శ్రీ

# కురాను షరీఫ్



అనువాదకులు

మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ

డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు

ఎమ్. ఏ., పిఎచ్. డి., ఎల్.టి.

# ఉపోద్ఘాతము

## I

ధర్మమడుగంటి యధర్మము చెలరేగుచున్నప్పుడెల్ల ప్రపంచచరిత్రయందు దాయాకాలముల నవతారపురుషులు బయలుదేరి యంధకారమున మునిఁగియున్న జనము నుద్ధరించుచుండిరి. శ్రీకృష్ణుఁడు, బుద్ధుఁడు, మహావీరుఁడు, కన్ఫ్యూషియసు, జూరాస్టరు, ఏసుక్రీస్తు మున్నగువారట్టివారు. వారుబోధించిన ధర్మములవలన లోకమజ్ఞానమును తరించి యుత్తేజముఁ గాంచినది. కాని, కొంతకాలమునకు ఆయామతముల నవలంబించినవారు మతస్థాపనాచార్యుల యుద్దేశములను సరిగ గ్రహింపకయు, వారి మాటలకపార్థములఁ గల్పించియు, వేర్వేఱు తెగలుగ విడిపోయి, తిరిగి యజ్ఞానమున మునిఁగిపోవుచుండిరి.

ముహమ్మదుకూడ గొప్ప సత్యమతమును స్థాపించినవాఁడు. అతని మతము నవలంబించినవారికి ముస్లిములని పేరు. ముస్లిములనఁగా భక్తులు. సత్యస్వరూపుఁడగు దేవునికై తమ సర్వమును వినియోగించి యాతనికి తమ సర్వము నధీనముచేయువారు. ముహమ్మదు క్రొత్తమతమును స్థాపించుటకేల పూనవలెనో, అతఁడు బోధించిన మతమెట్టిదో తెలిసికొనుటకుఁ బూర్వము అతనికిముందతని జన్మదేశమగు నరేబియా స్థితిని గూర్చియు, ముహమ్మదు జీవితమును గూర్చియుఁ గొంత తెలిసికొనవలసియున్నది.

అరేబియాదేశమునందు అరబ్-ఉల్-బాద్దా, అరబ్-ఉల్ అరిబా లేక ముతరిబా, అరబ్ ఉల్-ముస్తరిబా, అను మూఁడు తెగలజనులుండిరి. వీరిలో మొదటివారరేబియాలోని యాదిమనివాసులు. రెండవతెగవారు వీరిని జయించి దేశము నాక్రమించుకొనిరి. వీరే అరబ్బులను పేర వ్యవహరింపఁబడుచున్నారు. మూఁడవతెగవారగు ముస్తరిబావారు పైదేశములనుండి యరేబియాలోనికి వలసవచ్చి స్థానముల నేర్పఱచుకొన్నవారు. నానాఁటికిని వీరు రెండవతెగవారితో సంబంధబాంధవ్యములను చేసికొని వారితో నైక్యమును బొందుచువచ్చిరి.

రెండవతెగవారగు అరబ్-ఉల్-ఆరిబావారు తరతరములనుండియు నరేబియాదేశము నాక్రమించికొని యుండిరి. వీరిలో ఆదువారు, అమాలికులు, సామూదులు, జదీలు ననువారు ముఖ్యులు. ఆదు లనువారు మిగుల బలవంతులైయుండి చాలదేశములను జయించి, యిండియావఱకును గూడ దండెత్తి వచ్చినట్లు తెలియుచున్నది. వీరి

# II
## ముహమ్మదుజీవితము.

క్రీస్తుఅయిదవ శతాబ్దమధ్యమున కొసెయ్ అనునాతఁడు మక్కాకు అధిపతియయ్యెను. అతఁడు కొరెయిషు అను తెగవాఁడు. అతనికిపూర్వము కొరెయిషు తెగవారు వేర్వేరుగా దూరదూరదేశములందుండెడివారు. కొసెయ్ వీరినందఱి నొకచోఁ జేర్చి, కాబాకుదగ్గఱగా నొకకోటఁగట్టికొని, మక్కాపట్టణముపై సర్వాధికారములను సంపాదించి, తన తెగవారు తక్కినవారికంటె నుచ్ఛస్థానమున నుండునట్లుచేసెను. ఇతఁడు సుమారు క్రీ॥శ॥480 సం॥గమున చనిపోఁగా నీతనికుమారుఁడగు అబ్దుద్దారు నిస్థానమునకు వచ్చెను. కాని, అబ్దుద్దారు మరణానంతర మాతనిమనుమలకును, అతనిసోదరుఁడగు అబ్దుల్ మనాఫు పుత్త్రులకును తగవులుకలిగెను. అయినను వారురాజీపడిరి. కొంతకాలమునకు సర్వాధికారమును అబ్దుమనాఫుపుత్త్రుఁడగు హాషీముచేతిలోనికి వచ్చెను. హాషీమువర్తకమునందు నిపుణుఁడై యేఁటేఁటను రెండుబిడారులను దూరదేశములకు పంపుచుండెను. సుమారు క్రీ॥ శ॥ 510సం॥గమున నీతఁడు మృతినొందఁగా నాతని యేకపుత్త్రుఁడగు షాయిబా అనునాతని హాషిముసోదరుఁడగు ముతాలీబనునాతఁడు మక్కాకు తీసికొనివచ్చి పెంచుచుండెను. షాయిబా ముతాలీబు బానిసయని తలంచి మక్కావారాతని అబ్దుల్ ముతల్లిబ్ అనిపిలుచుచుండిరి. ముతల్లిబు క్రీ॥ శ॥ 520 ప్రాంతమున చనిపోఁగా అబ్దుల్ ముతల్లిబు మక్కా అధికారమును వహించెను. ఇతనికి అబ్దుల్లాజనించెను. ఈఅబ్దుల్లాకును ఆమినాయనునామెకును బుట్టినాఁడే ముహమ్మదు పైగంబరు.

ముహమ్మదు క్రీ॥శ॥ 570 సం॥గము ఆగస్టునెల తే 29 దీని జనన మొందెను. ఇతని జన్మకాలమున ప్రకృతియందు చాలశుభసూచనలు పొడమెనఁట. మహాత్ములు, దేశోద్ధారకులు, ప్రపంచమునకు ముక్తినొసగి తరింపఁజేయఁగల మహాపురుషు లుద్భవించునపుడు ప్రకృతియంతయు సంతోషించుచుండును. ముహమ్మదు పుట్టకపూర్వమే యతఁడు పితృహీనుఁడయ్యెను. తల్లియగు ఆమినా యాతని నతిగారాబముతోఁ బెంచుచుండెను. గాని, యామెయు నచిరకాలముననే లోకాంతరప్రాప్తినొందెను. తల్లిచనిపోయిన నాలుగేండ్లకే తాతయు నాబాలుని పినతండ్రియగు అబూతాలిబున కొప్పగించి మృతినొందెను. అబూతాలిబు ముహమ్మదు నతిప్రేమతోఁ బెంచెను. ముహమ్మదు బాల్యము నుండియుఁ దనదేశస్థుల దురాచారములను జూచి మిక్కిలియు వగచుచుండెను. తనజాతివారి పురాణకథల నతిశ్రద్ధతో వినుచుండెను. తనపినతండ్రి బిడారులతోఁ గలసి దూరదేశముల కేఁగుచు లోకజ్ఞానమును సంపాదించుచుండెను. ఇట్లాతనిజీవితమున నిరువదినాలుగేండ్లు గడచిపోయినవి.

V

ముహమ్మదు ఇరువదియైదవయేట కొరెయిషు తెగ స్త్రీయును, తనబంధువును అగు ఖదీజా యను సంపన్నురాలి బిడారుత్రోలికొని సిరియాదేశమునకు పోయెను. అతఁడు బహుకష్టములను గడచి, తన కార్యమును నిర్వహించి, తన యజమానురాలికి గొప్ప లాభమును తెచ్చెను. అతని విశ్వాసమును, సత్ప్రవర్తనమును గుర్తించి యామె ముహమ్మదును పెండ్లియాడెను. ఇందువలన నాతఁడు పూర్వమువలె కష్టపడ నవసరము లేకపోయెను. అతనికి కావలసినంత విశ్రాంతి లభించెను. నాటినుండి యు నాతఁడు మనస్సును వేధించుచున్న తన సంఘదుస్థితినిగూర్చియు, నాధ్యాత్మిక విషయములఁ గూర్చియు నాలోచింప మొదలిడెను. అతఁడు తఱచుగ తన యూరికి దగ్గరనున్న యొక కొండ గుహలోఁ గూర్చుండి ధ్యానతత్పరుఁడగుచుండెను. ఇట్లు పదునైదేండ్లు గతించెను. ఒకనాఁటిరాత్రి యాతఁడు ధ్యాననిమగ్నుఁడై యుండ ప్రకృతియంతయు పరమశాంతత వహించియుండెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. అప్పుడాతని హృదయ మొక భారమును వహించి యుండెను. ఆ పరమప్రశాంతసమయమున నొక యశరీరవాణి యాతనిఁ బిలిచినట్లయ్యెను. అదియేమో యని యాతఁడు దిగులుగొనియు సరకు గొనలేదు. మూఁడవసారి యావాణి "అనుము — ప్రకటించుము" అని పలికెను. అతఁడు వివశుఁడై "ఏమి ప్రకటింపవలెను" అని కేకవేసెను. "నీప్రభువు పేర ప్రకటించుము" అని పెద్దధ్వనితో చెప్పి, మనుష్యుఁడు పరమాణువులనుండి యెట్లుద్భవించినదియు, జ్ఞానమువలనను దయామయుఁడగు అల్లాకు గుణవలనను నెట్లున్నతిని పొందినదియు వివరించి ఆవాణి యూరకొనెను. ముహమ్మదు మూర్ఛనుండి తేరను. అశరీరవాణిభాషించిన పలుకులు తన హృదయమున నాటికొనినట్లయ్యెను. అతఁడు వెంటనే యింటికి పరుగునపోయి భార్యతో, "ప్రేయసీ, ఏమిది, నాకేమైనది" అనిమూర్ఛపోయెను. ఖదీజా అతని ప్రక్క కూర్చుండి యుపచారములు చేయుచుండెను. కొంతవడి కాతనికి తెలివివచ్చి, "ఖదీజా, నాకేమైన భూనినదా! లేక పిచ్చియెత్తుచున్నదా!" అని యడిగెను. ఆమె "అబుల్ కజీమా! దేవుఁడే నాకురక్షకుఁడు. అతఁడు నీకెట్టియాపత్తుఁ గలుగనీయఁడు. నీవు సత్యవంతుఁడవు. అపకారికైనను ఉపకారము చేయుచుందువు. పరమవిశ్వాసివి. నీజీవితమతి నిర్మలమైనది. బంధుమిత్రులను ప్రేమింతువు. నెలుగరివలె బజారులలో నసంబద్ధ వాక్యముల నాఁడువాఁడవు కావు. నీకేమి వచ్చినది? ఏదేని భయంకరదృశ్యమును చూచితివా?" అనెను. ముహమ్మదు తాను విన్నదంతయు నామెకు తెలిపెను. అంత నాసాధ్వి, "సంతోషింపుము, ప్రియుఁడా, సంతోషింపుము. నీవీ ప్రజలకు ప్రవక్తవు కానున్నావు" అని పలికి వృద్ధుఁడును నంధుఁడును, పూర్వమతగ్రంథములను బాగుగఁజదివినవాఁడును నగు తన మేనమామయైన వరకాయొద్దకేఁగి ఈవృత్తాంతమంతయుఁ దెలిపెను. అతఁడును, "ఓహో. పవిత్రదినము, పవిత్రదినము. పూర్వకాలమున మూసాకు

వచ్చిన సందేశము నిదియే. ఈతఁడు తన ప్రజలకు ప్రవక్త కాఁగలఁడు. అతనితో నిది చెప్పుము. హృదయమున ధైర్యము వహింపుమని చెప్పుము" అనెను. సామ్రాజ్యము లంతరించుచుండ, ఒక జాతివారు మఱియొక జాతివారితోడను, ఒక తెగవారుమఱి యొక తెగవారితోడను కలహించుచుండ, సకల దిక్కులయందును, "ఇదిగో దేవుని సువార్త వచ్చుచున్నది. దారితప్పిన మందను తిరిగి త్రోవకు తీసికొని రాఁగల గొల్ల వాఁడిదిగో మీమధ్యనే యున్నాఁడు" అను వాక్కు నిండియుండెను. అది వరకా హృదయమునుండి వెలువడినది.

నాఁటినుండియు ముహమ్మదు మనస్సు చాల క్షోభము నొందుచుండెను. ఆక్షో భము నణఁచి, యతని విధికృత్యమును నెరవేర్పవలసినదిగా దేవదూత యాతని కుత్సా హము కలిగించుచు, తాము లోకములో వ్యాపింపఁజేయవలసిన వార్తను తెలుపు చుండెను.

ఈదేవదూతను ముహమ్మదీయులు జిబ్రీలు అందురు. జిబ్రీలాతని మనోనయనము నకు సాక్షాత్కరించినప్పుడెల్ల ముహమ్మదు మూర్ఛనొందుచుండెను. అతని మొగమును కన్నులును ఎఱ్ఱగానుండెను. ముచ్చెమటలును పోయుచుండెను. ఆసమయమునసతఁడు ఒడలినిండ దుప్పటిని కప్పుకొనియుండ, అతనినుండి జిబ్రీలు దేవుని సందేశమును పలి కించుచుండెను. తొలుత నీతని సందేశములఁగూర్చి ఖడీజాయును వరకాయును దప్ప నితరులు నమ్మరైరి. కాని, యాతని పూర్వచరిత్రమును, సద్వర్తనమును నెఱిఁగియుండిన వారొక్కరొక్కరుగ నాతఁడు మూర్ఛావస్థనుండి పలికిన మాటలను వ్రాసికొని యుంచుచుండిరి. ఈవచనముల సంహితయే కురానుషరీఫను గ్రంథము.

ముహమ్మదు క్రొత్తగా ప్రకటించుచుండిన యుపదేశములు అరబ్బీదేశములోని యప్పటిమతమునకు విరుద్ధములుగా నుండెను. అయినను, తొలుత ఆదేశస్థులాతని పిచ్చి వానిఁగా భావించి యుపేక్ష చేయుచుండిరి. కాని, యాతని మతమును స్వీకరించినవా రంతకంతకును ఎక్కువకాఁజొచ్చిరి. ఇట్లాతనిఁ జేరినవారిని మొదట మందలించి చూచిరి. కార్యము లేకపోయెను. ముహమ్మదును అతని యనుచరులును రహస్యముగాఁ జేరుచు సర్వేశ్వరుని ధ్యానము చేయుచుండిరి. కొంతకాలమునకు వీరివలన తమమతము నకు ముప్పువాటిల్లునని పూర్వమతాచారావలంబు లనుకొని, ముహమ్మదుతోఁ జేరిన వారి ననేకవిధముల బాధింపసాగిరి. వారాబాధలనన్నిటి ననుభవించియుఁ దాము ప్రవక్త యని నమ్మిన ముహమ్మదును వీడరైరి.ఇఁక దారిలేక యాదేశస్థులు వీరినందఱినిఁ జంపనూహించిరి. ముహమ్మదు వారి యవస్థను చూడలేక దగ్గఱనున్న అబిసీనియా దేశమున తలదాచుకొనుఁడని వారికిఁ జెప్పెను.

అబిస్సీనియా దేశము నొక భక్తిపరుఁడగు నజ్రాసీ యేలుచుండెను. మహమ్మదు శిష్యులలో కొందఱా దేశమును చేరికొనిరి. కాని, మహమ్మదు దేశస్థులూరకొనక, వారి నా దేశమునకు వెంబడించి వారిని తమకొప్పఁజెప్పవలయునని యా రాజును గోరిరి. ఆరాజు మహమ్మదు అనుచరులతో మీరు నామతమును మీమతమును విసర్జించి చేకొనిన యీ క్రొత్తమతమెట్టిది?' అనెను. అప్పుడు వారిలో జాఫరను నతఁడు ముందుకువచ్చి "రాజా, మేము నాగరికత యందును అజ్ఞానమునందును మునిఁగియుంటిమి. శవములను తినుచు అనరానిమాటల ననుచుంటిమి. మనుష్యుని కుండవలసిన దయాదాక్షిణ్య భావములను విడిచి, ఆతిథ్యము, పరోపకారము అనువానిని మఱచితిమి. బలవంతుల దేరాజ్య మనుకొనుచుంటిమి. అప్పుడు మాయందొక ప్రవక్త లేచినాఁడు. ఆతని జన్మఁగూర్చియు, సత్యసంధత, విశ్వాసము, పవిత్రతలఁ గూర్చియు మాకు బాగుగఁ దెలియును. అతఁడు దేవుఁడొక్కఁడే యనియు నతనితో నితర దైవములఁ జేర్పరాదనియు మాకుబోధించినాఁడు. నమ్ము విగ్రహారాధనమానుఁడనినాఁడు; సత్యమును పలుకుఁడన్నాఁడు. విశ్వాసమును దయయుఁగలిగి యితరుల హక్కులను మన్నింపుఁడన్నాఁడు. స్త్రీలమానమును కాపాడుఁడనియు ననాథ శిశువుల ధనము నపహరింపవలదనియు నన్నాఁడు. వ్యసనములను విడిచి, దౌష్ట్యమునుండి దూరముగనుండుఁడన్నాఁడు. దైవప్రార్థనఁ జేయుచు, బీదలకు భిక్షమెట్టుచు, ఉపవాస విధిని నెరవేర్పుఁడన్నాఁడు. మేమాతని నమ్మినాము. అతని బోధనల నంగీకరించినాము. దేవుఁడొక్కఁడేయనియు నాతఁడుతప్ప మఱియొక దైవములేఁడనియు విశ్వసించినాము. ఇందుకొఱకే మావారు మమ్ముబాధించి, కఱ్ఱవిగ్రహములకును రాతివిగ్రహములకును మ్రొక్కుఁడనుచున్నారు. మేము నీశరణమును గోరి నీ దేశమును జొచ్చియున్నాము. మమ్మువారు బాధించకుండ మమ్ముకాపాడెదవని నమ్ముచున్నాము" అనెను. రాజీమాట విని కొరెయిషుజాతివారిని తనదేశమునుండి త్రోలి, మహమ్మదు ననుచరులకు రక్షణ నొసగెను.

తనశిష్యు లిట్లు పరదేశములలో తలదాఁచుకొనుచుండఁగా మహమ్మదుమాత్రము తన స్థానమును వీడలేదు. వారికి తన సందేశమును తెలుపుచునే యుండెను. కొరెయిషువా రాతనిఁ దూలనాడిరి. వెలివేసెదమనిరి. అగౌరవము చేయుచుండిరి. కాని, యాతఁడు సరకుగొనలేదు. ఇఁక కార్యములేదని ఆతని తెగవారియందఱి మీఁదను వారు తమక్రోధమును జూపఁ దొడఁగిరి. బాధలంతకంతకును హెచ్చు రాఁ జొచ్చెను. వాని నోర్వలేక వారందఱును చేరువనున్న యొక కొండలోయ నాశ్రయించిరి. కాని, యెంతకాలమట్లుండఁగలరు? తాము తెచ్చికొనిన యాహారపదార్థము లయిపోయెను. చిన్నపిల్లల యేడ్పులు వినరయ్యెను. అందుచేత వారిలో నొకఁడు కొరెయిషువారితో సంధిచేసికొని తనతో వచ్చినవారితో మక్కా ప్రవేశించెను,

మఱుచటి సంవత్సరము 'దుఃఖసంవత్సరము'. ఈయేఁట చిన్ననాఁటి నుండియు ముహమ్మదును పెంచి రక్షించిన అబూతాలిబు కాలధర్మము నొందెను. అంతకును మించి, తన్నెవ్వరును విశ్వసించియుండనిసమయమునఁ దన సందేశమునందు తనకే సంపూర్ణవిశ్వాసములేని సమయమున, తన హృదయము ననేకసంశయములు పీడించుచుండినసమయమున, తానెటుచూచినను నంధకారమయమై యుత్సాహమంతయు నంతరించియుండిన సమయమున, తన పజ్జనిలిచి తనకు ధైర్యముచెప్పి, తన్ను ప్రేమించి తన కార్యమునందు చేదోడువాదోడుగా సంచరించిన తన ప్రియపత్ని ఖదీజాయును స్వర్గముఁజేరెను. ముహమ్మదు కింతకంటె నిరుత్సాహకారణ మేముండును? ఇవిగాక మక్కానివాసులు తనసందేశమును తిరస్కరించినారు. వారితో నిఁక దేవులాడుటవలన కార్యములేదు. దగ్గఱగా తాయెఫ్ పట్టణ మున్నది. అక్కడివారి కీసందేశము కావలెనేమో వారైనను వినరా? అని యోచించుచుండెను. కాని, తన సందేశమును చాటుట మాత్రము మానలేదు. తనవారును తన్ను హేళనచేయుచు బాధించుట మానలేదు. ఒకనాఁడు తాయెఫుపట్టణమువారాఱుగురు వర్తకులును యాత్రికులునగువారి నాతఁడు చూడఁ దటస్థించెను. వారినాతఁడు గూర్చుండఁబెట్టి తనసందేశమును దెలిపెను. వారు వెంటనే యాతని యనుచరవర్గములోఁజేరి తమపట్టణమున కేఁగి తమవారి కిదంతయుఁ దెలిపిరి. మఱుచటిసంవత్సరమీయార్గురును మఱియార్గురిని వెంటఁబెట్టికొని వచ్చిరి. వీరును ముహమ్మదుసందేశమును స్వీకరించిరి. ఈరీతిగా డెబ్బదియైదుగురు ఆతనిశిష్యవర్గములోఁజేరిరి. అందుతాము ముహమ్మదు నెన్నఁడును విడిచిపెట్టమనియు, ముహమ్మదు తామువారి నెన్నఁడును విడిచిపెట్టఁడనియు ప్రమాణములను చేసికొనిరి. ఇదియంతయు నొకమక్కావాసి చూచెను. వెంటనే యాతఁడు తనపట్టణమునకు పరుగునఁబోయి తనవారి కీవృత్తాంతముఁ దెలిపెను. మక్కావారునువచ్చి ఈక్రొత్తశిష్యవర్గపు బిడారును చుట్టుముట్టి ప్రమాణముచేసినవారెవ్వరని యడిగిరి. కాని, వారెవ్వరో తెలిసికొనఁజాలక బిడారును వెడలనిచ్చిరి. ముహమ్మదు మక్కాకు తిరిగివచ్చెను. అతనిని, అతనిశిష్యులను బాధలపాలుచేయుచుండిరి. తుదకు ముహమ్మదును చంపఁగుట్రచేసి ఆయుధహస్తులై యాతనిగృహము చుట్టును మూగిరి. రాత్రియంతయు నట్లుండి తెల్లవారుజామున నాతఁడు పైకివచ్చునప్పు డాతని నంతమొందింపవలెనని వారియుద్దేశము. కాని, ముహమ్మదున కీకుట్ర యెట్లో తెలిసెను. ఆతఁడులేచి తన మేనల్లుఁడగు అలీపై తనయాకుపచ్చని దుప్పటినికప్పి, ఆతని నట్లేపరుండియుండుమని చెప్పి ఒకకిటికీద్వారా యిల్లువిడచి వెడలిపోయెను.

అట్లాతఁడుపోయి తన ముఖ్యశిష్యుఁడగు అబూబకర్ ఇల్లు చేర, వారిద్దరును కలసి ఊరువిడిచి ఒక కొండగుహలో తల దాఁచుకొనిరి. వీరుతప్పిపోయిరనివిన్న కొరె

యిది వారి కాగ్రహమినుమడించి, మహమ్మదుతల నరికి తెచ్చినవారికి బహుమాన మిత్తుమని ప్రకటించిరి. వారికొఱకు చాలమంది వెదకుచుండిరి. ఒకటిరెండుసార్లు వారు శత్రువుల కన్నులఁబడిరి. అబూబకరుహృదయము కంపింపసాగెను. "ఏమిచేయుదము. మనమిద్దరమే అయిపోతిమే" అని యాతఁ డనెను. అప్పుడు మహమ్మదు "భయపడకుము. అల్లామనపక్షమున నున్నాడు. మనము ముగ్గురమున్నాము" అని ధైర్యము చెప్పెను. మూఁడురోజు లయినతరువాత వా రచటినుండి బయలుదేరిరి. దారిలో నొకఁడు గుఱ్ఱముపై నెక్కి వారిని వెంబడించెను. కాని, అతఁడును వారిని సమీపించి నంతనే ధైర్యమువీడి గడగడవడఁకుచు మహమ్మదు పాదములపైఁబడి తన్ను క్షమించి రక్షింపవలసినదని వేడుకొనెను. వా రాతని విడిచి రబీ 1 నెలలో నొక శుక్రవార ముదయమున (క్రీ॥ శ॥ 622 సం॥ నము జూలై తే2 దీని) తాయెఫ్ పట్టణమును ప్రవేశించిరి. ఈ ప్రవేశమునకే హిజ్రత్ అందురు. మహమ్మదీయు లీదినమునుండియే తమ సంవత్సరములను లెక్కించుచుందురు.

తాయెఫ్‌పట్టణములో మహమ్మదుచేరిననాఁటినుండియు దానికి మదీనాయను పేరు కుదురుకొనెను. మదీనాయనఁగా జ్యోతిర్మయమైన నగరిఅని యర్థము. మహమ్మదురాకవలన నాపట్టణమునకు క్రొత్తవికాసము కలిగెను. ఇచటికినానాఁటికిని ఈక్రొత్తమతమును స్వీకరించినవారు చేరుచుండిరి. వీరు తమదేశములో తమపూర్వమతస్థులబాధపడలేక పారిపోవచ్చినవారు. వీరికి మహాజిరీనులని పేరు. మదీనాలో మహమ్మదుకుసహాయము చేయుచు నాతనిమతము స్వీకరించినవారికి అన్సారులని పేరు. అన్సారులనఁగా సహాయకులు. ముహాజిరీనులు అన్సారులును మహమ్మదుకు సహాయముచేయుచుండఁగా ముస్లిముమత మతిత్వరితముగ మదీనాలో వ్యాపించుచుండెను. ఇట్లుచేరినవారిలో కొందఱు మహమ్మదు గుట్టుమట్టులుకనుఁగొని యతనిశత్రువులకు కావలసిన వృత్తాంతమును దెలుపుచుండిరి. వీరుగాక మదీనాలోని యహూదీలును నస్రానీలును ముస్లిములసంఖ్య హెచ్చుగుచుండ భయముగొని శత్రువర్గములోచేరి పనిచేయుచుండిరి. ఒకదినమున వారందఱును మక్కాకు సందేశమంపి ముస్లిములపైకి సైన్యముతో రావలసినదని కోరిరి. అబూజహల్ అను నతఁడు వేయిమంది సపరికరులగు సైనికులతో మదీనామీఁదికి వచ్చెను. బదర్ అను స్థలమున ముస్లిములకును ఈ సైన్యమునకును గొప్పయుద్ధము జరిగెను. దేవతలందఱును ముస్లిములకు సహాయపడుచుండిరా యనునట్లు చలిగాలి వీచుచు పెద్దతుపాను పట్టెను. ముస్లిము లినుమడించిన యుత్సాహముతో పోరాడి మక్కావారిసైన్యమును ఖండింపఁజొచ్చిరి. వారినాయకులందఱును యుద్ధభూమిని నిహతులైరి. హతశేషులగు మక్కాసైన్యము వెనుజూపి తమపట్టణమును జేరికొనెను.

ఈవిజయమువలన ముస్లిములకు నుత్సాహము హెచ్చయ్యెను. శత్రువర్గమునకు క్రోధము హెచ్చయ్యెను. వారు ముస్లిములపై పగఁదీర్చుకొనఁ గొప్పప్రయత్నములు చేసి పెద్దసైన్యమును ప్రోవుచేసి అబూసుఫియాననుయోధుని నాయకత్వము క్రింద మదీనాపైకి పంపిరి. ఒహోదు అను గిరియొద్ద రెండుసైన్యములును డీకొనెను. తొలుత ముస్లిములకే జయముకలుగుచుండెను. ముహమ్మదు కొందఱు శరయోధుల నొక యున్నతప్రదేశమున నిలిపి తాను సైఁగచేసినంతవఱకును నచటినుండి కదలవలదని యాజ్ఞాపించెను. కాని, శత్రువులు వెనుజూపి పారిపోవుచున్నారని వీరుచూచినంతనే ముహమ్మదునుండి సైఁగలేకయే తమస్థానమును వదలి కొల్లకొఱకు వెదకులాడసాగిరి. ఇదిచూచి శత్రునాయకులు తమగుఱ్ఱములను వెనుకకుత్రిప్పి ముస్లిములపైఁ బడిరి. ముస్లిములజయమంతయు నపజయముగ నొక్కక్షణములో మాఱిపోయెను. వారిని శత్రువు లన్నిప్రక్కలను చుట్టుకొనిరి. ముస్లిమునాయకులలో ముఖ్యులు చాలమంది నేల కొరగిరి. ముహమ్మదుకుఁగూడ పెద్దగాయము తగిలెను. అతఁడు మరణించెననియే యొక నీలివార్త వ్యాపించెను. కాని, ముహమ్మదురక్షణార్థమై అలీ మొదలగువారు త్వరపడిరి. ఇచ్చటియుద్ధముచూచి సైనికులు ముహమ్మదు బ్రతికియేయున్నాఁడని ధైర్యముతెచ్చి కొని తాము యుద్ధమునకు తలపడి ఎంతయోకష్టముపై నాతనిఁదీసికొని ఒహోదుగిరి శిఖరమును చేరుకొనిరి. కొరెయిషువా రిప్పటికే చాలనలసియుండుటచేత ముస్లిములను మఱివెంబడింపక, గాయములు తగిలి క్రిందబడియున్నవారి నవమానపఱచుచు తమ పట్టణమునకు మఱలిపోయిరి.

కొరెయిషువారు తమవారికి కావించిన యవమానమునకు ప్రతిక్రియనొనరింప ముస్లిము లుద్వేగమునొందుచుండిరి. కాని, ముహమ్మదు వారికోపమును శాంతింపఁజేసి, ముస్లిముల బలము తగ్గలేదని సూచించుటకు మక్కాపైకి చిన్న సైన్యములను బంపుచుండెను. ఒహోదువద్ద ముస్లిములకు గలిగిన యపజయమునకు మదీనాలోని యహూదీలును నస్రానీలును కారణమని యాతనికిఁదెలిసెను. కావున నాతఁడు తనకు ప్రతికూలముగ వర్తించి, కుట్రలుపన్నినవారిని కఠినముగ శిక్షించి, మదీనాప్రభుత్వము మంచి కట్టుబాట్లమీఁద నడచుటకై కొన్నిశాసనములను వర్తింపఁజేయుచుండెను.

ఇట్లు తనపదవిని స్థిరపఱచుకొని, ముహమ్మదు తనమతము నితరదేశములందు వ్యాపింపఁజేయుటకు ఆయారాజులకు రాయబారము లంపుచుండెను. ఈలోపున మక్కానివాసులు దుష్టప్రభుత్వమునకు పాల్పడి, బాధలుభరింపలేక, ముహమ్మదునొద్ద కేఁగి మొఱపెట్టుకొనిరి. కొరెయిషువారిలో మునుపటి యుత్సాహముగాని, మునుపటి ధైర్యముగాని లేకుండెను. ముహమ్మదుబోధించినమతమునందు విశ్వాసము హెచ్చుచుండెను. ఇదియే యదనని ముహమ్మదు పదివేలసైన్యముతో మక్కాపైకేఁగెను. ఎవ్వరో కొంద్ఱ

అడ్డగించిరిగాని కార్యములేకపోయెను. మహమ్మదు మక్కా-పట్టణమును ప్రవేశించెను. పూర్వ మితరులకరుణకు పాత్రుఁడై తనమతమును వ్యాపింపఁజేయలేకపోయినవాని కరుణకు మక్కా-వాసులే పాత్రులుకాఁజొచ్చిరి.

"సత్యముదయించుచు, అసత్య మంతరించును. అసత్య మెన్నాళ్లో జయము పొందనేరదు" అనునూక్తి యపుడు నిజమయినది. మహమ్మదు అచటివిగ్రహములనన్నిటిని పగులఁగొట్టించి సత్యరూపియగు నేకేశ్వరునియారాధనను మక్కా-యందు నెలకొల్పెను. అప్పటినుండియు వేలకువేలుజనులు ముస్లిముమతమును స్వీకరించుచుండిరి. "మేము అల్లానుతప్ప ఇతరదైవముల నారాధింపము. జారత్వచోరత్వ దోషములకుపాలు కాఁబోము. శిశుహత్యలను చేయము. అసత్యము లాడము. స్త్రీలమానములను మన్నించెదము'' అని వారు ప్రమాణములు చేయుచుండిరి.

ఇట్లు ముస్లిములసంఖ్య హెచ్చుచుండఁగా, మహమ్మదునుచూచి ఓర్వని వారు లేకపోలేదు. వారందఱునుగలిసి పెద్దసైన్యము నేర్పఱుచుకొని యుద్ధప్రయత్నమును చేయుచుండిరి. వీరినిగూర్చి మహమ్మదు తెలిసికొని వారిపైఁ గొంతసైన్యము నంపెను. రెండుపక్షములవారును హునైను అనుస్థలమునఁ గలసిరి. విగ్రహారాధకుల కపజయముకలిగెను. వారు మహమ్మదు కాళ్లపైఁబడి రక్షింపవేఁడికొనిరి.

మఱుచటి సంవత్సరమంతయు మహమ్మదు పరదేశరాజులు తనకుపంపిన రాయబారములను స్వీకరించుటతో సరిపోయినది. తీరదేశములకును ఈక్రొత్తమతము వ్యాపించినది. మహమ్మదు తానవతరించి చేయవలసినపనిని నిర్వర్తించినాఁడు. అతనికిపూర్వ మెందఱో ప్రవక్తలు వచ్చిరి; మతసంస్కర్తలు బయలుదేరిరి. కాని, వారిజీవితకాలములో వారు స్థాపింపనెంచిన ధర్మములు స్థాపితములుకాలేదు. మహమ్మదట్లుకాక, తనకువచ్చిన సందేశమును చాటుటలో నెన్నియోబాధలుపడి, ధైర్యముతో, ఓపికతో పనిచేసి, తనమతమును లోకమునవ్యాపింపఁజేసి, అది చిరస్థాయిగానుండుటకు వలయు కట్టుదిట్టములు చేసి, హిజ్రత్ 11 వ సంవత్సరము రబీ 1 నెల పండ్రెండవ దినమున (క్రీ॥ శ॥ 632 సం॥ రము జూన్ తే 8 దీని) స్వర్గమునుచేరెను.

ఇట్టిమహాపురుషులు యుగమునకొకసారి యవతరించుచుందురు. దీనకుటుంబమున పుట్టినవాఁడు ఖుస్రూ, సీజరులవంటి చక్రవర్తిపదమును పొందినాఁడు. ఒకజాతివారి భావ్యభ్యున్నతికి హేతువైనాఁడు. ఇట్లగుటకు కారణమేమి? అతని దీనమానసము, విశాలహృదయము, నిర్మలవర్తనము, ఆచారపవిత్రత, కరుణాళుత్వము, విధ్యుక్తకార్యనిర్వహణమునందలి దీక్ష-ఈగుణములన్నియు నతనియనుచరులమానసముల నాకర్షించినవి. అతనిని వారు అల్-అమీన్, విస్వాసపాత్రుఁడు, అనునామములో వ్యవ

హరించుచుండిరి. పెద్దలయెడ నణఁకువ, బీదలయెడదయ, డాంబికులయెడ నసహిష్ణుత, హృదయనైర్మల్యము, ఇవియన్నియుఁగలసి యాతనినెల్లరును మన్నించి గౌరవించునట్లుచేసినవి. ఈతఁడు ప్రవర్తింపఁజేసినమతము పూర్వదురాచారములఁ బోఁదోలుటకై స్థాపింపఁబడినది. ఆమతమెట్టిదో యీపురాణుమరీఫును చదివినఁ దెలియఁగలదు.

# III

## ఇస్లాము.

---

ఇస్లామనఁగా శాంతిమతము. లోకములోని జనులహృదయములను సంక్షోభపెట్టు దౌష్ట్యము మున్నగుదుర్గుణములను పాఁగఁద్రోలి, శాంతినొసగి, సర్వేశ్వరుని ధ్యానమందు వానిని లీనములుగఁజేయు మతమునకే యిస్లామని పేరు. ముహమ్మదు అరేబియాదేశమువారికి క్రొత్తమతమును బోధించలేదు. ఆదము, నుహూ, ఇబ్రాహీము, మూసా, ఈసా, మున్నగు మహనీయులు బోధించినధర్మములు లోకమున ఖిలములుకాఁగా అల్లా ముహమ్మదుపైగంబరుముఖమున ధర్మరక్షణార్థమై యీసందేశమును జిబ్రీలను దేవతద్వారా పంపినాఁడని ముస్లిములవిశ్వాసము. ఈమతమునందు జాతివర్ణవ్యవస్థలులేవు. సర్వజనులును దేవునిముందఱ సమానులే. తక్కిన ప్రవక్తలను అవతారపురుషులను మిథ్యాపురుషులని కొందఱనవచ్చును గాని, ముహమ్మదువిషయమున నట్లనవీలులేదు. చరిత్ర యీతఁడుచేసినపనిని స్పష్టముచేయుచున్నది.

దేవుఁడొక్కఁడే యనియు, ముహమ్మదాతనిప్రవక్తయనియు నమ్మినవారందఱును ముస్లిములే. ఈమతములో కేవలవిశ్వాస మెందుకును బనికిరాదు; విశ్వాసమునకుతగినట్లు ధర్మవర్తనముచేయువారే నిజమైనముస్లిములు. "విశ్వసించి క్రమవర్తనులైనవారికే స్వర్గమ"ని కురానునందు పదేపదే చెప్పఁబడుచుండును. కురానులో అయిదు ధర్మములు వివరింపఁబడియున్నవి: అల్లాయందు నమ్మకము, అల్లా తనధర్మసందేశములను ప్రవక్తలద్వారా లోకములోనికి పంపుననువిశ్వాసము, రాఁబోవు జీవితము, ప్రార్థన, దానము—అనునవేయవి. వీనినిగురించి కురానుచదువుకొనిన బాగుగ తెలియఁగలదు. కావున నిచట వివరించుటనావశ్యకము.

ముస్లిములందఱును తప్పక యాచరింపవలసిన నాలుగువిధులున్నవి. అందులో మొదటిది ప్రార్థన. ప్రార్థనను దినమున నైదుపర్యాయములు చేయవలెను. ఉదయమును (సలాతుల్ ఫజర్), మధ్యాహ్నమునకు పూర్వమును (సలాతుజ్-జుహుర్),

మధ్యాహ్నమునకు పరమునను (సలాతుల్-అసర్), సాయంత్రమును (సలాతుల్-మగ్రిబ్), రాత్రియు (సలాతుల్-ఇషా) ఈప్రార్థనలను సలుపుచుండవలెను.

ప్రార్థనను చేయకపూర్వము బహిఃశౌచ మవసరము. ఇందుకై మొదట చేతులను చీలమండలవఱకును కడుగుకొనవలెను. తరువాత నోటిని శుద్ధిచేసికొనవలెను. పిదప నాసారంధ్రములను కడుగవలెను. తరువాత మొగము ప్రక్షాలనముచేయవలెను. తరువాత మొదటకుడిచేతిని, పిమ్మట ఎడమచేతిని ముడుకులవరకును కడుగుకొనవలెను. తరువాత మధ్యమూఁడు వ్రేళ్లను కలిపి తడితో తలతుడుచుకొనవలెను. తరువాత కుడిపాదమును, ఎడమపాదమును వరుసగా కడుగుకొనవలెను.

అందఱును కలిసిచేయవలసిన ప్రార్థనకు పూర్వము ఒకరు అజాన్ చేయుదురు. అజాన్ అనఁగా ప్రార్థనచేయుటకై అందఱిని పిలుచుట. అజాన్‌లో ఈక్రింది వాక్యముల నుపయోగింతురు

(i) అల్లా-హు-అక్బర్
దేవ ఏవ పరః
దేవుఁడు సర్వాధికుఁడు,

(ii) అష్-హదు అన్-లా-ఇలాహ ఇల్లల్లాహ్,
తస్మాన్నాన్యో పూజ్య ఇతి మే మతిః
దేవునికంటె నితరుఁడు పూజనీయుఁడు కాఁడని నా నిశ్చయము.

(iii) అష్-హదు అన్న ముహమ్మద-ర్రసూ-లుల్లా.
తస్య ప్రవక్తా ముహమ్మదితి మే నిశ్చయః
ముహమ్మదు దేవుని ప్రవక్తయని నా నమ్మకము.

(iv) హయ్యా' అలస్ సలాహ్.
ఆగచ్ఛ ప్రార్థనాయై.
ప్రార్థనకొఱకు రమ్ము.

(v) హయ్యా' అలల్-ఫలాహ్.
స్వీకురు విజయమ్.
జయమును చేకొనుము.

(vi) అల్లా హు-అక్బర్.
దేవ ఏవ పరః.
దేవుఁడు సర్వాధికుఁడు.

(vii) లా ఇలాహ ఇల్లల్ లాహ్
తం వినా నాస్త్యన్యో దేవః
అతఁడుతప్ప మఱియొక దేవుఁడు లేఁడు.

ఇస్లాములోని ప్రార్థన రెండు భాగములుగానుండును. మొదటిభాగమునకు 'ఫర్ద్' అనిపేరు. 'ఫర్ద్' అనఁగా అందఱును చేసితీరవలయునది. ఈప్రార్థన మసీదులో చేయుట మంచిది. దీనిలో 'ఇమాము' అనగా ఒక మతపెద్ద అధికారిగా ఉండి తక్కినవారిచేత ప్రార్థన చేయించును. రెండోభాగమునకు 'సున్నత్' అనిపేరు. ఇది ఎవనిమట్టుకువాఁడే తన యింటిలో చేసికొవలసిన ప్రార్థన. రోగముచేతగాని, మఱి యేకారణముచేతగాని ఎవఁడైనను 'ఫర్దు' ను సంఘముతో కలిసి చేయలేనప్పుడు, సున్నత్ వలెనే తనయింటిలో ఒక్కఁడే చేసికొవచ్చును. ఈరెండు భాగములలోను ఆయాకాలముల ప్రార్థనలలో కొన్ని 'రకత్తులు' ఉండును.

## రకత్తు.

ఈక్రింద చెప్పఁబడినపనులు, ప్రార్థనలు, అన్నిటికిని రకత్తు అని పేరు.

(౧) 'కిబ్లా' అనఁగా మక్కా. అటువైపు తిరిగి నిలుచుండి చేతులు చెవులదగ్గఱ చేర్చి,

"అల్లా హు అక్బర్
దేవ ఏవ పరః
దేవుఁడు సర్వాధికుఁడు"

అని అనవలెను. ఇట్లుచేయుటకు 'తక్బీరె తహ్రీమహ్' అని పేరు.

(౨) తరువాత 'ఖియామ్' చేయవలెను. అనఁగా నిలఁబడియే ఉండి కుడిచేయి గుండెమీదుగాఁగాని నాభిప్రదేశమునఁ గాని ఎడమచేతిమీఁద నుంచి, ఈక్రింది ప్రార్థన గాని, అందులో ఒక కొంతగాని చెప్పవలెను.

"ఇన్ని వజ్జహ్తు వజ్-హియ లిల్లజీ ఫతరస్-సమావాతి వల్-అర్ద హాని ఫన్ వ మా అనా మినల్ ముష్రికీన్. ఇన్న సలాతి వ నుసుకి వ మహ్యాయ వ మమాతి లిల్లాహి రబ్బి అల్-ఆలమీన్, లాషరీకలహూ వ బిజాలిక ఉమిర్తు వ అనా మినల్-ముస్లిమీన్. అల్లాహుమ్మ అంతల్-మలికు లా ఇలాహ ఇల్లా అంత, అంత

రబ్బి వ అనాఅబ్దుక జలమ్తు నఫ్సి వ' తరఫు బిజన్బి ఫఘ్ఫిర్లి జనూబి జమి, అన్ ఇన్న హూలా యఘ్ఫిరు జునూజపమి, అన్ ఇన్న హూబ ఇల్లా అంత, వహ్దిని లి-అహ్సాన్-ఇల్-ఆఖ్ లాఖి లా యహ్ది లి అహ్సానిహా ఇల్లా అంత, వమరిఫ్, అన్ని సయ్యి అహా లాయస్రిఫు 'అన్ని సయ్యి 'అహా ఇల్లా అంత.''

స్వర్గస్యచ పృథివ్యాశ్చ సృష్టి ర్యస్మా త్ప్రభూయతే
ప్రణిప త్యాభిముఖ్యేన వందే తం నాన్యదేవతాః
త్యాగశ్చ ప్రార్థనాచైవ జీవో మృత్యు స్తథైవచ
దేవాయ మమ తత్సర్వం జగన్నాథాయ కల్ప్యతే
దేవస్య హీసమో నాస్తి త్వాజ్ఞా మే వర్తతే శుభా
తస్యాహం దాసభావేన భవేయం కింకరస్సదా
త్వం చక్రవర్తీ జగతాం త్వదన్యో నాస్తికశ్చన
ప్రభుస్త్వం కింకర శ్చాహం మామేవాపకరోమ్యహమ్
నివేదయామ్యహం సర్వా నపరాధాం క్షమస్వ తాన్
తేభ్యోఽపరాధేభ్యశ్చ త్వదన్యో మే నరక్షకః
సన్మార్గగామీ భవితుం సన్మార్గేణ నయస్వ మామ్
సన్మార్గదర్శకో నాస్తి త్వదన్యః పురుషః ప్రభో
మదీయా దుష్టచింతాశ్చ కుచర్యాశ్చ వినాశయ
తేషా మప్యపహర్తా త్వం త్వదన్యో నాస్తి కశ్చన,

"ధర్మనిరతుఁడనై స్వర్గమర్త్యముల సృజించిన యాతని కభిముఖుఁడ నగుచున్నాను. నేను బహుదైవారాధకులలోనివాఁడను గాను. నాప్రార్థన, నాత్యాగము, నాప్రాణము, నామృత్యువు, సర్వమును జగన్నాథుఁడగు అల్లాకే సమర్పించుచున్నాను. అతనికి సముఁడు లేఁడు. ఇట్లే నాకాజ్ఞ అయినది. ప్రణతు లగువారిలో నేను చేరుచున్నాను. దేవా, నీవు చక్రవర్తివి. నీవు తప్ప మఱియొక దేవుఁడు లేఁడు. నీవు నాకు ప్రభుఁవవు, నేను నీకు కింకరుఁడను. నాకు నేనే అధర్మముగా ప్రవర్తించుచున్నాను. నాయపరాధముల నన్నిటిని నీకు నివేదించికొనుచున్నాను. వానినుండి నన్ను రక్షింపుము. నన్ను మంచి నీతిమార్గమున నడపుము. అట్లు నడపఁగలవాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు. నన్ను దుర్నీతివిముఖునిచేయుము, దుర్నీతినుండి నన్ను తొలఁగింపఁగలవాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు.''

పైప్రార్థనకు బదులుగా సాధారణముగా ఈ క్రింది చిన్నప్రార్థనను చెప్పుచుందురు.

"సుబ్హానక అల్లాహుమ్మ వ బి-హమ్ది-క వ తబారకస్ముక వ త'ఆలా జద్దుక వ లా ఇలాహ ఘైరుక అ' ఊజుబిల్లాహిమినష్ షైతా నిర్-రజీమ్"

"జయ దేవ పరోఽసి త్వం స్తుత్యః పరమపావనః
సేవ్య స్త్వదన్యః కోవాఽస్తి త్వాం మహాం శరణం గతః
తస్మాత్త్వం ఘోరపాపేభ్య స్త్రాతు మర్హసి మాం ప్రభో"

"దేవా, నీవు మహిమవంతుఁడ వగుదువుగాక! నీవు స్తోత్రార్హుఁడవు; నీనామము ధన్యము. నీ ప్రభావము నిరతిశయము. నీవు తప్ప సేవింపఁదగినవాఁ డితరుఁడు లేఁడు. సైతాను నుండి నన్ను రక్షింతువని నిన్ను శరణు. జొచ్చియున్నాను."

ఈ ప్రార్థన అయినతరువాత 'ఫాతిహా' చదువుదురు. 'ఫాతిహా' అనఁగా కురానులోని మొదటి అధ్యాయము (సురా.)

"బిస్మిల్లా-హిర్ రహ్మాని-ర్ రహీమ్, అల్-హమ్దు లిల్లాహి రబ్బిల్-' ఆలమీన్. అర్-రహ్మా నిర్ రహీమ్. మాలికి-యౌమి-ద్దీన్ ఇయ్యాక న'బుదు వ, ఇయ్యాక నస్త' ఈన్. ఇహ్దీ-నస్-సిరాతల్ ముస్తఖీమ్, సిరాత్-ల్లజీన అ'' నమ్త "అలైహిమ్ గైరి ల్ మఘ్-దూబి అలైహిమ్. వ లద్దా' ల్లీన్."

"జగన్నాథాయ దేవాయ దయాదాక్షిణ్యమూర్తయే
ధర్మనిర్ణయకాలేచ తుభ్యం ధర్మాధికారిణే
నమోఽస్తు తే జగన్నాథ త్వాం మహాం శరణం గతః
సేవే త్వామేవ యాచే చ త్వామేవ శరణం ప్రభో
గత్వా యేన సుమార్గేణ లభంతే సజ్జనా వరాన్
నగత్వా యేన మార్గేణ దుర్జనా యాంతి దుర్గతిమ్
తేనైవాపి సుమార్గేణ నేతు మర్హసి మాం ప్రభో."

"దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర జగన్నాథుఁడును, దయాదాక్షిణ్యమూర్తియు నగు దేవుఁడే సర్వస్తుతులకును అర్హుఁడు. మేము నిన్నే సేవింతుము. సహాయముకొఱకు నిన్నే ప్రార్థింతుము. నీప్రసాదమును బడసిన వారవల్ల

బించు సన్మార్గమున మాకును దారి చూపుము. తప్పుత్రోవఁ బడి నీకోపమునకుఁ బాత్రులగువారి మార్గమును మాకు పరిహరింపుము."

ఈ 'ఫాతిహా' చెప్పినతరువాత 'ఆమీన్' 'తథాస్తు' 'అట్లే అగుగాక!' అని చెప్పుదురు. తరువాత బాగుగా వల్లెవేసిన కురానులోని ఒక 'సురా' (అధ్యాయము) ను చదువుదురు. సాధారణముగా కురానుకొన నుండు చిన్న అధ్యాయము నొకదానిని చదువుట వాడుక. కురాను చదువనివారు 'అలిఫ్ లామ్' (ఏకత్వము) అను సురాను చదువుదురు.

"ఖుల్ హు-వల్లాహు-అహద్. అల్లాహు-స్సమద్. లమ్ యలిద్ వ లమ్ యూలద్. వ లమ్ యకుల్-లహూ-కుఫువనహద్."

"స ఏకో దేవ స్తస్మాచ్ఛ స్వతంత్రో నాస్తి కశ్చన
అజోఽసదృశో; న కంచి జ్జనయిష్యతి స ప్రభుః

"దేవుఁడొక్కఁడే. అతనినుండి స్వతంత్రముగా నుండున దేదియు లేదు. అతఁడు పుట్టినవాఁడు కాఁడు, అతనికి పుట్టినవారు నెవ్వరును లేరు. అతఁ డసదృశుఁడు" అని చెప్పుము.

3. తరువాత "అల్లా-హు-అక్బర్-" "దేవఏవ పరః" "దేవుఁడు సర్వాధికుఁడు" అని పలికి, ప్రార్థనచేయువాఁడు తల వంచి అరచేతులు మోకాళ్ళవఱకు చేరునట్లు చేయును. ఇట్లు చేయుటకు 'రుకూ' అనిపేరు. ఇట్లుండి అతఁడు దేవుని మహిమ నీక్రింది వాక్యములతో స్మరించును.

'సుబ్-హాన-రబ్బియ-లజీమ్-"

"జయ మే పరమప్రభో"

"పరముఁడగు నా ప్రభువు మహిమవంతుఁ డగుఁగాక!"

దీని క్రిందిమాటలు చేర్చవచ్చును. లేదా దానికిబదులుగా చెప్పవచ్చును.

• "సుబ్-హానక-అల్లాహుమ్మ-రబ్బనా వ బిహమ్దిక అల్లాహుమ్ మగ్ఫిర్ లి"

"జయ దేవ ప్రభో రక్ష స్తువే త్వామేవ సర్వదా,"

"దేవా, ప్రభువా, నీవు మహిమవంతుఁడ వగుదువుగాక. స్తుత్యుఁడవు. దేవా, నాకు రక్షణ నొసగుము."

౪. పిమ్మట నిలుచుండి—

"సమి'-అల్లా-హు లిమన్ హమి దహ్"

"యో దేవం స్తౌతి తం నిత్యం స్వీకరోతి ప్రభు స్సదా,
తస్మా త్పాలయ మాం నాథ స్తౌమి త్వామేవ హి ప్రభో"

"తన్ను స్తుతించువానిని దేవుఁడు స్వీకరించును. నాథా, నీవు స్తోత్రార్హుఁడవు" అనవలెను. ఇట్లని నిలఁబడి 'రబ్బనా-లకల్-హమ్ద్' అని 'అల్లాహు-అక్బర్'-అనిపలుకును.

౫. తరువాత సాష్టాంగపడవలెను. రెండుపాదములబొటనవ్రేళ్లు, రెండుకాళ్ల మణుకులు, రెండుచేతులు, నుదురు, ఇని నేల తాఁకవలెను. ఈసాష్టాంగమునకు 'సజ్ దహ్' అని పేరు. ఇట్లు సాష్టాంగపడి,

"సుబ్ హాన రబ్బియల్-అ' లా"

"జయ ప్రభో పరాత్పర"

"పరిభువా, పరాత్పరా, నీకు జయము" అని మూఁడుసార్లయినను అనవలెను.

ఈ క్రిందివాక్యమును పైదానికి కలుపవచ్చును; లేదా, దానికిబదులుగా అనవచ్చును.

సుబ్హాన-క అల్లాహుమ్మ రబ్బ-నా వ బి-హమ్దిక అల్లాహుమ్-మగ్ఫిర్ లి."

"జయ స్తవనీయ హే పాలయ మామ్"

"దేవా, స్తవనీయ, నన్ను రక్షింపుము." ఇది మొదటి "సజ్ దహ్"

౬. తరువాత ప్రార్థనాపరుఁడైనవాఁడు భక్తియుతుఁడై కూర్చుండవలెను. ఇట్లు కూర్చుండుటకు "జల్ సహ్" అని పేరు.

౭. పిదప రెండవసారి అయిదవపేరాలో చెప్పినట్లే సాష్టాంగపడవలెను. ఇది రెండవ "సజ్ దహ్". అక్కడచెప్పిన వాక్యములనే ఇప్పుడును అనవలెను.

౮. ఇక్కడితో ఒక 'రకత్తు' సంపూర్ణమగును. అప్పుడుఆరాధకుఁడులేచి రెండవ 'రకత్తు' కొఱకు నిలుచుండి, మొదటి 'రకత్తు' చేసినట్లే చేయవలెను. రెండవ రకత్తు అయినతరువాత మఱి నిలబడనక్కఱలేదు. భక్తితో మోఁకాళ్లపై కూర్చుండి, దైవస్తోత్రముతోపాటు ప్రవక్తయగు ముహమ్మదు పైగంబరుకొఱకును కొన్ని స్తుతి వాక్యములను పఠింపవలెను. ఈస్తోత్రమునకు 'తహియ్యా' అని పేరు.

అత్ తహియ్యాతు లిల్లాహివ-స్సలవాతు వత్-తయ్యిబాతు. అ-స్సలాము! అలైక అయ్యుహాన్ నబియ్యు వ రహ్మతుల్లాహి వ బరకాతుహ్, అస్సలాము' అలైనా వ' అలా' ఇబాదిల్లా హిస్సాలిహీన. అష్-హదు

అల్లా ఇలా హా ఇల్లల్లాహు వ అష్-హాదు అన్న ముహామ్మదన్' అబ్దు-హూ రసూలుహూ".

"పూజాః ప్రార్థనాశ్చైవ యా వాగ్భిః కర్మభిః కృతాః
సంపద్భిశ్చాపి తా స్సర్వా స్తే దేవా యాస్తు సర్వదా
ప్రవక్తః శాంతి స్తే ప్యస్తు కృపా దేవస్య యే వరాః
వయం తస్యైవ దాసా స్స్యాం ధర్మే నిత్యం ప్రతిష్ఠితాః
తస్మా దస్మాకమ ప్యస్తు శాంతిః ; సేవ్య స్స ఏవహి
తస్య ప్రవక్తా దాసశ్చ ముహామ్మ దితి నిశ్చయః"

"మాటలచేతను, క్రియలచేతను, ధనముచేతను చేసిన ప్రార్థనలును, ఆరాధనయు, సర్వమును దేవునికి చెందుచున్నది. ముహామ్మదా, నీకు శాంతి యగుగాక ! దేవుని వరములకును కరుణకును నీవు పాత్రుఁడ వగుదువుగాక ! మాకును దైవకింకరులకును శాంతి యగుఁగాక ! దేవుఁడు తప్ప సేవింపఁదగినవాఁడు లేఁడు. ముహామ్మదు పైగంబరే అతని ముఖ్యకింకరుఁడు, అతని ప్రవక్త".

౯. ఇప్పటికి రెండు 'రకత్తు'లకంటె ఎక్కువ చెప్పఁదలఁచినయెడల, తిరిగి నిలుచుండి, యెప్పటివలెనే ఆరంభింపవలెను. రెండురకత్తులు మాత్రమే చెప్పఁదలఁచిన యెడల, ప్రవక్తకొఱకు ఈ క్రింది ప్రార్థనను కూడ చేయవలెను. అంతమున 'సలామ్' చెప్పక పూర్వము ఈ ప్రార్థనను దీని తరువాతి ప్రార్థనను చేయవలెను.

"అల్లా హుమ్మ సల్లి ' అలా ముహామ్మదిన్ వ ' అలా ఆలి ముహామ్మదిన్ కమా సల్లఇత ' అ అలా ఇబ్రాహీమ వ ' అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హామీదుమ్-మజీద్ అల్లాహుమ్మ బారిక్.' అలా ముహామ్మదిన్ వ ' అలా ఆలి ముహామ్మదిన్ కమా బారక్త' అలా ఇబ్రాహీమ వ 'అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హామీదుమ్-మజీద్."

"సర్వా అపి తే స్తుతయ స్త వైవ మహిమా పరా
ఇబ్రాహీ మనుగంతార స్త్వత్ప్రసాదా జ్జయంగతాః
తథా ముహామ్మ జ్జయతు తథా తదనుసారిణః
ఇబ్రాహీ మనుగంతారః ప్రాప్నువ న్నుత్తమా న్వరాన్
తథైవ ప్రాప్నుయా ద్దేవ ముహామ్మ దనుసారిభిః"

"దేవా, ఇబ్రాహీమునకును అతని ననుసరించిన వారికిని జయము నిచ్చినట్లే మహమ్మదునకు అతని ననుసరించువారికిని జయము నిమ్ము. నీవు స్తుత్యుఁడవు. పరముఁడవు. దేవా, ఇబ్రాహీమును అతనియనుచరులను అనుగ్రహింపుము. నీవే స్తుత్యుఁడవు, పరముఁడవు."

దీనికి క్రింది ప్రార్థనను చేర్చవలెను:—

"అల్లాహుమ్మ ఇన్నీ జలమ్తు నఫ్సీజుల్మన్ కసీరన్‌వలా యఘ్ఫిరుజ్ - జునూబ ఇల్లా అంత, ఫఘ్ఫిర్ లీ మఘ్ఫిరదన్ మిన్ ఇందిక వర్‌హమ్‌నీ ఇన్నక అంతల్ ఘఫూరుర్ - రహీమ్,

"అపరాధసహస్రాణి కృతవా నస్మి కేవలమ్
త్వం తేభ్యో ఉపరాధేభ్యో రక్షి తాన్యో న కశ్చన
తస్మా త్కారుణ్యభావేన రక్ష మాం పరమప్రభో
క్షమాచ కరుణాచైవ త్వై హి పరాత్పర"

"దేవా, నే నెన్నియో యపరాధములఁ జేసియున్నాను. అపరాధములనుండి రక్షించువాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు. కావున నీవేరక్షించికరుణఁజూడుము. క్షమించువాఁడవును" కరుణామయుండవును, నీవే."

దీనికి బదులుగా ఈ క్రింది స్తోత్రమును పఠింపవచ్చును:—

"రబ్బిజ్ అల్నీ ముఖీమస్సలాతి వమిన్ జుర్రియ్యతి రబ్బనా వ తఖబ్బల్ దు, అ, రబ్బనఘ్ఫిర్ లీ వలెవాలెదెయ్య-వలిల్-మోమినీన-యౌమయఖూముల్-హిసాబ్,"

"యథాహం మత్ప్రజాశ్చై వ భవేమ ప్రార్థనాపరాః
తథాంగీకురు త్వమాంనాథ ప్రార్థనాం; రక్ష నః ప్రభో॥
యదాస్మాకం పరీక్షార్థమై ధర్మనిర్ణయతత్పరః
పరీక్షేథా స్తదారక్ష మాం భక్తాంశ్చ పిత్రాంస్తథా."

"ప్రభువా, నన్నును నాసంతతివారిని ప్రార్థనాపరులమగునట్లు చేయుము. ప్రభువా, మాప్రార్థన నంగీకరింపుము. ప్రభువా, మా యపరాధములను లెక్కపెట్టు కాలమున నాకును నాతలిదండ్రులకును భక్తులకును నీరక్షణ నొసఁగుము."

18. ఇంతటితో ప్రార్థనయగును. పిదప ఈక్రిందిరీతిగా సలాము చెప్పవలెను. ముస్లిములు ఒకరికొకరిట్లే సలాముచెప్పికొందురు. సలామ్‌చెప్పునప్పు డొకసారి తలను కుడిప్రక్కకును ఒకసారి ఎడమప్రక్కకును త్రిప్పుచు ఇట్లు చెప్పవలెను;—

"అస్-సలాము, అలైకుమ్-వ రహ్మతుల్లాహ్"

"దేవస్య కరుణాపాత్రో శాంతియుక్త స్సదాభవ"

"నీకు శాంతియు, దేవునికరుణయుం బ్రాప్తించుఁగాక !"

11 రెండు 'రకత్తు'లే చెప్ప నుద్దేశించినవారిప్రార్థన యింతవఱకు చెప్పఁబడి నది. కాని, మూఁడు నాలుగు రకత్తులు చెప్ప నెంచినయెడల, 8 వ పేరాలో చెప్పి నట్లు 'ఖదా'యును, 'తహియ్యా' యును చెప్పి, తిరిగినిలుచుండి 'అల్లా-హు-అక్బర్ 'దేవ ఏవ పరః' 'దేవుఁడు సర్వాధికుఁడు' అని చెప్పి, మొదటి ఏడు పేరాలలో చెప్పిన ప్రకారము రెండు 'రకత్తు'లను పూర్తిచేయవలెను. ఎప్పుడును తుదకు భక్తితో మోకరించుట, 'తహియ్యా' చేయుట, ముహమ్మదు పైగంబరుకొఱకు ప్రార్థన మొదలగునవి, 8, 9 పేరాలలోనిప్రార్థన, ఆఖరువరకు సలాము, ఇవన్నియు జరుగవలెను.

ఇది గాక, ఆరాధకుఁడు తనయిష్టము వచ్చిన ట్లుండి ప్రార్థనచేయవచ్చును. భక్తుఁడగువాఁడు సర్వకాల సర్వావస్థలయందును దేవునికి నమ్రుఁడై యుండును, ముస్లిములకు ప్రార్థన నిత్యకృత్యము. వారు నిలుచున్నను కూర్చున్నను, మోకరించి ఉండినను, ఏయవస్థలో ఉన్ననుసరే ప్రార్థనను మానరు. ఒకప్రక్కనుండి మఱియొక ప్రక్కకు తిరుగునప్పుడెల్ల వారు దేవుని మహిమను కొనియాడుచునే యుందురు. 'రుకు' (చూడు-3-వ పేరా) చేసి నిలుచున్నప్పుడెల్ల "సమ' అల్లాహు లెమన్-హామిదహ్"

"స్తోతారం దేవోఽనుగృహ్ణాతి"

"తన్ను స్తోత్రముచేయువానిని దేవుఁడు స్వీకరించును" అనుచుందురు.

నలుగురును చేరి సంఘముగా ప్రార్థనచేయునప్పుడు, అచ్చట చేరినవా రందఱును ఇమాము చెప్పిన ప్రార్థనల నన్నిటిని ఫాతీహాతో సహా చెప్పుచుందురు. 'ఫాతిహా' తరువాత ఇమాము చదువు కొరాను భాగములను మాత్రము తక్కినవా రుచ్చరింతురు. ఇమాము మ్రొక్కుచుండు స్థితినుండి లేచి "సమి 'అల్లాహు లిమన్ హామిదహ్'' అని నప్పుడు "రబ్బనా వ లకల్-హమ్ద్'' (చూడు, పేరా 3.) అని అందురు.

౧౨. మూఁడవపేరాలో చెప్పిన 'రుకూ' చేసిన తరువాతఁగాని అదిఆరంభింపక పూర్వము నిలుచున్నప్పుడుగాని, 'ఖునూత్' అనుప్రార్థనచేయఁబడును. 'ఇషా'ప్రార్థనలో తుదిమూఁడు రకత్తు లప్పుడు మాత్రము ఈప్రార్థనను సాధారణముగా చేయుచుందురు. అట్టి "ఖునూత్" ప్రార్థనలలో బాగుగా ప్రచారములో ఈ క్రిందిది ఉన్నది.

"అల్లాహుమ్-మహ్దినీ ఫీమిన్ హదైతవ 'ఆఫిని ఫీ మన్ ఆఫైత వ తవల్లనీ ఫీ మన్ తవల్లైన వ బారిక్ లి ఫీ మా అంతైత వఖినిమష్ట మా ఖధైత ఫ-ఇన్నక తఖ్ దీ

వలా యఖ్ దా 'అలైక ఇర్న హూా ల యజుల్లుమన్ వాలైత తబారక్త రష్బనా వత లైత్.''

"సన్మార్గే యేగతా స్తేషాంమార్గే మామపి చోదయ
రక్షాం తే యేగతా స్తేషాం తద్రక్షాం దేహి నః ప్రభో
మైత్రీం తే యేగతా స్తేషాం మిత్రతాం మాం ప్రసాదయ
య న్మాం దాస్యసి తత్సర్వం ధన్యం మాం కర్తు మర్హతి
ధర్మనిర్ణయకాలే చ యో దోషో దృశ్యతే మయి
క్షమస్వ నాథ తత్సర్వం ప్రార్థయామి నిరంతరమ్
త్వం ధర్మనిర్ణయే స్వామీ త్వాం నకశ్చన నిందతి
మిత్రతాం యో గత స్తే నకదాచి దపహీయతే
ధన్యోఽసి త్వం ప్రభో నాథ దేవదేవ పరాత్పర."

"దేవా, సన్మార్గమున నీవు దారిచూపిన వారితో నాకును దారిచూపుము. నీవు కాపాడినవారితోఁగూడ నన్నును కాపాడుము. నీవు స్నేహముచేసినవారితోపాటు నాతోఁగూడ స్నేహము చేయుము. నీవు నాకు ప్రసాదించిన దానితోపాటు నన్నాశీర్వదింపుము, నీవునాయందు చూచినదోషమునుండి నన్ను రక్షింపుము. ధర్మనిర్ణయము చేయువాఁడవు నీవే; నిన్నెవ్వరును వ్రేలెత్తిచూపఁజాలరు. నీమైత్రిని బడసినవానికగౌరవమనున దుండదు. నాథా! పరాత్పరా! నీవు ధన్యుఁడవు.''

పైదానికి బదులుగా కొందఱు ఈక్రింది ప్రార్థనను చేయుదురు.

''అల్లాహుమ్మ ఇన్నా నస్త' ఈనుక వనస్తఘ్ఫిరుక వ ను 'మిను బిక వనతవక్కలు' అలైక వ నుస్నీ అలైక్-అల్-ఖైర వనష్కురుక వ లా నక్ ఫురుక వ నఖ్ ల' ఉ వనత్రుకు మన్ యఫ్జురుక. అల్లాహుమ్మ ఇయ్యాక న'బుదు వ లక నుసల్లి వ నస్జుదు వ ఇలైక నస్' ఆ వనహ్ఫిదు వ నర్జూ రహ్మతక వ నఖ్ షా' అజాబక ఇన్న' అజాబక బిల్-కుఫ్ఫారి ముల్ హిఖ్''

హువేమ త్వాం సహాయార్థం రక్షాం తే ప్రార్థయామహే
త్వాం తు విశ్వసిమో దేవ త్వయి బుద్ధిం ప్రకుర్మహే
ఉచ్చై స్స్తువేమ త్వా మేవ నమస్కుర్మో యథావిధి
కృతఘ్నా మాభవేమ త్వ దభక్తా న్వర్జయేమ చ

సేవామహే చ త్వామేవ త్వామేవ ప్రార్థయామహే
త్వామేవ ప్రణతా స్స్యామ త్వాం శీఘ్రం శరణంగతాః
యాచేమ త్వద్దయాం నాథ దండనాద్వై భయాకులాః
దండనాం తవ విందంతే భక్తిహీనా స్సునిశ్చయమ్॥"

"దేవా, మేము నీ సహాయము వేడుచున్నాము. నీరక్షణను కోరుచున్నాము. మాకు తెలిసిన ఉత్తమమార్గమున నిన్ను స్తుతించుచున్నాము. నీకు వందనములాచరించుచున్నాము. మేము కృతఘ్నులమై యుండలేము. నీయాజ్ఞలను మన్నింపనివారిని విడిచిపెట్టి వారికి దూరముగా పోవుచున్నాము. దేవా, నిన్నే సేవింతుము, నిన్నే ప్రార్థింతుము, నీకే నమస్కరింతుము. శీఘ్రముగ నీయొద్దకే పరుగెత్తివచ్చుచున్నాము. నీవు మమ్ము కరుణింతువని ఆశపెట్టుకొనియున్నాము. నీ దండనకై భయపడుచున్నాము. విశ్వాసహీనులను దండన అనుసరించుచునే ఉండును."

ఇట్టిప్రార్థనయందు ముస్లిమగువాడు తన సర్వమును దేవునిచే యనునమ్మకము కలిగి యంతయు నతని యాధీనము చేయును. మనుష్యుడు తన సృష్టికర్తయెడల నెట్లు ప్రవర్తింపవలెనో సర్వకాలసర్వావస్థలయందును ఆతని నామము నెట్లుస్మరింపవలెనో అతని స్తోత్రము నెట్లుచేయవలెనో యీయిస్లాములో విధింపబడిన ప్రార్థన తెలుపుచున్నది. ఇందు ఇతరమతములకు విరుద్ధమైన ఒక్క అక్షరమును లేదు.

ముస్లిములు నిర్వర్తింపవలసిన రెండవవిధి ఉపవాసము. దౌష్ట్యమునుండి తొలగియుండుటకే యుపవాసము విధింపబడినదని ఖురాను చెప్పుచున్నది. ప్రార్థనవలెనే ఇదియును ఆత్మనుశుద్ధిచేసి దుర్మార్గమునుండి దూరముగానుంచును. ఖురాను 'మంచిదానిని చేయుము. చెడుగునువర్జింపుము' అనిమాత్రము చెప్పియూరకొనక మంచినిచేయుటకును, చెడుగునువర్జించుటకును వలయుమార్గము నేర్పఱుచుచున్నది. ఉపవాస మట్టి మార్గములలో నొకటి. ఇస్లాములో నుపవాసమనగా కేవలము నాహారవిసర్జనమే కాదు. చెడుబుద్ధుల నన్నిటిని విడుచుటయుగూడ నుపవాసమే. ఇంద్రియనిగ్రహమున కుపవాసము చాలతోడ్పడును. అది కష్టజీవనము నలవాటుచేసి దేహారోగ్యమును ఆత్మనైర్మల్యమును ప్రసాదించును. రమధాను నెలయంతయు నుపవాసకాలముగా విధింపబడియున్నది. ఆదినములలో సూర్యోదయమునుండి సూర్యాస్తమయమువఱకును తిండి తినకూడదు. నీళ్ళుత్రాగకూడదు. అట్లే యీనెలలో స్త్రీసంసర్గమును వర్జింపవలయును. దీర్ఘరోగులును, వృద్ధులగు స్త్రీపురుషులును, గర్భిణులును, పాలతల్లులును ఉపవాసము చేయనక్కఱలేదుగాని, వారికిజరిగినయెడల ప్రతిదినమున మఱియొకనికి భోజనము పెట్టవలయును.

మూఁడవవిధి దానము. తక్కినమతములలో దానము విచక్షణలేక చేయఁబడుచుండును. ఎవనియిష్టానుసారము వాఁడు దానముచేసికొనవచ్చును. ధనవంతుఁడైనను దానముచేయవలయునను నిర్బంధములేదు. అందుచేత నిజముగా దరిద్రులును రోగులును నగువారికి సహాయము దొరకుట సంభవింపదు. ఇస్లాములో అట్లుకాదు. ప్రతిగృహయజమానుఁడు విధిగా తనయాస్తినిబట్టి ఇంతసొమ్మియవలయును. ఇది యొకపన్నువంటిది. ఇట్లుసమకూర్చిన ధనమును బీదలకును, జీవనముచేయుటకువలయు సాధనములు లేనివారికిని, ఋణగ్రస్తులకును, తమచేతఁజిక్కినబానిసలనువిడిపించుటకును, అభ్యాగతులకును, ఈపన్నును వసూలుచేయువారి జీతములకును, ఇస్లామును స్వీకరింప నిచ్ఛగలవారికిని, అల్లామార్గమునను వినియోగముచేయవలయును. పైదానిలో తుదిరెండును ఇస్లామును వ్యాపింపఁజేయుట కేర్పఱిచినవి.

యాత్రఅనునది ఇస్లాములో నాల్గవవిధి. ముస్లిములగువారందఱును దమజీవితకాలములో నొక్కసారియైనను మక్కాకు యాత్రచేయవలయును. తాను యాత్రకు వలయు సామగ్రిని జాగ్రత్తపెట్టికొనుటయేకాక, యింటియందుండువారికి తానుయాత్రనుండి తిరిగివచ్చునంతవఱకును కావలసిన భోజనసామగ్రిని కూర్చియుంచినఁగాని బయలుదేరఁగూడదు. యాత్ర జుల్ హజ్జు నెలలో ప్రారంభమగును. యాత్రికుఁడా నెలలో ఏడవదినమునకు మక్కా చేరవలెను. యాత్రలో నీక్రిందివిధానమునకు అర్కాన్ అనిపేరు. యాత్రికుఁడు తొలుత ఇహ్రాము చేయవలెను. అనఁగా మామూలుదుస్తులను విడిచిపెట్టి యాత్రికులందఱును ఒకటే విధమగు రెండుదుప్పటములను ధరించవలెను. శిరోవేష్టనమెద్దియు నుండఁగూడదు. ఇందువలన ధనవంతుఁడు బీదవాఁడనునను భేదముపోవును. రెండవది తవాఫు అనఁగా 'కాబా' యను దేవాలయముచుట్టును ఏడుసార్లుప్రదక్షిణముచేయుట. మూఁడవది సయి, అనఁగా మక్కాలోని సఫ, మర్వ, అను రెండుచిన్నకొండలమధ్యను ఏడుసార్లు పరుగెత్తుట. నాల్గవది అరీఫాత్ అనుమైదానముమీఁద కొంతకాలము వాసముచేయుట. అరీఫాత్ అనఁగా జ్ఞానభూమి. ఈమైదానముపై ముస్లిములందఱును ఏకరీతివస్త్రములనుధరించుచు ఏకభక్తితో పరమేశ్వరధ్యానముచేసి ప్రపంచములోసృష్టికర్తముందఱవీఁడుధనవంతుఁడు వీఁడుధనహీనుఁడు, వీఁడు అధికారి వీఁడుసేవకుఁడు, వీఁడుపాలకుఁడు, వీఁడుపాలితుఁడు, అనువిభేదములులేక, సర్వమానవులునుఏక సోదరసంఘమునకు చెందినవారను భావముతో మెలఁగుచుండుట సంభవించును.

పైని ఇస్లాముస్వరూపము సంగ్రహముగా వివరింపఁబడినది. కాని, దానిని సంపూర్ణముగా తెలిసికొనుటకు ఖురానుషరీఫును చదివితీరవలయును. శతాబ్దముల తర

బడిని భారతవర్షమున హిందువులును ముసల్మానులును గలిసి జీవించుచున్నారు. వీరి యాచారములవారును వారియాచారములను వీరును కొంతవఱకు లౌకికమున నవలంబించి యున్నారు. దుస్తులలోను అలంకారములలోను ఇతరబాహ్యవిషయములయందెల్ల ఒకరి నుండియొకరు గ్రహించియున్నారు. కాని, వీరిమతమును వారుగాని వారిమతమును వీరుగాని తెలిసికొనఁ బ్రయత్నించి యుండలేదు. ఇదియెంతయు శోచనీయము. ఇట్లు తెలిసికొనినఁగాని, మతవైషమ్యములు తొలఁగి సంపూర్ణసోదరభావము కుదురుకొనదు. ఇంతవఱకును నిట్టిపని జరుగకుండుటకుఁ గారణము ఆయామతగ్రంథములు దేశభాషలలో లేకపోవుటయే. ఇట్టిలోపమును తొలఁగించుటకే కురానుషరీఫును తెనుఁగులోని కనువదించుటకు 1915 వ సంవత్సరమున నారంభించితిని. అరబ్బీభాష తెలిసిన యిద్దఱు మౌల్వీల నేర్పాటుచేసికొని, అరబ్బీకురానును ఇంగ్లీషులోనియనువాదములను ప్రక్కనుంచుకొని, వారితోచర్చచేయుచు, సాధ్యమయినంతవఱకును మూలగ్రంథములోని యర్థము చెడకుండఁ బ్రయత్నము చేసి, దైవానుగ్రహమున దీనిని ముగించితిని. గ్రంథముపూర్తి యయినతరువాత మరియు సంప్రదాయమును బాగుగఁ దెలిసిన ముస్లిముస్నేహితులకు దీనిని వినిపించుచు నచ్చటచ్చట సవరణలు చేయుచుంటిని. నేఁటికి దీనిని ముద్రించి యాంధ్రలోకమునకు సమర్పింప సాహసించినాను. ఈయనువాదమునందు లోపములుండవచ్చును. ఒకభాషనుండి మఱియొకభాషలోనికి భావమును తెచ్చుట సులభసాధ్యముకాదు. అరబ్బీభాష ప్రతిభవేఱు, ఆంధ్రభాషప్రతిభ వేఱు. అరబ్బీలోనిభావములను సరిగా తెలుపు తెలుఁగుపదములు లభింపకపోవచ్చును. అప్పుడువానిని మిక్కిలియుదగ్గఱగాబోధించు తెలుఁగుమాటల నుపయోగింపవలయును. ఇదిగాక కురానులోనిభాష సరిగా జీబ్రీలునుండి ముహమ్మదుపైగంబరు గ్రహించినది. ఎట్లయినను ముహమ్మదుపైగంబరు గొప్పయుత్సాహముతో క్రొత్తమతమునుచాటుట కుపయోగించినభాష. దానికిసరిపోయినభాష అసలరబ్బీలోనే లేదు. అట్టియెడ, దానిని పరభాషలోనికిమార్చుటవలన చప్పబడిపోవుననివేఱెచెప్పనక్కఱలేదు. అయినను మనకు భావముప్రధానము. అట్టిభావమును గ్రహించి, యాంధ్రదేశమందలి హిందువులును ముహమ్మదీయులును సమరసభావముతో మెలఁగినయెడల నేనుపడినప్రయాసము సఫలమగునని యెంచుచున్నాను.

చిలుకూరి నారాయణరావు.

# రెండవ ముద్రణమునకు పీఠిక.

——(:o:)——

ఖురానుషరీఫు ప్రథమముద్రణము ప్రతులన్నియు 1930 సం॥ రమునందే, అనఁగా నేఁటి కనిమిదేండ్లక్రిందటనే ఖర్చయిపోయినవి. వీనిలో కొన్నిప్రతులను ఇస్లాము మతాభిమానులు కొని తమపేర పంచిపెట్టిరి. వారి సహాయమును అభిమానమును లేకుండిన మేము చాలకష్టపడియుందుము. ఇంతటి పెద్దగ్రంథమును ప్రకటించుట సులభసాధ్యము కాదు. ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమము బాగుగసాగినదికాని, అది పుస్తకములు ప్రకటించువారిమీఁదికి పిడుగుగా పరిణమించినది. గ్రంథకర్త ఎంతకష్టపడినాఁడో గమనించు దిక్కులేదు. గ్రంథమచ్చగుటకు ఎంతధనము వ్యయమయినదో గమనించువారులేరు. దానిప్రకటనమున కెంతవెచ్చపెట్టవలెనో ఆలోచింపరు. గ్రంథమును ప్రకటించగానే ఉచితముగా (పోస్టేజికూడభరించి) ప్రతులను పంపుఁడని నూర్లకొలఁది కార్డులువచ్చి పడుచుండును. ఇది దేశదౌర్భాగ్యమునకు గుఱుతు. మంచి గ్రంథములు అయిదునూర్ల ప్రతులయినను ఖర్చగునను ధైర్యమున్నయెడల ఎన్నియుత్కృష్ట గ్రంథములనయినను ప్రకటించి యాంధ్రవాఙ్మయాభివృద్ధికి తోడ్పడవచ్చును. ఆయదృష్టమాంధ్రదేశమున కెప్పుడుకలుగునో !

ఇట్టి పరిస్థితులలోనయినను ఈగ్రంథమును రెండవసారి ముద్రించుటకు సాహసించినాము. ఆంధ్రదేశమున కదృష్టదినములు పట్టినవను విశ్వాసమే యీ సాహసమునకుఁ గారణము. ఈగ్రంథప్రాముఖ్యమునుగూర్చి ప్రత్యేకముగ వివరింపనక్కఱలేదు. ఎన్నియోసమయములందు హిందువులకును ముస్లిములకును కలిగినకలహములవలన ఆపద రానున్నప్పుడు ఈ యాంధ్రానువాదము ఈ రెండుమతములవారికిని సామరస్యమును కుదిరించినది. ఇదియే గ్రంథకర్తకును గ్రంథప్రకాశకులకును బహుమానము. హిందూ ముస్లిము సమస్యయే భారతవర్ష సమస్య. వీరొండొరుల మతాభిప్రాయములను బాగుగ బోధపఱుచుకొనినఁగాని ఈ సమస్య ముమ్మాటికిని పరిష్కారముకాదు. ఇతరప్రాంతములలో హిందూముస్లిము కలహము లెక్కువగానుండుటకును, ఆంధ్రదేశమున నంతగ లేకుండుటకును కారణము ఖురానుషరీఫునకు ఆంధ్రానువాదమును మేము ప్రకటించుటయే అని చెప్పుకొని గర్వించుట కధికారమున్నదని మనవిచేయుచున్నాము.

ఈ రెండవముద్రణమున భాష యింకను సరళముచేయఁబడినది. మొదటిదానిలోని అచ్చుతప్పులును అనువాదములోని పొరపాట్లును సవరణచేయఁబడినవి. మొదటి ముద్రణమునకంటె నిప్పుడీగ్రంథము సర్వాంగసుందరముగ చేయఁబడినది. ముస్లిములును హిందువులునుగూడ నీమాయుద్యమమునెడల నొకరితోనొకరు స్పర్థవహించి సహాయము చేయుదురుగాక అని కోరుచున్నాము.

ఈ గ్రంథము ననువాదసందర్భమున గ్రంథకర్త కనేకవిధముల సహాయముచేసిన ప్రెసిడెన్సీకాలేజీ అరబీ, పెర్షియను, ఉర్దూమున్షీగారగు జనాబు హాజీముహమ్మదు ఇస్మాయేలు సాహేబుగారికిని, అనంతపురకలాశాలయందదే స్థానముననున్న జనాబు అఫ్‌జుల్ ఉలేమా కె. ఎమ్. ఫరూకీసాహేబుగారికిని మాకృతజ్ఞతను తెలుపుచున్నాము.

ప్రకాశకులు.

శ్రీ

# కురాను షరీఫ్



## కాండము. 1.

## సురా 1 ఫాతిహా.

మక్కా—7 పద్యములు

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

జ గ న్నా థా !

దయాదాక్షిణ్యమూర్తీ !

రక్షణదినాధినాథా ! నీకునతులు !

మేము నిన్నే యారాధింతుము. నీకే మొఱలిడెదము.

మమ్ము ఋజుమార్గగాములఁ జేయుము.

నీకోపమునకుఁ బాత్రులుకానివారును,

నీమార్గమును దప్పనివారును,

నీవనుగ్రహించినవారును బోవుమార్గముననే మాకును దారిఁ జూపుము.

# సురా 2 గోవు.

---

మదీనా-286 పద్యములు-40 రుకూ్కలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

## అధ్యాయము 1.

అలీఫ్. లామ్. మీమ్. ముహమ్మదువారి యాజ్ఞప్రకారము.

ఈ గ్రంథముఁగూర్చి యెట్టిసంశయమును లేదు. దైవభీతిపరుల కిది రక్షణమార్గము.

దృగ్గోచరములుకాని సత్యములను నమ్మువారును, ప్రార్థన (నమాజ్) సలుపువారును, దమకు మేము ప్రసాదించినదానినుండి దేవునికొఱకు వినియోగించువారును,

నీకును, నీకుఁబూర్వమును దెలిపినదానిని నమ్మువారును, రాఁబోవుదినమునందు సంపూర్ణవిశ్వాసము గలవారును,

వీరికిఁ బ్రభువు మార్గముఁజూపును. వీరి కిష్టశ్రేయఃప్రాప్తి యగును.

విశ్వాసహీనులనిననో, వారికి సూచననిచ్చినను, నీయకపోయినను నొకటే. వారు నమ్మరు.

వారిహృదయములకును జెవులకును దేవుఁడు మూఁతలుకల్పించియున్నాఁడు. వారికన్నులపైఁ బొర క్రమ్మియున్నది. వారికిఁ దుదిదినమున ఘోరశిక్ష రానున్నది.

## అధ్యాయము-2.

"తుదిదినమునందును, దేవునియందును మాకు నమ్మకమున్నది" అని కొంద ఱందురు. కాని వారుభక్తియుతులు కానేరారు,

వారు దేవుని నతనిభక్తులనుగూడ మోసపుచ్చుచున్నామని యనుకొందురుగాని, తమ్ముఁ దామే మోసగించుకొనుచున్నా మను మాట వారికిఁ దెలియదు.

10 వారిహృదయమునం దింతకుపూర్వ మవిశ్వాసరోగ ముండెను. ఈ కురాను వచ్చినతరువాత దేవుఁ డీరోగమును హెచ్చుచేసెను. ఈగ్రంథము దైవప్రోక్తము కాదని యసత్యములు పల్కినందుకు దేవుఁడు వారికి ఘోరశిక్షను విధించును.

మీరు భూమిపై నెట్టియల్లరులను జేయఁగూడదని వారికిఁ జెప్పఁగా "మేము సంధానకర్తలముమాత్రమే" యని వారందురు.

వారేకదా యాయల్లరులకుఁ గారకులు! అయినను నది వారికిఁ దెలియదు.

"తక్కినజనులు నమ్మినట్లే మీరును నమ్ముఁ" డని వారితో ననినచో వారు, "మూర్ఖులవలె మేమును నమ్మవలయునా" అని తిరిగి యడిగెదరు కాని తామే మూర్ఖులనుమాట వారికి గోచరింపదు.

వారు భక్తులతోఁ గూడియున్నప్పుడు "మేమును భక్తులమే" అని యందురు. వారినుండి దూరమయి, తమసైతానులతోఁ గలిసియున్నప్పుడు "నిశ్చయముగా మేము మీతోడివారమే. భక్తులను జూచి మేమపహాస్యము చేయుచుందు" మందురు.

దేవుఁడు వారినిజూచి నవ్వుచు నాయల్లరులయందే చిరకాలము తెన్నుగానకుండునట్లు చేయఁగలఁడు.

వారు రక్షణను వదలుకొని తప్పును చేకొనుచున్నారు. వారి బేరమేమియు సాగదు. వారు సరియైనత్రోవను స్థిరముగనుండలేదు.

కొంద ఱగ్నినివేల్చినప్పుడు దానినుండి వెలుతురువచ్చినంతనే దేవుఁడు వారిదృష్టిని దీసివేసెను. వారు తిరిగి యంధకారములో దేవులాడసాగిరి. వీరును వారివలెనే దేనినిం గానఁజాలకున్నారు.

వారికి చెవుడు, మూగ, గ్రుడ్డి; అందుచేవారు తప్పునుండి వెనుకకు మఱల సమర్థులుగారు.

లేదా, కారుమేఘములుగ్రమ్మి, చీకటి, యుఱుములు, మెఱపులు, నావరించుకొనినప్పుడు, పిడుగుపడునేమో, చచ్చిపోవుదుమేమో యని చెవులలో వ్రేళ్ళను దూర్చికొను వారివలె వారున్నారు.

దేవుఁడు భక్తిహీనులచుట్టును గూడుకొనియున్నాఁడు. వారాతని నుండి తప్పించుకొనఁజాలరు.

20. మెఱపు కన్నుల మిఱుమిట్లుగొలిపి వారిదృష్టుల నపహరించును' అది మెఱయునంతసేపును దానిసాహాయ్యమున వారునడచుచుందురు' కాని, చీకటి వారి నావరించినతోడనే యాగిపోయెదరు. దైవేచ్ఛ యున్నచో వారు తమ కన్నులను జెవులనుగూడఁ గోల్పోవుదురు. దేవుఁడు సర్వశక్తుఁడుగదా!

## అధ్యాయము. 3.

మక్కా-వాసులారా! మిమ్మును మీపూర్వులనుగూడ సృజించిన మీప్రభువు నారాధింపుఁడు. మీ కెట్టి కీడును గలుగనేరదు.

భూమిని మీకు శయ్యగను, నాకాశమును గప్పికొను వస్త్రముగను నిర్మించి, యాకాశమునుండి గంగను క్రిందికిదింపి, దానిమూలమున మీ కాహారముకొఱకు ఫలములను గల్పించియున్న మీప్రభువునకు భయపడుఁడు. దేవునికి సాటివారితరులున్నారని వచింపకుఁడు.

మీకింకరునకుఁ బంపినవార్తనుగూర్చి మీకు సంశయమున్నచో, మీరు సత్యవంతులరేయైనచో, నట్టివార్తను మఱియొకదానిని చూపెట్టి, దానికి సాక్షులను గనఁబఱుపఁగలరా?

అట్లు మీరు చేయఁజాలరు. అట్లు చేయఁజాలనిచో మనుష్యులను, ఱాళ్ళను నింధనములుగాఁ గలిగి, విశ్వాసహీనుల కేర్పఱుపఁబడిన యగ్నికొఱ కెదురుచూచుచుండుఁడు.

కాని, విశ్వాసయుతులై, ఋజుమార్గవర్తులగువారికి నదీ ప్రవాహములదరి నుపవనములు కలుగనున్నవను సువార్తనుచాటుము. అట్టిఫలములు వారి కాహారముగా నున్నంతకాలమును వారు "పూర్వమును మా యాహార మిదే" యని యందురు. అట్టి ఫలములే వారికి లభియింపఁగలవు. వారు పరమ పవిత్రలగు భార్యలతో నందు శాశ్వతముగ వసింపఁగలరు.

గొప్పవస్తువులవలె, నలుసులనుగూడ నుదాహరణములుగఁ దీసికొనుట దేవునికిఁ దప్పుకాదు. విశ్వసించినవా రది దేవునినుండివచ్చిన సత్య మని తెలిసికొందురు విశ్వసింపనివారు "ఈయుదాహరణము వలన దేవునియభిప్రాయమే" మని యడుగుదురు. అట్టి యుదాహరణములవలన ననేకులకాతఁడు దారిచూపుచు చాలమందిని దారి తప్పించుచుండును కాని, యాయుదాహరణము స్థిరపడినపిదప దేవుని యాజ్ఞ నుల్లంఘించి, యాతఁడు కలుపవలయునను దానిని వేఱు సేయుచు భూమిపై నక్రమముగ సంచరించు దుర్మార్గులనుదప్ప నితరుల నెవ్వరి నాతఁడు త్రోవఁదప్పింపఁడు. వీరే నష్టము నొందఁగలవారు.

నీవు దేవునియందు విశ్వాసముంచ కెట్లుందువు ? నీవు చనిపోవఁగా నాతఁడు నీకుఁ బ్రాణముఁబోసెను తిరిగి యాతఁడు నిన్నుఁ జంపఁగలఁడు. తరువాత నాతఁడు నీకుఁ బ్రాణదాతయై తనయొద్దకు నిన్ను జేర్చుకొనును.

అతఁడే భూమియందుఁగల సర్వమును నీకొఱకు సృజించి, స్వర్గమున కేఁగి, దాని నేడు ఖండములుగాఁ జేసినవాఁడు. అతనికిఁ దెలియని దేమున్నది ?

## అధ్యాయము 4.

3. నీప్రభువు దేవతలతో "ఇదిగో! భూమిపై నాకుమాఱుగా నొకని నుంచుచున్నా" ననెను. వారు, మేమిచట నీపవిత్రతను

గొనియాడుచుండఁగా నచట చెడుగుచేయుచు రక్తప్రవాహములఁ గలిగించువాని నుంచెదవా?" యనియడిగిరి. ఆతఁడు "నిశ్చయముగా మీకుఁ దెలియనిది నాకుఁ దెలియు" ననెను.

పిదప నాతఁడు సర్వవస్తువుల నామములను ఆదామునకు నేర్పి యావస్తువులనే దేవతలముందఱ నిడి "మీరే జ్ఞానుల రగుదురేని యీవస్తువుల పేళ్ళేమో మాకుఁ దెలుపుఁ" డనెను.

వారు "నిన్ను స్తుతించుచున్నాము. నీవు మాకనుగ్రహించి నదితప్ప నొం డొద్దియుమాకుఁ దెలియదు. నీవే సర్వజ్ఞుఁడవు. బుద్ధిశాలివి" అనిరి.

అప్పుడాతఁ డాదాముతో "ఓయీ! వానినామములను వీరి కెఱింగింపు" మనెను. ఆతఁడు వానిని దెలిపినంతనే దేవుఁడు దేవతల వంకదిరిగి "స్వర్గమునందును, భూమియందును గల రహస్యవస్తువులు నాకుఁదెలియుననియు, మీరు వెలిపుచ్చువిషయములే కాక, దాచి నవిగూడ నాకుగోచరములే యనియు మీతోఁజెప్పలేదా ?" అనెను.

పిదప మేము దేవతలతో "ఆదామునకు నమస్కరించి యాతనిఁ గొలువుఁడీ" యన, వారును నట్లుచేసిరికాని, "ఇబ్లీసు" అను సైతా నుపేక్షించెను. అతఁడు గర్వముతో నుప్పొంగి, తిరస్కరించి తానును విశ్వాసహీనుఁడయ్యెను.

అప్పుడు మే మాదాముతో "ఓయీ! నీవును, నీభార్యయును నందనవనములో వసించుచు, మీయిచ్చవచ్చినవానిని దీసికొని, తినుచుండుఁడు. కాని, యీవృక్షముదరి మాత్రము చేరకుఁడు. అట్లు చేసినచో నాయాజ్ఞ నుల్లంఘించువా రగుదు" రంటిమి.

కాని, సైతాను వారిని మాయాజ్ఞనుండి తప్పించి, స్థానభ్రష్టులఁజేసెను. అప్పుడు మేము "మీరధోగతిం బొందుఁడు. మీరొం డొరులకు శత్రువులరు కండు. మీకు భూమి వాసస్థానమగును. అందు

మీకుఁ గావలసినయాహారము కొంతకాలమువఱకును లభింపఁ గల " దంటిమి.

అప్పు డాదాము ప్రభువునుండి స్తుతివాక్యముల నేర్చికొనెను. ప్రభు వాతని ననుగ్రహించెను. కరుణాలవాలుఁ డగుప్రభువున కదే కదా ప్రీతి !

మేము " ఇచ్చటనుండి యందఱును దిగిపొండు. ఎన్నడైనను మీకు మార్గదర్శకమగు సూచనను మే మీయఁగలము. ఆసూచనను లక్ష్యించినవారి కేభయమును నేదుఃఖమును రాఁజాలదు.

కాని, మాసూచన లసత్యములనుచు, నమ్మకములేనివారగ్ని యందు వేల్వఁబడుదురు. అందువారు చిరకాలమువసింపఁగల " రంటిమి.

## అధ్యాయము-5.

40 ఇస్రాయేలుసంతతివారలారా ! నేను మీకొకవరము నను గ్రహించితిని. దానిని మఱువకుఁడీ. మీరు నాకిచ్చిన వాగ్దానమును బాలింపుఁడీ. నేను నావాగ్దానమును మఱువను. కావున నన్నారా ధింపుఁడీ ! మీవేదములు సత్యములని నిర్ధారించుటకు నేనుపంపిన సూచనలందు విశ్వాసముంచుఁడీ ! దానిని విశ్వసింపనివారిలోఁ బ్రథ ములు మీరలే కాకుఁడీ ! తుచ్ఛమగుధనము నాసించి, నాసూచన లను పరిత్యజింపకుఁడీ ! నాకు భయపడుఁడీ !

సత్యము నసత్యముతోఁ గప్పిపుచ్చకుఁడు. మీకు సత్యము తెలిసినప్పుడు దానిని దాఁచకుఁడు.

ప్రార్థనను మఱువకుఁడు. మీరు న్యాయముగాఁ జెల్లింపవల సినదాని నెగవేయకుఁడు నమస్కరించువారితోఁ గలిసి నమస్క రింపుఁడు.

ఋజుమార్గము నితరులకుబోధించి, మీరే దానిని వీడెదరా ? మీరు గ్రంథమును జదువుదురే ! మీ కదియర్థము కాలేదా ?

ఓర్పుతోఁ బ్రార్థించుచు సహాయముఁగోరికొనుఁడు. ఇది చాలఁ గష్టమగుపనియే.

కాని, తమప్రభువును జేరఁ గలమనియు, వాని యొద్దకే తుదకుఁ జేరఁగలవారమనియు, జ్ఞప్తియందుంచుకొను దీనమానసుల కదియొకకష్టము గానేరదు.

అధ్యాయము 6.

ఓ యిస్రాయేలు సంతతివారలారా, నేనుమీకు వరము లొసంగిన యనుగ్రహబుద్ధిని మఱవఁబోకుఁడీ! మానవసంతతియంతటి లోను, మీకే యమేయములగువరములఁ బ్రసాదించియున్నాను.

ఆదినమున నొక యాత్మ మఱియొక యాత్మకు బాధ్యత వహింపఁ బోదు. వారికొఱకు మధ్యవర్తు లెవ్వరును బనికిరారు ధనమిచ్చి యైనను వారు వదలించుకొలేరు. వారికిఁ గొంచెమైనను సహాయము దొరకదు. ఆదినమునకు భయపడుఁడీ!

మిమ్ము ఘోరశిక్షకుఁ బాత్రులఁగాఁ జేసిన ఫిరౌనుజనుల నుండి మిమ్ము రక్షించియుంటిమని మదినుంచుకొనుఁడు. వారు మీ మగశిశువుల నందఱను జంపి, యాఁడుబిడ్డలను మాత్రము వదలి పెట్టిరి. ఇది మీప్రభువునుండి కలిగిన మహాశోధన.

50 మీకు సముద్రము దారివదలునట్లుచేసి, ఫిరౌను జనమును మీరు చూచుచుండఁగనే జలముల ముంచి చంపితిమి.

మేము మూసాతో నలువదిదినములు గోష్ఠిసలుపుచుండ నాతఁడు లేకుండుటఁజూచి గోవత్సమును గ్రహించి దానిని దుర్మార్గులరై చంపితిరి.

అట్లుచేసినను, మీరు కృతజ్ఞులరై యుందురుగదా యని మిమ్ము క్షమించి యుంటిమి.

మీకు మార్గదర్శకముగ నుండుటకు మూసాకు గ్రంథమును వెలుతురును మే మొసగితిమి.

మూసా తనజనముతో "నాజనులారా, మీయారాధన కొఱకు గోవత్సమును గ్రహించి మీకీడుకొఱకే పాపమునొనర్చితిరి• కావున మీసృష్టికర్త నాశ్రయించి, మీలో ద్రోహులగువారిని బరిమార్పుఁడు. ఇందువలన నాతనియనుగ్రహమును బడయఁగలరు" అనెను. అప్పుడు ప్రభువు మిమ్ముకృపాదృష్టి నాలోకించెను. ఆతఁడు కరుణాలవాలుఁడు ; అనుగ్రహింపఁగలవాఁ డాతఁడొకఁడే !

మీరు మూసాతో "ఓయీ ! దేవుఁడు మాకు స్పష్టముగాఁ గనఁబడునంతవఱకును నిన్ను మేము నమ్మఁజాలము" అంటిరి. వెంటనే మీరుచూచుచుండఁగనే, పిడుగుపడి మీరుపడిపోవఁగా,

బహుశః మీరుకృతజ్ఞతాపూర్వకవందనముల నర్పింపఁగల రని మిమ్ము మూర్ఛనుండి లేవఁదీసితిమి

పిదప మిమ్ము మేఘములచే నాచ్ఛాదితులఁజేసి,యమృతమును, నత్తలను వర్షింపఁజేసి, "మీయాహారముకొఱకు మేమనుగ్రహించినవానిలో మేలివస్తువులను దీసికొని తినుఁ" డంటిమి. కాని మీ రావస్తువులను ప్రోగుచేసి దాఁచియుంచుకొనుటచే మీకు మీరే చేటుఁ దెచ్చుకొంటిరి.

" ఈపురముఁబ్రవేశించి, యందు మీయిచ్చవచ్చినవానిం గడుపారఁ దిని ద్వారముకడ సాష్టాంగనమస్కారములతోఁ బ్రవేశించుచు క్షమింపుఁ డని వేఁడుకొనుఁడు. మీపాపములను క్షమించి, సన్మార్గవర్తులకు మఱింతహెచ్చుగా నిత్తుము " అని మేమంటిమి.

కాని దుష్టవర్తనులు మేమనినదానిని తార్మాఱు చేసిరి ; వారిపై వారిదుర్నయముల భారము మోపి, స్వర్గమునుండి కోపదృష్టిం జూచితిమి

## అధ్యాయము 7.

60. పిదప మూసా తనజనులు దప్పితీర్చికొనుటకు నీరడుగఁగా “నీచేతికఱ్ఱతో బండఱాతిని తాఁకు” మంటిమి. అట్లాతఁడు తాఁకఁగనే యందుండి పండ్రెండు ధారలు బయలువెడలఁ, బ్రతిజాతివారును దాముతాము త్రాగుట కేర్పఱుపఁబడినస్థానములను గుర్తెఱింగిరి. మేమును వారితో “దేవుఁడు మీకుఁ బ్రసాదించినదానిని తినుచుఁ ద్రాగుచు నుండుఁడు; కాని మీదుర్ణయములచే భూమిపై నపరాధముల నాచరింపకుఁడు” అంటిమి.

మీరు మూసాతో “ఓయీ! ఒకటేరీతి యాహారముచే మాకు మొగము మొత్తుచున్నది. కావున నీప్రభువును బ్రార్థించి భూసంబంధ మగునాహారముఁ బ్రసాదించునట్లు చేయుము. భూమియందలి యాకుకూరలు, గుమ్మడికాయలు, వెల్లుల్లి, తోటకూర, యెఱ్ఱయుల్లి, మొదలగుపదార్థములు మాకుఁ గావలె” నంటిరి. అతఁడు “ఏమిది! మేలివస్తువులను మీ కిచ్చియుండ చెడుపదార్థములను మీ రేల కోరుచున్నారు? ఒకపురమునకుఁ బొండు. అచట మీరు కోరినది లభించు” ననెను. వారియందు దుష్టత్వమును దారిద్ర్యమును నచ్చుపడెను. అంతట వారు కోపావిష్టహృదయులై ప్రభువును వీడి చనిరి. వారు దేవునిసూచనలను నమ్మక ప్రవక్తల నధర్మముగఁ జంపి, తిరుగుబాటు చేసి, యాజ్ఞల నల్లంఘించుటచేతనే యిట్టియాపద వారికిఁ దటస్థించెను.

## అధ్యాయము 8.

నిశ్చయముగా విశ్వాసులు, యహూదీలు, నస్రానీలు, సబావారు — ఎవ్వరైననసరే — దేవునియందును బ్రళయదినమునందును నమ్మకము గలవారు, ఋజుమార్గప్రవర్తకులు, వీరందఱును బ్రభువు

సమ్మానమును బడయఁగలరు. వారికి భయముగాని దుఃఖముగాని కలుగఁబోవు.

మేము మీతో నొడంబడికఁజేసి మీపర్వతము నెత్తినవిషయమును జ్ఞప్తియం దుంచుకొనుఁడు. మేము "మీకు వెల్లడించినవిషయమును భక్తితో నవలంబించి. భయము కలిగి, దానిలో నేమున్నదో జ్ఞాపక ముంచుకొనుఁడు."

అని యిట్లు మీకుఁ దెలిపినను మీరు వెనుదిరిగి యున్నారు. దేవునికృపయే మీపై లేకుండిన మీరు నష్టవర్గములోనే చేరియుందురు.

సబ్బాతుదినమం దాజ్ఞల నుల్లంఘించినవారిని మీ రెఱుఁగుదురు గదా! వారిని వికృతముఖములుగల క్రోఁతులుగా మార్చితిమి.

ఆకాలమువారికిని, దరువాతికాలమువారికిని భయసూచనల నిచ్చితిమి. దైవభీతిపరులకే యీసూచన!

మూసా తనజనులతో "దేవుఁడు మిమ్మొక గోవును బలియిండ నెనుగదా!" అనెను. వారు "ఏమి, మాతో హాస్యమాడుచున్నారా?" అనిరి. ఆతఁడు "దైవానుగ్రహమున నేను మూర్ఖవర్గములోఁ జేరకుందును గాక!" అనెను.

"ఆ గోవెట్టిదో మీప్రభువును మాకు విశదముచేయు మను" మని వా రాతనితో బల్కఁగా నాతఁడు "గోవు ముసలిదియు, లేఁతదియుఁ గాక మధ్యవయస్సులో నుండవలయు నని దేవునియాజ్ఞ. కావున నాయాజ్ఞచొప్పున జేయుఁడ' నెను.

వా రపుడు "దానిరం గెట్టిదో మాకు విశదపఱుపు మని నీప్రభువు నడుగు" మన నాతఁడు "అది కపిలగోవు; తేజోవంతమగువర్ణము గలిగి యుండును. చూచువారి కది యానందదాయకమగునని దేవుఁడు చెప్పినాఁ" డనెను.

70. అంత వారు "అయ్యా వెట్టిదో మా కింకను దెలియలేదు. మాదృష్టి కన్నియావులు నొకటేరీతిగ నుండును. దైవానుగ్రహమున మాకు సరియగుమార్గము లభించునుగాక! నిశ్చయమగువృత్తాంత మును నీప్రభువు నడిగి తెలిసికొనుము. ఆతనియనుగ్రహ ముండిన మాకు సరియగురక్షణ దొరకు" ననిరి.

ఆతఁడు, "భూమిదున్నుటవలనను, పొలములకు నీరుపెట్టుట వలనను జీర్ణించినదిగాక, యది యారోగ్యవంతమై, దుష్టముకానిదై యుం డవలె నని దేవు డనుచున్నాఁ" డనెను. వారును "ఇప్పుడు సత్య మును దెచ్చియున్నా"వని పల్కి యట్టిగోవును బలియిచ్చిరి. ఇంత యైనఁగాని వా రట్టిబలి నీయకుండియుందురు.

## అధ్యాయము 9.

పిదప మీ రొకనరహత్యఁ గావించి మీలో మీరు పోట్లా డుచుండఁగా మీరంతవఱకును రహస్యముగా నుంచియుండినదాని నాతఁడు బయలుపెట్టెను.

"ఆశవమును గోమాంసఖండముతో, దాకుఁ" డని మే మంటిమి. బహుళః దీనివలన దేవుఁడు మీకు బోధ గలుగఁజేసి, తనసూచనలఁ దెల్పి, చచ్చినవారిని బ్రదుకఁజేయును.

పిదప మీహృదయములు శిలలవలెను, నంతకంటె నెక్కుడు కఠినములుగను, నయ్యెను. శిలలనుండికదా నదు లుబుకుచుండుట. కొన్నిశిలలు బీఁటలువారఁగా నందుండి జలము ప్రవహించుచుండ లేదా? కొన్ని దేవునికి భయపడి యణఁగిపోయినవి. దేవుఁడు మీ కర్మలకన్నిటికిని సాక్షియై యున్నాఁడు.

మీరు సంతోషించుటకా, యహూదీలు విశ్వసింపవలయును? అందు గొందఱు దేవునివార్తను విని బోధపఱచుకొనియు దాని యర్థమును తార్మారు చేసిరి.

వారు విశ్వాసయుతులతోఁ గలిసియున్నప్పుడు, "మేము విశ్వసించితి" మందురు. వారిని వీడి యున్నప్పుడు, "దేవుఁడు మీకు చెప్పినదానిని వారికెఱింగించెదరా ? మీప్రభువుముందఱ మీతో వాదించుటకు వారిని రమ్మనుఁ"డని యందురు. వారి యుద్దేశము నీకు తెలిసినదా ?

వారు దాచినదానిని, వెల్లడించినదానిని గూడ దేవుఁడు తెలిసికొనఁగలఁ డని వారికిఁ దెలియదా ?

వారిలోఁ గొందఱు విద్యావిహీను లున్నారు. వారి కీగ్రంథముఁ గూర్చి తెలియదు. వారి కసత్యములు మాత్రము తెలియును. వారి కవ్యక్తము లగునూహాలు మాత్ర మున్నవి.

స్వహస్తములతో నీగ్రంథమును దప్పుగ వ్రాసి, పిదప దానిని తుచ్ఛలాభమున కమ్ముటకు, 'ఇదియే దైవప్రోక్త' మనువారు దుఃఖభాజను లగుదురుగాక ! తమచేతులు వ్రాసినదానికై వారికి దుఃఖము కలుగునుగాక ! వారు పొందినలాభమే వారికి దుఃఖముఁ గూర్చుఁగాక !

80. "మేము నరకాగ్నియందు కొలఁదిదినములు మాత్రమే యుందు" మని వా రందురు. "మీతో దేవుఁ డట్లు చెప్పియున్నాఁడా ? అయిన నాతఁడు తనమాటను ద్రిప్పివేయఁగలఁడు. మీకుఁ దెలియనిదానిని దేవుని కంటఁగట్టుచున్నారా ?" అని వారి నడుగుము.

కాని తమదుష్కృత్యములే తమకు లాభకారులై యుండఁ బాపము నావరించియున్నవా రగ్నియందు వాసముచేయుచుఁ జిర కాల ముండఁగలరు.

విశ్వాసము కలిగి, ఋజుమార్గగాము లగువారు స్వర్గమందు చిరవాసము చేయుదురు.

## అధ్యాయము 10.

ఇస్రాయేలుసంతతివారితో మే మొడంబడిక చేసికొనిననాఁడు "దేవుని దప్ప నితరుల నారాధింపఁకుడు. తలిదండ్రులు, బంధువులు, ననాథులు, దరిద్రులు నగువారియెడ దయఁ గలిగి యుండుఁడు, ధర్మమైనదానినే జనులకు వచింపుఁడు, ప్రార్థన మానకుఁడు. విధివిహిత మగుభిక్షను పెట్టుచుండుఁ" డంటిమి. అప్పుడు మీలోఁ గొందఱు తప్ప నందఱును వెనుదిరిగి దూరముగా వెడలిపోయిరి.

ఒకరినొకరు నఱకుకొనఁగూడ దనియు, నొకరిగృహముల నుండి యొకరిని పోఁద్రోలఁగూడ దనియు, మీలోమీరే యొడంబడికఁ జేసికొని, దాని కంగీకరించి, దానికి మీరే సాక్షులై యుంటిరి.

పిదప నొకరి నొకరు నఱకుకొనినవారును మీరే. మీలోఁ గొందఱిని వారిగృహములనుండి పాఱఁద్రోలినవారును మీరే. ఒకరి కొక రెగ్గుచేసికొని యన్యాయాపరులై యుండినవారును మీరే. వారు మీకు శరణాగతులైనప్పుడు ధర్మేతరులై వారిని త్రోసివేసిన వారును మీరే. అట్లయిన నీగ్రంథములో నొకభాగమునందు విశ్వాసమును మఱియొకభాగమునందు విశ్వాసము లేకుండుటయునా? ఇట్లు చేసినవారి కిహమందు ఫలము సిగ్గుగాక మఱియొద్ది? దేవుఁడు మీరు చేయుచున్నదానిని జూచుచునే యున్నాఁడు. రక్షణదినమున నట్టివారి నతిక్రూరశిక్షకుఁ బాత్రులఁ జేసెదము.

రాఁబోవుదినమును లక్ష్యపెట్టక యీజీవితమే ప్రధానమను వారు వీరే. వీరికి బాధ యొకించుకయుఁ దగ్గఁబోదు. వీరి కెట్టిసహాయమును గలుగదు.

## అధ్యాయము 11.

ఇదిగాక మూసాకు గ్రంథము నిచ్చి, యాతనితరువాతఁ బ్రవక్తల నంపితిమి. మరియముపుత్రుఁడగు ఈసా తాను జేయవలసినపనిని

స్పష్టముగా నిర్ణయించి యాతనికిఁ బరిశుద్ధాత్మను బ్రసాదించి శక్తి మంతునిగ నొనర్చితిమి. కాని, మీకిష్టము లేనిదానిని జెప్పు ప్రవక్త వచ్చునప్పుడెల్ల గర్వముచేఁ గన్నుగానక, కొందఱిని కృత్రిములనుగ నెంచి, కొందఱిని చంపెదరా ?

వారు, "మాహృదయములు సంస్కారముఁ జెందలే" దం దురు. దేవుఁడు నిశ్చయముగా వారియవిశ్వాసమునకై వారిని శపించి యున్నాఁడు ! విశ్వాసులు చాలకొలఁదిమందియే.

వారు విశ్వసింపనివారిపై జయము కలుగవలె నని పూర్వము కోరియుండిరి. వారికిఁ బూర్వము వచ్చినవార్తను రూఢిపఱుచుచు నీ 'కురా' నను గ్రంథ మిప్పుడు రాఁగా వారు తెలిసియు దానిని గ్రహింపరైరి. విశ్వాసహీనులు దైవశాపోపహతు లగుదురుగాక ?

90. తనకింకరులలో నిష్టమువచ్చినవారికి దేవుఁడు వరములనిచ్చుట సహింపలేక, దేవుఁ డంపినవార్తను నమ్మక, వారు తుచ్ఛలాభమునకై యమ్ముడుపోయినారు. ఇట్లు వారు దేవునిక్రోధపరంపరలను దమపైఁ దెచ్చికొనినారు. విశ్వాసహీనుల కతిలజ్జాకరమగుశిక్ష కాఁగలదు.

"దేవుఁడు పంపినదానిని విశ్వసింపుఁ" డని వారితోఁ జెప్పఁగా వారు "స్వయముగా మాకు వచ్చినదానినే మేము నమ్మెద" మని పల్కియుఁ దమనోటినుండి వచ్చినదే యాపంపఁబడినదానిని స్థిరపఱచున దైనను నమ్మరు. "అట్లయినఁ బూర్వము మీరు విశ్వ సించినవా రయ్యు దేవునిప్రవక్తల నేల చంపితిరి" అని యడుగుము.

ఇదిగాక మూసా తాను జేయవలసినదానికిఁ బ్రమాణములఁ దీసికొని వచ్చెను. కాని, యతఁడు లేకుండుటఁజూచి, మీరు గోవత్స మును దేవుఁడని నమ్మి దుష్టులై వర్తించితిరి.

పిదప మేము మీయొడంబడిక నంగీకరించి, మీపైఁ బర్వతము నెత్తి, "మేము మీకిచ్చినదానిని గట్టిగ నవలంబించి చెవియొగ్గివినుఁ"

డంటిమి. మీారు, "మేము వినియుఁ దిరుగుబాటు చేసినా" మంటిరి. వారికృతఘ్నతకు మాఱుగా వారు తమగోవత్సము నెడఁగల ప్రేమ నాస్వాదింపవలసి వచ్చెను. "మీారు విశ్వాసుల రైనచో, మీావిశ్వాస మూలముననే యొకదుష్టకృత్యము నొనర్చితి" రని పలుకుము.

"ఇఁకముందు దేవునితోడివాసము ముఖ్యముగ మీాకే కలుగునా? ఇతరులకు చేకూరదా? మీారే విశ్వాసులరా? అయిన మృత్యువును గోరికొనుఁడు. చూతము," అనుము.

కాని, వారు తమకు ముందుగనే తమకర్మలను బంపికొని యుండిరి. అందుచేతనే వారి కట్టికోరిక పొడమకుండెను. దుష్టులెవ్వరో దేవుని కెఱుకయే కదా!

బహుదైవారాధకులకంటె వారికిఁ దమప్రాణములపై నాశ హెచ్చు! వారిలో నొక్కొక్కఁడు వేయిసంవత్సరములు జీవింపఁ గోరుచుండును. ఎన్నఁడును జావక బొందెతోనే వా రుండఁజాలినను శిక్షమాత్రము వారికిఁ దప్పదు. దేవుఁడు వారుచేయుదానిని జూచుచునే యున్నాఁడు.

అధ్యాయము—12.

కురాను పూర్వముచెప్పబడినరహస్యములను రూఢి పఱుచును. అది రక్షణమార్గమును జూపునది. విశ్వాసయుక్తుల కది సువార్త. అట్టికురానును నీహృదయమున నెలకొల్పిన,

జిబ్రీలునకుఁ గాని, దేవుఁడు, నాతని దేవతలు, మీాకాలు, వీరిలో నెవరికి శత్రువైనను, దేవునికి శత్రువే యగును. దేవుఁడు విశ్వాసహీనులకు శత్రువై యున్నాఁడు.

ఇది గాక స్పష్టసూచనలను నీ కొసగి యున్నాము. విశ్వాసులు తప్ప నితరులు దానిని విశ్వసింపరు.

100. వారు నీతో నెప్పుడు నేదోయొకయొడంబడికఁ జేసికొనుచునే యుందురు; కాని కొందఱు దాని నతిక్రమించుచుందురు. చాలమంది విశ్వసింపనే విశ్వసింపరు.

పూర్వము వారికిఁ దెలియఁజేసినరహస్యములను స్థిరపఱుచుటకు దేవునియొద్దనుండి వారికడ కొకప్రవక్త వచ్చినప్పుడు, ఆవేదమును గ్రహించినవారిలోఁ గొందఱు దైవగ్రంథమును వెనుదోసి యది తమకుఁ దెలియనట్లు నటించిరి.

సులైమాను విశ్వాసియే కాని యాతనిప్రజలు సైతానులను విశ్వసించుచుండిరి. సైతానులమార్గముననే వా రవలంబించిరి. చిల్లంగియును, హారుత్, మరుత్ అను నిద్దఱుదేవతలకు బాబిలునొద్ద లభించినవిద్యయును, వారికి సైతాను లభ్యసింపజేసిరి. కాని, యీయిద్దఱును వారితోఁ దొలుత, "మేము మీకుఁ ద్రోవఁ దప్పించువారమే. అందుచేత విశ్వాసహీనులరు కాకుండుఁ" డని చెప్పి యట్టిదానినిఁ గఱుపఁజొచ్చిరి. ఈయిరువురివలననే వారు భార్య యనియు భర్త యనియు విభాగముఁ జేయ నేర్చికొనిరి. కాని దైవాజ్ఞ లేనిదే వా రెవ్వరిని బాధపెట్టలేదు. తమకు హానికరమైనదానినే కాని లాభకరమైనదానిని వా రభ్యసింపలేదు. కాని యీవిద్యను తెచ్చినవాఁడు మున్ముందు దించుకయు నుపయోగపడఁడని వారికిఁ దెలియును. వారికే తెలిసియుండినచో వారు తుచ్ఛలాభమునకై యమ్ముడుపోయియుండిరని తెలిసికొనకపోరు.

వారికి దేవునియందు భక్తివిశ్వాసము లున్నచో వారిని దేవుఁడు మిక్కిలిగా బహూకరించి యుండును. కాని వారి కది తెలియదు.

## అధ్యాయము 13.

విశ్వాసులారా! మాప్రవక్తతో "రాఇనా" మమ్ముల

వినుఁడు అనకుఁడు. "అంజుర్నా" (కొంతగడువు ననుగ్రహింపుఁడు) అనుఁడు విశ్వాసహీనులు ఘోరశిక్ష ననుభవింపఁగలరనిగుర్తింపుఁడు.

కురాను ననుసరించువారిలోను, విగ్రహారాధకులయందును నవిశ్వాసకులు నీప్రభువునుండి యెట్టిమేలును గోరకున్నారు. కాని, దేవుఁడు తనయిచ్చవచ్చినవారినిఁ గరుణఁజూచును. అతఁడు దయా సింధుఁడు!

మే మేవాక్యములనైన రద్దుచేసినను, మఱువఁ జేసినను, వానికి సమానములను నంతకుమంచివానిని వానికిమాఱుగా నిచ్చుచున్నాము. దేవుఁడు సర్వశక్తుఁ డనుమాట నీకుఁ దెలియదా?

స్వర్గమర్త్యాధిపత్యము దేవునిదే యనియు, దేవుఁడు దప్ప సహాయకుఁడును బోషకుఁడును నితరుఁడు లేఁడనియు నీకుఁ దెలియదా?

పూర్వకాలమువారు మూసా నడిగినదానినే మీరు మీప్రవక్త నడుగుచున్నారా? కాని, భక్తిని వీడి యవిశ్వాసి యగువాఁ డప్పుడే ఋజుమార్గమునుండి తప్పిపోయి యున్నాఁడు.

గ్రంథావలంబకులలోఁ గొందఱికి సత్యము స్పష్టముగాఁ దెలియఁ జేయఁబడినను విశ్వాసులగు మీపై నసూయచే వారు మిమ్ము తిరిగి నమ్మకుండునట్లు చేయఁబ్రయత్నింతురు. కాని, వారిని క్షమించి, దేవుఁడు తనపనిని జేయునంతవఱకును, వారిసాంగత్యమున నుండకుము. నిజముగా దేవుఁడు సర్వవస్తువులపైనను నధికారము కలిగి యున్నాఁడు!

110 ప్రార్థనను మానక, చెల్లింపవలసినపన్నులను జెల్లింపుము. నీయాత్మకొఱకు ముందుగా నీవు పంపించుకొనునది దేవునియొద్ద నీకొఱకు వేచియుండును. నీవు చేయుదానిని దేవుఁడు తప్పక చూచుచునే యున్నాఁడు.

"యహూదీలును నస్రానీలును దప్ప నితరులు స్వర్గముఁ బొందనేర" రని వా రందురు. ఇది వారికోరిక. "మీరు పల్కునది సత్యమైనచో సాక్ష్యముఁ దీసికొనిరం" డని వారినడుగుము

కాని, సర్వమును బరిత్యజించి, దీనముగా దేవునిపై దృష్టి నిలిపి, ఋజుమార్గవర్తు లగువారికి దేవుఁడు మేలు చేయఁగలఁడు. వారి కేభయముగాని, యేదుఃఖముగాని కలుఁగఁబోదు.

అధ్యాయము 14.

ఇదిగాక యహూదీలు నస్రానీల కెట్టియాధారమును లేద నియు, నస్రానీలు యహూదీల కెట్టియాధారమును లేదనియుఁ బల్కుచుందురు. ఇద్దఱును కురాను చదువువారే. ఇట్లే యజ్ఞానవంతులును బల్కుచుందురు కాని, రక్షణదినమందు దేవుఁడు వారిభేద కారణమును నిర్ణయింపఁగలఁడు.

దేవునియాలయములం దాతనినామమును స్మరింపకుండఁజేసి, యాయాలయములను నాశనముచేయువానికంటె నధికపాపి యెవ్వఁ డుండును? అట్టివా రాయాలయములలోనికి భయములేకుండఁ బోఁ జాలరు. వారి కిహమందు సిగ్గుబాటును, బరమందు ఘోరబాధ యుఁ గలుగఁగలవు.

తూర్పుపడమరలు రెండును దేవునివే, కావున నీ వెటుతిరి గినను నాతనిముఖము గనఁబడును. ఆతఁ డనంతుఁడు, సర్వజ్ఞుఁడు.

దేవుని కొకకుమారుఁ డున్నాఁడని వా రందురు. అది యస త్యము! అతనినామము కీర్తనీయమగుఁగాక! స్వర్గములందును భూమి యందును గలదంతయు నాతనిదే.

స్వర్గములకును, భూమికిని నేకసృష్టికర్త యగునాతని కంత యును విధేయత వహించియుండును. అతని కేదేని నొకపని కావ లెనన్న 'ఇట్లగుము' అనునంతనే యది యగుచుండును.

జ్ఞానశూన్యు లగువారు 'దేవుఁడు మాతో మాటాడినఁగాని, నీవు మాకొకసూచన నిచ్చినఁగాని, మేము నమ్మఁజాల'మందురు వీరిపూర్వులు నిట్టిమాటలనే యనుచుండిరి. వీరిహృదయములును వారిహృదయములును నొక్కరీతివే. దృఢవిశ్వాసము గలవారెల్ల రకును స్పష్టమగుసూచనలం జూపియున్నాము.

నీకు సత్యవాక్యము నిచ్చి పంపియున్నాము. నీవు సువార్తను దీసికొని భయసూచన నొసఁగఁగలవు. నరకవాసులఁగూర్చి నిన్నెవ్వరును బ్రశ్నింపరు.

120. వారిమతమును నీవవలంబించినఁగాని యహూదీలును, నస్రానీలును నీతో సఖ్యపడరు. వారితో, 'నిజముగా దేవుని రక్షణయే రక్షణ' యని యనుము. నీకు సమకూరినజ్ఞానము ననంతర మింకను వారికోరికలనే యనుసరించితివేని దేవునినుండి సహాయకుఁడు గాని రక్షకుఁడుగాని నీకుఁ జిక్కఁబోఁడు.

మావలనఁ బుస్తకము ననుగ్రహింపఁబడినవారును, దానిని జదువవలసినరీతిగాఁ జదువువారును, వీరే దానిని నమ్మెదరు. దానిని నమ్మనివారు ఘోరనరకమునఁ బడుదురు.

## అధ్యాయము 15.

ఇస్రాయేలుసంతతివారలారా! మేము మీ కనుగ్రహించిన వరమును మఱువకుఁడు. మేము మిమ్ము మానవులలో శ్రేష్ఠులనుగా నొనరించితి మని జ్ఞప్తియం దుంచుకొనుఁడు.

ఆదినమున నొకయాత్మ మఱియొక యాత్మకు బాధ్యతవహించి యుండదు. దానిరక్షణకై ధనము స్వీకరింపఁబడదు. ఎవరిమాధ్యస్థ్యము నంగీకరింపఁబడదు. వారికెట్టిసహాయమును దొరకదు. ఆదినమును దలంచి భయపడుఁడు!

ఇబ్రాహీమునందు తన యాజ్ఞలను నిర్వర్తించి పరిపూర్ణతనందించి, "నిన్ను జనులపై 'ఇమాము' గాఁ జేయుచున్నా" మనునప్పు డాతఁడు, "నాసంతతివారికిఁగూడ నాయధికారమి" మ్మనెను. దేవుఁడు, "దుష్టవర్తనులతోఁగూడ న న్నొడంబడమందువా ?" అనెను.

'కాబా' యనుపవిత్రగేహమును మనుష్యులకు రక్షణస్థాన ముగా నొనర్చి, "ఇబ్రాహీ మున్నగృహమును ప్రార్థనస్థలముగాఁ జేసికొనుఁ" డని మే మన్నమాటను జ్ఞప్తియం దుంచుకొనుఁడు. "ఆగృహముచుట్టును ప్రదక్షిణము చేయువారికొఱకును, భక్తిపరులై యందు వాసముచేయువారికిని, అచట సాష్టాంగనమస్కారములు చేయు వారికొఱకును నాగృహమును శుద్ధిచేయుఁ" డని ఇబ్రాహీము, ఇస్మాయీలుల కాజ్ఞయిడితిమి.

అప్పు డిబ్రాహీము "ప్రభువా ! ఈదేశము సురక్షిత మగునట్లును, దేవునియందును, ప్రళయదినమందును నమ్మినవారికి ఫలము లబ్బునట్లును జేయు" మని వేఁడికొనెను. దేవుఁడు "నమ్మని వారికిఁగూడఁ గొంతకాలమువఱకును మంచివస్తువులఁ బ్రసాదించి పిదప నరకాగ్నియందుఁ గూలనేసెద" ననెను. ఇది ఘోరవిపత్తు కాదా ?

అప్పు డిబ్రాహీమును, ఇస్రాయీలులును కలిసి యాగృహములకుఁ బునాదు లెత్తి "ప్రభువా, మేమిచ్చుదీనిని బరిగ్రహింపుము. నీవే శ్రోతవు ! సర్వజ్ఞుఁడవు !

ప్రభువా! మమ్మును మాసంతతివారినిఁ గూడ ముస్లిములఁ (భక్తుల) గా నొనర్పుము. మామతవిధులను మాకు బోధపఱిచి మా కభిముఖుఁడవై యుండుము. నీవు దయాళుఁడవు ! ప్రసన్న మూర్తివి !

ప్రభువా, నీసూచనలను వారికిఁ జూపఁగలయొకప్రవక్తను వారియందే లేవఁదీసి, కురానును, బుద్ధిని వారికిఁ బ్రసాదింపుము. వారినిఁ బవిత్రులఁ జేయుము. నీవు సర్వశక్తుఁడవు! బుద్ధుఁడవు!" అనిరి.

## అధ్యాయము 16

130. ఇబ్రాహీం మీలోకములో మా కిష్టుఁడగునట్లును బరలోకమున న్యాయవంతులలో నొకఁ డగునట్లుగను మే మొనర్చితిమి. తనయాత్మను మూఢముగ నొనర్చి, నీచమగునట్లు చేయువాఁడు తప్ప నితరుఁ డెవ్వఁడు నిబ్రాహీముమతము నధిక్షేపింపఁడు.

ప్రభువు తనతో, "సర్వమును నా కర్పింపుము" అనునప్పు డాతఁడు, "బ్రహ్మాండాధినాథుఁ డగుదేవునికి సర్వము నర్పించుచున్నా" ననెను.

"పుత్త్రులారా! దేవుఁడు మీ కొకమతమును గల్పించి యున్నాఁడు. అందుచేత 'ముస్లిములు' (భక్తులు) కాకుండ మృతి నొందకుఁడు" అనునుపదేశమే ఇబ్రాహీము, యాకూబులు తమ సంతతివారి కొసగిన ధనము.

యాకూబు ప్రాణముల విడువనున్నప్పుడు మీ రాతనికడ నుండిరా? ఆతఁడు, "నేను చనిపోయినపిదప మీ రెవ్వరినారాధింతు" రని తనపుత్త్రులఁ బ్రశ్నింపఁగా, వారు "నీకును, నీపూర్వు లగు ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్హాకులకును బ్రభువగునేకేశ్వరునే పూజింతుము. ఆతనియెడలనే మేము ముస్లిములమై యుండెద" మనిరి.

ఆసంతతివా రిప్పు డంతరించి పోయినారు. వారికర్మఫలములను వారును, మీ కర్మఫలములను మీరును ననుభవింపఁగలరు. కాని వారు చేసినకర్మములకు మీరు బాధ్యులు కానేరరు.

అదిగాక వారు, "నిజమగురక్షణోపాయము మీకుఁ గావలసినచో, యహూదీలరో, నస్రానీలరో కండు" అందురు. నీవు వారితో "అట్లుగాదు. నిశ్చలభక్తియుక్తుఁడగు నిబ్రాహీముమతమునవలంబింపుఁడు. సత్యమగు దైవముతో నితరదైవములను సాటితెచ్చి వారి దారిఁ బట్టకుఁడు.' అని చాటుము.

మీరు "దేవునియందును, మాకు బంపఁబడినదానియందును, ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్హాకు, యాకూబులకును నాయా తెగలవారికిని దెలుపఁబడినదానియందును, మూసా, ఈసాల కీయఁబడినదానియందును, ప్రభువువలన నాయాప్రవక్తలకు దెలిసినదానియందును, మాకు దృఢవిశ్వాసము కలదు. వారిలో నొకరి కొకరికి భేదములఁ గల్పింపఁబోము. దేవునికే సర్వమును సమర్పించి ముస్లిముల (భక్తుల) మగుచున్నా" మనుఁడు

కావున నీవు విశ్వసించినట్లు వారును విశ్వసించినచో వారికి సమైనరక్షణోపాయము కలుగఁగలదు. కాని, వారు వెనుదిరిగినచో నీకు దూరమైపోయెదరు. దేవుఁడు సర్వమును వినుచున్నాఁడు. తెలిసికొనుచున్నాఁడు. వారినుండి యాతఁడే నిన్ను రక్షింపఁగలఁడు.

'ఇస్లా' మనునది దేవుఁడు చేయించుజ్ఞానస్నానము. దేవుఁడు తప్ప నితరుఁ డెవఁ డట్టిస్నానముఁ జేయింపఁగలఁడు? "ఆతనినే మేము కొలిచెదము.

"దేవుఁడు మీకును మాకునుగూడ ప్రభువే! ఆతనిఁగూర్చి మాతో వాదింతురా? మీకర్మలను మీరు చేయుదురు. మాకర్మలను మేము చేయుదము. మనము నిజముగా నాతనివారలమే!" అని చెప్పుము.

140 "సత్యముగా, ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్హాకు, యాకూబులను నాయా తెగలవారిని, యహూదీలును, నస్రానీలు"నని

మీరందురా? దీనినిఁగూర్చి బాగుగ నెవరికిఁదెలియును? దేవునికా, మీకా? తనకున్నసాక్ష్యమును దేవునినుండి మఱుగుపఱచువానికంటె తప్పుచేయువాఁడు మఱెవ్వఁడు? కాని, దేవుఁడు నీవుచేయుదానిని గుర్తించుచునే యున్నాఁడు.

ఆజను లిప్పు డంతరించిపోయినారు. వారికర్మఫలమును వారును, మీకర్మఫలమును మీరును ననుభవింపఁగలరు. కాని వారి కర్మలకు మీరు బాధ్యులు గానేరరు.

---

# కాండము. 2

---

## అధ్యాయము 17.

“తాము వాడుకచేయుచుండిన ‘కిబ్లా’ నుండి వారేల మఱలిరి?” అని మూర్ఖు లడుగుదురు. “ప్రాక్పశ్చిమములు రెండును దేవునివే. తనయిష్టమువచ్చినవారిని సరియగుమార్గమున నాతఁడు ప్రవర్తింపఁజేయును.” అని నీవు చెప్పుము.

ఈరీతిగా మేము మిమ్ము మధ్యస్థులఁ జేసి, మీరు మనుష్యజాతికి సాక్షులుగా నుండునట్లును, మిమ్ముఁగూర్చి ప్రవక్త సాక్షిగా నుండునట్లును జేసితిమి. ప్రవక్తననుసరించువానినుండి యాతనికి వెను దిరిగినవానిని బోల్చికొనుటకు, పూర్వము మీరు వాడుచుండిన “కిబ్లా” నేర్పఱిచితిమి. ఈమార్పువలనఁ గొంతకష్టమే కాని దేవునిరక్షణఁ బడసినవారి కదియొకశ్రమలోనిది కానేరదు. దేవుఁడు

మీభక్తికిఁ దగినఫల మీయకపోఁడు. ఆతఁడు మనుష్యునియెడల దయాపరుఁడు, నుదారవంతుఁడు నై యున్నాఁడు.

మీరు స్వర్గమున కన్నిదిశలకు నభిముఖులరై యుండుట మేము చూచితిమి. కాని, మీకు సంతోషదాయక మగు "కెబ్లా" వైపు మీ రభిముఖు లగునట్లు చేసెదము. కావున పవిత్రవంతమగు మసీదువైపు మీముఖములఁ ద్రిప్పుఁడు. మీ రెచట నుండినను దానికే యభిముఖులరు కండు. కురాను ప్రసాదింపఁబడినవారు ఇది దేవుఁడు నియమించినసత్య మని గ్రహింపఁగలరు. దేవుఁడు మీరు చేయుపనుల నన్నిటిని జూచుచునే యున్నాఁడు.

వేదగ్రంథములను స్వీకరించినవా రెట్టిసూచనలను గనఁబఱిచి నను 'కెబ్లాను' మాత్రము వారు స్వీకరింపరు. వారి 'కెబ్లాను' మీరు స్వీకరింపఁగూడదు. వారిలోనే కొందఱ తెగలు వాడుక చేయు 'కెబ్లాను' గూడ గ్రహింపరు. మీకుఁ బ్రసాదింపఁబడిన జ్ఞానమును జేకొనియు వారికోరికల ననుసరించితిరేని మీరు నిశ్చయముగా నధర్మవర్తనులలోఁ జేరినవా రగుదురు.

వేదగ్రంథములను స్వీకరించినవారు, తమపిల్లలను గుర్తించు నట్లే ప్రవక్తను గూడ దెలిసిగొనఁగలరు. కాని వారిలోఁ గొందఱకు సత్యము తెలిసినను దానిని మఱుఁగుపఱుతురు.

సత్యము నీప్రభు వనుగ్రహించినదే. కావున నీవు శంకాపరు లలోఁ జేరకుము.

## అధ్యాయము 18.

అందఱును స్వర్గముల కొకదిక్కుగాఁ దిరుగుచుందురు. కాని నీ వెక్కడ నున్నను సన్మార్గవర్తనులపథ మవలంబింపుము. దేవుఁ డొకానొకదినమున మిమ్ముల నందఱ నొకచోఁ జేర్చును నిశ్చయముగా దేవుఁడు సర్వశక్తుఁడు!

నీ వేస్థలమునుండి వచ్చినను పవిత్రవంతమగుమసీదునకు మొగ మగుము. నీప్రభువునుండి వచ్చినసత్య మిదియే. దేవుఁడు మీరు చేయు కార్యములఁ జూడక యుండ లేదు.

150. మీ రేస్థలమునుండి వచ్చినను బవిత్ర మగు మసీదువంక మొగముఁద్రిప్పుఁడు. జనులుమీతో వాదింపకుండునట్లు మీ రెచ్చట నున్నను మసీదునకే యభిముఖులరు కండు. వారిలో భక్తిహీను లకు భయపడకుఁడు. నేను మీ కమేయవరములఁ బ్రసాదించుటకును మీకు సరియగురక్షణమార్గము లభియించుటకును నాయెడ భయము గలిగి యుండుఁడు.

మాసూచనలను మీకు చూపెట్టుటకును మిమ్ముఁ బవిత్రులఁ జేయుటకును, వేదగ్రంథమును మీకు బోధపఱచుటకును, మీకింతకు ముందు తెలియనిదానిని తెలుపుటకును, మీలో నొకనిని ప్రవక్తగాఁ బంపియున్నాము.

కావున నన్ను జ్ఞాపకముంచుకొనుఁడు. నేను మిమ్ము జ్ఞాపక ముంచుకొందును. నాకు వందనముల నర్పింపుఁడు. కృతఘ్నులరు కాకుండుఁడు.

## అధ్యాయము 19.

భక్తియుక్తులారా! దేవుఁ డోర్పుగలవారితో నుండునుగనుక, ఓర్పు గలిగి ప్రార్థనలు చేయుచు సహాయము నపేక్షింపుఁడు.

దేవునికార్యమున హతులయినవారు మృతులైరని తలఁపకుఁడు. వారు సజీవు లయియే యున్నారు. కాని, మీరుదానిని బోధపఱచు కొనలేకున్నారు.

భయమును నాఁకలిని గలిగించి ధనప్రాణఫలనష్టమును జేసి మిమ్ము నిశ్చయముగా శోధింతును.

ఓర్పుగలవారి కేదేని యాపద ఘటిల్లినప్పుడు, "నిజముగా మేము దేవునివారము. ఆతనియొద్దకే చేరెద" మందురు. అట్టియోర్పు గలవారికి సువార్తను దీసికొని పొండు.

వారికి ప్రభువునాశీర్వాదములును దయయుఁ జేకూరును. వారే సత్యమగురక్షణ నొందినవారు.

నిజముగా సఫా, మార్వా, యను పర్వతములు రెండును దేవుని గృహములే. దేవాలయమునకు యాత్రఁ జేయువారును, దానిని దర్శించువారును, నారెండు పర్వతములచుట్టును బ్రదక్షిణముచేసి నచో నిందకుఁ బాత్రులు కానేరరు. సహజముగా సన్మార్గగామి యగువాఁ డట్టిపనిని జేసినచో దేవుఁడు దానిని దెలిసికొని తగిన ఫలము నీయఁగలఁడు.

స్పష్టమగుసాక్ష్యముగాఁ గాని రక్షణగాఁగాని, మేము గ్రంథము మూలమునఁ దెలియఁజేసినదానిని గ్రహించియు, దానియం దించుక యేని దాచినవారిని దేవుఁడు శపించును. శాపమునీయ సమర్థులును వారిని శపింపఁగలరు.

160. కాని, నావంక తిరిగి సత్యమును వెల్లడించువారివైపు నేనును దిరిగెదను. దయాలవాలుఁడను, మంచివారివైపు తిరుగువాఁడను నేనే!

నిజముగా భక్తిహీనులై యుండి, భక్తిహీనులుగఁ జచ్చి పోవువారే దేవునికిని దేవతలకును సర్వమనుష్యులకును ద్వేషు లగు చున్నారు."

అట్టిద్వేషమును వారు శాశ్వతముగ ననుభవింపఁ గలరు. వారిబాధ యించుకయైన తగ్గింపఁబడదు. దేవుఁడు వారివంకఁ జూడనైనఁ జూడఁడు.

మీదేవుఁడొక్కఁడే. దయాదాక్షిణ్యమూర్తియగు నాతఁడు తప్ప నితరదైవ మెవ్వఁడును లేఁడు.

## అధ్యాయము 20.

బోధపఱుచుకొనువారికి నిశ్చయముగా భూస్వర్గముల సృష్టి యందును రాత్రింబవళ్ళవరుసయందును మనుష్యునియుపయోగార్థము వస్తువులను మోచికొని సముద్రముపై నేగు నావలయందును, భూమి నిర్జీవమై యుండఁగా దానిని సజీవం జేసి దానిపై నన్నివిధములగు జంతువులను వ్యాపింపఁజేయుటకు స్వర్గమునుండి దేవుఁడు పంపించు వర్షమునందును, మారుతములమార్పునందును, భూమికిని స్వర్గమునకును మధ్య నుపచారముల సలుపు మేఘములందును సూచనలు కనఁబడుచునే యుండును.

అయినను గొందఱు దేవుని వెంబడి కొన్నివిగ్రహములను మోసికొని పోవుచు నాతనిఁ బ్రేమించునట్లే యావిగ్రహములను బ్రేమింతురు. కాని విశ్వాసయుతులగువారియందు దేవునిపైఁ బ్రేమ దృఢముగానుండును. భక్తిహీనులు బాధల ననుభవించు సమయమునఁ గదా దేవుఁడు సర్వశక్తుఁ డనియు, నాతనిశిక్ష యతి ఘోర మనియుఁ దెలిసికొందురు.

శిక్షనొందినతరువాతఁ దా మనుసరించినవారు తమ్మువిడిచివేసి నప్పుడు,

"మేము తిరిగి లేచుటయే నిజమైనయెడల మమ్మువా రెట్లు విడిచి దూరముగ నుండిరో, యట్లే మేమును వారికి దూరముగ నుండి పోయి, వారిని మఱి యనుసరింపఁబోము" అనియందురు. ఈరీతిగనే దేవుఁడు వారికర్మల వారికి హృద్గోచరములుగఁ జేయుచుండును వారు నిట్టూర్పులు విడుచుచుందురే కాని, యగ్నినుండి పైకి తప్పించుకొనలేరు.

## అధ్యాయము 21.

జనులారా! భూమిపై ధర్మవిహితమైనదియు, నుంచిదియు

నగుదానినే యాస్వాదింపుఁడు. మీకు గర్భశత్రు వగు సైతాను ననుసరింపకుఁడు.

అతఁడు మీచే దుష్టకార్యములఁ జేయించి, దేవునిఁగూర్చి మీకుఁ దెలియనిదాని నుచ్చరింపఁ జేయును.

170. వారితో "దేవుఁడు మీ రనుసరింప విధించినదానినే చేకొనుఁడు" అనునప్పుడు వారు "అట్లు కాదు. మాతాతముత్తాత లనుసరించినదానినే మేమనుసరించెద" మందురు. వారితాతముత్తాత లజ్ఞానపరులు, రక్షణమార్గహీనులు నైనను, వా రట్లనుట తప్పగదా ?

విశ్వాసహీనులకు చెప్పుట చెవిటివానిముందు శంఖము నూదుటవంటిది. "వారికి వినఁబడదు, కనఁబడదు, మాట లేదు. కావుననే వారికి జ్ఞానమనునది సున్న.

భక్తులారా! మేము మీకుఁ బ్రసాదించిన మంచివస్తువులను భుజింపుఁడు. మీరు దేవుని యారాధకులే యైనచో నాతనికి మీ నతుల నర్పింపుఁడు.

కాని, సహజముగ మృతినొందినదానిని, రక్తమును పంది మాంసమును, దేవునిపేరఁ గాక, మఱి యేదేవతఁగూర్చి యైనను బలియిచ్చినదానిని, మీరు సేవింపఁగూడదు. ఇచ్ఛాపూర్వకముగను బ్రీతితోడను గాక బలవంతముగ నట్టియాహారమును భుజింపఁజేయఁ బడినచో నేపాపమును గలుగఁబోదు. దేవుఁడు దయామయాపరుఁడు.

దేవుఁ డనుగ్రహించినపవిత్రవేదగ్రంథములను దాఁచిపెట్టి వానిని తుచ్ఛధనమున కమ్మివేయువారు తమయుదరములలోని కగ్నిం దప్ప వేఱొండు మ్రింగఁబోరు. రక్షణదినమందు దేవుఁడు వారితో మాట్లాడఁబోఁడు. వారిమాలిన్యములను దొలఁగింపఁబోఁడు. వారికి ఘోరబాధ కలుగనున్నది.

వీరే రక్షణను వదలి సత్యమును ననుగ్రహమును బోవిడిచి

బాధను చేకొనినవారు. కాని, ఏ రగ్ని బాధ నెంతవఱకు భరింపగలరో చూడవలసియున్నది !

దేవుఁడు పంపినసత్యగ్రంథముప్రకారము వారికిఁ గలుగుశిక్ష యిదియే. ఆగ్రంథముఁగూర్చి సందేహించువారు దానినుండి చాలదూరముగఁ దొలఁగినవా రగుచున్నారు.

## అధ్యాయము 22.

మీముఖములను తూర్పునకుఁగాని పడమరకుఁగాని త్రిప్పుట వలన మీరు భక్తిపరులు కాఁబోరు. దేవునియందును ప్రళయదినమునందును, దేవతలయందును, వేదగ్రంథములయందును, ప్రవక్తలయందును నమ్మకము గలవారును, దేవునిపైఁ బ్రేమచేఁ దమ ధనమును బంధువులకును, అనాథశిశువులకును, దరిద్రులకును, పాంథులకును, యాచకులకును, శత్రువశమున నున్నవారిని విడిపించుటకును వినియోగించినవారును, నెపుడును బ్రార్థనను మఱువక ధర్మభిక్ష నిచ్చుచు నొకకార్యమునందు తలఁ దూర్చి యది పొంత మగువఱకును దానిని వదలక రోగములందును, గష్టములందును, జిక్కులయందును, నోర్పు గలిగియుండువారును, వీరే సత్యమగు భక్తులు. ఇట్టివారే ధర్మపరులు. ఇట్టివారే దైవభీతి గలవారు.

భక్తులారా ! మీరక్తమును జూచినవారి రక్తమును మీరును జూడవచ్చును. స్వేచ్ఛాపరులు స్వేచ్ఛాపరులపైనను, బానిసలు బానిసలపైనను, స్త్రీ స్త్రీపైనను, బగఁ దీర్చికొనవచ్చును. కాని తన సోదరుఁడు తగినధనము నిచ్చినచో సంధి చేసికొనవచ్చును. వానికి నపరాధమునకుఁ దృప్తిగా సొమ్ము నీయవలయును. ఇది నీకు నీప్రభు వనుగ్రహించినది. ఇటుతరువాత దీని నతిక్రమించువారికి ఘోరదండన కలుగఁగలదు.

జ్ఞానులారా! మీరు దైవభీతి గలిగి యుండుటకును మీ ప్రాణరక్షణకొఱకును, నీధర్మము విధింపఁబడినది.

180. మీలో నెవ్వరికైనను మృత్యు వాసన్నమైనప్పుడు తనయాస్తినిఁ దనతల్లిదండ్రులకును బంధువులకును న్యాయముగాఁ బంచిపెట్ట వలసిన దని మీకు విధింపఁబడినది. దైవభీతిపరుల కిది తప్పనిసరియై యున్నది. కాని యీపంపకమునుగూర్చి వినినతరువాత దాని నెవ్వఁడేని మార్చినయెడల నాత ప్పామార్చినవానియం దుండును. దేవుఁడు సర్వమును వినుచున్నాఁడు. అంతయును దెలిసికొనుచునే యున్నాఁడు.

కాని, యట్టివ్రాతయందు తప్పుగాని యధర్మముగాని యున్నయెడల నాయీవారసుల కాయీ యాస్తిని సరిగాఁ బంచువాని కెట్టి దోషమును గలుగఁబోదు. సత్యముగా దేవుఁడు దయాదాక్షిణ్యమూర్తి.

## అధ్యాయము. 23.

భక్తులారా, మీరు దైవభీతిపరులై యుండుటకు మీపూర్వులకువలెనే మీకును గొన్ని దినములవఱకు నుపవాసము విధింపఁబడియున్నది.

కాని, రోగులకును, ప్రయాణికులకును, నాదినములందే యుపవసింపవలయు ననునిర్బంధము లేదు. అన్నియేదినములు మఱి యొకప్పు డుపవసించినఁ జాలును. కాని, యుపవాసము చేయ సామర్థ్యము గలిగియు నట్లు చేయనివారు ప్రాయశ్చిత్తముగ నొక బీదవానిని బోషింపవలయును. తనంతటఁ దానే సత్కర్మ నాచరించిన వానికి మేలు కలుగును. తెలిసి యుపవసించుటయే మంచిపని.

మనుష్యునికి రక్షణగను, ఆరక్షణకును జ్ఞానజ్యోతికిని వ్యాఖ్యానముగను, కురానును 'రమధాను' నెలలోఁ బంపితిని.

ఆ నెలయందు చంద్రుఁడు కనఁబడినవెంటనే యుపవాసము నారంభింపుఁడు. కాని, రోగపీడితుల రైనను, బ్రయాణమునం దున్నను, నాదినములలోనే యుపవాసము చేయవలయునను నిర్బంధము లేదు. మఱియొకప్పు డన్నిదినములే యుపవసించినఁ జాలును. దేవుఁడు నీకిబ్బంది కలుగఁజేయుటను గాక నీసౌఖ్యమునే కోరుచున్నాఁడు. ఉపవాసదినములు గడపి, దేవుని రక్షణకొఱ కాతని స్తుతించి కృతజ్ఞుఁడవై యుండవలసిన దనియే యాతనికోరిక.

నాకింకరులు నన్నుగూర్చి యడిగినప్పుడు నేను వారిదరినే యుండెదను. మొఱలిడువారిమొఱలను, నాకై పరితపించువారి యార్తనాదములను విని నే 'నో' యని పలికెదను. వారు సత్పథవర్తులగుటకు నామాట విని నాయందు విశ్వాసులై యుందురుగాక !

ఉపవాసమునాఁటిరాత్రి మీరు మీ భార్యల యొద్దకుఁ బోవచ్చును. వారు మీకును మీరు వారికిని వస్త్రములవంటివారు. ఈవిషయమున మీరు మోసపోదు రని తెలిసియే దేవుఁడు మీవైపు తిరిగి మిమ్ము క్షమించుచున్నాఁడు. కావున దేవుఁడు మీకు విధించిన దానికొఱకు వారియొద్దకు నిండుకోరికతో పొండు. తెల్లవారుసరికి తెల్లదార మేదో నల్లదార మేదో పోల్చుకొనువఱకును, మీరు తిని త్రాగవచ్చును. తరువాత పగలంతయు నియమముగ నుపవసించి రాత్రి యగునంతవఱకును మీభార్యలయొద్దకుఁ బోక మసీదులోఁ గాలముఁ గడుపవలయును. దేవుఁడు మీ కీహద్దులను నియమించినాఁడు. కావున వానిని మీఱకుండుఁడు. ఈరీతిగా జనులు దేవుని యెడ భీతులై యుండుటకుఁ దనసూచనల నాతఁడు స్పష్టపఱుచుచుండును.

కొఱగానివస్తువులకై మీధనమును పాడుచేసికొనకుఁడు. ఇతరులధనము నపహరించుటకై తెలిసి తెలిసి న్యాయకర్తలకు ధనమును లంచ మీయకుఁడు.

## అధ్యాయము 24.

అమావాస్యలనఁగా నేమని వారు నిన్నడుగుదురు. వారితో "అవి మనుష్యుఁడు దేవునిసేవయందును యాత్రలయందును వినియోగింపవలసినదినము" లని చెప్పుము. మీగృహములలోనికి పెరటిలోనుండి ప్రవేశించుట ధర్మము కాదు. దైవభీతి యేదో యదిగనే భక్తికావున ముందుద్వారముగుండ మీగృహములలోనికిఁ బొండు. మీకు సర్వశ్రేయ మగుటకు దేవునికి భయపడుఁడు.

190. మీపైఁ దిరుగఁబడువారితో దేవునిపక్షమునఁ బోరాడుఁడు. కాని, హద్దుమీఱి యుద్ధము చేయకుఁడు. దేవుని కట్టియధర్మ మిష్టము లేదు.

వారు మీ కెక్కడ కంటఁబడినను బరిమార్చుఁడు. వారు మి మ్మేయేచోట్లనుండి తఱిమివేసిరో యందుండి వారినిఁ దఱిమి వేయుఁడు. చంపుటకంటె బాధలఁబెట్టుట ఘోరమైనది. కాని, వారు మిమ్ము మొదటఁ దలపడినఁ దప్ప పవిత్రమగుమసీదునొద్ద వారిపైఁ బడకుఁడు. వారే మొదట మీపైఁబడినయెడల వారిని జంపివేయుఁడు. విశ్వాసహీనులకుఁ దగినఫల మిదియే.

వారు యుద్ధవిముఖులైనచో దేవుఁడును దయాదాక్షిణ్య పరుఁ డగును.

కావున సంక్షోకలహములు మానువఱకును, దేవునియారాధన తప్ప నితరారాధన లంతరించువఱకును యుద్ధము చేయుఁడు. వారు యుద్ధము నిలిపినయెడల దుష్టులపైఁ దప్పఁ దక్కినయన్ని చోట్లను శత్రుత్వమును గట్టిపెట్టుఁడు.

పవిత్రమగుమాసమును, బవిత్రమగు నావరణయు, ధర్మ యుద్ధమునకు నియమిత మైనవి. కావున మి మ్మెవఁడైన నెదిరించిన

యెడల నల్లే యాతని నెదిరింపఁడు. దేవునికి భయపడుఁడు. దేవుఁడు తనకు భయపడువారిపక్షమున నున్నాఁ డని తెలిసికొనుఁడు.

దైవకార్యమునకు వెనుదీయక ధనము నిండు. తెలిసి తెలిసి ధనమును సర్వమును గోల్పోకుఁడు. ఎప్పుడును మంచిపనులను జేయుచుండుఁడు. సత్కార్యానుష్ఠానపరులు దేవుని కిష్టులు.

దేవునిగౌరవార్థమై యాత్ర చేయుఁడు. పవిత్రస్థలముల దర్శింపఁబొండు. మీరు శత్రుమధ్యమున నుండినయెడల సులువుగ దేవాలయమునకుఁ జేరఁగలదానిని బంపుఁడు. మీ కానుక బలిస్థానమును జేరువఱకును క్షురకర్మ చేసికొనకుఁడు. రోగులును శిరోరోగము కలవారునైనయెడల నుపవాసము చేసికాని, భిక్షల నిచ్చికాని, కానుకల నంపికాని, మొక్కు తీర్పవలయును. శత్రుభయము తీరినవెంటనే యాత్రాస్థలమువఱకును నుండుపవిత్ర స్థలముల దర్శించువారు వారివారియథాశక్తిగాఁ గానుకలను బట్టుకొని పోవలయును. కానుకగా నిచ్చుటకు సామర్థ్యము లేని వారు యాత్రాస్థలమున మూడుదినములును, నింటికి వచ్చినవెనుక నేడు దినములును, మొత్తము పదిదినము లుపవాసము చేయవలయును. కుటుంబమును బవిత్రమగుమసీదునొద్దకు దీసికొనివెళ్ళనివారి కీయుప వాసము విధియైయున్నది. దేవునికి భయపడుఁడు. ఆతఁడు కఠిన దండనఁ జేయగలఁ డని జ్ఞప్తియం దుంచుకొనుఁడు.

## అధ్యాయము 25.

ఇంతకుముందు తెలిపినమాసములలోనే యాత్రల సలుపు చుండుఁడు. ఆనెలలలో యాత్రలు చేయువాఁడు స్త్రీసంపర్కమును వర్జించి, ధర్మము నతిక్రమింపక, యాత్రాసమయములందు వాదముల లోనికి దిగక యుండవలయును. మీరు చేయుసత్కార్యము లన్నియు

దేవుని తెలుసుకరయే. ప్రయాణమునకుఁగావలసినసామగ్రిని జాగ్రత్త పెట్టుకొనుఁడు. దైవభీతియే మీకుఁగావలసినముఖ్యసామగ్రి కావున నోబుద్ధిమంతులారా! నాకు భయపడుఁడు.

మీప్రభునుండి యైశ్వర్యమునుగోరుట మీకు తప్పుగాదు. అరఫాత్ నుండి మీరు త్వరగాఁ బోవుచున్నప్పుడు పవిత్రగృహము నొద్ద దేవునిస్మరింపుఁడు. ఇంతకుఁబూర్వము దుష్పథవర్తులతోఁ గలిసి యుండినమీకు సరియగుమార్గముఁ జూపించినదేవుని స్మరింపుఁడు.

జనులందఱును వడిగాఁ బోవుస్థలములందు మీరును వడిగఁ బ్రయాణముచేసి దయాక్షమాపరుఁ డగుదేవుని క్షమింప వేఁడుఁడు.

200. మీదైవకార్యములు సాంతములైనపిదప మీపితరుల నెట్లు జ్ఞాపకముంచుకొందురో యంతకెక్కుడుగ దేవుని జ్ఞప్తియుందుంచు కొనుఁడు. కొందఱు, "ప్రభూ! మా కీభువియందు నిర్ణీతమైనదానిని బ్రసాదింపు" మందురు. అట్టివారికి మున్ముందు రావలసినలాభము దొరకదు.

కొందఱు, "ప్రభూ, ఇహమునందును బరమునందును గూడ మాకు మేలునే ప్రసాదించి యగ్ని బాధనుండి తొలఁగింపు" మందురు.

అట్టివారు తమకు తగినయదృష్టమునే పొందఁగలరు. దేవుఁడు వారిపాపపుణ్యములను జాగుచేయక గణించుచునే యున్నాఁడు.

నియమితదినములందు దేవుని స్మరించుచుండుఁడు. ఎవరైనను రెండుదినములలో యాత్రను ముగించినను దప్పులేదు. దేవునికి వెఱ చినయెడల నచట మఱికొంతకాలము మసలినను తప్పులేదు. అందు చేత దైవభీతి గలిగి తుద కతనియొద్దకే మీరు చేరఁగల రని తెలిసి కొనుఁడు.

ఇహలోకజన్మమునుగూర్చి మీ కాశ్చర్యమగునట్లు సంభాషిం పఁగలవాఁ డొకఁడు గలఁడు. తనహృదయములో నున్నదానికి

దేవుఁడు సాక్షియని యాతఁడు పలుకుచుండును. కాని, మిమ్మాతఁడు మిక్కిలిగా నెదిరించుచుండును.

అతఁడు మిమ్ము విడిచిపెట్టి దేశమునందు పరుగెత్తుచు, నక్రమములను వృద్ధిచేయుచు, పొలములను మందలను నాశనము చేయుచుండును. దేవుని క్రియక్రమము లిష్టములు కావు.

అతనితో, "దేవునికి భయపడు" మనునప్పుడు పాపగర్వగ్రస్తుండగును గాని, తరువాత నరకమును సంపూర్ణముగా ననుభవించుచు దుఃఖశయ్యపై నాతఁడు పొరలాడఁగలఁడు!

దైవప్రీతికొఱకు తనయాత్మనుగూడఁ బరిత్యజించువాఁ డొకఁడు కలఁడు. దేవుఁడు తనకింకరులయెడఁ బ్రసన్నుఁడై యుండును.

భక్తులారా, సత్యమతమును సంపూర్ణముగ స్వీకరింపుఁడు. మీకు బద్ధవైరియగు సైతానుమార్గము ననుసరింపకుఁడు.

మేము మీకుఁ జూపిన స్పష్టసూచనలను గుర్తించియు మా మాటల నతిక్రమించినయెడల దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధస్వరూపుఁడు నని జ్ఞాపకముంచుకొనుఁడు.

210\. అట్టివారికి దేవుఁడు మేఘములచే నాచ్ఛాదితుఁడయి దేవతలతోఁ గూడియుండి శిక్ష నొసంగఁగలఁడు? సర్వవస్తువులును దుదకు దేవునియందే సంక్రమింపఁగలవు.

## అధ్యాయము 26.

ఇస్రాయేలుసంతతివారి కెన్ని స్పష్టములగుసూచనల నిచ్చితిమో యడుగుఁడు. దైవప్రసాదమగు నీకురాను వారికి చేరినపిదప దానిని మార్చివేయువారిని దేవుఁడు కఠినదండనలపాలు చేయఁగలఁడు.

విశ్వసింపనివారికిని, విశ్వాసులను హేళనచేయువారికిని, నిహలోకజీవనము సమకూర్పఁబడియున్నది. కాని, రక్షణదినమున దేవ

భీతిపరులు విశ్వాసహీనులకు పైగా నుందురు. దేవుఁడు తనయిష్టము వచ్చినవారిమనోరథములను సంపూర్ణముగా నీడేర్పఁగలఁడు.

పూర్వము మనుష్యజాతియంతయు నొకటియే యైయుండెను. వారికి సంతోషవార్తను, భయసూచనను దెలుపుటకు దేవుఁడు తన ప్రవక్తల నంపెను. జనులవివాదములను బరిష్కరించుటకు సత్య గ్రంథమునుగూడ వారితోఁ బంపెను. ఆగ్రంథమును స్వీకరించిన వారే యొకరియెడల నొక రీర్ష్యాపరులై స్పష్టములగు సూచనలను జూచియు నాగ్రంథమునుగూర్చి వాదములు జరుప మొదలిడిరి. విశ్వాస యుక్తులను, దనయాజ్ఞప్రకారము వాదములు సలిపినవారిని నాతఁడు సన్మార్గగాములఁ జేసెను, దేవుఁడు తన కిష్టమైనవారిని ఋజుమార్గ మునఁ బోవునట్లు చేయును.

మీపూర్వులకువలె మీకును నట్టిసూచనలు కనఁబడనప్పుడు మీరు స్వర్గముఁ జొరనెంచుచున్నారా ? వారు రోగములచేతను గష్టములచేతను శోధింపఁ బడిరి. కాని, వారాశోధనల కాగలేక తమప్రవక్తతోఁబాటు "దేవునిసహాయ మెప్పుడు కలుగు" నని యడుగఁజొచ్చిరి. దేవునిసహాయ మాసన్నమైయున్నది కాదా ?

"భిక్షగా నేమిత్తు" మని వా రడుగుదురు. మీరు చేయు మేలు మీతల్లిదండ్రులకును, బంధువులకును, ననాథశిశువులకును, దరిద్రులకును, పాంథులకును జేయుఁడు. మీరు చేయుసత్కర్మ లన్నియు దేవుని కెఱుకయే " యని వారితో ననుము.

యుద్ధముచేయుట మీకు నియతమైయున్నది. కాని, యది మీకిష్టములేకున్నది. అయినను, బహుశః మీరు మీకు మంచిదగు దానినుండి విముఖులుగను, చెడుగగుదానియెడల సుముఖులుగను నున్నవారేమో. మీ కేమియుఁ దెలియదు. దేవునికే యది తెలియును.

## అధ్యాయము 27.

పవిత్రమాసములలో యుద్ధముచేయుటఁగూర్చి వారు నిన్నడిగెదరు. "అందు యుద్ధముచేయుట తప్పే కాని, దేవునిపక్షమునుండి తొలఁగి యాతనియెడలను, పవిత్రదేవాలయమునందును విశ్వాసమును వీడి, యాయాలయమునందలిజనులను బాఱఁదోలుట, ఇంతకంటెను దేవునిదృష్టియందు తప్పయినపని. రక్తమయమగు యుద్ధముకంటె జనులు తమలోఁ దాము పోరాడుట హీనమైనది. వారికి సాధ్యమైనచో మిమ్ము మీమతమునుండి పోఁదోలువఱకును వారు తమ యుద్ధమును మానరు. కాని, మీలో నెవ్వరయినఁ దనుమతమును విడిచి విశ్వాసహీనులైనచో వారి కిహామందును బరమందును గూడఁ దనుసత్కర్మలఫలము చేకూర నేరదు. వారు దవానలమునం బడి యందే సార్వకాలమును వసింపఁగలరు.

కాని, విశ్వాసయుక్తులై తమదేశమునుండి పాఱిపోయి దేవుని పక్షమునఁ బోరాడువా రాతనికరుణకు బాల్పడవచ్చును. దేవుఁడు దయాదాక్షిణ్యమూర్తి.

సురాపానమును జూదమును గూర్చి వారు నిన్నడుగుదురు. "రెండును పాపకృత్యములే. మనుష్యులకు రెండును లాభకరములే. కాని, వానిలాభముకంటె పాపమే హెచ్చు" అని చెప్పుము. వారు భిక్షగా నేమీయవలయు నని నిన్నడుగుదురు. "నీవీయఁగలదాని నిమ్ము" అని వారితోఁ బలుకుము. ఇహపరలోకములఁగూర్చి నీవు చింతనచేయుటకై దేవుఁడు మీ కిట్టిసూచనలను గనఁబఱుచును.

220. అనాథశిశువులనుగూర్చి వారు నిన్నడుగుదురు. "వారి యెడల న్యాయవర్తనులై యుండుట శ్రేయస్కరము, కాని వారివ్యవహారములలో మీకు జోక్యము కలిగినయెడల వారు మీకు సోదరుల వంటివారు. న్యాయవర్తి యెవఁడో యన్యాయవర్తి యెవఁడో దేవుని

కెఱుక. దేవుని కిష్టమైనయెడల నాతఁడు మీకు దుఃఖముఁ జేఁగూర్పఁ గలఁడు. నిజముగా దేవుఁడు శక్తిమంతుఁడు! బుద్ధమూర్తి!" అని చెప్పెను.

విగ్రహారాధకురాండ్రు విశ్వసించువఱకును వారిని బెండ్లి యాడకుము. నీకు సంతోషమును గూర్చునదైనను విగ్రహారాధనా పరమైన స్త్రీకంటె విశ్వసించిన బానిసస్త్రీ మంచిది. విగ్రహారాధకులు విశ్వసించువఱకును నీకూఁతుండ్రను వారికిఁ బెండ్లిచేయకుము. నీకిష్టుఁడైనను విశ్వసింపనివాఁడు విశ్వసించినబానిసకంటె హీనుఁడు. వారు నిన్నగ్నిలోని కాహ్వానము చేయుదురు. కాని, దేవుఁడు నిన్ను స్వర్గమునకుఁ బిలిచి తన కిష్టమైనయెడల క్షమించి మనుష్యులు తన్ను జ్ఞాపకముంచుకొనుటకు తనసూచనలను వారికిఁ జూపును.

అధ్యాయము 28.

స్త్రీలు ఋతుమతులగుటంగూర్చియు వారు నిన్నడుగుదురు. వారినంటఁగూడదు. కావున వారినుండి విడిపోయి, వారు శుద్ధలగువఱకును వారిదరిఁ జేరకుఁడు. శుద్ధినొందినతరువాత దేవ్రని యాజ్ఞప్రకారము వారియొద్దఁ జేరుఁడు. నిశ్చయముగాఁ దనవైపు తిరిగినవారిని, శుచిగా నుండువారిని దేవుఁడు ప్రేమించును.

మీభార్యలు మీపొలములవంటివారు. కావున మీకిష్టము వచ్చినట్లు వారియొద్దకుఁ బొండు. కాని, మీయాత్మకు మేలుకొఱకొకమంచికార్యముఁ జేయుఁడు. దేవునికి భయపడుఁడు. మీ రతనియొద్దకు చేరవలసియున్న దని తెలిసికొనుఁడు. విశ్వాసయుతుల కీసువార్తను దీసికొనిపొమ్ము.

మీరు నీతిమంతులై, దైవభీతిపరులై యుండి మనుష్యులయందు శాంతిని వర్ధిల్లఁజేయుటకు ప్రమాణము జేయునప్పుడు దేవునిమీఁద నొట్టు పెట్టుకొనకుఁడు.

మీరు డంబముకొఱకు చేసినప్రమాణముల విషయమై దేవుఁడు మిమ్ము ప్రశ్నింపఁబోఁడు. మీరు హృదయపూర్వకముగ నవలంబించినవానిఁగూర్చియే యాతఁడు మిమ్మడుగును. ఆతఁడు దయాదాక్షిణ్యమూర్తి.

తమభార్యలనుండి విడఁబడిపోవ నెంచువారు నాలుగునెల లూరకుండవలయును. ఆకాలమైనపిదప వారిమనస్సు తిరిగినచో వారు నిశ్చయముగా దేవునిదయాదాక్షిణ్యములకుఁ బాత్రులగుదురు.

కాని, వారు విడియాకులిచ్చుటకే నిశ్చయించినచో, నిశ్చయముగా దేవుఁడు వినుచుఁ దెలిసికొనుచునే యున్నాఁడు.

విడియాకు లీయఁబడినస్త్రీ మూఁడుపర్యాయములు బహిష్ఠ యగువఱకును భర్తయొద్దనే యుండి దేవునియందును బ్రళయదినము నందును విశ్వసించినచో దేవుఁడు తనగర్భమునందు కల్పించినదానిని దాచకుండవలయును. భర్తలు సన్మార్గము ననుమోదించువారైన యెడల గర్భవతులను దిరిగి స్వీకరించుట ధర్మము. భర్తలు తమ యెడల నెట్లు సంచరింతురో భార్యలును భర్తలయెడ నట్లే నమ్మకముగా వర్తింపవలయును. కాని మగవారు వారికంటె నొకమెట్టెక్కువ గానే యుందురు. దేవుఁడు శక్తిమంతుఁడు! బుద్ధమూర్తి!

## అధ్యాయము 29.

మీరు భార్యలకు రెండుసారులు విడియాకు లీయవచ్చును. వారిని గౌరవించి, దయతో వదలిపెట్టుఁడు. దేవుఁడు నియమించిన హద్దుల నిద్దఱును నతిక్రమింతురేమో యని భయము కలిగినప్పుడు తప్ప, భార్యలకు మీ రిచ్చినదానిని తిరిగి మీరు తీసికొనఁగూడదు. దేవునియాజ్ఞలను స్త్రీ లనుసరింపలే రని మీకుఁ దోఁచినయెడల భార్య తనవిడుదలకొఱ కొసగినదానికై మీయిరువురకు నేవిధమైన

నిందయుఁ గలుగఁజాలదు. ఇవి దేవుఁడు నియమించినహద్దులు. కావున వీని నతిక్రమింపకుఁడు. వీని నతిక్రమించువారే దుష్ట వర్తనులు.

230. కాని, భర్త మూఁడవసారి విడియాకులిచ్చినయెడల నామె మఱియొకనిని వివాహమగువఱకు నామెను దిరిగి స్వీకరింపఁగూడదు. క్రొత్తభర్తయు నామెకు విడియాకు లిచ్చినయెడల నామెయు, దొలిభర్తయు దేవుని మేరలను మీఱకుందు మని తలంచి కలిసినయెడల నెట్టితప్పును లేదు. ఇవియే దేవుఁడు నియమించిన హద్దులు. జ్ఞానవంతులకు దేవుఁడు వీనినిస్పష్టపఱుచుచుండును.

అయినను స్త్రీలకు విడియాకులిచ్చి వారిని వదలివేయు సమయము వచ్చినప్పుడు దయతో నుంచుకొనుటయో, దయతో వదలిపెట్టుటయో చేయవలయును. వారియెడ నన్యాయవర్తనులై బలవంతముగా నింట నుంచుకొనఁగూడదు. అట్లు చేయుట మీకే హానిగలుగఁజేయును. దేవునిసూచనలను హేళన చేయక, యాతనికి మీయెడఁగల యనుగ్రహమును, మీకు భయసూచనగా నాతఁడు పంపినగ్రంథమును, జ్ఞానమును, స్మరించుచు నాతనికి భయపడి, యతనికిఁ దెలియని దేదియు లేదని తెలిసికొనుఁడు.

## అధ్యాయము 30.

మీరు మీభార్యలకు విడియాకులీయఁగా వారు నియమిత కాలము వఱకు వేచియున్నపిదపఁ దమ కిష్టమువచ్చినభర్తలను గౌరవముగఁ బెండ్లిచేసికొనఁబోయినయెడల వారిని నిర్బంధింపకుఁడు. మీలో దేవునియందును బ్రళయదినమందును నమ్మకము గలవారి కిది యొక భయసూచన. ఇది మీకు మిక్కిలి యుచితమైనదియుఁ బవిత్రమైనదియునైయున్నది. ఇది దేవునికిఁదెలియును గాని మీకుఁ దెలియదు.

చేతిపిల్లలుగల తల్లులకు విడియాకు లిచ్చునప్పుడు పిల్లలు చన్నువదలువఱకును పాలియ్యవలసిన దని భర్తలు కోరినయెడల నాతల్లులు రెండుసంవత్సరములవఱకును బాలియ్యవలయును. ఆకాలమున తగినవస్త్రము లిచ్చి పోషించుభారము తండ్రియం దున్నది. తనశక్తికి మించి యెవ్వఁడును సీయవలయునను నిర్బంధము లేదు. తల్లి తనబిడ్డకొఱకు గాని, తండ్రి తనబిడ్డకొఱకుగాని, యన్యాయముగా నిర్బంధింపఁబడఁగూడదు. తండ్రి వారసులవిషయమునఁ గూడ నిట్లే కాని, యన్యోన్యము నొప్పికొనికాని, సొమ్మునిచ్చి కాని, బిడ్డ నవరియొద్దనైన నుంచికొనుట కిష్టపడినయెడల నది తప్పుకాదు. మీ బిడ్డలకు దాదినిపెట్టి పాలిప్పింపవలసినచో నాదాది కొప్పుకొనినధన మిచ్చి యట్లు చేయుటయుఁ దప్పుకాదు. దేవునికి భయపడుఁడు. దేవుఁడు మీరు చేయుచున్నదానిని దెలిసికొనుచున్నాఁ డని గ్రహింపుఁడు.

మీలో మృతినొందువారికి భార్యలుండినయెడల వారు నాలుగునెలల పదిరోజులు భర్తృవిహీనలై యుండవలెను. ఈ గడువు దాఁటినతరువాత వారు గౌరవముగా నెట్లు సంచరించినను మీకు బాధ్యత లేదు. దేవుఁడు మీరుచేయుదానిని జూచుచునేయున్నాఁడు.

ఆగడువు దాఁటినతరువాత నట్టివారిని బెండ్లి చేసికొందుమని మాట నిచ్చుటయు, నట్టితలంపు గలిగియుండుటయు నిందావహము గాదు. వారిని మీరు మఱచిపోరని దేవునికిఁ దెలియును మీరు గౌరవముగాఁ దప్ప వారితో రహస్యముగా ముచ్చటింపకుఁడు. గడువు కాలము దాఁటువఱకును వివాహముహూర్తమును నిశ్చయింపకుఁడు. మీమనస్సులలో నేమున్నదో దేవుని కెఱుక యని తెలిసికొనుఁడు. అందుచేత నాతనికి భయపడుఁడు. దేవుఁడు శాంతుఁడును దయాపరుఁడు నని తెలిసికొనుఁడు.

## అధ్యాయము 31.

గర్భాధానసంస్కారము కాకపూర్వము, భార్యలకు ధనము నీయక పూర్వమును, వారికి విడియాకు లిచ్చుట దోషము కానేరదు. గొప్పవారును బీదవారును గూడఁ దమతమస్థితులకు దగినట్లు విడియాకు లీయఁబడిన స్త్రీలకుఁ గావలసినదానిని సగౌరవముగ నీయవలయును. ఋజుమార్గగాముల కిది విధాయకము.

కాని, గర్భాధానసంస్కారము కాకపూర్వమును, ధనము నిచ్చినతరువాతను, విడియాకు లిచ్చినయెడల వారి కీయవలసినదానిలో సగ మిచ్చివేయవలయును. స్త్రీలుగాని వారిపోషకులు గాని యీసగమునుగూడఁ గోరనియెడల దాని నీయనక్కఱలేదు. కాని నీవు సర్వమును స్త్రీలకు విడిచిపెట్టుట భక్తిమార్గము. మీలో నొకరికొకరియెడలఁ గలసంబంధములందు దయ యనుగుణమును మఱచిపోకుఁడు. దేవుఁడు మీరు చేయుపనులను జూచుచున్నాఁడు

ప్రార్థనలను, ముఖ్యముగ మధ్యాహ్నప్రార్థనను, మఱచిపోకుఁడు. దేవుని కభిముఖు లగుచు భక్తిపరిపూర్ణులరై నిలిచి యుండుఁడు.

మీకు భయకారణ మేమైన నున్నయెడల నడచుచుఁ గాని, స్వారిచేయుచుఁ గాని, ప్రార్థన చేయుఁడు. మీరు సురక్షితముగానుండినతరువాత మీకుఁ దెలియనిదానినిఁ దెలియఁజేసిన దేవుని స్మరింపుఁడు.

240. మీలో మృతినొందినవారికి భార్య లున్నయెడల నట్టి భార్యలు తమగృహములను విడిచిపెట్టక యొకసంవత్సరమువఱకుచు గ్రాసముండునట్లు వారి కీయవలయును. కాని, వారు తమంతటఁ దామే గృహములను విడిచిపెట్టినయెడల గౌరవమార్గమున వా రెట్లు సంచ

రించినను మీ కెట్టినిందయు నుండబోదు. దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధమూర్తి!

విడియారా కులిచ్చిన స్త్రీలకుఁ దగినయుపాధిని కల్పింపవలయును. దైవభక్తిపరుల కిది విధాయకము.

మీరు బోధపఱుచుకొనుటకు దేవుఁ డిట్టిసూచనలను మీ కనుగ్రహించియున్నాఁడు.

## అధ్యాయము 32.

మృత్యుభయముచే తమగృహములను విడిచి చనిన వేలకొలఁది జనులఁ గూర్చి నీవు తెలిసికొనలేదా? దేవుఁడు వారిని 'చావుఁ' డని తిరిగి జీవమును బ్రసాదించెను. దేవుఁడు మనుష్యునియెడ నపార దయాపరుఁడై యున్నాఁడు. కాని, చాలమందిజనులు కృతఙ్ఞులై యుండరు.

దేవునిపక్షమున యుద్ధము చేయుము. దేవుఁడు సర్వమును వినుచుఁ దెలిసికొనుచున్నాఁ డని గ్రహింపుము.

దేవుని కెవఁడు మంచియప్పు నిచ్చుచున్నాఁడో యాతనికి తిరిగి రెండింతలు దేవుఁ డొసఁగఁగలఁడు. దేవుఁడు లుబ్ధేగాని, కొన్ని సమయములం దుదారస్వభావుఁడు నైయున్నాఁడు. ఆతని యొద్దకే మీరు తిరిగి చేరికొనఁగలరు.

ఇస్రాయేలుసంతతివారు మూసా చనిపోయినతరువాత వారి ప్రవక్త యగునొకనితో "మా కొకరాజు నిమ్ము. దేవునిపక్షమున మేము యుద్ధము చేసెదము" అనిరి. ఆతఁడు "మీకుయుద్ధము నియతమైనచో మీరు యుద్ధము చేయరేమో" యని వారితో ననెను. వారు "మేమును మాసంతతియు మాగృహములనుండి వెడలఁగొట్టఁబడితిమి గదా. దేవునికొఱకు మే మేల యుద్ధము

చేయుము " అని యడిగిరి. కాని, వారిని యుద్ధముచేయుఁ డనఁగా, వారిలోఁ గొందఱుతప్ప నందఱును, సమరపరాఙ్ముఖులైరి. దేవుఁడు తప్పుచేసినవారిని గుర్తించియే యుండెను. ఈసంగతి మీకుఁ దెలియదా ?

వారిప్రవక్త తమతో "దేవుఁడు మీపై తాలూతును రాజుగా నియమించినాఁ" డనెను. "ఏమి! అతనికంటె మేమే రాజ్యమున కర్హులమే! ఆతఁ డంతధనవంతుఁడు గాఁడే!" అని వారనఁగా నాతఁడు "నిశ్చయముగా దేవుఁ డతనిని మీపైనుండున ట్లేర్పఱిచినాఁడు. వానికి జ్ఞానమును దేహదార్ఢ్యమును నధికముగా నొసగినాఁడు. దేవుఁడు తనరాజ్యమును దనకిష్టమువచ్చినవారికిఁ బ్రసాదించును. దేవుఁ డుదారస్వభావుఁడు ! సర్వమును దెలిసినవాఁడు !" అనెను.

వారిప్రవక్త వారితో మఱల "నిశ్చయముగా నాతఁడు రాజనుటకు మీకు సూచనయగునట్లు 'ఆర్కు' అనునావ వచ్చును. అందు మీప్రభువునుండి రక్షణమార్గమును మూసా, హారూనుల కుటుంబములందలి కొన్నివస్తువులు నుండును. దేవతలు దానికి వాహకు లగుదురు. మీరు విశ్వసించినచో నిశ్చయముగ నిదియే యొక సూచన మైయున్న " దనెను.

## అధ్యాయము. 33.

తాలూతు తనసైన్యములతో దాడి వెడలుచు, "దేవుఁడు మి మ్మొకనదినిబట్టి శోధించును. ఆనదీజలమును త్రాగువారు నావర్గములోఁ జేరఁబోరు. చేతితోఁ దప్ప మఱి యేరీతినైనను జలమును గ్రోలనివారు నావర్గములోఁ జేరుదు " రనెను. కాని, వారిలో గొందఱు తప్ప నందఱును నానదియందలినీటిని త్రాగిరి.

వా రానదిని దాటఁగానే యవిశ్వాసకులు "ఈదినమున జాలూత్ తోడను నాతనిసైన్యములతోడను బోరాడుటకు మాకు శక్తిచాల" దనిరి. కాని, దేవునిఁ జేరఁగల మని విశ్వసించినవారు, "దైవేచ్ఛ యున్నపు డెన్నిసార్లు చిన్నసైన్యములు పెద్దసైన్యముల నోడింపలేదు? దేవుఁడు సహనపరులపక్షమున నుండు" ననిరి.

250. ఇట్లు వారు జాలూతుపైనను నతనిసైన్యములపైనను విజృంభించుచు, "ప్రభువా, మాకు స్థైర్యముఁ బ్రసాదింపుము. మాకాళ్ళకు బలము నిమ్ము. ఈయవిశ్వాసకులపై మాకు సహాయము కమ్ము" అని వేఁడికొనిరి.

దైవానుగ్రహముచే వా రిట్లు శత్రువులను బాఱఁదోలిరి. దావూదు జాలూతును జంపివేసెను. దేవుఁ డాతనికి రాజ్యమును బ్రసాదించి, బుద్ధి ననుగ్రహించి, తనయిష్టప్రకార మాతనికి సర్వమును నేర్పెను. దేవుఁ డొకరిపై నొకరి నుంచి యధికారము నీయకుండినచో భూమియం దరాజకము ప్రబలియే యుండును. కాని దేవుఁడు తనప్రజలయెడ దయానిధియై యున్నాఁడు.

ఇవి దేవునిసూచనలు. నీవు మేమంపినప్రవక్తలలో నొకఁడవు. మేము నీకు వానిని సత్యముగా వినిపించుచున్నాము.

---

# కాండము. 3

---

మేము పంపినప్రవక్తలలోఁ గొందఱికంటె మఱికొందఱకు హెచ్చుజ్ఞానమును బ్రసాదించియున్నాము. దేవుఁడు స్వయముగా మాటలాడినవా రత్యుచ్ఛస్థానమును బొందియున్నారు. మరియుమ్మ

పుత్త్రుఁడగు ఈసాకునకు, స్పష్టసూచనలనిచ్చి, పవిత్రాత్మను బ్రసాదించి బలమునొసంగి యున్నాము. దైవేచ్ఛయే యున్న యెడల నిట్టిస్పష్ట సూచనలను వారు చూచియు నొకరితోనొకరు వివాదములు పెంచు కొనియుండరు. కాని, వా రొండొరులతో వాదములు పెంచుకొనిరి. వారిలోఁ గొందఱు విశ్వసించిరి. ఇతరులు విశ్వసింపరైరి. దేవుని యిష్టమైనయెడల వా రట్లు వివాదములు పెట్టుకొనక యుందురు. దైవము తన కిష్టమైనదానినే చేయుచుండును.

## అధ్యాయము 34.

విశ్వాసులారా! బేరము గాని, స్నేహము గాని, మాధ్యస్థ్యముగాని, పనికిరానిదినము రాకపూర్వమే, మేము మీ కనుగ్రహించినదానిలోఁ గొంతభిక్షుకుఁ గా వినియోగింపుఁడు. అవిశ్వాసకులే తప్పుచేసినవారు.

దేవుఁడా! నిత్యజీవియు, శాశ్వతుఁడు నగునాతఁడు తప్ప మఱియొక దేవుఁడు లేఁడు. అతనికి కునుకుగాని నిద్రగాని రాదు. స్వర్గమర్త్యములయందుఁ గలదియంతయు నాతనిదే. ఆతనియనుజ్ఞ లేక యాతనిమ్రోల నెవ్వఁడును మాధ్యస్థ్యమును వహింపఁజాలఁడు. అతనికి భూతభవిష్యత్తులు రెండును దెలియును. కాని, యాతఁ డనుగ్రహించినజ్ఞానము తప్ప నితరమును వారు గ్రహింపలేరు. ఆతని సింహాసనము స్వర్గమర్త్యములకుఁ బైగా నున్నది. ఆ రెండును నాతనికి బరువుకావు, ఆతఁ డున్నతుఁడు! మహాత్ముఁడు!

మతమునందు నిర్బంధ మెద్దియు లేదు. ఇప్పుడు ఋజుమార్గము నుండి దుష్పథ మేర్పఱుపఁబడినది. అందుచేత, సైతానును విడిచి దేవునిఁ జేపట్టువానికి బలమును చేయూతయు లభించుచున్నవి. దేవుఁడు సర్వమును వినుచున్నాఁడు. తెలిసికొనుచున్నాఁడు.

దేవుఁడు విశ్వాసులపోషకుఁడు. ఆతఁడు వారిని చీఁకటినుండి వెలుతురులోనికిఁ దెచ్చును. విశ్వసింపనివారికి సైతాను పోషకుఁడు ఆతఁడు వారిని వెలుతురునుండి చీఁకటిలోనికిఁ దీసికొనిపోవును. వారగ్నియందుఁ బడుదురు. అందే సార్వకాలమును వసింతురు.

అధ్యాయము 35.

దేవుఁ డిబ్రాహీమునకు రాజ్యము నిచ్చినాఁడని యాతనితోఁ దనప్రభువుఁగూర్చి సంవాదముచేసినవానివిషయమై నీవు యోచించితివా? ఇబ్రాహీము, "నాప్రభువు జీవము నిచ్చుటకును, దీసివేయుటకును సమర్థుఁడై యున్నాఁ" డనఁగా నాతఁడు "పుట్టింపఁ గిట్టింప సమర్థుఁడను నేనేకాని, నీప్రభువు కాఁ" డనెను. అప్పుడిబ్రాహీము, "దేవుఁడు సూర్యుని తూర్పున నుదయింపఁజేసిన నీవు పడమట నుదయింపఁజేయఁగలవా?" అని ప్రశ్నింప నాతని కెట్టియుత్తరమును దోఁచకపోయెను. దేవుఁడు దుష్టులకు రక్షణమార్గమును జూపఁడు.

సంపూర్ణ నాశనము నొందిన నగరముప్రక్కగాఁ బోయినవానికి జరిగిన యవమానమునుగూర్చి నీవు తలంచితివా? "ఈనగరము మృతప్రాయము గదా! దీనికి దేవుఁడు తిరిగి జీవము నెట్లుపోయఁగలఁడు" అని యాతఁ డడిగెను. దేవుఁడాతనిని నూఱుసంవత్సరములు మృతునివలె నుంచి, తిరిగి జీవము కాన్పింపఁజేసి "ఓయీ! నీవెన్ని వత్సరములు వేచియుంటివి" అని యడుగ నాతఁడు "ఒకదినమో, దినములో నొకభాగమో వేచియుంటి" నని బదులిచ్చెను. దేవుఁ డాతనితో "అట్లు కాదు. నీవు నూఱుసంవత్సరములు వేచియుంటివి. ఇవిగో నీయాహారపానీయము లించుకయుఁ జెడలేదు. ఇదిగో నీ గాడిద. నిన్ను మనుష్యుల కొకసూచనగాఁ జూపెదము. ఇవిగో నీగాడిద యెముకలు. వీని నెట్లుద్ధరించి, తిరిగి మాంసముతోఁ గప్పె

దమో చూచుచుండు " మని యట్లు చేయఁగా నాతఁడు తుదకు, "దేవుఁడు సర్వశక్తుఁడని యొప్పుకొనుచున్నా " ననెను.

260. ఇబ్రాహీం మొకప్పుడు, "ప్రభువా! నిర్జీవులకు జీవము నెట్లిచ్చెదవో నాకుఁ దెలుపు" మని యడుగ, దేవుఁడు "నీవు విశ్వసింపలేదా" యని యడిగెను. ఆతఁడును "నేను విశ్వసించినాను. కాని నాహృదయమునకు నమ్మకము కలుగునట్లు చేయుమని నిన్నడుగుచున్నాను" అనెను దేవుఁడు "నాలుగుపక్షులను దీసికొని, వానిని ఖండఖండములుగాఁ గోసి, యొకొక్కముక్క నొక్కొకపర్వతముపై నుంచి, యాపక్షులను బిలువుము. అవి నీవంక కెగురుచు వచ్చుటను జూచి, దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధమూర్తియునని తెలిసికొనుము" అనెను.

## అధ్యాయము 36.

దేవునివిషయమై తమధనమును వినియోగించువారు ఒకొక్క జంటలో నూఱుధాన్యపుగింజలు కలిగినయేడుజంటలధాన్యపు వెన్నువలె నుందురు. దేవుఁడు తనయిష్టమువచ్చినవారియైశ్వర్యమును వృద్ధి చేయును. దేవుఁ డుదారస్వభావుఁడు. సర్వవేత్త.

దేవునివిషయమై తమధనమును వినియోగించి, భిక్షగానిచ్చిన వెంటనే కొట్టి తిట్టకుండువారు ప్రభువనుగ్రహమునకుఁ బాత్రులగుదురు. వారి కేభయమును నేదుఃఖమును గలుగఁబోదు.

భిక్ష నిచ్చి హాని కలుగఁజేయుటకంటె దయాయుతమగు వాక్కును, క్షమయు, నుత్తమములు. దేవుఁ డైశ్వర్యవంతుఁడు. కరుణాలవాలుఁడు !

విశ్వాసులారా! మనుష్యులు చూచునట్లు ధనము నిచ్చి, దేవునియందును, బ్రళయదినమునందును నమ్మనివారివలె భిక్ష

నిచ్చినవెంటనే కొట్టుచుఁ దిట్టుచు దానిని వృథాసేయకుఁడు. వారు పలుచనిమంటిచేఁ గప్పఁబడినబండఱాతివంటి వారు. దానిపై వర్షము కురిసినతోడనే యామన్ను కఱఁగిపోయి గట్టిదగుఱాయిమాత్రము మిగిలిపోవును. వారు చేసినకృత్యములవలనఁ దమ కేలాభమును గలుగఁబోదు. దేవుఁ డవిశ్వాసులకు రక్షణమార్గమునుగల్పింపఁబోఁడు.

దేవుని సంతోషపెట్టుటకును, దమయాత్మల స్థిరత్వమునకును, దమధనమును వెచ్చపెట్టువారు పర్వతముమీఁది తోఁటవంటివారు. దానిపై గొప్పవర్షము పడి తోఁట రెండింతలు ఫలవంత మగును. వర్షము పడకపోయినను మంచైనను దానిపైఁ బడకపోదు. దేవుఁడు నీకృత్యములను జూచుచునే యున్నాఁడు.

నదులు ప్రవహించుచుండు తాళవనమునందును, ద్రాక్షవనము నందును, సర్వవిధములగుపం డ్లుండగా నచట వృద్ధత్వము త న్నాక స్మికముగా నలముకొనఁ, దనసంతతివారు బలహీనులై యుండ, వెంటనే ప్రచండమారుతము వీచి, యావనమును గాల్పఁగా నది నిర్మూలమగుట యెవ్వని కిష్టముండును ? నీ వాలోచించుకొనుటకు దేవుఁ డిట్టి సూచనలను స్పష్టపఱుచుచుండును.

## అధ్యాయము 37.

విశ్వాసులారా! మీరుసంపాదించినసర్వవస్తువులను, మేము భూమినుండి తీసి మీ కనుగ్రహించినవస్తువులను మాత్రమే భిక్షగా నొసగుఁడు. చెడువస్తువుల నేర్చి భిక్షనీయకుఁడు. మీరు పరిగ్రహింప నిచ్చగించువస్తువులనే భిక్షగా నొసగుఁడు. దేవుఁ డైశ్వర్యవంతుఁడు! స్తవనీయుఁడు!

సైతానుస్త్రీ మీకు దారిద్ర్యము నిచ్చెద నని భయపెట్టుచు నీచకార్యములఁ జేయ నియోగించుచుండును. కాని దేవుఁడు తన

యెడల చేసిన యపరాధములను క్షమించి యైశ్వర్యము నిచ్చెద నను చున్నాఁడు. దేవుఁడు సర్వప్రదాత. బుద్ధమూర్తి.

ఆతఁడు తనయిష్టమువచ్చినవారికి బుద్ధిని ప్రసాదించును. అట్టి బుద్ధిని పొందినవారు గొప్ప మేలు పడయఁ గలరు. కాని, హృదయము లందు మంచియూహాలు కలవారు తప్ప నితరులు దానిని జ్ఞాపక ముంచుకొనరు.

270. నీ వేభిక్ష నిచ్చినను, ఏ మ్రొక్కు మ్రొక్కినను, దేవునికిఁ దెలియుచునే యున్నది. కాని, యధర్మవర్తనుల కెట్టిసహాయమును చేకూరదు.

నీవు బహిరంగముగా నీయనెంచెదవా? అది మంచిదే. బీదలకు గుప్తదానముఁ జేసెదవా? ఇదియు నీకు లాభకరమే. అది నీపాపము లను హరింపఁగలదు. దేవుఁడు నీకర్మలన్నిటికిని సాక్షియైయు న్నాఁడు.

ఓముహమ్మదా! వారిరక్షణనుగూర్చి నీ కేమియు నధికారము లేదు. దేవుఁడు తనయిచ్ఛవచ్చినవారికే రక్షణ నొసగును. మీరు భిక్షగా నొసగినదాని మేలు మీకే వచ్చి చేరును. మీదేవునిముఖ సందర్శనమునకే భిక్ష పెట్టుచుండవలెను. భిక్షగా మీరిచ్చిన మంచి వస్తువు లన్నియు మీకు తిరిగి యీయఁబడును. మీ కేయన్యాయ మును గలుగఁబోదు.

మీలోఁ గొందఱు బీదవారై యెల్లప్పుడును దేవునిపక్షము ననే పోరాడుచు, భూమిని దున్నియు, త్రివ్వియు, నైశ్వర్యవంతులు కాఁజాలనివా రున్నారు. వారినమ్రత్వమును జూచి, వారినిగూర్చి తెలియనివారు వారిని ధనవంతు లని తలంతురు. వారు దీనముగా నితరులను యాచింపకుండుటనుబట్టి వారిని నీవు తెలిసికొనఁగలవు.

వారికి నీ వేమంచివస్తువును భిక్షగా నిచ్చినను దేవుఁడు దానిని గుర్తించుచునే యుండును.

## అధ్యాయము 38.

తమధనమును రాత్రింబవళ్ళు రహస్యముగనో, బహిరంగముగనో భిక్షగా నిచ్చివేయువారిని దేవుఁ డనుగ్రహించును. వారికి భయదుఃఖములు గలుగఁబోవు.

ఎక్కువవడ్డికి ధన మప్పిచ్చువారు రక్షణదినమున సైతానుచే గ్రస్తులగువారు వేచునట్లు వేచియుందురు. వడ్డికిచ్చుటయు, వర్తకము నొక్కటే యని వారందురు. కాని, వర్తకము చేయువచ్చును గాని, వడ్డి కప్పు నీయఁగూడ దని దేవుఁడు నిషేధించియున్నాఁడు. కావున నీభయసూచనను గ్రహించినపిదప వడ్డీవ్యాపారమును మానుకొనువానిని దేవుఁడు క్షమించి తనసాన్నిధ్యమునఁ జేర్చికొనును. వడ్డీవ్యాపారమునందే యుండువారు నరకమునఁ బడి యందే శాశ్వతముగా వసింపఁగలరు.

వడ్డీధనమును నిషేధించినను, దేవుఁడు భిక్షగా నిచ్చినదానిని వడ్డీతో హెచ్చుచేయుచుండును. దేవుని కవిశ్వాసకులును, దుష్టులును నిష్టులు కారు.

కాని, విశ్వాసులును, ఋజువర్తనులును ప్రార్థనాపరులును, ధర్మభిక్షాదాతలును, ప్రభువునను గ్రహమునకుఁ బాత్రులయ్యెదరు. వారల కేభయమును, ఏదుఃఖమును గలుగఁబోదు.

భక్తులారా! మీరు విశ్వసించినవారే యైనచో మిగిలిన వడ్డీధనమును విడిచిపెట్టి దైవభీతిఁ గలిగియుండుఁడు.

మీ రట్లు చేయనిచో దేవునిపక్షమునను, నాతనిప్రవక్తపక్షమునను జరుగఁబోవుయుద్ధమునుగూర్చి వినుఁడు. మీరిప్పుడైనఁ

బశ్చాత్తాపము నొందినచో మీమూలధన మైనను మీకు మిగులును. ఒకరికి హానిచేయనియెడల మీ కేహానియుఁ గలుగఁబోదు.

280. అప్పుతీర్చుట కష్టమని తోచినవానికి సులువగువఱకును నోర్చియుండుఁడు. దానిని భిక్షగాఁ దెలిసి విడిచిపెట్టినయెడల మఱెంత మంచిది.

మీరు దేవునియొద్దకు తిరిగి వెళ్ళఁగలదినముఁగూర్చి భయపడుఁడు. అపు డెవరికిఁదగినలాభము వారికిఁ గలుగఁ గలదు. ఎవరికి నన్యాయము గలుఁగబోదు.

## అధ్యాయము 39.

విశ్వాసులారా! ఒకనిశ్చితదినమునకు చెల్లింపగలమని యప్పు తీసికొన్నప్పుడు దానిని వ్రాఁతమూలముగా నుంచుకొనుఁడు. మీ యిద్దఱకును నన్యాయము లేకుండ వ్రాయసకాఁడు వ్రాయవలయును. వ్రాతగాఁడు దేవుఁడు ప్రసాదించినట్లు వ్రాసి తీఱవలయును. అప్పు పుచ్చుకొనినవాఁడు వ్రాయవలసినది చెప్పుచుండగా వ్రాయువాఁడు వ్రాయుచుండవలయును. అప్పుపుచ్చుకొనినవాఁడు దైవభీతి గలిగి, పుచ్చుకొనినదానిలో తా నేమాత్రమును నెగవేయనెంచఁ గూడదు. కాని, యప్పుపుచ్చుకొనినవానికిఁ దెలియక, బలహీనముగ నుండి, యప్పుపత్రమును వ్రాయించుకొనలేకపోయినప్పుడు తనస్నేహితుఁడు న్యాయముగా వ్రాయింపవలయును. పత్రముపై మీలో నిద్దఱుమగవారిని సాక్షులుగా నుదాహరింపవలయును. ఇద్దఱు మగవారు దొరకనప్పు డొకమగవాఁడును, తగినవారని నీకుఁ దోచిన యిద్దఱుస్త్రీలును సాక్షులుగా నుండవచ్చును. ఆస్త్రీలయం దొక తె మఱచిపోయినయెడల రెండవయామె యైనను జ్ఞాపకము తేఁగలదు. సాక్షుల నెప్పుడుపిలిచినను రాకే మనఁగూడదు. అప్పు కొంచె

మైనను, గొప్పదైనను లేదితోఁగూడ వ్రాఁతయుం దుంచనేల యని యుపేక్ష చేయఁగూడదు. ఇది దేవునిదృష్టియందు న్యాయముగను, తీర్పుచెప్పుట కనుకూలముగను, సంశయములఁ దొలఁగించునదిగను నుండును. కాని, వస్తువు లెదురుగా నున్నప్పు డొక చేతినుండి మఱి యొకచేతి కొప్పఁజెప్పవలసినప్పు డవి వ్రాఁతమూలముగా నుండకపోయి నను తప్పులేదు. అమ్మినప్పుడు సాక్షులనుంచికొని, వ్రాఁతగానికిఁ గాని, సాక్షికిఁ గాని హాని కలుగఁజేయకుఁడు. ఇట్లు చేయుట ద్రోహ మగును. దేవునికి సర్వమును దెలియును. దైవభీతి గలిగి యున్నచో దేవుఁడు మీకు జ్ఞానమును బ్రసాదింపఁగలఁడు.

నీవు ప్రయాణములో నుండఁగా వ్రాతగాఁడు దొరకనప్పుఁడు, తనఖాగా వస్తువుల నుంచికొనవచ్చును. కాని మీలో నొకరిపై నొకరికి నమ్మక మున్న యెడల తనఖాగా వస్తువులను తిరిగి యిచ్చివేసి దేవునికి భయపడవలయును. సాక్ష్యమీయమనిచెప్పకుఁడు. అట్లు చెప్పువాడు దుష్టహృదయుఁ డగుచున్నాఁడు. దేవుఁడు మీకృత్య ములను జూచుచునే యున్నాఁడు.

## అధ్యాయము 40.

స్వర్గమర్త్యములందుఁ గలదంతయు దేవునిదే. మీామనస్సులలో నున్నది దాచిపెట్టినను వెలిబుచ్చినను దేవుఁడు సర్వమును గుర్తిం చుచునే యున్నాఁడు. అతఁడు తనయిష్టమువచ్చినవారిని క్షమించి, యిష్టమువచ్చినవారిని శిక్షించును. అతఁడు సర్వశక్తుఁడు.

భక్తులవలెఁ బ్రవక్తయు ప్రభుపంపినవార్తను నమ్ముచు న్నాఁడు. ప్రతిమనుష్యుఁడును దేవునియందును, నతనిదేవతల యందును, నతనిగ్రంథమునందును, నతనిప్రవక్తలయందును నమ్మ కము గలిగియున్నాఁడు. ఆతనిప్రవక్తలయందు మేము తారతమ్యము

లెంచఁబోము. వారు "మేమువింటిమి. విధేయులమై యున్నాము. ప్రభువా! నీయొద్దకే మేము తిరిగి రాఁగలము. కావునఁ గరుణింపు" మని యందురు.

ఏయాత్మపైనను దేవుఁడు శక్తికిమించినభారము నుంచఁడు. ఆయాత్మ తాను సంపాదించినమంచి ననుభవించి, కష్టపడి కూడఁ బెట్టినచెడుగును మోయఁగలదు. "ప్రభువా! మేము మఱచినను, పాపులమైనను మమ్ము శిక్షింపకుము. ప్రభువా! మాపూర్వులపై నీవు వైచినభారమువంటిభారమును మాపై వేయకుము. ప్రభువా! మేము మోయశక్తిలేనిదానిని మాపైనుంచకుము. మాపాపములను రూపుమాపి, మమ్ము క్షమించి, మాయెడఁ గరుణఁ జూపుము. నీవే మాకు రక్షకుఁడవు. కావున విశ్వాసహీనములగుజాతులపై మాకు జయము నిమ్ము.

## సురా 3. ఇమ్రానుకుటుంబము

మదీనా—199 పద్యములు—20 రుకూలు.

### అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలిఫ్. లమ్. మిమ్.

దేవుఁడు చిన్మయుఁడు, స్వయంవ్యక్తుఁడు, సర్వాధారుఁడు, అతనికంటె వేఱు దేవుఁడు లేఁడు.

మనుష్యునకు రక్షణగా శాసనమును, (తౌరాత్) ధర్మ

గ్రంథమును (ఇంజీల్) నాతఁడు పూర్వము పంపియుండెను. ఇప్పు డీ "జ్యోతిని" బంపినాఁడు. ఈ "గ్రంథము" పూర్వపుదానిని సత్యముగా స్థిరపఱచుచునదియే. దేవునిసూచనల నమ్మనివారికి ఘోరబాధయేకదా! దేవుఁడు శక్తిమంతుఁడు. పగగలవాఁడు.

దేవుఁడు! స్వర్గమర్త్యములయం దెద్దియు నాతనికి గోప్యము కాదు.

తల్లులగర్భములలో మీకు రూపము నొసగినవాఁ డాతఁడే. దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధుఁడు; అతనికంటె వేఱుదైవము లేఁడు.

'ఆగ్రంథమును' మీకుఁ బంపినవాఁ డాతఁడే. దానిలోని కొన్ని సూచనలు స్పష్టార్థము గలవి. ఇవియే గ్రంథమునకుఁబునాదులు; ఇతరము లలంకారగర్భితములు. కాని తప్పుతో వ్రిఁవంబడినహృదయము లందలియలంకారముల ననుసరించి, వానియర్థముకొఱకు వెనఁగు లాడుచుండును. చీకాకునొంద నభిలషించును. స్థిరజ్ఞానము గలవారు "మేము దానిని నమ్మినాము. అదియంతయు దేవుఁ డనుగ్రహించినదే" యని యందురు. కాని జ్ఞానులుతప్ప నితరులు దీనిని మనసులం దుంచుకొనరు.

మాప్రభువా! నీవే దాతవు. ఒకసారి మాకు రక్షణనొసగి తిరిగి మాహృదయములను భ్రమలోఁ బడనీయకుము. నీకరుణ మాపైఁ బ్రసరింపఁ జేయుము.

మాప్రభువా! నిశ్చితమైనదినముకొఱకు నీవు మనుష్యజాతి నంతటి నొకచోఁ జేరఁదీయఁ గలవు దేవుఁడు తనమాటను తప్పఁడు. అవిశ్వాసులధనమును, సంతతియు దేవునిముం దెందుకును బనికిరావు. వా రగ్ని కింధనప్రాయు లగుదురు.

10. ఫిరౌనుప్రజలును, వారికిఁ బూర్వము గతించినవారునువలె వారు మాసూచనల నసత్యములుగఁ బరిగణించిరి. కావున దేవుఁడు వారిని దమ పాపములతోఁ బట్టికొనెను. దేవునిశిక్ష కఠినమైనది.

అవిశ్వాసులతో "మీరపజయము నొందుదురు. నరకములో మీరందఱును జేరుదురు. అచట మీకు దుఃఖశయ్య ప్రాప్తమగును.

రెండుసైన్యములును గలియుటయందు మీకప్పుడే సూచన యుండెను. ఒకసైన్యము దేవునిపక్షమునఁ బోరాడెను. రెండవది విశ్వాసము లేకయుండెను. శత్రువులదృష్టికి మీరు రెండింతలుగఁ గనఁబడితిరి. దేవుఁడు తనయిచ్ఛవచ్చినవారినిఁ గాపాడెను. బుద్ధిగలవారు దీనివలన పాఠము నేర్చికొనఁగలరు.

స్త్రీలు, సంతానము, వెండిబంగారములభాగ్యము, మేలిగుఱ్ఱములు, పశువులమందలు, సస్యభూములు, వీనివలనఁ గలుగునానందములు మనుష్యులకు బాగుగఁ గనఁబడును. అవన్నియు నిహలోకభోగములే. కాని దేవునితోడివాసమే శ్రేష్ఠమైనది.

దైవభీతులగువారి కాతనిసన్నిధానమున నింతకంటె మేలైనవి సిద్ధముగ నుండును. వానిని మీకెఱింగించుకునా? వనములు, అందలి గుడారములక్రిందినదులు, నచట శాశ్వతవాసము, నిష్కళంకలగుభార్యలు, దేవునియామోదము, ఇవన్నియు వారికిఁగలుగును. "ప్రభువా! మేము నమ్మినాము. 'మాపాపములను క్షమించి, యగ్నిబాధనుండి మమ్ము తప్పింపుము'. అను కింకరులను, సహనపరులను, సత్యవంతులను, నమ్రతగలవారిని, ధార్మికులను, ప్రత్యూదయమునను దేవుని క్షమాపణ వేఁడుకొనువారిని, దేవుఁడు ప్రేమించును" అనుము.

తాను తప్ప నితరదైవము లేనందుకు దేవుఁడే సాక్షి. దేవతలును, జ్ఞానవంతులు, పుణ్యవంతులు, నైనవారును, "శక్తిమంతుఁడు, బుద్ధుఁడు నగుదేవునికంటె నితరదైవము లేఁడని" పల్కుచుందురు.

దేవున కిస్లామే సత్యమతము. దైవగ్రంథములఁ గొనినవారు తమకు "జ్ఞానము" కలిగి యొండొరులయెడ నీర్ష్యాబద్ధులగువఱకును భేదాభిప్రాయములఁబడలేదు. కాని దేవునిసూచనల నమ్మనివారిని దేవుఁడు క్షమింపఁడు.

వారు నీతో వాదమునకు దిగినచో "నన్ననుసరించినవారి వలె నేనును దేవునియధీనములోఁ జేరితిని" అనుము. గ్రంథమును స్వీకరించినవారితోను సాధారణజనులతోను "మీరు దైవాధీనుల రగుదురా?" అని యడుగుము. వారు భక్తులైనచో వారికి సరియగురక్షణ దొరకును. వారు పెడమొగము పెట్టినచో వారికి బోధించుటయే నీవిధి. దేవుఁడు తనకింకరుల ననుగ్రహించుచునే యున్నాఁడు.

## అధ్యాయము 3.

20. కాని, దేవునిసూచనలను నమ్మక, ప్రవక్తలను, పుణ్యమార్గప్రబోధకులను జంపెడివారికి ఘోరశిక్ష కలుగనున్న దని చాటుము.

ఇహపరలోకముల రెంటియందును వీరికర్మలు పనికిరాక పోవును. వారికి సహాయముగ నెవ్వరు నుండరు.

దైవగ్రంథములలోని కొన్నిభాగములను పొందినవారిని నీవు గుర్తించితివా? వారు తమయభిప్రాయభేదముల సరిచేసికొనుటకు గ్రంథమునొద్దకుఁ బిలువఁబడినప్పుడు వారిముఖములను గనిపెట్టితివా? అప్పుడు వారిలోఁ గొందఱు వెనుదిరిగి చాలదూరము పోయిరి.

"అగ్ని కొన్నిదినములు తప్ప నెప్పుడును మ మ్మంటదు" అని వారుచెప్పుటచేతనే యట్లాయినది. వారిమతమునందలి వారిపన్నాగములే వారిని మోసపుచ్చినవి.

కాని, నిశ్చయముగ వచ్చుచున్నదినమందు వారందఱు నొకచోఁ జేరునప్పుడు ప్రత్యాత్మయుఁ దాను గడించుకొనినదానిని తీసికొననున్నప్పుడు, వారి కెట్టియన్యాయమును గలుగఁబోనప్పు డేమగునో !

‘ దేవా ! సర్వశక్తిసంపన్నా ! నీయిచ్చవచ్చినవారికి నీవు సహాయమొసగుదువు ; ఇచ్చవచ్చినవారినుండి దానిని తీసివేసెదవు ; నీయిచ్చవచ్చినవారిని పైకెత్తుదువు. ఇచ్చవచ్చినవారిని దీనులఁ జేసెదవు. నీకన్నివస్తువులపైనను శక్తి గలదు. మేలంతయు నీచేతనే యున్నది ” అనుము.

రాత్రిని పగటిలోనికిని, పగటిని రాత్రిలోనికిని నీవు సంక్రమింపఁజేతువు. సజీవుల నిర్జీవులుగను, నిర్జీవుల సజీవులుగను చేసెదవు. నీయిష్టమువచ్చినవారికి నీవు కొలఁదికిమీఱి యొసగెదవు.

విశ్వాసులు విశ్వాసులతోడనే కాని యవిశ్వాసులతో స్నేహము చేయఁగూడదు. వారినుండి భయశంక గలిగినప్పుడుతప్ప వారు దేవునినుండి యెద్దానిని నాసింపఁజాలరు. దేవుఁడు తన్నుఁ గూర్చి మిమ్ము భయపడవలయు నని కోరుచున్నాఁడు ; మీరు దేవునియొద్దకేకదా తిరిగి పోవలయును ?

మీహృదయములలో నున్నదానిని దాచికొనినను బయటఁ బెట్టినను దేవునికిఁ దెలియును. స్వర్గమర్త్యములం దేమియున్నదో యాతనికే యెఱుక. అన్నివస్తువులపైనను దేవునికి శక్తి గలదు.

ఆదినమునఁ బ్రత్యాత్మయుఁ దా నొనర్చినపుణ్యమును జూచును ; తాఁ జేసినపాపమునకును దనకును గడుదవ్వగుఁగాక యని కోరుచుండును. దేవుఁడు తనకింకరులయెడ ప్రేమగలిగి యున్నాఁడు. కావున నాతఁడు నీవు తన్ను గుర్తించియుండఁ గోరుచున్నాఁడు.

## అధ్యాయము 4.

30. "మీరు దేవునిఁ బ్రేమించినచో నన్ననుసరింపుఁడు. దేవుఁడు క్షమించును. మిమ్ముఁ బ్రేమించును. మీ పాపములను బాఱఁ ద్రోలును.

దేవుని ప్రవక్తను మన్నింపుఁడు. వెనుదిరిగినచో దేవుఁడు నమ్మనివారిని ప్రేమింపఁడు" అని చెప్పుము.

దేవుఁడు ఆదామును, నూహును, ఇబ్రాహీముకుటుంబమును, ఇమ్రానుకుటుంబమును,

ఇట్లే యొకసంతతితరువాత నొకసంతతివారిని మనుష్యు లందఱికంటె నధికులఁ గావించెను. దేవుఁడు శ్రోత; జ్ఞాని.

ఇమ్రానుభార్య "ప్రభూ! నేను నాగర్భములోనిశిశువును నీసేవకై యర్పించుచున్నాను. నీవు శ్రోతవు. జ్ఞానివి. కావున నాయీకానుకను బరిగ్రహింపుము" అనెను.

ఆమెయుఁ బ్రసూతయై "ప్రభువా! నాకు స్త్రీశిశు వుద్భవించినది. ఆమెకు "మరియమ్మ" యని నామకరణ మొనర్చితిని. రాలదెబ్బలుతినిన సైతానునుండి యామెను నామెసంతతిని గాపాడుము" అనెను. ఆమె కేశిశువు జనించెనో దేవునికిఁ దెలిసెను. స్త్రీ పురుషుఁడు కాదు గదా!

అయినను ప్రభువా స్త్రీశిశువును బ్రీతితో స్వీకరించి దినదినాభివృద్ధి నొందించెను. జకెరియా ఆమెను పెంచెను. మఠమునొద్దకు జకెరియా యెన్నిసార్లు పోయి చూచినను మరియమ్మకుఁ గావలసినంత యాహార ముండుచుండెను. "మరియమ్మా, ఇది నీ కెక్కడిది" అని యాతఁ డడుగ నామె "ఇది దేవుఁ డనుగ్రహించినది. దేవుఁడు తనయిచ్చవచ్చినవారిని బోషించును. అతనికి లెక్కలేదు" అనెను.

అచట జకెరియా తనప్రభువును బిలిచి "ప్రభో! నీవు ప్రార్థనలను విందువు. నాకు మంచిసంతతి కలుగున ట్లనుగ్రహింపుము. నీవే మొఱల నాలించువాఁడవు" అనెను.

అతఁడు మఠమునొద్ద ప్రార్థించుచు నిలిచియుండఁగా దేవతలాతనిఁ బిలిచి "దేవుఁడు నీకు యాహ్యా నిచ్చినాఁడు. అతఁడు దేవునివాక్యమును స్థిరపఱుచును. అతఁడు మహాత్ముఁడు, పవిత్రుఁడు, పుణ్యవంతులలో శ్రేష్ఠుఁడు" ననిరి.

అతఁడు "ప్రభువా! నేను వృద్ధుఁడనైతినిగదా! నాభార్య వంధ్యగదా. నాకు సంతాన మెట్లు కలుగును?" అనెను. అతఁడు "దేవుఁడు తనయిష్టము నిట్లే నెఱవేర్చుకొనుచుండు" ననెను.

40. అతఁడు "దేవా! నాకొక యానవా లిమ్ము" అనఁ బ్రభువు నీవు మూఁడుదినములు సైఁగలుచేయుట తప్ప మాటలాడవు. ఇదియే నీకానవాలు. కాని, నీప్రభువును నిత్యమును స్మరించి ప్రాతస్సాయంకాలముల నాతని స్తోత్రము చేయుచుండుము" అనెను.

అధ్యాయము 5.

దేవతలు "మరియమ్మా! దేవుఁడు నిన్నెంచికొని, పవిత్రవంతురాలుగఁ జేసి ప్రపంచమందలి స్త్రీలోకములో నిన్నే శ్రేష్ఠురాలుగఁ జేసియున్నాఁడు. మరియమ్మా! నీప్రభువునెడల దృఢభక్తి గలిగి, సాష్టాంగపడి నమస్కరించువారితోఁబాటు నమస్కరింపుము" అనుమాటలను జ్ఞప్తియం దుంచుకొనుము.

నీకదృష్టపూర్వమైన విషయములలో నిది యొకటి. మహమ్మదా! నీకు దీని నెఱింగించుచున్నాము. వీరిలో మరియమ్మ నెవరు పెంచవలె నని చీట్లుతీసినపుడు నీవు వారితో లేవు. దానినిగూర్చి వివాదము హెచ్చినప్పుడును నీవు వారితో లేవు.

దేవత "మరియమ్మా! దేవుఁడు తనమాటను నీకు తప్పక చెప్పును. ఆతనిపేరు మరియమ్మకుమారుఁడగు మెసయా ఈసా. అతఁడిహపరలోకములందు కీర్తిపరుఁడై దేవుని సాన్నిధ్యవర్తులలో నొకఁడై యుండును.

పొత్తిళ్ళలో నున్నపుడును, పెద్దవాఁడైనపుడును గూడ నాతఁడు మనుష్యులకు హితము బోధించును. అతఁడు న్యాయవంతులలో నొకఁడై యుండును" అనుమాటలను జ్ఞాపకముంచుకొనుము.

ఆమె "ప్రభువా! నేను కన్యనై పురుషస్పర్శ లేనిదే పుత్త్రివతి నెట్లగుదును" అన నాతఁడు "ఇట్లే యగును. దేవుఁడు తన కిష్టమైనదానిని సృజింపఁగలఁడు. తన కొకవస్తువు చేయవలెనని యున్నచో "కమ్ము" అనఁగనే యది యగును" అనెను.

ఆతఁడాతని కాగ్రంథమును బోధించి, బుద్ధిని, ధర్మమును, సువార్తను బ్రసాదించును.

అతఁడిస్రాయేలుపుత్త్రులకుఁ బ్రవక్తయగును. "మీప్రభువునుండి యానవాలుతో నిదిగో వచ్చియున్నాను. మట్టితో మీ కొకపక్షిని జేసెదను. నేను దానిలోని కూపిరివిడువఁగనే యది జీవము గలదగును. అంధులను, కుష్ఠరోగులను బాగుచేసెదను. దేవునియనుమతిచొప్పున మృతులకు చైతన్య మొసగెదను. మీ రేమిభుజింతురో, మీగృహములలో నేమిదాచికొందురో దానిని మీతోఁ జెప్పెదను. మీరు విశ్వాసుల రైనచో దీనియందే మీ కొకసూచన యున్నది.

నాకు పూర్వము చెప్పఁబడినధర్మమును స్థిరీకరించుటకును, నిషేధింపఁబడినదానిలో తిరిగి కొంత మీ కనుమతించుటకును, నేను వచ్చియున్నాను. నేను మీప్రభువునుండి యొకసూచనను తీసికొని వచ్చియున్నాను. దేవునికి భయపడి నన్ను మన్నింపుఁడు.

50. సత్యముగా దేవుఁడు నాకును మీకును ప్రభువు. కావున నాతని పూజింపుఁడు. ఇదియే క్రమపథము'' అని యాతఁడు పల్కెను.

ఈసా వారియవిశ్వాసమును జూచి, "దేవునితోఁగలసి నా కెవ్వరు సహాయకు లయ్యెదరు" అనఁగా ప్రవక్తలు "మేము దేవునికి సహాయకుల మయ్యెదము. మేము దేవుని నమ్మియున్నాము. దృఢ భక్తులమైనందుకు నీవు సాక్షిగా నుండుము.

ప్రభువా! నీవుపంపినదానిపై మాకు విశ్వాసము గలదు. మేము నీప్రవక్త ననుసరించెదము. అతనికి సాక్షులగువారితోఁబాటు మాపేళ్ళనుగూడ లిఖింపుము'' అనిరి.

యహూదీలు కుట్రపన్నిరి. దేవుఁడు తనపన్నాగమును బన్నెను. పన్నాగములఁబన్నువారిలో దేవుఁడే మిక్కిలిసమర్థుఁడు.

అధ్యాయము 6.

దేవుఁడు "ఈసా! నిశ్చయముగా మమ్ము మృతులఁజేసి మా యొద్దకుఁ జేర్చి యవిశ్వాసకులనుండి విడఁదీసెదము. రక్షణదినము వఱకును, అవిశ్వాసులకంటె, నిన్ననుసరించువారి నధికులఁ జేసెదము. పిదప మీరు నాయొద్దకే వత్తురు. అప్పుడు మీ వివాదములఁ దీర్చెదను.

నమ్మనివారి కిహపరలోకములయందు ఘోరశిక్ష విధించెదను. వారి కెవ్వరు నడ్డుపడఁ జాలరు" అనినమాట జ్ఞాపకముంచుకొనుము.

విశ్వాసులై క్రమవర్తను లగువారి కాతఁడు తగినబహుమాన మిచ్చును. దేవుఁడు దుష్టులను బ్రేమింపఁడు.

ఈయానవాళ్ళను భయసూచనను నీకుఁ జూపఁగలను. నిశ్చయముగా దేవుని సన్నిధిని ఈసా ఆదామువంటివాఁడే. అతనిని మట్టి నుండి సృజించి "కమ్ము" అనఁగనే యాతఁడు రూపముఁ దాల్చెను.

ఇది నీప్రభువు చాటినసత్యము. కావున శంకావిలులతోఁ జేరకుము.

60. నీకు ‘ జ్ఞానము ’ కలిగినపిదప నాతనిగూర్చి యింకను సందేహపడువారితో “రండు! మీపుత్త్రులను మాపుత్త్రులను, మీ భార్యలను మాభార్యలను, మమ్మును మిమ్మును బిలిచెదము. అసత్యము పల్కినవారిపై దేవుని కాగ్రహము కలుగుఁగాక!

ఈచెప్పినది సత్యము. దేవుఁడుతప్ప నితరదైవము లేఁడు. నిశ్చయముగా దేవుఁడు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు.

కాని, వారు వెనుదిరిగినచో దేవుఁడు దుష్టవర్తనులఁ దెలిసికొనియే యుండును.

## అధ్యాయము 7.

“గ్రంథము ననుసరించుజనులారా! మీకును మాకును వివాదము తీరఁగలదు. రండు! మేము దేవునితప్పనితరులఁ బూజింపము. అతనితో నితరదైవములఁ జేర్పము” అనుము. వారు వెనుదిరిగినచో “మేము దృఢభక్తుల మగుటకు మీరే సాక్షులు.

గ్రంథము ననుసరించుజనులారా! ఇబ్రాహీమునకు పిదపఁ గాని, ధర్మమును, తౌరాత్ సువార్తయు, ఇంజీల్ పంపఁబడకుండినప్పుడాతనిగూర్చి యేల వివాదపడెదరు? మీకు బోధపడలేదా?

ఇదిగో తెలిసినదానికొఱకే మీరు తగవులాడుచున్నారు. తెలియనిదానివిషయమై యేల వివాదములు సల్పెదరు. దేవుఁడు సర్వజ్ఞుఁడు. మీ రజ్ఞానులరు.

ఇబ్రాహీము యహూదీకాఁడు. నసారీయునుగాఁడు. కాని యాతఁడు దృఢభక్తియుతుఁడు. అతఁడు దేవునితో నితరదైవములఁ జేర్చినవారిలోనివాఁడు గాఁడు.

మనుష్యులలో నిబ్రాహీమునకు దగ్గఱచుట్టములును, ప్రవక్తయగు ముహమ్మదును, అతని నమ్మినవారును నాతని నిశ్చయముగా ననుసరింతురు. దేవుఁడు విశ్వాసులరక్షకుఁడు.

గ్రంథావలంబులలోఁ గొందఱు మిమ్ము తప్పుత్రోవఁ బెట్ట నభిలషింతురు. కాని వారే తప్పుత్రోవలోఁ బడుచు దానిని దెలిసికొనలేకుందురు.

గ్రంథము ననుసరించుజనులారా! దేవునిసూచనల మీరే చూచియుంటిరిగదా! వానిని మీ రేల నమ్మరు?

70. గ్రంథావలంబులారా! సత్యము నసత్యముతో నేల కప్పిపుచ్చెదరు? తెలిసియు సత్యము నేల దాచెదరు?" అనుము.

అధ్యాయము 8.

గ్రంథమును నమ్మినవారిలో మఱి కొందఱు "విశ్వాసులకుఁ బంపఁబడినదానిని దినారంభమున నమ్మి, దినాంతమున నమ్మకుఁడు.

మీమతము ననుసరించినవారినే విశ్వసింపుఁడు" అందురు. వారిట్లే వెనుకంజ వైచెదరు. వారితో, "దేవుఁడు చూపినదే సరియైనమార్గము. మీకుఁ జెప్పినదానివంటిదానినే యితరులకును జెప్పవలయును. అయినను నీప్రభునిసన్నిధానమున వారు నీతో నేల తగవులాడెదరు? దేవుఁడు కావలసినవరముల నొసగ సమర్థుడు. అతఁడు వానిని తనయిచ్ఛవచ్చినవారి కిచ్చును. దేవుఁడు పరమధార్మికుఁడు, బుద్ధుఁడు.

దేవుఁడు మహాదాత. అతఁడు తనయిచ్ఛవచ్చినవారియెడల దయఁజూపును" అని యనుము.

గ్రంథావలంబులలోఁ గొందఱు తమకు వేయిబంగారునాణెముల నిచ్చినను తిరిగి నీకప్పగించునంతటినమ్మకము గలవారు. మఱి

కొందఱు నీవొకనాణెము నిచ్చినను నీవు వెంటనే యడుగకున్నచో తిరిగి నీధనము నప్పగింపని విశ్వాసహీనులు. వీరు, " అజ్ఞానవంతుల యెడ మే మేల నమ్మకము గలిగి ప్రవర్తింపవలెను ? వారు దేవుని గూర్చి యసత్యములఁ బల్కుదురు. అట్లు పల్కుచుంటిమని వారికిఁ దెలియును" అని యందురు.

కాని, తానొప్పుకొనినపనిని తప్పక చేయుచు దేవునికి భయ పడువాని నాతఁడు ప్రేమించును.

కొంచెపువెలకై దేవునికొఱ కొప్పుకొనినపనులను, తమ ప్రమాణములను, అమ్మకొనినవారికిఁ బరలోకమునఁ దావు దొరకదు! రక్షణదినమున దేవుఁడు వారితో భాషింపఁడు. వారిని జూడనైనఁ జూడఁడు. వారిని స్పృశింపనైన స్పృశింపఁడు. వారికి ఘోరశిక్ష సంప్రాప్తమగును.

వీరిలో మఱికొందఱు దైవగ్రంథములోని వాక్యములను తార్మారుచేసి సత్యవాక్యములవలెఁ గనఁబడఁజేయుదురు. కాని యదిగ్రంథస్థమైనది కాకయుండును. వారు 'ఇది దేవుఁడు పల్కినది' అందురు. గాని యది దైవప్రోక్తము గాదు. వారు దేవునివిష యమై యసత్యములాడుచున్నారని తెలిసియు నట్లు చేయుదురు.

దేవునినుండి పవిత్రగ్రంథములను, బుద్ధిని, భవిష్యజ్జ్ఞానమును బడసియు మనుష్యుఁడు తనయనుచరులతో "నన్ను దేవుని గూఁడ బూజింపుఁ" డని చెప్పుట పాడిగాదు. "మీరు దైవవిషయ మున సంపూర్ణులరు కండు. మీకుఁ బవిత్రగ్రంథములు దెలి యునుగదా! వానిని బాగుగఁ జదివియున్నారుగదా!" యని చెప్పుట యుచితము.

దేవతలనుగాని, ప్రవక్తలనుగాని, మీరు ప్రభులనుగాఁ జేకొనుఁడని దేవునియాజ్ఞ కాదు. ఏమి! మీభక్తి నిశ్చలమైనపిదప, గూడ నాతఁడు మి మ్మవిశ్వాసులఁ గమ్మనునా ?

## అధ్యాయము 9.

80. దేవుఁడు తనప్రవక్తలతో నొడంబడిక చేసికొనునప్పుడు వారితో "ఇదిగో నేను మీకిచ్చుచున్న గ్రంథమును, జ్ఞానమును, మీతో నిదివఱకే యున్న పవిత్రగ్రంథములను స్థిరపఱుచుట కిఁక మీఁద మీయొద్ద కొకప్రవక్త రాఁగలఁడు. మీ రతనిని విశ్వసించి ఆతనికి సహాయము చేయవలయును. మీరట్లు చేయుటకు నిశ్చయించుకొని నారా? ఈమరతులపై నీ మొడంబడిక నొప్పుకొందురా?" అని యడుగ వారు "మేము నిశ్చయముగ నొప్పుకొందు" మనిరి. అప్పు డాతఁడు "మీరు సాక్షులుగ నుండుఁడు. మీతోఁబాటు నేనును సాక్షిగా నుండెదను.

ఇందుపై వెనుదిరిగినవారు దుష్టులగుదు" రనెను.

వారికి దేవునిమతము గాక యితరమతము గావలెనా? స్వర్గమర్త్యములయం దన్నియు నాతనియెడ నమ్రత్వము వహించును. వారి కిష్టమైనను నిష్టములేకున్నను సరే, యవి యన్నియుఁ దిరిగి యాతనియొద్దకే చేరును.

"మేము దేవుని నమ్మెదము. ఇబ్రాహీము, ఇస్మాయేలు, ఇసాకు, యాకూబు, ఆయాజాతులవారు, వీరికిఁ బంపఁబడినదానిని, మూసా, ఈసా, అనుప్రవక్తలను, వీరు తమప్రభువునుండి స్వీకరించిన దానిని, మేము విశ్వసింతుము. మేము వారిలో వారికి భేదములఁ గల్పింపము. మే మాతనికే యధీనులమైయున్నాము.

ఇస్లాముతప్ప మఱియొకమత మెవరైనఁ గోరినచో నామత మంగీకరింపఁబడదు. అట్టివారు పరలోకమునందు నష్టులైనవారిలోఁ జేరుదురు.

ప్రవక్త సత్యవంతుఁ డని తెలిసికొని నమ్మి, యాతనినుండి స్పష్టములగుసూచనలం గొని, విశ్వాసహీనులయినవారిని దేవుఁ డెట్లు

రక్షింపఁగలఁడు? ధర్మము నుల్లంఘించినవారిని దేవుఁడు రక్షింపఁడు.

దేవునియు, దేవతలయు, మనుష్యులయు శాపము వీరి దగులును. వారు శాపోపహతులై చిరకాల ముందురు. వారిబా యిసుమంతయుఁ దగ్గదు. ఇటుపైని పశ్చాత్తప్తులై,

క్రమమార్గమును బట్టినవారిని తప్ప నితరులను దేవుఁడు చూడనైనఁ జూడఁడు. నిశ్చయముగా దేవుఁడు దయాళుఁడు; కరుణామయుఁడు.

మొదట నమ్మి, పిదప నవిశ్వాసులై, యాయవిశ్వాసమును వృద్ధిపఱుచుకొనువారి పశ్చాత్తాప మంగీకరింపఁబడదు. వీరే తప్పు త్రోవఁ బట్టినవారు.

90. అవిశ్వాసులై మృతినొందినవారు భూమిలో నున్న బంగార మంతయు పరిహారముక్రింద నిచ్చినను అంగీకరింపఁబడదు. వీరికి ఘోర శిక్ష రానున్నది. వీరి కెవ్వరును సహాయము చేయఁజాలరు.

# కాండము. 4

## అధ్యాయము 10.

నీకు ప్రేమాస్పదమైనదానిని భిక్షగా నిచ్చినఁగాని మంచి వాఁడ వెన్నటికిఁ గానేరవు. నీవొసగునదంతయు దేవునికి యథార్థ ముగఁ దెలియును.

శాసనము (తౌరాత్) రాకపూర్వము ఇస్రాయేలు తనకుఁ దాను నిషేధించుకొనినదితప్ప, మనుష్యుల కన్నివిధములగు నాహారము నంగీకరింపఁబడినది. 'మీరు సత్యవంతులరైనచో నాశాసనము (తౌరాత్) ను దెచ్చి చదువుఁడు' అనుము.

ఇఁక దేవునిగూర్చి యసత్యము కల్పించినవారే దుర్మార్గులు.

"దేవుఁడు సత్యముఁబల్కును. కావున, దృఢభక్తియుతులరై, దేవునితో నితరదైవములఁ జేర్పకుండిన ఇబ్రాహీము ననుసరింపుఁడు.

మనుష్యులకొఱకు తొలుదొల్త కట్టఁబడినదేవాలయము "బెక్కా" లో నున్నది. అది ధన్యము; మనుష్యులకు మార్గప్రదర్శకము.

దానియందు స్పష్టములగు సూచనలున్నవి. అచట ఇబ్రాహీము నిలిచియుండినస్థలమునుండి యన్నియూనవాళ్ళు నున్నవి. అచటఁ బ్రవేశించినవాఁడు సురక్షితుఁడై యుండును. అంతవఱకుఁ బ్రయాణము చేయఁగలవారి కందఱికి నాదేవాలయము యాత్రాస్థలముగా విధింపఁబడియున్నది. సరే, యిఁక నమ్మనివారిమాట యెందుకు? దేవుని కేజీవులతోడను జోక్యము లేదుగదా!

గ్రంథావలంబకులారా! దేవునిసూచనల నేల నమ్మరు? దేవుఁడు సర్వసాక్షి!

గ్రంథానుసారులారా! దైవమార్గమునుండి విశ్వాసుల నేల తప్పించెదరు. మీరు దానిని వంకఱగఁ జేసియుఁ జూచుచుందురు. కాని, దేవుఁడు మీరు చేయుదానిని చూడక యుండఁడు.

విశ్వాసులారా! పవిత్రగ్రంథమును స్వీకరించినవారిలోఁ గొందఱిని మీ రనుసరించిన మీరు భక్తులయినవెంటనే వారు మిమ్మవిశ్వాసులఁ జేసెదరు.

100. దేవునిసూచన లన్నియు మీకుఁ దెలుపఁబడియుండఁగా, నాతనిప్రవక్త మీయందే యుండఁగా, మీ రవిశ్వాసు లెట్లు

కాఁగలరు ? దేవునే పట్టుకొని నిలిచినవాఁ డప్పుడే క్రమపథమును బట్టి యున్నాఁడు.

## అధ్యాయము 11.

విశ్వాసులారా ! దేవునికి భయపడవలసినరీతిగా భయపడుఁడు. మీరు నిశ్చలభక్తులుగానిదే మృతినొందకుఁడు.

మీరందఱును దేవునిసూత్రమును గట్టిగాఁ బట్టుకొని యుండుఁడు. దానిని విడిచిపెట్టకుఁడు. పూర్వ మొండొరులకు శత్రువులుగా నున్నమీహృదయముల నైక్యముచేసి, తనప్రసాదమున మిమ్ము సోదరులఁగా నొనర్చినదేవునిదయను మఱువకుఁడు. అగ్నికుండమునఁ బడనున్నప్పుఁడు మి మ్మాతఁడు దానినుండి మఱల్చినాఁడు. మీరు సరియైనరక్షణను పొందుటకు,

సన్మార్గములోనికిఁ బిలుచువారును, న్యాయమును విధించువారును, అన్యాయమును నిషేధించువారును, మీలోఁ గొందఱుండు రుగదా యని, దేవుఁడు తనసూచనల నీరీతిగా స్పష్టపఱుచుచుండును. వీరికి శ్రేయస్సు కలుగును.

తమలోఁదాము కక్షల వహించి, స్పష్టములగుసాక్ష్యములను జూచియు తగవులాడువారివలె మీరుండకుఁడు.

అట్టివారికి మొగములు తెల్లఁబోయి, పిదప నల్లఁబడినదినమందు ఘోరశిక్ష కలుగనున్నది. మొగములు నల్లబడువారికి......... "ఏమి, విశ్వసించియు నవిశ్వాసకులైరా ? మీరు నమ్మనందులకు శిక్ష గొంత రుచిచూడుఁడు" అని చెప్పఁబడును.

మొగములు తెల్లబాఱినవారు దేవునికరుణకుఁ బాత్రులై శాశ్వతముగ ననుగ్రహింపఁబడుదురు.

ఇవి దేవునిసూచనలు ; మేము మీకు వానిని సత్యముగ దెలుపుచున్నాము. దేవుఁడు మనుష్యజాతి కన్యాయముఁ జేయఁడు.

స్వర్గమర్త్యములయందున్నదంతయును దేవునిదే. అన్నియును దేవునియొద్దకే మఱలి పోవును.

అధ్యాయము 12.

మనుష్యజాతికై యుద్ధరింపఁబడినవారిలో మీరు శ్రేష్ఠులు, మీరు న్యాయమును విధించి, దౌష్ట్యమును నిషేధించి, దేవుని నమ్మి యున్నారు. గ్రంథావలంబకులు విశ్వాసులైనచో వారి కెంతయు శ్రేయస్సు కలుగును. వారిలో విశ్వాసు లున్నారుగాని, చాలమంది దుర్మార్గులు.

110. వారు మీ కెట్టినష్టమును గలిగింపఁజాలరు. వారు మీతో యుద్ధముచేసి వెనుచూపుదురు. వారి కెట్టిసహాయమును గలుగఁ బోదు.

వారు దేవునితోడను, మనుష్యులతోడను, సఖ్యము నెఱపనిచో నెక్కడనున్నను వారు లజ్జాముద్రాంకితు లగుదురు. వారు దేవుని యాగ్రహమునకుఁ బాత్రులై, మొగములపై దారిద్ర్యముద్ర ధరించి యుందురు. వారు దేవునిసూచనల విశ్వసింపక, యన్యాయముగఁ బ్రవక్తలఁ జంపి, తిరుగుబాటుచేసి, ధర్మపథము నుల్లంఘించుటచేతనే వారి కిట్టియనుభవము కలుగును.

అయినను నందఱు నొక్కరీతివారు కారు. గ్రంథావలంబకులలో రాత్రిపూఁట దేవునిసూచనలఁ బఠించి పూజలసల్పు న్యాయవంతులును గలరు.

వారు దేవునియందును, తుదిదినమందును నమ్మకము గలిగి, న్యాయమును విధించి, పాపమును బరిహరించి, శీఘ్రముగ సత్కార్యముల నాచరించుచుందురు. వీరే పుణ్యవంతులు.

మీ రాచరించుసత్కార్యములకు ఫలమును మీరు పొందక పోరు. తనకు భయపడువారిని దేవుఁడు గుర్తించియున్నాఁడు.

అవిశ్వాసులధనమును, సంతతియు, దేవుని కెందుకును బనికి రావు. వారు నిరంతర మగ్నిజ్వాలలో వాసముచేయఁగలరు.

వా రిహమునఁ బెట్టుభిక్షము తమకుఁ దా మన్యాయముగ వర్తించువారిసస్యములపైఁబడి ధ్వంసమొనర్చు చలిగాలివంటిది. దేవుఁడు వారి కేయన్యాయమును జేయఁడు. వారికివారే యన్యాయముఁ జేసికొనుచున్నారు.

విశ్వాసులారా! మీలోమీరె కాక యితరులతో సఖ్యము నెఱపకుఁడు. వారు మిమ్ము కలుషాత్ములఁ జేయకమానరు. వారు మీవినాశముకొఱ కెదురు చూచుచున్నారు. వారినోటినుండి యసూయ బయలువెడలియే యున్నది. వారిహృదయములయందు దాగియున్న దింతకంటె దుఃఖావహము. మీరు బోధపఱుచుకొనినచో దానిచిహ్నములను మీ కిప్పుడే తెల్పియున్నాము.

చూడుఁడు! మీరు వారిని ప్రేమింతురు గాని, వారు మిమ్ముఁ బ్రేమింపరు. మీరు సర్వగ్రంథమును నమ్మియున్నారు. వారు మిమ్ముఁ గలిసికొనినప్పుడు 'నమ్మియున్నా' మందురు కాని, వీడియున్నప్పుడు కోపముతో మీవైపుచూచి, కొనవ్రేళ్ళను గఱచు కొందురు. "అయిన మీకోపములో నశింపుఁడు" అనుము. మీహృదయములలోని మూలమూలలు దేవునికిఁ దెలియును.

మీకు మేలుకలిగినచో వారు దుఃఖింతురు; కీడైనచో సంతసింతురు. మీరు స్థిరచిత్తులరై దేవునికి భయపడినచో వారికుట్ర మిమ్మేమియుఁ జేయఁజాలదు. దేవుఁడు వారికర్మలచుట్టు నావరించుకొని యున్నాఁడు.

## అధ్యాయము 13.

120. నీవు ఉషఃకాలముననే యిల్లు విడిచి, యుద్ధమునకు స్థలము బాగుచేయనున్నప్పుడు, దేవుఁ డాసంగతి తెలిసికొనెను.

మీలో నిరువురు సైనికులు మనస్సున కలవరపడి ధైర్యమెడలి యున్నప్పుడు దేవుఁడు వారిద్దఱిని రక్షించెను. దీనిని జ్ఞాపకముంచుకొనుము. విశ్వాసులు దేవునే నమ్మియుందురుగాక!

బదరునొద్ద మీరు బలముచాలక యున్నప్పుడింతకుముం దొకసారి దేవుఁడు మిమ్ముఁ గాపాడి యున్నాఁడు. కావున, మీరు కృతజ్ఞులరై దేవునికి భయపడుఁడు.

అప్పుడు నీవు విశ్వాసులతో, "స్వర్గమునుండి మూఁడువేల మంది దేవతలను బంపి దేవుఁడు మీకు సహాయపడుట చాలదా?" అంటివి.

ఔను, కాని, నీవు చలింపక దేవునికి భయపడియున్నచో, నీశత్రువు తీవ్రముగ నీపైఁబడినప్పుడు దేవుఁ డైదువేలమంది దేవతలను వారివారిచిహ్నములతో మీసహాయమునకు బంపును.

శక్తిమంతుఁడు బుద్ధుఁడు నగుదేవుఁడే విజయము చేకూర్పఁగలవాఁడు. మీహృదయములకు నమ్మకము గలిగించుటకును,

నమ్మనివారిలో చాలమంది నంతమునొందించుటకును, లేదా వారిని బడఁదోసి మఱి సహాయములేకుండ నపజయము చేకూర్చుటకును, దేవుఁ డీసువార్తను మీకుఁ బంపియున్నాఁడు.

వారు దుష్టాత్ములు. కావున వారి నతఁడు దయదలఁచి విడుచుటనుగూర్చియు, శిక్షించుటనుగూర్చియు, నీ కేప్రసక్తియు లేదు.

స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవునిదే. అతఁడు తన యిచ్చవచ్చినవారి ననుగ్రహించి యిచ్చవచ్చినవారిని శిక్షించును. దేవుఁడు క్షమావంతుఁడు; దయాపరుఁడు.

## అధ్యాయము 14.

విశ్వాసులారా! వడ్డికి వడ్డి పెంచి దిగమ్రింగకుఁడు. మీరు శ్రేయఃకాములరైనచో దేవునికి భయపడుఁడు.

130. అవిశ్వాసులకై యేర్పఱుపఁబడిన యగ్నికి భయపడుఁడు.

మీ రాతనిదయ సంపాదించుటకు దేవుని, నతనిప్రవక్తను మన్నింపుఁడు.

దేవునిక్షమాపణకొఱకును, దైవభీతిపరులగువారికి సిద్ధపఱుపఁబడి స్వర్గమర్త్యములంతగా విస్తరించియుండు భోగభూమికొఱకును, నొండొరులతో స్పర్ధ వహించి యుండుఁడు.

జయమునందును నభివృద్ధియందును నొక్కతీరుననే భిక్షము నొసగి, తమకోపమును స్వాధీనముచేసికొని, యితరుల క్షమించుచు, సత్కార్యాచరణదీక్ష బూనినవారిని దేవుఁడు ప్రేమించును.

ఒకదుష్కార్యమునుగాని, తమయాత్మల కేయపచారమునుగాని, యొనర్చినను దేవునిస్మరించి యతనిని క్షమింపవేఁడి, మఱి యాదుష్కృతి నాచరింపనివారికి,

ప్రభువు క్షమయు, నదులు ప్రవహించునుద్యానవనములలో స్థిరవాసమును, బహుమానములు. దేవుఁడుతప్ప పాపముల క్షమింప నెవ్వఁడు సమర్థుఁడు? కష్టపడువారికి మంచిలాభము కలుగును.

ముందే మీ కుదాహరణములు కల్పింపఁబడియున్నవి. కావున దేశసంచారము గావించి, మీకుఁ బూర్వము ప్రవక్తల నసత్యవంతులుగాఁ బరిగణించినవారిగతి యేమయ్యెనో యారయుఁడు.

ఈ కురాను మానవులకు జ్ఞాపకగ్రంథము. దైవభీతిపరులకు మార్గదర్శకము. భయసూచన.

ధైర్యము వీడకుఁడు. విచారింపకుఁడు దేవునికి భయపడినచో మీచేయియే మీఁదిదగును.

మీకు గాయముతగిలినచో నంతకుఁబూర్వమే యితరుల కట్టి గాయము తగిలి యుండును. విశ్వాసు లెవ్వరో తెలిసికొనుటకును, మతముకొఱకు ప్రాణముల నర్పింపఁగలవారిని మీలోనుండి యెన్ను కొనుటకును,

140. విశ్వాసులను శోధించి యవిశ్వాసులను నాశనముచేయుట కును, దేవుఁడు జయాపజయముల నొకదాని వెనుక నొకటిగఁ బంపుచుండును. దేవుఁడు దుర్మార్గులను ప్రేమింపఁడు.

మీలో ధైర్యముతోఁ బోరాడినవా రెవరో, యోర్పుతో సహించియున్నవా రెవరో కనుగొనకయే దేవుఁడు మిమ్ము భోగ భూమిని ప్రవేశింపనిచ్చుననుకొంటిరా ?

మృత్యువాసన్నముకానిదే మీరు మృత్యువును గోరియున్నారు. కాని, యిప్పుడు కన్నులయెదుట దానిని జూచి పరుగులిడుచున్నారు.

అధ్యాయము 15.

ముహమ్మదు కేవల మొకప్రవక్తయే. అతనికిపూర్వ మట్టి ప్రవక్తలెందఱో గతించిరి. అతఁడు మృతినొందినను, చంపఁబడినను, మీ రేల వెనుదిరిగి పాఱిపోవలయును? పాఱిపోయినవాఁడు దేవుని కేహానియుఁ జేయఁజాలఁడు. కృతజ్ఞులగువారిని దేవుఁడు తప్పక బహూకరించును.

మనుష్యుని జీవితపరిమితిని నిర్ణయించుగ్రంథముప్రకారము దేవునియనుజ్ఞ లేనిదే యెవ్వరును మృతినొందఁజాలరు. ఇహలోక ఫలము గోరువారి కిహలోకఫలమును, పరలోకఫలము గోరువారికిఁ బరలోకఫలమును నొసగెదము. కృతజ్ఞులనుతప్పక బహూకరింతుము.



లక్షోపలక్షలమందితో ప్రవక్తలు విగ్రహములు సల్పిరి.

అయినను దైవమార్గమున వారికి సంభవించినదానితో వారధైర్య పడలేదు. బలహీనతఁ జూపలేదు. శాంతముగ లొంగిపోలేదు. ఓర్పు గలిగియుండువారిని దేవుఁడు ప్రేమించును.

వారును "ప్రభువా ! ఈ మాపనిలో మాపాపములను తప్పులను క్షమింపుము. మాకాళ్ళకు స్థిరత్వము నొసగుము. అవిశ్వాసులపై మాకు సహాయపడుము" అనిరే కాని యంతకెక్కుడుగ నేమియు ననలేదు.

దేవుఁ డిహపరలోకఫలములనొసగెను. మంచికార్యములను జేయువారిని దేవుఁడు ప్రేమించును.

## అధ్యాయము 16.

విశ్వాసులారా ! మీ రవిశ్వాసులను మన్నించినచో మిమ్ము వారు వెనుదిరుగఁజేసి తిరిగి నరకమునఁ బడఁద్రోయుదురు.

కాని దేవుఁడు మీప్రభువు. సహాయకులలో నాతఁడు శ్రేష్ఠుఁడు.

150. అనుమతిలేనిదే, దేవునితో దేవతలను సమానులనుగాఁ జేసినందు కవిశ్వాసులహృదయములందు భయోత్పాతములఁ గలుగఁ జేసెదము. వారి కగ్నియే వాసస్థానమగును. దుష్టవర్తనులగృహము దుఃఖావిలమైయుండును.

దేవుని యనుమతిచొప్పున మీ రెప్పుడు శత్రువుల నిర్జించితిరో, యప్పుడే దేవుఁడు తనవాగ్దానమును నెఱవేర్చికొనినాఁడు. కాని, హృదయములందు దౌర్బల్యముచేరినది. అతనియనుజ్ఞఁగూర్చి వివాదపడినారు. మీ ప్రవర్తక మీరు కోరినదానిని మీమొదుటికిఁ దెచ్చినను, దేవుని మీరు మన్నించినారు కారు. మీలోఁ గొంద ఱిహలోకమును, గొందఱు పరలోకమును, గోరుచున్నారు. పిదప మిమ్ము శోధించుటకు వారినుండి మిమ్ము పరుగెత్తఁజేసినాఁడు. కాని, దేవుఁడు విశ్వాసులయెడ నపారదయావంతుఁడు.

మీ ప్రవక్త మీ వెనుక నిలిచియుండి యుద్ధమునకుఁ బ్రేరేపించు చుండ మీరు కొండనెక్కి యెవ్వరిని సరకుగొనకుండ నున్నప్పు డాతఁడు మిమ్ము క్షమించినాఁడు. మీరు మీధనమును గోల్పోయిన దానికిని, మీకు సంభవించినదానికిని వగవకుండఁ జేయుటకును నాతఁడు మీకు కష్టపరంపరలఁ గల్పించినాఁడు. దేవునికి మీకృత్యములన్నియుఁ దెలిసియే యున్నవి.

ఇట్లు మీకుఁ గష్టములను దెచ్చి పెట్టినపిదప దేవుఁడు మిమ్ము సురక్షితముగ నుంచినాఁడు. మీలోఁ గొందఱు నిద్రావశులై యుండిరి. తక్కినవారు మోహపరవశులై యజ్ఞానముచే దేవునివిషయమై యన్యాయాలోచనలఁ గలిగియుండిరి. 'ఇందువలన మా కేమిలాభ' మని వారనిరి. "ఇదియంతయు దేవునియధీన" మనిచెప్పుము. "మాకిందులో నేదైనలాభము కలుగనున్నచో మాలో నెవ్వరును నిచట మృతినొందకుండియుందురు'' అనుచు వారు పైకొకటి చెప్పి లోన నొకటి దాచికొనిరి. దేవునికి హృదయమర్మములన్నియుఁ దెలిసియే యున్నవి. మీ రిండ్లలోనే యుండిపోయినను, మీలో నిచట చచ్చిపోవ నను శాసింపఁబడినవా రిప్పుడున్నచోట్లకే పోయి యుందురు. అచట దేవుఁడు మీహృదయములను శోధించి యం దేమి కలదో తెలిసికొనియేయుండును" అనుము.

యుద్ధమున సేన లొండొరులం దాఁకినదినమున మీరు గావించినదానిని గనిపెట్టి మీమీధర్మముల ననుష్ఠింపనీకుండఁ జేసినవాఁడు సత్యముగ సైతానే కాని, యిప్పుడు దేవుఁడు వారిని క్షమించినాఁడు. దేవుఁడు క్షమాయుతుఁడు, దయాపరుఁడు.

## అధ్యాయము 17

విశ్వాసులారా! ప్రయాణముఁజేసికాని, యుద్ధమునకు వెడలి

కాని, యున్నసోదరులంగూర్చి "వారు మాతోడనే యుండియున్నచో మృతినొందకుండియుందురు; చంపఁబడక యుండియుందురు'' అని పల్కు నవిశ్వాసులవలె నుండకుఁడు. ఈవిషయమై వారికి హృదయ విచారము కలుగవలెననియే దేవుఁ డుద్దేశించినాఁడు! దేవుఁడు పుట్టింప గిట్టింప సమర్థుఁడు; దేవుఁడు మీకార్యములను జూచుచునే యున్నాఁడు.

మీరు దేవునిమార్గమునఁ జంపఁబడినను, చచ్చినను నది మీయార్జన లన్నిటికంటె శ్రేష్ఠము.

మీరు చచ్చినను జంపఁబడినను దేవునిసొద్దకే చేరఁగలరు.

దేవునిదయనుగూర్చి నీవు వారితో సాధువాద మొనర్చితివి. నీవు కఠినహృదయుఁడవై తీక్ష్ణతఁ జూపినచో వారు నిన్ను వదలివెళ్ళి యుందురు. కావున వారిని క్షమించి, వారికొఱకు క్షమాపణవేఁడి, యుద్ధవిషయమై వారియభిప్రాయములఁ గనుగొని, నీవు నిశ్చయించు కొనినపిదప, దేవుని విశ్వసించియుండుము. తన్ను నమ్మినవారిని దేవుఁడు ప్రేమించును.

దేవుఁడు మీకు సహాయపడినచో మి మ్మెవ్వరును జయింపఁ జాలరు. అతఁడు మిమ్ము వర్జించి వెడలియున్నప్పుడు మీకెవరు సహా యముఁజేయఁగలరు? కావున విశ్వాసులు దేవుని నమ్మియుందురుగాక!

160. మిమ్ము మోసపుచ్చువాఁడు ప్రవక్త కాఁడు. ఆమోసగాఁడు తనమోసములతో రక్షణదినమున బయలువెడలును. అప్పుడు ప్రత్యాత్మయుఁ దనకు రావలసినఫలము ననుభవించియే తీరును. వారి కేయన్యాయమును గలుగఁబోదు.

దేవునియిష్టముచొప్పునఁ దిరుగువాఁడు, దేవునికోపమును గోరి

తెచ్చికొని నరకమున వసింపఁగలవానివలె నుండునా? అచటికిఁ బ్రయాణ మతిదుఃఖావహముగ నుండును.

దేవునికి చాలయంతరువులు గలవు. మీరు చేయుదానిని దేవుఁడు చూచుచున్నాఁడు.

దేవుఁ డిప్పుడు విశ్వాసులయెడ దయాపరుఁడై యున్నాఁడు. తమవారినుండియే యొకప్రవక్తను లేవఁదీసి, తనసూచనలను వారి యెదుటఁ గనఁబఱుపఁజేసి, వారిని శుద్ధాత్ములఁజేసి, గ్రంథమును, జ్ఞానమును నాతఁడు వారికిఁ బ్రసాదించెను. అంతకుఁబూర్వము వారు మిగుల పొరబడియుండిరి.

ఇంతకుపూర్వ మొరులకు చేకూర్చిన యపజయమువంటి యపజయము మీకును గలిగినప్పుడు 'ఇది యెచటినుండి వచ్చినది' అని మీ రడుగుదురు. 'దేవుని కన్నివస్తువులపైనను శక్తి కలదు. ఈ యపజయము మీరు తెచ్చికొనినదే' అని యనుము.

సైన్యములుఁ కలిసినదినమున మీకు కలిగినది, దేవుఁడు మీలో విశ్వాసు లెవ్వరో, కృత్రిము లెవ్వరో శోధించుటకు తెచ్చి పెట్టినది.

"నడువుఁడు. దేవునిమార్గమున యుద్ధముచేయుఁడు. శత్రువును బాఱఁద్రోలుఁడు" అనునాజ్ఞ వెడలినపుడు, వారు "మాకు యుద్ధము చేయుటయే తెలిసియుండిన మి మ్మనుసరించియుందుము" అనిరి. వారిలోఁ గొందఱు విశ్వాసమునకంటె నవిశ్వాసమునకే చేరువవైరి. వారిహృదయములలో లేనిదానిని పెదవులతో నుచ్చరించిరి! కాని, తా మింటఁగూర్చుండి తమసోదరులఁగూర్చి "వారు మాతోఁబా టుండిపోయినచో మృతి నొందకుండియుందురే" యను వారిరహస్యములను దేవుఁడు తెలిసికొనియే యున్నాఁడు. 'మీరు సత్యభాషు లైనచో మృత్యువునుండి తప్పించుకొనుఁడు.

దేవునిమార్గమునఁ జంపఁబడినవారు మృతినొంది రని తలంప వలదు. వారు తమప్రభువుతో జీవించియుండి, భాగ్యవంత మగు జీవనము జరిపెదరు.

దేవుఁడు తనదయాపారవశ్యముచే నొసగినదానికి సంతోషించుచు తమమార్గమునుబట్టియుఁ దమ్మింకను జేరనివారికొఱకు మోదమునొందుచునుందురు. వారి కేవిధమైనభయముగాని, దుఃఖము గాని కలుగఁబోదు.

170. వారు దేవునివరములచేతను, నతనిదయచేతను సంతోషపూర్ణులై యుందురు. విశ్వాసులై యున్నందుకు వారిఫలమును దేవుఁడు నశింపఁజేయఁడు.

## అధ్యాయము 18.

అపజయము నొందినను దేవుని, నతనిప్రవక్తను మన్నించువారును, సత్కార్యములంజేసి దేవునికి భయపడువారును, గొప్ప లాభమును బడయఁగలరు.

వారితో మనుష్యులు "ఇదిగో, మక్కావాసు లధికసంఖ్యాకులై మీపైకి దాడి వచ్చుచున్నారు. కావున వారికి భయపడుఁడు" అనినప్పుడు వారు తమవిశ్వాసమును మఱింత దృఢపఱిచికొని "మాకు దేవుఁడే చాలును. అతఁడు మమ్ము బాగుగఁ గాపాడఁగలఁడు" అనిరి.

కావున వారు దేవునిప్రసాదమును బడసి, యతనివలన భాగ్యవంతులై, యేయపాయమును బొందక తిరిగి వచ్చిరి. దేవుని కిష్టమైన దానినే వా రనుసరించిరి. దేవుఁడు మహాదాత.

సైతాను తనయనుచరులకువలె మీ హృదయములను భయపూరితములుగఁ జేయ నభిలషించును. మీరు వారికి భయపడ వలదు; విశ్వాసులైనచో నాకు భయపడుఁడు.

170. విశ్వాసములేక తామే ఘనులమని పంతమువైచికొనువారిని జూచి చింతిల్లకుము. నిశ్చయముగా వారు దేవుని కేమాత్రమును హానిచేయఁజాలరు. పరలోకజీవనమున దేవుఁడు వారికి పాలొసం గఁడు. ఘోరశిక్షయే వారికి గతి.

తమవిశ్వాసము నిచ్చి యవిశ్వాసమును గొనువారు దేవుని కేమాత్రమును హానిచేయఁజాలరు. ఘోరశిక్షయే వారికిగతి.

అవిశ్వాసులకు మే మొసగు చిరజీవిత్వము వారిమేలుకొఱకే యని తాము తలంపఁజనదు. వారు తమపాపములను వృద్ధిచేసికొను టకే వారి నంతకాలము జీవింపనిచ్చుట. వారికి లజ్జాకరమగుశిక్షయే గతి.

చెడ్డవారినుండి మంచివారిని విడదీయువఱకును విద్వాంసులను తాముండుచోటనే విడిచియుండుట దేవునియభిమతముకాదు. రహ స్యములను మీకుఁ దెలుపుట దేవునియభీష్టము గాదు. వానిని తెలు పుట కాతఁడు తనప్రవక్తలలో తనయిష్టమువచ్చినవారి నెంచికొనును. కావున దేవుని నతనిప్రవక్తలను నమ్మియుండుము. నీవు నమ్మి దేవు నికి భయపడినచో, నీకు గొప్పబహుమానము కలుగఁగలదు.

దేవుఁడు దయాపూర్ణుఁడై యొసగినది చాలదని గునియు వారి కది శ్రేయస్కరము కాదు. అది వారికి చెఱుపే. రక్షణదిన మున వారు దేనికై గునిసిరో, యదే కంఠమును జుట్టుకొను పట్టీవలె నుండును. స్వర్గమర్త్యముల వారసత్వ మాతనిదే. మీరుచేయునదం తయు దేవుని కెఱుక.

## అధ్యాయము 19.

180. "దేవుఁడు దరిద్రుఁడు. మేము ధనవంతులము" అని చెప్పువారి మాటలను దేవుఁడు వినినాఁడు. వారివాక్యములను

అన్యాయముగ ప్రవక్తలను వారు చంపుటయు, మేము తప్పక వ్రాసియుంచి "అగ్నిబాధను రుచిచూడుఁడు.

మీహస్తములతో మీరు ముందుగఁ బంపికొనినదాని కిది ఫలము. దేవుఁడు తనకింకరుల కన్యాయముచేయఁడు" అని యందుము.

"స్వర్గమునుండి దిగివచ్చునగ్నిని మ్రింగఁగల యాహుతిని గనఁబఱచినఁగాని యేప్రవక్తను నమ్మవలదని దేవుఁడు మాకువిధించి నాఁ" డని చెప్పువారితో "ఇంతకు పూర్వమే, మీరుచెప్పినపనిని, నింకననేకాద్భుతచర్యలను జేసిన ప్రవక్తలు మీయొద్దకు వచ్చియుండిరే! వారిని మీ రేలచంపితిరి? సత్యవంతులరైనచో నాకది చెప్పుఁడు" అనుము.

వారు నిన్నసత్యవంతునిగఁ బరిగణించినచో నింతకుఁబూర్వము ప్రవక్తలు తమసందేశమునకు స్పష్టమగు సాక్ష్యములను పవిత్రగ్రంథములను, జ్యోతిర్మయమగు గ్రంథమును దెచ్చినను నసత్యవచనులే యైరిగదా !

ప్రత్యాత్మయు మృత్యువును రుచిచూచి తీరవలయును. రక్షణ దినమున మీమీకర్మలకు ఫలములనే యనుభవింతురు. అగ్నినుండి తప్పి, భోగభూమిని జేరినవాఁడు సుఖియగును. ఇహలోకజీవనము కృత్రిమఫలదాయకము.

మీధనమువలనను మీవలనను మీరు గొప్ప శోధనలఁబొందుదురు. మీకు పూర్వము పవిత్రగ్రంథములఁ గొనినవారినుండియు దేవునితో సమానులుగ నితరదేవతలఁ జేర్చినవారినుండియు, మీరు తప్పక చెడ్డవార్తలను విందురు. మీరు స్థిరచిత్తులరై దేవునికి భయపడుచుండుటయే యిహలోకజీవనమునకు గావలసినది.

ఇదిగాక, దేవుఁడు పవిత్రగ్రంథములఁ గొనినవారితో నొడం

బడిక చేసికొని, "మీరు దీనిని దాచఁగూడదు. మనుష్యులకు చాటి చెప్పవలె" నని విధింపఁగా వారు దానిని వెనుకకు పాఱవైచి కొలఁది వెల కమ్మివేసిరి. వారమ్మినధనము పాపభూయిష్ఠము.

తాము చేసినదానికి సంతసించుచు, చేయనిదానికి స్తుతి నపేక్షించువారు శిక్షనుండి తప్పిపోదురని తలంపకుము. వారికి ఘోర శిక్ష సిద్ధముగా నున్నది.

స్వర్గమర్త్యాధిపత్య మంతయు దేవునిదే. దేవుని కన్నివస్తువుల పైనను శక్తిగలదు.

## అధ్యాయము 20.

జ్ఞానసంపన్నహృదయులై, నిలిచియున్నను, గూర్చుండియున్నను, ప్రక్కపై వ్రాలియున్నను, దేవుని స్మరించుచు, స్వర్గమర్త్యములసృష్టినే చింతించుచుండువారికి స్వర్గమర్త్యములసృష్టియందును రాత్రింబవళ్లొకదానివెంబడినొకటిగ వచ్చుచుండుటయందును, సూచనలు గలవు.

వారు "ప్రభువా! నీవు దీనిని వృథగా సృజించియుండ లేదు. నీవు కీర్తనీయుఁడ వగుదువుగాక! మ మ్మగ్నిబాధనుండి తొలఁగింపుము.

ప్రభువా! నీ వగ్నిలోఁబడఁద్రోయువారిని లజ్జాయుతులఁ జేసెదవు. దుర్మార్గుల కెవ్వరును సహాయపడరు.

ప్రభువా! మ మ్మెవరో పిలిచిరి. అతనిపిలుపు వినినాము. "మీరు ప్రభువును నమ్ముఁడు," అనుచు నాతఁడు మమ్ము భక్తిలోనికిఁ బిలిచినాఁడు. వెంటనే మేము విశ్వాసయుతుల మైనాము. ప్రభువా! మాపాపమును క్షమింపుము. దుష్టకర్మములను మమ్మునుండి దాఁచిపెట్టుము. పుణ్యవంతులతోఁబాటు మాకు మరణమును బ్రసాదింపుము.

ప్రభువా ! నీప్రవక్తలద్వారా మాకు నీవు వాగ్దానముచేసి దాని నిమ్ము. రక్షణదినమున మమ్ము లజ్జాన్వితులఁ జేయకుము. నీవ మాటతప్పనివాఁడవుగదా !" అని యందురు.

అప్పుడు వారిప్రభువు వారితో "మీలో పురుషుఁడైనను స్త్రీయైనను చేసినపనిని నష్టపఱుపము. మీలో నొకరు రెండవవారి పుట్టినవారే. తమదేశమును విడిచి, గృహములను విడిచి నాపక్షము కష్టములపాలై యుద్ధముచేసి పడిపోయినవారిపాపములను నిర్మూలించి నదులు ప్రవహించుచుండు వనములలోనికి వారిని దెత్తుము" అనుము. ఇదియే దేవుఁడిచ్చుబహుమానము. దేవుఁడే సంపూర్ణ బహుమానము నొసఁగఁగలవాఁడు.

నమ్మనివారికి భూమిపైఁ గలుగునభివృద్ధివలన మోసపోకుము.

అది క్షణభంగురము. పిదప వారికి నరకవాసమే యగును. వారికయ్యది దుఃఖహేతు వగును.

కాని, దేవునికి భయపడువారికి తరంగిణులు గానమొనర్చు నుద్యానవనములు నిత్యవాసముగా నేర్పడును. దేవుఁడు వారినట్లు బహూకరించును. పుణ్యవంతులకు దేవుఁడిచ్చినదే శ్రేష్ఠము.

గ్రంథావలంబకులలో దేవునియందును, మీకుఁ బంపఁబడిన దానియందును, వారికిఁబంపఁబడినదానియందును, నమ్మకము గలిగి దేవునిమోల నమ్రులై యుండువారు గలరు. వారు దేవునియానవాళ్ళను తుచ్ఛధనమున కమ్మి వేయరు. వీరా ! వీరికి ప్రభువుబహుమానము సిద్ధముగానున్నది. అవును, దేవుఁడు శీఘ్రముగ లెక్కలను వేయుచున్నాఁడు,

విశ్వాసులారా ! ఓర్చి యుండుఁడు. సహనపరు లెవ్వరని స్పర్థ గలిగి స్థిరచిత్తులై దేవునికి భయపడుచుండుఁడు ! మీకు శ్రేయస్సు కలుగును.

# సురా 4. స్త్రీలు.

మదీనా 177 పద్యములు—23 రుక్కూలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

జనులారా! మిమ్మొకజీవాణువునుండి సృజియించి, యందుండి యొకభార్యను కల్పించి, యాయిరువురనుండియు నింతమంది పురుషులను, స్త్రీలను విస్తరింపఁజేసిన దేవునికి భయపడుఁడు. ఎవని పేర మీ రొండొరులసహాయము వేఁడెదరో యాదేవునికి భయపడుఁడు. మిమ్ములఁ గన్నగర్భములను పూజింపుఁడు. దేవుఁడు మీనడవడిని కనిపెట్టుచున్నాఁడుగదా!

అనాథశిశువులధనమును వారి కిచ్చివేయుఁడు. వారివిలువగలవస్తువులకు బదులుగా, పనికిమాలినమీవస్తువుల నంటఁగట్టకుఁడు. వారియాస్తిని కలుపుకొని మ్రింగివేయకుఁడు. ఇది గొప్పనేరము.

అయినను మీ రనాథశిశువులయెడ సరిగ వర్తింపలే దని భయపడినచో, నితరస్త్రీలనుండి యిద్దఱను, ముగ్గురను, నలుగురను మాత్రమే వివాహాముచేసికొనుఁడు. ఇంకను న్యాయముగ సంచరింపలేదని భయపడినచో నొకర్తెనే కాని, మీరు సంపాదించినబానిసస్త్రీలంగాని పెండ్లియాడుఁడు. ఇట్లు చేసినచో మీరు న్యాయముగ వర్తించుటకు సులభమగును.

స్త్రీలకు రావలసినధనమును స్వేచ్ఛగా నిచ్చివేయుఁడు. కాని, వారంతటవారే యాధనములో మీకు భాగమిచ్చినచో నాలాభమును బాగుగ ననుభవింపుఁడు.

తమధనమును కాపాడుకొనఁజాలనివారికి, దేవుఁడు వారిసంరక్షణకొఱకై మీయధీనములోనుంచినదాని నిచ్చివేయకుఁడు. వారిని పోషించి వస్త్రములిచ్చి వారితో దయగ మాటాడుఁడు.

అనాథశిశువులను వివాహమునకు యుక్తవయస్సువచ్చువఱకును శోధింపుఁడు. వారు స్థిరచిత్తముగలవారని మీకుఁదోచినచో వారియాస్తిని వారికిచ్చివేయుఁడు. కాని, వారిధనమును పాడుచేయుటగాని, యుక్తవయస్సురానిదే వారు పెరుగుచున్నారుగదాయని, వారియాస్తిని వారి కిచ్చివేయుటగాని, చేయకుఁడు. ఆయాస్తిని ధనవంతుఁడగు సంరక్షకుఁడు ముట్టనైన ముట్టఁగూడదు. పేదవాఁడు దానిని జాగ్రత్తగ వాడుకొనుచు తాను కొంత యనుభవింపవచ్చును. వారియాస్తివారికిచ్చివేయునపుడు వారియెదుటనే సాక్ష్యముఁ దీసికొనుఁడు. దేవుఁడుగూడ తగినలెక్క లుంచుచునే యున్నాఁడు.

పురుషులకు తమతలిదండ్రులును, బంధువులును, విడిచినదానియందును స్త్రీలకు వారితలిదండ్రులును బంధువులును విడిచినదానియందును పాల్గొన నధికారమున్నది. కొంచెమైనను, గొప్పదైనను వారికి కొంతపాలు తప్పక పోవలయును.

ఆస్తి విభక్తమగునప్పుడు బంధువులు, ననాథశిశువులు, దరిద్రులు నున్నచో, వారి కొకభాగ మిండు. వారితో దయగలిగి మాటాడుఁడు.

తమసంతానము దుర్బలమైనచో వారిక్షేమమునకై యాతురతనొందువా రనాథశిశువులకు హాని కలుగకుండఁ జూడవలయును. కావున వారు దేవునికి భయపడి న్యాయమునే విధింతురుగాక !

10. అక్రమముగా ననాథశిశువులయాస్తిని మ్రింగివేయువారు తమకడుపులోని కగ్ని హోత్రమును మ్రింగవలసియుండును. వారందే దహింపఁబడఁగలరు.

అధ్యాయము 2.

మీ సంతానములో నిద్దఱుపుత్త్రికలవం తొకపుత్త్రునికి చొప్పున నీయవలసిన దని దేవునియాజ్ఞ. ఇద్దఱుపుత్త్రికలకంటె నెక్కువమంది యున్నచో వారికి మూఁడువంతులలో రెండువంతులును, ఒక్కతెయే యైనచో నామెకు సగముపాలును, నీయవలయును. మృతినొందినవానికి సంతానమున్నయెడల నాతనితలిదండ్రులొక్కొక్కరి కాఱవభాగ మీయవలయును. అతనికి సంతానము లేక ఆయాస్తికి తలిదండ్రులే వారసులైనచో తల్లికి మూఁడవవంతు పోవలయును. అతనికి సోదరు లున్నచో, నతఁడు చేసినయప్పులను దీర్చి, యాతఁ డిమ్మనిచెప్పినదాని నిచ్చివేయఁగా మిగిలినదానిలో నాఱవభాగము తల్లికి వచ్చును. మీ తండ్రులలోను పుత్త్రులలోను, నెవ్వరు మీ కెక్కువలాభకారులో మీకుఁ దెలియదు. ఇది దేవుని ధర్మశాసనము. దేవుఁడు జ్ఞానియు, బుద్ధుఁడును గదా!

మీ భార్యలకు సంతానము లేనిచో వారు వదలిపెట్టిన దానిలో సగముమీది. వారికి సంతానమున్నచో వారియప్పులు తీఱఁగా, వారిమ్మనిన వారి కిచ్చివేయఁగా, మిగిలినదానిలో నాల్గవభాగము మీకు వచ్చును. మీకు సంతానములేనిచో, మీరు వదలిపెట్టినదానిలో నాల్గవభాగము వారిది. మీకు సంతానమున్నచో మీయప్పులు తీరఁగా, మీ రిమ్మనినవారి కిచ్చివేయఁగా, మిగిలిన దానిలో నెనిమిదవభాగము వారికి వెళ్ళును. స్త్రీగాని, పురుషుఁడుగాని, దూరబంధువును వారసునిగా విధించియున్నపుడు ఆమెకుగాని, యతనికిఁగాని, సోదరుఁడో సోదరియో యున్నచో, వారికి చెఱియాఱవభాగమును వెళ్ళును. ఇంతకంటె నెక్కుడుమంది యున్నచో, అప్పులు తీర్చివేయఁగా, ఇవ్వవలసినవారి కిచ్చివేయఁగా, మిగిలిన దానిలో మూఁడవభాగము వారికిఁ బంచిపెట్టవలయును. ఎవ్వరికిని

నష్టము రాఁగూడదు. ఇది దేవునిధర్మానుశాసనము. దేవుఁడు జ్ఞాని దయాళుఁడు.

ఇవి దేవునిబోధలు. దేవుని, అతనిప్రవక్తను మన్నించిన వారిని దేవుఁడు తరంగిణులు ప్రవహించు నందనోద్యానముల నీడఁ క్రింద నిత్యవాసము లేర్పఱుచును. ఇదియే పరమధన్యత!

దేవునిపైనను, నతనిప్రవక్తపైనను తిరుగఁబడి యతనికట్టుఁ బాట్ల నుల్లంఘించినవానిని దేవుఁ డగ్నిలో శాశ్వతముగఁ బడవే యును. అతనికి లజ్జాకరమగుబాధ కలుగును.

## అధ్యాయము 3.

మీలో నేస్త్రీయైనను వ్యభిచరించినచో మీలోనుండియే నలుగురుసాక్షులను తీసికొనివచ్చి, వా రావిషయమును ఋజువుపఱిచినయెడల, వారు మృతినొందువఱకునో వారికి దేవుఁ డేదోమార్గము కల్పించువఱకునో వారియిండ్లు కదలకుండ నుంచుఁడు.

మీలో నేరముచేసినవారి నిద్దఱను శిక్షింపుఁడు. వారు తమ మార్గమునుండి మఱలి పశ్చాత్తాపమునొందినచో నూరకొనుఁడు. దేవుఁడే మఱలించువాఁడు! కరుణాళుఁడు!

అజ్ఞానముచే దుష్కృతము నాచరించినను, పిదప పరితాపము నొంది త్వరగ దేవు నాశ్రయించినవానిని నాతఁ డనుగ్రహించును. దేవుఁడు వీరివంక దిరుగును. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు!

కాని యకార్యమొనరించి మృతినొందువఱకును పరితాపము నొందక తుదకు మృత్యువాసన్నమగునప్పుడు, "మేము దేవునిశరణుఁ జొచ్చెదము, అను వారికి పశ్చాత్తాపమునకు స్థానమెక్కడిది?" అవిశ్వాసులుగనున్నవారును దేవునిదయకుఁ బాత్రులు కాఁజాలరు. వీరా! వీరికి ఘోరబాధలను సిద్ధముచేసి యున్నాము.

విశ్వాసులారా! మీ భార్యలయిష్టము లేనిదే మీరు వారలకు వారసులు కాఁజాలరు. నిస్సందేహముగ మీరు వ్యభిచార దోషమునకు పాలయినఁగాని, వారికి మీరిచ్చినధనమును తీసికొనుటకై వారిని మఱియొకనిని వివాహమాడకుండ నాటంకపెట్టుటయు మీకు తగదు. కాని, దయగలిగి వారితోఁ గలిసియుండుఁడు. మీరు వారిని ద్వేషించి వారినుండి విడిపోయినచో దేవుఁడు మీ కొఱకుంచిన మేలునుండియు మీరు విడఁబడిపోవుదురేమో?

20. మీ రొకభార్యను విడిచి మఱియొకతెను చేకొన నిచ్ఛగించినచో మొదటియామె కిచ్చినధనమునుండి యేమియు తీసికొనఁ గూడదు. ఆమె కవమానము కల్పించి, కీడుచేసియా దానిని గైకొనుట?

మీ రొండొరులఁ గలసికొని యైక్యమునొందినపిదప నామె నుండి ధనమెట్లు తీసికొనఁగలరు?

మీ తండ్రులు పెండ్లియాడినస్త్రీలను పెండ్లిచేసికొనఁకుఁడు. ఇది లజ్జాకరము. హేయము. దుర్మార్గము. అయినదేదో కానిండు. ఇఁకముం దట్లు చేయకుఁడు.

## అధ్యాయము 4.

మీ తల్లులును, కుమార్తెలును, అక్కచెల్లెండ్రును, పినతల్లులును, మేనత్తలును, అన్నదమ్ములకుమార్తెలును, అక్కసెల్లెండ్ర కూఁతుండ్రును, మీసవతితల్లులును, సవతియక్కసెల్లెండ్రును, మీ భార్యలతల్లులును, నిన్నుఁజేరినభార్యలకుఁబుట్టిన సవతికూఁతుండ్రును, (నీవు వారినిఁ జేరనిచో వారికుమార్తెలఁ బెండ్లియాడుట పాపము కాదు) నీకడుపునఁబుట్టిన కొడుకులభార్యలును మీకు పత్నులుగా నిషేధింపఁబడియున్నారు. ఈకురాను మీకుఁ జేరకపూర్వము మీరు పెండ్లియాడినఁదప్ప, ఇద్దఱక్కచెల్లెండ్రను వివాహ మాడఁ గూడదు. దేవుఁడు దయాళుఁడును, కరుణాళుఁడును గదా!

# కాండము. 5

మీచేతిలో బానిసరాండ్రుగా నున్నవారినిదప్ప, వివాహితలైనస్త్రీలను మీరు పెండ్లాడఁగూడదు. ఇది దేవుఁడు మీకు విధించినధర్మము. మీధనము నుపయోగించి, మంచినడవడి కలిగి, వ్యభిచారదోషము లేకుండ మీరు వివాహము చేసికొనవచ్చును. మీతో సంగముచేసినస్త్రీలకు వారికి రావలసినదాని నిచ్చివేయుఁడు. ఇదియే ధర్మము. ఈధర్మము నతిక్రమించికూడ మీ రొడంబడికలఁ జేసికొనుటయు నేరముకాదు. దేవుఁడు జ్ఞానియు బుద్ధుఁడునుగదా!

మీలో స్వతంత్రలు, విశ్వాసినులు నగుస్త్రీలను బెండ్లియాడుటకు ధనములేనివా రున్నయెడల, మీచేతిలోఁబడిన విశ్వాసినులగు బానిసకన్యలను పరిణయము చేసికొనవచ్చును. దేవుఁడు మీ భక్తిని గుర్తించియున్నాఁడు. మీరొకరినుండి యొకరు పుట్టియున్నారు. కావున వారియభిమానుల యనుమతిఁ బడసి, న్యాయమగు ధనము నిచ్చి వారిని బెండ్లిచేసికొనుఁడు. కాని, వారు పతివ్రతలై యుండునట్లును, వ్యభిచరింపకుండునట్లును, కాముకులఁ జేరఁదీయనివారుగ నుండునట్లును జూడుఁడు. వివాహమైనపిదప వారు వ్యభిచరించినచో స్వతంత్రలగు వివాహితలకు విధించునపరాధములో సగము వారికి విధింపుము. అన్యాయము సేయుటకు వెఱచువానికీధర్మము విధింపఁబడినది. కాని యాయపరాధమును విధింపకుండుటయే నీకు మంచిది. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు.

అధ్యాయము 5.

ఇది మీకుఁ దెలియవలయుననియు, మీపూర్వులమార్గము

నకు మిమ్ము ద్రిప్పవలయుననియు, ఆతనికరుణకు మిమ్ముఁ బాత్రుల జేయవలయుననియు దేవునికోరిక. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు!

దేవుఁడు మి మ్మిట్లే తనవంకకుఁ ద్రిప్ప నిశ్చయించినాఁడు. కాని, తమభోగేచ్ఛలకు లోనైనవారు, మీరుగూడ తప్పుత్రోవకు దిగవలయునని కోరుదురు.

మనుష్యుఁడు బలహీనుఁడుగ సృజియింపఁబడి యుండుటచే దేవుఁడు మీభారమును చులకనఁ జేయఁ గోరుచున్నాఁడు.

విశ్వాసులారా! మీరొండొరులతో నొడఁబడి వర్తకముఁ జేసి తప్ప, జూదములు మొదలగువానిలోనికి దిగి యొండొరులధనమును మ్రింగివేయకుఁడు. ఒకరినొకరు చంపుకొనకుఁడు. సత్యముగా దేవుఁడు మీయెడల కరుణ గలిగియున్నాఁడు.

30. కాని, యెవ్వఁడైనను దురుద్దేశముతో నన్యాయముగ నట్లు చేసినచో నాతని నగ్నిలోఁ ద్రోసెదము. ఇట్లు చేయుట దేవునికి సులభము.

నిషేధింపఁబడిన ఘోరపాపములను మీరు చేయకున్నచో, మీతప్పిదములనుమన్నించి గౌరవముగ మిమ్ము భోగభూమిలోఁబ్రవేశ పెట్టెదము.

దేవుఁడు మీలోఁ గొందఱికి హెచ్చుగా వరములిచ్చి తక్కిన వారికంటె నధికులుగఁ జేసియున్నాఁడు. ఆవరములకొఱకు మీరు నాశపడకుఁడు. స్త్రీపురుషులు తమకుఁదనగినట్లు బహుమానముల నందఁగలరు. కావున దేవుని వరముల నడుగుఁడు. నిశ్చయముగా దేవుఁడు సర్వజ్ఞుఁడు.

తలిదండ్రులును, బంధువులును, స్నేహితులును, విడిచిపెట్టి వెళ్ళినధనమునకు ప్రతివానికిని వారసుల నేర్పఱచి యున్నాము.

కావున వారివారికిఁ గావలసినవా లిచ్చివేయుము. దేవుఁడు సర్వసాక్షిగదా!

### అధ్యాయము 6.

స్త్రీలకంటె పురుషులకు దేవుఁ డెక్కుడుమంచిగుణముల నిచ్చియుండుటచేతను, పురుషులే తమకుఁ బ్రసాదింపఁబడినదానితో నెక్కుడుగ నాదాయము చేయఁగలవా రగుటచేతను, స్త్రీలకంటెఁ బురుషు లధికులు. దేవుఁడు స్త్రీలను జాగ్రత్తగఁ జూచుచుండుటచే భర్తలులేనిసమయమున పతివ్రతలగుస్త్రీలు వినయముగలిగి జాగ్రతగ సంచరింతురు. అయినను అక్రమవతులగుదురని నీవు సందేహించిన వారిని మందలింపుము. వారికి వేఱుశయ్యలనిచ్చి బాధింపుము. అంతట వారు నీకు విధేయలైనచో వారిపైఁ గోపింపఁజూడకుము. దేవుఁ డున్నతుఁడు; మహాత్ముఁడు!

భార్యాభర్తలకు పడకున్నదని నీవు శంకించినచో నాయిరు వురికుటుంబములనుండియు మధ్యవర్తుల నంపుము. వారు కలియుట కిష్టపడినచో దేవుఁడు వారిని సఖ్యపడఁజేయును. దేవుఁడు సర్వజ్ఞుఁడు గదా!

దేవునిఁ బూజించుచు నాపూజలో నితరదైవములఁ గలుపకుము. తలిదండ్రులకును, బంధువులకును అనాథశిశువులకును, బీదలకును, బంధువులైనను, క్రొత్తవారైనను సరే యిరుగుపొరుగులనుండువారికిని, తోడఁ బ్రయాణముచేయువానికిని, పాంథునకును, మీకుడిచేతులతో గ్రహించిన బానిసలకును ననుకూలముగ వర్తింపుము. గర్విష్ఠులను, వ్యర్థప్రలాపులను,

తాము లోభులై యితరులను లోభమునకుఁ బురి కొల్పువారిని, దేవుఁడు ప్రసాదించినదానిని దాఁచిపెట్టియుంచువారిని దేవుఁడు ప్రేమింపఁడుగదా! అవిశ్వాసులకొఱకును,

తాము చేయుదానముల నితరులు చూడవలయునని కోరు వారికొఱకును, దేవునియందును, తుదిదినమునందును, నమ్మకములేని వారికొఱకును, లజ్జాకరమగుశిక్షను సిద్ధముచేసి యుంచియున్నాము. సైతాను స్నేహితుఁడుగాఁగలవాఁడు దుష్టసఖ్యమును జేసినవాఁడగును.

కాని, దేవునియందును, తుదిదినమునందును విశ్వసించి దేవుఁడనుగ్రహించినదానిలో భిక్షము పెట్టువా రెంతయు ధన్యాత్ము లగుదురు. దేవుఁడు వారిని గుర్తించి యుండును!

40. నిశ్చయముగా దేవుఁ డొకధూళిరేణువంతైన నెవనికి నపకారము చేయఁడు. వా రేదేని సత్కార్యము చేసినచో నతఁడు ద్విగుణముగ నొసగును. అతనిమ్రోల గొప్ప బహుమానము చేకూఱఁగలదు.

కాని, వీరిపై తమప్రజలనుండియే సాక్షులను దీసికొనివచ్చి నప్పుడు, నిన్నే వారిపై నొకసాక్షిగా పిలిచినప్పు డెట్లుండఁగలదో!

ఆదినమున నవిశ్వాసులై, ప్రవక్తపైఁ దిరుగఁబడినవారు తమతోఁగూడ భూమియంతయు సమనుచేయఁబడుఁగాక యని కోరుదురు. కాని, వారు దేవునిమ్రోల నొకమాటనుగూడ దాఁచియుంచఁజాలరు.

## అధ్యాయము 7.

విశ్వాసులారా! త్రాగి మత్తిల్లియున్నప్పుడు ప్రార్థన సేయరాకుఁడు. మీమాటలు మీకు బోధపడువఱకును వేచియుండుఁడు. దారిలో ప్రయాణముచేయుచున్నప్పుడు తప్ప మీకు మైలతగిలి యున్నప్పుడు శుభ్రముగ కడుగుకొనకుండ ప్రార్థన సల్పకుఁడు. మీరు రోగపీడితులై యున్నపుడును, ప్రయాణము చేయుచున్న పుడును, అపవిత్రస్థలమునుండి వచ్చినపుడును, స్త్రీ నంటినపిదపను,

నీరు దొరకకున్నను, మంచియిసుకతో రాచికొని, మీముఖములను చేతులను దానితో తోముకొనుఁడు. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడునుగదా!

సత్యగ్రంథములో నొకభాగ మనుగ్రహింపఁబడినవారిని మీరుగుర్తించియుండలేదా? వారు తప్పు నమ్మెడివారు; మీరు మార్గమునుండి తప్పిపోవుదురుగాక యని వారు కోరుచుందురు.

కాని, దేవునికి మీశత్రువు లెవరో తెలియును. దేవుని యాదరణమే చాలును. ఆతనిసహాయమే సరిపోవును.

యూదులలోఁ గొందఱు సత్యగ్రంథములోనిమాటలను తారుమాఱుచేసి, "మేము విన్నాముగాని, యనుసరింపలేము. నీవును వినియు విననివానివలె నుండుము. మావంక చూచుచుండుము" అనుచు నాలుకలు తడఁబడ తమదూషణలచే సత్యభక్తి కపాయము గల్పించుచుందురు. అయినను వారు "మేము విన్నాము. అనుసరించుచున్నాము. నీవును విని మమ్ము గుర్తింపు" మనినచో వారికి శ్రేయస్కరముగను, క్రమముగను నుండియుండును. కాని, దేవుఁడు వారియవిశ్వాసమునకై వారిని శపించియున్నాఁడు. వారిలో కొలఁది మందియే విశ్వాసులు!

సత్యగ్రంథ మనుగ్రహింపఁబడినవారలారా! మీముఖలక్షణముల రూపుమాపి, మీతల నిటునుండి యటుత్రిప్పి, సాబత్తుదినమును లక్షింపనివారిని శపించినట్లు మిమ్ము మేము శపింపకముందే, మీచేతిలోనున్న సత్యగ్రంథమును స్థిరపఱుచుటకు మేము పంపినదానిని విశ్వసింపుఁడు. దేవునియాజ్ఞ జరిగియే తీరవలెను.

దేవుఁడు తనతో నితరదేవతలను జేర్చుటను క్షమింపఁడుగదా! తనయిష్టమైనవారిని గాక మఱియేది చేసినను నతఁడు క్షమింపఁ

గలఁడు. దేవునితో నితరదైవములఁ గూర్చినవాఁడు గొప్ప ద్రోహ్యమును గల్పించినవాఁ డగును.

తాము పుణ్యవంతుల మని, యనుకొనువారిని నీవు గుర్తించి యుండలేదా! కాని, దేవుఁడు తనయిష్టమువచ్చినవారినే పుణ్యవంతులుగఁ బరిగణించును. వారి కాతఁడు ఖర్జూరపుగింజలోని రేణువంతయైనను నపకారము చేయుఁడు.

50. వారు దేవునిఁగూర్చి యసత్యము నెట్లు కల్పించుచున్నారో చూడుము. వారిద్రోహ్యము వెల్లడి కాలేదా?

## అధ్యాయము 8.

సత్యగ్రంథములో నొకభాగ మీాయఁబడినవారిని నీవు చూచియుంటివిగదా! వారు జుప్తు, థాగొటు లనుసైతానులను నమ్మి, యవిశ్వాసులే భక్తులకంటె మంచిమార్గమున నడుపఁబడుచున్నా రని యందురు.

వీరినే దేవుఁడు శపించినాఁడు. దేవుఁడు శపించినవారికి నీవెట్టి సహాయకుని జేకూర్పఁజాలవు.

ఖర్జూరపుగింజలోని రేణువైన నొరులకీఁజాలనివారికి రాజ్యములో వంతు దొరకునా?

దేవుఁడు దయాపరుఁడై యనుగ్రహించిన యితరులనుజూచి వా రోర్వలేకున్నారా? పూర్వము మే మిబ్రాహీముసంతతివారికి గొప్పరాజ్యమును సత్యగ్రంథమును, బుద్ధిని నొసగితిమి.

వారిలోఁ గొందఱు ప్రవక్తను నమ్మిరి. కొంద ఱాతని నుండి తొలఁగిపోవుదురు. వారికి నరకవహ్నియే తగినశిక్షయై యున్నది.

మాసూచనల నమ్మనివారిని తుద కగ్నిలోఁ గూలఁద్రోయు దుము. వారిచర్మములు కాలిపోయినంతనే వెంటనే వారికి క్రొత్తచ ర్మమునిచ్చి బాధ ననుభవింపఁ జేయుచునేయుందుము. దేవుఁడు శక్తి మంతుఁడు, బుద్ధుఁడు.

కాని, విశ్వాసయుతులై, క్రమవర్తనులగువారిని తరంగిణులు ప్రవహించునుద్యానవనములలో శాశ్వతముగ వసింపఁజేయుదుము. అచట వారికి నిష్కళంకపవిత్రలగుభార్య లుందురు. అచట వారి నెల్లపుడును చల్లనినీడలయందే యుంచుదుము.

మీయొద్ద నెవరైన దాచికొనినదానిని వారి కిచ్చివేయుఁ డనియు, వారికి మాధ్యస్థ్యము వహించినపుడు న్యాయమగుతీర్పియ వలయుననియు దేవుఁ డాజ్ఞాపించియున్నాఁడు. దేవుఁడు మిమ్ము సద భ్యాసములకుఁ బ్రేరేపించుచున్నాఁడు. దేవుఁడు చూచుచున్నాఁడు, వినుచున్నాఁడు.

విశ్వాసులారా! దేవుని, నతనిప్రవక్తను, మీలోనియధికా రులను మన్నింపుఁడు. మీకు భేదాభిప్రాయములు కలిగినచో, మీరు దేవునియందును తుదిదినమునందును విశ్వసించినచో, నాతగవును దేవునికిని, నతనిప్రవక్తకును దెలుపుఁడు. మీకార్యముల సరిచేసికొ నుట కిదియే యుత్తమమును క్రమమును నగుమార్గము.

## అధ్యాయము 9.

60. నీకును నీపూర్వులకును బంపఁబడినదానిని విశ్వసించితిమని నటించువారిని నీవు గుర్తించియుండలేదా! థాగాటును వారు నమ్మఁ గూడదని యాజ్ఞయైనను, నతనినే తీర్పుచెప్పుమని వారు కోరుదురు. సైతానుకూడ వారిని సత్యమార్గమునుండి కడుదవ్వుగఁ దొలఁగింప నభిలషించుచున్నాఁడు.

"దేవుఁడు మీకును బ్రవక్తకును బంపినదాని నొప్పుఁగొనుఁ" డని వారితోఁ జెప్పినచో కపటులు నిన్ను ద్వేషించి మఱలి పోవుదురు.

కాని, వారు చేసికొనినదాని కొకకష్టము కలిగినచో వా రెట్లుందురో! అప్పుడు వారు దేవునియాన ప్రమాణములు చేయుచు నీయొద్దకు వచ్చి "జనులయందు మంచియు, సఖ్యమును బ్రవర్తింపఁజేయుట తప్ప మఱియొకటి మా కిష్టములే" దందురు.

దేవుఁడు వీరిహృదయముల నెఱింగియే యున్నాఁడు. కావున వారినుండివిడఁబడి, వారికి భయసూచనలఁ దెల్పి, వారిహృదయము లందు నాటునట్లుఁగా హితోపదేశముఁ జేయుము.

దేవునియాజ్ఞచొప్పున ప్రతిప్రవక్తను మన్నింపఁబడుటకే పంపియున్నాము. కాని, వారు తమయవిశ్వాసముచేఁ దమకుఁదామే యపకారము చేసికొనినపిదప నీయొద్దకుఁజేరి, దేవుని శరణుజొచ్చి నప్పుడు ప్రవక్తయు వారికొఱకు క్షమాపణ వేఁడినప్పుడు దేవుఁడు కరుణాళుఁడై మనుష్యునివంకఁ దిరుగువాఁడే యని వారు గ్రహింపఁ గలరు.

నేను మీప్రభువునాన ప్రమాణము చేయుచున్నాను!—వారికిఁగల తగవులలో నిన్ను మధ్యస్థునిగాఁ జేసినపిదపఁ గాని వారు విశ్వసింపరు. అప్పుడు నీతీర్పులన్నియు సంకటరహితము లైనవని తెలిసికొని యాతీర్పులను శిరసావహింతురు.

"మిమ్ము మీరు చంపుకొనుఁడు. మీగృహములను వదలి పొండు" అని మేము వారి ననుశాసించినచో వారిలో కొలఁది మంది మాత్రమే యట్లు చేసియుందురు. కాని, వారు తాము ప్రేరేపింపఁబడినదానినే చేసియుండినచో, వారిభక్తి దృఢమై, వారికి శ్రేయస్కరమై యుండియుండును.

అప్పుడు వారికి మేమే గొప్పబహుమాన మిచ్చి,
వారిని క్రమమార్గమున నంపియుందుము!

దేవుని, సతనిప్రవక్తను మన్నించువారు దేవునిదయకుఁ బాత్రులయినప్రవక్తలు, నిష్కపటులు, మతముకొఱకుఁ బ్రాణముల నర్పించినవారు, న్యాయవంతులు నగువారితోఁ గూడియుందురు. వీరు మంచివారు.

70. ఇదియే దేవునిదయ. దేవుఁడు చాలినంతజ్ఞానము గలవాఁడు.

## అధ్యాయము 10.

విశ్వాసులారా! ముందువెనుకలు చూచుకొనుచు వేర్వేఱు సైన్యములుగనో, యొక్కసారిగనో కలిసి పొండు.

మీలో నొకఁడు వెనుకకు తగ్గుచుండును. మీ కేదేనియపజయము గలిగిన నాతఁడు "నేను మీతో యుద్ధము చేయలేదు. కావున దేవుఁడు నన్ననుగ్రహించినాఁ" డనును.

కాని, మీకు జయమే చేకూఱినచో నాతఁడు మీతో నెన్నఁడును, సఖ్యము నెఱపనివానివలె, "అయ్యో! నేను వారితోనుండిన నెంతబాగుండును! నాకును గొప్పబహుమానము గలిగియుండునే!" యనును.

కావున పరలోకజీవనమునకై యిహలోకజీవనము నర్పించువారు దేవునిమార్గమున యుద్ధము చేయుదురుగాక! దైవపథమున రణమొనరించువాఁడు చచ్చినను జయించినను సతనికి తుదిని గొప్ప బహుమాన మిత్తుము.

దేవునిమార్గమునందును, బలహీనులు, స్త్రీలు, బాలురును "ప్రభువా! ఈపురవాసులు మమ్ము బాధించుచున్నారు. ఈపురము

నుండి మమ్ము తప్పింపుము. మాపక్షమునఁ బోరాడుట కొకనిఁ బంపుము. మా కొకసంరక్షకుని నీయొద్దనుండి పంపుము" అను చుండఁగా వారిపక్షముననుs, మీరు పోరాడకుండుటకు మీ కేమి మూడినది ?

విశ్వాసులు దేవునిమార్గమున యుద్ధము చేయుదురు. అవిశ్వాసులు థాగాటుమార్గమున పోరుదురు. కావున సైతానుస్నేహితులపై పోరు సలుపుము. సైతానుపన్నాగము శక్తిహీనముకాఁగలదు.

## అధ్యాయము 11.

"కొలఁదికాలము యుద్ధము మానుఁడు; ప్రార్థనల సల్పి భిక్షము పెట్టుఁడు" అని చెప్పఁబడినవారిని నీవు గుర్తించియుండలేదా ? కాని, వారు యుద్ధము చేయవలయు నని యాజ్ఞయైనంతనే దేవునికి భయపడునట్లే, అంతకంటె నెక్కుడుగనే మనుష్యులకును భయపడి "ప్రభువా ! మమ్ము యుద్ధముచేయుఁడని యేల యాజ్ఞాపించితివి ? మేము చరమవిశ్రాంతి నొందువఱకు నేల యూరకుంటివికావు ?" అందురు. "ఇహలోకఫలము కొంచెమే. దేవునికి భయపడువానికి పరలోకజీవనమే శ్రేయోదాయకము. మీకు ఖర్జూరపుగింజతొక్క కంటె నెక్కువకీడు కలుగఁబో" దని వారితో ననుము.

మీ రున్నతగోపురములందుఁగాని, యెక్కడగాని యున్నను మిమ్ము మృత్యువు వెంబడించుచునే యున్నది. వారికి జయము కలిగినచో "ఇది దేవుఁ డనుగ్రహించిన" దనియు, హాని కలిగినచో "దీనిని నీవే తెచ్చిపెట్టితి" వనియు నందురు. వారితో "సర్వమును దేవుఁడు తెచ్చినదే" అనుము. కాని, వారికి చెప్పినదాని నించుకైనను వారు బోధపఱుచుకొనకుండుటకు వారి కేమిమూడినది ?

నీకు కలిగినమేలు దేవుఁ డిచ్చినది ; కీడు నీవు తెచ్చికొనినదే.

మనుష్యజాతికి నిన్ను ప్రవక్తగాఁ బంపియున్నాము. నిన్నుఁగూర్చి సాక్ష్యము పలుకుటకు దేవుఁ డొక్కఁడే చాలును.

80. ప్రవక్తను మన్నించినవాఁడు దేవునిఁగూఁడ మన్నించినవాఁడగును. నిన్నునుండి మఱలిపోయినవారిసంరక్షణకై నిన్ను పంపియుండలేదు.

ఇదిగాక వారు "విధేయత" యని యుచ్చరింతురేకాని, నీ సమక్షమునుండి తిరిగిపోవఁగనే వారిలోఁ గొందఱు నీమాటలఁగాక మఱికొన్ని మాటలను స్మరించుకొనుచుందురు. కాని, వారేమిస్మరించుకొనుచున్నారో దేవుఁడు వ్రాసియుంచుచునే యున్నాఁడు. కావున వారిని విడిచిపెట్టి దేవునే నమ్మి యుండుము. దేవుఁడు నిన్ను సంరక్షించుటకుఁ జాలును.

వారు కురానును ధ్యానింపఁజాలరా? దేవుఁడే దానిని పంపకుండినచో దానియం దెన్నియో యసందర్భము లుండి యుండును.

క్షేమవార్తగాని, భయవార్తగాని, వారిచెవిని బడఁగనే వారు దానిని చాటుచుందురు. కాని, వారు దానిని ప్రవక్తకును, నధికారులకును, దెలిసినచో, దానిని గూర్చి తెలిసికొనఁ గోరువారు వారినుండి తెలిసికొందురు. దేవుఁడు మంచివాఁడును దయాళుఁడును కాఁబట్టిగాని, కానిచో మీలోఁ గొందఱు తప్ప, నందఱును సైతానునే యనుసరించియుందురు.

కావున, దేవునిమార్గమున పోరు సలుపుము. నీమీఁద తప్ప నితరులపై భార ముంచకుము. విశ్వాసులను యుద్ధమునకుఁ బ్రేరేపింపుము. దేవుఁడు బలవంతుఁడు. శిక్షించుట కతనికే బలము కలదు. కావున దేవుఁడవిశ్వాసులబలమును తగ్గింపఁగలఁడు.

మంచికొఱకు మనుష్యులకు మాధ్యస్థ్యమును వహించినవాఁడు లాభము పొందఁగలఁడు. కాని, దురుద్దేశముతో మాధ్యస్థ్యము

వహించువాఁడు దానిఫలము ననుభవించితీరును. దేవుఁడు సర్వమును జూచుచున్నాఁడు.

మి మ్మెవ్వరైన నభినందించినచో వారి నంతకెక్కుడుగను లేదా సమానముగనైనను నభినందింపుఁడు. దేవుఁ డన్నిటిని లెక్క వే యుచునే యున్నాఁడు.

దేవుఁడు ! అతఁడుతప్ప వేఱుదైవము లేఁడు ! రక్షణదినమున నాతఁడు మిమ్మందఱ నొకచోఁ జేర్చును. ఈవిషయమై యేసందేహ మును లేదు. దేవునివాక్యముకంటె సత్యమైన దేది ?

## అధ్యాయము 12.

కపటులుచేసినదానికై దేవుఁడు వారిని విసర్జించి యుండఁగా వారినిగూర్చి మీ కేల భేదాభిప్రాయము లుండవలయును ? దేవుఁడు త్రోవతప్పించినవారిని మీరు సరిగ నడిపింపఁ జూచుచున్నారా ? దేవుఁడు త్రోవ తప్పించినవారికి నీవు మఱియొకదారి చూపఁజాలవు సుమీ !

మీరును వారివలె నొకటేరీతిగ నవిశ్వాసులై యుండవలయు నని వారికోరిక. దేవునివిషయమై వారు తమగృహములను వీడి వెళ్ళు వఱకును, వారితో స్నేహము చేయకుము. వారు తిరిగివచ్చినయెడల వారిని పట్టుకొని, కనఁబడినచోట్లనెల్ల నఱకివేయుము. వారిలో,

90. మీమిత్రులశరణుఁ జొచ్చినవారిని, మీపక్షమునకుఁ తిరిగి పోయి, మీపైనను, మీప్రజలపైనను యుద్ధముసేయ నొల్లనివారినిఁ దప్ప, నితరులను మీస్నేహితులుగఁ గాని, సహాయకులుగఁ గాని, చేకొనకుఁడు. దేవుని కిష్టమైనచో నతఁడు వారికి మీపై శక్తి నొసగి మీతో యుద్ధము చేయనిచ్చియుండును. కాని, వారు నిన్ను విడిచిపోయినను నీతో యుద్ధము చేయక సంధికి దిగినను, వారితో నేజోక్యము మీకు దేవుఁడు కలుగనీయఁడు.

నీవిశ్వాసమును, తమప్రజలవిశ్వాసమును బొందఁగోరు నిత రులను మీరు కనుగొందురు. వా రెంతకాలము కుట్రి పన్నుదురో యంతకాలము నాకుట్రి యణఁగిపోవును. కాని, వారు నిన్ను విడు వక, సంధికి దిగక, యుద్ధము నాపకుండినచో వారిని పట్టుకొని కనఁ బడినచోటనెల్ల నఱికివేయుఁడు. వీరిపై నీకు నిస్సందేహమగుశక్తి నిచ్చియున్నాము.

## అధ్యాయము 13.

పొరపాటువలన తప్ప విశ్వాసి విశ్వాసిని చంపఁడు. అట్లా పొరబాటువలన నొకవిశ్వాసిని చంపినవాఁడు బానిసతనములో నున్న మఱియొకవిశ్వాసిని విడిపించుట విధియైయున్నది. చనిపోయినవాని కుటుంబమునకు పరిహార మీయవలయును. వారు దానిని భిక్షగా నిచ్చివేయవచ్చును. కాని, చంపఁబడినవిశ్వాసి శత్రుపక్షమువాఁడై నచో, విశ్వాసియై తనక్రింద నున్న బానిసీని నొకనిని విడుదలచేయు వలయును. కాని, యతఁడు తనమిత్రులలోనివాఁ డైనచో నాతని కుటుంబమునకు పరిహార మిచ్చుటయే కాక తనబానిసయగువిశ్వాసి నొకనిని విడుదలకూడ చేయువలయును. అట్లుచేయుటకు ధనము లేనివాఁడు వరుసగ రెండునెల లుపవాసము చేయువలయును. ఇది దేవుఁడు విధించినప్రాయశ్చిత్తము. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు!

కాని, చంపవలెనను నుద్దేశముతో విశ్వాసిని చంపువానికి నరకమే ప్రాప్తము. అతఁ డందు శాశ్వతముగ వసింపవలయును. దేవుఁ డాతనిఁ గోపించి, శపించి, గొప్పబాధ నతనికి సిద్ధపఱుచును.

విశ్వాసులారా! దేవునిపక్షమున మీరు యుద్ధముచేయ నేఁగునప్పుడు యుక్తాయుక్తముల విచారించుచు, మీరుకలిసినప్రతివాని తోడను నిహలోకఫలముల నాశించి "నీవు విశ్వాసివి కావు" అని

యనుచుండకుఁడు. దేవుఁడే మీకుఁ గావలసినంత కొల్లగ నీయఁగలఁడు. మీరు పూర్వ మట్లు చేయుచుంటిరి. కాని, దేవుఁడు మిమ్ము తన దయకుఁ బాత్రులఁజేసెను. దేవునికి మీరు చేయునది తెలియును గావున వివేకము గలిగి వర్తింపుఁడు.

ఏకష్టమును లేక యింటఁ గూర్చుండు విశ్వాసులకును, దేవుని కొఱకు తమధనమును, తనువులను వినియోగించి యుద్ధము చేయు విశ్వాసులకును, సమానఫలములు కలుగఁబోవు. ఇంటఁ గూర్చుండు వారికంటె, తమధనమును, దేహములను మనసార దేవుని కర్పించి పోరువారికి దేవుఁ డుచ్చస్థానము నిచ్చును. అతఁ డందఱకును మంచి వాగ్దానములఁ జేసి యున్నాఁడు; కాని యింటఁ గూర్చుండినవారికంటె పట్టుదలఁ గలిగి పోరువారికి గొప్పబహుమానమును,

గొప్పపదవిని, క్షమాపణయు, కరుణయుఁ బ్రసాదించును. దేవుఁడు క్షమాయుతుఁడు. కరుణాళుఁడు.

## అధ్యాయము 14.

తమసౌఖ్యమునకే ముప్పు తెచ్చికొనినవారి యాత్మలను దేవతలు పట్టుకొని నీస్థితి పూర్వ మెట్టిదై యుండె" నని యడుగఁగా వారు, "భూమిపై మేము బలహీనులముగా నుంటిమి" అందురు. "ఏమి! మీరు పరుగెత్తి పాఱిపోవుటకు దేవునివిశాలభూమి చాలినది కాదా?" యని దేవతలు బదులు చెప్పుదురు. వీరా! వీరికి నరకమే గృహ మగును. అచటికి దారి కష్టసంకులము.

బలహీనతచే శక్తిచాలక పాఱిపోవుటకు దారి దొరకని స్త్రీలును, శిశువులును మాత్రము మార్గోపదేశకులు దొరకనందున నరకములోనికిఁ బోవరు.

వీరిని దేవుఁడు క్షమింపఁగలఁడు. దేవుఁడు క్షమాయుతుఁడు, దాక్షిణ్యమూర్తి!

100. దేవునికొఱకు దేశమును విడిచిపెట్టినవారికిని భూమిలో తమ వలె నిర్బంధితులైనవారికిని చాలినంతధనము గోచర మగును. తన గృహమును విడిచిపెట్టి దేవుని, నతనిప్రవక్తను, శరణుఁ జొచ్చినవానికి మృత్యు వాసన్నమైనను దేవుఁ డాతనికి బహుమానమిచ్చుట తప్పదు. దేవుఁడు దయాళుఁడు, కరుణామయుఁడు!

## అధ్యాయము 15.

మీరు యుద్ధమున నున్నప్పుడు శత్రువులు మీపైఁబడనున్నచో మీప్రార్థనలను క్లుప్తపఱచుకొనుట నేరము గాదు. అవిశ్వాసులే నిస్సం దేహముగ నీశత్రువులు.

ప్రవక్తా! నీవు వారిలో నుండి, వారితోఁ బ్రార్థనల సల్పినప్పుడు వారిలోఁ గొందఱు లేచి తమయాయుధముల గ్రహింపనిమ్ము. వారు తమసాష్టాంగనమస్కారములు చేసినపిదప నీవెనుకకుఁ బోనిమ్ము. పిదప ప్రార్థనలఁ గావింపనిమఱికొందఱు వచ్చి నీతోఁ బ్రార్థించి, ముందువెనుక లారసి తమయాయుధముల గ్రహింపనిమ్ము. మీరు మీయాయుధములను, మూటలను నుపేక్షించుట యవిశ్వాసులకు సంతోషదాయకము. అప్పుడు వారు మీపై వెంటనే పడవచ్చును గదా! వర్షముచేతను రోగముచేతను బాధింపఁబడునప్పుడు మీరు యుద్ధములో వారిని వదలిపెట్టుట నేరము కానేరదు. కాని, ముందు వెనుకలఁ జూచికొని వర్తింపవలయును. దేవుఁ డవిశ్వాసులకు ఘోర బాధను సిద్ధపఱిచి యున్నాఁడు.

నీప్రార్థన ముగిసినపిదపఁగూడ, నిలిచి యుండి యున్నను, కూర్చుండినను, ప్రక్కపై ప్రాలియున్నను దేవునినామోచ్చారణము

చేయుచుందుము. నీవు సురక్షితుఁడవైనంతనే ప్రార్థనలసలుపుము. విశ్వాసుల కాయాగంటలయందు ప్రార్థన విధింపఁబడి యున్నది.

శత్రువును వెంబడించునపు డాలస్యము చేయఁబోకుఁడు. మీకు నష్టము గలిగినచో వారికిని మీవలె నష్టము కలుగుచున్న దని గ్రహింపుఁడు. కాని, వారికి లేనియాశ మీ కున్నదిగదా! దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

## అధ్యాయము 16.

దేవుఁడు నీ కిచ్చినవిజ్ఞానము నుపయోగించి మనుష్యులకు తీర్పు చెప్పుదువు గదా యని మేము నీకు గ్రంథము నంపి యున్నాము. కాని, మోసగాండ్రతో వాదింపఁ బోకుము.

దేవుని క్షమాపణ వేఁడుము. దేవుఁడు క్షమాయుతుఁడు. దయాళుఁడును గదా!

తమ్ము తామే మోసగించుకొనినవారిని దయఁ జూడు మని మమ్ము ప్రార్థింపకుము. మోసగాఁడును, నేరస్థుఁడును, నయినవానిని దేవుఁడు ప్రేమింపఁడు.

మనుష్యులనుండి వారు మఱుగుపడి యుండెదరు కాని, దేవుని ముందఱ దాపఱిక మెక్కడిది? ప్రతిరాత్రియు నాతని కిష్టములేని సభలను వారు చేయునప్పు డాతఁడు వారితో నుండనేయుండును. దేవుఁడు వారికృత్యములచుట్టు నున్నాఁడు.

ఓహో! ఇహలోకమున మీరు వారిపక్షమున క్షమాపణ వేఁడుచున్నారే కాని, రక్షణదినమున వారి కెవ రడ్డుపడఁగలరు? వారి కప్పు డెవ్వరు సంరక్షకులు కాఁగలరు?

110. కాని కీడొనరించి తమయాత్మలకే భంగము గావించుకొనినను, పిదప దేవుని క్షమాపణ వేడినవా రాతని క్షమాయుతునిగను, కరుణామయునిగను, గనుఁగొనఁ గలరు.

పాపముచేసినవాఁడు తనముప్పునకే యట్లు చేయుచుండును. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు!

అవశుఁడై తప్పును నేరమును గావించి, పిదప నమాయకులపై నానేరమును ద్రోయువాఁడు పరనిందాదోషమునకును స్పష్టమగు నేరమునకును బాధ్యుఁ డగుచున్నాఁడు.

## అధ్యాయము 17.

దేవునిదయయుఁ గరుణయు నీపై లేకుండినచో వారిలోఁ గొందఱు నిన్ను తప్పుదారిఁ బెట్టి నరకమునఁ ద్రోయ నిశ్చయించి యుందురు. కాని, వారు తమ్మేఁ దామే త్రోవ తప్పించుకొని, తమ యాత్మలను నరకమునఁ ద్రోసికొనినవా రగుదురు. వారు నీ కేవిషయమునను కీడు చేయలేరు. గ్రంథమును విజ్ఞానమును దేవుఁడు నీపై నవతరింపఁ జేసినాఁడు. నీకుఁ దెలియనిదాని నాతఁడు నీకుఁ దెలియఁజేసినాఁడు. దేవునికి నీపై నపారమగుదయ గలదు.

వారి రహస్యసంభాషణమువలన నేలాభమును లేదు. భిక్షాదానమును, క్రమవర్తనమును, పరస్పరసౌమనస్యమును విధించువానికే శ్రేయస్సు కలుగును. దేవుని సంతోషపెట్టుట కట్లు చేసినవానికి తుదకు గొప్పబహుమాన మిచ్చెదము.

"రక్షణఁ" గూర్చి తెలిసినపిదపఁగూడ ప్రవక్తనుండి విడఁబడి విశ్వాసులమార్గము గాక మఱియొకమార్గమును బట్టినవానికి మా కాతఁడు వెనుద్రిప్పినట్లే మేమును నతనిపైకి వెనుద్రిప్పి

వానిని నరకమునఁ గూలఁ ద్రోయుదుము. ఆమార్గ మతిదుర్గమ ముగా నుండఁగలదు.

## అధ్యాయము 18.

తనతో నితరదైవములఁ జేర్చుటను దేవుఁడు క్షమింపఁడు. తన యిష్టమువచ్చినవా రితరపాపములఁ జేసినవారి నాతఁడు క్షమించు నేమో కాని, యితరదైవములఁ గూర్చువారు తప్పుదారిని కడు దవ్వు పోయియున్నారు.

వారు కేవలము స్త్రీదేవతలనే పిలుచుచున్నారు. వారు తిరుగు బాటు చేసిన సైతాను నావాహనము చేయుచున్నారు.

వారిపై దేవుఁడు క్రుద్ధుఁడై యున్నాఁడు. అతఁడు "నీసేవకు లలోఁ గొందఱను గ్రహించి,

వారిని దారి తప్పించి, వారియందు కామముల నుద్రేకింపఁ జేసి, యాజ్ఞాపింపఁగనే వారు జంతువులచెవులను కోయుదురు. నాయాజ్ఞ యైనంతనే వారు దేవునిసృష్టిని మార్చివేయుదురు" అని యనియున్నాఁడు. దేవునిఁగాక సైతానును రక్షకునిగాఁ జేకొనిన వానికి నాశనము స్పష్టముగ గోచరించుచునే యున్నది.

120. అతఁడు వారికి వాగ్దానములఁ జేసి, వారియందు కామముల నుద్రేకింపఁజేసి యున్నాఁడు. కాని సైతాను దారి తప్పించుటకే యట్టివాగ్దానములఁ జేయును. వీరా! వీరికి నరకమే యావాసము. వా రందుండి తప్పించుకొనఁ జాలరు.

కాని, విశ్వాసులై క్రమవర్తను లగువారిని తరంగిణులు ప్రవ హించు నుద్యానవనములలోఁ బ్రవేశపెట్టుదుము. అచట వారు శాశ్వతముగ వసింపఁగలరు. ఇది సత్యముగా దేవునివాక్యము. దేవునివాక్యమునకంటె నిశ్చయమైన దేది?

ఈవిషయములు మీ కోరికల ప్రకారమును 'గ్రంథా' వలంబకులగు ప్రజలకోరికల ప్రకారమును జరుగవు. కీడు చేసినవాఁడు దానిఫల మనుభవింపఁ గలఁడు. అతనికి దేవుఁడు గాక మఱియొక సహాయకుఁడు గాని, సంరక్షకుఁడు గాని దొరకఁడు.

స్త్రీ గాని, పురుషుఁడు గాని, క్రమవర్తనులై విశ్వసించినచో భోగభూమిం జొరఁగలరు. ఖర్జూరపుగింజపై తొక్కపాటి యపాయమును వారికి కలుగనేరదు.

దేవుని కధీనుఁడై, క్రమవర్తనము గలిగి నిష్కాపట్యముతో నిబ్రాహీముమతము ననుసరించువానిమతముకంటె నుత్తమమతమెద్ది? దేవుఁ డిబ్రాహీమును స్నేహితునిగాఁ జేకొనెను.

స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవునిదే. దేవుఁడు సర్వము నావరించుకొని యున్నాఁడు.

## అధ్యాయము 19.

ఇదిగాక వారు నిన్ను స్త్రీలఁ గూర్చి యుపదేశ మడుగుదురు. వారితో "వారిని గూర్చి దేవుఁడు మీకు చెప్పియే యున్నాఁడు. అనాథస్త్రీశిశువులకు న్యాయముగ రావలసినపాలును, నీ వీయ నప్పుడును, వారిని నీవు పెండ్లియాడ నొల్లనప్పుడును, బలహీనులగు బాలురఁగూర్చియు, అనాథశిశువులయెడ నీవు న్యాయముగ వర్తింప వలయు ననియు, నాతఁడు తనగ్రంథముమూలమున తనయిచ్ఛను నీకుఁ దెలిపియే యున్నాఁడు. నీవు గావించుప్రతికార్యమును దేవునికిఁ దెలియుచునే యున్నది.

భర్తకు తనపై నిష్టము లేక కష్టపెట్టునేమో యని భార్య భయపడినచో వారిరువురు నొడఁబడుటవలన తప్పు లేదు. ఒడంబడుటయే

యు త్తమము. మనుష్యులయాత్మలు సాధారణముగ నత్యాశ కాకరములై యుండును. కాని, నీవు దయతో వర్తించి దేవునికి భయపడుచున్నచో నీకార్యములను దేవుఁడు గుర్తింపకపోఁడు!

నీవు నీభార్యల నందఱ నొకేరీతిగఁ జూచికొనవలె నని యెంత యభిలషించినను నట్లు చేయ శక్తుఁడవు కాఁజాలవు. కాని, విమన స్కుఁడవై యున్నట్లు నటించి వారిలో నెవ్వరిని వేధింపకుము. మీ రొకరి నొకరు బోధపఱచుకొని దేవునికి భయపడినచో దేవుఁడు క్షమించి దయఁజూడఁ గలఁడు.

130. కాని, వారు విడఁబడినచో దేవుఁడు వారిని దయతోఁ జూడకపోఁడు. దేవుఁడు సర్వప్రదాత! బుద్ధుఁడు!

స్వర్గమర్త్యములం దున్నదంతయు దేవునిదే! మీకును, మీకుఁ బూర్వము సత్యగ్రంథముల నంపినవారికిని, దైవభీతిని విధించి యుంటిమి. కాని, మీ రవిశ్వాసుల రైనను, స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవునిదే యని తెలిసికొనుఁడు. దేవుఁడు భాగ్యవం తుఁడు. స్తవనీయుఁడు.

స్వర్గమర్త్యములయం దున్నదంతయును దేవునిదే. ఆతని సహాయమే మీకు చాలును.

ఓమనుష్యజాతీ! అతని కిష్టమైనచో మిమ్ము రూపుమాపి, మీస్థానమున నితరుల నతఁడు స్థాపింపఁ గలఁడు. దేవుని కిట్లు చేయు టకు శక్తి కలదు.

ఇహలోకఫలమునకై యందఱు నాసింతురు గాని, యిహపర లోకఫలములు రెండును, దేవునియందే యున్నవి.! దేవుఁడు చూచు చున్నాఁడు; వినుచున్నాఁడు!

## అధ్యాయము 20.

విశ్వాసులారా! దేవునిమ్రోల మీరిచ్చుసాక్ష్యము, మీకును, మీతలిదండ్రులకును, బంధువులకును విరుద్ధముగ నున్నను, ఎదురుకక్షవారు ధనవంతులైనను, నిరుపేదలైనను, న్యాయము నందు గుఱి నిల్పుఁడు. మీకంటె దేవుఁ డిరువురకును దగ్గఱగ నున్నాఁడు. కావున మీరు సత్యమునుండి తొలఁగకుండుటకు మీ కామములకు వశులు కాకుండుఁడు. కాని, మీసాక్ష్యమును నిర్బంధము వలనఁ జెప్పినను, సాక్ష్య మీయకుండ దూరముగ నుండిపోయినను, దేవుఁడు చేయున దంతయును నెఱుంగుచునే యున్నాఁడు గదా!

విశ్వాసులారా! దేవునియందును, నాతనిప్రవక్తయందును, నీకుఁ బంపఁబడినగ్రంథమునందును, నీపూర్వులకుఁబంపఁబడినగ్రంథము నందును, నమ్మకము గలిగి యుండుఁడు. దేవుని, నతనిదేవతలను, నతనిప్రవక్తలయందును, తుదిదినమునందును, నమ్మనివాఁడు, తప్పు త్రోవయందు కడుదవ్వు పోయియున్నాఁడు.

తొలుత విశ్వసించి మఱల విశ్వసింపక, తిరిగి నమ్మి, యావె నుక నమ్మక తమయవిశ్వాసమును వృద్ధిచేసికొనినవారిని సరియగు మార్గమున దేవుఁడు తీసికొని పోఁడు.

కపటులకు ఘోరబాధ కలుగనున్నదని చాటుము.

విశ్వాసులను గాక యవిశ్వాసులను స్నేహితులుగఁ జేకొనిన వారు వారినుండి గౌరవము నాసించుచున్నారా? గౌరవ మంతయు దేవునిదే కదా!

140. ఇంతకుపూర్వమే యాతఁడు తనగ్రంథములో "దేవునిసూచ నలను మీరు వినునప్పుడు వారు విశ్వసింపఁబడక కేలి చేయఁబడు

దురు” అనువాక్యము చెప్పఁబడియే యున్నది. కావున వారు సంభాషణ నారంభింపకపూర్వము వారితోఁ గూర్చుండకుఁడు. కూర్చున్నచో మీరును వారివంటివా రగుదురు. దేవుఁడు కపటులను, నవిశ్వాసులను గలిపి నరకములో తప్పక చేర్చును.

వారు మిమ్ము సూక్ష్మముగఁ బరిశీలించుచున్నారు. మీకు దేవుఁడు విజయ మిచ్చినచో వారు “మేము మీతో నుంటిమి గదా!” యనియు, నవిశ్వాసులు జయించినచో వారితో “మేము మీకంటె నధికులము గదా! మీకు విశ్వాసులపై తోడ్పడితిమి కామా?” యనియు నందురు. రక్షణదినమున దేవుఁడు మీకును వారికిని, మధ్యవర్తియై తీర్పు చెప్పఁగలఁడు. దేవుఁ డెన్నఁడును విశ్వాసులపై నవిశ్వాసుల నుంచఁడు.

## అధ్యాయము 21.

కపటులు దేవుని మోసపుచ్చఁ జూతురు గాని, దేవుఁడే వారిని మోసపుచ్చును. వారు ప్రార్థించునపుడు నిర్లక్ష్యముగ నిలుచుండి, మనుష్యులు తమ్ముఁ జూచుటయే ప్రధానము చేసికొని దేవుని నించుకైనను స్మరింపరు.

వా రిటునటుఁ గాక, వారికిని వీరికిని పొందక యుందురు. దేవుఁడు దారి తప్పించినవానికి, మఱి నీవు దారి చూపఁజాలవు.

విశ్వాసులారా! విశ్వాసులతో స్నేహము చేయుఁడు గాని, యవిశ్వాసులను చేపట్టకుఁడు. మిమ్ము దేవుఁడు శిక్షించుటకుఁ దగినకారణము గల్పింప నెంతురా?

కపటు లగ్ని కడుగుబిలములో నుండఁగా వారి కచట నెవ్వరును సహాయము చేయఁ జాలరు.

కాని, వెనుకకు మఱలి, పరితపించి, దేవుని గట్టిగ నాశ్ర యించి దేవునికి తమమతమునందలి భక్తిని నచ్చఁ జెప్పువారు మాత్రము భక్తులలో గణనకెక్కి దేవుని గొప్పబహుమానమునకుఁ బాత్రు లగుదురు.

మీరు కృతజ్ఞులు, విశ్వాసులు నైనచో మిమ్ము దేవుఁ డేల శిక్షింపవలయును ? దేవుఁడు కృతజ్ఞుఁడు, బుద్ధుఁడు.

---

# కాండము. 6

---

ఎవరి కయిన కీడు కలిగినఁ దప్ప నెవ్వరును దౌష్ట్యమును గూర్చి బహిరంగముగ మాట్లాడకుండుట దేవుని కిష్టము. వినువాఁడును, తెలిసికొనువాఁడును దేవుఁడే.

మీరు మేలును ప్రకటించినను, దాఁచినను, కీడును క్షమించినను, దేవుఁడు క్షమించును. అతఁడు శక్తిమంతుఁడు.

150. దేవుని, నతనిప్రవక్తలను నమ్మనివారును, దేవుని నాతని ప్రవక్తనుండి విడదీయ నెంచువారును, " మేము కొంత నమ్ముదుము. కొంత నమ్మము " అనువారును, అటు నిటు గాక మధ్యదారిని ద్రొక్క నెంచువారును,

వీరా ! వీరే తప్పక యవిశ్వాసులు ! అవిశ్వాసులకు లజ్జాకర మగుశిక్షను సిద్ధపఱిచి యున్నాము.

కాని, దేవుని నాతనిప్రవక్తలను నమ్మి, వారిలో వారికి భేదములఁ గల్పింపనివారికి తుదకు బహుమాన మిచ్చెదము. దేవుఁడు దాక్షిణ్యమూర్తి ! కరుణాళుఁడు !

## అధ్యాయము 22.

గ్రంథావలంబకులు నిన్ను స్వర్గమునుండి యొకగ్రంథమును తెప్పింపు మందురు. కాని, వారు మోసెసు నింతకంటె నెక్కుడుపనిఁ జేయు మనిరి. వా రాతనితో "మాకు దేవుని స్పష్టముగాఁ జూపు" మనిరి. వారిదౌష్ట్యమునకుగా వారిపై నగ్నివర్షము కురిసెను. వారికి మా స్పష్టములగునానవాళ్ళు తెలిసినను వా రొకదూడను పూజా వస్తువుగా గ్రహించిరి. కాని, మేము వారిని క్షమించి మూసాకు నిస్సందేహమగు శక్తి నిచ్చితిమి.

మేము వారితో నొడంబడిక చేసికొనినప్పుడు పర్వతమును వారికి పైఁగా నెత్తి "పూజించుచు ద్వారమును జొరుఁడు. సాబత్తు వ్రతము నుల్లంఘింపకుఁడు" అని యుపదేశించి, వారివలన నొడం బడికపత్రమును గొంటిమి.

కాని, వారు తమయొడంబడికను తప్పి, దేవునిసూచనలను లక్ష్యముచేయక, యన్యాయముగా ప్రవక్తలను జంపుచు 'మాహృ దయములు సంస్కారముఁ బొందలే" దనిరి. దేవుఁడు వారి యవి శ్వాసమునకై వారిహృదయములకు మూఁతలు వైచెను. కావునఁ గొలఁదిగ మాత్రమే విశ్వసించి యున్నారు.

వారియవిశ్వాసమునకును, మరియమ్మపై గొప్పయపనిందను మోపినందులకును,

దేవునిప్రవక్తయు, మరియమ్మపుత్త్రుఁడగు ఈసా యను దూతను చంపినవారము మేమే యని యనినందులకును, వారి కిట్లు యినది కాని, వా రాతని జంపలేదు. అతనిని శిలువపై నెక్కింప లేదు. అతనిఁ బోలినమతియొకనిని మాత్రమే వా రంటఁ గలిగిరి. అతనిఁగూర్చి భేదాభిప్రాయములు గల వారాతనిఁగూర్చి సందేహ

పడిరి. అతనిఁగూర్చి వారికి నిశ్చయజ్ఞానము లేకుండుటచే, నొకరి మాటను మాత్ర మనుసరించుటచే, వా రతనిని నిశ్చయముగ చంప లేకపోఁగా,

దేవుఁ డతనిని తనయొద్దకుఁ జేర్చికొనెను. దేవుఁడు శక్తి మంతుఁడు, బుద్ధుఁడు !

ప్రతిగ్రంథావలంబియు మృతినొందకపూర్వ మాతని విశ్వ సింపక యుండఁడు. రక్షణదినమున నాతఁడు వారిపై సాక్ష్య మిచ్చును.

160. యహూదీలు కొందఱు దుష్టులగుటచేతను, చాలమందిని వారు దైవమార్గమునుండి తప్పించి యుండుటచేతను, వారికి పూర్వము మేము ప్రసాదించియుండిన భక్ష్యభోజ్యముల నిపుడు నిషేధించితిమి.

మేము నిషేధించినను వారు వడ్డికి వడ్డి పెంచి యితరులధన మును వినోదముకొఱకు మ్రింగివేయుటచే నవిశ్వాసులకు ఘోరబా ధను సిద్ధము చేసియున్నాము.

కాని, మహాజ్ఞానులై నీకుఁ బంపినదానిని, నీపూర్వులకుఁ బంపినదానిని, నమ్మినవారై, ప్రార్థనలు సలిపి, విధింపఁబడినభిక్షము పెట్టుచు, దేవుని యందును, తుదిదినమునందును, విశ్వాసము గలవా రికి గొప్పబహుమానము నీయఁగలము.

## అధ్యాయము 23.

నుహూకును, అతనియనంతరము వచ్చినప్రవక్తలకును, ఇబ్రాహీము, ఇస్మాయేలు, ఇసాకు, యాకూబు, ఆయాజాతుల వారు ఈసా, అయ్యూబు, యూనూసు, హారూను, సులైమాను

మొదలగువారికి తెలిపినట్లే నీకును జ్ఞానమును వెల్లడించియున్నాము. దావూదునకు దైవకీర్తనల నిచ్చియుంటిమి.

"కొందఱుప్రవక్తలఁగూర్చి నీకు చెప్పియున్నాము. కొందఱినిఁగూర్చి చెప్పనేలేదు" అని దేవుఁడు మూసాతో సంభాషించెను.

ఈప్రవక్తలపిదప వచ్చినజనులు దేవునిఁగూర్చి యాక్షేపింపకుండుటకు ప్రకటనలతోడను, భయసూచనలతోడను, వారిని బంపియుంటిమి. దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధుఁడు!

దేవుఁడు నీకుఁ బంపినదానికి తానే సాక్షి. అతఁడు జ్ఞాని కావుననే దానిని నీకుఁ బంపెను. దేవతలును సాక్ష్యమీయఁగల్గుదురు గాని, దేవునిసాక్ష్యము చాలును.

విశ్వసింపక దేవునిమార్గమునుండి తప్పిపోయినవారు, సత్యమునుండియు నతిదూరముగ పోయినవారే కదా!

విశ్వసింపక యన్యాయవర్తు లగువారిని దేవుఁడు క్షమింపక,

నరకమార్గమునఁ దప్ప వారిని నడిపింపక యందే శాశ్వతముగ వసియింపఁ జేయును. ఇది దేవునికి సులభము.

170. జనులారా! మీప్రభువునుండి సత్యమును పట్టుకొని, యిదిగో ప్రవక్త వచ్చియున్నాఁడు. మీరు విశ్వసించినచో శ్రేయోదాయక మగును. మీరు విశ్వసింపకున్నను స్వర్గమర్త్యములయందున్న దంతయు దేవునిదే కదా! దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు!

గ్రంథావలంబులారా! మీ మతమునందలి కట్టుబాట్లను మీఱకుఁడు. దేవునిఁగూర్చి సత్యమునే వచింపుఁడు. మరియమ్మపుత్త్రుఁడగుదూత దేవునిప్రవక్తలలో నొకఁడే. అతఁడు మరియమ్మగర్భములోనుంచినమాటయే, తనయొద్దనుండి బయలువెడలిన యొకవ్యక్తివిశేషమే తప్ప మఱియొకఁడు కాఁడు. కావున, దేవునియందును

ఆతనిప్రవ_క్తలయందును, నమ్మకము గలిగి, "త్రిమూర్తు లున్నా" రని పలుకఁబోకుఁడు. అట్లు పలుక కున్నచో మీకు శ్రేయస్సు కలుగును. దేవుఁ డొక్కఁడే! అతని కొకపుత్త్రుఁ డుండుటకును, ఆతనిమహిమకును చాలదూరము. స్వర్గమర్త్యములం దున్నదంతయు నాతనిదే! దేవుఁడు తగినసంరక్షకుఁడు.

## అధ్యాయము 24.

ఆదూతగాని యాతనిదరినున్న దేవతలుగాని దేవునిసేవకులుగా నుండుట కిష్టపడకుండరు.

అతనిసేవ నిచ్ఛగింపక గర్వపూరితు లగువారిని దేవుఁడు తనయొద్దకే చేర్చికొనును.

విశ్వాసులై, క్రమవర్తను లగువారికి దేవుఁడు తగినబహుమానముల నిచ్చుటయే కాక, తన యపారకరుణచే వారిని వృద్ధి నొందించును. కాని, లక్ష్యపెట్టక గర్వితులైనవారి నాతఁడు ఘోర బాధలపాలు చేయును.

దేవుఁడు తప్ప మఱెవ్వరును వారికి సహాయపడువారు గాని, రక్షించువారు గాని యుండఁబోరు.

జనులారా! ఇదిగో మీ ప్రభువు మీ కొకస్పష్టమగు సాక్ష్యమును బంపినాఁడు. మేము మీ కొకనిర్మలజ్యోతిని బంపినాము. దేవుని విశ్వసించి యతనినే గట్టిగ నాశ్రయించికొని యున్నవారిని, దేవుఁడు తనదయాదాక్షిణ్యములకుఁ బాత్రులఁ జేసి, తిన్ననిమార్గమునఁ దనయొద్దకే చేర్చికొనును.

వారు నీయుపదేశమును గోరునప్పుడు వారితో "దూరబంధువులకువలె దేవుఁడు మీకు బోధచేయును. ఎవనికైనను సంతా

నము లేక చనిపోవునప్పు డాతని కొక్కయక్కచెల్లె లున్నచో ఆతనిధనములో సగ మామెకు పోవలయును. ఆమె సంతానములేక మృతినొందినచో తానే యామెకు వారసుఁడగును. అతని కిద్ద ఱక్కచెల్లెం డ్రున్నచో తనధనములో మూఁడువంతులలో రెండువంతులు వారికి వెళ్ళును. అన్నదమ్ములు నక్కచెల్లెండ్రుఁ గూడ నున్నచో మగవాని కిద్దఱాఁడువారలభాగము వెళ్ళును. మీరు పొరపడకుండ నుండుటకు దేవుఁడు మీకు స్పష్టముగ బోధించుచున్నాఁడు. దేవుఁడు సర్వజ్ఞుఁడు!

# సురా 5 ఆహారము.

మదీనా—120 పద్యములు—16 రుకూలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

విశ్వాసులారా! మీ రిచ్చినమాట తప్పకుఁడు. మీరు వేఁటాడి చంపినజంతువులమాంసమును యాత్రకుఁ బోవునప్పుడు తప్ప నితరసమయములయందు తినవచ్చును. ఇఁక ముందు చెప్పఁబడు నది తప్ప పశువులమాంసమును మీరు భుజింపవచ్చును. దేవుఁడు తన కిష్టమైనదానిని విధించుచుండును గదా!

విశ్వాసులారా! దేవునిసంబంధములగు కర్మలును, రమధాను పండుగయు, పూజలును, మాలాధారణమును, ప్రభువు దయసంపాదించి యాతనియనుగ్రహమునకుఁ బాత్రు లగుటకు పవిత్రగృహమునకుఁ బోవ త్వరపడుటయు, వీనినిగూర్చిన యతిక్రమణదోషమునకుఁ బాల్ప

డకుఁడు. మీవిధికృత్యములు నిర్వర్తింపఁబడినపిదప వేఁట చేసికొన వచ్చును. మిమ్ము పవిత్రమగు మసీదునొద్దకు రాకుండఁ జేయువారి యెడలఁ గల కార్పణ్యముచే పవిత్రమాసమున యుద్ధము చేయక, సదాచారమునకును, భక్తికిని ననుగుణముగ నౌకరి కొకరు సహాయము చేసికొనుఁడు. దౌష్ట్యమునకును, కార్పణ్యమునకును తోడ్పడకుఁడు. దేవునికి భయపడుఁడు. దేవుఁడు కడు కఠినముగ శిక్షించును గదా !

స్వాభావికముగా చనిపోయినది, రక్తము, పందిమాంసము, దేవుని పేరఁ గాక యితర దేవత పేరఁ జంపఁబడినది, ఉరితీసినది, గ్రుద్దుటవలనను, పడిపోవుటవలనను, పొడుచుటవలనను మృతి నొందినది, చావుదెబ్బను మీచే తినక క్రూరమృగములచే చంపఁబడినది, బూతిదిమ్మలకు బలిగా నొసఁగబడినది, యిది యంతయు మీకు నిషిద్ధము. చంపఁబడినదానిని పంచుకొనునప్పుడు బాణములను లెక్కించుట దైవాపరాధము. మీమతము నీదినమున విసర్జించువారు దుఃఖులగుదురు. వారికి భయపడకుఁడు. నాకు భయపడుఁడు. ఈదినమున మీమతమును పరిపూర్ణము చేసి, మావరములను మీకు నిండుగా నిచ్చితిమి. ఇస్లామే మీమత మగుట నాయిష్టము. కాని, మనస్ఫూర్తిగా దౌష్ట్యమునకుఁ బూనుకొనక యాఁకలిచే నుల్లంఘన చేసిన వానిని దేవుఁడు దయగలిగి కరుణించును.

తమకు విధివిహిత మేది యని వారు నిన్నడుగుదురు. “ మంచి వస్తువు లన్నియును, దేవుఁడు మీకు నేర్పినట్లు మీరు మృగములకును బక్షులకును వేఁట నేర్ప, వానివలన సంపాదించినమాంసము మీకు ధర్మాహారముగా విధింపఁబడి యున్నది. కావున నవి మీ కాహారముగాఁ దెచ్చిపెట్టినదానిని భుజించుచు, భుజించునప్పుడు

దేవునినామమును స్మరించి యాతనికి భయపడి యుండుఁడు. దేవుఁడతిత్వరగా లెక్క పెట్టుచుండును సుఁడీ !

ఆరోగ్యవంతము లైనవియు, ధర్మగ్రంథమును గ్రహించువారు భుజించునట్టివియు నగుమాంసములను, మీమాంసములు వారి కెట్లు విధివిహితములో, అట్లెవారివియు మీకీదినమున ధర్మాహారముగా నిర్ణయింపఁ బడియున్నవి. విశ్వాసము గలిగి పుణ్యవతు లయినస్త్రీలను, మీకు పూర్వము ధర్మగ్రంథములఁ జేకొనినవారి స్త్రీలకు రావలసినభాగము నిచ్చినపిదప వారిని, మీరు పత్నులఁగా గ్రహింపవచ్చును. కాని, మీరితరస్త్రీలను చెఱఁబట్టుటయు, భోగినుల నుంచుకొనుటయు చేయక, నిర్మలజీవనము చేయుచుండవలయును. ఈమతమును విడిచిపెట్టెడువారికార్యము లన్నియు వృథయగును. పరలోకమున వారు నష్టులయినవారిలో చేరుదురు.

అధ్యాయము 2.

విశ్వాసులారా ! మీరు ప్రార్థన చేయఁబోవునపుడు మొగములను, మోచేతులవఱకు చేతులను, కడిగికొనుఁడు. మీశిరములను,చీలమండలవఱకును మీపాదములను,తుడిచికొనుఁడు. మీరు మైలతగిలినచో పవిత్రులరు కండు. కాని, రోగులై యున్నను, ప్రయాణమై పోవుచున్నను, మీలో నొకఁడు మఱుగుదొడ్డినుండి వచ్చియున్నను, మీరు స్త్రీల నంటియున్నను, నీరు దొరకకపోయినయెడల శుభ్రమైన యిసుకనైనను దీసికొని మీముఖములను చేతులను దానితో తుడిచికొనుఁడు. దేవుఁడు మీపై భారమునుంపఁ దలంపలేదు. మీరు పవిత్రులై యుండుటయే యాతనికోరిక. మీరు కృతజ్ఞు లగుటకు మిమ్ము సంపూర్ణముగ ననుగ్రహించును.

దేవునికి మీపైఁగల యనుగ్రహమును స్మరింపుఁడు. 'మేము విని యున్నాము. నిన్ను మన్నించెద' మని మీ రాతనితోఁ జేసి

కొనిన యొడంబడికను జ్ఞాపకముంచుకొనుఁడు. దేవునికి భయపడుఁడు. నిశ్చయముగా దేవునికి హృదయమందలి రహస్యము లన్నియుఁ దెలియును.

విశ్వాసులారా! క్రమవర్తను లై దేవునికి సాక్షులుగా నిలుచుండుఁడు. మీ కెవనిపై నైనను గల వైమనస్యముచే క్రమ మార్గమును వదలిపెట్టకుఁడు. సరిగ వర్తింపుఁడు. దైవభీతితరువాత నిదియే ధర్మము. దేవునికి భయపడుఁడు. నిశ్చయముగా దేవునికి మీరు చేయున దంతయుఁ దెలిసియే యున్నది.

విశ్వసించి క్రమమగుపనులను చేయువారికి క్షమాపణను, గొప్పబహుమానమును దేవుఁ డొసగ వాగ్దానము చేసియున్నాఁడు.

10. కాని, యవిశ్వాసులై మాసూచన లసత్యము లనువారు నరకాగ్నిలోఁ జేర్పఁబడుదురు.

విశ్వాసులారా! కొందఱుజనులు మిమ్ము పట్టుకొనఁ దలఁచి నప్పుడు వారినుండి మిమ్ముఁ దప్పించిననాఁటిదేవునికృపను జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు. దేవునికి భయపడుఁడు. విశ్వాసులు దేవుని నమ్మి యుండెదరుగాక!

## అధ్యాయము 3.

పూర్వకాలమున దేవుఁడు ఇస్రాయేలుసంతతివారి యొడంబడిక నంగీకరింపఁగా వారినుండి మేము పన్నిద్దఱుప్రవక్తలను లేవఁ దీసితిమి. దేవుఁడు వారితో "నేను మీతో నుందును సుఁడీ! మీరు ప్రార్థనల సలుపుచు, విధివిహితభిక్షమును బెట్టుచు, నాప్రవక్తలను నమ్మి, వారికి సహాయపడుచు, దేవునికి బాగుగ ఋణమునిచ్చినచో మీయకార్యములను మిమ్మునుండి తప్పించి తరంగిణులు ప్రవహించు నుద్యానవనములలోనికి మిమ్ముఁ దీసికొనిపోయెదము! ఇది తెలిసిన

పిదపఁగూడ నమ్మనివాఁడు క్రమమార్గమునుండి కడుదవ్వు తప్పిపోయి యుండును" అనెను.

కాని, వారు తమయొడంబడికను తప్పుటచే, మేము వారిని శపించి, వారిహృదయములను కఠినములుగఁ జేసితిమి. వారు దివ్య గ్రంథములలోని వాక్యములను తార్మాఱు చేసి, తమకు బోధింపఁ బడినదానిలోఁ గొంత మఱచిపోవుదురు. వారిలో కొలఁదిమంది మోసము తప్ప, అంతయు నీవు తెలిసికొనుచునే యుందువు. కాని, వారిని క్షమించి యంత పట్టుఁబట్టకుము. దయావంతులై వర్తించు వారిని దేవుఁడు ప్రేమించునుగదా!

"మేము నసారీల" మని చెప్పినవారి యొడంబడికనుగూడ మే మంగీకరించితిమి. కాని, వారును దమకుఁ దెలుపఁబడినదా నిలో నొకభాగమును మఱచిపోయిరి. కావున రక్షణదినమువఱ కును నుండఁగలశత్రుత్వమును, నసూయను, వారియం దుద్రేకింపఁ జేసితిమి. తుదకు దేవుఁడు వారు కావించినదానిని వారికిఁ దెలుపఁ గలఁడు.

సత్య గ్రంథావలంబులారా! ఆగ్రంథములో మీరు మఱుగు పఱిచినదానియందలిచాలభాగమును మీకుఁ దెలుపుటకును, చాలకా ర్యములను సరకుగొనకుండుటకును, నిపుడు మాప్రవక్త మీయొద్దకు వచ్చియున్నాఁడు. ఇపుడు మీకొక జ్యోతియు, స్పష్టగ్రంథమును వచ్చినవి.

వానిమూలమున దేవునియిష్టము ననుసరించినవారిని దేవుఁడు శాంతిస్థానములఁ జేర్చి, చీఁకటినుండి వెలుతురులోనికిఁ దెచ్చి తనయనుగ్రహమున క్రమమార్గమున మిమ్ము నడపును.

"మరియమ్మపుత్త్రుఁడే దేవుఁడు" అనువారే యిపు డవిశ్వా సులు. మరియమ్మకుమారుని, నాతనితల్లిని, వారితో భూమిపైఁగలిసి

యున్న వారి నందఱిని నాతఁడు చంపినచో, వారిని దేవునినుండి యెవరు తప్పింపఁగలరు" అనుము. స్వర్గమర్త్యములమీఁదను, ఆరెం డిటికిని మధ్యనున్న దానిమీఁదను, నధికారము దేవునిదే. అతఁడు తనయిచ్ఛవచ్చినవానిని సృజియించును. అతనికి సర్వవస్తువులపైనను శక్తిగలదు.

యహూదీలును, నసారీలును "మేము దేవునియొక్కయు, నతఁడు ప్రేమించినవారియొక్కయు పుత్త్రులము" అందురు. "అయినను నాతఁడు మీపాపములకొఱకు మి మ్మేల శిక్షించును ? మీ రాతనిచే సృజింపఁబడినమనుష్యులలోనివారే కాని యితరులు కారు. అతఁడు తనయిష్టమువచ్చినవారిని క్షమించి, యిష్టమువచ్చిన వారిని శిక్షించును. స్వర్గమర్త్యములపైనను నారెండింటికినిమధ్యనున్న దానిపైనను నతని కధికారముగలదు. సర్వవస్తువులును తుద కతని యొద్దకే చేరును.

గ్రంథావలంబులారా ! 'మా కెవ్వరును నొకసువార్తను గాని, భయసూచనను గాని, తెచ్చియుండలే' దని యనకుండ పూర్వ ప్రవక్తలు గతించినవెనుక, తిరిగి యిప్పు డొకప్రవక్తను దేవుఁడు పంపియున్నాఁడు. సువార్తను, భయసూచనను తీసికొని యొకఁ డిప్పుడు వచ్చియున్నాఁడు. దేవుఁడు సర్వశక్తుఁడు.

## అధ్యాయము 4.

20. మూసా తనప్రజలతో "నాప్రజలారా ! దేవుఁడు మీలో నుండియే ప్రవక్తల నేర్పఱిచి, మిమ్ము రాజులుగ నియమించి, పూర్వ మేమనుష్యునకు నీయనిదాని నిచ్చి, మీయెడల ననుగ్రహము చూపియుండుటను స్మరింపుఁడు.

నాప్రజలారా ! దేవుఁడు మీకు విధించియున్న పవిత్రదేశ

మును జేరుడు. మీరు నాశితులు కాకుండుటకు వెనుకకు మఱలి పోకుడు" అని చెప్పియున్నదానిని జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు.

వా రాతనితో "ఓమూసా, అందు బలవంతు లున్నారు. వారు పోయినఁగాని మే మాపురములోనికి పోలేముగదా! వారు వెడలిపోయినచోఁగదా మే మందు ప్రవేశించుట?" అనిరి.

అప్పుడు వారిలో దేవునికి భయపడి యతనియనుగ్రహామునకుఁ బాత్రులయిన యిరువురు" మీ రాద్వారముగుండ పురము చొచ్చి నంతనే వారు లొంగిపోవుదురు. మీరు విశ్వాసు లైనచో దేవుని నమ్మి యుండుఁడు" అనిరి.

ప్రజలు మూసాతో "ఓమూసా! వా రందున్నంతకాలమును మేము దానిలోనికి పోలేము. నీవును నీప్రభువును పోయి యుద్ధము చేయుఁడు. మే మిచటనే కూర్చుండియుందుము" అనిరి.

అంత నతఁడు "ప్రభువా! నాపైనను, నాసోదరునిపైనను దప్ప, నితరులపై నా కధికారము లేదుగదా! కావున మాకును నీదైవదూషకులకును, భేదముఁ గల్పింపుము" అనెను.

అప్పు డతనిప్రభువు "వారికి నలువదేండ్లవఱకు నీదేశము నిషేధింపఁబడినది. వారు చీకాకుపడుచు భూమిపైఁ దిరుగులాడు చుందురుగాక! కావున నీదైవదూషకులఁ జూచి నీవు కలఁత నొంద కుము" అనెను.

## అధ్యాయము. 5

ఆదాముపుత్త్రు లిరువురును వేర్వేఱుగ పూజలు సల్పిరి. అం దొకనిపూజ యంగీకరిపఁబడెను. రెండవయాతనిపూజ నిరాకరింపఁ బడెను. వారిలో నొకఁడు "నేను నిన్నుతప్పక చంపెద" ననెను. రెండవవాఁడు, "తనకు భయపడినవారిపూజనే దేవుఁ డంగీక రించినాఁడు.

"నీవు నన్ను చంపుటకు చేయి యెత్తినను నేను నిన్ను చంపుటకు చే యెత్తను. నేను జగన్నాథుఁ డగుదేవునికి నిశ్చయముగ భయపడెదను.

"నీవు నాపాపమును నీపాపమును గూడ మోయుచు నగ్నిలోఁ గూలుట నా కిష్టము. అక్రమవర్తనుల కిదియే లాభము" అనెను.

30\. ఇట్లనఁగా నాతఁడు క్రోధోద్రిక్తుఁడై తనసోదరునిఁ జంపివై చెను. అతఁడు నశించువారిలోఁ జేరిపోయెను.

అప్పుడు దేవుఁ డతనియొద్దకొకకాకిని బంప, నది యాతఁడు తనసోదరుని జంపిన నేరమును దాఁచిపెట్టవలసినవిధమును సూచించునట్లు నేలను గోళ్ళతోఁ ద్రవ్వెను. "అయ్యో! ఎంతదుష్టాత్ముఁడను! నాసోదరుని జంపినపాపమును దాఁచివేయుటకీ కాకివలె నేను బలహీనుఁడ నైతినా?" యని యతఁడు పరితపించెను.

ఈకారణముచేతనే నరహంతకునిఁదప్ప నెవరినైనను జంపినవాఁడును, దేశములో నల్లరులఁ బ్రబలఁ జేయువాఁడును, మనుష్యజాతి నంతటిని జంపినపాపమునఁ బోవు ననియు, నొకప్రాణమును రక్షించినవాఁడు మనుష్యజాతి నంతను రక్షించినపుణ్యముఁ గాంచు ననియు మేము ఇస్రాయేలుసంతతివారి కాజ్ఞ నంపితిమి. పూర్వకాలమున వారియొద్దకు మాప్రవక్తలు తమసందేశమునకు స్పష్టమగుప్రమాణములఁ దీసికొని వెళ్ళిరి కాని, తరువాతఁగూడ వారు దేశములో దుర్నయములఁ జేసిరిగదా.

దేవునిపైనను నాతనిప్రవక్తపైనను యుద్ధము చేయుచు దేశములో నల్లరులఁ బ్రబలఁజేయువారికి చంపఁబడుటయో, సిలువనెక్కుటయో, ఒకప్రక్క పాదములును, నొకప్రక్క చేతులును, ఖండింపఁబడుటయో, దేశమునుండి వెడలఁగొట్టఁబడుటయో ఫలమగును.

వారు నీవళము కాకపూర్వమే పరితపింపకుండినచో నిహాలోకమున నిట్టియవమానమును, బరలోకమున ఘోరబాధను బొందఁగలరు. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు" నని తెలిసికొనుము.

అధ్యాయము 6.

విశ్వాసులారా! దేవునికి భయపడుఁడు. ఆతనిఁ గలియఁగోరుఁడు. మీకు సౌఖ్యము కలుగుట కాతనిమార్గము ననుసరింపఁగష్టపడుచుండుఁడు.

అవిశ్వాసులు రక్షణదినమున తా మనుభవింపవలసినబాధకు పరిహారముగాఁ దమకుఁ గలధనముకంటె రెండింత లిచ్చినను నది యంగీకరింపఁబడదు. వారికి దుఃఖకరమగు బాధ కలుగును.

వా రగ్నినుండి బైటఁబడఁ జూతురు గాని, దానినుండి వారు తప్పించుకొనలేరు. వారికి శాశ్వతమైన బాధయే ప్రాప్తము.

స్త్రీ యైనను, పురుషుఁ డైనను, దొంగతనము చేసిన, వారి చేతులను ఖండించివేయుము. దేవుఁడే భయసూచనగా నీశిక్షను విధించినాఁడు. దేవుఁడు శక్తిమంతుఁడు; బుద్ధుఁడు.

తొలుత దుర్మార్గుఁ డైనను, దానినుండి మఱలి దేవుని కభిముఖుఁ డగువానికి దేవుఁ డభిముఖుఁ డగును. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు.

40. స్వర్గమర్త్యములయధికారము దేవునిదని నీకుఁ దెలియదా? అతఁడు తనయిచ్ఛవచ్చినవారిని శిక్షించి, యిష్టమైనవారిని క్షమించును. దేవుని కన్నివస్తువులపైనను శక్తి గలదు.

ఓయీ ప్రవక్తా! ఎవరు ముందుగ భక్తిహీనుల మగుదుమని త్వరపడుదురో వారు, నోటితో విశ్వసించితి మని హృదయములలో విశ్వాసము లేనివారు, అసత్యములకును నితరులకును చెవి

యొగ్గుచు నీయొద్దకురాని యహూదీలు, వీరివలన నీవు కలఁత నొంద కుము. వారు ధర్మగ్రంథములోనివాక్యములను తార్మాఱు చేసి "ఇది మీకు తేఁబడినచో స్వీకరింపుఁడు; లేకున్న, దానింగూర్చి జాగ్రత్తగ నుండుఁడు" అందురు. దేవుఁడు దారి తప్పింప నెంచిన వానిని క్షమింపు మని దేవునితో నీవు చెప్పనే లేవు. దేవుఁడు వారి హృదయములఁ బవిత్రముః చేయ నెంచనిచో, వా రిహలోకమున నవమానమును బరలోకమున ఘోరశిక్షను ననుభవింపఁగలరు.

వా రసత్యములకుఁ జెవి యొగ్గి, నిషేధింపఁబడినదాని నాతుర తతో దిగమ్రింగుదురు. వారు నిన్నుఁ జేరినచో వారికి తీర్పయి నను చెప్పుము; వారినుండి తొలఁగియైన నుండుము. నీవు వారల కెడముగ నున్నచో వారు నీ కేహానియుఁ జేయఁజాలరు. నీవు తీర్పు చెప్పుచో న్యాయముగ తీర్పు చెప్పుము. న్యాయమును చెప్పు వారిని దేవుఁడు ప్రేమించునుగదా!

దేవునియాజ్ఞలుగలగ్రంథము వారియొద్ద నున్నను దానిని వారు మన్నింపలేదే! వారు నిన్ను న్యాయకర్తగా నెంచుకొందురా? ఇటుపై వారు వెనుదిరుగుదురు. అట్టివారు విశ్వాసులు కాఁజాలరు.

## అధ్యాయము 7.

రక్షణయు, వెలుతురును గలయనుశాసనమును మేము పంపియుంటిమిగదా! ఇస్లాము నవలంబించినవారు దానినిబట్టియే యహూదీలను బరీక్షించిరి. విద్వాంసులును, గురువులును, తాము రక్షకులుగను, సాక్షులుగను జేయఁబడిన యాగ్రంథభాగమునుబట్టి పరీక్షించిరి. కావున నోయహూదీలారా! నాకు భయపడుఁడుగాని, మనుష్యులకు భయపడకుఁడు. తుచ్ఛధనమునకై నాసూచనల నమ్మ

వేయకుఁడు. దేవుఁడు పంపినదానినిబట్టి తీర్పు చెప్పనివారే దైవ ద్రోహులు.

"ప్రాణమునకుఁ బ్రాణము, కన్నుకుఁ గన్ను, ముక్కుకు ముక్కు, చెవికిఁ జెవి, పంటికి పన్ను, గాయములకుఁ బ్రతీకారము" అని మేము దానియందు విధించియుంటిమి. దీనికి బదులుగా అవకారమును మఱచిపోవువారిపాపములును తొలఁగిపోవును. దేవుఁడు పంపిన దానిని బట్టి తీర్పు చెప్పనివారే యధర్మపరులు.

పూర్వపు శాసనమును స్థిరపఱుచుచు, ప్రవక్తలమార్గము ననుసరించుటకు మరియమ్మ కుమారుండగు ఈసాను బంపి యుంటిమి. రక్షణతోడను, వెలుతురుతోడను గూడియుండుసువార్తను, పూర్వపు ధర్మమును స్థిరపఱుచుచు నతనిపరము చేసితిమి.

సువార్తఁ జేకొనినప్రజలు తమ కంపఁబడినప్రకారము తీర్పు చెప్పుటకును, దేవునికి భయపడువారికి రక్షణగను, వెలుతురుగను నుండుటకును నీశాసనము పంపఁబడినది. దేవుఁడు పంపినదాని ననుసరించి తీర్పు చెప్పనివారే దుష్టులు.

పూర్వపుదివ్యగ్రంథముల స్థిరపఱచి కాపాడు నీ కురానును నీకుఁ బంపియున్నాము. కావున దేవుఁడు పంపినదానిప్రకారము వారిని బరీక్షింపుము. నీకుఁ జేరినసత్యమును విడనాడినవారికోరికల ననుసరింపకుము. మీలో నొకొక్కజాతివారి కొకొక్కమార్గముఁ జూపియున్నాము. దేవుని కిష్టమైనచో మి మ్మందఱ నొక్కజాతివారిగనే చేసియుండును. కాని, యాతఁడు వారివారి కిచ్చిన దానినిబట్టి మిమ్ముఁ బరీక్షించును. కావున, సత్కార్యాచరణమునం దొక రొకరితో స్పర్థ వహింపుఁడు. మీ రందఱును దేవునియొద్దకే చేరుదురు. అపు డాతఁడు మీకు మీవివాదవిషయముల నెఱుక చేయును.

కావున, మీ కాతఁడు పంపినదానినిబట్టియే తీర్పుల నిచ్చుచుఁ డుఁడు. వారికోరికల ననుసరింపకుఁడు! దేవుఁడు మీకుఁ బంపిన యుపదేశములనుండి వారు మిమ్ము తప్పింపకుండ జాగరూకతతో మెలంగుఁడు. వారు వెనుదిరిగినచో వారిదుష్కార్యములలోఁ గొన్నిటికై దేవుఁడు వారిని శిక్షించు నని తెలిసికొనుఁడు. నిశ్చయముగా చాలమంది దుర్మార్గులై యున్నారు.

50. అజ్ఞానదశయందలితీర్పులను వారు కోరుకొనుచున్నారా? దృఢభక్తులకు దేవునికంటె బాగుగఁ దీర్పు చెప్పువాఁడెవ్వఁడుండును?

## అధ్యాయము 8.

విశ్వాసులారా! యహూదీలతోడను, నసారీలతోడను స్నేహముచేయకుఁడు. వారికివారే స్నేహితులుగ నుండనిండు. మీలో నెవ్వరైనను వారితో స్నేహము చేసినచో వారిలోఁ జేరిపోయినవారగుదురు. దేవుఁ డక్రమవర్తనులకు దారి చూపఁడు.

హృదయరోగములు గలవారు త్వరగ వారియొద్ద కేఁగి, "మాయదృష్టము మారునేమో యని మాకు భయమగుచున్న" దని యనుచుండుట నీవు చూడఁగలవు. బహుశః దేవుఁడు తన యాజ్ఞప్రకారము విజయమో, యేదో తీసికొని వచ్చును. అప్పుడు వారు తమరహస్యాలోచనలకై పరితపింపఁగలరు.

అప్పుడు విశ్వాసులు, "ఏమీ, వీరేనా మీతో నున్నామని ఘోరప్రమాణమును చేసినవారు" అని యడుగుదురు. వారి కార్యము లన్నియు వృథ యగును; వారు నాశనము నొందుదురు.

విశ్వాసులారా! మీలో నెవరైన నతనిమతము విసర్జించినచో, తన్ను ప్రేమించువారును, తన కిష్టులును, భక్తులయెడ నమ్రములును, దైవదూషకులను తిరస్కారముతోఁ జూచువారును, నగు

ప్రజలను దేవుఁడు లేవఁ దీయును. వారు దేవునిపక్షమునఁ బోరుచు, నిందలను మోపువారి నిందలను సరకుగొనరు. ఇదియే దేవుని యనుగ్రహము. అతఁడు తనయిచ్ఛవచ్చినవారి ననుగ్రహించును! అతఁ డనంతుఁడు! సర్వజ్ఞుఁడు!

దేవుఁడును, ఆతనిప్రవక్తయు, విశ్వాసులును, ప్రార్థనాపరులును, విధివిహితభిక్షాప్రదాతలును, ఆరాధనాపరులును, వీరేకదా మీారక్షకులు!

దేవుఁడును, నతనిప్రవక్తయు, స్నేహితులను నమ్మినవారును, వీరే ప్రజలు; వీరలచేయి మీాఁదగును.

## అధ్యాయము 9.

విశ్వాసులారా! పూర్వము పవిత్రగ్రంథములఁ జేకొనిన వారిలో మీామతమును గేలిసేసి యధిక్షేపించువారిని, దైవదూషకులను, స్నేహితులుగఁ జేకొనకుఁడు. మీారు విశ్వాసులైనచో దేవునికి భయపడుఁడు.

మీారు ప్రార్థనకుఁ బిలువఁగా, వేళాకోళము చేసి నిరసించువారితోఁగూడ స్నేహము చేయవలదు. వారికి బోధ లేదు గావుననే వా రట్లు చేయుదురు.

గ్రంథావలంబులారా! మేము దేవునియందును, మాకుఁ బంపఁబడినదానియందును, మాకు పూర్వము వచ్చినదానియందును, మేము నమ్మితి మనియు, మీారు దుష్టవర్తనుల రనియుఁ గదా మమ్ము విడనాడుచున్నారు?

60. దేవునియొద్ద వారికి వేచియున్నశిక్ష తప్ప, వారికి మఱియేశిక్షను ప్రకటింపఁగలము? దేవుఁడు తాను శపించి, కోపించిన వారిలోఁ గొందఱిని, క్రోఁతులుగను, పందులుగను మార్చివేసెను.

సైతాను నారాధించువారు దుర్గతిపాలై క్రమమార్గమును కడు దవ్వున విడిచిపెట్టి యున్నారు.

వారు మీయొద్దకు వచ్చి 'మేము నమ్మితిమి' అనిరే కాని, వచ్చినప్పు డట్లవిశ్వాసులో, మమ్ము విడిచినప్పుడు నట్లే యవిశ్వాసులుగ నుండిరి. వారు దాఁచిపెట్టినదానిని దేవుఁడు బాగుగఁ దెలిసికొనెను.

వారిలోఁ జాలమంది దౌష్ట్యమునకును, నిర్ఘృణకును లోనగుచు ధర్మేతరములగు వస్తువుల భుజించుచుండుట నీకుఁ గనఁబడును. తాము గావించినదానికి వారు సిగ్గులపా లగుదురు గాక!

వారివిద్వాంసులును, గురువులును, వారిని దౌష్ట్యము పలుకవల దనియు, ధర్మేతరాహారము భుజింపవల దనియు, నిషేధింపకుండినచో వారికార్యములు దుష్టములుగనే యుండియుండును.

'దేవునిచేతికి సంకెళ్ళు పడియున్న' వని యహూదీ లందురు. కాని, తమచేతులకే సంకెళ్ళు పడియున్నవి. వారు పల్కినదానికై శపింపఁబడుదురు. దేవుని చేతులు చాచియే యున్నవి! అతని కిష్టమైనప్పుడు వరములఁ బ్రసాదించును. నీప్రభువు నీకుఁ బంపినది వారిలో చాలజనులయందు తిరుగుబాటుదనమును, నవిశ్వాసమును వృద్ధి చేయును. రక్షణదినమువఱకును నుండునట్లు వారియందు ద్వేషమును శత్రుత్వమును నుంచియున్నాము. యుద్ధమును తెలియఁజేయుటకై వా రెన్నిసారు లగ్నిని బ్రజ్వలింపఁ జేసినను దేవుఁడు దానినార్పివేయుచుండును. భూమిపై నక్రమములఁ బ్రబలఁజేయుటయే వారియుద్దేశము. కాని, యక్రమమునకుఁ బ్రేరేపించువారిని దేవుఁడు ప్రేమింపఁడు.

కాని, గ్రంథావలంబకులు విశ్వాసులై దేవునికి భయపడినచో వారినుండి వారిపాపములను బాపి, నందనోద్యానవనములలోనికి వారిని జేర్చుదుము.

దేవుని యనుశాసనమును సువార్తను, వారికిఁ బంపఁబడిన దానిని, వారు తప్పకుండినచో, క్రిందనుండియు మీఁదనుండియుఁ గూడ వారికి మంచివస్తువులు సంపూర్ణముగఁ జేకూరును. వారిలోఁ గొందఱు క్రమవర్తనులే కాని, చాలమంది మిక్కిలిగ దుష్కార్యములఁ జేయుచుందురు.

## అధ్యాయము 10.

ఓయీ ప్రవక్తా! నీకుఁ బంపఁబడినదాని నంతను జనులకుఁ బ్రకటింపుము. నీ వట్లు చేయనిచో సందేశమును ప్రకటించిన వాఁడవే కానేరవు. దేవుఁడు నిన్ను దుష్టులనుండి రక్షించును. దేవుఁడు దుష్టులకు దారి చూపఁడుగదా!

"గ్రంథావలంబులారా! ధర్మానుశాసనమును, సువార్తను మీప్రభువు మీకుఁ బంపినదానిని మీ రనుసరించువఱకును, మీకు నిలుచుండుట కైనను స్థలము దొఱుకదు. నీప్రభువునుండి వచ్చిన గ్రంథమువలన వారిలోఁ జాలమంది తిరుగుబాటుదనమును, నవిశ్వాసమును జూపుదురు. కాని, యీయవిశ్వాసులవిషయమై నీవు కలఁత నొందకుము" అనుము.

విశ్వాసులు, యహూదీలు, సబాతుననుసరించువారు, నస్రానీలు, నెవరైనను సరే, దేవునియందును, తుదిదినమునందును నమ్మకము గలిగి క్రమవర్తను లైనచో వారికి భయముగాని, దుఃఖము గాని కలుగఁబోదు.

70. పూర్వము మే మిస్రాయేలుసంతతివారియొడంబడిక నంగీకరించి వారియొద్దకు ప్రవక్తల నంపితిమి. తమ కిష్టము కానిదానిని దీసికొని ప్రవక్తలు వచ్చినప్పుడు, వారు వారిలోఁ గొందఱి నసత్యవాదులుగఁ బరిగణించి కొందఱిని జంపివేసిరి.

అందువలనఁ దమ కెట్టి హానియుఁ గలుగ దని వా రనుకొనిరి. కాని, వా రంధులు, బధిరులు నై పోయిరి. తిరిగి దేవుఁడు వారివంకఁ దిరుగఁగా వారిలోఁ జాలమంది యింకను నంధులు, బధిరులు నైరి. వా రొనరించినదానిని దేవుఁడు చూచియే యుండెను.

"ఇస్రాయేలుపుత్త్రులారా! నాప్రభువును, మీప్రభువునునగు దేవు నారాధింపుఁడు" అని దేవదూత పలుకఁగా "మేరీపుత్త్రుఁడగు దేవదూతయే దేవుఁ" డని యనువారే దేవదూషకులు. దేవునితో నితరదైవములఁ జేర్చువారికి దేవుఁడు నందనవనమును నిషేధించి యగ్నిలోఁ గూలనేయును. దుష్టుల కెవ్వరును సహాయపడఁజాలరు.

"దేవుఁడు త్రిమూర్తులలో మూఁడవవాఁ" డని యను వారే దేవదూషకులు. దేవుఁడొక్కఁడే. మఱియొకదేవుఁడు లేఁడు. వా రట్లు ప్రేలుట మాననిచో వారిలో దేవదూషకులకు ఘోర శిక్ష కలుగఁ గలదు.

కావున, వారు దేవునివంక దిరిగి క్షమింప వేఁడికొన రేల? దేవుఁడు క్షమాయుతుఁడును కరుణాళుఁడును గదా!

మరియమ్మకుమారుఁ డగు దేవదూత యొకప్రవక్త మాత్రమే అతనికి పూర్వమునను ప్రవక్తలుండిరి. అతనితల్లి క్రమప్రవర్తనము గలది. వా రిరువురు నలుగురవలె నన్నము దినినవారే. ఇదిగో మేము వారికి మాసూచనలను స్పష్టపఱుచుచుండఁగా వా రెట్లు వెనుకకుఁ దిరిగి పోవుచున్నారో చూడుము!

"దేవుని గాక మీకు మేలు గాని కీడు గాని చేయఁజాలని యితరవస్తువు నేల పూజింతురు? దేవుఁడు శ్రోత! అతఁడు జ్ఞాని!

గ్రంథావలంబులారా! మీమతమునందలిసత్యవిధులను దాఁటకుఁడు. తామే సరియైనదారినుండి తప్పిపోయి, యితరులనుగూడ దారి తప్పించినవారి ననుసరింపకుఁడు" అనుము.

## అధ్యాయము 11.

ఇస్రాయేలుసంతతివారిలో నమ్మనివారిని, దావూదును, మరి యమ్మపుత్రుఁడగు ఈసాయును శపించి యుండిరి. వారు తిరుగు బాటు చేసి యుల్లంఘించుటచేతనే యిట్లు జరిగినది.

వారు కావించిన ఘోరపాపములు చేయఁగూడ దని వా రొకరి నొకరు మందలించుకొనకుండిరి. వారిపను లన్నియు గర్హ్యములే !

80. వారిలోఁ జాలమంది దేవదూషకులతో స్నేహము చేసి యుండుట నీవు కనుగొందువు. తనుకామముచేఁ బ్రేరేపింపఁబడినట్టి యు, తనకు ముందుగాఁ బంపికొనియున్నట్టియు కార్యము లన్నియు నష్టములే. దేవుఁడు వారిపైఁ గోపించి యున్నాఁడు. వారు శాశ్వ తబాధ ననుభవింపఁ గలరు.

వారు, దేవుని, నతనిప్రవక్తను, వారికిఁ బంపఁబడినకురా నును, నమ్మి యుండినచో వారు వారితో స్నేహము చేసియుండరు. కాని, వారిలో చాలమంది దుష్టులు.

మనుష్యు లందఱిలోను, యహూదీలును, దేవునితో నితర దైవములఁ జేర్చువారును, విశ్వాసులయెడ మిక్కుటమగుద్వేషము గలిగి యుండుట నీవు కనుగొందువు. "మేము నస్రానీలము" అని చెప్పుకొనువారికిని, వీరికిని మంచిసఖ్య ముండును. వీరిలోఁ గొందఱు పురోహితులు, యతులుగ నుండుటచేతను, వారు గర్వరహితు లై యుండుటచేతను, నిట్లు సంభవించును.

# కాండము. 7

ప్రవక్తకంపఁబడినదానిని వారు విని, దానియందలిసత్యమును గ్రహించుటచేఁ గన్నీరు గార్చుచు "ప్రభువా! మేము నమ్మినాము. దానికి సాక్ష్య మిచ్చువారితోఁగూడమమ్ముఁ జేర్చివ్రాయుము.

"దేవుని నతఁడు పంపినసత్యమును నమ్మి న్యాయవంతులతో మేమును, భోగభూమిలో వసింప నేల కోరఁగూడదు" అనియందురు.

కావుననే దేవుఁడు వారికి తరంగిణులు ప్రవహించునుద్యానవనములో వారిమాటలకు బహుమానముగ శాశ్వతవాసముల ననుగ్రహించెను. పుణ్యవంతుల కిదియే బహుమానము!

కాని, విశ్వసింపక మాసూచనల కసత్యదోషముఁ గల్పించువారు నరకాగ్నియందు వసింపఁగలరు.

## అధ్యాయము 12.

విశ్వాసులారా! దేవుఁడు మీ కనుగ్రహించిన యారోగ్యప్రదములగుభక్ష్యభోజ్యములను నిషేధింపకుఁడు. ఈమేరను మీఱకుఁడు. దీనిని మీఱినవారిని దేవుఁడు ప్రేమింపఁడు.

దేవుఁడు మీ కిచ్చినయాహారములో ధర్మవిహితమును, నారోగ్యవంతమును నైనదానిని భుజింపుఁడు. మీరు నమ్మినదేవునికి భయపడుఁడు.

మీరు పొరబాటునఁ జేసినప్రమాణములకై దేవుఁడు మిమ్ము క్షమించును గాని, బుద్ధిపూర్వకముగఁ జేసినదానికై మిమ్ము శిక్షించును. పదిమందిబీదలను బిలిచి, మీకుటుంబములో సాధారణ

ముగఁ దినునాహారమును వారికిఁ బెట్టుటయో, లేదా, వారికి బట్టల నిచ్చుటయో యీపాపమునకుఁ బరిహారము; లేదా, మీచేతఁ జిక్కినవాని నొకనిని వదలివేయవలయును. ఇట్లు చేయుటకు శక్తి లేనివాఁడు మూఁడుదినము లుపవసింపవలయును. మీరు ప్రమాణములు చేసినప్పు డిదియే పరిహారము. కావున మీరొట్లను పాలింపుఁడు. మీరు కృతజ్ఞులరై యుండుటకు దేవుఁ డిట్లే తన సూచనలను స్పష్టపఱుచుచుండును.

90. విశ్వాసులారా! ద్రాక్షరసము, జూదము, విగ్రహములు, సోదె చెప్పుబాణములు నివి యన్నియు సైతాను కల్పించిన నైచ్యములు. మీ రభివృద్ధి నొందుటకై వానిని విసర్జింపుఁడు.

ద్రాక్షారసము, జూదము వీనివలన సైతాను మీలో ద్వేషమును, పోరాటమును గల్పించి దైవస్మరణనుండియు, ప్రార్థననుండియు మిమ్ము తప్పించును. కావున మీరు వానిని విసర్జింపరా?

దేవుని, నాతనిప్రవక్తను, మన్నించి జాగరూకులై యుండుఁడు. మీరు వెనుదిరిగినచో మాప్రవక్త మీకు స్పష్టప్రకటన చేయుట తప్ప మఱేమియుఁ జేయఁ జాలఁడు.

దేవునికి భయపడి, విశ్వసించి, క్రమవర్తనులై, యింకను దేవునికి భయపడి, విశ్వసించి, మఱింత భయపడి, సత్కార్యములఁ జేయుచుండినచో విశ్వాసులకును, సత్కార్యపరులకును నేనిందయుఁ గలుగఁబోదు. సత్కార్యముల నాచరించువారిని దేవుఁడు ప్రేమించును.

## అధ్యాయము 13.

విశ్వాసులారా! మీచేతితో సంపాదించినవేఁటవిషయము లోనో, మీయీటెలవిషయములోనో, మిమ్ము తప్పక శోధించి,

తనకు రహస్యముగ భయపడువాఁ డెవఁడో యాతఁడు కనుఁగొనుచుం డును. ఇఁకమీఁద నుల్లంఘించినవాఁడు ఘోరశిక్ష ననుభవింపఁ గలఁడు.

విశ్వాసులారా! మీరు యాత్రలో నున్నప్పుడు వేఁటాడ కుఁడు. అట్లెవఁడైన వేఁటాడి మృగములఁ జంపినచో దానికి పరిహార ముగా, కాబాయొద్ద నర్పించుటకు మీలో న్యాయవంతు లగునిద్దఱు తీర్పు చెప్పినప్రకార మామృగమునకు సమాన మగుజంతువులను దీసికొని పోవలయును; లేదా, బీదల కన్న మిడవలయును; లేదా తాను చేసినదానిదుష్ఫలమును రుచి చూచుటకుపవాసము చేయ వలయును. దేవుఁ డయినదానిని క్షమించును; ఎవఁ డైన దానిని తిరిగి చేసినచో దానికై యాతఁడు పగ దీర్చికొనును. దేవుఁడు శక్తి మంతుఁడు, పగ దీర్చికొనఁ గలవాఁడు.

మీరు సముద్రములో చేఁపలు పట్టవచ్చును. యాత్రలో నున్నప్పు డాహారముగా చేఁపలను సంగ్రహించి యుంచికొని తిన వచ్చును. కాని, యాత్రలో నున్నప్పుడు భూమిపై వేఁటాడుట ధర్మ విరుద్ధము. కావున మీ రందఱు చేరఁగలయతనికి భయపడుఁడు.

పవిత్రగృహ మగు కాబాను మనుష్యు లందఱును చేరవల సినస్థలముగను, పవిత్రమాసమును, బలిని, దానియాభరణములను, దేవుఁడు విధించియున్నాఁడు. స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవునికిఁ దెలియు ననియు నాతఁడు సర్వజ్ఞుఁ డనియు, మీరు కను గొనుటకే యి ట్లాతఁడు విధించియున్నాఁడు.

దేవుఁడు కఠినముగ శిక్షించుటయే కాక క్షమాయుతుఁడును కరుణాళుఁడును గూడ నై యున్నాఁ డని తెలిసికొనుఁడు.

ప్రవక్తకు బోధ చేయుట మాత్రమే విధి. మీరు దాఁచు దానిని, బయలుపెట్టుదానిని దేవుఁడు తెలిసికొనుచునే యున్నాఁడు.

100. "నీకు దుర్మార్గమే సంపూర్ణముగ నిష్టముగాని, చెడుగును మంచియు నొక్కటేరీతిగా నెంచబడవు. కావున నోబుద్ధిమంతులారా! దేవునికి భయపడుఁడు. మీకు జయము కలుగును" అనుము.

అధ్యాయము 14.

విశ్వాసులారా ! మేము చెప్పినయెడల మీకు బాధ కలుగఁ గలదానినిగూర్చి మ మ్మడుగకుఁడు. కురా నంతయు మీకుఁ బంపఁబడిన పిదప మీరు దానినిగూర్చి మ మ్మడిగినయెడల నవి మీకుఁ దెలియఁ జేయఁబడును. దేవుఁడు క్షమాయుతుఁడు, దాక్షిణ్యమూర్తియుఁ గావున నాతఁడు మి మ్మావిషయములో క్షమించును.

మీపూర్వు లట్టివిషయములఁగూర్చి యడిగిరి గాని, వెంటనే వానిఁగూర్చి విశ్వాసహీనులైరి.

బహీర, సాయిబా, వసీలా, హామీ, యనుజంతువులఁగూర్చి దేవుఁ డెద్దానిని విధించి యుండలేదు. కాని, యవిశ్వాసులు దేవునిపై నీయసత్యమును గల్పించిరి. వారిలో చాలమందికి బోధ లేదు.

'మీకును పవిత్రకురను బంపఁబడినదాని నంగీకరింపుఁ' డని వారితోఁ జెప్పఁగా వారు "మా పూర్వులమతము మాకుఁ జాలు" ననిరి. ఏమి! వారిపూర్వులకు జ్ఞానమ గాని, రక్షణ గాని లేకున్నను వా రిట్లనవచ్చునా ?

విశ్వాసులారా ! మిమ్ముగూర్చి జాగరూకులరై యుండుఁడు. మీకు రక్షణ యుండఁగా తప్పులోఁ బడినవాఁడు మీ కేకీడును జేయలేఁడు. మీ రందఱును దేవునియొద్దకే వత్తురు. అప్పు డతఁడు మీరు గావించినదానిని మీకుఁ దెలియఁ జేయును.

విశ్వాసులారా ! మీకు మరణ మాసన్నము కాఁగా మరణ శాసనము వ్రాయునపుడు సాక్షులను దగ్గఱ నుంచుకొనుఁడు.

మీలోనివారే యిద్దఱు సాక్షులు చాలును. కాని, మీరు ప్రయాణ ముఁలో నున్నప్పుడు మృత్యు వాసన్న మైనను, ఆకస్మికమరణము వచ్చినను పరజాతివా రైనను సరే యిద్దఱుసాక్షు లుండినఁ జాలును. ప్రార్థన మైనపిదప వా రిద్దఱిని వెడలిపోకుండ నుంచవలయును. మీకు వారినిగూర్చి సందేహ మున్నచో వారు "ఎదుటిపక్షమువాఁడు మాకు బంధు వైనను సరే, మేము లంచము పుచ్చుకొనము. దేవుని సాక్ష్యమును మేము దాఁచిపెట్టము. అట్లుచేసినచో మేము దుష్టులలోఁ జేరినవార మగుదుము" అని ప్రమాణము చేయవలయును.

వారిద్దఱు నసత్యమాడి రని ఋజువు వచ్చినయెడల వారిపై నానిందను మోపినవారిలో మృతినొందినవానికి మిక్కిలి దగ్గఱరక్త సంబంధులు నిలువఁబడి, "వారిద్దఱిసాక్ష్యమునకంటె మాసాక్ష్యము సత్య మైనది. మే మసత్య మాడము. అట్లు చేసినచో మేమన్యాయపరులలోఁ జేరినవార మగుదు" మని దేవునియాన ప్రమాణము చేయవలయును.

సరియగుసాక్ష్యము వచ్చుట కిదియే మార్గము. లేకపోయినచో నొకప్రమాణము చేసినపిదప మఱియొకప్రమాణమును వారు చేయఁగలరు. గావున దేవునికి భయపడి చెవి యొగ్గి యుండుఁడు. దేవుఁడు దుష్టులకు దారి చూపఁడు.

## అధ్యాయము 15.

దేవుఁడు ప్రవక్తల నొకదినమున సమావేశపఱిచి 'మీ కేమి ప్రత్యుత్తరము వచ్చినది' యని యడుగఁగా వారు "మా కేమియుఁ దెలియదు. రహస్యము లన్నియు మీకే తెలియు" నని యందురు.

110. అప్పు డాతఁడు, "మరియమ్మకుమారుఁడా! ఈసా! నేను నీకుఁ బరిశుద్ధాత్మ నొసఁగి, యుయ్యాలలో నున్నపుడును, పెద్ద

వాఁడ వైనతరువాతను, మనుష్యులతో మాటాడు మని చెప్పుచు, నీకును నీతల్లికిని నిచ్చినయనుగ్రహమును జ్ఞప్తికిఁ దెచ్చికొనుము. నేను నీకు పవిత్రగ్రంథమును, జ్ఞానమును, ధర్మమును, సువార్తను బ్రసాదించితిని. మాయనుమతిచొప్పున నీవు మట్టితో నొకపక్షిని జేసి, దానిలో నూపిరి విడువఁగా నది జీవముగల పక్షి యయ్యెను. నీవు నాయనుజ్ఞచొప్పున, నంధులను, కుష్ఠరోగులను, బాగుచేసితివి; చచ్చినవారిని నాయనుజ్ఞచొప్పున బ్రదికించితివి. ఇస్రాయేలుపుత్త్రులయొద్దకు నీవు స్పష్టసూచనలతో వచ్చినప్పుడు, వారలను నీతోఁ జేరకుండఁ జేసితిని. అందులో నమ్మనివారు 'ఇది చిల్లంగికాని, వేఱు కాదు' అనిరి.

ప్రవక్తలకు "నన్నును, నేను పంపినవానిని నమ్ముఁ" డని నేను చెప్పఁగా వారు "మేము నమ్మియున్నాము. మేముదృఢభక్తుల మగుటకు నీవే సాక్షివి" అనిరి.

అప్పుడు ప్రవక్తలు "మరియమ్మకుమారుఁడా! ఈసా! నీప్రభువు మాకొఱకు స్వర్గమునుండి సమస్తవస్తుసంభరిత మగు నాహారమును పంపఁగలఁడా" యని యడుగఁగా నాతఁడు "మీరు విశ్వాసులైనచో దేవునికి భయపడుఁడు" అని చెప్పుటను స్మరింపుము.

వారపుడు "మేము దానినిభుజించి హృదయములకు నిబ్బరము కలుగఁజేసికొందుము. నీవు సరిగ సత్యమే పలికినందుల కిందు మూలమున మేము సాక్షులముగ నుందుము" అనిరి.

మరియమ్మపుత్త్రుఁడగు ఈసా అంతట "ప్రభో! దేవా! మాలో మొదటినుండి తుదివానివఱకు నొకసూచనగ నుండుటకును, సర్వదా పండుగయై ప్రబలుటకును, స్వర్గమునుండి మా కాహారమును పంపుము. నీవు పోషకులలో శ్రేష్ఠుఁడవు. కావున మమ్ము పోషింపుము" అనెను.

దేవుఁడు "సరే, నేను దానిని మీాకుఁ బంపెదను. కాని యా వెనుక నమ్మనివారి నేజంతువును గూడ శిక్షించనట్లు శిక్షించెద" ననెను.

అధ్యాయము 16.

మరియమ్మపుత్త్రుఁడా! ఈసా! దేవుఁడు గాక నీవును నీతల్లి యుఁ గూడ దైవములే యని మనుష్యులతోఁ జెప్పితివా?" అని దేవుఁ డడుగ నాతఁడు "నీవు మహిమాన్వితుఁడ వగుదువు గాక! సత్యము గాదని యెఱిఁగినదానిని నేను పలుకవలసినవాఁడను గాను. నే నట్లు చెప్పి యుండినచో నీకు మాత్రము తెలిసియుండదా? నాలో నున్నది నీకుఁ దెలియును గాని, నీలోనిది నాకుఁ దెలియదు. రహస్యము లన్నియు నీకు బాగుగఁ దెలియును గదా!

'నా ప్రభువును, మీా ప్రభువును నగుదేవు నారాధింపుఁడు.' అని నీవు న న్నాజ్ఞాపించినదానిని తప్ప వారితో మఱేమియుఁ జెప్ప లేదు. వారితో నున్నంతకాలమును వారు చేసినపనులకు నేను సాక్ష్య మిచ్చెదను. ఇప్పుడు నన్ను నీదరికి చేర్చికొంటివి కావున నీవే సర్వ మును గమనించి చూచుచున్నావు.

"నీవు వారిని శిక్షించినచో, వారు నీసేవకులు. నీవు వారిని క్షమించినచో...నీవే శక్తిమంతుఁడవు. బుద్ధుఁడవు" అనెను.

"సత్యవంతుల కీదినమున వారిసత్యము లాభకారి యగును. తరంగిణులు ప్రవహించునుద్యానవనములలో వారు శాశ్వతముగ వసింపఁ గలరు. వారిని దేవుఁడును, దేవుఁడు వారిని ప్రేమించు కొందురు. ఇదియే పరమానందము" అని దేవుఁ డనును.

120. స్వర్గమర్త్యములయు, నందుఁ గలవస్తువులయు నధికార మంతయు దేవునిదే. అతఁడు సర్వశక్తుఁడు.

# సురా 6 పశువులు.

మక్కా-165 పద్యములు-20 రుక్కూలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

స్వర్గమర్త్యముల సృజించి చీఁకటిని వెలుతురును గల్పించిన దేవుఁడు స్తుతింపఁబడుగాక! అయినను విశ్వాసులు తమప్రభునితో సమానులను గూర్తురు!

మిమ్ము మట్టినుండి సృజించినవాఁ డాతఁడే. పిదప మీయాయుష్కాలము నాతఁడు నిర్ణయించి రక్షణదినమునకుఁ బూర్వము కొంత వ్యవధినిగూడఁ గల్పించెను ఇఁకను మీకు సందేహములు తీరలేదా?

స్వర్గమర్త్యములందు దేవుఁ డాతఁడే! మీరహస్యములను, మీరు వెల్లడించువానినిగూడ నాతఁడు తెలిసికొనియే యున్నాఁడు! మీరు దేనికి తగుదురో యాతని కెఱుకయే!

వారికి ప్రభువునుండి వచ్చినసూచనల నన్నిఁటినుండియు వారు మఱలిపోయినారు. వారికి సత్యముఁగూర్చి తెలియవచ్చినను వారు దాని నసత్యముగ గణించినారు. కాని, తుదకు వారు వెక్కిరించిన దానిఁగూర్చిన సందేశము వారికి చేరఁగలదు.

వారికి పూర్వ మెన్నితరములవారిని నాశనము చేసితిమో వారికిఁ దెలియరాలేదా? మీకుఁ జేయనట్లుఁగూడ వారికి భూమిపై స్థిరవాసముల నేర్పఱిచి, స్వర్గమునుండి వారిపై వర్షధారలుగఁ గురియించి, వారిపాదములక్రిందిదివ్యతరంగిణులఁ బ్రవహింపఁ జేసితిమి. అయినను వారు పాపములఁ జేయుచుండఁగనే వారిని జంపి వారి స్థానముల నితరుల నిల్పితిమి.

మేము మీకు తోలుకాగితముపై గ్రంథమును వ్రాసి పంపఁగా వారు దానిని తమచేతులతో స్పృశించి "ఇది కేవలము చిల్లంగి...

మాకొద్ద కొక దేవత దిగి వచ్చినఁ గాని........" యని యందురు. మేమే యొక దేవతను బాపి యుండినచో వారిని తీర్పు వెంటనే చేరియుండును. వారికిని వ్యవధియే లేక యుండియుండును.

మేము దేవతనే పంపినచో, నాదేవతకు మనుష్యరూపము నిచ్చి, తాము ధరించునట్టివస్త్రముల నే కట్టియుందుము.

10. ఇది గాక నీకు పూర్వము వచ్చినప్రవక్తలును, వెక్కిరింతల కును, నవ్వులకును బాలయిరి. కాని, వారు దేనిని జూచి నవ్విరో, యదే యావెక్కిరించినవారిని చుట్టుకొనెను.

## అధ్యాయము 2.

"దేశములో సంచారము చేసి, వా రసత్యవాదు లనినవారి గతి యేమయ్యెనో విచారింపుఁడు.

స్వర్గమర్త్యములలో నున్నదంతయు నెవరిది? "దేవునిదే" యనుము. అతఁడు తనకు కరుణయే ధర్మముగా విధించికొనినాఁడు. అతఁడు రక్షణదినమున మి మ్మొకచోఁ జేర్చును. ఈవిషయమై సందేహము లేదు. విశ్వసింపనివారే తమనాశనమును తెచ్చిపెట్టు కొనుచున్నారు.

అహోరాత్రములయందు నివాసముగల దంతయు నాతనిదే! అతఁడు శ్రోత, జ్ఞాని.

"స్వర్గమర్త్యములసృష్టికర్తయై, సర్వపోషకుఁడై, యెవని చేతను పోషింపఁబడనియాతనిఁ దప్ప, వే ఱొక్కని నాప్రభువుఁగా స్వీకరింతునా! ఇస్లామును పరిగ్రహించినవారిలో నేనే ప్రథముఁ

డను గా నుండవలయు నని నా కాజ్ఞ యైనది. నీవు దేవునితో దైవ ములఁ జేర్చువారితోఁ గూడకుము.

నేను నా ప్రభువును తిరస్కరించినచో నామహాదినమున శిక్ష కలుగు నని భయపడుచున్నా " నని యనుము.

ఆదినమున నాశిక్షను తప్పించుకొనువారి నందఱి నతఁడు కరుణఁ జూచును. ఇదియే స్పష్టమగు నానందము.

దేవుఁడే కష్టము నంటఁ జేసినయెడల దాని నాతఁడే తప్ప మఱియొకఁడు తీసివేయఁ జాలఁడు; మేలు కలుగఁ జేసినచో నన్ని వస్తువులపైన నాతనికి శక్తి యున్నది కదా!

అతఁడు తనసేవకుల కందఱకు ప్రభువు. అతఁడు బుద్ధుఁడు! జ్ఞాని.

మిక్కిలి భారమగుసాక్ష్య మేది? నీకును నాకును దేవుఁడే సాక్షి. నిన్నును, అది చేరినయందఱికిని భయముఁ దెల్పుట కీ కురాను నాకుఁ దెలుపఁబడినది. ఏమి! దేవుఁడు గాక యితరదైవము లున్నా రని మీరు సాక్ష్యమీయఁగలరా? నే నట్టిసాక్ష్య మీయలేను. అతఁ డొక్కఁడే కదా దేవుఁడు. అతనితో మీరు చేర్చువారివిషయమై నేను నిర్దోషిని " అనుము.

20. గ్రంథ మనుగ్రహింపఁబడినవారు, తమపిల్లలను పోల్చుకొనఁ గలిగినట్లు మహమ్మదును పోల్చుకొనఁ గలరు. కాని, తమనరకమును తాము కల్పించుకొనువారే యవిశ్వాసులు.

## అధ్యాయము 3.

దేవునిగూర్చి యసత్యముఁ గల్పించువాఁడును, మాసూచన లసత్యములనువాఁడును గాక దుష్టుఁ డెవఁ డున్నాఁడు? అట్టిదుష్టులు వృద్ధినొందఁ జాలరు.

"ఆదినము" న మేమందఱి నొకచోఁ జేర్చెదము. అప్పుడు దేవునితో నితరదైవములఁ జేర్చినవానిని "మీ రనుకొను దైవసము లేరి" యని యడిగెదము.

అప్పుడు వారు "మా ప్రభు వగుదేవునియాన! మే మాయనకు సమానులఁ గల్పింపలే" దనుటకంటె మఱెద్దియుఁ జేయజాలరు.

అదిగో, వా రె ట్లసత్యము లాడుచున్నారో చూడుము. తాము సృష్టించినదైవములే తమ్ము విడనాడుచున్నారు!

వారిలోఁ గొందఱు నిన్ను విందురు. వారు కురానును బోధపఱుచుకొనకుండుటకు వారిహృదయములపై తెరఁ గప్పి, వారిచెవులలో దిమ్మలగొట్టితిమి. మేము వారి కెన్నివిధములగుసూచనల నిచ్చినను, వారికి దేనియందును విశ్వాసము కుదురక, తుదకు నీతో వాదించుటకు వచ్చినప్పు డాయవిశ్వాసులు, "ఇవి యన్నియు తాతలనాఁటిప్రాతకథలే గదా" యని యందురు.

వారు దానిని నిషేధించి విడనాడుదురు. కాని, వారినరకము వారే కల్పించుకొనుచున్నా రని వారికిఁ దెలియదు.

వారి నగ్నిపైఁ బెట్టినప్పుడు "అయ్యో! మమ్ము తిరిగి యేల పంపివేయరు? దేవునిసూచన లసత్యము లనము. మేము విశ్వాసులలోఁ జేరెదము" అనుచుండ మీరు చూచిన నెంతయో బాగుండును.

అవును, వారు పూర్వము దాఁచినది వారి కిపుడు స్పష్టమైనది. వారిని తిరిగి పంపివేసినను, వారు తిరిగి నిషేధింపఁబడినదానినే యనుసరింతురు. వారు నిశ్చయముగ నసత్యవచనులు!

"ఇహలోకజీవనముకంటె వేఱుజీవనము లేదు. మేము తిరిగి లేచుట యసత్య" మని వా రందురు.

30. అయిన, వారిని ప్రభుప్రమోలకుఁ దెచ్చినప్పుడు నీవు చూచిన నెంత బాగుండును! అతఁడు వారితో "సత్యముగా నిదియే కదా రక్షణదిన" మని పలుకఁగా వారు "మాప్రభువునాన, అవు నదియే" యని బదులు చెప్పుదురు. "మీరు విశ్వసింపరైరి. కావున బాధను రుచి చూడుఁ" డని యాతఁ డనును.

## అధ్యాయము 4.

"ఆగంట" యకస్మాత్తుగా వచ్చువఱకును దేవుని ప్రమోలకుఁ బోవుట యసత్య మనువారు నిశ్చయముగా నష్ట లగుచున్నారు. అప్పుడు వారు, "పూర్వ మీగంట నుపేక్షించినందు కెంత యసురుసురు కావలసి వచ్చెను" అని యార్చుచు తమభారములను వీఁపులపై మోయవలసి యుండును. వారి కెత్తఁబడినబరువు వారికి దుర్భర మగునుగదా!

ఇహలోకజీవన మొకయాట, ఒకవినోదము. రాఁబోవువసతి గృహము దైవభీతిపరు లగుజనులకు శ్రేయోదాయకము! కావున మీరు దీనిని బోధపఱుచుకొనరేల?

వారు చెప్పునది నిన్ను వ్యాకులపెట్టు నని మాకుఁ దెలియును. వారు నిన్నొకనినే యసత్యవాది యనలేదు. దైవమును నమ్మని వారు దేవునిసూచనల నన్నిటిని నిరాకరింతురు.

నీకు పూర్వము ప్రవక్తలందఱు నసత్యవచను లను వాదునకు లోనై యుండిరి. కాని, వారికి మాసహాయము చేరువఱకును వారు చలింపక యాయన్యాయమును, నపవాదమును, సహించి యుండిరి. దేవునిమాటల నెవరు మఱల్పఁ గలరు? అతనిప్రవక్తలదైన యాచరిత్ర మింతకుఁబూర్వమే మిమ్ముఁ జేరినది.

వారిమొదబాటు నీకు దుఃఖదాయకమై, వారి కొకయాన వాలు తెచ్చుటకు భూమిలోని కొకబిలమును గాని, స్వర్గమున కొక నిచ్చెనగాని, నీకు లభించినచో......అవును. దేవుని కిష్టమైనచో వారి నందఱను దేవుఁడు రక్షణమార్గములోనికి దింపియుండును! కావున నీవుకు నజ్ఞానములోఁ బడిపోకుము.

చెవి యొగ్గి వినువారికే యాతఁడు బదులు చెప్పును. చచ్చిన వారిని దేవుఁడు లేవఁదీయును. వా రప్పు డాతనియొద్దకే చేరఁగలరు.

"తనప్రభువునుండి యాతని కొకసూచన రాకున్నచో..." అని వా రన్నప్పుడు వారితో "ఆయానవాలును బంపుటకు దేవునికి శక్తి గలదు. కాని, వారిలో చాలమంది కది తెలియదు" అని పలుకుము.

భూమిపై సంచరించుజంతువుగాని ఱెక్కలతో నాకాశమున నెగురుపక్షిగాని, మీజాతివంటిది కాదు. ఈగ్రంథమున మే మేదియు వదలిపెట్టలేదు. పిదప వా రందఱును దేవునియొద్దకే చేర్పఁబడుదురు.

మాసూచనల నిరాకరించువారు, మూఁగలు, చంధులునై, చీఁకటిలో నున్నారు. దేవుఁడు తనయిచ్చవచ్చినవారిని తప్పుత్రోవఁ బెట్టి, యిచ్చవచ్చినవారికి సరియగుమార్గము చూపును.

40. "మీ రేమని తలంచుచున్నారు? దేవునిశిక్ష గాని, యా 'గంట' గాని, మి మ్మెదురొక్కనునప్పుడు, దేవునికిఁ గాక మఱె వరికి మొఱ లిడుదురు? మీరు సత్యవచస్కులైనచో చెప్పుఁడు' అని వారితో ననుము.

అవును. అతనికే మీరు మొఱలిడుదురు. అతని కిష్టమైనచో మీరు దేనినుండి తప్పింపు మని మొఱలిడితిరో దానినుండి మిమ్ము తప్పించును. మీరును నాతనితోఁ జేర్చినయితరదైవములను మఱవ గలరు.

## అధ్యాయము 5.

నీకుఁబూర్వముండిన జాతులవారికిని, ప్రవక్తల నంపి నమ్ములగుదు రను నుద్దేశముతో, వారిని కష్టములకును, సంకటములకును బాలుచేసితిమి.

వారికి మాకష్టము తగిలినను వారు నమ్ములు కారైరి. వారి హృదయములు కఠినము లయ్యెను. వారిప్రవక్త నంతకుఁబూర్వమే సైతాను విధించి యుండెను.

వారు మాభయసూచనల నిరాకరింపఁగా వారికి సర్వవస్తువులద్వారములను తెఱచి యుంచితిమి. అట్లు వారు మావరముల ననుభవించుచు సుఖించుచుండఁగనే యకస్మాత్తుగా వారిని బట్టికొంటిమి. అంత వారు నిస్పృహులైరి.

భక్తిహీనులలోఁ జాలమంది యిట్లు నశించిరి. జగన్నాథుఁడగు దేవుఁడు స్తుతింపఁబడుఁ గాక !

" మీ రేమనుకొనుచున్నారు ? దేవుఁడు మిమ్ము మూఁగలుగను, నంధులుగను జేసి, మీహృదయములకు మూఁతలు వేసిన యెడల దేవుఁడు గాక మఱి యేదైవము మీకు వానిని తిరిగి యీయఁ గలఁడు ? మాసూచనల నెట్లు మార్చివేయుచుందుమో చూడుఁడు. అయినను వారు వానిని గుర్తింపరు " అనుము.

"మీ రేమనుకొనుచున్నారు ? తెలిసిగాని, తెలియకుండఁగాని దేవునిశిక్ష మి మ్మెదుర్కొనునప్పుడు, భక్తిహీనులు తప్ప మఱెవ్వారైన నశింతురా ? " అనుము.

మేము మాప్రవక్తలను సువార్తలఁ దెచ్చుటకును భయసూచనల నిచ్చుటకునే పంపుదుము. విశ్వసించి పరితాపమునొందు వారి కేభయముగాని, యేదుఃఖముగాని కలుగదు.

కాని, మాసూచన లసత్యము లనువారిదుష్కార్యములకు శిక్ష రాక తప్పదు.

50. "దేవుని ద్రవ్య మంతయు నాయొద్దనే యున్నదని కాని, నాకు రహస్యములు తెలియునని కాని, నేను దేవత నని కాని, మీతోఁ జెప్ప లేదు. నాకుఁ దెలుపఁబడినదానినే నే ననుసరించు చున్నాను. అంధులును, దృష్టిగలవారును నొకటే రీతిగఁ జూడఁబడు దురా ? అయిన మీ రాలోచింపరేల ?" అనుము.

## అధ్యాయము 6.

ప్రభువునొద్దఁ జేరుటకు భీతిల్లువా రాతనికి భయపడుటకై, యతఁడుతప్ప రక్షకుఁడు గాని, యడ్డుపడువాఁడు గాని యుండఁబోఁ డని వారికి నాటఁ జెప్పుము !

ప్రభునిముఖముఁజూడ నాతురతతో సాయంప్రాతలయం దాతనికి మొఱలిడువారిని త్రోసివేయకుము. నీవు వారియూహలను కనుఁగొనుటకుఁ గాని, వారు నిన్నుఁగూర్చి తెలిసికొనుటకుఁ గాని, యేమిపని యున్నది ? వారిని నీవు త్రోసివేసినచో నీవును దుర్మార్గ లలోఁ జేరుదువు.

"వీరేనా దేవునిదయకు పాత్రులైనవా" రని వా రను కొనుటకు, వారిలోఁ గొందఱినే వారి కుదాహరణప్రాయులఁ జేసి తిమి. కృతజ్ఞు లెవ్వరో దేవునికి బాగుగఁ దెలియునుగదా !

మాసూచనలను విశ్వసించినవారు నీయొద్దకు వచ్చినప్పుడు, "మీకు శాంతియగుఁగాక ! దేవుఁడు తనకు కరుణయే ధర్మముగ విధించికొనియున్నాఁడు. కావున మీలో నెవరైనఁ దొలుత తప్పు చేసినను పిదప పరితపించి దిద్దుకొనినచో నతఁడు తప్పక మీయెడ దయాదాక్షిణ్యములు కలిగి యుండును" అనుము.

దుష్టులమార్గము తెలియుటకే యిట్లు మాసూచనలను మీకు స్పష్టీకరించితిమి.

## అధ్యాయము 7.

“దేవునితో సమానులుగా మీరు పిలుచువారిని నే నారాధింప కుండ నిషేధింపఁబడితిని. మీకోర్కులను నే ననుసరింపను. అట్లు చేసినచో నేను దారి తప్పి రక్షితులలోఁ జేరియుండను.

“నేను ప్రభువుచూపిన ప్రమాణములచొప్పున నడచు కొందును. కాని, మీరు వాని నసత్యములందురు. మీరు వేగముగ రాఁగోరుకొనినశిక్షను తెచ్చికొనుట మీకుశక్యము కాదు. దేవుఁడే తీర్పు చెప్పఁగలవాఁడు. అతఁడు సత్యమును వెల్లడించును. వివాద ములఁ దీర్చువారిలో నాతఁడే శ్రేష్ఠుఁడు.

“నీవు వేగముగా రావలె నని కోరికొనినది మీయధీన ములో నున్నచో మీకును నాకును గలవివాదము తీరిపోయియే యుండును. కాని భక్తిహీను లెవ్వరో దేవుని కెఱుక” అనుము.

రహస్యవస్తువులబీగము లాతనియొద్దనే యున్నవి. అతనికి తప్ప నితరుల కవి తెలియవు. భూమిపైనను సముద్రమునందును, గలదంతయు నాతనికిఁ దెలియును. అతనికిఁ దెలియకుండ నొకయా కైన రాలదు. భూమిలోని చీఁకటియందలిదిగాని, పచ్చనిదిగాని, యెండినదిగాని, గ్రంథములో స్పష్టముగా వ్రాయఁబడని దొకటియు లేదు.

60. రాత్రి మీయాత్మలను గ్రహించి, పగటిపూట మీరు దేనిని గడించికొనిరో యాతఁడు తెలిసికొనును. మీయాయుష్కా లమును నిర్ణయించుటకు మి మ్మాతఁడు మేల్కొల్పుచుండును.

అప్పుడు మీ రాతనియొద్దకే పోఁగలరు. అప్పుడు మీరు కావించిన దాని నాతఁడు మీకుఁ దెలుపఁగలఁడు.

## అధ్యాయము 8.

అతఁడు తనసేవకులపై సంపూర్ణాధికారము వహించి, మిమ్ము కనిపెట్టి యుండుటకు వేగులను పంపుచుండును. మిమ్ము మృత్యు వెదుర్కొనునంతనే యతనిదూతలు మీయాత్మలను తప్పక గ్రహింతురు.

అప్పుడు వారు సత్యమూర్తియగు తమప్రభువైన దేవునిపరము చేయఁబడుదురు. అతఁడేకదా తీర్పు చెప్పవలసినవాఁడు! అతఁ డతి త్వరితముగ లెక్కల నెక్కించుకొనుచుండును.

“మమ్ము దీనినుండి రక్షించినచో, మేము నీకు కృతజ్ఞులమై యుందు” మని మీరు నమ్రతతో రహస్యముగ మొఱపెట్టునప్పుడు భూసముద్రముల భయోత్పాతములనుండి మిమ్మెవఁడు రక్షింపఁ గలఁడు?”

“వారినుండియు, నన్ని సంకటములనుండియు దేవుఁడు మిమ్ము రక్షించినను పిదప మీ రాతనికి సమాను లగుదురు.

మీపైనుండి కాని క్రిందనుండి కాని, మీపై శిక్షను బంపుటకును, మీలో మీకు వైరము బుట్టించుటకును, మీలో నొకరినొకరు హానిఁ గల్పింపఁ జేయుటకును, సమర్థుఁ డాతఁడే. మీరు బుద్ధిమంతు లగుదురు గదా యని మాసూచనల నెంత యద్భుతముగా మార్చు చుందుమో గమనింపుము” అనుము. ఖురాను సత్యగ్రంథమే యైనను నీప్రజలు దాని నసత్య మనిరి “మీరునాయధీనములో లేరు.

వచ్చు నని చెప్పినదాని కంతటికి నొకనిర్ణీతకాల మున్నది. క్రమక్రమముగ మీ కది తెలియఁ గలదు” అనుము!

మాసూచనలను వెక్కిరించుటయందు మగ్నులైయున్నవారినిం జూచి, వారు దానిని మాని మఱియొకదానినిగూర్చి మాట్లాడుకొను వఱకును, వారినుండి తొలంగి యుండుము. సైతాను నిన్ను దీనిని మఱువఁజేసినచో స్మృతి వచ్చినపిదప భక్తిహీనులతోఁ గూర్చుండకుము.

వారి కిట్లు స్మృతి వచ్చుట దైవభీతిపరులు వారికి తీర్పు చెప్పుటకు కాదు. వా రతని కింకను భయపడుటకే యాస్మృతి వారికి వచ్చినదని తెలిసికొనుము.

70. మతము నొకయాటగను, వినోదముగను నెంచి, యిహలోక జీవనముచే మోసపోయియున్నవారిని వదలిపెట్టుము. ప్రత్యాత్మయు తనకర్మలకుగాను ఫల మనుభవించితీరునని వారికిఁ దెల్పుము. దాని కడ్డుపడువాఁడుగాని రక్షకుఁడుగాని యుండఁబోఁడు. పరిహారముగ నెంతధన మిచ్చినను నది యంగీకరింపఁబడదు. తమకర్మలకై శిక్ష నొందవలసినవారికి ఉడుకునీటి ధారలును ఘోరబాధయుఁగలుగును. వారు విశ్వసింపకుండిరిగదా !

## అధ్యాయము 9.

"దేవునిఁ గాక, మనకు సహాయముగాని, రక్షణగాని, చేయఁజాలనియితరులను మన మావాహనము చేయవచ్చునా ? మనలను దేవుఁడు సరిగ నడిపించుచుండ, వెనుదిరిగి పోవచ్చునా ? తనస్నేహితులు క్రమమార్గమును బట్టుచు "మాతో ర" మ్మని పిలుచుచుండ సైతానుచే నడారిమధ్యమున మోహమునకు పాలై యేమిచేయుటకుఁ దెలియక సంచరించువానివలె మనముండవచ్చునా ? దేవుని రక్షణయే సత్యమగురక్షణ. మనము జగన్నాథు నాశ్రయింపవలయునని యాజ్ఞయైనది" అనుము.

మీరు కాలము నతిక్రమింపక ప్రార్థించుచుండుఁడు. దేవు నికి భయపడుఁడు. అతనియొద్దకే మీరు పోవలసి యున్నది.

స్వర్గమర్త్యముల సృజించినవాఁడు సత్యముగ నాతఁడే. అతఁడొకవస్తువును 'కమ్ము' అనఁగనే యది యగును.

అతనిమాట సత్యము. బూరాపై మ్రోఁత వినఁబడునాఁడు రాజ్య మాతనిదై యుండును. దృష్టాదృష్టము లన్నియు నాతనికిఁ దెలియును. అతఁడు బుద్ధుఁడు; జ్ఞాని.

ఇబ్రాహీము తనతండ్రియగు ఆజరుతో "విగ్రహములు దైవము లనుచున్నావా ? నీవును నీప్రజలును తప్పులో నున్నా రని నాకు గోచర మైనది" అనుటను స్మరింపుము.

ఇబ్రాహీమునకు జ్ఞానమును స్థిరపఱుచుటకై యిట్లు స్వర్గ మర్త్యాధిరాజ్యమును జూపితిమి.

రాత్రియైనంతనే యాతని కొకనక్షత్రము కనఁబడఁగా, 'ఇదియే నాప్రభువు' అనెను గాని యది యస్తమింపఁగనే "అస్త మించుదేవతలను నేను ప్రేమింప" ననెను.

చంద్రుఁ డుదయించుచుండఁగాఁ జూచి 'యిదియే నాప్రభు, వనెను. కాని, యదియు నస్తమింపఁగనే "దేవుఁడు నన్ను సరిగ నడిపింపనిచో నేను తప్పుత్రోవలోఁ బడిపోవుదు" ననెను.

సూర్యుఁ డుదయించుటఁ జూచి యాతఁడు "ఇదియేనాప్రభువు. ఇదియుత్కృష్టమము" అనెను. కాని, యాతఁడ స్తమింపఁగనే "నాప్రజలారా ! మీతోఁ గలిసి, దేవునితో నితరదైవములఁ జేర్చుదోషమునకు నేను పాలుగాను.

80. క్రమమైనమతము ననుసరించుచు స్వర్గమర్త్యముల సృజించిన యాతనికే మొగము త్రిప్పెదను. నేను దేవునితోనితరదైవములఁ జేర్చువారిలోనివాఁడను కాను" అనెను.

అంత నాతని ప్రజలాతనితో వాదము సల్పిరి. అతఁడు వారితో "దేవుఁడు నన్ను రక్షించియుండఁగా నాతనిగూర్చి మీరు నాతో వాదించెదరా ? మీ రాతనితోఁ జేర్చు దేవతల కతనియనుగ్రహము లేక యేశక్తియు నుండఁబోదు. నేను వారికి భయపడను. నా ప్రభువు సర్వజ్ఞుఁడు. ఇంకను మీ రాలోచింపరా ?

ఆతనితో వారిని జేర్చుటకు మీ కనుజ్ఞ లేకున్నను, అట్లు చేయుటకు భయపడకున్నారే ! అట్టి మీ దేవతలకు నే నెట్లు భయపడుదును ? ఈ రెండుపక్షములవారిలో నెవరు రక్షణీయులో మీకుఁ దెలియదా ?

విశ్వాసము గలిగి, తమభక్తి నజ్ఞానముచేఁ గప్పిపుచ్చనివారే రక్షణీయులు. వారికే సరియగురక్షణ !"

## అధ్యాయము 10.

ఈరీతిగా తనప్రజలతో నిబ్రాహీమును వాదము చేయ నిచ్చితిమి. మాయిష్టమువచ్చినవారికి తగినబుద్ధిని మే మొసగుచుందుము. దేవుఁడు బుద్ధుఁడు, జ్ఞానియుఁ గదా !

అతనికి ఇసాకు, యాకూబుల నిచ్చి వారిని సరియగుమార్గమున నడిపితిమి. వారికి పూర్వము నుహును గూడ నిట్లే సరిగ నడిపితిమి. ఇట్లే ఇబ్రాహీముసంతతివారిలో దావూదు, సులైమాను, అయ్యూబు, యూసూఫు, మూసా, హారూను, వీరును మారక్షణ నొందిరి. పుణ్యాత్ములను మే మిట్లే బహూకరింతుము.

జకరియ్యా, యహ్యా, ఈసా, ఇలియాసు, వీరందఱును న్యాయవంతులే. ఇస్మాయేలు, అల్ యసా, యూనుసు, లూటు వీరిని మనుష్యజాతియంతటికంటె నెక్కుడుగఁ జూచితిమి.

వారిపూర్వులు, వారిసంతతివారు, వారిసోదరులు, వీరిని గొందఱినిగూడ పరిగ్రహించి సరియగుత్రోవలో నడువఁజేసితిమి.

ఇదియే దేవునిరక్షణ. దానివలన నాతఁడు తనయిచ్ఛవచ్చిన సేవకులను మంచిత్రోవలో నడిపించును. కాని, వారిలో నెవ్వరైనఁ దనతోఁ నితరదైవములఁ జేర్చినచో వారికార్యము లన్నియు వృథ యగుట తప్పదు.

90. మాదివ్యగ్రంథమును, బుద్ధిని, దివ్యజ్ఞానమును బడసినవారు వీరే. కాని, వీరిసంతతివారు దానిని నమ్మనియెడల వారినుండి దానిని తప్పించి నమ్మినవారి కిచ్చివేయుదుము.

వీరినే దేవుఁడు సరిగ నడిపించినాఁడు. కావున వారిమార్గము ననుసరింపుఁడు. "దీనికొఱకై మీరు నా కేమియుఁ జెల్లింప నక్కఱ లేదు. ఇది యన్నిజాతులవారికిని జ్ఞాపకము చేయునదిగదా!" అనుము.

## అధ్యాయము 11.

'దేవుఁడు మనుష్యున కేమియుఁ బంపలే' దనువారు దేవుని గూర్చి సరిగఁ దెలిసికొనలేరు. 'మనుష్యునకు జ్యోతియు రక్షణోపాయము నగుగ్రంథమును మూసా తేఁగా, మీరు దానిని కాగితముపై వ్రాసి యుంచి, దానిలోఁ గొంచెము మాత్రమే ప్రకటించి చాలభాగమును దాఁచిపెట్టితిరిగదా! ఆగ్రంథమును పంపినవాఁ డెవఁడు? దానిమూలమున మీకుఁ గాని మీపూర్వులకుఁగాని, ముందు తెలియని విషయము మీకుఁ దెలుపఁబడినదిగదా! దానిని పంపినవాఁడు దేవుఁడే, యని వారి కెఱింగించి వారింకను నాక్షేపించుచున్నచో వారిని విడిచిపెట్టుము.

మే మిప్పుడు మీకుఁ బంపినగ్రంథము ధన్యమైనది. పూర్వము మీకుఁ బాపఁబడినదానిని స్థిరపఱుచుచున్నది. దానిని చేకొని మీమాతృనగరమునను, దానిచుట్టు నుండువారికిని బోధింపవలయును. పరలోకజీవనమును నమ్మినవారు దానిని విశ్వసించి ప్రార్థనలను తప్పక చేయుచుందురు.

కాని, దేవునివిషయమై యసత్యమును గల్పించి, తన కేమియుఁ దెలుపఁబడకపోయినను "నా కిది తెలుపఁబడినది, దేవుఁడు పంపిన గ్రంథమువంటిగ్రంథమును నేనును దీసికొని రాఁగలను" అనువాని కంటె దుష్టుఁ డుండునా? భక్తిహీనులు మృత్యుప్రవాహములోఁ గొట్టుకొని పోవుచున్నప్పుడు దేవతలు "మీయాత్మల నిచ్చివేయుఁడు. మీరు దేవునిఁగూర్చి పల్కినయసత్యములకును, గర్వముతో నాతని సూచనల నిరాకరించినందుకును, మీ కతిహీనమగు శిక్షయే నేఁ డనుభవింపఁ వలయు" నని చేతులు చాఁచుచున్నప్పుడు వారిని నీవు చూచియుండిన నెంత బాగుండును!

"మేము నిన్ను సృజించినట్లే యొంటరిగా మాయొద్దకు వచ్చి యున్నావు. మేము నీ కిచ్చినమంచివస్తువులను వెనుక విడిచిపెట్టినావు. దేవునితో సమానులని నీవు కల్పించుకొనిన సహాయకులు నీతో రాలేదు. మీ కిప్పు డెడబాటు కలిగినది. దేవునితో నీవు కల్పించిన భాగస్థులు నిన్ను విడనాడినారు."

## అధ్యాయము 12.

ధాన్యపువిత్తును, ఖర్జూరపుగింజను దేవుఁడు తిరుగ మొలకలెత్తఁ జేయును. అతఁడు జీవించి యున్నవానినుండి మృతవస్తువులను, చచ్చినవానినుండి జీవములను పుట్టించును. ఇతఁడే దేవుఁడు. అయిన సతనినుండి యేల మఱలి పోయెదరు?

అతఁ డుదయమును గల్పించి, విశ్రాంతికై రాత్రి నేర్పఱిచి, కాలమానమునకై సూర్యచంద్రులను నిలిపి యున్నాఁడు. శక్తిమంతుఁడును, బుద్ధుఁడును నగునాతని యాజ్ఞ యిదియే.

భూసముద్రములపైఁ జీఁకటి క్రమ్మియున్నపుడు మీకు దారి చూపుట కాతఁడు నక్షత్రములను నిలిపినాఁడు! జ్ఞానుల కీసూచనలు స్పష్టముగానే యుంచినాము.

మి మ్మొక్కమనుష్యునినుండియే కల్పించి యొకగృహమును, విశ్రాంతిస్థలమును నిచ్చినవాఁ డాతఁడే! వివేకము గలవారికి మాసూచనలను స్పష్టీకరించితిమి.

100. స్వర్గమునుండి వర్షముఁ బంపినవాఁడు నాతఁడే. దానిమూలమున మేము మొక్కలకు చిగుళ్ళు పెట్టించి, వానినుండి పచ్చని యాకుజొంపములఁ బెంచి, ధాన్యమును దట్టముగఁ బండించి, ఖర్జూర వృక్షములను పండ్లగుత్తులతోఁ బ్రేలఁజేసి, నానావిధములగు ద్రాక్షలు, ఆలివులు, దానిమ్మలు గలతోఁటలను వృద్ధిచేయుదుము. అవి ఫలించి పక్వము చెందునపుడు వానివంక జూడుఁడు. విశ్వసించినవారి కిందు సూచనలు కలవు గదా!

అయినను దేవుఁడు సృజించినభూతములనే యాతనికి సమానములుగ వారు కల్పించుచున్నారు. అజ్ఞానముచే వా రాతనికి కొడుకులుఁ గూఁతుండ్రు నున్నారని పల్కుచున్నారు. అతఁడు మహోన్నతుఁ డగుఁగాక! అతఁడు, వారు తన్నుఁగూర్చి పల్కు నగుణముల కతీతుఁడై వెలయును గాక!

## అధ్యాయము 13.

స్వర్గమర్త్యములను సృజించినవాఁ డాతఁ డొక్కఁడే! అతనికి భార్యయే లేనప్పుడు కొడు కెచటనుండి వచ్చును? అతఁడు సర్వమును సృజించినాఁడు. సర్వము నతనికిఁ దెలియును.

ఇతఁడే మీప్రభువగు దేవుఁడు! సర్వసృష్టికర్త యగు నాత నికి మించి మఱియొక దేవుఁడు లేఁడు. కావున నతనినే పూజింపుము. అతఁడు సర్వమును కాచికొని యున్నాఁడు.

అతని నెవ్వరును చూడఁ జాలరు. అతఁడు సర్వమును చూడఁగలఁడు. అతఁడు సూక్ష్ముఁడు. సర్వజ్ఞుఁడు!

ఇపుడు మీరు చూడఁగలప్రమాణములు మీ ప్రభువునుండి మీకు వచ్చినవి. వానిని చూడఁగలవానిదే భాగ్యము. వానిని చూడలేనివాఁడే దరిద్రుఁడు. నేను మీకు సంరక్షకునిగా నియమింపఁబడలేదు.

'మీరు బాగుగఁ జదివికొనినా' రని యనుకొనుట కాసూచనలను మీ కనేక రీతులుగా తెలుపుచుందును. బోద్ధ లగువారికవి స్పష్టపడుటయే మా యభిప్రాయము.

నీప్రభువు నీకుఁ దెలిపినదాని ననుసరింపుము. అతఁడు తప్ప మఱియొకదేవుఁడు లేఁడు. అతనితో నితరదైవములఁ జేర్చువారి నుండి తొలఁగిపొమ్ము!

దేవునియిష్టమైనచో, నాతనితో వా రితరదైవములఁ జేర్చి యుండరు. మేము నిన్ను వారిపై యజమానునిగఁ గాని, సంరక్షకునిగఁ గాని, యుంచలేదు.

దేవునిఁగాక, వా రావాహన చేయువారిని తృణీకరింపకుము. అట్లు చేసినచో వారును నజ్ఞానముచే దేవుని తృణీకరింతురేమో. మే మిట్లు ప్రతిజాతివారును చేయవలసినపనులను కల్పించితిమి. వారు తిరిగి తమ ప్రభువునొద్దకు వచ్చునప్పుడు వారు కావించిన పను లెట్టివో యాతఁడు వారి కెఱింగింపఁ గలఁడు.

110. వారి కొకసూచన వచ్చినచో తప్పక దానిని విశ్వసింతుమని దేవునియాన వారు ఘోరముగుప్రమాణమును చేసియున్నారు.

"సూచనల నీయఁగలవాఁడు దేవుఁ డొక్కఁడే. అవి వచ్చినప్పుడు మీరు విశ్వసించి యుండకపోవుటచే వానినుండి మీ కాతఁడు బోధింపఁడు" అనుము.

వారు తొలుత విశ్వసించి యుండకపోవుటచే వారిహృదయములను నేత్రములను సత్యమును గనుగొనకుండునట్లు చేసెదము. వారు తమయక్రమవర్తనమునందే తెన్నుగానక తిరుగునట్లు చేసెదము.

---

# కాండము. 8

---

## అధ్యాయము 14.

మేము వారిచెంతకు దేవతలను బంపినను, చచ్చినవారు వారితో మాటాడినను, వారిచుట్టు నున్నవస్తువులను నన్నిటి నాయా తరగతులుగ నొకచోఁ జేర్చినను, దేవుని యిష్టమున్నఁగాని వారు విశ్వసింపరు. కాని, వారిలో చాలమంది కది తెలియదు.

మనుష్యులలోను భూతములలోను సైతానులను గల్పించి, ప్రతిప్రవక్తకును శత్రువుల నేర్పఱిచియే యున్నాము. మోసపుచ్చుటకై వా రొకరితో నొకరు వృథాసంభాషణలఁ గావింతురు. నీప్రభువున కిష్టమైనచో వా రట్లు చేసియుండరు. కావున వారిని, వారి వెఱ్ఱి యూహలను విడిచిపెట్టుము.

రాఁబోవు జీవనమున నమ్మకము లేనివారి హృదయములను దానివంక తిరుగునట్లు చేయును. వారిని దీనితో తృప్తి నొందనిచ్చి వారిలాభమును వారిని పొందనిమ్ము.

ఏమి ! స్పష్టమగు గ్రంథమును పంపినవాఁ డతఁడే యైయుండఁగా దేవుని తప్ప నితరన్యాయకర్తను పిలుతునా ? మే మాగ్రంథము నిచ్చినవారి కది సత్యముగ దేవునినుండియే వచ్చినదని తెలియును. కావున నీవు శంకాపరులలోఁ జేరకుము.

నీప్రభువువాక్యములు సంపూర్ణముగ సత్యవంతములు. న్యాయవంతములు, అతనిమాటల నెవ్వరును త్రిప్పివేయఁ జాలరు. అతఁడు శ్రోత ! జ్ఞాని ! మీరీలోకమున చాలమందికి విధేయులైనచో వారు నిన్ను దేవునిమార్గమునుండి తప్పింతురు. వారు తమయూహానే యనుసరించుచు నసత్యవాదులై యున్నారు.

నీప్రభువు ! తనమార్గము నుండి తప్పించినవారిని, మంచిమార్గము ననుసరించినవారిని నాతఁడెఱుఁగును.

నీవు దేవునిసూచనల నమ్మినయెడల, నీవు తినుదానిపై తొలుత దేవునినామము నుచ్చరించి భుజింపుము.

120. నిర్బంధముచే నీవు తినవలయునప్పుడు తప్ప, దేవునినామము తొలుత నుచ్చరింపఁబడినదాని నేల భుజింపవు ? నిషేధించినవస్తువుల నాతఁడు నీకుఁ దెలిపియే యున్నాఁడుగదా ! కాని చాలమంది యజ్ఞానులై తమరుచులనే యనుసరించి యితరులను త్రోవతప్పింతురు. నిశ్చయముగా నీప్రభువున కాజ్ఞోల్లంఘనాపరు లెవ్వరో తెలిసియే యున్నది.

దౌష్ట్యమును, దానినిబోలుదానిని గూడ విసర్జింపుము. పాపమునే యార్జించుకొనినవారికి తగినలాభము చేకూఱును.

దేవుని నామ ముచ్చరింపఁబడనివస్తువును సేవించుట నేరము. కావున నట్టిదానిని భుజింపకుము. సైతానులు తమభక్తులను నీతో వాదింపఁ బ్రేరేపింతురు. నీవు వారిని మన్నించినచో, నీవును దేవునితో నితరదైవములఁ జేర్చినవారిలోఁ జేరుదువు.

## అధ్యాయము 15.

చచ్చినవెనుక మేము జీవము లిచ్చి మనుష్యులలోఁ దిరుగుట కొకదీపము నొసగిన వా రెప్పుడును చీఁకటిలో మెలఁగుచు నందుండి పైకి రాఁ జాలనివారివంటివా రగుదురా? అవిశ్వాసులకృత్యము లిట్లే వారికొఱకు సిద్ధము చేయఁబడినవి.

ఇట్లే ప్రతినగరమునందును దుష్టులకు మొనగాండ్రె నేర్పఱచినాము. వారు కుటిలు పన్నుచుందురు గాని, యవి తమ్మే కొట్టి వేయును. వారి కది తెలియదు.

వారి కొకసూచన వచ్చినంతనే "దేవునిప్రవక్తల కిచ్చిన దానివంటిది మాకు నీయనిచో మేము నమ్మము" అందురు. తన సందేశము నెవరికిఁ బంపవలయునో దేవునికి బాగుగఁ దెలియును. ఉల్లంఘించినవారికుటిలకుఁగాను దేవునిమోల నవమానమును ఘోరశిక్షయు విధింపఁబడి యున్నవి.

దేవుఁడు రక్షింప నుద్దేశించినవానిహృదయము భక్తిని గ్రహించుటకు (ఇస్లామునకు) సుముఖముగ నుండును. కాని, యాతఁడు త్రోవఁ దప్పింపనెంచినవారిహృదయములు స్వర్గమున కెగబ్రాఁకు చున్నట్లే సంకుచితములుగఁ జేయును. దేవుఁ డిట్లే యవిశ్వాసులను ఘోరముగ శిక్షించును.

ఇదియే నీప్రభువు చూపినక్రమమార్గము. వివేకము గలవారి కిపుడు మాసూచనలను విడివిడిగాఁ దెలిపియున్నాము.

వారికిఁ దమప్రభువుతో శాంతియుతమగుగృహము లభించును. వారు గావించినసత్కార్యములకు ఫలముగ నాతఁడు వారికి రక్షకుఁ డగును.

దేవుఁడు వారి నందఱి నొకచోఁ జేర్చుదినమున వారితో "ఓభూతసంతతివారలారా! మీరు మనుష్యులను మిక్కిలి పీడించితిరి"

అనఁగా మనుష్యులలోనున్న వారిభక్తులు "ప్రభువా! మే మొండొరు లకు సహాయపడితిమి. అయినను నీవు మాకు నిర్ణయించిన యాయుష్కాల మైపోయినది" అనియందురు. వారితో నాతఁడు "మీకగ్నియే యావా సము! అందు శాశ్వతముగాఁ బడియుండుఁడు. దేవునియిష్టమైనఁ గాని మీ కన్యథా జరుగదు" అనును. నిశ్చయముగా నీప్రభువు బుద్ధుఁడు, జ్ఞాని!

130. ఇట్లే, దుష్టులను తమకార్యములకు ఫలముగా నొకరిపై నొకరి నేర్పఱిచెదము.

## అధ్యాయము 16.

ఓభూతమనుష్యసంతతివారలారా! మీకు నాసూచనలఁదెల్పుచు, నీదినమున మీరు నన్నుఁ జేరుటఁగూర్చి చాటుచు, మీలో నుండియె మీయొద్దకు ప్రవక్తలు వచ్చియుండిరికారా! "మేము మీపై సాక్ష్యము పల్కెదు" మని వారందురు. ఇహలోకజీవ నము వారిని భ్రమింపఁజేసెను. తాము విశ్వాసు లగుటకు తమపై తామే సాక్ష్య మీయఁగలరు.

ప్రజ లజాగ్రత్తగా నుండఁగా వారిపురములను నాశనము చేయ నిష్టపడకుండుటచేతనే యి ట్లయ్యెను.

వారివారికార్యములకుఁ దగినఫలములను వారు పొందఁగలరు. వారు చేసినపనులను వారిప్రభువు గుర్తించియుండకపోలేదు.

నీప్రభువు భాగ్యవంతుఁడు, కరుణాపూర్ణుఁడు. అతని యిష్టమైన చో మిమ్ము నాశనము చేసి మిమ్ము మీపూర్వులస్థానములందు నిలిపినట్లు మీస్థానములం దితరుల నిలుపఁ గలఁడు.

మీరు దేనిచే భయపెట్టఁబడితిరో యది తప్పక జరుగఁ గలదు. దానిశక్తిని మీరు తగ్గింపఁజాలరు.

నాభక్తజలారా! శ్రేష్ఠతరముగఁ బ్రవర్తింపుఁడు. నేను నాప నిని చేసెదను. ఇఁకముందు దాగృహాలాభ మెవరికిఁ గలుగునో మీకుఁ దెలియఁగలదు. భక్తిహీను లెన్నటికిని వృద్ధినొందఁ జాలరు.

ఇది గాక వా రాతఁడు సృజించినఫలములలోను, పశువుల లోను, కొన్నిఁటిని వేఱె యుంచి 'ఇవి దేవునికి' అనియు, 'ఇవి మేము దేవునితోఁ జేర్చినయితరులకు' అనియు నందురు. అయినను వారు దేవునిసమానుల కుంచినవి దేవునియొద్దకు రావు. దేవునికొఱ కుంచినవి వారిసమానులకు వచ్చును. వారి వివేచన దుష్టము గదా!

ఇట్లే వారు దేవునితోఁగూర్చిన సమానదైవములు తమ సంతానమును జంపి తమమతము నక్రమములతోఁ గప్పిపుచ్చుటకు ప్రేరేపింతురు. కాని, దేవుని కిష్టమైనచో వా రట్లు చేసియుండరు. కావున వారిని, వారి పన్నాగములను విడిచిపెట్టుము.

"ఈపశువులును, నీఫలములును, పవిత్రవంతములు. మాయిష్టము వచ్చినవారుతప్ప నితరులు వీనిని భక్షింపఁగూడదు. ఈపశువుల వీఁపులపై భారములు వేయఁగూడదు" అని వారందురు. కొన్ని పశు వులపై వారు దేవునినామ ముచ్చరింపనే యుచ్చరింపరు. ఇది యంతయు దేవునిపై నసత్యము గల్పించుట కాదా? వారికల్పనలకు వారు తగినఫల మనుభవింపఁగలరు.

140. "ఈపశువులగర్భములలో నున్నవానిని పురుషులే కాని మా యాఁడువారు తినఁగూడ" దందురు. కాని, యాపశువుగర్భమునుండి పిండమే జాతిపడినయెడల నిరువురును దాని నారగింతురు. ఈ భేద కల్పనలకు దేవుఁడు వారికిఁ దగినఫల మీయఁగలఁడు. అతఁడు జ్ఞాని, బుద్ధుఁడు!

అజ్ఞానవశమునఁ దమసంతానమును జంపియు దేవుఁ డాహార ముగా విధించినదానిని నిషేధించియు దేవునిపై నసత్యములం గల్పిం చువారు నష్టులై పోవుదురు! వారు పొరపడినారు. వారికి సరియగు రక్షణ దొరకలేదు.

## అధ్యాయము 17.

ద్రాక్ష, ఖర్జూరవనములను, వివిధసస్యములను, ఆలివులను, దానిమ్మలను మొదలగుననేకవిధములగువానిని పుట్టించినవాఁడాతఁడే. అవి ఫలించినప్పుడు వానిఫలములను తిని, వాని నేరునప్పు డెవరికి రావలసినభాగము వారి కిచ్చివేయుఁడు. వృథావ్యయము చేయకుఁడు! అట్లు చేయువారిని దేవుఁడు ప్రేమింపఁడు.

బరువులు మోయుటకును, ప్రయాణములకును పశువు లున్నవి. దేవుఁడు మీ కాహారముగా నిచ్చినదానిని భుజింపుఁడు. సైతాను మీకు గర్భశత్రువు. కావున నాతనిపదముల ననుసరింపకుఁడు.

జతలుజతలుగా నాలుగురకములపశువులు మీ కున్నవి. గొఱ్ఱెలజత యొకటి, మేకలజత యొకటి. 'వానిలో రెండును మగ వానినా, రెండును ఆఁడువానినా యాతఁడు నిషేధించెను? లేక, యా రెండు ఆయాఁడువానిగర్భములలోనివానినా? మీరు సత్యవంతు లైనచో తెలిసికొని నాకుఁ జెప్పుడు" అనుము.

ఒంటెలజతయొకటి, ఆవుయెద్దులజత యొకటి, వీనిలో రెండును మగవానినా, ఆఁడువానినా, లేక యాఁడువానిగర్భములలో నున్న వానినా, యాతఁడు మీకు నిషేధించినాఁడు? దేవుఁ డిట్లు విధించి నప్పుడు మీ రున్నారా? మనుష్యులను మోసపుచ్చుటకు దేవునిఁ గూర్చి యసత్యకల్పనము చేయువానికంటె దుష్టుఁ డెవఁడు? దేవుఁడు దుష్టులను రక్షింపఁడు' అనుము.

## అధ్యాయము 18.

తనంతట తాను చచ్చిపోయినది, పైకి కారినరక్తము, పంది మాంసము, ఇవి దేవునిపేరఁ గాక, యితరులపేర చంపఁబడియుండు టచే నపవిత్రములును, దుష్టములు నయ్యెను. వీనినిగాక, తినువారికి మఱి యెవ్వానినిగూడ దేవుఁడు నిషేధించి యుండినట్లు నాకుఁ దెలియ లేదు. ఉల్లంఘనచేఁ గాక నిర్బంధితుఁడై వీనిని తినువాని యెడల దేవుఁడు క్షమాపరుఁడై కరుణించును.

యహూదీలకు మే మొంటిడెక్కగలజంతువులను. ఎద్దు, గొఱ్ఱెలు, వీనివీఁపులమీఁదను, పేగులలోను, దుమ్ములమీఁదను నుండు క్రొవ్వును తప్ప తక్కినచోట్లనుండు క్రొవ్వును నిషేధించియున్నాము. వా రుల్లంఘనాపరులగుటచే వారికింతే చేకూఱినది. మే మన్యాయము చేయువారము కాము.

వారు నిన్ను కృత్రిమునిగా నెంచినచో "నీప్రభువు కరుణా పూర్ణుఁడే కాని, యాతనికాఠిన్యమును దుష్టులనుండి యెవ్వరును తప్పింపఁ జాలరు" అని వారితోఁ జెప్పుము.

దేవునితో దైవములఁ జేర్చువారు "దేవునియిష్టమైనచో, నాతనికి సమానులఁ జేర్చుటగాని, దేనినైన నిషేధించుటగాని, చేసి యుండకుందుము" అని యందురు. మాశతినశిక్షను రుచిచూచు వఱకును, వారి పూర్వులును ప్రవర్తలను కృత్రిములుగనే పరిగణించి యుండిరిగదా! 'నీవు మా కేదైవ జ్ఞానమును తేఁగలవా? మీరు మీయూహలనే యనుసరించి యసత్యము లాడుచున్నారు' అని వారితో ననుము.

150. "దేవునిమాట యనాక్షేపణీయము. అతని కిష్టమైనచో మిమ్ముల నందఱిని సరియగుదారినే నడపి యుండును.

"దేవుఁ డీజంతువులను నిషేధించినాఁడని చెప్పఁగల సాక్షు లెవరైన నున్నచో వారిని తీసికొని రమ్ము. వా రొకవేళ నట్లు సాక్ష్య మిచ్చినను నీవుమాత్రము వారితోఁ గలిసి సాక్ష్య మీయకుము. మాసూచన లసత్యములని చెప్పినవారును, రాఁబోవు జీవనమును విశ్వ సింపనివారును, మనప్రభువుతో సమానులను గూర్చువారును నగువారి యూహాలఁగూర్చియు నీవు సాక్ష్య మీయకుము.

## అధ్యాయము 19.

"రమ్ము! దేవుఁడు విధించినవానిని మీకుఁ దెలియఁ జేసెదను. అతనితో భాగస్థులను మీరు కూర్పఁగూడదు. మీతలి దండ్రులయెడ మంచిగఁ బ్రవర్తింపవలయును. దారిద్ర్యముచే మీపిల్లలను చంపఁగూడదు. వారికిని, మీకును గూడ కావలసిన దానిని మేము మీ కిచ్చెదము. బాహ్యాభ్యంతరములగు నశుచిపదా ర్థములదరికి మీరు పోఁగూడదు. న్యాయపక్షమునఁ దప్ప దేవుఁడు చంపఁగూడ దని నిషేధించినవారినిఁ జంపఁగూడదు. మీరు బోధ పఱుచుకొనుటకు వీనినే యాతఁడు మీకు విధించియున్నాఁడు.

"అనాథశిశువునకు యుక్తవయస్సు వచ్చువఱకు నాతనిద్రవ్య మును వృద్ధిచేయుటకు తప్ప మఱియొక యుద్దేశముతో దానిదగ్గఱకుఁ బోఁగూడదు. నిండుకొలఁతలను, న్యాయమైనత్రాసులను నుప యోగింపుఁడు. ఏయాత్మ కెంతశక్తి గలదో యంతే కాని, యంత కెక్కుడుగ భారమును వేయకుఁడు. మీరు మాధ్యస్థ్యమును వహించి తీర్పు చెప్పునపుడు మీ బంధువునివిషయములోనైనను సరే న్యాయము ననుసరించి దేవునియొడంబడికకు కట్టుపడి యుండుఁడు. మీ శ్రేయస్సుకొఱకే దేవుఁ డిట్లు విధించియున్నాఁడు" అనుము.

"ఇదియే నాన్యాయమార్గము" కావున దాని ననుసరిం

ప్రుఁడు. అతనిమార్గమునుండి చెదరి పోకుండుట కితరమార్గములఁ జేకొనకుఁడు మీ రాతనికి భయపడియుండుటకై యాతఁడు దీనిని మీకు విధించియున్నాఁడు

న్యాయవంతులకు సంపూర్ణమై అన్నివిషయములందును తీర్పుల నిచ్చి, రక్షణయు, దయయు, నొసగి, వారు తమప్రభునితోఁ జేరుటనుగుఱించి నమ్ముటకు మూసాచేతికి మాగ్రంథము నిచ్చితిమి.

అధ్యాయము 20.

మేముపంపిన యీగ్రంథము సర్వోత్కృష్టమైనది. దయకుఁ బాత్రులగుటకు మీరు దాని ననుసరించి దేవునికి భయపడుఁడు.

"మాకుపూర్వము రెండుజాతులవారికే యీగ్రంథము వచ్చియుండెను. కాని, మేము దానిని బాగుగఁ జదివియుండలేదు" అని మీ రనకుండుటకును,

"మీ కొక గ్రంథము వచ్చియుండినచో వారికంటె మేమే దానిని బాగుగ ననుసరించి యుందుము" అని యనకుండుటకును, మీకు రక్షణయు కరుణయుఁ జేకూఱుటకు స్పష్టమగువ్యాఖ్యానముతోఁగూడ నీగ్రంథమును మీ ప్రభువునుండి మీకుఁ బంపియున్నాము. కావున, దేవునిసూచన లసత్యము లనుచు వానినుండి మఱలువానికంటె దుష్టుఁ డెవఁడు? మఱలి పోయినందు కట్టివారికి కఠినశిక్షనే ఫలముగా నొసగెదము.

దేవతలో, లేక నీప్రభువో, వారియొద్దకు దిగి వత్తురనియో, లేదా ప్రభువుసూచనలు జరుగఁబోవునేమో యనియునో కదా వారు వేచియున్నారు? నీప్రభువుసూచనలు కొన్ని జరుగఁగలదినమున, నంతకుఁబూర్వమే విశ్వసింపక యాభక్తి కనుగుణముగ సత్కా-

ర్యములఁజేసియుండనియాత్మకు తాత్కాలిక భక్తివలన నొకించుకయు లాభింపదు. "మీరు వేచియుండుఁడు. మేమును వేచియుందుము గదా!" యని వారితోఁ జెప్పుము.

160. తమమతమును చీల్చికొని శాఖలుగా వీడినవారితో జోక్యము కలుగఁజేసికొనకుము. వారిని దేవుఁడే చూడఁగలఁడు. వారు చేసినదానిని తరువాత నాతఁడే వారికిఁ దెలుపఁగలఁడు.

సత్కార్యముల నాచరించి వచ్చినవానికి పదిరెట్లు బహుమానము దొఱకును. దుష్కార్యముల నాచరించి వచ్చినవానికి దానికిఁ దగినశిక్షయే కలుగును. వారి కేయన్యాయమును జరుగఁబోదు.

'నన్ను నాప్రభువు తిన్ననిదారిలో నడిపించియున్నాఁడు. నిశ్చల భక్తుఁడైన యిబ్రాహీ మవలంబించిన సత్యమతమే యది. అతఁడు దేవునితో నితర దైవములఁ జేర్చినవారిలోనివాఁడు కాడు

నాప్రార్థనలు, నాపూజ, నాజీవితము, నామరణము, సర్వమును జగన్నాథుఁడగు దేవునికే యర్పించివాను.

అతనికి సమానుఁడు లేఁడు. ఇది నాకయినయాజ్ఞ. భక్తులలో నేను ప్రథముఁడను.

'దేవుఁడు సర్వాధినాథుఁడై యుండ నతనిని గాక యితరునిఁ జేకొందునా? ప్రత్యాత్మయు తనకొఱకే పాటుపడవలయును. భారములను మొదటనే మోసికొనుచున్నవానిపై మఱియొక భారము గూడ వేయఁబడదు. తుదకు మీరు మీప్రభునొద్దకే రాఁగలరు. అప్పుడు మీ వివాదముల నాతఁడు మీకుఁ దెలుపఁగలఁడు' అనుము.

మి మ్మాభూమిపై మఱికొందఱిస్థానమున నిలిపి, తనవరముల నిచ్చి మిమ్ము శోధించుటకు మీలోమీ కంతరువుల నాతఁ డేర్పఱిచి యున్నాఁడు. నీప్రభు వతిశీఘ్రముగ శిక్షించుట నిశ్చయము. కాని, యాతఁడు కరుణామయుఁడు, దయాదాక్షిణ్యపరుఁడుగ నున్నాడు.

# సురా 7 ఉన్నతస్థానములు.

మక్కా-205 పద్యములు-24 రుకూలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

అలీఫ్. లమ్. మిమ్. సాద్.

మీరు భయసూచనఁ గొందురనియు, విశ్వాసులు భయపడుదు రనియు, నొకగ్రంథము మీకుఁ బంపఁబడినది. కావున దానినిగుఱించి మీహృదయములందు సందేహము వలదు.

మీప్రభువు మీకుఁ బంపినదాని ననుసరింపుఁడు ; అతనిఁ దప్ప నితరప్రభువుల ననుసరింపకుఁడు. మీ కించుకైనను భయము లేదు.

మే మెన్నియో నగరముల నాశనము చేసియున్నాము. రాత్రి వేళనో, మధ్యాహ్నము వారు నిద్రించుచుండఁగనో, యవి మాకోపమునకు గుఱియైనవి.

అప్పుడు వారు "అయ్యో! మేము భక్తిహీనులమై యుంటి" మని తప్ప మఱియొక కేక వేయలేదు.

కావున మేము ప్రవక్తలఁబంపి, వారిని తప్పక లెక్కల నడిగెదము. ఆప్రవక్తలనే మేము లెక్క చెప్పుమందుము.

మేము వారి నెన్నఁడును విడిచియుండలేను. వారిపను లన్నియు మాకుఁ దెలిసినను వారిని మే మడిగెదము.

ఆదినమున త్రాసుతో న్యాయముగ తూఁచెదము. త్రాసు బరువెక్కినవారు సుఖులగుదురు.

త్రాసులు తేలికయైనవారే మాసూచనలమెడ నన్యాయపరులై తమయాత్మలను పోఁగొట్టుకొనినవారు.

10. మిమ్ము మేము భూమిపై నిలిపి మీ ప్రాణాధారమునకుఁ గావలసిన దంతయు నిచ్చితిమి. మీ రెంతయు కృతఘ్నులై నారు.

అధ్యాయము. 2.

మేము మిమ్ము సృజించి, రూపముల నిచ్చి, దేవతలతో "ఆదామునకుఁ సాగిలపడుఁ" డనఁగా వా రందఱు నారాధనా పరులై సాష్టాంగపడిరి. కాని, ఇబ్లీసు మాత్ర మట్లు చేయ లేదు. అతఁడు సాగిలఁబడినవారిలో లేకుండెను.

అతనితో దేవుఁడు "నాయాజ్ఞ ప్రకారము నీవు సాష్టాంగ పడకుండుటకు నీ కేమి యాటంకము కలిగినది ?" అని యడుగ నాతఁడు "వానికంటె నేను ఘనుఁడను. న న్నగ్నితోడను, నాతని మట్టితోడను గదా సృజించితి" వనెను.

అతఁడు "ఇచ్చటనుండి దిగి పొమ్ము. నీగర్వమున కీభోగ భూమి తగదు. ఇక్కడనుండి పొమ్ము. నీ వవమానితుఁడ వగుదువు గాక" అనెను.

అతఁడు "మనుష్యజాతి మృతులనుండి లేవఁదీయఁబడువఱకుఁ గడు విమ్ము" అనెను.

అతఁడు "అట్లే, గడువిచ్చినాము" అని పల్కెను.

అతఁడు "ఇప్పుడు నీవు నన్ను తప్పుదారిని బెట్టితివి గాన, వారికొఱకు నీదారిలో పొంచియుండెదను.

అప్పుడు మేము మీముందునుండియు, వెనుకనుండియు, కుడి ప్రక్కనుండియు, నెడమప్రక్కనుండియు వారిపైఁ బడెదము. వారిలోఁ జాలమంది కృతజ్ఞులుగా నుండకుండుట నీవు కనుగొందువు" అనెను.

అతఁడు "ఇచటనుండి ప్రవాసివై, దూషితుఁడవై పొమ్ము.

వారిలో ని న్ననుసరించినవారి నందఱిలోను నరకమును నింపివేసెదను.

ఆదామా, నీవును నీభార్యయు స్వర్గభూమిలో వసించి మీ యిచ్చవచ్చినదానిని తినుఁడు. కాని, యీచెట్టునొద్ద చేరకుఁడు. అట్లు చేసినచో మీ రన్యాయవర్తు లగుదురు" అనెను.

20. అప్పుడు సైతాను వారిద్దఱినుండియు దాఁచఁబడిన నగ్నత్వము వారికిఁ దెలియుటకై వారిచెవిలో నేమో చెప్పుచు "మీ రమర్త్యులరో, మర్త్యులరో కాకుండనుండుట కీవృక్షము మీకు నిషేధింపఁబడిన" దనెను.

"మీకు సరియైనయుపదేశము చేసినవాఁడ" నని యాతఁడు వారిరువురి|మోలను ప్రమాణము చేసెను.

ఇట్లాతఁడు వారిని మోసములచే త్రోవ తప్పింపఁగా వా రావృక్షఫలము నాస్వాదించి, తమనగ్నత్వము గోచరమైనంతనే తోఁటలోని యాకులతో వస్త్రములఁ గట్టుకొన నారంభించిరి. అప్పుడు వారిప్రభువు "మీ కీచెట్టును నిషేధించిన సైతాను మీకు గర్భశత్రు వని మీతోఁ జెప్పలేదా" యని ప్రశ్నించెను.

వా రాతనితో, "ప్రభువా, మాకు మేమే యన్యాయము చేసికొనినాము. నీవు మమ్ము క్షమించి కరుణింపనిచో మేము తప్పక నశించువారిలోఁ జేరుదుము" అనిరి.

అతఁడు "మీలో నొకరి కొకరు శత్రువులరై యిచటనుండి పొండు. మీకు భూమియే యావాస మగును. మీ కొక్కఋతువే యాహారము దొఱకును.

మీ రందే జీవించి, యందే మృతినొంది, యచటనుండియే తీసికొనిరాఁబడుదురు" అనెను.

## అధ్యాయము 3.

ఆదాముసంతతివారలారా! ఇపుడు మీమానముఁ గప్పి కొనుటకు బట్టలను మేలివస్త్రములను బంపియున్నాము. కాని,మీకు భక్తివస్త్రమే మంచివస్త్రము. మనుష్యుఁ డాలోచించుకొనుట కిది యొకసూచన.

ఆదామసంతతివారలారా! పూర్వము సైతాను మీతలి దండ్రులనగ్నత్వము జూచికొనుటకు వారిభక్తిని హరించి, యుద్యాన వనమునుండి తఱిమివేసినట్లు మిమ్మునుగూడ కష్టములోనికి దింపనీయ కుఁడు. అతఁడును నతనిసహాయకులును మీకుఁ గనఁబడకుండ మిమ్ముఁ జూచుచుండెదరు. మేము సైతానుల నవిశ్వాసులకు గురువులఁ జేసితిమి.

దుష్టులేదైన కార్యముఁ జేసి "మాతండ్రులిట్లే చేయుచుం డుటఁ గాంచితిమి. ఇది దేవుఁ డాజ్ఞాపించినదే" అందురు. "దేవుఁ డకార్యముల విధింపలేదు. మీకుఁ దెలియనిదానిని దేవుని కంటఁ గట్టెదరా?" అనుము.

"నాప్రభువు న్యాయమునే విధించినాఁడు. కావున నాతఁడారా ధింపఁబడు నన్నిస్థలములకును మొగము త్రిప్పుఁడు. నిష్కాపట్యమగు మతము నవలంబించి యాతనిఁ బిలువుఁడు. అతఁడు మిమ్ము సృజించు టచే నతనినే తిరిగి చేరుదురు.

30. కొందఱి నాతఁడు రక్షించెనుగాని, కొందఱు సైతానులను గురువులఁ జేసికొని దేవుని విసర్జించి తాము సరియైనత్రోవనే పట్టితి మనుకొనినందున వారిని తప్పుత్రోవలోనే వదలిపెట్టినాఁడు" అనుము.

ఆదాముపుత్త్రులారా! మీ రేమసీదునకుఁ బోయినను మంచి బట్టలను తొడిగికొని, మంచియాహారమును తిని, మంచిపానీయమును

దాగ్రిగుఁడు. కాని, మితిమీఱకుఁడు. అతఁడు మితిమీఱినవారిని బేగ్రిమింపఁడు.

అధ్యాయము 4.

"దేవుఁ డనుగ్రహించినమంచివస్త్రములను, అతఁడు ప్రసాదించినభక్ష్యభోజ్యములను నిషేధించినవాఁ డెవఁడు?" అనుము. "ఇహలోకజీవనమునందును అంతకుమించి రక్షణదినమునను విశ్వాసుల కివి చేకూఱును. జ్ఞానులకు మాసూచనల నిట్లు తెలుపుదుము" అనుము.

రహస్యముగను, బహిరంగముగను నకార్యములఁ జేయుటయు, ఘోరపాపములను జేయుటయు, అక్రమముగ హింసించుటయు, అతని యనుమతిఁ బడయనియితరదైవముల నాతనితోఁ జేర్చుటయు, మీకుఁ దెలియని దానిని దేవుని కంటఁగట్టుటయు, వీనిని నాప్రభువు నిషేధించినాఁడు" అనుము.

ప్రతిజాతికి నొకకాలము నిర్ణీతమై యున్నది. కాలము వచ్చినప్పుడు, వారు దాని నొకగంట ముందుకుఁగాని, యొకగంట వెనుకకుఁగాని, మఱలింపలేరు.

ఆదాముపుత్త్రులారా! నాసూచనలను మీకుఁ దెల్పుచు మిమ్మునుండియే ప్రవక్తలు మీయొద్దకు వత్తురు. దేవునికి భయపడి సత్కార్యముల నాచరించువారి కేభయముగాని, యేదుఃఖముగాని కలుగఁబోదు,

మాసూచన లసత్యము లని, గర్వముతో వానినుండి మఱలినవా రగ్నిహోత్రమున శాశ్వతవాసమ్ముఁ జేయవలయును.

దేవునిగూర్చి యసత్యములాడి, మాసూచనల నసత్యములుగఁ బరిగణించినవారికంటె నధము లెవరు? మాదూతలు వారియాత్మలను

గ్రహించుచు, "దేవుని గాక మీరు పిలిచిన యితరు లెక్కడ నున్నా" రని యడుగువఱకును, మాధర్మగ్రంథములోఁ జెప్పఁబడిన ప్రకారము వారికి రావలసినభాగము వారికీయఁబడుచునేయుండును. వారు "అవి మమ్ము విడిచిపోయినవి" అని యనఁగలరు. తా మవిశ్వాసులగుటకు వారిపై సాక్ష్యము రాఁగలదు.

"మీకుఁ బూర్వము గతించినభూతములతోడను, మనుష్యుల తోడను నగ్నిలోఁ బ్రవేశింపుఁడు. ఒకతరమువారివెంబడిని వేఱొక తరమువా రందుఁ బ్రవేశించినకొలఁదిని తమసోదరులను శపించుచు తుద కందఱు నందు చొచ్చినంతనే, తుదిని వచ్చినవారు తమపూర్వులతో "ప్రభువా ! వీరే మమ్ము తప్పుత్రోవఁ బెట్టినవారు. కావున వీరిని రెండింతలుగ నగ్నిచే బాధింపుము" అనఁగా నాతఁడు, "మీ కందఱికి రెండింతలుగనే బాధ కలుగు" ననును. కాని మీ కిది తెలియదు.

వారిలో మొదటివారు రెండవవారితో "మీరు మాకంటె నెందులో నధికులు? కావున మీరు చేసినదానికి బాధ ననుభవించియే తీరవలయు" నందురు.

## అధ్యాయము 5.

40. మాసూచన లసత్యము లని గర్వముతో వానినుండి తొలఁగిపోయినవారికి స్వర్గద్వారములు తెఱువఁబడవు. వారు భోగభూమిని ఒంటె యొకటి సూదిబెజ్జముద్వారా పోఁగలవఱకును బ్రవేశింపఁజాలరు. ఆజ్ఞల నుల్లంఘించినవారి నిట్లే బహూకరింతుము.

వారు నరకమునఁ దమశయ్యను పఱచుకొనఁగా వారిపై నగ్నిదుప్పటములు కప్పఁబడును. దుష్టుల కిదియే బహుమానము.

మే మెవరిపైనను శక్తికి మించినభారము పెట్టము. విశ్వాసులై క్రమవర్తనులగువారు స్వర్గమున వసింతురు. అందు వారు శాశ్వతముగ నుండఁగలరు.

మేము వారిహృదయములనున్న దుఃఖమునంతటిని హరింతుము. వారికాళ్ళకడ తరంగిణులు ప్రవహించును. "మ మ్మిచటికి తోడ్కొని వచ్చినయాతని స్తుతింతుము. దేవుఁడు మాకు దారి చూపనిచో నిచటికి వచ్చియుండము. మాప్రభుప్రవక్తలు సత్యముఁబట్టుకొని మాయొద్దకు వచ్చిరి" అని వా రందురు. "మీకర్మలకు ఫలముగా మీరు వారసులైనభోగభూమి యిదియే" యనునొకవాణి వారికి వినఁబడును.

భోగభూమినివాసులు అగ్నిలోనున్నవారితో "మాప్రభువు సత్యమగునని చెప్పినదాని నిప్పుడు కనుఁగొనినాము. మీప్రభువు సత్యమని చెప్పినదానిని మీరును కనుఁగొంటిరా?" అని యడుగ వారు "అవును, కనుగొంటి" మని బదులు చెప్పుదురు. వారిరువురకును మధ్య నొకవంది వచ్చి "దుష్టులను దేవుఁడు శపించుఁగాక!

వారు మనుష్యులను దేవునిమార్గమునుండి తప్పింతురు. దానిని వంకరఁ జేయుదురు. పరలోకజీవనమునందు వారికి నమ్మకము లేదు" అని కేక వేయును.

వారిరువురకును మధ్య నొకగోడ యుండును. ఆ ఉన్నత స్థానమున తమతమయానవాళ్ళతో మనుష్యులు కూర్చుండి భోగభూమి యందలివారితో "మీకు శాంతి యగుఁగాక!" యని యందురుగాని, తమ కెంత యభిలాష యున్నను దానిలోనికిఁ బోలేరు.

వారికన్ను లగ్నిలోనున్నవారిపైఁ బడఁగనే "ప్రభువా! ఈదురాచారులతో మమ్ముఁ జేర్పకు" మందురు.

అధ్యాయము 6.

ఉన్నతస్థానములపై నున్నవారు యానవాళ్ళచే తాము కనుఁగొనినమనుష్యులతో "మీసంపాదనయు, మీగర్వమును, మీ కెందుకును పనికివచ్చినవి కావు.

దేవుఁడు కరుణింపఁడని ప్రమాణము చేసినవారు వీరేనా ? విశ్వాసులారా ! మీరు భోగభూమిఁ బొందుఁడు. అచట మీ కేభయముగాని, దుఃఖముగాని యుండదు " అందురు.

50. అగ్నియం దున్నవారు భోగభూమిలోనివారితో " మాపై నింత నీరో, దేవుఁడు మీకిచ్చినవస్తువులనో పోయుఁడు, " అనఁగా వారు " మత మొకయాటగను, వినోదముగను జేసినవారికిని, ఇహలోకజీవనముచే మోహమునొందినవారికిని, దేవుఁడు రెంటను నిషేధించియున్నాఁడు" అందురు.

వా రీదినమున మమ్ము గలిసికొనుటఁగూర్చి మఱచినట్లును, మాసూచనలను చేకొననట్లును, మేమును వారిని మఱతుము.

ఇపుడు మేము వారి కొగ్రంథమును దెచ్చియున్నాము. దానిని జ్ఞానముతో వారికి బోధపఱచినాము. అది విశ్వసించినవారికి రక్షణోపాయము. దయానిధానము.

వారికి దానియర్థముగాక మఱేమి కావలయును ? ఆయర్థము వచ్చినప్పుడు, ఇంతకుపూర్వము దానిని మఱచియున్నవారు "మాప్రభుప్రవక్తలు సత్యమును దెచ్చియున్నారు. మా కడ్డుపడువా రెవ్వరైన నుందురా ? లేదా, మమ్ము తిరిగి పంపివేయుదురా? అట్లు చేసినచో మానడవడిని మార్చికొందుము, " అందురు. కాని, వారిని వారే నాశనము చేసికొనినారు. తాము కల్పించికొనిన దేవతలు తమయొద్దనుండి వెడలిపోయినారు.

అధ్యాయము 7.

ఆఱుదినములలో స్వర్గమర్త్యముల సృజించి పిదప సింహాసనాసీనుఁడైన మీప్రభువు దేవుఁడే. అతఁడు పగటిపై రాత్రి యను తెరను వైచును. అది దానిని త్వరితముగ వెంబడించును. తనయాజ్ఞకు

లోనైన సూర్యచంద్రనక్షత్రముల నాతఁడు సృజించినాఁడు. సృష్టి యంతయును, దానిపైనిసామ్రాజ్యమును నాతనివేకదా ! జగన్నాథుఁ డగు దేవుఁడు ధన్యుఁ డగుఁగాక !

శాసనముల నుల్లంఘించువారిని మీప్రభువు ప్రేమింపఁడు. కావున నాతని నమ్రతతోను, రహస్యముగను పిలువుఁడు.

భూమిపై నంతయు సరిగ నున్నపిదప దానిని చెఱుపకుఁడు. భయముతోను నాతురతతోను నాతనిఁ బిలువుఁడు. పుణ్యవంతులకు దేవునిదయ చేరువగనే యున్నది.

తనదయను ముందుగాఁ దెలుపుటకు, మారుతములఁ బంపువాఁ డాతఁడే. అవి జలమేఘములను తేఁగా మేము వాని నొకమృతభూమిపైఁ బంపి జలము వర్షింపించి నానావిధఫలములను బుట్టింతుము. ఇట్లే మేము మృతులను సజీవులఁ జేసెదము. మీ రాలోచించెదరుగాక !

ఫలవంతమగునేలలో మొలకలు హెచ్చుగను, ఫలహీనమగు దానియందు కొంచెముగను, దానిప్రభువునాజ్ఞచొప్పున పెరుగును. కృతజ్ఞులగువారికి ట్లనేకవిధములుగా మాసూచనల నిత్తుము.

## అధ్యాయము 8.

పూర్వము నుహూను తనప్రజలయొద్ద కంపఁగా నాతఁడు "ప్రజలారా ! దేవు నారాధింపుఁడు. అతఁడుగాక మీకు మఱియొక దేవుఁడు లేఁడు. ఆమహాదినమున మీకు శిక్ష కలుగునేమో యని భయమగుచున్నది" అనెను.

60. తనప్రజలలోనినాయకు లాతనితో "నీవు పొరబడి యున్నావని మాకు స్పష్టముగ గోచరమగుచున్న" దనిరి.

అతఁడు "ప్రజలారా! నాలో నేతప్పును లేదు. నేను జగన్నాథుని

దూతను. నేను నా ప్రభువువార్తలను మీకుఁ దెచ్చియున్నాను. మీకు హితోపదేశము చేసెదను. మీకు తెలియనిదానిని దేవుని నుండి నేను తెలిసికొనియున్నాను.

మీలో నొక్కని మీ ప్రభువు మాయొద్ద కంపుటయు, అతఁడు మీకు భయసూచన నిచ్చుటయు, మీకు మీరే భయపడుటయు, బహుశః మీరు దయాపాత్రు లగుటయు, నిదంతయు మీ కాశ్చర్య జనక మగుచున్నదా ?" అనెను.

కాని, వా రాతని నసత్యవంతునిగఁ బరిగణించిరి. కావున నాతనితో నావయందున్నవారి నాతఁడు రక్షించి, మాసూచన లసత్యము లనువారిని నీటిలో ముంచివైచెను. వా రంధులు కారా ?

అధ్యాయము 9.

పిదప ఆద్ వారియొద్దకు వారిసోదరుఁడగు హూదు నంపితిమి. అతఁడు "నా ప్రజలారా ! దేవు నారాధింపుఁడు. అతఁడుతప్ప మీకు వేఱుదేవుఁడు లేఁడు. అతని కేల భయపడరు" అనెను.

వారిలో నవిశ్వాసులగునాయకు లాతనితో "నీకు మతి పోయినదని మాకుఁ దోచుచున్నది. నీవు కృత్రిముఁడవు" అనిరి.

అతఁడు "ప్రజలారా ! నాకు మతి పో లేదు. నేనుజగన్నాథుని ప్రవక్తను.

నా ప్రభువుసందేశములను మీకుఁ దెలిపెదను. నేను మీకు హితోపదేశకుఁడను.

మీలోనుండియే యొకఁడు లేచి మీకు భయసూచన తెలుపుటకు ప్రభువుచే పంపఁబడుటఁగూర్చి యాశ్చర్యపడుచున్నారా ? అతఁడు మిమ్ము నుహ్ ప్రజలపిదప నిచటికిఁ బంపుటయే కాక వారి

కంటె పొడవరులుగఁ జేసియుండుటను స్మరింపుఁడు. దేవుఁడు మీ కొసగినవరములను స్మరింపుఁడు. మీకు శ్రేయస్సు కలుగును" అనెను.

70. వారు "మాతండ్రితాతలు పూజించినదేవతలను విడిచి, యొక్కదేవునే యారాధింపుఁడని చెప్పుటకా నీవు వచ్చితివి? నీవు సత్యవచస్కుఁడ వైనచో నీవు భయపెట్టినదానిని మాపైకిఁ దీసికొని రమ్ము" అనిరి.

అతఁడు "మీప్రభువు తనపగను, క్రోధమును మీపై హఠాత్తుగాఁ జూపును. దేవునియనుమతి బడయక మీతండ్రితాతలచేఁ బూజింపఁబడువిగ్రహముల నామములఁ గూర్చి మీరు నాతో తగవులాడెదరా? అయిన వేచియుండుఁడు. నేనును మీతో వేచియుండెదను" అనెను.

మేము వారిని, వారిపక్షావలంబులను, దయఁదలఁచి విడిచితిమి. అవిశ్వాసులై మాసూచన లసత్యము లనినవారిని నిశ్శేషముగఁ జంపితిమి.

## అధ్యాయము 10.

సామూదులయొద్దకు వారిసోదరుఁడగు 'సాలే' నంపితిమి. అతఁడు "నాప్రజలారా! దేవుని పూజింపుఁడు. అతఁడుతప్ప మీకు వేఱుదేవుఁడు లేఁడు. ఇదిగో! దేవుఁడంపిన యాఁడుయొంటె. ఇది మీ కొకయానవాలు. నాసందేశమునకు ప్రభువంపినసాక్ష్య మిదియే. కావున దానిని దేవునిభూమిపై యథేచ్ఛగ మేయుటకు వదలివేయుఁడు. దానికి హాని కలిగించుటకై దానిని ముట్టకుఁడు. అట్లు చేసినచో మీకు ఘోరశిక్ష కలుగును.

మిమ్ము ఆద్ ప్రజలపిదప నిచటి కాతఁడు పంపినాఁడు. మీకీభూమిపై వసతుల నేర్పఱిచినాఁడు. దానిపై మేడలను మిద్దెలను

గట్టికొని, కొండలలో నిండ్లను దొలిచికొని యుండుఁడనినాఁడు. దీనిని జ్ఞాపకముంచికొనుఁడు. దేవునియనుగ్రహమును మఱవకుఁడు. విచ్చల విడిగఁ దిరిగి భూమిని పాడుచేయకుఁడు" అనెను.

ఆప్రజలనాయకులు గర్వముచే నుప్పొంగి, తాము బలహీను లనుకొనినవారితోడను, విశ్వాసులైనవారితోడను గూడ, "ఏమీ! సాలేను అతని ప్రభువే పంపెనని మీకుఁ దెలియునా" యనఁగా వారు "అతఁడు పంపినదానియందు మాకు సత్యముగ నమ్మకము గల" దనిరి.

అప్పుడా గర్విష్ఠులు "మీరు నమ్మినదానిని మేము నమ్మ" మనిరి.

వా రా యూఁడుఒంటెను చంపి, దేవునియాజ్ఞను తిరస్కరించి "నీ వొకప్రవక్తవే యైనచో మీ భయసూచన లేవో యిఁక జరుగని" య్మనిరి.

అంత భూకంప మకస్మాత్తుగాఁ గలుగఁగా, నెవరియిండ్లలో వారు తెల్లవారుసరికి మొగములపైఁబడి మృతినొందిరి.

అపు డాతఁడు వారిని వదలి "నాప్రజలారా! నేను మీకు నాప్రభువుసందేశమును బ్రకటించితిని. మీకు హితోపదేశము చేసితిని. కాని మీరు హితమొసగువారినిఁ బ్రేమింపరు" అనెను.

80. మేము లూటునుగూడఁ బంపఁగా నాతఁడు తనప్రజలతో "ఇంతకుపూర్వ మెజంతువును జేసియుండని యీనీచకార్యము నేల చేయుచారు?

కామేచ్ఛతో స్త్రీలయొద్ద కేఁగెదరుగాక! పురుషులపైకిఁ గూడ వత్తురా? మీరు మితిమీఱి వర్తించుచున్నారు" అనెను.

వారు "వీరు తామే పవిత్రవంతుల మనుకొనుచున్నారు. వీరిని పురమునుండి వెడలఁగొట్టుఁడు" అనిరి.

అంత మే మాతని, నతని కుటుంబమును రక్షించితిమి. అతని భార్య యాలసించుటచే నామెను రక్షింపలేదు.

పిదప వారిపై వర్షము గురియించితిమి. చూచితిరా! దుష్టుల గతి యేమైనదో!

## అధ్యాయము 11.

తరువాత మేము మదీయానువారియొద్దకు వారిసోదరుఁడగు షుయైబు నంపితిమి. అతఁడు "నాప్రజలారా! దేవునిఁ బూజింపుఁడు. అతఁడు తప్ప వేఱుదేవుఁడు లేఁడు. ఇదిగో మీప్రభు వొకస్పష్టమగు నానవాలు పంపియున్నాఁడు. కావున తప్పుకొలతలను తూనికలను చేయకుఁడు. మీరు దీనిని నమ్మినచో శ్రేయస్సుకలుగును.

బాట లన్నిటియందును త్రోవఁ బోయినవారిని భయపెట్టుటకు పొంచియుండకుఁడు. దేవునియందు నమ్మకము గలవానిని త్రోవ తప్పించుటగాని, దానిని వంకర చేయుటగాని చేయకుఁడు. మీరు కొలఁదివారుగా నున్నప్పు డాతఁడు మిమ్ము వృద్ధిచేయుటను స్మరింపుఁడు. అక్రమములఁ గల్పించినవారిగతి నారయుఁడు.

నేను తెచ్చినదానిని మీలోఁ గొందఱు నమ్మి, కొందఱు నమ్మకయుండినచో దేవుఁడు తీర్పు చెప్పువఱకును వేచియుండుఁడు. అతఁడు న్యాయకర్తలలో శ్రేష్ఠుఁడు" అనెను.

# కాండము 9

అప్పుడు వారినాయకులు గర్వముచే నుప్పొంగి, "ఓషుయైబా! మీరు తిరిగి మామతములోనికి వచ్చినఁగాని, నిన్నును నీయనుచర విశ్వాసులను మాపురమునుండి వెడలఁగొట్టెద" మనిరి. "ఏమి! మా కది యిష్టము లేకున్నను, మీమతము నవలంబింపవలెనా?

దేవుఁడు మమ్ము మీామతమునుండి తప్పించియున్నాఁడు. మేము దానిని తిరిగి చేకొనినచో దేవునిఁగూర్చి యసత్యముఁ గల్పించినవార మగుదుము. మాప్రభువగు దేవుని యనుజ్ఞ లేనిదే తిరిగి మీామతమును స్వీకరింపఁ జాలము. మాప్రభువు సర్వజ్ఞుఁడు. అతనినే మేము నమ్మియున్నాము. ప్రభువా! మాకును మాప్రజలకును, మాధ్యస్థ్యము వహించి తీర్పు చెప్పుము. నీవు న్యాయమూర్తులలో శ్రేష్ఠుఁడవు '' అని యాతఁ డనెను.

90. అవిశ్వాసులగు నా నాయకులు, "షుయైబును మీా రనుసరించినచో తప్పక నశింతు '' రనిరి.

కావున హఠాత్తుగా నొకభూకంపము కలుగఁగా నుదయమగుసరికి వారు మొగములపైఁ బడి తమయిండ్లలోనే మృతినొందియుండిరి.

షుయైబు కృత్రిముఁ డనినవారు తమయిండ్లలో నెన్నఁడును వసింపనట్లే మాయమైరి. షుయైబు కృత్రిముఁ డనినవారే నశించినవారు.

కావున నాతఁడు వారినుండి మఱలి "నాప్రజలారా! నాప్రభువు సందేశమును చాటితిని. మీాకు హితోపదేశము చేసితిని. కాని నమ్మని వారికై నే నెట్లు చింతిల్లఁగలను '' అనెను.

## అధ్యాయము 12.

నమ్రములగుదురను నుద్దేశముతో ప్రతిపురమునందలి ప్రజలకును కష్టమును దుఃఖమును ననుభవింపఁ జేసినపిదపఁగాని, వారి కే ప్రవక్తను బంపలేదు.

పిదప వారికీడును మేలుగ మార్చి, వారిధనమును వృద్ధిచేసి, వారితో "మనతండ్రుల కిట్లే పూర్వము కష్టములవెంబడి సౌఖ్య

ములు కలిగినవి" అంటిమి. కావుననే, వా రేమటియున్నప్పు డకస్మాత్తుగా వారిని బట్టికొంటిమి.

ఈపురమునందలి ప్రజలే మమ్ము నమ్మియుండినచో స్వర్గమ ర్త్య ములనుండి వారికి సకలసౌఖ్యములను చేకూర్చియుందుము. కాని, వారు మాసూచనల నసత్యములుగఁ బరిగణించుటచే వారు చేసినపనులకై వారిపైఁ బగదీర్చి కొంటిమి.

అయిన నాపురప్రజలు రాత్రిపూట మైమఱచి నిద్రించి యుండఁగా మాకోపమునకుఁ బాత్రులము కాముగదాయని భద్ర ముగ నున్నారా?

వారు పగటిపూఁట వినోదించుచుండఁగా మాకోపమునకుఁ బాత్రులము కామని భద్రముగ నున్నారా?

దేవునిపన్నాగమునుండి సురక్షితులుగా నుంటిమని వారను కొనిరేమో! నశించువారు తప్ప నితరులు దేవునిపన్నాగమునుండి సురక్షితులుగ నుంటి మనుకొనరు.

## అధ్యాయము 13.

100. ఈభూమిపై పూర్వము వసించినవారిపిదప వచ్చినవారిని మా కిష్టమైనచో వారిపాపములకొఱకుఁ జంపి వారు వినకుండినంతున వారిహృదయములకు ముద్రలు వైచెదమని ఋజువుచేయఁబడలేదా?

ఈపురములకథలను నీకు దెలిపెదము. వారిప్రవక్తలు స్పష్ట మగుసాక్ష్యముతో వారియొద్దకు వచ్చిరి. కాని, తాము పూర్వము కృత్రిమ మని తలంచినదాని నిప్పుడైనను నమ్మలేదు. ఇట్లే దేవుఁ డవిశ్వాసులహృదయములను కప్పివేయును.

వారిలో నొడంబడిక యేమాత్రమును ననుసరింపఁబడలేదు. వారిలోఁ జాలమంది యుత్పథగాము లైరి.

పిదప ఫిరౌనునొద్దకును, నతని సామంతులయొద్దకును, మూసా నంపితిమి. వారు వాని కన్యాయము చేసిరి. ఆయన్యాయవర్తనుల గతి యేమయ్యెనో చూడుము.

మూసా "ఫిరౌనా! నేను జగన్నాథునిపవిత్రవక్తను.

నేను దేవునిఁగూర్చి సత్యముఁ దప్ప మఱియొకటి మాట్లాడఁ గూడదు. నాసందేశముఁగూర్చి సాక్ష్యముతో నాప్రభువునుండి యిపుడు వచ్చియున్నాను. కావున ఇస్రాయేలుసంతతివారిని నాతో నిప్పుడు పంపివేయుము".

అనఁగా నాతఁడు "నీవు ఆనవాలుతో వచ్చితి ననుచున్నావు. సత్యవంతుఁడ వైనచో మాకు దానిని జూపుము" అనెను.

అంత నాతఁడు తనచేతికఱ్ఱను క్రిందఁ బడవేయఁగా నది యొకపా మయ్యెను.

పిదప తనచేతిని వారికిఁ జూపఁగా నది తెల్లఁగాఁ గనఁబడెను.

అధ్యాయము 14.

అప్పుడు ఫిరౌనుప్రజలు "ఈఁ డెవఁడో గొప్పమాయావిగా నున్నాఁడు.

110. ఒకవేళ మి మ్మాతఁ డీ దేశమునుండి తఱిమివేయునేమో, మ మ్మేమి చేయుమందువో యానతిమ్ము" అనిరి.

వారు ప్రజలతో "ఇతనిని ఇతనిసోదరునిఁ గొంతకాలము వేచి యుంచి, మీపురముల కంపి,

దేశమునను్న యైంద్రజాలికుల నందఱిని రావింపుఁడు" అనిరి.

ఆయైంద్రజాలికులును ఫిరౌనునొద్దకు వచ్చి "మేము గెలిచినచో మాకు బహుమాన మిత్తువా?" అని యడిగిరి.

"ఇంతియే కాదు. మిమ్ము, మాసన్నిధానవర్తులఁజేసెద" నని యాతఁడు వాగ్దానము చేసెను.

అంత వారు "మూసా! తొలుత నీకఱ్ఱను క్రింద వైచె దవా? మమ్ము వైవమందువా?" యన

ఆతఁడు "మీరే వైవుఁడు" అనెను. వారికఱ్ఱలు క్రిందఁబడఁ గనే చూచినవారి కన్నులు మోహావశములై భయాక్రాంతము లయ్యెను. వారు గొప్పయింద్రజాలమును జూపిరి.

అప్పుడు మేము మూసాతో "నీకఱ్ఱను క్రిందఁ బడవే యుము" అంటిమి. అట్లాతఁడు చేసినంతనే యది వారికృత్రిమాద్భుత చర్యలను మ్రింగివేసెను. కావున సత్యమునకు బలము కలిగి వారు చేసినది వృథ యయ్యెను. వారచ్చోటనే యపజయము నొంది, పరాభూతులై తొలఁగి పోయిరి.

120. కాని, కొందఱైంద్రజాలికులు వానికి సాష్టాంగపడి కీర్తిం చుచు, "మూసా హారూనులకు ప్రభువగు

జగన్నాథుని నమ్మితిమి" అనిరి.

అప్పుడు ఫిరౌను వారితో "మాయనుజ్ఞ లేనిదే వానిని నమ్మితిరా? ఇది ఈపురప్రజలను దఱిమివేయుటకై యిచటనే మీరు పన్నినపన్నాగము కాని, మఱియొకటి కాదు. కానిండు. మీ కేమి కాఁగలదో తుదకు తెలియఁగలదు.

నేను మీకాళ్లను చేతులను రెండుప్రక్కలను ఖండింపించెదను. పిదప మిమ్మందఱను సిలువనెక్కించెదను" అనెను.

వారు "మాప్రభువుసూచనలు మాకు రాఁగా వానిని నమ్మి నందుకుగదా నీవు పగతీర్చికొందువు? మేము

మాప్రభువునొద్దకే మఱలి పోయెదము. ప్రభువా! మాకు

స్థిరత్వముఁ బ్రసాదించి దృఢభక్తులుగ మృతినొందునట్లనుగ్రహింపు" మనిరి.

## అధ్యాయము 15.

అప్పుడు ఫిరౌను ప్రజలలోని నాయకులు "మూసాను, ఆతని ప్రజలను దేశములో వ్యాపింపఁజేసి యక్రమముల నేల పెరుగఁ జేసెదవు? వారిని, నీదేవతలను, నిన్నును నేల విడువఁజేసెదవు?" అనఁగా నాతఁడు "మేము వారిపురుషశిశువులఁ జంపించి స్త్రీశిశువులఁ బ్రమకనిచ్చెదము. మేము నిశ్చయముగా వారిపై నధికారుల మయ్యెద" మనెను.

మూసా తనప్రజలతో, "ఈభూమి దేవునిది. కావున దేవునికి మొఱలిడి యోర్పు గలిగియుండుఁడు. తన కిష్టులైనకింకరుల కాతఁ డీభూమి నిచ్చును. అతనికి భయపడువారికి సౌఖ్యసంతానములు కలుగును" అనెను.

వారు "నీవు వచ్చినపిదపను, రాకపూర్వమును, మేము బాధింపఁబడితి" మనఁగా నాతఁడు "బహుశః మీప్రభువు మీశత్రువును జంపి, మిమ్ము వారలకు వారసులఁ జేసి, మీ రెట్లు సంచరింతురో చూడఁగలఁడు" అనెను.

## అధ్యాయము 16.

130. ఫిరౌనుప్రజలు భయపడియుందు రనునుద్దేశముతో నప్పుడే వారికి క్షామమును కల్పించి, యేఫలములను దొఱకకుండఁ జేసితిమి.

వారికి మేలు గలిగినంతనే "ఇది మాకు రావలసినదే" యనిరి. కాని, వారికి కీడు కలుగఁగనే మూసాను, నాతనిప్రజలను వారు శకునపక్షులని నిందించిరి. కాని, వారిశకునము లన్నియు దేవుఁ

డంపినవేకదా ! అయినను వారిలోఁ జాలమంది కది దెలియలేదు.

వా రప్పుడు "మమ్ము మోహపెట్టుట కెన్నిసూచనలఁ గల్పించినను మేము నిన్ను నమ్మ" మనిరి.

అంత మేము వారిపై తుపానును, మిడుతలదండును, చీడపురుగులను, కప్పలను, రక్తమును బంపితిమి. ఇవి స్పష్టచిహ్నములే యైనను వారు గర్వముతో సంచరించి పాపులైరి.

వారి నేదైన మహామారి యంటినంతనే "మూసా ! నీప్రభువు నీతోఁ జేసినయొడంబడికప్రకార మాతనికి మాపక్షమునఁ బ్రార్థన సలుపుము. నీవు మహామారిని తొలఁగించినచో మేము నిన్ను నమ్మి యిస్రాయేలుసంతతిని నీతోఁ బంపివేయుదుము" అనిరి.

మేము నామహామారిని మరల్చినంతనే దేవుఁడు విధించి యుండినకాల మంతరింపఁగనే వారు తమమాటను తప్పిపోయిరి.

కావున, మేము వారిపై పగఁదీర్చికొని వారిని సముద్రములో ముంచి చంపితిమి. వారు మాసూచన లసత్యములని వానిని లక్ష్యపెట్టకుండుటచేతనే యిట్లు చేసితిమి.

ఈరీతిగా మేము దీనులనొనర్చినవారికి ప్రాక్పశ్చిమదేశముల నాశీర్వదించి ప్రసాదించితిమి. ఇస్రాయేలుసంతతివారు సహనపరులై యుండుటచే దేవుఁడు తనమాటను నిలిపికొనెను. మేమును ఫిరౌను యొక్కయు నాతనిప్రజలయు పనులను నిండ్లను నాశనమొనర్చితిమి.

అంత మే మిస్రాయేలుసంతతిని సముద్రము దాఁటింపఁగా వారు విగ్రహారాధనాపరులగు నొకజాతివారియొద్దకు వచ్చిరి. వారు "మూసా ! వారిదేవతలవంటి యొకదేవుని మాకును నిర్మింపు" మనఁగా నాతఁడు "మీ రజ్ఞానులరు.

వా రాచరించుపూజ నాశనమగును. వారు చేయునదంతయు వృథ యగును" అనెను,

140. అతఁడు "దేవుఁడు మి మ్మన్ని జాతులవారికంటె నధికులుగ నొనర్చియుండ నాతనిఁగాక వేఱొకదేవుని మీకు కల్పింపవలెనా ?" యనెను.

మేము మిమ్ము ఫిరౌను ప్రజలనుండి రక్షించునప్పుడు వారు మిమ్ము ఘోరముగ బాధించిరి. వారు మీపుత్రులఁ జంపి మీకుమార్తెలను బ్రతుకనిచ్చిరి. ఇందే మీప్రభువు మిమ్ము శోధించినాఁడు. దీనిని స్మరింపుఁడు

## అధ్యాయము 17.

మేము మూసాతో ముప్పదిరాత్రులు కలిసియుందుమని చెప్పి, మఱి పదిరాత్రులుకూడ నుంటిమి. ఇట్లాతఁడు తనప్రభువుతో నలువదిరాత్రు లుండెను అప్పుడు మూసా తనసోదరుఁడగు హారూనుతో "నీవు ప్రజలలో నా స్థానము నధిష్ఠింపుము. క్రమముగ వర్తింపుము. దుష్టులమార్గ మనుసరింపకుము" అనెను.

మూసాకూడ, మేమునిర్ణయించినకాలమున రాఁగా నతని ప్రభు వాతనితో మాట్లాడుచు "నీవు నన్నుఁ జూడఁజాలవు. కాని, యాపర్వతమువంకఁ జూడుము. అదిస్థిరముగ నిలిచియుండినచో నీవు నన్నుఁ జూడఁగలవు" అనెను. దేవుఁడును పర్వతములో నావేశించినంతనే యది ధూళి యయ్యెను. మూసాయు మూర్ఛావశుఁడయ్యెను. అతనికి తెలివి వచ్చినంతనే "నీవు స్తవనీయుఁడ వగుదువుగాక ! పశ్చాత్తప్తుఁడనై నీవంకకే తిరిగెదను. నమ్మినవారిలో నేనే ప్రథముఁడ" నని యాతఁ డనెను.

అంత నాతఁడును, "మూసా ! ప్రజలందఱిలోను నీతో స్వయముగ మాట్లాడి నిన్నే నాయాజ్ఞాహరునిఁగ నెంచికొంటి. కావున నీకు నేను తెచ్చినదానిని స్వీకరించి కృతజ్ఞుండవు కమ్ము" అనెను.

అంతట మేము పలకలపై నన్నివిషయములఁగూర్చియు విధులను వ్రాసియుంచఁగా నాతఁడు "నీవు వీనిని స్థైర్యముతోఁ జేకొనుము. వానియందలి యుపదేశములను సరిగఁ బరిపాలింపుఁ డని నీప్రజల కాజ్ఞ యిడుము—మీకు దుష్టులయావాసముఁ జూపెదను" అనెను.

భూమిపై నన్యాయముగ గర్వించియుండువారిని మాసూచనలనుండి తొలఁగించెదము. వారు మాసూచనల నన్నిటినిఁజూచినను వారు వానిని విశ్వసింపరు. వారు పుణ్యమార్గమును గనుఁగొనినను దానిననుసరింపరు. తప్పుత్రోవం జూచి, దానినే పట్టెదరు. మాసూచనలసత్యములుగ నెంచి వానిని పాటింపకుండుటచేతనే యిట్లగును.

మాసూచనలను, పరలోకమున నందఱును గలియుటయు నసత్యము లని వారు తలంచుటచే వారి కార్యములన్నియు వృథయగును. వారికర్మల కనుగుణముగఁ గాక మఱియొకరీతి ఫలము వారికిఁ గలుగునా ?

## అధ్యాయము 18.

అంత మూసాప్రజలు తమయాభరణములతో స్వర్ణవికారమగు దూడను నఱచుచున్నదానిని చేసిరి. అది తమతో మాట్లాడఁ జాలకుండె ననియుఁ దమకు మార్గము జూపఁజాలకుండె ననియు వారు కనుఁగొనలేదా ? అయినను వారు దానిని దేవునిఁగఁ బరిగ్రహించి దోషులైరి.

కాని వారు పశ్చాత్తాపపడి, తమతప్పును గ్రహించి 'మాప్రభువు మమ్ము కనికరించి క్షమింపకున్నచో మేము నాశనము నొందకతీర' దనిరి.

150. అంత మూసా కోపక్రోధములకు వశుఁడై వారియొద్దకు వచ్చి "నేను వెడలినతోడనే మీరు దుష్కార్యము నొనర్చితిరి.

మీ ప్రభువుతీర్పునకై తొందరపడుచున్నారా ?" అని పలకలను క్రిందఁబడవైచి తనసోదరునితల పట్టి తనవంకకు లాగి, "సోదరా! ప్రజలు నన్ను బలహీనునిగ నెంచి చంపఁ బ్రయత్నించిరి. నాశత్రువులు నన్నుఁ జూచి సంతోషింపఁ జేయకుము. నన్ను దోషులలోఁ జేర్పకుము.

"ప్రభువా! నన్నును నాసోదరుని క్షమియించి, నీకరుణకుఁ బాత్రులఁ జేయుము. కరుణాకరులలో నీవు శ్రేష్ఠుఁడవు" అనెను.

## అధ్యాయము 19.

దూడను దేవుఁడని నమ్మినవారిని ప్రభునిక్రోధము వెంబడించునుగదా. వారి కిహలోకజీవనము లజ్జాకర మగునుగదా. అసత్యములఁ గల్పించువారి కిట్లే బహుమాన మిచ్చెదము.

కాని, తొలుత దోషులైనను, పిదప పరితాపమునొంది విశ్వసించినవారిని నీప్రభువు క్షమించి కరుణించును.

అంత మూసాకోపము చల్లారఁగనే యాతఁడు పలకల నెత్తికొనెను. దైవభీతిపరులకు వానిపై వ్రాయఁబడినవ్రాఁతయే రక్షణోపాయమును, దయాసంపాదకమును నగును.

పిదప మే మేర్పఱచినయొకసభకు మూసా డెబ్బదిమంది నెంచికొనెను. వారిని భూకంపము వెంబడింపఁగా నాతఁడు "ప్రభో! నీ కిష్టమైనచో వారిని నన్నును గూడ నిదివఱకే చంపియుందువు. మాలో మూర్ఖు లొనరించినదానికి మమ్ముఁ జంపెదవా ? ఇది నీశోధనగాని, మఱియొకటి గాదు. దానిమూలమున నీయిచ్చవచ్చినవారిని త్రోవఁ దప్పించి, యిచ్చవచ్చినవారికి సరిగ మార్గముఁ జూపుదువు. నీవు మాసంరక్షకుఁడవు! కావున మమ్ము కరుణించి క్షమింపుము. క్షమించువారిలో నీ వుత్తముఁడవు.

మేము నిన్నే యాశ్రయించుకొని యున్నాము. ఇహలోకము నందును, బరలోకమునందును, నుత్తమమార్గ మేదో మాకొఱకు వ్రాసియుంచు మనెను. అతఁడు నేను నాయిష్టమువచ్చినవారిని శిక్షింతును. నాకరుణ యంతటను నిండి యున్నది. నాకు భయపడి, భిక్షము నొసగుచు, నాసూచనలను నమ్మి, ధర్మగ్రంథమునందును, సువార్త యందును వానిలో వ్రాయఁబడి యుండియు,

చదువురానిమాప్రవక్త ననుసరించువారికొఱకు దానిని వ్రాసి యుంచెదను. అతఁడు వారికి సరియైనదానిని విధించి, కానివానిని నిషేధించి, భక్ష్యభోజ్యములఁ దినుమనియు, నపవిత్రవస్తువుల ముట్ట వల దనియుఁజెప్పి, వారిభారములను దింపి, వారిమెడలపైనున్న కాడులను దీసివేయును. అతనిని నమ్మి, యతనికి బల మొసగి, సహాయపడి యతనితోఁ బంపఁబడినజ్యోతి ననుసరించినవారికే శ్రేయస్సు కలుగును.

## అధ్యాయము 20.

వారితో “ జనులారా! స్వర్గమర్త్యముల కధిపతియగు దేవుని దూతను సుఁడీ నేను. మీయొద్దకు వచ్చియున్నాను! అతఁడు తప్ప మఱియొకదేవుఁడు లేఁడు. జీవింపఁజేయువాఁడును చంపువాఁడను నతఁడే! కావున దేవునియందును, నాతనిప్రవక్తయందును నమ్మకము గలిగియుండుఁడు. ఆప్రవక్త చదువురానివాఁడైనను దేవుని, నాతనిమాటను నమ్మియున్నాఁడు. మీకు సరియగురక్షణ దొఱకుటకొఱ కాతని ననుసరింపుఁడు.

మూసాప్రజలలో నితరులను సత్యమార్గమున నడపువారును, దానిప్రకారము సరిగ సంచరించుకొనువారును గొంద ఱున్నారు.

160. మే మిస్రాయేలులను బండ్రెండుజాతులవారిఁగా విభజించి

తిమి. వారు దాహమగుచున్నదని పల్కఁగా మేము మూసాతో "త్రాతిని నీకఱ్ఱతో తాఁకు" మని యంటిమి. అతఁ డట్లు చేయఁగా దానినుండి పండ్రెండుఊటలు బయలుదేఱఁగా నాయాజాతులవారు తమతమయూటలను గనుగొనిరి. అంత మేము వారిని మేఘముల నీడక్రింద నుండఁజేసి యమృతమును వడగండ్లను పంపితిమి. "మేము మీకు పంపిన మంచివస్తువులను దినుఁడు" కాని, వారు మా కేహా నియుఁ జేయలేదు. తమకుఁ దామే హాని చేసికొనిరి.

వారితో "ఈపురమున వసించి, యందు మీయిచ్ఛవచ్చిన దానిని భుజించి, క్షమాపణ వేఁడి, సాష్టాంగపడుచు ద్వారముఁ జొరుఁడు. అప్పుడు మేము మీతప్పులను క్షమించి సత్కార్యపరు లకు వృద్ధి నొసగెదము" అని చెప్పఁగా,

వారిలో దైవభీతి లేనివారు చెప్పఁబడినదానిని వేఱుగఁ ద్రిప్పి వేసిరి. కావుననే వారిదుష్కార్యములకు మేము స్వర్గమునుండి మాకోపమును బంపితిమి.

## అధ్యాయము 21.

సముద్రముప్రక్కనుండిన నగరమునుగూర్చి వారి నడుగుము. ఆపురవాసులు సాబతుదినము నుల్లంఘించిరి. వారా సాబత్తుదినమును పాలించినప్పు డందలిచేపలు స్పష్టముగావారికిఁ గనఁబడెను. కాని, యట్లు పరిపాలింపనప్పు డవి యదృశ్యములయ్యెను. వారు దుర్మా ర్గులు కావుననే వారి నట్లు శోధించితిమి.

దేవునిచే నాశనముచేయఁబడువారిని, ఘోరశిక్ష ననుభవింప వలసియున్నవారిని, నేల భయపెట్టెద వని వా రడిగినప్పుడు "దేవు నికి సమాధానము చెప్పుటకును, వా రతనికి భయపడుటకును" నని వారు బదులు చెప్పిరి.

వా రాభయసూచనలను మఱచిపోఁగా, దౌర్జన్యమును నిషేధించినవారిని మేము విడుదల చేసి, దుష్టులై యకార్యముల నాచరించినవారికి ఘోరశిక్ష విధించితిమి.

నిషేధింపఁబడినదాని నింకను గర్వముతోఁ జేయుచున్నవారితో "తరుమఁబడి యసహ్యముగఁ జూడఁబడు కోఁతులరుకం" డని యంటిమి.

అంత నీప్రభు వాయూళ్లపై కీడు తెచ్చువారిని శిక్షించుటకు, రక్షణదినమునఁ గొందఱిని బంపెదమని చెప్పెను. నీప్రభువు శిక్షించుటకు వెనుదీయఁడు. అతఁడు క్షమాయుతుఁడు. కరుణాళుఁడు.

మేము వారిని జాతులుగా విడఁదీసితిమి. అందు గొందఱు న్యాయవంతులుఁ గొంద ఱన్యాయవంతులు నైరి. వారు మమ్ము చేరుదురను నుద్దేశముతో వారికి మంచివస్తువుల నిచ్చియు చెడువస్తువుల నిచ్చియు శోధించితిమి.

వారిపిదప మఱికొంద ఱీభూమిపై వారిస్థానమున వచ్చిరి. వారికి "గ్రంథము" లభించెను. వా రిహలోకసౌఖ్యములఁ బొంది "మేము క్షమింపఁబడుదు" మని యందురు. అయినను వారికి తిరిగి యట్టిమంచివస్తువులు లభించినచో వానిని గ్రహింప వెనుదీయరు. కాని, సత్యముదప్ప మఱియొకటి చెప్పఁగూడదను నొడంబడిక సత్యగ్రంథముద్వారా వారికి తెలిసియే యున్నదిగదా! అయినను దానిని వా రింకను జదువుకొనుచుందురు. కాని, దైవభీతిగలవారలకు పరలోకవాస మెక్కుడులాభము కలది. ఇంకను మీకు బోధపడ లేదా ?

170. సత్యగ్రంథము ననుసరించి ప్రార్థనల నలుపుపుణ్యాత్ముల బహుమానమును మేము పోఁగొట్టము.

మే మాకొండ నొకనీడవలెఁ గదలింపఁగా వా రది తమపైఁ బడునేమో యని భయపడిరి. "మీరు భయపడియుండుటకై మేము తెచ్చినదానిని స్థిరచిత్తముతోఁ బరిగ్రహించి దానిలో నున్నదానిని జ్ఞాపక ముంచికొనుఁడు" అంటిమి.

## అధ్యాయము 22.

నీప్రభువు వారిసంతతివారిని ఆదాముపుత్త్రులయధికారము నుండి తప్పించి, తమపైఁ దామే సాక్షులుగనుండఁ జేయుచు, "నేను మీప్రభువును గానా" యని యడుగఁగా, వారు "అవును. మేము చూచుచున్నాము" అనిరి. రక్షణదినమున మీరు "దీనిని మా కెవ్వరును జెప్పియుండలేదు. కావుననే యశ్రద్ధ వహించితిమి" అని మీ రనకుండ మే మిట్లు చేసితిమి.

లేదా, మీరు "మాతండ్రులు దేవునితో నితరదేవతలఁ గూర్చి యుండిరి. మేము వారిసంతతివారము. మేము గర్వితుల మని మమ్ము నాశనము చేయుదువా ?" అని యందురేమో ?

మీరు దేవునియొద్దకు మఱలివత్తురుగదా యని మేము మాసూచనల నిట్లు స్పష్టీకరించుచుందుము.

మే మొకనికి మాసూచనలఁ దెల్పఁగా నాతఁడు వానిని లక్ష్యింపక సైతాను ననుసరించి దుష్టుఁ డయ్యెను. అతనిచరితమును వారికిఁ దెలుపుము.

మా కిష్టమైనచో దానివలన నాతని మహోన్నతపదవికిఁ దెచ్చియుందుము. కాని, యాతఁడు భూమిపై దేవులాడుచుఁ దన కామేచ్ఛలకే వశుఁ డయ్యెను. కుక్కను వెంటఁబెట్టినను, బెట్టకున్నను నాలుక వెళ్ళఁబెట్టును గదా, ఈతఁడు నట్టివాఁడే. మాసూచన లన

త్యములనువారందఱికి నిదియే యుపమానము. వా రాలోచించికొను టకు వారి కీకథను దెలుపుము.

మాసూచన లసత్యము లనువారు దౌష్ట్యస్వరూపులు. వారు తమకుఁ దామే హాని చేసికొందురు.

దేవునిచే మార్గము చూపఁబడినవాఁడే రక్షణ నొందినవాఁడు. త్రోవ తప్పించినచో నతఁడు నష్టుఁ డగును.

భూతములందును, మనుష్యులందును, మేము చాలమందిని నరకముకొఱకు సృష్టించితిమి. వారికి హృదయము లున్నవికాని, బోధ లేదు. కం ళ్లున్నవికాని చూడలేరు. చెవు లున్నవికాని, వినలేరు. వారు పశుప్రాయులు; మఱింత తప్పుత్రోవఁ బట్టుచుందురు; లక్ష్యపెట్టరు.

180. దేవుని కత్యుత్తమబిరుదము లున్నవి. ఆతని నాబిరుదము లతో సంబోధించి, వారి నాక్షేపించువారినుండి దూరముగఁ దొలఁగి పొమ్ము. వారు చేసినదానికి వారే ఫలము ననుభవింతురు.

మేము సృజించినజనులలోఁ గొంద ఱితరులను సత్యమార్గము నకుఁ ద్రిప్పి తాము న్యాయముగ వర్తించుచుందురు.

అధ్యాయము 23.

కాని, మాసూచన లసత్యములనువారిని, వారికిఁ దెలియ కుండ నంతకంతకు నధోగతిపాలు చేసెదము.

వారి యాయుష్కాలము పెరుగుచున్నను, నాపన్నాగము షాఱకమానదు.

వారిస్నేహితుఁడగు ముహమ్మదు పిశాచగ్రస్తుఁ డయ్యెనని కదా వారు తలంతురు. కాని, స్పష్టముగ · భయసూచన దెల్పు టయే యాతనివిధికృత్యము,

స్వర్గమర్త్యాదిరాజ్యములును దేవుఁడు సృజించినసర్వవస్తువు లును నంతరించు ననికదా వారు చూచుచుందురు! కురాను నుపే క్షించినవారు మఱియేగ్రంథమును విశ్వసింపఁగలరు ?

దేవుఁడు త్రోవఁదప్పించినవారి నెవ్వరును రక్షింపఁజాలరు! వారి నాతఁడు భూమిపై సంభ్రమింపఁజేసి వ్యాకులపెట్టును.

ఆగంట యెప్పుడువచ్చునదిగా విధింపఁబడిన దని వారు ని న్నడుగుదురు. "అది నాప్రభువునకే తెలియును. అతఁడుతప్ప మఱె వ్వరును దానిఁగూర్చి సకాలమునఁ జెప్పఁజాలరు. అది స్వర్గమర్త్యములపై పెద్దభారముగ నున్నది. అది యకస్మాత్తుగ తప్ప మఱియొకరీతిగ రాఁబోదు" అనుము. నీకును నాసంగతి తెలిసియున్నట్లు వారు మాటాడుదురు. "అది దేవునికిఁదప్ప నొరులకుఁ దెలియదు. కాని, చాలమంది దీనినిగూర్చి తెలియనివారై యున్నారు" అనుము.

నాకు మేలు కలుగఁజేయుదానిపైఁగాని కీడుగల్గించుదానిపైఁ గాని యేయధికారమును లేదు. అది యంతయు దైవేచ్ఛయే. అతనిరహస్యములు నాకే తెలిసియుండినచో మంచికార్యములనే చేసి దుష్కార్యముల నంటియుండకుందును. కాని, యితరులకు భయ సూచన నిచ్చి, విశ్వాసులకు సువార్తను దెలుపుటయే నావిధి యైయున్నది" అనుము.

## అధ్యాయము 24.

అతఁడు మి మ్మొక్కపురుషునినుండియే సృజించినాఁడు. అత నితో నివసించుట కాతనినుండియే యొకభార్యను పుట్టించినాఁడు. అతఁ డామెను గుర్తించినంతనే యామె స్వల్పభారమును వహించి యిటు నటుఁ దిరుగులాడెను. భారము హెచ్చైనంతనే వా రిరువు రును "మాకు కళంకరహితుఁడగు శిశువు నొసగినచో మేము కృత

ఞ్జులమైయుండు" మని వారిప్రభువగు దేవునితో పోటిపెట్టుకొనిరి.

190. కాని, దేవుఁడు వారికి కళంకహీనుఁడగుశిశువు ననుగ్రహించి నంతనే వారు తమ కాతఁడు కల్పించినమేలునకు బదులుగా నాత నితో సమానులని యితరదైవములఁ గల్పించిరి. కాని, వా రాత నితో సమానులుగాఁ గల్పించినవారికంటె దేవుఁ డున్నతుఁడు!

ఆదేవతలు తా మెద్దానిని సృజింపఁజాలరు. తామే సృజింపఁ బడియున్నారు.

వారు తమ్ము రక్షించుకొనలేరు; ఇతరులను రక్షింపఁజాలరు. ఏమి ? యిట్టివారినా దేవునితో సమానులుగఁ జేర్చుట ?

మీరు వారిని 'రక్షణమార్గమునకుఁ' బిలిచిన, వారు మి మ్మనుసరింపరు. మీరు వారిని బిలిచినను, నూరకున్నను,వారి కొక్కటే.

నిశ్చయముగా దేవునితో సమానులని మీరు చెప్పువారు మీవలె నాతని సేవకులే! నీవు వారినిఁగూర్చి పలుకునది సత్యమైనచో వారిని బిలువుము; బదులు పల్కెదరేమో చూతము.

వారికి నడచుటకు పాదము లున్నవా ? గ్రహించుటకు చేతు లున్నవా ? చూచుటకు కన్నులున్నవా ? వినుటకు చెవులున్నవా ? "ఈ మీదేవతలను బిలువుఁడు. మీరు నాపైఁ బన్నినపన్నాగము నాలసింపక పన్నుఁడు" అనుము.

దివ్యగ్రంథమును బంపినవాఁడు నాప్రభువగు దేవుఁడు కదా ! ఆతఁడే పుణ్యవంతులకు రక్షకుఁడు.

అతనిఁగాక మీరు యాచించునితరదేవతలు మిమ్ముఁగాని, తమ్ముఁగాని రక్షించుకొనఁ జాలరు.

మీరు వారిని "రక్షణమార్గము" నకుఁ బిలిచినచో వినరు. వారు నీవైపు చూచుచున్నట్లే కనఁబడును గాని, వారికి దృష్టి లేదు!

ఉత్తమకార్యముల నాచరింపుము ; క్రమమైనదానిని విధింపుము. అజ్ఞానులనుండి తొలఁగి యుండుము.

200. సైతాను నిన్ను దుష్కార్యములకుఁ బ్రేరేపించినచో దేవుని శరణు వేఁడుము. అతఁడు శ్రోత, జ్ఞాని !

సైతానుమాయ తమ్మాక్రమించుకొనినప్పుడు దేవునికి భయపడి యాతని స్మరించిన వారిదృష్టి నిర్మలముగ నుండును.

వారిసోదరు లింకను వారిని తప్పుదారిలోనే యుంచి, తాము దానినుండి తప్పించుకొనలేరు.

నీవు వారికి కురా ననుసూచన నొకదానిని తేకయున్నచో "ఏమి ! యింకను దానిని సృష్టింపలేదా '' యని నిన్నడుగుదురు. వారితో "నేను నాప్రభువు పల్కినదానినే పల్కుచుందును. ఇది మీప్రభు వొసగినస్పష్టసాక్ష్యము. విశ్వాసుల కిది రక్షణోపాయము. దయాసంపాదకము.

కురాను పఠింపఁబడుచున్నప్పుడు, కరుణను బడయుటకు వినుచు నిశ్శబ్దముగ నుండుము.

సాయంప్రాతలయందు నమ్రతతోడను, భయముతోడను ఉచ్చైస్స్వనముతోఁగాక, మెల్లగ నీలో నీవే దేవుని ధ్యానింపుము. అశ్రద్ధాపరులలోఁ జేరకుము.

నీప్రభువుచుట్టు నుండువా రాతనిసేవ నుపేక్షింపరు. వా రాతని స్తుతించి యతనిమ్రోల సాష్టాంగపడుదురు.

---

# సురా 8 యుద్ధములో చేకూరినధనము.

### మదీనా—75 పద్యములు—10 రుకూలు.

### అధ్యాయము 1.

---

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

యుద్ధములో చేకూరినధనముఁ గూర్చి వారు నిన్నుఁ బ్రశ్నింతురు. వారితో, "అట్లుచేకూరినది దేవునిది, ప్రవక్తది. కావున దేవునికి భయపడి, దీనిని మీలో మీరె సరిచేసికొనుఁడు. మీరు విశ్వాసులైనచో దేవుని, నాతనిప్రవక్తను మన్నింపుఁడు.

దేవునినామ ముచ్చరింపఁబడఁగనే తమహృదయములు భయముచేఁ గంపించుచుండ, అతనిసూచనలు పఠింపఁబడుచుండఁగాఁ దమ భక్తి హెచ్చగుచు ప్రభువునందే విశ్వాసము స్థిరపఱచికొని,

ప్రార్థనలు సలుపుచు, మేము తమ కొసగినదానినుండి భిక్షము నిచ్చుచు,

ఉండువారే విశ్వాసులు. తమప్రభువునెదుట వారికిఁ దగిన యంతరువుచొప్పున స్థానమును, క్షమయు, దయాపూరితమగు నాహారమును సిద్ధముగ నున్నవి.

నిన్నొకసత్యసందేశముతో నీప్రభువు పంపుటయు, విశ్వాసులలోఁ గొందఱు దానికి విముఖులై యుండుటయు, జ్ఞాపక ముంచికొనుము.

తాము మృత్యువుముందఱకుఁ దీసికొనిపోఁబడి దానిని తమ యెదుటఁ జూచుచున్నట్లే మిక్కిలియు స్పష్టముచేయఁబడినసత్యమును గూర్చి వారు నీతో వాదములు చేసిరి.

రెండుసైన్యములలో నొకటి మీయధీన మగునని దేవుఁడు వాగ్దానము చేయుటయు, ఆయుధములు లేనివారు మీచేతఁ జిక్కవలె నని మీరు కోరుటయు మీరు జ్ఞాపక ముంచికొనుఁడు.

కాని, దేవుఁడు తనమాటలే సత్యము లని ఋజువుచేయుటకును, అవిశ్వాసులలోఁ జాలమందిని చంపివేయుటకును తలంచెను.

మీరు మీప్రభువుసహాయమును వేఁడఁగా నాతఁడు "వరుసలుతీరిన వేయిమందిదేవతలతో నీకు సహాయమయ్యెద" నని బదులుచెప్పి, తనసత్యమే సత్య మని ఋజువుచేయుటకును, భక్తిహీనుల కిష్టము లేకున్నను విగ్రహారాధన నడుగంటించుటకును నిశ్చయించెను.

10. సహాయము దేవునినుండియే రాఁగలదు. అతఁడు శక్తిమంతుఁడు, బుద్ధుఁడును గదా! మీహృదయములకు నిబ్బరము గలిగించుటకు సువార్తగా నాతఁడు తనవాగ్దానము నంపెను.

## అధ్యాయము 2.

అతని రక్షణసూచకమగునిద్ర మి మ్మావరించినప్పుడు, మిమ్ముఁ బవిత్రవంతులఁ జేసి, సైతాను అంటుదోషమును బాపుటకు స్వర్గమునుండి మీపై జలమును వర్షించుటయును, మీహృదయములకు బల మొసగి, వానిమార్గముననే నడువఁజేయు నెంచుటయును,

నీప్రభువు దేవతలతో "నేను మీతో నుందును. విశ్వాసము నుండి మఱలకుఁడు. అవిశ్వాసులహృదయములందు భయము నింపెదము" అనుటయు జ్ఞాపకముంచికొనుము. కావున వారితలలను వ్రేళ్ళకొనలను నఱికివేయుము.

దేవుని, నాతనిప్రవక్తను వా రెదిరించుటచేతనే యిట్లు కావలెను. దేవుని, నాతనిప్రవక్తను నెదిరించువాఁడు.........నిశ్చయముగా దేవుఁడు ఘోరశిక్షను విధించును.

"ఇదిగో! ఇది నీకే! కావున దానిని రుచి చూడుము. అవిశ్వాసుల కగ్నిబాధ కలుగనున్నది."

విశ్వాసులారా! యవిశ్వాసుల సైన్యములు వరుసలుతీరి మి మ్మెదుర్కొనునప్పుడు వారికి వె న్నీయకుఁడు.

ఆదినమున యుద్ధము సేయుట కేపక్కకుఁ దొలఁగువాఁడుగాని, మఱియొక సైన్యముతోఁ గలిసి పోరాడుటకుఁ దప్ప మఱియొక రీతిగా వెనుకకుఁ దిరిగినవాఁడు దేవునికోపమునకుఁ బాత్రుఁ డగును. నరకమే యతనికి వాసస్థాన మగును. అచటికేఁ బ్రయాణము దుఃఖ సహితమై యుండును!

వారిని జంపినవాఁడు దేవుఁడుగాని, మీరు కారు. ఆబాణ ములు దేవునివి కాని, నీవి కావు. దేవుఁడు శ్రోత, జ్ఞాని. అతఁడు విశ్వాసులను దయాపూర్వకముగా శోధించును.

అవిశ్వాసులపన్నాగములను దేవుఁడు సాఁగనీయకుండుటకే యిది సంభవించినది.

ఓమక్కావాసులారా! మీకు తీర్పు కావలసినచో నిదిగో తీర్పు. మీరు పోరాటము మానినచో శ్రేయస్సు కలుగును. మీరు తిరిగి యారంభించినచో మేము నారంభించెదము. దేవుఁడు విశ్వా సులపక్షమున నుండుటచే మీకు సైన్యము లెన్నియున్నను లాభము లేదు.

## అధ్యాయము 3.

20. ఓవిశ్వాసులారా! ఇపుడు సత్యమును వింటిరికావున దేవుని, నాతనిప్రవక్తను మన్నించి, యతనినుండి మఱలకుఁడు.

వినకయున్నను 'వినఁబడినది' అనువారివలె నుండకుఁడు.

బోధపఱచుకొనని చెవిటివారును, మూఁగవారును, తుచ్ఛ మృగములవంటివారు.

వా రేపాటిమంచివా రని దేవునికిఁ దెలిసినను, దేవుఁడు వారిని తప్పక వినఁజేసియుండును. అట్లు వినఁజేసినను వారు తప్పక వెనుదిరిగి దూరముగఁ దొలఁగి పోయియుందురు.

విశ్వాసులారా! మీకు జీవనము నొసఁగుటకై పిలుచు నప్పుడు దేవునకును, నాతనిప్రవక్తకును, బదులు చెప్పుఁడు. దేవుఁడు మనుష్యునకును, నతనిహృదయమునకును, మాధ్యస్థ్యము వహించును. మీ రాతనియొద్ద కే చేర్పఁబడుదురు.

మీరు మోహావశులరు కాఁబోకుఁడు. మీలో నొక్కఁడుష్ట వర్తనులకే యది కలుగదు. దేవుఁడు చాల కఠినశిక్షను విధించునని తెలిసికొనుఁడు.

మీరు స్వల్పసంఖ్యాకులై దేశములో బలహీనులుగ నుంటిరి. మనుష్యులు మిమ్ము పెకలింతురేమో యని మీరు భయపడితిరి. అప్పు డాతఁడు మిమ్ము చేకొని, మీకు బలము నిచ్చి, సహాయపడి, మంచివస్తువుల నిచ్చి, మీరు కృతజ్ఞులరుగా నుందురని తలంచెను. దీనిని స్మరింపుఁడు.

విశ్వాసులారా! దేవుని, నాతనిప్రవక్తను మోసగింపఁ జూడకుఁడు. మీపనులయందును, మీజ్ఞానమునందును, కాపట్యమును వహింపకుఁడు.

మీధనమును, మీపుత్త్రులును మిమ్ము మోహపెట్టుచున్నా రని తెలిసికొనుఁడు. దేవుఁడే మీకు గొప్పబహుమాన మీయఁ గలవాఁడు.

## అధ్యాయము 4.

విశ్వాసులారా! మీరు దేవునికి భయపడినచో మి మ్మాతఁడు విడుదలచేసి, మీపాపములఁ బాపి, మిమ్ము క్షమించును. దేవుఁడు దయానిధి!

30. అవిశ్వాసులు నీపై కుట్ర పన్ని, నిన్ను కారాగృహమున నుంచుటకును, లేదా చంపుటకును, లేదా నిన్ను దేశమునుండి వెడలఁ గొట్టుటకును, దలంచిరి. దీనిని జ్ఞాపకముంచికొనుము. వారు కుట్ర పన్నిన దేవుఁడును బన్నెను. పన్నాగములఁ బన్నువారిలో దేవుఁడు గొప్పవాఁడు!

మే మెన్నిసారులు సూచనలను వారికిఁ దెలిపినను వారు, 'ఇపుడు మాకు వినఁబడినది. మా కిష్టమైనచో మేమును నట్టి మాట నాడియుందుము. తప్ప క యది తాతలనాఁటిపాతమాట.

దేవా! ఇది నీవు వచించుసత్యమే యైనచో, స్వర్గమునుండి మాపై ఱాలవర్షముఁ గురిపింపుము. లేదా, మా కేదైన ఘోరశిక్ష విధింపుము" అనిరి.

కాని, నీవు వారితో నున్నంతకాలమును వారిని దేవుఁడు శిక్షింపఁ దలంపలేదు. వారు క్షమాపణ వేఁడికొనినను, వారిని దండింప నెంచలేదు.

వారికి పవిత్రదేవాలయముపై నధికారము లేకున్నను, వారు విశ్వాసుల నచటికి చేరనీయనందుకు వారినుండి దేవునిశిక్ష నేది యుఁ దప్పింపలేరు. దైవభీతిగలవారికే యాదేవాలయముపై నధికారము గలదు. కాని వారిలో చాలమంది కది తెలియదు.

వా రాదేవాలయమునొద్దఁ జేరి యీలలను, చప్పటులనుఁ గొట్టుటతప్ప ప్రార్థనలు సలుపరు. "అయిన మీ రవిశ్వాసు లైనందులకు శిక్షను రుచి చూడుఁడు."

మనుష్యులను దైవపథమునుండి తప్పించుట కవిశ్వాసులు ధనమును వ్యయపఱుచుదురు. వారట్లే చేయనిమ్ము. పిదపఁ గాని, నిట్టూర్పులును, నపజయమును గలుగవు. అవిశ్వాసు లందఱును నరకములోఁ జేర్పఁబడుదురు.

అప్పుడు దేవుఁడు చెడ్డవారినుండి మంచివారిని విడఁదీసి, చెడ్డ వారిలోఁ గలహములఁ బుట్టించి, వారి నందఱను కలిపి నరకములోఁ గూలఁద్రోయును! వీరే నష్టులగువారు.

అధ్యాయము 5.

అవిశ్వాసులతోఁ, "వారు తమయవిశ్వాసమును వీడినచోఁ, జరిగినది క్షమింపఁబడును. కాని, వా రందే యుండినచోఁ బూర్వులు పొందినగతినే పొందుదురు!

కావున పోరాటము మానువఱకును, దేవునిమతమే సర్వత్ర నెలకొనువఱకును యుద్ధము చేయుము. వారు మానికొనినచో వారు చేయుదానిని దేవుఁడు చూచుచునే యుండును.

40. కాని వారు వెనుజూపినచోఁ, వారికి దేవుఁడే సహాయకుఁ డని తెలిసికొనుము. అతఁడు మంచిసహాయకుఁడు!

---

# కాండము. 10

మీ రెన్నఁడైన కొల్లగొనినచో నం దైదవభాగము దేవునికిని, ప్రవక్తకును, దగ్గఱిచుట్టములకును, ననాథశిశువులకును, బీదలకును, మార్గస్థులకును, బంచిపెట్టుఁడు. మీరు దేవునియందును, సైన్యములు కలిసిననాఁడు మాకింకరులకు మేము జయమునొసగుటయందును, మీకు నమ్మిక మున్నచో మీ రట్లు చేయుదురు. దేవుని కన్నివస్తువులపైనను శక్తి గలదు.

మీరు లోయదరిని, వా రావలిప్రక్కను, బిడారు మీకు

క్రిందుగా నున్నప్పుడు మీరు యుద్ధమునకుఁ గడంగియున్నచో తప్పక కొట్లాడియుందురు. అయినను దేవుఁడు తా ననుశాసించినదానిని నెఱ వేర్చికొనుటకును, నశింపవలసినవాఁడు స్పష్టచిహ్నమును జూచియు నశించుటకును, ఆచిహ్నమునే చూచి జీవింపవలసినవాఁడు జీవించుట కును, మీరు యుద్ధమునకుఁ బ్రేరేపింపఁబడితిరి. దేవుఁడు వినుచుఁ దెలిసి కొనుచునే యున్నాఁడు కదా!

దేవుఁడు వారిని స్వల్పసంఖ్యాకులుగ, కలలో మీకుఁ జూపి యుండుటను జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు. వారు చాలమందినిగా మీకాతఁడు గనఁబఱచినచో మీరు హృదయదౌర్బల్యము నొంది యావిషయమై వివాదముఁ జేసియుందురు. కాని, దేవుఁ డట్టిదానినుండి మిమ్ము తప్పించెను. హృదయమర్మము లన్నియు దేవుని కెఱుక.

మీరు యుద్ధమునఁ గలిసికొనినప్పుడును, కావలసినదానిని చేయుటకు వారిని మీకు స్వల్పసంఖ్యాకులుగను, తేజోగహీతులు గను, గనఁబడఁజేయుటను స్మరింపుఁడు. అన్నివస్తువులును తుదకు దేవునియొద్దకే చేరును.

## అధ్యాయము 6.

విశ్వాసులారా! మీరు సైన్యము నెదుర్చునప్పుడు, స్థిరముగ నిలిచి మీ శ్రేయస్సుకొఱకే దేవునినామమును సదా స్మరింపుఁడు.

దేవుని, నాతనిప్రవక్తను మన్నింపుఁడు. మీరు ధైర్యమెడలి యపజయము నొందకుండుటకు తగవులాడకుఁడు. స్థిరులై యోర్చిన వారితో దేవుఁ డుండును; కావున సహించి యుండుఁడు.

మిన్ను మన్నుఁ గానక మనుష్యులు తమ్ముఁ జూడవలెనని గృహములనుండి వెడలి దైవపథమునుండి యితరులను దప్పించు

మక్కావాసుల ననుకరింపకుఁడు దేవుఁడు వారికార్యములచుట్టును నిండియున్నాఁడు.

సైతాను వారికార్యములను సిద్ధముచేసి "ఈదినమున మి మ్మెవ్వరును జయింపలేరు. నేను మీకు సహాయము చేయుచు మీదగ్గఱనే యుందును" అనెను. కాని రెండుసైన్యములు నభిముఖములైనంతనే, అతఁడు పరుగిడ మొదలిడి, "అమ్మో! మీరు నా కక్కఱలేదు. అబ్బో! మీరు చూడనిది నాకుఁ గనఁబడుచున్నది. నాయనో! దేవుఁడనిన నాకు భయము. దేవుఁడు చాల కఠినముగ శిక్షించును" అనెను.

## అధ్యాయము 7.

కపటులును, హృదయదుర్బలులును, "భక్తిపరులను వారిమతమే తప్పుత్రోవఁ బెట్టినది. కాని దేవుని నమ్మినవాఁడు......" అనిరి. అవును గాని, దేవుఁడు శక్తియుతుఁడు, బుద్ధుఁడు!

50. దేవత లవిశ్వాసులఁ జంపునప్పుడు నీవు చూచిన బాగుండును. వారు వారిముఖములపైనను వీఁపులమీఁదను చఱచుచు "అగ్నిబాధ ననుభవింపుఁడు.

మీరు మీచేతులతో ముందుగా పంపికొనినదాని కిదే యనుభవము" అందురు. దేవుఁడు తనకింకరుల కన్యాయము చేయఁడు.

ఫిరౌనుప్రజలయు, దేవునిసూచనలను నమ్మకుండినవారి పూర్వులయు స్థితివలెనే యీరిస్థితియు నున్నది. కావుననే దేవుఁడు వారు పాపముచేయుచుండఁగనే పట్టుకొనెను. దేవుఁడు బలవంతుఁడు. అతఁడు కఠినముగ శిక్షించును.

దేవుఁ డనుగ్రహించినప్రజలు తమహృదయములలో నున్న దానిని మార్చికొనకుండినచో నింకను ననుగ్రహించుచునే యుండును;

కావుననే యిట్లు జరుగును. దేవుఁడు వినుచుండును, తెలిసికొను చుండును.

ఫిరౌనుప్రజలును, వారికిపూర్వము దేవునిసూచన లసత్యము లనినవారును నేస్థితిలో నుండిరో, వీరు నాస్థితియందే యున్నారు. కావున వారు పాపాత్ములై యుండఁగనే వారిని జంపితిమి; ఫిరౌను ప్రజలను నీటిలోఁ ద్రోసి చంపితిమి. వా రందఱును దుష్టవర్తనులే.

నమ్మక కృతఘ్నులై,

నీవు సఖ్యము నెఱపినను దానిని విడుచుచు, దేవునికి భయ పడనివారే తుచ్ఛపశువులు.

వారిని యుద్ధములో ఖైదీలనుగా నీవు తీసికొనినయెడల, వారిదురదృష్టమునకు వారిని వదలిపెట్టుము. వారి కిది యొకసూచన యగుఁగాక!

నీ కేజనులైనను మోసము చేయుదురని తలఁచినచో వారి యొడంబడికను వారిపై విసరివేయుము. మోసగాండ్రను దేవుఁడు ప్రేమింపఁడు.

అధ్యాయము 8.

అవిశ్వాసులు మమ్ముఁ దప్పించుకొనఁగల రనుకొనకుఁడు. వారు దేవుని బలహీనునిజేయలేరు.

6. దేవునికిని మీకును శత్రువులైనవారికిని, వారితో నుండి మీకుఁ దెలియకున్నను దేవునికిఁ దెలిసినవారికిని, భయముపుట్టుటకు మీరు చేర్పఁగలిగినబలమును, పెద్దసైన్యములను, నాయత్తపఱుచుకొని యుండుఁడు. దేవునివిషయమై మీ రేమిలాభమును గోరియున్నారో య దంతయు మీకు చేకూఱును. మీ కన్యాయము జరుగదు.

వారు సంధికి దిగినచో మీరును సంధికి దిగుఁడు; దేవుని నమ్మి యుండుఁడు. అతఁడు శ్రోత, జ్ఞాని!

కాని, వారు మిమ్ము మోసపుచ్చ నెంచినచో మీకు దేవుఁ డొక్కఁడే చాలును. తాను సహాయము చేసి, విశ్వాసులను సహాయపడఁజేసి, వారిహృదయములం దైక్యతఁ గలుగఁజేసి మీకుబలము నొసగినవాఁ డాతఁడే; భూమియందలి ధనమంతయు వ్యయపెట్టియు మీరు వారియం దైకమత్యముఁ బుట్టింపఁజాలక యుండియుందురు. దేవుఁడు శక్తియుతుఁడు, బుద్ధిమంతుఁడును గావున, వారి నందఱినిఁ గలిపెను.

ఓ ప్రవక్తా! దేవుఁడును, ని న్ననుసరించువిశ్వాసులు నే నీకు సహాయము చేయఁజాలుదురు.

## అధ్యాయము 9.

ఓప్రవక్తా! విశ్వాసులను యుద్ధమునకుఁ బురికొల్పుము. మీలో నిరువదిమంది కలిసి స్థిరముగ నిలిచినచో వారిలో రెండువందలమంది నోడింపఁజాలుదురు. మీలో నూర్గురు కలసి వారిలో వేయిమందిని చంపఁగలుగుదురు. అవిశ్వాసులు జ్ఞానశూన్యులు.

మీ రిప్పు డెంతబలహీనులుగ నున్నారో దేవునికిఁ దెలియును; కావున నాతఁడు మీపనిని సులువుచేసినాఁడు. మీలో నూర్గురు స్థిరులై నిలిచినచో రెండువందలమందిని నిర్జింపఁగలరు. దేవుని యనుమతిచొప్పున మీలో వేయిమంది రెండువేలమందిని నుక్కడంపఁగలరు. ఓర్పుగలిగి స్థిరచిత్తులైనవారితో దేవుఁడుండును.

తాను భూమియం దనేకుల నఱికినఁగాని యేప్రవక్తయును ఖైదీలను దీసికొన సమర్థుఁడు కాలేదు. మీరు క్షణభంగురములుగ నిహలోకఫలములఁ గోరుచున్నారు. దేవుఁడు మీకొఱకు పరలోకఫలములఁ గోరియున్నాఁడు. దేవుఁడు శక్తియుతుఁడు, బుద్ధుఁడు!

పూర్వ మప్పుడే దేవుఁడు శాసించి యుండనిచో మీరు గైకొనినపరిహారమునకు గొప్పశిక్ష నొందియుందురు.

మీరు కొల్లగొనినదానిలో న్యాయువంతములగు సద్వస్తువుల భుజింపుఁడు. దేవునికి భయపడుఁడు. అతఁడు దయాళుఁడు. కరుణాళుఁడు.

అధ్యాయము 10.

70. ప్రవక్తా, నీచేతఁ జిక్కిన ఖైదీలతో "మీహృదయములలో దేవుఁ డున్నాఁ డని మీకుఁ దెలిసినయెడల మిమ్ములనుండి తీసికొనిన దానికంటె నెన్నియో రెట్లెక్కువగ మీకిచ్చి క్షమించును. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు" అనుము.

కాని, వారు నీపై కుట్ర పన్న నెంచినచో వా రంతకుఁబూర్వమే దేవునిపైఁగుట్ర పన్నియున్నారు. కావుననే నీకు వారిపైశక్తి నతఁ డిచ్చియున్నాఁడు. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

నమ్మి, గృహములవిడిచి, తమసర్వస్వమును దేవునికొఱకు వినియోగించినవారును, ప్రవక్తను స్వీకరించి యాతనికి సహాయము చేసినవారును, నిశ్చయముగా దగ్గఱచుట్టములయ్యెదరు. నమ్మినవా రయ్యు గృహముల వీడనివారు దేశమునుండి పాఱిపోవువఱకును, మీతో నెట్టిచుట్టఱికమును గలిగియుండరు. వారివిశ్వాసము నాధారముచేసికొని, వారు మీసహాయము వేఁడినచో మీరు సంధిచేసికొనినజనులపైఁ దప్ప వారికి సహాయపడుట మీవిధి యైయున్నది. దేవుఁడు మీ రొనరించుకార్యములను జూచుచునే యుండును.

అవిశ్వాసు లొండొరులకు సహాయము చేసికొందురు. మీరును మీలో నట్లు చేసికొనినచో దేశమునందు పరస్పరకలహములును, దౌష్ట్యమును ప్రబలఁగలవు.

కాని, విశ్వాసులై దేశమునుండి పాటిపోయి దైవమార్గమున యుద్ధము సలిపి, ప్రవక్తకు రక్షణస్థాన మొసగి, సహాయపడిన వారే భక్తులు. వారికి దయయు, మంచియాహారమును దొరుకనున్నది.

తొలుతఁగాకున్నఁ దరువాత నైనను విశ్వసించి దేశమును వదలి వెళ్లి నీప్రక్క నిలిచి పోరాడినవారుఁగూడ నీవారే. రక్తసంబంధమే దగ్గఱసంబంధము. ఇది దైవగ్రంథములోనివాక్యము. నిశ్చయముగా దేవుఁడు సర్వజ్ఞుఁడు.

---

# సురా 9. పాపమోక్షణము.

---

మదీనా. 129 పద్యములు.-16 రుక్కులు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగుదేవునిపేర.

బహుదైవారాధకులగు నరబ్బులలో మీకు స్నేహితులుగానున్నవారికి దేవునివలనను, ప్రవక్తలవలనను, పాపమోక్షణము కలుగఁగలదు.

కావున మీరు నాలుగుమాసములు యథేచ్ఛగా దేశములో తిరుగుఁడు; కాని, మీరు దేవుని బలహీనునిగాఁ జేయఁజాల రని తెలిసికొనుఁడు. నమ్మనివారిని దేవుఁడు సిగ్గులపాలు చేయును.

ఆ మహాయాత్రాదినమున బహుదైవారాధకులతో దేవుఁడును, నాతనిప్రవక్తయు, నెట్టిప్రసక్తియుఁ గలుగఁజేసికొన రని

దేవుఁడును ప్రవక్తయుఁ బ్రకటన చేయుచుందురు ! కావున, మీరు దేవుని వంకఁ దిరిగినచో శ్రేయస్సు కలుగును. మీరు మఱలిపోయినంత మాత్రమున దేవునిబల మిసుమంతయుఁ దగ్గిపోదని తెలిసికొనుఁడు. అవిశ్వాసులకు ఘోరశిక్ష కలుగఁగల దని ప్రకటింపుము.

ఇది మీరు స్నేహము చేసినట్టియు, మీ రెల్లప్పుడును తోడ్పడు చుండినట్టియు, మీపై నొరులకు సహాయముచేయునట్టియు, బహుదైవా రాధకులకుఁ జెప్పఁబడినది కాదు. కావున, వారు మీతో నొడఁబడి యున్నంతకాలమును వారితో సఖ్యపడియే యుండుఁడు. తనకు భయ పడువారిని దేవుఁడు ప్రేమించును.

ఆపవిత్రమాసములు గతించినంతనే దేవునితో నితరదైవములఁ జేర్చువారు మీ కెచట కంటఁబడినను జంపివేయుఁడు. వారిని పట్టుకొని, వారిని ముట్టడించి అన్నివిధములుగను వారికై పొంచి యుండుఁడు. వారు నీమతమును స్వీకరించి, ప్రార్థనలు సలిపి, విధింపఁబడినభిక్షము నిచ్చినచో వారిని వారిదారిని విడిచిపెట్టుము. దేవుఁడు దయా దాక్షిణ్యమూర్తి.

దేవునితో నితరదైవములఁ జేర్చువాఁ డెవఁడైనను మిమ్ము తల దాఁచికొనుటకు తా వడిగినచో, అతఁడు దేవునివాక్యమును వినుటకై కోరినతా వొసంగి, పిదప తననిరపాయస్థానమునకుఁ బోనిండు. వా రజ్ఞానులు కావుననే యిట్లు చెప్పియున్నాము.

## అధ్యాయము 2.

పవిత్రదేవాలయముదగ్గఱ మీతో స్నేహము నెఱపినవారు తప్ప, దేవునితో నితరదైవములఁ జేర్చువారు దేవునితోడను, నతని ప్రవక్తతోడను, నెట్లొడఁబడి యుండఁగలరు? వారు మీమీఁద విశ్వాస

ములో వర్తించునంతవఱకును మీరును వారియెడల విశ్వాసముగలిగి వర్తింపుఁడు. తనకు భయపడువారిని దేవుఁడు ప్రేమించును.

వారు మీపై చెల రేగినచో రక్తబంధమునుగాని, భక్తిబంధమునుగాని పాటింపనప్పుడు వారెట్లొడఁబడి యుండఁగలరు? వారు మిమ్ము మాటలతోనే తృప్తిపఱిచెదరుకాని, వారిహృదయములు దుష్టములు. వారిలో చాలమంది దుష్టవర్తనులు.

వారు దేవునిసూచనలను తుచ్ఛధనమున కమ్మివేసి యితరుల నాతని మార్గమునుండి తప్పింతురు. వారు చేయునదంతయు దౌష్ట్యమే!

10. విశ్వసించినవానియందు వారు రక్తబంధమును గాని, భక్తిబంధమును గాని పాటింపరు. వీరే యాజ్ఞోల్లంఘనాపరులు.

కాని, వారు దేవునివంకఁ దిరిగి, ప్రార్థనచేసి, విధింపఁబడిన ద్రవ్యమును చెల్లించినచో మీమతసోదరులగుదురు. బోధపఱుచుకొను వారికి మాసూచనలను స్పష్టపఱుచుచుందుము.

వారు మీతోసఖ్యము నెఱపి, పిదప తమప్రమాణములను తప్పుచు మీమతమును దూషించినయెడల, నాయవిశ్వాసులలోని మొనగాం డ్రూరకొనునట్లు యుద్ధము చేయుఁడు. వారే ప్రమాణములకును కట్టుపడరు.

తమప్రమాణములను తప్పి, మీప్రవక్తను పాఱఁద్రోల నుద్దేశించి, తొలుత మిమ్మే యెదిరించినమక్కావాసులపై పోరు సల్పరా యేమి? వారనిన మీకు భయమా? మీరు విశ్వాసులైనచో దేవునికే మీరు భయపడ నర్హులు.

కావున, వారిపై యుద్ధము చేయుఁడు. దేవుఁడు వారినిమీచేతులతోనే శిక్షింపఁజేసి, సిగ్గులపాలొనర్చి, వారిపై మీకు విజయము చేకూర్చి, విశ్వసించిన హృదయములకుఁ దగిలిన గాయములను మాన్పును.

వారిహృదయములందలిక్రోధము నాతఁడు హరింపఁగలఁడు. దేవుఁడు తనయిచ్ఛవచ్చినవారివంకకు తిరుగుచుండును. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు !

మీలో ధైర్యముతోఁ బోరు సలిపినవా రెవరో, దేవుని, నాతనిప్రవక్త, విశ్వాసులను దప్ప నితరులను స్నేహితులుగఁ జేసికొనినవా రెవరో, యింకను దేవుఁడు తెలిసికొనకుండఁగనే, మీరు విడనాడఁబడుదు రని తలంచుచున్నారా ? దేవునికి మీరు చేయు సర్వకార్యములును దెలియుచునేయున్నవి.

## అధ్యాయము 3.

దేవునితో నితరదైవములఁ జేర్చి, తమయవిశ్వాసమునకుఁ దామే సాక్షులగువారు దేవునియాలయములను దర్శింప వీలులేదు. వీరిపను లన్నియు వృథా యగును. వా రగ్నియందే శాశ్వతముగ వసింపవలయును.

దేవునియందును తుదిదినమునందును, నమ్మకము గలిగి, ప్రార్థనలసల్పుచు, విధివిహితమగుభిక్షము నొసగుచు, దేవునికితప్ప నితరులకు భయపడనివారే దేవునియాలయముల దర్శింపవలయును. వీరు సరియగుమార్గమున నడిపింపఁబడినవారై యుందురు.

యాత్రికులదాహముఁ దీర్చి, పవిత్రదేవాలయమును దర్శించుటయు, దేవునియందును తుదిదినమునందును నమ్మకము గలిగి దేవునిమార్గమున యుద్ధముచేయుటయు నొకటే యని తలంతురా ? దేవుఁ డీరెండింటిని సమానములుగాఁ దలంపఁడు. అక్రమవర్తనులకు దేవుఁడు మార్గముఁ జూపఁడు.

20. విశ్వసించి గృహములను వీడి, తమద్రవ్యములను, దేహములను, భగవదర్పణము చేసినవారు దేవునివలన నత్యుచ్ఛస్థాన

మును గాంచఁ గలుగుదురు. వీరే సుఖులై యుండఁగలుగువారు.

తనయిష్టముచొప్పున ప్రభువు తనయొద్దనుండి, కరుణావార్తను నిత్యసౌఖ్యప్రదాయకములగు నుద్యానవనములను వారికి పంపును.

వా రందు శాశ్వతముగ వసింపఁగలరు. దేవుఁడే హెచ్చుగ బహుమాన మీయఁగలుగువాఁడు.

విశ్వాసులారా! భక్తిపరులు గాక భక్తిహీనులై యుండినచో మీతండ్రులైనను సరే, సోదరులైనను సరే, వారితో స్నేహము చేయకుఁడు. వారితో స్నేహముచేసినవారు దుష్టవర్తను లగుదురు.

"మీతండ్రులు, కొడుకులు, అన్నదమ్ములు, భార్యలు, బంధువులు, మీరు గడించినధనము, చెల్లకపోవునేమో యని మీరు భయపడుసరకులు, మీరు క్రీడించుగృహములు, ఇవి దేవునికంటెను, నతనిప్రవక్తకంటెను, అతనిమార్గమున మీరు పడుశ్రమకంటెను, మీకు ప్రియతరము లైనయెడల, దేవుఁడు తనపని నారంభించువఱకును వేచియుండుఁడు. భక్తిహీనునకు దేవుఁడు దారిచూపఁడు" అనుము.

## అధ్యాయము 4.

అనేకయుద్ధభూములందు దేవుఁడు మీకు సహాయపడినాఁడు. హూనైనుదగ్గఱ యుద్ధమైననాఁడు మీ రధికసంఖ్యాకులము గదా యని గర్వించితిరి. కావున నక్కడ మీకు కార్యములేకపోయెను. విశాలమైన భూమియంతయు మీకు మిక్కిలి సన్నగిల్లిపోయెను. అంతట మీరు వెనుదిరిగి పరుగిడసాఁగితిరి.

అట్టిసమయమున దేవుఁడు, తనప్రవక్తకును, విశ్వాసులకును, విశ్రాంతిని కలుగఁజేసి, మీకుఁ గనఁబడకుండ గొప్పసైన్యముల

నంపి యవిశ్వాసులను శిక్షించెను. ఇదియే యవిశ్వాసులకు బహుమానము !

ఇఁకముందును దేవుఁడు తనయిచ్చవచ్చినవారికి సుముఖుఁడై యుండును. దేవుఁడు దయాదాక్షిణ్యమూర్తి.

విశ్వాసులారా ! దేవునితో నితరదైవములఁ జేర్చువారే యపవిత్రులు ! కావున, నీసంవత్సరము గతించువఱకును, పవిత్రదేవాలయమునొద్దకు వారిని రానీయకుఁడు. మీకు కఱవు కల్గినచో దేవుఁడే దయతో మీకు సర్వము నొసగును. అతఁడు జ్ఞాని. బుద్ధుఁడు !

దివ్యగ్రంథము పంపఁబడినను, దేవునియందును, తుదిదినమునందును నమ్మకము లేక, దేవుఁడును, నాతనిప్రవక్తయు నిషేధించిన దానిని నిషేధింపక, సత్యము నవలంబింపక యుండువారు, తమచేత నుండు ధనమునుండి పరిహారమును చెల్లించి నమ్రులగువఱకును, వారిపై యుద్ధముచేయుట మానకుఁడు.

## అధ్యాయము 5.

30. ఉజైరు దేవునికుమారుఁడని యహూదీ లందురు. నసారీలు మెసయా దేవునిపుత్రుఁడందురు. వారినోటినుండి వెలువడుమాటలిట్టివే ! ఈమాటలు పూర్వ మవిశ్వాసులు పల్కినవానిని పోలియుండును. వారిపై దేవుఁడు యుద్ధముచేయుఁగాక ! వారు మార్గమునుండి యెంతయో తొలఁగింపఁబడినారు !

ఏకేశ్వరునే యారాధింపుఁడని చెప్పినను, తమగురువులను, పకీరులను, మరియమ్మకుమారుఁడగు మెసయాను, వారు దేవునితోఁగూడఁ బ్రభువులుగాఁ జేకొందురు. అతఁడుతప్ప మఱియొక దేవుఁడు

లేఁడు ! వా రాతనితోఁ జేర్చినదెల్ల నాతనిమహిమకుఁ జాలదూర ముగ నుండునుగదా !

వారు దేవునిజ్యోతిని తమనోటితో నార్పివేయఁ జూతురు. అవిశ్వాసుల కిష్టములేకపోయినను దేవుఁడు తనజ్యోతిని మఱింత ప్రజ్వలింపఁజేయుచుండును.

దేవునికి భాగస్థులను కల్పించువారి కిష్టములేకున్నను, నితర మతము లన్నిటిపైనను విజయముగాంచుటకై తనప్రవక్తద్వారా రక్షణోపాయమును, సత్యమతమును బంపినవాఁడాతఁడే.

విశ్వాసులారా ! గురువుల మనియు, యతీశ్వరుల మనియుఁ బేరుపెట్టుకొనినవారిలో చాలమంది దంభపరులై మనుష్యునిధనమును మ్రింగివేయుచు, వానిని దైవపథమునుండి తప్పించుచుందురు. కాని, వెండి బంగారములను పాతులువేసికొని, దేవునిమార్గమున వ్యయము చేయనివారికి ఘోరశిక్ష కలుగనున్నదని చాటి చెప్పుము.

ఆదినమున వారిధనములను నరకాగ్నిలో కఱిగించి వారినుదుటను, ప్రక్కలను, వీఁపులమీఁదను, వానితో చుఱుకలు వేయుదురు......"మీరు దాఁచికొనినధనము లివియే. కావున మీధనములను రుచిచూడుఁడు."

దైవగ్రంథముప్రకారము స్వర్గమర్త్యముల నాతఁడు సృజించిన నాఁటినుండియు, మాసములసంఖ్య పండ్రెండై యున్నది. అందులో నాల్గు పవిత్రమాసములు. ఇదియే క్రమమైనపద్ధతి. కాని, యీవిషయమై వివాదము సలిపి యొకరికొకరు హాని చేసికొనకుఁడు. దేవునితో నితరదైవములఁ జేర్చువారు మి మ్మెదిరించినట్లే, యన్నిమాసములయందును, వారిపై యుద్ధము చేయుఁడు. దేవుఁడు తనకు భయపడువారితో నున్నాఁడని తెలిసికొనుఁడు.

అధికమాసములను కల్పించుట కేవలము భక్తిరాహిత్యము వలన గలిగినదే. భక్తిహీనులు దానివలన తప్పులోఁ బడిపోదురు. వారు దాని నొకసంవత్సరమునఁ గలిపి, మఱియొకదానియందుఁ గలుపక, దేవుఁడు పవిత్రముచేసినమాసములసంఖ్యను పూర్తిచేయ నెంచి, దేవుఁడు నిషేధించినదాని నిట్లు చేయుచుందురు. వారిదుష్కార్యములను సైతాను వారికొఱకు సిద్ధపఱిచియే యున్నాఁడు. విశ్వసింపని వారికి దేవుఁడు దారిఁజూపఁడు.

## అధ్యాయము 6.

విశ్వాసులారా! "దేవునిమార్గమున యుద్ధమునకు బయలుదేరుఁ" డని మీతోఁ బల్కఁగా మీరు భూమిలోనికి కృంగిపోయినట్లగుటకు మీ కేమి యావేశించినది? ఏమి, పరలోకజీవనముకంటె నిహలోకజీవనమే శ్రేష్ఠమనుచున్నారా? పరలోకఫలము ముందఱ నిహలోకఫలము చాల స్వల్పము.

మీరు యుద్ధమునకు నడువనిచో మి మ్మాతఁడు ఘోరబాధలపాలు చేయును. మీస్థానమున నితరప్రజలను నిలుపును. మీ రాతని కేహానియుఁ జేయఁజాలరు. అతని కన్నిటిపైనను శక్తి కలదు.

40. మీరు ప్రవక్తకు సహాయపడకున్న నేమి?......అవిశ్వాసులాతనిపాఱఁద్రోలఁగా మఱియొక్కని మాత్రమే వెంటఁబెట్టికొని వెడలిపోయినప్పుడును, వారిరువురు నొకగుహలో దాఁగియున్నప్పుడును, ప్రవక్త తనస్నేహితులతో "దేవుఁడు తనతో నున్నాఁడు. చింతిల్లకుము" అని చెప్పినపుడును దేవుఁ డాతనికి సహాయము చేసి యుండెను. దేవుఁ డాతనికి శాంతి కలుగఁజేసి, మీకు కనఁబడని సైన్యములతో నాతనికి బలము నిచ్చి, అవిశ్వాసులమాట క్రిందగు

నట్లును, దేవునిమాట మీఁ దగునట్లును, చేసియుండెను. దేవుఁడు శక్తిమంతుఁడు, జ్ఞాని.

మీలో పిన్నలును పెద్దలును తమధనమును, దేహములను దేవునిమార్గమున వినియోగించుచు యుద్ధమునకు వెడలుఁడు. ఇది మీకు తెలిసినచో శ్రేయస్సు కలుగును.

ఎంతో ప్రయాణము చేయనక్కఱలేక లాభము వెంటనే కలిగినచో వారు నిన్ననుసరించియుందురు. కాని, వారికి దారి పొడవుగ నున్నట్లు తోచెను. అయినను వారు "మాకు శక్తియుండినచో మీతో తప్పక వచ్చియుందుము" మని దేవునియాన ప్రమాణము చేయుదురు. వా రాత్మవినాశకులు! వా రసత్యవంతు లనుసంగతి దేవునికిఁ దెలియును.

## అధ్యాయము 7.

దేవుఁడు నిన్ను క్షమించుఁగాక! వారు సత్యముఁ బల్కుచున్నారో, యసత్యము వచించుచున్నారో నీకు తెలియకుండఁగనే వారి నేల యిటనుండి పోనిచ్చితివి?

దేవునియందును తుదిదినమునందును నమ్మకముగలవారు, తమధనముతోను దేహములతోను, యుద్ధముచేయుటనుండి తప్పింపుమని కోరరు. తనకు భయపడు వారిని దేవుఁడు తెలిసికొనును!

దేవునియందును, తుదిదినమునందును, విశ్వసింపక, హృదయములను సందేహములతో నింపి, వారిసందేహములలో నిటునటు తల్లడిల్లువారే యింటినుండి పోవ ననుజ్ఞ వేఁడుకొందురు.

వారు యుద్ధభూమిని ప్రవేశింపనెంచియే యుండినచో యుద్ధసామగ్రిని సిద్ధపఱచుకొని యుండరా? వారు యుద్ధమునకు వెడలుట దేవుని కిష్టములేకపోవుటచేతనే వారిని వెనుకకు తగ్గఁజేసి, వారితో,

"కూర్చుండువారితో నింటియొద్దనే కూర్చుండు" డని చెప్పెను.

వారే మీతో యుద్ధమునకు వచ్చినయెడల మీకు భారమై యిటునటు నడావడిగఁ దిరుగుచు మిమ్ము యుద్ధవిముఖులఁ జేయఁ బ్రయత్నించియుందురు. మీలోఁ గొందఱు వారికి చెవియొగ్గి యుందురు. దుష్టు లెవరో దేవునికిఁ దెలియును.

పూర్వము, వారు ద్రోహము నెంచి, మీకార్యములకు భంగపాటు కలిగించిరి. తుదకు సత్యము గోచరమయ్యెను. వారి కిష్టము లేకపోయినను దేవుని యాజ్ఞ స్పష్టము చేయఁబడెను.

వారిలోఁ గొందఱు నీతో "న న్నింటినుండి పోనిమ్ము. నన్ను శోధనకు పాలుచేయకుము" అందురు కాని, వా రంతకుఁబూర్వమే శోధనకుఁ బాల్పడియుండిరి కారా? నిశ్చయముగా నవిశ్వాసులను నరకము చుట్టికొనును.

50. నీకు జయము కలిగినచో వారు దుఃఖింతురు. అపజయమే కలిగినచో "ఇట్లగునని మే మిదివఱకే యనుకొంటిమి" అనుచు వెనుదిరిగి సంతోషింతురు.

"దేవుఁడు మా కుద్దేశించినది తప్ప మఱేదియు మాకు సంభవింపదు. అతఁడు మా కధినాథుఁడు. విశ్వాసులు దేవుని నమ్మియుందురు గాక!

మాకు శ్రేష్ఠమగు జయమో మరణమో కాక మఱియొకటి కలుగుటఁ జూడవలెనని వేచియున్నారా? అయినను, మీకు దేవుని నుండియు మాచేతులనుండియుఁ గలుగఁబోవుశిక్షకొఱకు వేచియుం దుము. మీరు కనిపెట్టుకొనియుండుఁడు. మేమును కాఁచికొని యుందుము.

"మీరు మనస్ఫూర్తిగనో, నిర్బంధముచేతనో పూజలు సల్పు చుందురుగాని, దుష్టులగుటచే మీపూజలు పరిగ్రహింపఁబడవు" అనుము.

వారు దేవుని, నాతనిప్రవక్తను నమ్మక యాలసించికాని, తమప్రార్థనావిధి ననుష్ఠింపక నిర్బంధముచేతఁగాని, పూజల నల్పమగుం డుటచేతఁగాని, లేకున్నచో వారిపూజలు పరిగ్రహింపఁబడియుండుట కేయాటంకమును లేదు.

కావున వారిభాగ్యమును, వారిసంతతిని జూచి యచ్చెరువు నొందకుము. ఈవిధముగా నిహలోకములోనే వారిని శిక్షింపవలె ననియు, వా రవిశ్వాసులుగ నుండఁగనే వారియాత్మలు వారిని వీడవలె ననియు, దేవుఁడు నిశ్చయించియున్నాఁడు.

వారు మీవార మని దేవునియానఁ బ్రమాణము చేసెదరు గాని, మీవారు కారు. మీకు భయపడిమాత్ర మున్నారు.

వారి కొకనిరుపద్రవస్థానమో, గుహలోఁ దాఁగియుండుటకు చోటో, కనఁబడినచో వా రచటికి తొందరగాఁ బోవుదురు.

భిక్షావిషయమై వారిలోఁగొందఱు నీపరువు తీయుదురు. వారికి నీవు తావిచ్చినచో తృప్తిఁబొందియుందురు. కాని, యీయ కున్నయెడల కోపావిష్టు లగుదురు.

వారు తమకు దేవుఁడును, నాతనిప్రవక్తయు ననుగ్రహించిన దానితో తృప్తినొంది "దేవుఁడే మాకు చాలును! దేవుఁడును నాతనిప్రవక్తయుఁ గూడ తమదయను మాకుఁ బ్రసాదింతురు. దేవునికే మామొఱలను విన్నవించుకొనుచున్నా" మనియనినచో నెంతయో బాగుండును.

## అధ్యాయము 8.

60. కాని, భిక్ష మనునది నిరుపేదలకును, కష్టములో నున్న వారికిని, దానిమీఁదనే యాధారపడి యుండువారికిని, తమహృదయములను దృఢభక్తికి మఱల్చుకొనినవారికిని, నష్టపరిహారముకొఱ

కును, సధమర్ణులకును, దైవకార్యములకును, పాంథులకును, మాత్రమే యీయవలయును. ఇది దేవునియాజ్ఞ. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

వారిలోఁ గొందఱు ప్రవక్తకు హాని చేసి "ఈతఁడు మేము చెప్పికొనినదంతయు, వినివేయుచున్నాఁడే" యందురు. "మీరును మంచినే వినుచుందురు గాక! అతఁడు దేవుని, విశ్వాసులను, నమ్మి యున్నాఁడు. విశ్వసించినవారియెడ నాతఁడు కరుణామయుఁడు" అనుము. దేవునిప్రవక్తకు హానిచేయువారు దుఃఖకరమగు శిక్ష ననుభవింపఁగలరు.

మిమ్ము సంతోషపెట్టుటకే వారు దేవునియాన ప్రమాణము చేయుదురు. వారు విశ్వాసులైనచో సంతోషపెట్టఁబడుట కర్హులు దేవుఁడును, నతని ప్రవక్తయునే.

దేవుని, నతనిప్రవక్తను నెదిరించువారికి నరకాగ్నియే ప్రాప్తమగు ననియు నందు వారు శాశ్వతముగ వసింపవలయు ననియు, వారికిఁ దెలియదా? ఇదియే మిక్కిలి లజ్జాకరము!

తమహృదయములలో నున్నదానిని స్పష్టముగ బయలుపెట్టు నొకవాక్యము పంపఁబడునేమో యని కపటులు భయపడుచుందురు. "మీరు హేళనచేసిన చేయుదురుగాక! మీరు దేనికి భయపడుచున్నారో దానిని దేవుఁడు వెలిబుచ్చును" అని వారితో ననుము.

నీవు వారిని ప్రశ్నించినయెడల "మే మేదో వినోదమున కట్లు ప్రసంగించినా" మని వారందురు. "ఏమి! దేవుని, నాతని ప్రవక్తను, నాతనిసూచనలను, హేళన చేసెదరా?" అని వారి నడుగుము.

మీరు సాకులఁ గల్పింపకుఁడు. భక్తిని విడిచి మీరు భక్తిహీను లయినారు! మేము మీలోఁ గొందఱిని క్షమించినను, దుష్టులగు నితరులను శిక్షింతుము.

## అధ్యాయము 9.

కపటులగు స్త్రీపురుషు లొకరినొక రనుకరించుచుందురు. వా రన్యాయమును విధించి, న్యాయమును నిషేధించి చేతులు ముడుచుకొందురు. వారు దేవుని మఱచిపోయినారు. దేవుఁడును వారిని మఱచినాఁడు. నిశ్చయముగా కపటులే దుర్మార్గులు.

కపటులగు స్త్రీపురుషులకును, నవిశ్వాసులకును, నరకాగ్ని యందు నిత్యవాసమును దేవుఁడు విధించి యున్నాఁడు. ఇదియే వారికిఁ దగినఫలము ! దేవుఁడు వారిని శపించినాఁడు. వారికి శాశ్వత బాధ విధింపఁబడి యున్నది.

మీరు మీపూర్వులవలెనే ప్రవర్తించుచున్నారు. వారు మీకంటె శక్తిగలిగియుండి మీకంటె భాగ్యమునందును, సంతానము నందును నధికులై తమపాలును దా మనుభవించిరి. మీపూర్వులు తమకు ప్రాప్తించినదాని ననుభవించినట్లే, మీకు ప్రాప్తించినదానిని మీరును ననుభవింతురు. మీరును వారివలెనే సంభాషణల సల్పు దురు. వీరా ! వీరికార్యము లిహలోకమునకును, బరలోకమునకును గూడఁ బనికిరాక యుండును ! వీరే నష్టులైనవారు.

70. వారిపూర్వులచరిత్రము మీకు తెలియరాలేదా? నుహు, ఆదు, సామూదు, ఇబ్రాహీము, వీరిప్రజలయు, మదియాను మొదలుగా నాశము నొందిననగరముల ప్రజలయు చరిత్రము మీకుఁ దెలిసియే యున్నదికదా ! వారిప్రవక్తలు తమకుఁ గనఁబడినదానికిఁ దగినప్రమా ణములతో వారియొద్దకు వచ్చిరి. దేవుఁడు వారి కన్యాయము చేయ లేదు. వారు తమకుఁ దామే యన్యాయము చేసికొనిరి.

విశ్వాసులగు స్త్రీపురుషు లన్యోన్యము స్నేహితులయి యుందురు. వారు న్యాయమును విధించి, యన్యాయమును నిషేధిం తురు. వారు ప్రార్థనల సల్పుచు ధర్మవిహితమగు భిక్షము పెట్టుచు,

దేవుని, నాతనిప్రవక్తను మన్నింతురు. వీరిని దేవుఁడు కరుణించును. దేవుఁడు జ్ఞానియు, బుద్ధుఁడునుగదా !

దేవుఁడు విశ్వాసులగు స్త్రీపురుషులకు తరంగిణులు ప్రవహించు నుద్యానవనములయందు వాసమును, ఈడెనువనమున గొప్ప హర్మ్యములను నొసగును. కాని, దేవునికి వారియందు ప్రీతి యుండుటయే శ్రేష్ఠము. ఇదియే పరమానందము.

## అధ్యాయము 10.

ఓప్రవక్తా ! అవిశ్వాసులను, కపటులను నెదిర్చి, వారియెడల కఠినుఁడవై యుండుము. వారికి నరకమే యావాసము కాఁగలదు. అచటికి దారి కడు దుర్గమము.

వా రట్టిమాటను పల్కలే దని దేవునితోడుగాఁ బ్రమాణము చేయుదురు. కాని, వారు భక్తిహీనములగు మాటల మాట్లాడియే యుండిరి. తొలుత భక్తులై తరువాత భక్తిహీనులైరి. తాము కావిం పలేనిదానిని వారు పన్నిరి. దేవుఁడును నాతనిప్రవక్తయు నిండుగ ననుగ్రహించుటచే నాపన్నాగమును విడిచిపెట్టిరి. వారు పరితపించి నచో శ్రేయస్సు కలుగును. కాని, తిరిగి పాపములోనికిఁబోయినచో దేవుఁడు వారి నిహపరలోకముల రెండిటియందును ఘోరముగ శిక్షించును. భూమిపై వారికి స్నేహితుఁడుగాని, రక్షకుఁడుగాని, దొరకఁడు !

వారిలోఁ గొందఱు "అతఁడు మమ్ము తనయనుగ్రహాము నకుఁ బాత్రులఁ జేసినచో మేము తప్పక భిక్షమునిచ్చుచుఁ గ్రమ వర్తనుల మయ్యెద" మని దేవునితో నొడంబడిక చేసికొనిరి.

కాని, యాతఁడు వారి ననుగ్రహింపఁగనే, వారు దానిచే మోహితులై, వెనుదిరిగి దూరముగఁ దొలఁగిపోయిరి.

వారు దేవుని యెదుటఁ జేసిన వాగ్దానమును తప్పుటవలనను, నసత్యవచస్కు లగుటచేతను, తన్నాదినమున చేరువఱకును వారి హృదయములందు కాపట్యమును తిరిగి ప్రవేశ పెట్టెను.

వారిరహస్యములు వారిగూఢసంభాషణలుకూడ దేవునికిఁ దెలియు ననియు, దేవునికి సర్వరహస్యములును విశదములే యనియు, వారికి బోధపడలే దేమో ?

భిక్షను ధారాళముగ నిచ్చువారిని, తాము సంపాదించుకొని నది తప్ప భిక్షగా నిచ్చుట కొండెద్దియు లేనివారిని జూచి వారు హేళనచేసినను, అవిశ్వాసుల నట్లుచేసినందుకు దేవుఁడును, వారిని హేళనచేయకపోఁడు. వారికి దుఃఖకరమగుబాధ సిద్ధముగ నున్నది.

80. నీవు వారిని క్షమింప వేఁడినను, వేఁడకున్నను నొక్కటే. డెబ్బదిసారులు క్షమింప వేఁడినను దేవుఁడు వారిని క్షమింపఁ జాలఁడు. దేవుని, నాతనిప్రవక్తనువారు నమ్మనందుననే వారి కట్లు కలుగును ! భక్తిహీనులకు దేవుఁడు దారిఁ జూపఁడు.

## అధ్యాయము 11.

ఇంటియొద్ద వదలివేయఁబడినవారు ప్రవక్తవెనుక నొదిగి యుండి తృప్తినొందుచు, తమధనమును దేహములను దేవునిమార్గ మున వినియోగింపక "ఈయెండలో నేల పోయెదరు" అనిరి. "నరకాగ్ని యింతకంటె తపించును'' అని వారికి చెప్పుము. వారు దీనిని బోధపఱుచుకొనినచో నెంత బాగుండును !

కావున వారికార్యములకు ఫలముగా వారినవ్వులు తగ్గిపోయి యేడ్పులు ప్రబలమగును గాక!

దేవుఁడు మిమ్ము యుద్ధభూమినుండి త్రిప్పి యొకసారి వారి యొద్దకుఁ దెచ్చినప్పుడు వారును నీతో యుద్ధభూమికి వచ్చెద మందు

లేని "ఎంతమాత్రమును మాతో యుద్ధభూమికి మీరు రావలదు. మాతోఁ గలిసి యెంతమాత్రమును శత్రువులతో యుద్ధము చేయ వలదు. మొదటియుపాయమప్పుడు మీరు చల్లగ నింటిలోఁ గూర్చుంటిరి. కావున వెనుకకు తగ్గిపోయినవారితో నింటియొద్దనే గూర్చుండి యుండుఁడు" అని వారితోఁజెప్పుము.

దేవుని, నాతనిపవిత్రను, నమ్మక దుష్టుఁడై మృతినొందినవాని గోరీయొద్ద కేఁగి యతనియాత్మకొఱకు ప్రార్థన చేయకుము.

వారిధనమును సంతతిని జూచి యచ్చెరువు నొందకుము. వారి నీలోకమునందే శిక్షించి వారు నమ్మక యుండియుండఁగనే వారియాత్మలిచటనుండి వెడలిపోవలెనని దేవుఁడు వానిని వారి కొసగియున్నాఁడు.

"దేవుని నమ్మి యాతనిపవిత్రతో యుద్ధమునకు వెడలుఁ" డని వారి కొకయాజ్ఞ రాఁగా వారిలోఁ గొందఱు ధనవంతులు తమ్ము విడిచిపెట్టవలయు నని కోరుచు "మ మ్మింట నిలిచిపోయిన వారితోనుండని" మ్మని పల్కిరి.

వారిహృదయములకు మూఁతలుపడి బోధ కలుగకపోవుటచే వెనుకకుండిపోయినవారితో నుండుటయే వారి కిష్టమయ్యెను.

కాని, ప్రవక్తయు నాతనివలె భక్తిపరులగువారును, తమ ద్రవ్యముతోడను,దేహములతోడను మతముకొఱకు పోరుసలుపుదురు. వీరికి సర్వసద్వస్తువులును చేకూఱును. సుఖులగువారు వీరే!

దేవుఁడు వారిసత్యనివాసమునకై తరంగిణులు ప్రవహించు నుద్యానవనముల సిద్ధపఱిచియున్నాఁడు. అవియే వారికి పరమా నందము.

90. ఎడారిలోని కొంద ఱరబ్బులు సాకులఁ గల్పించుకొనుచు తమ్ము వదలివేయుఁడని వచ్చిరి. దేవుని నాపవిత్రను నిరాకరించినవా

రింటియొద్దనే కూర్చుండిరి. విశ్వసింపనివారికి ఘోరశిక్ష కలుగ నున్నది.

బలహీనులును, రోగులును, నేవిధముగ నైన సహాయము చేయలేనివారును, దేవునియెడలను, నాతనిప్రవక్తయెడలను, నిష్కపటులై యుండినచో నింటియొద్ద నుండిపోవుట నేరము కాదు. న్యాయముగా సంచరించువారి కెట్టినిందాకారణమును లేదు. దేవుఁడు దయాదాక్షిణ్యమూర్తి!

"మమ్ము నీపై నెక్కించుకొను" మనుచు నీదగ్గఱకుఁ గొందఱు రాఁగా 'మి మ్మెక్కించుకొనుటకు నా కాధార మేదియు లేదు' అని నీవంటివి. అప్పుడు వా రేవిధమునన్నైన సహాయపడఁ జాలమైతిమి గదా యని కన్నీరు గార్చుచు వెడలిపోయిరి. అట్టివారి కెట్టినిందయుఁ గలుగఁబోదు.

ధనవంతు లయ్యును సాకులఁ గల్పించుకొనినవారే నిందాస్పదు లగుదురు. వారు వెనుక నిలిచిపోయినవారితో నుండ నిచ్చగింతురు. దేవుఁడు వారిహృదయములకు మూఁతలు వేసినాఁడు. వారికి జ్ఞానము లేదు.

# కాండము 11

నీవు వారియొద్దకుఁ దిరిగి వచ్చినంతనే సాకులఁ గల్పింతురు. "సాకులఁ గల్పింపఁబోకుఁడు. మేము నిన్ను నమ్మఁజాలము. దేవుఁడు మిమ్ముఁగూర్చి మాకుఁ దెలిపియే యున్నాఁడు. దేవుఁడును, నాతని ప్రవక్తయుఁ గూడ మీకార్యములను జూచుచున్నారు. బహిరంతర

విషయముల నన్నిటిని దెలిసికొనఁగలవానియొద్దకు మీరు తీసికొని రాఁబడుదురు. అతఁడు మీరు చేసినదానిని మీకుఁ దెలియఁ జేయును " అనుము.

నీవు వారియొద్దకు తిరిగి వచ్చినప్పుడు వారు దేవునిపేరఁ దమ్ము నుండి తొలంగి యుండుమందురు. వా రపవిత్రులగుటచే వారి నుండి తొలఁగిపొమ్ము. వారికి నరకావాసమే యగును. అదియే వారికిఁ దగినఫలము.

వారు నిన్ను తమతోఁగూడి సంతోషింపు మందురు. నీవు వారితో సంతోషించినను దుష్టవర్తనులఁ జూచి దేవుఁడు సంతోషింపఁడు.

ఎడారిలోనియరబ్బులు మిగుల నవిశ్వాసులు, మాయావులు. దేవుఁడు తనప్రవక్తకుఁ బంపిన యనుశాసనములు వారికిఁ దెలిసి యుండకపోవచ్చును. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు !

ఎడారిలోనియరబ్బులలోఁ గొందఱు తాము దేవునివిషయమై వ్యయము చేసినదానిని పరిహారముగా లెక్కించుకొని మీయదృష్టము మాఱిపోవుటకును, వేచియుందురు. వారికి హానియే కలుగఁ గలదు. దేవుఁడు శ్రోత, జ్ఞాని.

ఎడారిలోనియరబ్బులలోఁ గొందఱు, దేవుని, తుదిదినమును నమ్మి, భిక్షము పెట్టుటవలన దేవునికిని, ప్రవక్తప్రార్థనలకును చేరువగా నుందు మని తలంతురు. వారు చేరువగనే యున్నారుగదా! దేవుఁడు వారిని దనకరుణకుఁ బాత్రులఁ జేయును. ఔను ! దేవుఁడు దయాళుఁడు.

## అధ్యాయము 13.

100. ముహాజరులలోను, అన్సరులలోను ప్రథములై దారిచూపిన వారును వారియున్నతవర్తనము ననుసరించినవారును, దేవుని జూచి

సంతోషింతురు. దేవుఁడు వారిని జూచి సంతోషించును. వారి కాతఁడు తరంగిణులు ప్రవహించు నుద్యానవనములను సిద్ధము చేసియు న్నాఁడు. వారచట శాశ్వతముగ వసింతురు. ఇదియే పరమానందము.

ఎడారిలోనియరబ్బులలోనిచుట్టు నుండువారలయందుఁ గొందఱు కపటులు. మదీనావాస్తవ్యులలోఁ గొందఱును కాపట్యముతో నిండియున్నారు. ముహమ్మదా! ఇది నీకుఁ దెలియదు. మాకుఁ దెలియును. మేము వారిని రెండుసార్లు శిక్షించినపిదప పెద్దశిక్షకు వారిని వదలివేయుదుము.

ఇతరులు తమతప్పుల నొప్పికొనియు న్యాయకార్యములతో మఱియొకయన్యాయమును గలిపిరి. బహుశః దేవుఁడు వారికి సుముఖుఁడగును. దేవుఁడు క్షమాయుతుఁడు. కరుణామయుఁడు.

వారిని శుభ్రపఱిచి, పవిత్రవంతులఁ జేయుటకై వారిద్రవ్య మునుండి భిక్షమును పరిగ్రహించి వారికొఱకు ప్రార్థింపుము. నీప్రా ర్థనలవలన వారిమనస్సులకు ధైర్యము కలుగును. దేవుఁడు శ్రోత, జ్ఞాని!

తనసేవకులు పరితాపముతో తనవంక దిరిగినప్పుడు దేవుఁడు దాని నంగీకరించి భిక్షను గ్రహించు ననియు, సుముఖుఁడై కరుణించు వాఁ డాతఁడే యనియు, వారికిఁ దెలియదా?

"మీరు మీపనులను చేయుఁడు. దేవుఁడును, నాతని ప్రవక్తయు, భక్తులును నాపనులను జూచుచుందురు. తుదకు బాహ్యా భ్యంతరకార్యములనన్నిటిని దెలిసికొనఁగలవానియొద్దకు మీరువత్తురు. అతఁడు మీరు గావించినవానిఁగూర్చి మీకే తెలియజెప్పును" అనుము.

దేవుఁడు తమ్ము శిక్షించునో, యనుగ్రహించునో యని కొంద ఱాతనితీర్పుకొఱ కెదురుచూచుచుందురు. కాని, దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

దౌర్జన్యమును నవిశ్వాసమును నెలకొల్పి, విశ్వాసులను విడఁదీయుటకును, పూర్వకాలమున దేవునితోడను, నాతనిప్రవక్తతోడను యుద్ధము చేసినవాఁడు తిరిగివచ్చునను నాశతోడను, నొకమసీదును కట్టినవారు కొందఱు కలరు. "మాయుద్దేశము మంచిదే" యని వారు ప్రమాణము చేయుదురు. కాని, వా రసత్యవంతు లైనందుకు దేవుఁడు సాక్షి.

ఆమసీదులో నీవు కాలు పెట్టకుము. ప్రథమదినముననే భక్తితోఁ గట్టఁబడిన యొక మసీదున్నది. నీవు దానిని ప్రవేశింప నర్హుఁడవు. అందు పవిత్రవంతులు కాఁగోరువా రున్నారు. పవిత్రవంతులను దేవుఁడు ప్రేమించును.

దైవభీతిని దైవప్రీతిని పునాదులుగా వేసి యిల్లు కట్టినవాఁడా, వరదలచే సగము కూలిపోయినగట్టుపై నరకాగ్నికి దారి చూపుచున్నదానిని పునాదిగ వైచి కట్టినవాఁడా! వీరిరువురిలో నెవఁడు శ్రేష్ఠుఁడు? అన్యాయవర్తనులకు దేవుఁడు దారి చూపఁడు.

110. వారిహృదయములను చీలికలుగా చీల్చి వైచినఁగాని, వారు కట్టినయిల్లు వారిహృదయములను వేధింపక మానదు. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

## అధ్యాయము 14.

విశ్వాసులకు భోగభూమిని వాగ్దానముచేసి వారిద్రవ్యమును దేహమును దేవుఁడు కొనినాఁడు. వారు దేవునిమార్గమున యుద్ధము చేయుచు, చంపి, చావవలెను. ధర్మగ్రంథమునందును, సువార్త

యందును, కురానునందును, సీవాగ్దానము వ్రాయఁబడియున్నది. దేవుఁడుతప్ప తనమాటను తప్పనివాఁడు మఱెవ్వఁ డుండును ? కావున మీరు చేసికొనినయొడంబడికకై సంతోషింపుఁడు. ఇదియే పరమానందము

దేవునివంకఁ దిరిగి, యాతని సేవించి, స్తుతించి, యుపవసించి, నమ్రులై, సాష్టాంగపడి, న్యాయమును విధించి, యన్యాయమును నిషేధించి, దేవునిమేరలను మీఱక.........కావున విశ్వాసులకీ సువార్తను ప్రకటింపుము.

దేవునితో నితరులను చేర్చినవారు నరకమున వసింపఁగలరని స్పష్టముగఁ దెలుపఁబడినను దేవునికి సమానులఁ గూర్చువారు బంధువులైనను వారికొఱకు ప్రవక్తయు, విశ్వాసులును క్షమాపణను వేఁడరాదు.

ఇబ్రాహీము తనతండ్రికిపూర్వము చేసినవాగ్దానము దొప్పన క్షమాపణ వేఁడెనుగాని, యతఁడు దేవునికి శత్రువని తెలుపఁబడిన తోడనే యాతని విసర్జించెను. ఇబ్రాహీము కనికరము గలవాఁడైనను దయావంతుఁడైనను నిట్లు చేసెను.

ఒకసారి సరియగుమార్గముఁ జూపి, భయహేతువును స్పష్టముగ నిరూపించినపిదప దేవుఁడు జనులను తప్పులోనికి దింపఁడు. నిశ్చయముగా దేవుఁడు సర్వజ్ఞుఁడు.

దేవుఁడు ! స్వర్గమర్త్యాధిపత్య మాతనిదే. చంపువాఁడును, పుట్టించువాఁడును నాతఁడే. దేవుఁడుతప్ప వేఱె పోషకుఁడుగాని, సహాయకుఁడు గాని, నీకు లేఁడు.

ప్రవక్తయు, కష్టసమయములో నాతనినంటియుండిన ముహాజురులు (శరణాగతులు) ను, అన్సరులు (సహాయకులు) ను తమహృదయములధైర్యముచే డీలుపడియున్నప్పుడు దేవుఁడు వారి ననుగ్రహించెను.

అతఁడు వారియెడ దయార్ద్రహృదయుఁడై వారిని కరుణించియుండి నందుననే వారివంకకు దేవుఁడు తిరిగెను.

ముగ్గురు వెనుకనుండి పోయిరి. విశాలమైనభూమి వారికి సన్న గిల్లిపోయెను. అప్పుడు దేవునికోపమునుండి తప్పించుకొనుట కాతఁడే తప్ప వేఱుగతి లేదని గ్రహింపఁగా నాతఁడు వారికిని సుముఖుఁ డయ్యెను. అనుగ్రహించువాఁడును కరుణించువాఁడును దేవుఁడే. వారు తనవంక తిరుగుదురనియే యతఁడును వారివంక దిరిగెను.

## అధ్యాయము 15.

విశ్వాసులారా! దేవునికి భయపడి నిష్కపటులతో నుండుఁడు.

120. మదీనావాస్తవ్యులకును, వారిచుట్టునుండు నరబ్బులకును, దేవునిమార్గమున వారున్నంతకాలమును, దాహముగాని, కష్టము గాని, ఆఁకలిగాని, యుండుటకు వీలులేదు. సత్కార్యమని వ్రాసి యుంచఁబడినవిషయమునఁదప్ప వారవిశ్వాసులకు కోపము తెప్పించుట కొకయడుగైనను వేయ నక్కఱ లేకయుండెను. వారికిశత్రువు వలన నేనష్టమును కలుగ వీలులేకయుండెను. అయినను వారు నిష్కారణముగా దేవునిప్రవక్తను విడిచిపెట్టి యాతనిప్రాణముకంటెఁ దమప్రాణములనే హెచ్చుగాఁజూచికొనిరి. నిశ్చయముగా దేవుఁడు పుణ్యవంతులఫలమును నశింపనీయఁడు.

దేవుఁడు వారు గావించినదానికంటె మంచిబహుమానము నిచ్చుటకై కొలఁదిదైనను, గొప్పదైనను వారుపెట్టినభిక్షలను, వారు దాఁటినప్రవాహములను, యథార్థముగ వ్రాసియుంచును.

విశ్వాసు లందఱు గలిసి యొక్కసారిగా యుద్ధమునకు వెడలఁగూడదు. వారిసైన్యములలోఁ గొన్ని వెనుక నుండిపోయి,

తమమతధర్మములఁగూర్చి ముచ్చటించుకొనుచు, యుద్ధమునకు వెడలిన తమవారు తిరిగి వచ్చినప్పుడు వారు జాగ్రత్తగానుండి దృఢభక్తి పరులై యుండఁ జేరేపింపవలయును.

## అధ్యాయము 16.

విశ్వాసులారా! మీకు దగ్గఱగనుండు నవిశ్వాసులపై యుద్ధమునకు వెడలి, మీరతికఠిను లనుసంగతి వారికిఁ దెలియనిండు. తనకు భయపడువారితో దేవుఁ డున్నాఁడని తెలిసికొనుఁడు.

ఏదేని యొకయాజ్ఞ వచ్చినప్పుడెల్లను వారిలోఁ గొందఱు "ఇది యెవరిభక్తిని వృద్ధిచేసినది" అని యడుగుదురు. అది విశ్వాసులభక్తిని వృద్ధిచేయును. వారు సంతోషింపఁగలరు.

కాని, హృదయరోగపీడితులగువారికి శంకపై శంక పొడము చుండును. వారుభక్తిహీనులుగనే మృతి నొందుదురు.

ప్రతిసంవత్సరమును నొకటి రెండు సార్లు వారికి శోధన కలుగునని తెలియునేకాని, వారు జాగ్రత్తగ నుండరు. తమమార్గమును వీడరు.

ఏదేని యొకయాజ్ఞ వచ్చినప్పుడెల్లను వా రొకరి నొకరు చూచుకొనుచుందురు; వారి నెవ్వరైనఁ జూచినంతనే ప్రక్కకు మఱలిపోవుదురు. వారిహృదయములకు బోధ కలుగలేదు. కావున దేవుఁ డాహృదయములనే ప్రక్కకు మఱలఁజేయును.

ఇప్పుడు మీయొద్దకు మీలోనుండియే యొకప్రవక్త వచ్చి యున్నాఁడు. అతఁడు మీపాపభారమును మోయుచులే కున్నాఁడు. అతఁడు మిమ్మును, విశ్వాసులను, దయతోడను, కరుణతోడను కాఁచికొనియున్నాఁడు.

వారు మఱలిపోయినచో వారితో "నాకు దేవుఁడు చాలును. అతఁడుతప్ప వేఱుదేవుఁడు లేఁడు. అతనినే నేను నమ్మియున్నాను. అతఁడు మహిమోన్నతమగు సింహాసనము నధిష్ఠించి యున్నాఁడు" అనిపల్కుము.

---

# సురా 10 యూనూసు

---

మక్కా-109 పద్యములు-11 రుకూ్కలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లమ్. ర. ఇవియే జ్ఞానగ్రంథమునందలిసూచనలు.

"ప్రజలకు భయసూచనలఁ గొని పొమ్ము. విశ్వాసులగు వారు తమనిష్కాపట్యమువలన సంపాదించుకొనిన ప్రభుసాన్నిధ్య మును బొందఁగల రని సువార్తను బ్రకటింపుము" అని వారిలో నొకరికిఁ జెప్పియుండుట మక్కావాస్తవ్యుల కాశ్చర్య హేతువైనది. అవిశ్వాసులు "వీఁడొక చిల్లంగివాఁడుగా స్పష్టముగఁ గనఁబడు చున్నాఁడుగదా!" అనియందురు.

ఆఱుదినములలో స్వర్గమర్త్యముల సృజియించి—స్వర్గమును పరిపాలించుటకు సింహాసనము నెక్కినదేవుఁడే మీప్రభువు. అతని యనుమతి లేనిదే యెవ్వరు నాతనిమ్రోల పరుల కడ్డుపడఁ జాలరు.

ఇతఁడే నీపభువగు దేవుఁడు. కావున నాతని సేవింపుము. నీ వాలోచించుకొనవేల ?

మీ రందఱును గలిసి యాతనియొద్దకే చేరఁగలరు. దేవుని మాట తప్పదు. అతఁ డొకజీవమును పుట్టించి, తిరిగి తనయొద్దకే తీసికొని, విశ్వసించి, క్రమవర్తనుఁ డైనచో, న్యాయము తప్పక, తగిన బహుమాన మొసగును. కాని, యవిశ్వాసులకు వారియవిశ్వాసమునకై సలసల మఱుగుచున్ననీరును, ఘోరబాధయునే ప్రాప్తము లగును.

ప్రకాశముకొఱకు సూర్యుని, దీపముగఁ జంద్రుని నియమించి, మీరు సంవత్సరములసంఖ్యను, కాలమానమును దెలిసికొనుటకు, వారికి వారిస్థానముల నేర్పఱచినవాఁ డాతఁడే. సత్యముకొఱకే దేవుఁడు దీని నంతటిని సృజించియున్నాఁడు. బోధపఱచుకొనువారికి దేవుఁడు తన సూచనలను స్పష్టముగఁ దెలియఁజేయును.

ఒకటివెనుక నొకటిగ నహోరాత్రములు క్రమముగఁ దిరుగుటయందును, స్వర్గమర్త్యములందు దేవుఁడు సృజించిన సర్వవస్తువులలోను, నతనికి భయపడువారికి స్పష్టసూచన లున్నవి.

మమ్ముఁ జేరదనునాశ లేక, యిహలోక జీవనముతోనే తృప్తినొంది, దానినే నమ్ముకొని, మాసూచనలను లక్ష్యపెట్టని వారే తమకార్యములకు ఫలితముగ నగ్నిలో వసింపఁగలరు.

కాని, విశ్వసించి, క్రమవర్తనులగువారిభక్తికై దేవుఁడు వారిని సరియగు త్రోవను నడిపించును. నందనవనములందు వారికాళ్ళదరిని తరంగిణులు ప్రవహింపఁగలవు.

10. అచట వారు, "దేవా! నీవు మహిమాన్వితుఁడవు కమ్ము" అనుచు నొకరి నొకరు "శాంతి రస్తు" అని యభినందించుకొందురు. "సర్వజీవాధినాథుఁడగు దేవుఁడు స్తవనీయుఁ డగుఁగాక!'' యని వారి ప్రార్థనల ముగింతురు.

## అధ్యాయము 2.

నరులు మేలు పంపుమని త్వరపడినట్లు దేవుఁడు కీడు పంపినచో వారు నాశనమయియే యుందురు. మమ్ముఁ జేర నాసింపనివారి నిక్లే తమతప్పులతో తడఁబడుచుండనిచ్చెదము.

మనుష్యునికి కష్టమంటినపు డాతఁడు పరుండియో, కూర్చుండియో, నిలుచుండియో మొఱలిడును. మేము దానిని తీసివేసినంతనే యాకష్టము తన్నంటియుండనట్లే యాతఁడు నడిచి పోవును. ఉల్లంఘనాపరులకార్యము లిక్లే మందుగనే యేర్పఱుపఁబడియున్నవి.

మీకుపూర్వ ముండినతరములవారు దుష్టవర్తనులై యుండఁగా వారిపవిత్రవక్తలు వారిసందేశములనుగూర్చిన స్పష్టసూచనతో వచ్చినను, వారునమ్మకుండుటచే మాచే నాశనము నొందిరి. దుష్టుల కిట్టిబహుమానము నే యొసగెదము.

మీ రెట్లు సంచరింతురో చూడవలెనని వారివెనుక మిమ్ము భూమిపై నిలిపితిమి.

కాని, మాస్పష్టసూచనలు తెలుపఁబడిన వారు మమ్ముఁ జేర నాసింపక "ఈకురాను గాక మఱియొక కురానును దీసికొని రమ్ము. లేదా, దీనిలోనే మార్పులు చేయుము" అందురు. "నాయిష్టము వచ్చినట్లు నేను మార్పుచేయవీలులేదు. నాకుఁ దెలుపఁబడినదానినే నేను ప్రకటించెదను. నేను నాప్రభువుపైఁ దిరుగఁబడినచో గొప్ప శిక్షకుఁ బాత్రుఁడ నగుదుననుభయము నాకుఁ గలదు.

"దేవునికిష్టమైనచో, నేను మీకు దీనిని పఠించుటగాని, బోధించుటగాని చేసియుండను. ఇది నాకుఁదెలియక పూర్వమెన్నియో సంవత్సరములు మీతోడనే యుంటిని. మీకు బోధపడలేదా?" అని యనుము,

దేవునిపైనసత్యము కల్పించువాఁడును, మాసూచన లసత్యము లనువాఁడును గాక యన్యాయపరుఁ డెవ్వఁ డుండును ? దుష్టు లెన్నఁడును వృద్ధిఁబొందరు.

దేవునిఁగాక, వారు తమకు మేలుగాని కీడుగాని చేయఁజాలని వానిని పూజించుచు, "వీరే దేవునిమ్రోల మాపక్షమున మాట్లాడు వారు" అని యందురు. వారితో "స్వర్గమర్త్యములలో దేవునికిఁ దెలియనిదాని నాతనికిఁ దెలుపుదువా ? ఆతఁడు స్తుతింపఁబడుఁగాక ! వా రాతనితోఁ జేర్చుదైవములకంటె నాతఁ డున్నతుఁడై యుండుఁ గాక!" అనుము.

తొలుత మనుష్య లోకమేమతము నవలంబించి యుండిరి. తరువాత వారిలో భేదాభిప్రాయములు కలిగెను. విశ్రాంతినిగూర్చిన యాజ్ఞ యిదివఱకే తెలుపఁబడక యుండినచో వారివివాదము లప్పుడే పరిష్కరింపఁబడి యుండును!

20. వారు "అతని ప్రభువునుండి యొకసూచన యతనికి చేరుచో ......" అని యందురు. వారితో "రహస్య మంతయు దేవుని యొద్దనే యున్నది. కావున వేచియుండుఁడు. వేచినవారితోఁగూడ నేను మీయొద్దనే యుందును" అనుము.

## అధ్యాయము 3.

వారి కొకయాపద యంటియుండఁగా మేము వారికి మాకరుణను కొంచెము రుచి చూపితిమి. అయినను వారు వెంటనే మాసూచనలపై పన్నాగములు పన్న నారంభించిరి. "దేవుఁడు మీకంటె శీఘ్రముగ పన్నాగములను పన్నఁగలఁడు! మాదూతలు మీకుట్రలను వ్రాసి యుంచుచు నేయున్నారుగదా!" అని యనుము.

అనుకూలవాయువువీచుటచే సంతోషించుచు, సముద్రముపై నావలలోను, భూమిమీఁదను ప్రయాణముచేయ శక్తినిచ్చినవాఁ

డాతఁడే. కాని వారి కెదురుగాలి తగిలినప్పుడు తుపాను పట్టి, కెరటము లన్ని వంకలనుండియు వచ్చుచుండఁగా దానిలో తగుల్కొంటి మని తలంచి, వారు నిష్కాపట్యముగ మతమునవలంబించినట్లు నటించి "నీవు మమ్ము దీనినుండి తప్పించినచోఁ గృతజ్ఞులమై యుండెద" మని దేవునికి మొఱలిడుదురు.

మేమును వారిని రక్షించినంతనే భూమిపై మిక్కుటముగ నక్రమముల నాచరింతురు. జనులారా! మీ రీయల్లరులఁ జేసి యానందించుట యిహలోకమందే సుఁడీ! మీరు వేగముగ మమ్ముఁ జేరుదురు; మీరు చేసినదాని నప్పుడు మేము మీ కెఱిఁగించెదము.

ప్రస్తుతజీవనము, మేము స్వర్గమునుండి పంపిననీటిని, మనుష్యులును పశువులును తినుట కుంచిన సస్యములనునే గదా పోలియున్నది. భూమి మరల తన బంగారుదుప్పటమును గప్పికొని యలంకరించుకొనును. అంతట దానిపై నుండువారు దానికి తామే యధికారుల మనుకొందురు! కాని, రాత్రిపూఁటనో పగటి పూఁటనో మాయాజ్ఞ వచ్చినంతనే, దాని నంతటిని కోసివేసినదాని వలెను, నిన్ననే బయలుదేఱినదానివలెను, జేసివేసెదము. ఆలోచించు కొనువారికి మాసూచనల నిట్లే స్పష్టపఱిచెదము.

దేవుఁడు శాంతిస్థానమునకుఁ బిలుచుచున్నాఁడు. తన కిష్టమైనవారిని క్రమమార్గమున నాతఁడు నడపును.

మంచిచేయువారికి మంచితనమును, దానియభివృద్ధియుఁ గలుగును. వారిమొగములు నల్లఁబడవు. లజ్జావృతములు కానేరవు! వీరే శాశ్వతముగ భోగభూమిలో వసింపఁగలవారు.

కీడు చేసినవారికి సైతము తగినఫలితము చేకూఱఁగలదు. వారిని లజ్జ యావరించును. వారిమొగములు రాత్రి చీఁకటిచే నల్లబడిన ట్లుండఁగా వారికి దేవునిపై నెవ్వరు సహాయముచేయుదురు? వీరు శాశ్వతముగ నగ్నిలో వసింపవలయును.

ఆదినమున వారినందఱి నొకచోఁ జేర్చి, వారిలో దేవునితో నితరదైవములఁ జేర్చినవారితో "మీరును, మీరు చేర్చినదైవములును, మీస్థానములకు పొండు" అని వారిని విడఁదీయఁగా వారి దైవములు "మీరు మమ్ము కొలువలేదు.

"మీకును మాకును దేవుఁడే సాక్షి. మీపూజలను మేము లక్ష్యపెట్టనే లేదు" అని యందురు.

30. అచటఁ బ్రత్యాత్మయుఁ దాను ముందుగఁ బంపుకొనిన దానింగూర్చి సాక్ష్య మిచ్చినపిదప, తమ సత్యప్రభువగు దేవుని మ్రోలకు రాఁగా వారిదైవములు వారి కదృశ్యులగుదురు.

అధ్యాయము 4.

"స్వర్గమర్త్యములనుండి సర్వమును మీ కిచ్చువాఁ డెవ్వఁడు? వినుటకును చూచుటకును నెవని కధికార మున్నది? చచ్చిన వారినుండి బ్రతికినవారిని, బ్రతికినవారినుండిచచ్చినవారిని దెచ్చువాఁ డెవ్వఁడు? సర్వమును పాలించువాఁ డెవ్వఁడు?" అని నీవడుగ వారు "దేవుఁడే" యని యందురు. వారితో "ఏమి! అయిన నాతనికి భయపడరా?

"ఈదేవుఁడే సత్యముగ మీప్రభువు. సత్యము గతించిన పిదప నసత్యమేకదా మిగులును? అయిన మీ రింతటిదుష్టు లెట్లయితిరి?" అని పల్కుము.

'దుష్టుల నమ్మకుందురుగాక' యనుదేవునిమాటయిట్లేజరిగినది.

"మీరు దేవునితోఁ జేర్చుదైవములలో నెవ్వఁడైన నాతనిఁ వలె తొలుత నొకనినిఁ బుట్టించి తిరిగి తనయొద్దకుఁ జేర్చికొనఁ గలఁడా? దేవుఁడు జీవముల సృష్టించి, మఱల తనయొద్దకు చేర్చి కొనఁగలఁడు. అయినను మీరు ప్రక్కకు మఱలిపోయితిరేల?

"మీరు దేవునితోఁ జేర్చినదేవతలలో నెవ్వరైన మిమ్ము సత్యములోనికిఁ ద్రిప్పగలరా? దేవుఁడు సత్యములోనికిఁ ద్రిప్పఁగలఁడు. సత్యములోనికి మిమ్ము నడుపువాఁడా, లేక, తానే నడుపఁబడకుండినచో నడువలేనివాఁడా, యనుసరణీయుఁడు? మీ రిట్లు తలంచుటకు మీ కేమిమూడినది" అని పల్కుము.

వారిలోఁ జాలమంది యొక్కయూహనే యనుసరింతురు. ఊహ యెన్నటికైన సత్య మగునా? వారు చెప్పునది దేవుని కెఱుక యే కదా?

ఇదిగాక యీఖురానును దేవుఁడుతప్ప మఱెవ్వఁడు కల్పింపఁ గలుగును? ఇది పూర్వము తెలుపఁబడినదానిని స్థిరపఱుచుటకును, దివ్యగ్రంథములయర్థమును విప్పి చెప్పుటకును, నిస్సందేహముగ సర్వజీవాధినాథుఁడగు దేవునినుండి వచ్చినది.

"ఆతఁడేనా దీనిని గల్పించెను?" అని వా రందు రేని వారితో "అయిన నట్టి సురాను నీవు తీసికొని రమ్ము. నీవు సత్యవంతుఁడ వైనచో దేవునిఁగాక మఱెవ్వనిఁ బిలిచెదవో పిలువుము" అనుము.

కాని, వారు జ్ఞానులై యవలంబింపనిదాని కసత్యదోషమును కట్టిపెట్టిరి. వారికి దానివ్యాఖ్యానమును మే మీయక పూర్వమే వా రిట్లనిరి. ఇట్టే వారిపూర్వులును నది కృత్రిమమను నింద వైచిరి. కాని యన్యాయవంతులగతి ఏమయ్యెనో చూడుము!

40. వారిలోఁ గొందఱు దానిని నమ్ముదురు; కొందఱు నమ్మరు. నీప్రభువున కుల్లంఘనాపరు లెవ్వరో తెలియును.

## అధ్యాయము 5.

నిన్ను వారు కృత్రిముఁ డనినచో "నాపని నాది, మీపని మీది! మీరు చేయుదానితో నాకు జోక్యము లేదు. నేను చేయు దానితో మీకు జోక్యములేదు" అని యనుము.

వారిలోఁ గొందఱు నీకు వెంటనే చెవియొగ్గుదురు. చెవిటి వారికి బోధపడకున్నను వినునట్లు చేయుదువా ?

వారిలోఁ గొందఱు నీవంక చూచెదరు. అంధులకు కనఁబడ నప్పుడు వారికి దారి చూపఁగలవా ?

దేవుఁడు మనుష్యుల కెందును హాని చేయఁడుగదా! వారు తమకుఁ దామే హాని చేసికొందురు.

ఇది గాక, ఆదినమున నాతఁడు వారి నందఱి నొకచోఁ జేర్చును. వారు దినములో నొకగంటమాత్రమే వేచియుండినట్లు గాన్పింతురు. వా రొకరి నొకరు పోల్చికొందురు. దేవునిఁ గలిసికొను టనుగూర్చి నమ్మకుండినవారును, సరియగురక్షణ నొందనివారును నిప్పుడు నశింతురు గాక !

మాభయసూచనలఁ గొన్నిటిని మేముజరుపునప్పుడు మిమ్ముఁ జూడఁజేసినను, మిమ్మే మొదట మాయొద్దకు చేర్చికొనినను, వారు మాయొద్దకే వచ్చి చేరుదురు. అప్పుడు వారు చేయుదానికి దేవుఁడు సాక్ష్య మీయఁగలఁడు.

ప్రతిప్రజకును నొకప్రవక్త వచ్చెను. వారిప్రవక్త వచ్చినం తనే సరియగుతీర్పు వచ్చి, యెవరికి నేయన్యాయమును గలుగ దయ్యెను.

అయినను వారు "ఈభయపెట్టున దెప్పుడు వచ్చును? నీవు సత్యము వచించినచోఁ జెప్పుము" అని యందురు.

50. "దేవునియిష్టమేకాని, నాసుఖదుఃఖములపై నా కధికారము లేదు. ప్రతిజాతికిని నొకనిర్ణీతకాల ముండును. వారికాలము రాఁగానే, దాని నొకగంట ముందుకుగాని, యొకగంట వెనుకకుగాని, జరుపఁజాలరు.

"మీా రేమి తలంచుచున్నారు! రాత్రియో, పగలో, దేవుని శిక్ష వచ్చినచో, దానిలో నేభాగమునైనను దుష్టులు త్వరపెట్టఁగలరా?

అది మీాపైఁబడినతరువాతనా నమ్మెదురు? అప్పు డప్పుడే మీారు నమ్మెదరు. ఇంకను నది వేగముగ వచ్చుటనుగూర్చి మీారు విశ్వసింపరైతిరి" అని వానితో ననును.

అప్పు డుల్లంఘునాపరులతో "శాశ్వతశిక్ష ననుభవింపుఁడు. మీాకర్మల కనుగుణముగఁ గాక యితరవిధముగా మీాకు ఫలము గలుగునా?" యని చెప్పఁబడును.

ఇది సత్యమేనా యని వారు నిన్ను తెలుపఁగోరుదురు. "అవును నాప్రభువునాన నిదియే సత్యము. మీా రాతనిబలమును తగ్గింపలేరు" అని వారితో ననుము.

అధ్యాయము 6.

పాపముచేసిన ప్రత్యాత్మయును భూమిపై నున్నదంతయుఁ దన కున్నయెడల దానిని తనపాపమునకు పరిహారముగా నిచ్చివేయఁదలంచును. శిక్ష కంటఁబడినతరువాత వారు పరితపించెదరు. వారికి సరియైనతీర్పే వచ్చును. వారి కేయన్యాయమును జరుగదు.

స్వర్గమర్త్యములం దున్నదంతయు దేవునిదే కదా? దేవుని మాట సత్యము కదా? కాని చాలమంది కది తెలియదు.

అతఁడే జీవింపఁజేయువాఁడును, చంపువాఁడును. అతనియొద్దకే మీరు చేరుదురు.

మనుష్యులారా! మీహృదయరోగముల కౌషధమును, విశ్వాసులకు రక్షణోపాయమును, కరుణాప్రధానమగు భయసూచన మీకు మీప్రభువునుండి యిపుడు వచ్చినది.

"ఇది దేవునియనుగ్రహమువలనను దయవలనను గలిగినది. వారు దీనితో నానందము నొందుదురుగాక! మీకు గణించినదాని కంటె నిది శ్రేష్ఠము.

"మీ రేమనుకొనుచున్నారు? మీ కాహారముగా దేవుఁడు పంపినదానిలో ధర్మవిహితము ధర్మేతరము నని భేదముఁ గల్పించుచున్నారా? దేవుఁడు మీ కనుమతి నిచ్చెనా? లేక మీకు మీరే దేవునిపక్షమునఁ గల్పించుచున్నారా?" అని వారి నడుగుము.

60. దేవుని కసత్యదోష మంటఁగట్టువారు రక్షణదినమున నేమని తలంతురో! నిశ్చయముగా దేవుఁడు మనుష్యులకు వరముల నిచ్చి యున్నాఁడు. కాని, వారిలోఁ జాలమంది కృతజ్ఞులుగానుండరు.

అధ్యాయము. 7.

మీ రేపనిలో నున్నను, కురానులో నేయధ్యాయము జదువుచున్నను, ఏకార్యమును జేయుచున్నను, మీ రాయాపనులను జేయుచున్నప్పుడు మేము చూచుచునే యుందుము. స్వర్గమర్త్యములలో నొకయణువైనను మాప్రభువును తప్పించుకొనఁ జాలదు. ఇంతకు తక్కువదిగాని హెచ్చుదిగాని స్పష్టగ్రంథములో లేనిది మఱెచ్చటను లేదు.

ఏభయముగాని, యేదుఃఖముగాని లేనివారే కదా దేవునికి స్నేహితులు.

దేవుని నమ్మి యాతనికి భయపడువారికి,

ఇహలోకముననుబరలోకముననుసువార్త వచ్చును. దేవుని వాక్యములలో మాఱున దేదియును లేదు. ఇదియే పరమానందము.

వారిసంభాషణకు నీవు చింతిల్లకుము. దేవుఁడే సర్వశక్తుఁడు. శ్రోతయు జ్ఞానియుఁ నాతఁడే!

స్వర్గమర్త్యములం దున్నవారందఱును, దేవునికి లోఁబడి యున్నవారే కదా? దేవునిఁగాక, యతనితో నితరదైవములఁ జేర్చు వారు దేని ననుసరింతురు? వారు తమయూహానే యనుసరింతురు. వా రసత్యవచనులు.

విశ్రాంతికొఱకు రాత్రిని, వెలుతురుకొఱకు పగటిని నిర్ణయించినవాఁ డాతఁడే. వినువారి కిందే సూచన లున్నవిగదా!

వారు "దేవునికి సంతాన మున్నది" అందురు. అతని మహిమయాన! ఇది సత్యము కాదు. అతని కతఁడే చాలును. స్వర్గమర్త్యములయం దున్నదంతయు నాతనిదే! నీ వట్లనుటకుఁ బ్రమాణ మున్నదా? ఏమి! మీకు తెలియనిదానినే దేవునిఁగూర్చి పల్కెదరా?

"దేవునిఁగూర్చి యీయసత్యము పల్కువారికి శ్రేయస్సు కలుగదు" అనుము.

70. వా రీలోకములో కొంతకాలమే యుండెదరు! పిదప మమ్ముఁ జేరుదురు. వా రవిశ్వాసులైనందుకు వారికి ఘోరబాధను రుచి చూపెదము.

అధ్యాయము 8.

"నాప్రజలారా! నేను మీతోనుండి, మీకు దేవునిసూచనలను తెలుపుట కష్టముగ నుండవచ్చును. కాని, నేను దేవుని నమ్మి

యున్నాను. కావున నెన్నికుట్రలఁ బన్నెదరో పన్నుఁడు. ఎంతమంది యసత్యదేవతలను దెచ్చెదరో తెండు. మీరు చేయనెంచినదానిని రహస్యముగఁ జేయకుఁడు. పిదప నాలస్యము సేయక నాయొద్దకు రండు. తీర్పు చెప్పెదను.

"మీరు నాకు వెనుద్రిప్పినచో నా కేమియుఁ గానుక నీయనక్కఱ లేదు. దేవుఁడే నాకు బహుమాన మీయఁగలఁడు. నేను దృఢభక్తుఁడనుగా నుండవలెనని యాజ్ఞ యైనది" అని నుహు చెప్పెను.

కాని, వా రాతని నసత్యవంతునిగఁ బరిగణించిరి. కావున నాతని, నాతనితో నావయందున్న వారిని మేము రక్షించి, తక్కినవారు చచ్చినను వీరిని బ్రదుకనిచ్చితిమి. మాసూచన లసత్యములనువారిని నీట ముంచి చంపితిమి. ఈభయసూచనఁ గొన్నవారిగతి యేమయ్యెనో చూడుము. నుహుచరిత్రమును వారికిఁ దెల్పుము.

అతనితరువాత మేము వారిప్రజలయొద్ద కానవాళ్ళతోఁగూడఁ బ్రవక్తలఁ బంపితిమి. కాని, వారు తాము పూర్వము నిరాకరించిన దాని నిప్పుడైనను నమ్మరైరి. అట్లే యుల్లంఘనాపరులహృదయము లకు మూఁతలు వైచెదము!

వారితరువాత, ఫిరౌనునొద్దకును, నతని సామంతులయొద్ద కును, మాసూచనలతో మూసా, హారూనులను బంపితిమి. కాని, వారు గర్వితులును దుష్టులును నైరి.

వారికి మాసత్యమును దెలుపఁగా "ఇది కేవలము చిల్లంగియే" యనిరి.

"ఏమి! మీకు సత్యము తెలిసినపిదపఁగూడ 'ఇది చిల్లం గియా' యని యడిగెదరా? చిల్లంగివా రభివృద్ధి నొందరు" అని మూసా పలికెను.

వారు "ఏమి! మమ్ము మాతండ్రులమతమునుండి తప్పించి మీ రిద్దఱును మ మ్మేలుటకా నీవు వచ్చినది?" యని యడిగిరి.

ఫిరౌను "నేర్పరులగు నైంద్రజాలికులఁ బిలిపింపుఁ" డనఁగా నైంద్రజాలికులు వచ్చిరి.

80. వారితో మూసా "మీరు క్రింద నేమి త్రోయుదురో త్రోయుఁడు" అనెను.

వారు వానిని క్రిందికి త్రోయఁగా మూసా "మీరు చేసిన చిల్లంగు లన్నిటిని దేవుఁడు వృథ చేయును. దుర్మార్గులకార్యములను దేవుఁడు పెంపొందింపఁడు.

భక్తిహీనుల కిష్టము లేకున్నను దేవుఁడు తనమాటలచే సత్యమును బరీక్షించును.

## అధ్యాయము 9.

మూసాజాతిలోఁ గొందఱు తప్ప నందఱును, ఫిరౌనును, నాతనిసామంతులును తమ్ము బాధింతురేమో యని జడిసి యతనిని నమ్మలేదు. ఫిరౌను తనదేశమునందు బలవంతుఁడై యనేకదుష్కార్యములఁ జేయుచుండెను.

మూసా తనప్రజలతో "ప్రజలారా! మీరు దేవుని నమ్మినచో, దృఢభక్తులైనచో నతనినే నమ్మి యుండుఁ" డనెను.

వారు "మేము దేవునే నమ్మియున్నాము. ప్రభువా! ఈ యన్యాయపరులు మమ్ము శోధించునప్పుడు మమ్ము విడనాడకుము.

మమ్ము కరుణించి యవిశ్వాసులబారినుండి తప్పింపుము" అనిరి.

అప్పుడు మూసాకును, నతనిసోదరునకును "మీప్రజలకు మిసిరుదేశములో గృహముల నేర్పఱిచి, మీయిండ్లలో నొక 'కిబ్లా'

నేర్పఱచి, ప్రార్థనలు సల్పుచు, విశ్వాసులకు సువార్తను ప్రకటింపుఁడు" అని తెలియఁ జేసితిమి.

మూసా "ప్రభువా! ఫిరౌనునకును, నతని ప్రజలకును, నిహలోకమున సిరియు సంపదయు నొసగితివి. వారు నీత్రోవను తప్పియుండుట కేకదా యట్లు చేయుట? ప్రభువా! వారిసంపద వారిని చీకాకుపెట్టుఁగాక! ఘోర బాధ వారికంటి కగపడువఱకును వారు విశ్వసింపకుండునట్లు వారిహృదయములకుఁ గాఠిన్యముఁ గూర్పుము" అనెను.

ఆతని ప్రభువు "మీయిరువురి ప్రార్థనయు వినఁబడినది. తిన్నని మార్గము ననుసరింపుఁడు. అజ్ఞానులమార్గమును విసర్జింపుఁడు" అని మూసాతోఁ బల్కెను.

90. మే మంతట నిస్రాయేలుపుత్త్రులను సముద్రముపై గడపుచుండఁగా ఫిరౌను తనసైన్యములతో శత్రుత్వమువహించి వెంబడించెను. అప్పు డాతని నీట ముంచఁగా నాతఁడు చనిపోవుచు "ఇస్రాయేలుపుత్త్రులు నమ్ము దేవుఁడుతప్ప వేఱు దేవుఁడు లేఁ డని నేను నమ్ముచున్నాను. నేను దైవాధీనుఁడ నైనాను" అనెను.

"అవును, ఇప్పు డయినావు. ఇంతకు పూర్వము మాపైఁ దిరుగఁబడి దుష్టులలోఁ జేరియుంటివిగదా!

"నీతరువాత వచ్చువారి కొకసూచనగా ని న్నిప్పుడు నీదేహముతో రక్షింతుము. అయినను చాలమంది మాసూచనలను లక్ష్య పెట్టరు" అని దేవుఁడనెను.

## అధ్యాయము 10.

ఇదిగాక మే మిస్రాయేలుపుత్త్రులకు స్థిరవాస మేర్పఱిచి, సకలసద్వస్తువుల నిచ్చితిమి. వారికి మాయనుశాసనము చేరువఱ

కును వారు తగవులాడలేదు. వారిభేదకారణముంగూర్చి నీప్రభువు రక్షణదినమున తీర్పు చెప్పంగలండు.

మేము నీకు పంపినదానింగూర్చి సందేహము లున్నయెడల నీకుపూర్వము పవిత్రగ్రంథములం జదివినవారి నడిగి తెలిసికొనుము. ఇప్పుడు నీప్రభువునుండి సత్యము చేరియున్నది. కావున శంకాపరు లలోం జేరకుము.

దేవునిసూచనల కసత్యారోపణముం జేయువారిలోంగూడ నీవు చేరకుము. అట్లు చేసినచో నశించినవారితోం జేర్పంబడుదువు.

దేవుని యాగ్రహమునకుం బాత్రులయిపోయినవారు మఱి నమ్మరుగదా !

వారి కన్నివిధముల సూచనలు వచ్చినను, ఘోరబాధ కంటం బడువఱకును వారు నమ్మరు !

మఱియొకరీతిగ నయినచో, విశ్వసించినప్రతినగరమును, తన మతములోనే యుండి రక్షణ నందియుండును. ఒక్క- యూనూసు ప్రజలే యట్టిరక్షణ నొందిరి వారు విశ్వసింపంగనే యిహలోక మున వారికి విధింపంబడినలజ్జనుండి వారిని విడిపించి కొంతకాలము వారికిం గావలసినదంతయు నొసగితిమి.

నీప్రభున కిష్టమైనచో భూమిలో నున్నవారందఱును విశ్వ సించియే యుందురు. ఏమి ! మనుష్యులను విశ్వాసులు కమ్మని నిర్బంధించెదవా ?

100. దేవునియనుమతి లేనిదియు నేయాత్మయు విశ్వసింపంజాలదు. బోధపఱుచుకొనని వారిపై నాతండు క్రోధము బూనును.

"స్వర్గమర్త్యములలో నున్నదానినంతటిని విచారింపుము. సూచ నలుగాని, సూచనలం దెల్పువారుగాని, నమ్మనివారి కేసహాయమును జేయంజాలవు " అనుము.

వారిపూర్వులకుఁ గలిగినక్రోధదినములను తప్ప, వారు మఱేమి యాసింపఁగలరు? "వేచి యుండుఁడు. మీతో నేనును వేచియుండెదను" అనుము.

అప్పుడు మేము ప్రవక్తలను, విశ్వాసులను విడిపించెదము.

## అధ్యాయము 11.

"మనుష్యులారా! మీరు నామతమును నమ్మని యెడల దేవునిప్రక్క మీ రారాధించునితర దైవములను నేను కొలువను. మిమ్ము చంపఁగలదేవుని కొలిచెదను. నేను విస్వాసినై యుండ వలసినదని యాజ్ఞయయినది.

నిశ్చలభక్తియుతుఁడవై సత్యమతమువంక మొగము త్రిప్పుము. దేవునితో నితరదైవములఁ జేర్చువారితోఁ జేరకుము.

దేవునిగాక నీకు మేలుగాని, కీడుగాని చేయఁజాలనిదాని నావాహన చేయకుము. నీ వట్లు చేసినచో నన్యాయవంతులలోఁ జేరిపోవుదువు.

దేవుఁడు నీకు కష్టము నంటఁజేసినచో, దానినుండి నిన్ను తప్పింపఁగలవాఁడు దేవుఁడు తప్ప మఱి యెవ్వఁడు నుండఁబోఁడు. అతఁడు నీకు మేలు చేయనెంచినచో నాతనియనుగ్రహము నెవ్వరును దప్పింపఁజాలరు. ఆతఁడు తనవరములను తా నెంచికొనినసేవకులకుఁ బ్రసాదించును. అతఁడు దయాదాక్షిణ్య మూర్తి!

"జనులారా! మీప్రభువునుండి సత్య మిపుడు మీకు చేరినది. రక్షణ గోరువా రారక్షణను తనమేలుకొఱకే కోరుకొందురు. తప్పిపోయినవాఁ డారక్షణకొఱకే తప్పిపోవును. నేను మీసంరక్షకుఁడను గాను" అనుము.

మీకు తెలుపఁబడినదాని ననుసరింపుఁడు. దేవుఁడే న్యాయ

కర్తలలో శ్రేష్ఠుఁడు! కావున నాతఁడు తీర్పు చెప్పువఱకును, పట్టుదలతో నుండుఁడు.

# సురా 11 హూదు.

మక్కా—123 పద్యములు—10 రుక్కూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లమ్. ర. నీవు దేవునితప్ప నితరుల నారాధింపకుండుటకును,

అతని క్షమాపణవేఁడికొని యాతనివంక తిరుగుటకును, సందేశహారినై బుద్ధిమంతుఁడును, సర్వజ్ఞుఁడు నగునాతనిచే స్పష్టముగ విశదముచేయఁబడి,

జ్ఞానాధిష్ఠితమైన గ్రంథమును చేత నుంచుకొని వచ్చియున్నాను.

కొంతకాలమువఱకు నీ కాతఁడు మంచిసౌఖ్యముల నొసగును. అతనిప్రసాదమునుబడయ నర్హులగువారి కాతఁడు తనవరముల నొసగును. కాని, నీవు వెనుకకుఁ దిరిగినయెడల నామహాదినమునఁ గలుగఁబోవుశిక్షను నీవును బొందుదువేమో యని భయపడుచున్నాను.

మీరు దేవునియొద్దకు తిరిగి రావలయును. అన్నివస్తువులపైనను నాతని కధికారము గలదు.

వా రాతనినుండి దాఁగియుండుటకు తమవక్షఃస్థులను ద్విగుణముగా ముడిచికొనియుండరా ?

వారు తమయొడలినిండ వస్త్రములఁ గప్పికొనినను, తాము దాఁచినదానిని పైకిఁజూపుదానినిగూడ నాతఁ డెఱుఁగఁడా ? వారిహృదయములందు మూలమూలల నేమున్నదో యాతనికిఁ దెలియును.

# కాండము 12

---

భూమిపైఁ జరించుజీవములలో నాతనిపై నాధారపడనిది లేదు. దాని యాటపట్టులును తుదివిశ్రాంతిస్థానమును నాతనికిఁ దెలియును. స్పష్టగ్రంథమున నంతయు నున్నది.

ఆఱుదినములలో స్వర్గమర్త్యముల సృజించినవాఁ డాతఁడే. ఇంతకుఁబూర్వ మాతనిసింహాసనము నీళ్ళపై నిలిచియుండెను. దానినుండి మీలో నెవ్వరు సత్కర్మల నాచరించి మించెదరో యాతఁడు తెలిసికొనెను.

10. "మృతినొందినపిదప మీరు తిరిగి లేచెద" రని నీవు చెప్పినచో నవిశ్వాసులు నిశ్చయముగా "ఇది కేవలము చిల్లంగి" అని యందురు.

మేము వారిశిక్షను కొంతకాలము నిలిపినయెడల "ఏమి, ఆశిక్ష వెనుకఁబడినదేమి ?" అని వారడుగుదురు. ఓహో! తప్పించుకొనలేనిదినము వచ్చుచునేయున్నది గదా ! వారు పరిహసించినదే త మ్మన్నిదిక్కుల నావరింపఁగలదు.

## అధ్యాయము 2.

మేము మనుష్యుని మాదయ నాస్వాదింపఁజేసి, దానిని తిరిగి లాగికొనినయెడల నాతఁడాశవిడిచి కృతఘ్నుఁడగుచున్నాఁడు.

అతఁడు కష్టముల ననుభవించినపిదప మాప్రసాదమును బడసినచోఁ దనకు కష్టములు తొలఁగిపోయినవని సంతోషించుచున్నాఁడు. ఆనందించుచు డాంబికుఁడగుచున్నాఁడు.

ఓర్పుతో సహించి క్రమవర్తనులగువారట్లు కారు. వారు క్షమాపణకొఱకును, గొప్పబహుమానముకొఱకును నెదురుచూచుచున్నారు.

బహుశః నీకుఁ దెలియఁబఱిచినదానిలో నీవు కొంత దాఁచివైచెదవు కాఁబోలు! "అతనికి ధనము పంపఁబడకపోయినను, అతనితో నొకదేవత వచ్చినను.........." అని వారందురేమో యని నీహృదయము చింతిల్లుచున్నదేమో. కాని, కేవలము భయసూచన నిచ్చుటయే నీపని. సర్వమును దైవాధీనమే.

"కురా నాతఁడు కల్పించినదే" యని వారనినచో నీవు "మీకుఁ బ్రజ్ఞగలదేని దానిలోనిపద్యములవంటివానిని పదింటిని చేసితిరేమో తీసికొనిరండు. మీరు సత్యవంతులరే యైనచో దేవునిగాక మఱెవ్వని సహాయము తెచ్చికొందురో తీసికొని రండు" అని పలుకుము.

కాని, వారు నీకుఁ బ్రత్యుత్తర మీయనిచో నది దేవుని బుద్ధివిశేషమువలననే నీకుఁ బంపఁబడిన దనియు, నతఁడు తప్ప నితర దైవము లేఁడనియుఁ దెలిసికొనుము. వారు నిజమైనభక్తులేనా?

ప్రస్తుతజీవనమునందు కష్టములను గోరువారికి, తమకుఁ దగినబహుమాన మిత్తుము. వారికి రావలసినదానిలో నిసుమంతయుఁ దగ్గింపము.

వీరికిఁ బరలోకమున నగ్ని తప్ప మఱియొకగతి లేదు. వారు ప్రస్తుతజీవితమునం దొనర్చిన దంతయు వృథ యగును. వారికర్మ లన్నియుఁ బనికిరాని వగును.

29. తమప్రభువునుండి స్పష్టమగు సాక్ష్యముపై నాధారపడిన వారును, ఒకసాక్షివలన కురానును వినువారును, రక్షణోపాయమును దయాచిహ్నమును నగు మూసాగ్రంథము నంతకుపూర్వమే చేకొనిన వారును, వీరితోఁ బోల్పఁ దగుదురా ? వారి కిందు విశ్వాస మున్నది. కాని, యవిశ్వాసులకును, విగ్రహారాధనాపరులకును నగ్నిభయము కలుగుచున్నది. ఆగ్రంథము నీప్రభువుపంపినసత్యముతో నిండి యున్నది. కావున దానినిగూర్చి సందేహములను గట్టిపెట్టుము. అయినను చాలమందికి నమ్మకము లేదు.

దేవునిగూర్చి యసత్యమును గల్పించినవానికంటె నధర్మపరుఁ డెవఁడుండును ? వారు ప్రభుప్రమోలకుఁ దేఁబడినప్పుడు సాక్షులు "వీరే తమప్రభువు నసత్యవంతునిగఁ బరిగణించినవారు" అని పలుకుదురు.

ఇతరులను దేవునిమార్గమునుండి తప్పించి, యామార్గమును వంకరచేసి, రాఁబోవుజన్మమునందు నమ్మకములేని యాయధర్మవర్తనులపై దేవునియాగ్రహ ముండదా ? దేవునికి మర్త్యముపైఁ గల యధికారమును వారు బలహీనము చేయలేరు. దేవుఁడుతప్ప వారికి మఱియొకరక్షకుఁడు లేఁడు. వారిశిక్ష ద్విగుణిత మగును ! వారు వినలేక పోయిరి. చూడలేక పోయిరి.

వీరే తమయాత్మలను బోఁగొట్టుకొనినవారు. వారు కల్పించు కొనినదైవములు తమనుండి యదృశ్యులై పోయిరి.

పరలోకములో నష్టులగువారు వీరే యనుటకు సందేహము లేదు.

కాని, విశ్వాసులై క్రమవర్తనులై క్రమప్రభువునకు నమ్రు లయినవారు స్వర్గమున వసింపఁగలరు. వా రందు శాశ్వతముగ నుండఁగలరు.

ఈ రెండు తెగలవారిలో నొక రంధులను బధిరులను, రెండవ వారు చూడఁగలవారిని వినఁగలవారినిఁ బోలుదురు. వీ రిరువురు నొక్కరీతివారే యని యనఁగలమా? ఏమి! మీకు బోధపడలేదా?

## అధ్యాయము 3.

పూర్వకాలమున 'నుహు' ను దనప్రజలయొద్ద కంపఁగా నాతఁడు "దేవునితప్ప నితరులను మీ రారాధింపకుందురుగాక యని బోధించుటకై నేను వచ్చియున్నాను.

దుఃఖదినమున మీరు శిక్ష ననుభవింప వలయునేమో యని నేను భయపడుచున్నా" ననెను.

ఆతనిప్రజలలో నవిశ్వాసకులపెద్దలు "నీవును మావంటి యొక నరుఁడవే మనలో వివేకహీనులగుకడజాతివారెవరో నిన్నను సరించిరిగాని, యితరు లెవ్వరును నీమాట వినలేదు. మాకంటె నీ వెందు బుద్ధిమంతుఁడవు? మీ రందఱు నసత్యవాదులే"

30 అనఁగా నాతఁడు "నాప్రజలారా! మీ రేమని యోచించుచున్నారు? దేవుఁడు నాకు స్పష్టముగా నొకరహస్యమును దెలిబుచ్చినాఁడు. ఆతఁడు నాపై తనదయామృతమును గురియించినాఁడు. అది మీకుఁ గానరాకున్నది. మీకు నాయుపదేశము రుచింపకున్న యెడల మిమ్ము నేను బలవంతపెట్టుదునా?

నాప్రజలారా! మిమ్ము నేను ధనమునకై యాచింపలేదు. నాకు దేవుఁడే బహుమాన మియ్యఁగలఁడు. ప్రభువును జేరఁగల

విశ్వాసులను నేను తఱిమివేయను. కాని, మీరందఱును నా కజ్ఞానులవలెఁ గాన్పించుచున్నారు.

మఱియు నోప్రజలారా, వారిని నేను తఱిమివైచినచో దేవునినుండి నన్నెవ్వరు రక్షింపఁగలరు? అంగుచే మీ రాలోచింపవలదా?

దేవునిధన మంతయు నాయొద్ద నున్నదని నేను మీతోఁజెప్పలేను. కనఁబడనివస్తువులు కనఁబడిన వని నేను పలుకలేదు. నేను దేవతనని మీతో వాక్రువ్వలేదు. మీరు తృణీకరించిచూచువారిం గూర్చి "వారికి దేవుఁడు మంచివస్తువు నెద్దానిని నీయఁ" డని నే ననలేదు. వారిమనస్సులలో నేమున్నదో దేవునికి బాగుగఁదెలియును. ఇట్లు నేను చెప్పకపోయినచో నధర్మపరులలోఁ జేరిపోవుదును" అనెను.

వారు "నుహూ, నీవింతకుపూర్వమే మాతో వాదులాడితివి. మాతో వివాదములు పెంచుకొంటివి. నీవు సత్యభాషివే యైనచో నేదీ నీవు భయపెట్టుచున్నశిక్షను దీసికొనిరమ్ము" అనిరి.

అతఁడు "దేవుని కిష్టమైనప్పుడే దానిని దీసికొని వచ్చును. మీ రాతని బలహీనుని జేయఁజాలరు.

నేను సంతోషపూర్వకముగా క్రమమైనబోధను మీ కొనర్చినను నొకవేళ దేవుఁడు మిమ్ము తప్పుత్రోవఁ బెట్టనెంచినచో నా బోధ యించుకంతయుఁ బనికిరాదు. అతఁడు మీ ప్రభువు. అతని యొద్దకు మీరు తిరిగి తీసికొనిపోఁబడుదురు" అనెను

"ఈఖురాను నీవు కల్పించినదే" యని వా రందురేని నేను దానిని కల్పించినచో నాదోషము నాదే కాని, మీ రేవిషయమున దోషులో యాదోషము నన్నంటదు" అనుము.

## అధ్యాయము 4.

అది నుహునకుఁ దెలుపఁబడెను. నిశ్చయముగా, పూర్వము నమ్మినవారుతప్ప నీప్రజలలో నితరులు దానిని నమ్మరు. కావున నీవు వారిపనులఁ జూచి చింతిల్లకుము.

మేము చెప్పినప్రకారము మాకండ్లయెదుట 'నావ'ను (ఆర్కు) కట్టుము. దుష్టులు నీటిలో మునుఁగవలసి యున్నది గనుక వారినిగూర్చి నన్ను బ్రతిమాలకుము.

40. అప్పు డాతఁడు నావను నిర్మించెను. తనప్రజలలోని పెద్దలా తని ప్రక్కనుండి వెళ్ళినప్పుడెల్లను నాతనిఁ జూచి నవ్విరి. ఆతఁడు "మీరు నన్నుఁజూచి నవ్వినారు. మీరు నవ్వినట్లే మేమును మిమ్ముఁ జూచి నవ్వఁగలము.

అవమానకరమును శాశ్వతమును నగుశిక్ష యెవరికి ప్రాప్తించునో తుదకు మీకుఁ దెలియఁగలదు" అనెను.

మాయనుశాసనము జరుగుచు, భూమి మఱుగఁజొచ్చువఱకును నిట్లే యుండెను. మే మప్పుడు "ప్రతిజాతినుండియును నొక మిథునమును, నీకుటుంబములో మాశిక్షను పూర్వము పొందిన యాతఁడుతప్ప నితరులను, విశ్వాసులను, నావలో నెక్కించికొనుము" అంటిమి. కాని, కొంతమందితప్ప మఱెవ్వరును నమ్మలేదు.

ఆతఁడు "దానిలోనికి నేను చెప్పినవారితో నెక్కుము. దేవునియాన నది కదలుచు, లంగరులో నాడుచుండఁగాక నిశ్చయముగా నాప్రభువు దయావంతుఁడు. కరుణామయుఁడు" అనెను.

అప్పు డానావ పర్వతములఁబోలు కెరటములమధ్యనుండి నడువఁ జొచ్చెను. నుహు తన కెడముగా నున్నకొడుకును బిలిచి "నాయనా! మాతో నెక్కుము. అవిశ్వాసులలో జేరకుము" అనెను.

ఆతఁడు "ఈజలమునుండి తప్పించు నొక పర్వతము నాశ్రయించెద" ననెను. నుహు, అప్పుడు "దేవునిదయకు పాత్రుఁడగు వాఁడు తప్ప నీదినమున నాతనిశాసనమునుండి తప్పించుకొనువాఁ డెవ్వఁడు నుండఁబోఁడు" అనుచుండఁగనే యొకతరంగము వారిరువురిమధ్యనుండి లేవఁగా నాతనిపుత్రుఁడు నీటిలో మునిఁగి చచ్చిన వారిలోఁ జేరిపోయెను.

అప్పుడు "భూమీ! నీజలమును సంహరించుకొనుము. మేఘమా! ఆఁగుము" అనుధ్వని పుట్టెను. వెంటనే జలము క్షోభము మాని శాంతి నొందెను. దేవునియాజ్ఞ మన్నింపఁబడెను. నావ 'జూడీ'పై నిలిచెను. ఓదుష్టజాతీ! తొలఁగి పొమ్ము" అనునాదము విన వచ్చెను.

నుహు అప్పుడు తనప్రభువు నుద్దేశించి "ప్రభువా! నాకొడుకు నాకుటుంబములోనివాఁడు. నీవాగ్దానము సత్యము. నీవు న్యాయమూర్తులలో నగ్రగణ్యుఁడవు" అనెను.

ప్రభువు "నుహూ, నిశ్చయముగా నాతఁడు నీకుటుంబములోని వాఁడు గాఁడు. ఈవిషయమై నీవు క్రమముగ వర్తింపలేదు. నీకుఁ దెలియనిదానినిగూర్చి నన్నడుగఁబోకుము. నీవును నజ్ఞానులలోఁ జేరిపోవల దని నీకు సూచన నిచ్చుచున్నాను" అనెను.

ఆతఁడు "నాకుఁ దెలియనిదానిని నిన్నడిగినందుకు ప్రభువా! నిన్నే యాశ్రయించుచున్నాను. నీవు నన్ను క్షమించి దయఁ దలఁపనియెడల నేనును నష్టులైనవారిలోఁ గలసిపోయెద" నని పల్కెను.

50. అప్పు డాతనితో ప్రభువు "నుహూ, నీవు మాసహాయము నొంది సుఖముగ నావనుండి దిగుము. నిన్నును, నీతో నున్నవారలను, మీకు పుట్టఁబోవుసంతతులవారలను మే మాశీర్వదించుచు

న్నాము. కాని, యితరులగునవిశ్వాసకు లీలోకములో మావలన మంచివస్తువుల ననుభవించి, తరువాత పరలోకములో ఘోరశిక్ష ననుభవింపఁగలరు " అనెను.

ఇది యంతయు రహస్యచరిత్రములలో నొకటి. దీనిని మీకుఁ దెలియఁ జేయుచున్నాము. ఇంతకుపూర్వము నీకుఁగాని, నీపూర్వులకుఁగాని యిది తెలియదు. నీ వోర్పుగలిగి యుండుము. నిశ్చయముగా దైవభీతిపరులకు సంతానాభివృద్ధి యగును.

అధ్యాయము 5.

ఆద్ నొద్ద కాతనిసోదరుఁడగు హూదు నంపితిమి. ఆతఁడు "నాప్రజలారా! దేవు నారాధింపుఁడు. ఆతఁడుతప్ప నితరదైవము లేఁడు. మీ రొకయసత్యమును గల్పించుచున్నారు.

నాప్రజలారా! మిమ్ములనుండి నేను బహుమానము నాశింపలేదు. నన్ను సృజించినయాతఁడే నాకు బహుమానము నీయఁగలఁడు. కావున, మీ రేల బోధపఱుచుకొనరు?

ప్రజలారా! దేవుని క్షమాపణ వేఁడికొనుఁడు. ఆతని కభిముఖులరు గండు! మీ కాతఁడు సమృద్ధముగ స్వర్గమునుండి వర్షము కురియించును.

మీ కాతఁడు బలముపై బలము నొసగి యభివృద్ధి చేయును. కాని, మీరుమాత్రము దుష్టులై యాతనికి వెనుజూపకుఁడు" అనెను.

వా రాతనితో "హూదా, నీవు నీసందేశముఁగూర్చి యేసాక్ష్యమును దీసికొని రాలేదు. నీమాటపై మాదేవతలను వదలి పెట్టువారము కాము. మేము నిన్ను నమ్మము.

మాదేవతలలోఁ గొందఱు నిన్ను దుష్టునిగ నొనరించిరని

మాత్రము మేము చెప్పఁగలము" అనిరి. ఆతఁడు "ఇదిగో, దేవుఁడు నాకు సాక్షి. మీరును సాక్షులే. నేను దేవునితో సమానులను గల్పించువారినుండి తొలఁగియున్నాను.

కావలసినచో మీ రందఱును నాపైఁ గుట్ర పన్నుఁడు. ఆలస్యము చేయకుఁడు.

నాకును మీకును ప్రభువైనదేవునే నమ్మికొని యున్నాను. ఆతఁడు ముందలఁబట్టి గ్రహింపనిజీవ మొక్కటియు లేదు. నాప్రభువు నడచుదారి క్రమమైయినదే.

60. మీరు వెనుదిరిగినచో నాసందేశము నప్పుడే మీకు తెలిపియే యున్నాను. నాప్రభువు మీస్థానమున మఱియొకజాతివారిని నిలుపును. మీ రాతనికించుకయు హాని కలుగఁజేయఁజాలరు. నిశ్చయముగా నాప్రభు వన్నివస్తువులపైనను కనుగలిగి యున్నాఁడు" అనెను.

మాశిక్ష వచ్చినప్పుడు హూదును అతనివంటివిశ్వాసులను దయతో రక్షించితిమి. ఘోరశిక్షనుండి వారిని తొలఁగించితిమి.

ఈ ఆద్ మనుష్యులు ప్రభుసూచనల నిరాకరించి, యాతని దూతలపైఁ దిరుగఁబడి, గర్విష్ఠియగు ప్రతికృత్రిమస్వభావుని యాజ్ఞల నవలంబించిరి.

కావున నీలోకమున వారిని శాపము వెంటఁదగిలినది. రక్షణ దినమున వారితో "ఏమి, ఆద్ వారు దేవుని నమ్మకుండిరిగదా" అని చెప్పఁబడును. హూదు స్వజాతీయులగు ఆద్ వారు దూరముగ బహిష్కృతులైరిగదా.

## అధ్యాయము 6.

సామూదునొద్ద కాతనిసోదరుఁడగు 'సాలె' ను పంపితిమి. ఆతఁడు "ఓ నాప్రజలారా! దేవు నారాధింపుఁడు. అతఁడుతప్ప

నితరదైవము లేఁడు. మిమ్ము భూమినుండియెత్తి మీ కందు వసతి నేర్పఱిచి నాఁడు. కావున నాతని శరణు వేఁడుఁడు. ఆతని కభిముఖులరు కండు. మీప్రభువు దగ్గఱఁగనే యున్నాఁడు. ప్రత్యుత్తరమిచ్చుటకు సిద్ధముగ నున్నాఁడు" అనెను.

వా రాతనితో, "సాలే, ఇంతవఱకును మేము నీపై నాశ పెట్టుకొని యుంటిమి. మనతండ్రు లారాధించినవారి నిప్పుడు నీవు వదలిపెట్టుచున్నావా? నిశ్చయముగా నీ విప్పుడు మాకు బోధించు చున్నమతమును మేము శంకించుచున్నాము" అనిరి.

ఆతఁడు "ఓనాప్రజలారా! మీ రేమని యోచించుచు న్నారు. దేవుఁడు నాకు సహాయకుఁడు. తనసందేశమును వెలిబుచ్చి నాఁడు. ఆతఁడు నాపైఁ గరుణ జూపినాఁడు. అతనిపై నేను దిరుగఁ బడిన న న్నెవ్వరు రక్షింపఁగలరు? మీరు నాకు నాశనమునే హెచ్చుగఁ గోరుచున్నారు.

నాప్రజలారా! ఇదియే యొంటె. మీ కిది యొక సూచన. అది యథేచ్ఛగా విహరించిదేవునిభూమిపై మేయ నిండు. దానికి హాని జేయకుఁడు. అట్లుచేసినచో మీకు ఘోరశిక్ష ప్రాప్తించును" అనెను.

అయినను వారు దాని నురిదీసిరి. అప్పుడాతఁడు "ఇంక మూఁడుదినములు సంతోషింపుఁడు. మేము చెప్పినవిప త్తసత్యము గానేరదు" అనెను.

పిదప మాశాసనము జరుగునప్పుడు 'సాలే' ను అతనిఁబోలిన విశ్వాసులను నాదినమున నవమానము నొందకుండ దయఁదలఁచి రక్షించితిమి. నిశ్చయముగా నీప్రభువు బలవంతుఁడు. శక్తిమంతుఁడు!

70. అప్పుడు దుష్టులపై గొప్పతుపాను వీచెను. తెల్లవారుసరికి వారందఱును దమగృహములలో సాఁగిలఁబడి యం దెన్నడును నివ సింపనివారివలె నైరి.

ఏమి ! సామూదు తనప్రభువును విశ్వసింపక యుండలేదా ? సామూదు కేవలము బహిష్కృతుఁడు కాలేదా ?

అధ్యాయము 7.

అప్పుడు మాదూతలు సువార్తలఁ జేకొని ఇబ్రాహీము నొద్దకు వచ్చిరి. ‘ శాంతిరస్తు ’ అని దీవించిరి. అతఁడును ‘ శాంతిర ’ స్తని పలికి యాలస్యము చేయక కాల్చినదూడను దీసికొని వచ్చెను.

వారు దానిని తమచేతులతో ముట్టకుండుటఁ జూచి యాతఁడు వారికి భయపడెను. “ భయపడకుము. మేము ‘ లూటు ’ ప్రజల యొద్దకు పంపఁబడియున్నా ” మని వా రనిరి.

అతని భార్య యతనిప్రక్కనే యుండి నవ్వెను. ఆమెకు ‘ ఇసాకు ’ పుట్టుననియు, ‘ ఇసాకు’కు యాకూబు కలుగుననియు మేము పల్కితిమి.

ఆమె “ ఆహా ! యెంతదురదృష్టవంతురాలను ! నేను వృద్ధనై యుండ, నాభర్తయు వృద్ధుఁడై యుండ మాకుఁ బుత్రుఁడు పుట్టునా ! ఇది చాల వింతగ నున్నదే ” యనెను.

వా రామెతో, “ ఏమి, నీవు దేవునియాజ్ఞ కాశ్చర్యము నొందుచున్నావా ? ఓగృహస్థులారా ! మీకు దేవునిదయయు వరములును జేకూఱుఁగాక ! అతఁడు కీర్తనీయుఁడును స్తుతిపాత్రుఁడును నగుఁగాక ! ” యనిరి.

అప్పు డిబ్రాహీము భయము వీడి, యీసువార్త తన్నుఁ జేరఁగనే ‘ లూటు ’ ప్రజలఁగూర్చిమీకు విన్నవించెను. నిశ్చయముగా నిబ్రాహీము దయావంతుఁడు, కరుణాశీలుఁడు, సహనపరుఁడు.

ఇబ్రాహీమా, ఈనీప్రయత్నమును మానుము. అప్పుడే నీదేవునియాజ్ఞ జరిగినది. వారికేమో తప్పనిసరిగ శిక్షకానున్నది.

మాదూతలు 'లూటు' నొద్దకు రాఁగానే యాతఁడు వారిని గూర్చి దుఃఖించెను. వారిని రక్షించుట కాతఁడు మిగుల బలహీనుఁడై వారితో "ఇది యొక కష్టదిన" మని పలికెను.

80. ఆతని ప్రజ లింతకుఁ బూర్వ మీదురితము లాచరించుటచే వా రాతనియొద్దకుఁ బరుగెత్తుకొనివచ్చిరి. అతఁడు వారితో "ఓనా ప్రజలారా! ఈనాకుమార్తెలు మీకు పవిత్రురాండ్రై) యుందురు. దేవునికి భయపడి యీయాతిథుల ప్రోల న న్నవమానింపకుఁడు. మీలో మంచిమనస్సుగలవాఁ డొక్కఁడైన లేఁడా?" అనెను.

వారు "నీకూఁతుళ్ళతో మాకు నిమిత్తములేదని నీకుఁ దెలియనే తెలియును. మా కేమికావలయునో నీకుఁ దెలిసియే యున్న" దనిరి.

అతఁడు "మిమ్ము ధిక్కరించుటకుబలముగాని, నన్ను రక్షింపఁగల మంచినాయకుని యాశ్రయము గాని నాకుఁ గలుగును గాక యని కోరుచున్నా" ననెను.

దేవతలు 'లూటా! మేము మీ ప్రభువుదూతలము. వారు ని న్నంటలేరు. అర్ధరాత్రమప్పుడు నీకుటుంబముతో లేచిపోయి మీలో నొక్క రును దిరిగి చూడకుఁడు. వారి కేమి మూడునో నీభార్యకు నదే కలుగును. నిశ్చయముగా వారికిఁ గలుగునాపద తెల్లవారినపిదపఁ గలుగును. ఉదయము దగ్గఱపడుచున్నదిగదా!" యనిరి.

మాశాసనము జరుగనారంభించునప్పుడు వారినగరముల నుతలక్రిందుగఁ ద్రిప్పివైచి నిరంతరముగ వారిపై ప్రభువు గుఱుతులు గల మంటిపెల్లలను గురియించితిమి. దుష్టులగు మక్కావాసులకును వారికిని నెంతో దూరము లేదు.

## అధ్యాయము 8.

పిదప మేము 'మదియాను' నొద్ద కాతని సోదరుఁడగు 'షూయైబు' నంపితిమి. అతఁడు "నాప్రజలారా! దేవు నారాధింపుఁడు. అతఁడుతప్ప నితరదైవము లేఁడు. మీరు తప్పుకొలతలఁ గొలువకుఁడు. మీరు మంచివస్తువులతో సంతోషించుచుండుట నేను చూచితిని. కాని, సర్వమును నాశనము కాఁగలదినమునఁ గలుగుశిక్ష మీకును గలుగునని నేను భయపడుచున్నాను.

"ఓనాప్రజలారా! న్యాయమగు కొలతలను, తూనికలను నుపయోగింపుఁడు. ఇతరులవస్తువుల నపహరింపకుఁడు. మీర ధర్మపరులై తప్పుమార్గమును బట్టకుఁడు.

మీరు విశ్వాసులైనచో దైవదత్తమగుదానిలో మిగిలినదే చాలును.

కాని, నేను మీకు సంరక్షకుఁడను గాను" అనెను.

వా రాతనితో "షూయైబా, మాతండ్రు లారాధించినదేవతలను బూజింప మానుదుమా? మాధనమును మా యిచ్ఛవచ్చినట్లు వెచ్చింప మానుదుమా? నీప్రార్థనలు మమ్ము నిర్బంధించునా? నీ వేమో శాంతుఁడవును మాకు క్రమమార్గమును జూఁపువాఁడవువలెను వేషము వేయుచున్నావే!" అనిరి.

90. అతఁడు "ఓనాప్రజలారా! మీ రేమి యోచించుచున్నారు. నాప్రభువు నాకు సరిగ రహస్యమును వెలిబుచ్చి యున్నచో, అతఁడే నాకు మంచివస్తువులను ప్రసాదించి యుండినచో, మీకు నిషేధించినవానినే నేననుసరించినచో, నాకు సాధ్యమైనంతవఱకుమీ వర్తనముల మార్చుటకంటె నితరము గోరెదనా? నాకుదేవుఁడేసర్వ విషయములందును సహాయపడును. నే నతనినే నమ్మికొని యున్నాను. అతనికే నే నభిముఖుఁడ నగుచున్నాను.

ఓనాప్రజలారా! మీరు నన్నదిరించి, మీకు పూర్వము నుహూదుప్రజలును, హూదుప్రజలును, సాలేప్రజలును ననుభవించిన దాని ననుభవింపకుఁడు. లూతుప్రజల వసతులు మీ కెంతో దూర ముగా లేవు.

మీప్రభువును శరణము వేఁడుఁడు. అతని కభిముఖులరు కండు. నిజముగా నాప్రభువు దయాళుఁడు, ప్రేమస్వరూపుఁడు" అనెను.

వారు "షూయైబా, నీవు చెప్పుదానిలో చాలమట్టుకు మాకు తెలియదు. మాలో నీ వసహాయుఁడవై యున్నావు. నీకుటుం బమును జూచికాని, లేకున్నచో నిన్నీపాటికి ఱాళ్ళు రువ్వి చంపి యుందుము. అప్పుడు నీవు మాపై తిరుగఁబడకుండియుందువు" అనిరి.

ఆతఁడు "ఓనాప్రజలారా! దేవునికంటె నాకుటుంబము ఘనమైన దనుకొందురా? అతని నుపేక్షించి విడిచివైచెదరా? నిశ్చ యముగా నాప్రభువు మీకృత్యములచుట్టు నావరించియే యున్నాఁడు.

నాప్రజలారా! నాకు హాని చేయుటకు మీ కేమి సామర్థ్య మున్నదో చూపుఁడు. నేను నాపనిఁజేసెదను.

మనతో నెవరి కవమానకరమగుశిక్ష కానున్నదో, యెవరు సత్యవంతులో మీకుఁదెలియఁగలదు. మీరు వేచియుండుఁడు. నేనును మీతో వేచియుండెదను" అనెను.

మాశాసనము జరుగఁబోవునప్పుడు మేము షూయైబును నతనివంటివిశ్వాసులను దయతోఁ గాచితిమి. దుష్టులపై గొప్పతుపాను వీవఁగనే వారు తమయిండ్లలోఁ బూర్వము నివసించియుండ నట్లె పడి పోయియుండిరి.

సామూదు నాశనమయినట్లే మదియానుగూడ నాశనమై నాఁడు గదా!

## అధ్యాయము 9.

పూర్వకాలమున మేము ఫిరౌనునొద్దకును, నాతనియుత్క్రమములగు నాజ్ఞలను మన్నించుచుండిన ధనికులయొద్దకును మానూచనలతో మూసా నంపితిమి.

100. రక్షణదినమున నాతఁడు తనప్రజలను వెంటఁబెట్టుకొని యగ్నిలో దిగును. ఆదిగుట చాల కష్టతరముగ నుండును.

వారి నీలోకమున నొకశాపము వెంబడించెను. వారికి లభించు వరమును వారికిఁ గష్టదాయకముగఁ బరిణమించును.

నీకుఁ దెలిపిన నగరములవృత్తాంతము లిట్టివి. వానిలోఁ గొన్ని నిలిచియున్నవి ; కొన్ని భూమిలోఁ గలిసిపోయినవి.

మేము వారి కన్యాయము చేయలేదు. వారు తమకుఁదామే యన్యాయము చేసికొనిరి. దేవునిశాసనము జరుగనున్నప్పు డాతనితో సమానులని చెప్పినవారికి దేవత లెవ్వరును సహాయపడలేకపోయిరి. ఆదేవతలు వారినాశనమును మఱింత వృద్ధిచేసిరి.

దుష్టనగరములను నీప్రభువు పట్టుకొనునప్పు డాతనిపట్టు పట్టిదై యుండెను. ఆతనిపట్టు కష్టదాయకము. దుఃఖావహము.

మున్ముందు రాఁబోవుశిక్షకు వెఱచువాని కిం దొకసూచన యున్నది. ఆదినమున మనుష్యజాతి యంతయు నొకచోఁ గూర్పఁబడును. ఆదినమునజంతుసముదాయము సర్వమును జూడఁగలదు.

నిశ్చితకాలమువఱకుఁ దప్ప మఱి మేము దాని నాపము.

ఆదినము వచ్చినప్పు డాతనియనుజ్ఞ లేనిదే యెవ్వరును మాటాడఁ జాలరు. అప్పుడు కొందఱు దుఃఖించెదరు. కొందఱు సుఖించెదరు.

దుఃఖభాజనులగువారి కగ్నియే శరణ్యము. వారందు నిట్టూర్పు విడుచుచు మూల్గఁగలరు.

నీప్రభు వన్యథా నిశ్చయించినఁదప్ప వారందు స్వర్గమర్త్యము లున్నంతకాలమును నుండఁగలరు. నిశ్చయముగా నీప్రభువు తనయిష్టము వచ్చినదానిని జేయఁగలఁడు.

110. ధన్యాత్ములగువారికి నందనవనము వాసస్థానమగును. స్వర్గ మర్త్యము లుండువఱకు, నీప్రభు వింకను ననుగ్రహింప నెంచిన వరముల ననుభవించుచు వారందు వసింపఁగలరు.

కావున వా రారాధించుదానివిషయమై నీకేసందేహమును వలదు. వారు తమతండ్రు లారాధించినవారినే యారాధింతురు. వారి కేలోటును లేకుండ వారికి రావలసినపాలు నొసగియే తీరుదుము.

## అధ్యాయము 10.

పూర్వము మేము మూసాకు గ్రంథము నొసగఁగా దానిని గూర్చి వారు వివిధములగు నభిప్రాయములం బడిరి. నీప్రభువు కొంత వ్యవధిని నిర్ణయింపకుండినచో వారికి తీర్పు చెప్పఁబడియే యుండును. నీప్రజలుగూడ కురానునుగూర్చి శంకించుచున్నారు.

వా రేమి చేయుచున్నారో నీప్రభువునకుఁ దెలియును. వారి వారి కర్మల కనుగుణముగ నాతఁడు బహూకరింపఁగలఁడు.

నీవును, నీతోఁగూడ దేవునకభిముఖుఁడైనవాఁడును గలిసి యాజ్ఞచొప్పున క్రమముగ నడుచుకొనుఁడు. అతఁడు మఱి దేవుని శాసనము నుల్లంఘింపకుండునుగాక ! మీరు చేయుదాని నాతఁడు చూచుచునే యున్నాఁడు.

అగ్ని నిన్నుఁగూడ నంటకుండుటకై దుష్టులపక్ష మవలంబింప

కుము. దేవుఁడుతప్ప నీకు మఱియొకరక్షకుఁడు లేఁడు. ఆతనినుండి నిన్నెవ్వరును రక్షింపఁజాలరు.

ఉదయమునను, సాయంసమయమునను, రాత్రి యాసన్నమైనపుడును ప్రార్థన సలుపుము. సత్కర్మలు దుష్కర్మలఁ బాఱఁదోలును. ఆలోచించువారి కిది యొకభయసూచన.

భయపడక ప్రయత్నము చేయుచునే యుండుము. న్యాయవంతులపుణ్యము నాతఁడు నశింపఁజేయఁడు.

పుణ్యవంతులగునీపూర్వులు భూమిపై నన్యాయమును నిషేధించిరి. వారిలో మేము విడుదలచేసినవారు చాలమంది కలరు. కాని, దుష్టులు తమకోరికలనే యనుసరించి దేవునియాజ్ఞ నుల్లంఘించినవా రయిరి.

ఆయానగరములవారు పుణ్యవంతు లయినప్పుడు నీప్రభు వానగరముల నన్యాయముగా నశింపఁజేయలేదు.

120. దేవుని కిష్టమైనచో మానవజాతి యంతయునొకేమతము నవలంబింపఁచేసియుండును. కాని దేవునిదయకు పాత్రులైనవారే తమవివాదములను గట్టిపెట్టుదురు. ఇందుకే వారి నాతఁడు సృజించినాఁడు. “నరకమును నేను భూతములతోడను, మనుష్యులతోడను నింపివై చెద ” నని ప్రభువు చెప్పినమాట జరిగి తీరును.

నీవు నీహృదయమును స్థిరపఱచుకొందువనియే యీప్రవక్తల చరిత్ర మంతయు నీకుఁ దెలిపితిమి. వీనిమూలమున నీకు సత్యము చేరినది. విశ్వాసులకు భయసూచన యీయఁబడినది.

కాని, నమ్మనివారితో “మీరు మీయిష్టముచొప్పున వర్తింపుఁడు. మేము చేయున దేమో మేము చేసితీరుదుము. మీరు వేచి యుండుఁడు. మేమును వేచి యుండెదము ” అనుము.

స్వర్గమర్త్యములందలిరహస్యవస్తువు లన్నియు దేవునివే. అన్ని వస్తువులును తుద కాతనియొద్ద కే చేరును. కావున నాతని నారాధించి

యాతనిని విశ్వసింపుఁడు. నీప్రభువు నీవు చేయుచున్నదానిని చూడక యుండలేదు.

---

# సురా 12. యూసూఫు.

---

మక్కా—111 పద్యములు—12 రుక్కులు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లమ్. ర. ఇవి స్పష్టగ్రంథమునందలి సూచనలు.

మీరుబోధపఱుచుకొనుట కరబ్బీభాషలోకురానునుబంపినాము.

ఈకురానువిషయమై యింతకుఁబూర్వము చెప్పియుండని యతిమనోహరమగుకథ నొకదానిని జెప్పెదము.

యూసూఫు తనతండ్రితో "నాయనా! నాకు పదు నొకండునక్షత్రములును సూర్యచంద్రులును గనఁబడిరి. అవి యన్నియు నాకు నమస్కరించుచుండెను" అని చెప్పఁగా నాతఁడు,

"కుమారా! నీవు చూచినదానిని నీసోదరులతోఁ జెప్పకుము. వారు నీపైఁ గుట్ర పన్నెదరు సుమీ! సైతాను మనుష్యునకు బహిరంగశత్రువుగదా!"

నీప్రభువు నిన్నట్లే యెంచికొని రహస్యార్థముల నెఱింగించి, పూర్వకాలమున నీతండ్రులగు ఇబ్రాహీము ఇసాకుల కెట్లో యట్లే నీకును, యాకూబుకుటుంబమునకును వరముల సంపూర్ణముగ నొసగును. నిజముగా ప్రభువు జ్ఞాని బుద్ధిమంతుఁడు" ననెను.

## అధ్యాయము 2.

ఇప్పుడు యూసూఫునందును నతనిసోదరులందును తెలిసికొనఁ గోరువారికి సూచన లున్నవి.

వారు "మనము యూసూఫు నతనిసోదరునికంటె నధిక సంఖ్యాకులము. అయినను వారిని మనప్రభువు మనకంటె నెక్కుడుగఁ బ్రేమించుచున్నాఁడు. నిశ్చయముగా మనతండ్రి పొరబడినాఁడు.

మీరు యూసూఫును జంపుఁడు, లేదా యతనిని మఱియొక దేశమునకుఁ దఱిమివేయుఁడు. మీతండ్రి మీదికే మొగమై యుండునట్లు చేసికొనుఁడు. ఇటుపై మీరు క్రమజీవనములఁ జేయ వలయు" ననిరి.

10. వారిలో నొకఁడు, "యూసూఫును జంపకుఁడు. అతనిని నూతిమడుగునఁ ద్రోసివేయుఁడు. అట్లుచేసినచోఁ ద్రోవఁబోవువా రెవరైన నాతనిని బైకిఁ దీయుదురు" అని పల్కఁగా,

వారు, "ప్రభువా! యూసూఫును మాకొప్పగింపనేల? మే మతనికి మేలే యొనర్తుము.

మాతోఁ గలసి సుఖించియాడుకొనుటకు రేపాతని మాతోఁ బంపుము. అతని కేయపాయమును గలుగకుండఁ గాపాడెదము" అనిరి.

అతఁడును వారితో "మీ రాతనిఁ దీసికొనిపోయినచో నాకు విచారము కలుగును. మీ రజాగ్రత్తగ నున్నయెడల తోడేళ్ళాతని మ్రింగివేయునేమో యని నాకు భయమగుచున్న" దనెను.

వారు "మేము బలహీనుల మైనఁగదా యిందర ముండియు నాతని తోడేళ్ళవాతఁ బెట్టుటకు" అనిరి.

అంత వా రాతనిఁ దీసికొనిపోయి నూతిమడుగునఁ ద్రోయ నిశ్చయించిరి. మే మప్పు డాతనితో "నిన్ను వారు పోల్చుకొన లేకున్నప్పుడు నీవు వారి కీకుట్రం దెలుపఁగల" వని పలికితిమి.

వారును రాత్రియగునప్పటి కేడ్చుచుఁ దమతండ్రియొద్దకువచ్చి, "తండ్రి! మేము సత్యముఁ బల్కుచున్నాము. మేము గుఱ్ఱపుపందెములకై పోవుచు, మాబట్టను యూసుపునొద్ద నుంచి వెళ్ళఁగా తోడే లొకటి యాతని మ్రింగివైచినది. మేము సత్యముఁ బల్కినను నీవు విశ్వసింపవుగదా" అనిరి.

అప్పుడు వారు కృత్రిమరక్తచిహ్నములుగల యాతనియంగీ నాతనికిఁ జూపిరి. అతఁడు "ఇది యంతయు మీరు చేసినదే. కాని, యోర్చి యుండుటయే మంచిది. మీరు చెప్పినదానిని సహించుటకు దేవుని సహాయమును వేఁడుచున్నా" ననెను.

అపుడు దారిఁబోవువా రొకనిని నీరు తోడుట కానూతి యొద్ద కంపఁగా నాతఁడు చేఁదను నూతిలో వైచి "ఇదియేమి! ఇం దెవఁడో యువకుఁ డున్నాఁ" డని యఱచెను. వా రాతని వృత్తాంతమును రహస్యముగా నుంచి వాని నమ్మివేయ నెంచిరి. కాని, వారు చేసినది దేవునికిఁ దెలిసెను.

20. వా రతనిని కొలదికాసుల కమ్మివైచిరి. తగినవెల కతనిని వా రమ్మలేదు.

## అధ్యాయము 3.

అతనిని కొనిన మిసిర్ (యీజిప్టు) దేశస్థుఁడు, తనభార్యతో "ఇతనిని దయతోఁ జూచుచుండుము. బహుశః ఈతఁడు మనకుఁ బనికివచ్చును. లేదా యీతని మనపుత్త్రునిఁగాఁ బెంచుకొందము" అనెను. ఇట్లు యూసూపును మే మా దేశములో నిల్పి, దేవుఁడు తన యుద్దేశము నెఱవేర్పఁగలవాఁడు గావున, రహస్యార్థముల నతనికి బోధ చేసితిమి. కాని, చాలమంది కది తెలియలేదు.

అతనికి బలము తగులఁగనే బుద్ధిజ్ఞానముల నిచ్చితిమి. మంచి వారిని మే మిట్లే బహూకరింతుము.

ఆతఁ డుండుగృహమునందలిస్త్రీ యాతనిపై మరులుగొని " ఇటురమ్ము " అని పిలిచెను. కాని, యాతఁడు " దేవుఁడు నన్ను రక్షించుఁగాక ! ఆతఁడు నాకు మంచిమార్గమును జూపి యున్నాఁడు. దుష్టు లభివృద్ధి నొందఁ జాలరు " అనెను.

కాని, యామె మోహమును వీడకుండెను. ప్రభు వాతని కొకసూచన నీయకుండినచో నాతఁ డామెను మోహించి యుండును. అతఁడు విశ్వాసులగు మాకింకరులలోనివాఁడు గావున మే మాతనిని కలుషమునుండియుఁ బాపమునుండియుఁ దప్పించితిమి.

వా రిరువురును ద్వారమువైపు బరుగెత్తిరి. ఆమె యాతని యంగీని చించివైచెను. ద్వారమునొద్ద వారు తమయజమానుని యొద్దకేగి " నీకుటుంబమునకు ద్రోహము తలఁచినవానికి కారాగృహమో ఘోరశిక్షయో కాక యొండేమి కలదు ? " అనిరి.

ఆతఁడు, "ఆమెయే నన్ను పాపములోనికిదింపఁ బ్రయత్నించె" ననెను. ఆమెకుటుంబములోనివాఁడే యొకఁడు " ఆతనియంగీ ముందుభాగమున చినిగిపోయినచో నామెమాట సత్యమును, నాతని మాట యసత్యమును నగును.

వెనుక చినిగినచో నాతనిమాట సత్యమును నామెమాట యసత్యమును నగు " నని తగవు చెప్పెను.

అతనియజమానుఁ డాయంగీవెనుకభాగమునఁ జినిగియుండుటఁ జూచి "ఓసీ ! యిది నీపన్నాగమే. నీ వెంతకైనఁ జాలుదువు.

యూసూఫా, ఈవృత్తాంతమును మఱచి పొమ్ము. ఓపెండ్లమా, నీవు గావించినపని పాపభూయిష్ఠమైనది. కావున నాతని క్షమింప వేఁడుకొనుము " అనెను.

అధ్యాయము 4.

30. పురములోనిస్త్రీలు " రాజుభార్య సేవకుని మోహించినది.

అతఁ డామెకు మోహహేతు వయినాఁడు. ఆమెతప్పు మాకు స్పష్ట ముగాఁ దెలిసినది.” అనిరి.

ఆమె వారియాలోచనలఁ దెలిసికొని, వారిని బిలిపించివిందు చేసి యొక్కొక్కతె కొక్కొక్కకత్తి నిచ్చి, “యూసూఫా, వీరి యెదుటికి రమ్ము” అనెను. వా రాతనిఁ జూచి యద్భుతపడి తమ చేతులనే కోసికొని “దేవుఁడు మమ్ము రక్షించుఁగాక! ఇతఁడు మనుష్యమాత్రుఁడు గాఁడు. ఇతఁడొక గొప్పదేవుఁడుగాని యన్యుఁడు కాఁ” డనిరి.

ఆమె, “ఈతనిఁగూర్చియే మీరు నన్ను నిందించినారు. నా కామముల ఫలింపఁజేయుమని యాతని వేఁడికొంటిని. కాని, యాతఁడు చిత్తము చలింపక నిలిచినాఁడు. అయినను ఆతఁడు నాయాజ్ఞను మన్నింపకుండినచోఁ గారాగృహమునఁ ద్రోయించి తృణీకృతుం జేసెద” ననెను.

ఆతఁడు “ఓనాప్రభువా! వారియాజ్ఞలకంటె నాకాకారా గృహవాసమే మేలు. కాని, నీవు నన్ను వారినుండి తప్పింపకున్నచో నేను వారిలో యౌవనుఁడనై యజ్ఞాని నయ్యెదను” అనెను.

అతనిప్రభు వాతనిమొఱ నాలించి యతనినుండి వారివలలను తప్పించెను. అతఁడు శ్రోత! జ్ఞాని!

వా రాతనియమాయకత్వమును దెలిసికొనియుఁ గొంత కాలము బందీకృతుం జేయ నిశ్చయించిరి.

## అధ్యాయము 5.

అతనితోఁగూడఁ గారాగృహములోని కిరువురుయువకులును వచ్చిరి. అందులో నొకఁడు “నా కొకకల వచ్చినది. అందు నేను ద్రాక్షలను ద్రొక్కి రసముఁ దీయుచున్న ట్లయిన” దనెను. రెండవ

వాఁడు, "నాకలలో రొట్టెలు మోయుచున్నట్లును దానిసి పక్షులు తినుచున్నట్లును నైనది. నీవు పుణ్యవంతుఁడవు. ఈకలలయర్థ మేమో మాకుఁ దెలుపు" మని వేఁడికొనిరి.

అతఁడు "కలలో భుజింపయోగ్యమగునాహారము దొరకునా? దీనిఫలము వేఱు. అది కలుగకపూర్వమే మీకు దానియర్థము నెఱింగించెదను. నేను దేవుని నమ్మనివారియు, పరలోకము లేదను వారియు మతమును విసర్జించితిని. నాప్రభునీవిషయమై కొంత తెలిపి యున్నాఁడు.

నాపితరులగు ఇబ్రాహీము, ఇసాకు, యాకూబులమతము నేనే యనుసరించుచున్నాను. దేవునితో మన మితరులను జేర్పఁగూడదు. మనకును మనుష్యజాతికిని దేవుఁడు చాలినంత యొసగియున్నాఁడు. కాని మనుష్యులలోఁ జాలమంది కృతజ్ఞులై యుండరు.

నాతోఁ గారాగృహవాసము ననుభవించుసోదరులారా! చిల్లర దేవుళ్ళు గొప్పవారా? అద్వితీయుఁడును సర్వశక్తుఁడును నగు దేవుఁడు గొప్పవాఁడా?

మీతండ్రులు నామకరణముచేసిన నామమాత్రము లగు దైవములను మీరును నారాధించుచున్నారు. దేవుఁడు మీ రట్లు చేయుట కనుమతింపలేదు. ఆతఁడే తీర్పు చెప్ప నర్హుఁడు. తన్నుఁ దప్ప నితరులఁ బూజింపవల దని యాతఁ డాజ్ఞాపించి యున్నాఁడు. ఇదియే సరియైన భక్తి. కాని, చాలమంది కిది తెలియదు.

నాతోఁ గారాగారమున నున్నసోదరులారా! మీలో నొకఁడు తనప్రభువునకు ద్రాక్షరసము నైవేద్యము పెట్టును. రెండవవాఁడు సిలువపై మేకులతో తాపఁబడును. అతనితలను పక్షులు పెకలించుకొని తినును. మీ రడిగినయర్థ మిట్లే విధింపఁబడియున్నది" అనెను.

విడుదల యగునని చెప్పఁబడినయాతఁడు "నీప్రభువునకు నన్ను జ్ఞాపకము చేయు" మనెను. కాని, సైతా నాతనిఁగూర్చి ప్రభువునకుఁ దెలుపుట మఱచునట్లు చేసెను. అందుచే నాతఁడు కొన్ని సంవత్సరములు కారాగృహమున నుండవలసివచ్చెను.

అధ్యాయము 6.

రా జప్పుడు "నా కొకకల వచ్చినది. అం దేఁడు బక్కయావు లేఁడు పుష్టిగలయావులను మ్రింగివైచినవి. ఏడుధాన్యపు టెన్నులే పచ్చగా నుండెను. తక్కినవి యెండిపోయెను. మీకు దీని యర్థము తెలిసినచో నాకుఁ దెలుపుఁ" డనెను.

వారు "కథకుఁ గా ళ్ళుండునా? మాకు స్వప్నశాస్త్ర మంతగాఁ దెలియ" దనిరి.

అయిద్దఱిలో విడుదలయైనవాఁడు, "దానియర్థమును నేను చెప్పెదను. నన్ను తీసికొని పొం" డనెను.

"సత్యవంతుఁడవగు నోయూసూఫా! ఏడు బక్కయావు లేడు పుష్టిగలయావులను మ్రింగుట యేమో, ఏడు ధాన్యపుటెన్నులు పచ్చగా నుండి తక్కిన వెండిపోవుట యేమో నాకుఁ దెలుపుము. నేను పోయి వారికిఁ దెలిపెద" ననెను.

ఆతఁడు "మీయాచారప్రకార మేఁడుసంవత్సరములు ధాన్యమును వి త్తఁగలరు. మీరు కోసినధాన్యములో భుక్తికిఁ గావలసిన భాగము దప్పఁ దక్కినదంతయు ఎన్నులుగానే యుంచఁగలరు.

తరువాత నేఁడుసంవత్సరములు దుర్భిక్షము కలుగఁగా, మీరు దాఁచియుంచికొనినదానిలోనుండి కొంచెము కొంచెముగా నుపయోగించుకొనెదరు.

మఱుచటిసంవత్సరము వర్షము పడును. వా రప్పుడు ద్రాక్షలను ఫిండి రసమును దీసికొందురు" అనెను.

అధ్యాయము 7.

50. రా జాతనిఁ దనప్రమోలకుఁ దెండని యాజ్ఞాపించెను. దూత యూసూఫునొద్దకు రాఁగా నాతఁడు "నీప్రభువునొద్దకు మరలఁ 'బోయి, నీస్త్రీలకుఁ దాముపైచిన వలలఁగూర్చి తెలియును. వారు తమ చేతుల నేల నఱికివైచికొనిరో యడుగుము' అని చెప్పు" మనెను.

అప్పుడు రాజు స్త్రీలతో "మీరు యూసూఫు నేల పిలిచితిరి" అని యడుగ వారు "యూసూఫునుగూర్చి చెడ్డ యేమియు మాకుఁ దెలియదు. దేవుఁడు మమ్ము రక్షించుఁగాక !" యనిరి. రాజుభార్య "ఇపుడు సత్యము బయలుపడినది. నేనే యతనిని పాపమోహ పాశముల బద్ధునిఁజేయ నెంచితిని. అతఁడు సత్యవంతుఁడు" అనెను.

అప్పుడు యూసూఫు "తాను లేనప్పు డాతనియెడల నేను కుట్రగా నడచికొనలేదనియు, మోసగాండ్రపన్నాగములకు దేవుఁడు సహాయపడఁ డనియు నాప్రభువు తెలిసికొనుఁగాక !

---

# కాండము. 13

---

నే నేమో శుద్ధుఁడనని చెప్పను. దేవునిదయకుఁ బాత్రమయి నదితప్ప నేహృదయమైనను, నెప్పటికైనను పాపమునకుఁ దావుగాక మానదు. నాప్రభువు దయాళుఁడు, కరుణాళుఁడు" అనెను.

రాజు "అతనిని నాయొద్దకు తోడ్కొని రండు. నాయభి మానసేవకునిగా స్వీకరించెద" ననెను. అతఁడును వచ్చి మాట్లా డఁగనే,

"నన్ను దేశములోని ధాన్యపుకొట్లపై నియోగింపుము. వానిని జాగ్రత్తగఁ జూచుచుండెద" ననెను.

ఇట్లు యూసూఫు సుఖముగా యాదేశమున నుండునట్లు చేసితిమి. మేము మాయిష్టమువచ్చినవారికి, సౌఖ్యముల నిచ్చి, పుణ్యాత్ముల ధనము పోకుండఁ గాపాడుదుము.

దేవుని నమ్మి యాతనికి భయపడువారికిఁ బరలోకమున గొప్పమేలు కలుగును.

అధ్యాయము 8.

అప్పుడు యూసూఫుసహోదరులు వచ్చి యాతని సమీపించిరి. అతఁడు వారినిగుర్తించెనుగాని, వారతనినిగుర్తింపఁజాలరైరి.

అతఁడు వారికిఁ దగినసంభారములఁ జేకూర్చి, "మీతండ్రి నుండి మీసోదరునిఁ దీసికొనిరండు. నేను మంచిగృహస్థుఁడను గానా? మీకుఁ గడుపునిండ భోజనము పెట్టుచున్నానుగదా!

60. మీ రాతనిఁ దీసికొని రాకపోయినచో మీ కిచ్చుచున్న ధాన్యమును నిలుపుచేసెదను. మీరు నాసమీపమునకు రావల దనెను.

వారు తమతండ్రి నడిగి యట్లే చేసెద మని చెప్పిరి.

అతఁడు సేవకులతో "వారిధనమును వారిమూటలలోఁ గట్టి పెట్టుఁడు. వారు తమయింటికిఁ బోయి చూచుకొందురు. బహుశః వారు మనయొద్దకు తిరిగి వత్తురు" అనెను.

వారు తమతండ్రియొద్దకుఁ బోయి "తండ్రీ! మాధాన్యమును దీసికొనినారు. నీవు మాసోదరుని మాతోఁ బంపినయెడల మాభాగమును మా కిత్తురు. అతనిని భద్రముగఁ గాపాడెద" మనిరి.

ఆతఁడు మీసోదరుని మీకు పూర్వ మప్పగించితినిగదా! అట్లేకదా యిపుడును నాతనిని మీ కప్పగింపవలయును? దేవుఁడే గొప్పసంరక్షకుఁడు. దయాపరులలో నాతఁడే యుత్తముఁడు" అనెను.

వారు తమ మూటలను విప్పిచూచికొనఁగా నందు తమధన మంతయు నుండెను. వారు "తండ్రీ! మా కింకేమి కావలయును? ఇదిగో మాధనమును మా కిచ్చివేసినారు. మేము మాకుటుంబము లకు ధాన్యము నిచ్చి, మాసోదరునిగూర్చి జాగ్రత్త పుచ్చుకొని మఱియొకయొంటెభారము ధాన్యమును సంపాదించెదము. ఆపాటి మాకు లభింపకపోదు" అనిరి.

మీ కేవో కష్టములు సంభవించినఁదప్ప నాతని నాయొద్దకు భద్రముగఁ దెత్తు మని దేవునియాన ప్రమాణము చేసినఁగాని, మీతో నాతనిఁ బంపను" అని యాతఁ డనుమాటలను విని వారును నట్లె ప్రమాణము చేసిరి. ఆతఁడు "మీరు పలుకుదానికి దేవుఁడే సాక్షి.

పుత్త్రులారా! మీ రంద ఱొకటేద్వారముగుండ పురము లోనికిఁ బోకుఁడు. వేర్వేఱుద్వారములఁ బట్టుఁడు. అయినను దేవుఁ డనుశాసించినదానినుండి మిమ్ము రక్షింపఁజాలను. దేవుఁడు తీర్పు చెప్ప నర్హుఁడు. నే నతనినే నమ్మి యున్నాను. విశ్వాసు లాతనినే నమ్మి యుందురుగాక!" అనెను.

వారును దమతండ్రియాజ్ఞచొప్పున పట్టణములోనికిఁ బోయి దేవునియనుశాసనమునుండి తప్పించుకొనలేకపోయిరి. కాని, యాకూబు మనస్సులోనున్న యొకకోర్కెనుదీర్చుట కది చాలియుండెను. అతనికి మే మొసగినజ్ఞాన ముండెను. చాలమంది కాజ్ఞానములేదు.

## అధ్యాయము 9.

వారు యూసూఫునొద్దకు రాఁగానే యాతఁడు తనసోదరునిఁ జేరఁదీయఁగా నాతఁడు "నిశ్చయముగా నేను నీసోదరుఁడను. వారు చేసినదానికి చింతిల్లకుము" అనెను.

70. ఆతఁడు వారికి వలయుసంభారములఁ జేకూర్చి తనగిన్నెను సోదరునిమూటలోఁ గట్టి యుంచెను. అప్పుడు జాంఘికులు "బాటసారులారా! మీరు దొంగ" లని యఱచిరి.

"మీరేమి పోయిన" దని వా రడిగిరి.

"మారాజుగారిగిన్నె పోయినది. దాని నిచ్చివేయువారి కొక యొంటె మోయఁగలిగినంతధాన్య మిచ్చెదము. ధాన్యమునకు మేము బాధ్యులమై యుండెదము"

అని వా రనఁగా "దేవునియాన మే మీదేశములో నేరముచేయుటకు రాలే దని మీకు తెలియును. మే మెన్నఁడును దొంగతనము చేసి యుండలేదు" అని బదులు చెప్పిరి.

మిసిర్ (ఈజిప్టు) దేశస్థులు, "మీ రసత్యమాడినచో దొంగిలించినవారి కేమి యనుభవము కలుగవలయు" నని యడిగిరి.

"ఎవనిమూటలో గిన్నె కనఁబడునో యాతని మీకప్పగించెదము. అన్యాయపరుల కిదియే శిక్ష" యని వారు ప్రత్యుత్తర మిచ్చిరి.

యూసూఫు తనసోదరునిమూటను వెదుకకపూర్వము తక్కిన వారిమూటలు వెదకి తుదకు తనసోదరునిమూటనుండి యాగిన్నెను దీసెను. ఈయుపాయమును యూసూఫునకు మే మెఱింగించితిమి. దేవునియిష్టము లేనిదే రాజాజ్ఞప్రకార మాతనిఁ బట్టుకొన వీలు లేకుండెను. మా యిచ్చవచ్చినవారిని బుద్ధిమంతులఁ జేసెదము. జ్ఞానులలో నొకరికంటె నొక రెక్కువవా రుండ నేయున్నారు.

వారు "దొంగతనము చేసినవాఁ డీతఁడే కాఁడు. ఇతనికిఁ బూర్వ మీతనిసోదరుఁడుఁగూడ దొంగిలించినాఁ" డనిరి. కాని, యూసూఫునకుఁ దనరహస్యముదెలిసియు, దానినివారికివెలిబుచ్చలేదు. అయినను జనాంతికముగా "మీస్థితియే ధైర్యముగానున్నది. మీరు చెప్పునది దేవునికిఁ దెలియు" నని యాతఁడనెను.

వారు "రాజా! అతనికి వృద్ధుఁడగుతండ్రి యున్నాఁడుగదా. నీవు దయావంతుఁడవు. అతనికి బదులుగ మాలో నొకరిని గొనుము" అనిరి.

వారు "మాధన మెవరియొద్ద నున్నదో యతనినే పట్టుకొనకుండ దేవుఁ డనుగ్రహించుఁగాక! పట్టువడినయెడల మే మన్యాయవంతులమను నపవాదముపా లగుదుము" అనిరి.

అధ్యాయము 10.

80. వారును బెంజామినునుగూర్చి నిస్పృహఁజెంది తమలోఁ దా మాలోచించుకొనుట కొకచోఁ జేరిరి. వారిలోఁ బెద్దవాఁడు "పూర్వము మీతండ్రి మీచేత దేవునితోడుగాఁ బ్రమాణము గొనుట మీ రెఱుఁగరా? యూసూఫునుగూర్చి మీరు మీవిధిని నిర్వర్తింపకుంటిరిగదా. నాతండ్రి సెలవీయనిదే, దేవుఁడు నాతోఁ జెప్పనిదే నే నీ దేశమును వదలిపెట్టను. తీర్పు చెప్పఁగలవారిలో దేవుఁడే శ్రేష్ఠుఁడు.

మీరు మీతండ్రియొద్ద కేఁగి "తండ్రీ! నీకొడుకు దొంగతనము చేసినాఁడు. మాకుఁ దెలిసినదానినిగూర్చియే మేము సాక్ష్యమీయఁగలము. మాకుఁ దెలియనిదానినుండి మమ్ము రక్షించుకొనలేకపోతిమి.

కావలసినయెడల మేమున్ననగరమందుగాని, మేము ప్రయాణము చేసినబిడారునందుగాని, కనుఁగొనవచ్చును. మేము సత్యభాషణులము అనుఁడు" అనెను.

అతఁడు వారితో "ఇదియంతయు మీలో మీరు కూడఁబలుకుకొన్నారు. కాని యోర్పు మంచిది. దేవుఁడు జ్ఞాని, బుద్ధిమంతుఁడు. బహుశః అతఁడు వారి నందఱిని గలిపి నాయొద్దకుఁ దేఁగలఁడేమో"

అనుచు వారిని విడిచి "అయ్యో! యూసూఫా" యని దుఃఖించెను. దుఃఖముతో నతనికన్నులు తెల్లనయ్యెను. లోలోననే దుఃఖము నాతఁ డడంచుకొనెను.

వారు "నీవు చచ్చియో, చావనుండియో కాని, యూసూఫుఁ గూర్చి తలంప మానవు" అనిరి.

ఆతఁడు "నాదుఃఖమును విచారమును దేవునికే తెలుపుకొందును. మీకుఁ దెలియనిదానిని దేవుఁడు నాకుఁ దెలిపినాఁడు.

పుత్త్రులారా! అవిశ్వాసులు తప్ప నితరులు దేవునిదయను గూర్చి నిస్పృహఁజెందవక్కఱలేదు. కావున మీ రాశవిడువక పోయి యూసూఫును ఆతనిసోదరునిఁగూర్చినవార్తను కనుఁగొనుఁడు" అనెను.

వారును యూసూఫునొద్దకు వచ్చి "రాజా! మేమును మాకుటుంబములును మిగుల కష్టములో నున్నాము. మేము తెచ్చిన ధనము చాలకొంచెము. కావున మాకు భిక్షముగఁ దృప్తికరముగ ధనమిమ్ము. భిక్షాదాతలను దేవుఁ డనుగ్రహించును" అనిరి.

ఆతఁడు "యూసూఫునకును నాతని సోదరునకును నజ్ఞానముచే నేమి చేసిరో మీకుఁ దెలియునా" యనెను.

90. వారు "నీవే యూసూఫు వగుదువా" యని యడిగిరి. ఆతఁడు "నేనే యూసూఫును, ఈతఁడు నాసోదరుఁడు. ఇప్పుడు

మాయెడల దేవుఁడు సుముఖుఁడై యున్నాఁడు. దేవునికి భయపడి యోర్చి యుండువారికి న్యాయవంతులపుణ్యము నన్యాయముగా దేవుఁడు క్షీణింపఁ జేయఁడు" అనెను.

వారు "దేవునిగూన, నిన్ను మాకంటె నధికునిఁగా దేవుఁ డెంచి యున్నాఁడు. మేము పాపుల మైతిమి" అనిరి.

ఆతఁడు "ఈదినమున మీ కేనిందయు గలుగను. దేవుఁడు దయాపరులలో శ్రేష్ఠుఁడు. అతఁడు మిమ్ము క్షమింపఁగలఁడు.

మీ రీయంగీని దీసికొనిపోయి నాతండ్రిముఖముపైఁ గప్పుఁడు. అతనికి తిరిగి దృష్టి వచ్చును. కుటుంబము నంతటిని నాయొద్దకుఁ దీసి కొనిరండు" అనెను.

## అధ్యాయము 11.

బిడారు వెడలఁగనే వారితండ్రి "యూసూఫు జీవించియున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. నాకు మతిపోయిన దనుకొనుచున్నారా" యనెను.

వారు "దేవునితోడుగాఁ జెప్పుచున్నాము. నీవు పూర్వము వలె పొరబడుచున్నావు" అనిరి.

ఆసువార్త నొకఁడు తీసికొనివచ్చి యంగీ నాతనిముఖముపైఁ గప్పఁగా యాకూబునకు దృష్టి వచ్చెను.

అప్పు డాతఁడు "మీకుఁ దెలియనిదానిని దేవుఁడు నాకుఁ దెలిపియున్నాఁ డని మీకుఁ జెప్పియుంటిని కదా" అనెను.

వారు "తండ్రీ! మేము పాపులము. మాకొఱకు క్షమాపణ వేఁడుము" అనిరి.

ఆతఁడు "నాప్రభువు దయాళుఁడు. కరుణాళుఁడు. మిమ్ము క్షమింప నాతని వేఁడికొందును" అనెను.

100. వారును యూసూఫునొద్దకుఁ బోయి తనతల్లిదండ్రుల నాతనియొకుర నుంచి " దేవునియిష్టమైనచో మీరు సురక్షితముగా నీజిప్టుదేశములోఁ బ్రవేశింపుఁడు " అనెను.

అతఁడు తన మాతాపితలను సింహాసనముపై నుంచఁగా తక్కిన వా రతనికి సాష్టాంగపడిరి. అప్పు డాతఁడు " తండ్రీ ! పూర్వము నాకు వచ్చినకల కథ మిదియే. నాప్రభు విప్పుడు దాని సత్యమైనదిగా జేసినాఁడు. ఆతఁడు నాకు వరదుఁడై కారాగృహమునుండి తప్పించి నాకును నాసోదరులకును సైతాను కలహములఁ గల్పించినపిదప మిమ్ము నెడారినుండి యీవలకుఁ దెచ్చినాఁడు. నాప్రభువు జ్ఞాని బుద్ధిమంతుఁడు. తన కిష్టమైనవారియెడ నాతఁడు సుముఖుఁడై యుండును

ప్రభువా ! నీవు నాకు రాజ్య మిచ్చి, రహస్యార్థముల దెల్పుశక్తి నిచ్చినావు. స్వర్గమర్త్యముల సృజించినప్రభువా ! ఇహ పరలోకములందు నీవే నాకు రక్షకుఁడవు. నన్ను భక్తునిగ నే చంపి న్యాయవంతులలోఁ జేర్పుము " అనెను.

ఇది రహస్యచరిత్రములలో నొకటి. దీనిని మేము మీకు దెలిపినాము. యూసూఫు సోదరులు కుట్రలు పన్నినప్పుడు నీవు వారితోఁ జేరలేదు. మనుష్యులందఱును విశ్వాసులుగా నుండవలె నని నీవెంత యభిలషించినను వారిలోఁ జాలమంది విశ్వసింపరు.

ఈవార్తకై వారినుండి యేప్రతిఫలమును నపేక్షింపకుము. మనుష్యజాతి కంతటికి నిది యొకబోధన.

## అధ్యాయము 12.

స్వర్గమర్త్యములం దెన్నిసూచనలు కనఁబడినను వారు వానిని సరకుగొనక తప్పించుకొందురు,

దేవునితో నితరదైవములఁ జేర్పనిదే వా రాతని నమ్మరు.

ఏమి ! వారికి మాఘోరశిక్ష కలుగదనికాని, వా రేమతి యున్నప్పు డాగంట హఠాత్తుగా వారికి వినఁబడదనికాని, వారు నిశ్చయముతో నున్నారా ?

వారితో "ఇది నామార్గము. నేనును, న న్ననుసరించు వారును స్పష్టమగుసాక్ష్యము నాధారముచేసికొని మిమ్ము దేవుని యొద్దకు రం డని పిలుచుచున్నాము. దేవుఁడు కీర్తనీయుఁ డగుఁగాక ! నేను దేవునితో నితరదైవములను జేర్చువాఁడను గాను" అనుము.

ఆయానగరములవారికి రహస్యములఁ దెలిపి, వారినుండియే ప్రవక్తల నెంచి, మిమ్ముఁ బోలె నింతకుఁబూర్వ మెవ్వరిని మేము పంపి యుండలేదు. వారు దేశసంచారముఁ జేసి తమపూర్వులకుఁ బట్టినగతిని కనుఁగొనఁ జాలకున్నారా ? దైవభీతిపరులకుఁ బరలోకమున గొప్పవసతి యేర్పడును. కావున వారు బోధపడుచుకొనరేల ?

110. తుదకు ప్రవక్తలు నిరాశ చేసికొని యసత్యవచను లను వాడుకపడ నున్నప్పుడు, మేము వారికి సహాయపడి మాయిష్టము వచ్చినవారిని విడుదల చేసితిమి. కాని, దుష్టులపై మాకు పగ తొలఁగిపోలేదు.

నిశ్చయముగా బుద్ధిమంతులకు వారిచరిత్రములోనే యొక యుదాహరణ మున్నది. ఇది కల్పితకథ కాదు. పూర్వగ్రంథముల యర్థమునే యిది తిరిగి చెప్పుచున్నది. వానికే యిది వ్యాఖ్యానము. విశ్వాసులగువారి కిది రక్షణోపాయము. దయాసంపాదకము.

# సురా 13 ఉరుము.

మక్కా-43 పద్యములు-6 రుకూ్కలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

అలీఫ్. లమ్. మిమ్. ర. ఇవిగో గ్రంథములోని సూచనలు! నీప్రభువునుండి వచ్చినదే సత్యము. కాని మనుష్యులలోఁ జాలమంది విశ్వసింపరు.

మీకు కనఁబడని స్తంభములతో స్వర్గములను లేవఁ దీసిన వాఁడు దేవుఁడే. తరువాత నతఁడు సింహాసన మెక్కి సూర్యచంద్రు లకు గతుల నేర్పఱిచెను. వారు తమతమస్థానములఁ జేరుదురు. ఆతఁ డన్నివస్తువుల కాజ్ఞయిచును. మీరు మీప్రభువును గూడుటఁ గూర్చి మీకు దృఢవిశ్వాసము గలుగుట కాతఁడు తనసూచనలను స్పష్టము చేయుచుండును.

భూమిని పఱచియుంచి దానిపైఁ బర్వతములను నదులను నాతఁ డుంచెను. అందు ఫలమునకు రెండేసరకములచొప్పున నుంచెను. రాత్రి వచ్చి పగటిని కప్పున ట్లాతఁడు చేయును. ఆలోచించువారి కిందు సూచన లున్నవిగదా!

భూమిపై నొకదాని కొకటి చేరువగా ద్రాక్షలు, ధాన్యము, ఒంటరిగ నుండు ఖర్జూరపుచెట్లు లేక వనములుగలభాగములు నున్నవి. అన్నిటికి నొకేజలము పోసినను వానిలో నొకదానికంటె నొకటి మంచియాహార మగును. బోధపఱుచుకొనువారికి వీనియం దెల్ల సూచన లున్నవి గదా!

నీ వెప్పుడైన నాశ్చర్యపడియుందువు కాని, వారు "మేము బుగ్గియై పోయినపిదప మాకు పునస్సృష్టి కలుగునా?" అనుమాట

యింతకంటె నెక్కువ యాశ్చర్యము. వీరే తమప్రభువునందు విశ్వాసము లేనివారు. వీరిమెడలకే పట్టీలు తగిలింపఁ బడును. వీ రగ్ని యందు చిరకాలము వసింపవలసియుండును.

మేలుకంటె కీడునే వేగము తెమ్మని వారు నిన్ను త్వరపెట్టుదురు. వారికి పూర్వముగూడ నట్టివా రుండిరి. మనుష్యులు పాపాత్ములైనను వారి ప్రభువు వారియెడ కరుణాప్రపూర్ణుఁడై యున్నాఁడు. కాని, నీప్రభు వతికఠినముగఁ గూడ శిక్షింపసమర్థుఁడు.

విశ్వసింపనివారు "అతని కొకసూచన పంపఁబడక యుండెనిచో......" అని యందురు. జనుసూచన నిచ్చుటయే నీపని ప్రతిజాతివారికిని దారి చూపువాఁడు వచ్చియే యున్నాఁడు.

అధ్యాయము 2.

స్త్రీలభారము దేవునికిఁ దెలియును ; వారిగర్భము లెట్లు పెరుగుచు తగ్గుచుండునో యాతని కెఱుక. అతఁడు సర్వవిషయములందును మితముగనే యుండును.

అతఁడు రహస్యములను బహిరంగవిషయములను తెలిసికొనియుండును. ఆతఁ డున్నతుఁడు ; మహాత్ముఁడు.

10. తనమాటలను లోన దాఁచికొనువాఁడును, పైకి ప్రకటించుకొనువాఁడును నాతని కొకటే. రాత్రిపూఁట దాఁగియున్నవాఁడును, పగటిపూఁట పైకి వచ్చువాఁడును నొక్కటే.

దేవునియాజ్ఞచొప్పున నాతనిఁ గనిపెట్టుచు నతనివెనుకను ముందును దేవత లుందురు. మనుష్యులు తమస్వభావమును మార్చుకొనువఱకును దేవుఁడు తా నిచ్చుచుండుదానిని మార్పఁడు. దేవుఁడు మనుష్యులకు హాని చేయనెంచినయెడల దానిని తప్పింపఁగలవారు కాని, సహాయపడువారు గాని, యుండరు.

భయమునకును నాశకును మెఱపును బుట్టించువాఁ డాతఁడే. అతఁడే జలభరితములగు మేఘములను దెచ్చువాఁడు.

అతనికి భయపడి యుఱుమును, దేవతలును నాతని స్తుతింతురు. అతఁడు పిడుగులను బంపి, వారు దేవునిగూర్చి వివాదములు చేసికొనుచున్నప్పుడే తనయిచ్ఛవచ్చినవారిని చంపివేయును. అతనిశక్తి యనంతము.

తాను ప్రార్థనఁ గొనుట కాతనికి హక్కు గలదు కాని, దేవునిఁగాక వారు ప్రార్థించుదేవతలు వారికి ప్రత్యుత్తర మీయరు. ఒకవేళ నిచ్చినచో నది "నోటికి నీరు కావలయు నని చేతులు సాచఁగా నవి యందనియట్లే యుండును. భక్తిహీనులప్రార్థన చంచలమై యుండి యంతరించిపోవును.

స్వర్గమర్త్యములయందున్నదంతయు నాతనికి మనస్ఫూర్తిగనో నిర్బంధముచేతనో నమస్కరించుచుండును. వానినీడలుగూడ సాయంప్రాతస్సమయములయందు సాష్టాంగపడుచుండును.

"స్వర్గమర్త్యములప్రభు వెవఁడు ? దేవుఁడు. అయినఁ దమకుఁ దామే మేలు గాని, కీడు గాని చేసికొనఁజాలని రక్షకుల నేల పరిగ్రహించి యున్నారు ? ఏమి ! గ్రుడ్డివారును, చూడఁగల వారును, సమానులేనా ? వెలుతురును, చీఁకటియు నొకటేనా ? లేదా యాతనిసృష్టివలెఁ గనఁబడుసృష్టిని చేయఁగలవారిని వారు చేకొనియున్నారా ? దేవుఁడే సర్వసృష్టికిని కర్త ! అతఁ డొక్కఁడే ! అతనిదే విజయము" అనుము.

అతఁడు స్వర్గమునుండి వర్షమును పంపించును ; అంతఁ గొలఁది కొలఁదిగఁ బ్రవాహములు ప్రారంభించును. పిదప నురగఁ గ్రక్కుచు వఱదలు వచ్చును. ఆభరణములకొఱకు కఱగించులోహములనుండియు నీ నురగవంటి మష్టే తేలును. దేవుఁ డీరీతిగ సత్యాసత్యముల

నేర్పుచుండును. నురగ వేగముగ నదృశ్య మగును. మనుష్యున కుప యుక్తమైన దేదో భూమిపై నిలిచిపోవును. దేవుఁ డిట్లే యుపమాన ములఁ గల్పించును !

దేవునికిఁ బ్రత్యుత్తర మిచ్చువారికి మంచిబహుమానము కలుగును. అతఁడు పిలువఁగాఁ బలుకనివారు, భూమిలో నున్న ధనము కంటె రెండింత లైన నిచ్చి తమవిడుదలకొఱకుఁ బ్రయత్నింతురు. వారిగణన యంతయు దుష్టమే ! వారికి నరకమే వాసస్థానము. అచట వారిశయ్య దుఃఖకరము.

అధ్యాయము 3.

నీప్రభువునుండి వచ్చినది సత్య మని తెలిసికొనినవాఁడు గ్రుడ్డివానివలె సంచరింపవచ్చునా ? అంతశ్చక్షువులును,

20. దేవునిమ్రొక్కులఁ జెల్లించి, తమయొడంబడికను తప్పని వారును,

దేవుఁడు కలుపుమనినదానిని కలుపుచు, ప్రభువునకు భయ పడుచు, తనకు దేవునియొద్ద రాఁబోవుకీడునకు వడఁకువారును,

తమప్రభువు మొగమును జూచుటకై, శోధనలకు తాళి, ప్రార్థనఁ దప్పక రహస్యముగను బహిరంగముగను మేము వారి కిచ్చిన దానిలోనే భిక్షమునొసగుచు, మేలు చేసి కీడును దొలఁగించు వారును, దీనిని జ్ఞాపక ముంచుకొందురు. వీరికి ఈడెను ఉద్యానవన ములయందు వాసము లభించును.

వీ రా నందనవనములలోనికి తమతండ్రులతోను, భార్యల తోను, తమసంతతివారితోను, న్యాయవంతులతోను గలసి ప్రవేశిం తురు. ప్రతిద్వారమునొద్దను దేవతలు వారిని దర్శించుచుందురు.

" మీరు శోధనల నన్నిటిని సహించిరి. మీకు శాంతి కలుగుఁ

గాక !” అని వా రందురు. వారివాసస్థాన మతిమనోహరముగా నుండును.

కాని, తాము దేవునితోఁ జేసికొనినయొడంబడికను తప్పి, దేవుఁడు కలుపుఁ డని యుత్తరువిచ్చువానిని విడఁదీయుచు భూమిపై నకార్యములఁ జేయువారికి శాపమును దుఃఖావాసమును సిద్ధముగా నున్నవి !

దేవుఁడు తనయిచ్చవచ్చినవారికి గొప్పగనో కొలఁదిగనో యిచ్చుచుండును. వారు ప్రస్తుతజీవనముఁ జూచి సంతోషింతురుకాని, యది క్షణభంగురము. రాఁబోవుజీవనమే శ్రేష్ఠమైనది.

## అధ్యాయము 4.

విశ్వాసరహితులు “ అతనికి తనప్రభువునుండి యొకసూచన రాకుండిన ........ ? ” అని యందురు. వారితో “ దేవుఁడు తన యిచ్చవచ్చినవారిని తప్పుత్రోవఁబెట్టును. కాని, యతనివంక మొగమై,

విశ్వాసము కలిగి, నిశ్చలచిత్తులై దేవుని ధ్యానించువారి కాతఁడు సరియగుదారిఁ జూపును. ఏమి, మనుష్యులహృదయములు దేవుని ధ్యానింపవలదా !

విశ్వాసులును, క్రమవర్తనులు నగువారి కానందమును, సుఖ వాసమును సిద్ధముగ నున్నవి.

30. ఈజనులకు పూర్వమును మఱికొందఱుజాతులవా రుండిరి. ని న్నీజనులయొద్ద కిపు డంపియున్నాము. నీకు మేము తెలిపినదానిని నీవు వారి కెఱింగింపవలెను. అయినను వారు కరుణామూర్తి యగు దేవుని విశ్వసింపరు. “ అతఁడు నాప్రభువు. అతఁడు తప్ప మఱియొక దేవుఁడు లేఁడు. నే నతనినే నమ్మియున్నాను అతనియొద్దకే నేను మఱలి పోవలయును ” అనుము.

అచలములను చలింపఁజేసి, భూమిని బ్రద్దలుచేసి, చచ్చిన వారిని మాట్లాడింపఁగల కురా నొకటి యున్న యెడల.........! కాని, సర్వాధికారమును దేవునిచేతులలో నున్నది. దేవుని కిష్ట మైనచో నాతఁడు సర్వజనులను సరియగుత్రోవనే నడిపించి యుండు ననుటను విశ్వాసులు సందేహింతురా? దేవునికోపఫలము వచ్చు వఱకును, అవిశ్వాసుల కాపదలు వచ్చి తమయిండ్లసమీపముననే కాఁపురముండుట మానవు. దేవుఁడు తా నిచ్చినమాటను తప్పఁడు.

అధ్యాయము 5.

నీకుపూర్వము వచ్చినప్రవక్తలును వేళాకోళములకు పాలయిరి. నే నవిశ్వాసులతోఁ జాలకాలము సహించి యూఁటినిగాని, తుదకు వారిని పట్టుకొని, ఘోరముగ శిక్షించితిని!

ప్రత్యాత్మయుఁ జేయుకర్మలను గుర్తించుచున్నవాఁ డెవఁడు? అయినను వారు దేవునితో సమానులుగ నితరులను నిల్పిరి. "వా రెవరో వారిపేళ్ళను జెప్పుము. ఏమి! భూమిపై దేవునికిఁ దెలియని దాని నాతనితోఁ జెప్పెదవా! వారిది కేవల ముత్తపేరే కదా! పూర్వమునుండియు నీమోసము నవిశ్వాసులు కల్పించుచూడినదియే. వారు త్రోవఁదప్పి యున్నారు. దేవుఁడు త్రోవఁ దప్పించినవాని కెవ్వఁడును దారిఁ జూపఁజాలఁడు.

వారి కీలోకములోనే శిక్ష సిద్ధముగ నున్నది. పరలోకమున నింతకంటె నెక్కువశిక్షను వా రనుభవింపఁగలరు. వాని నెవ్వరును దేవునినుండి దాఁచిపెట్టఁజాలరు.

దేవునికి భయపడువారి కాతఁడు వాగ్దానము చేసినభోగభూమి యిదిగో చిత్రపటమున నున్నది! దానియందలిపొదరిండ్లక్రింద తరంగి ణులు ప్రవహించుచున్నవి. అందు శాశ్వతమగు నాహారమును, వృక్ష

చ్చాయలు నున్నవి. దైవభీతిపరుల కిదియే బహుమానముగ రానున్నది. అవిశ్వాసుల కగ్నియే గతి.

మావలన గ్రంథము స్వీకరించినవారు నీ కిచ్చినదానిని జూచి సంతోషింతురు. కాని, దానిని నిరాకరించువారు కొందఱు కలసి యున్నారు. వారితో "నేను దేవు నారాధింపవలయు ననియు, నత నితో నితరులఁ జేర్పఁగూడ దనియు నా కాజ్ఞ యైనది. నేనతనికే మొఱలిడెదను. నే నాతనియొద్దకే మఱలిపోయెదను" అనుము.

ఈరీతిగా మే మరబ్బీభాషలో ధర్మశాస్త్రముగా నీకురానును బంపియున్నాము. ఇప్పుడు నీ కీజ్ఞానము గలిగినపిదపఁగూడ వారి కోరికల ననుసరించిన యెడల దేవునినుండి నిన్ను తప్పింపఁగల సంరక్షకుఁడుగాని, పోషకుఁడుగాని యుండఁబోఁడు.

అధ్యాయము 6.

నీకుఁబూర్వముగూడ మేము ప్రవక్తల నంపి వారికి భార్యలను పుత్త్రిలను గూర్చితిమి. కాని, దేవునియనుమతి లేనిదే యేప్రవక్తయు నద్భుతకార్యములఁ జేసియుండలేఁడు. ఆయాయుగములయం దాయా గ్రంథములు విధింపఁబడియున్నవి.

దేవుఁడు తనయిచ్ఛవచ్చినదానిని తీసివేయుటయో, స్థిరపఱుచు టయో చేయుచుండును. జ్ఞానప్రదాత యాతఁడే!

40. మేము చెప్పినయుపద్రవములలోఁ గొన్నిటిని నీకుఁ జూపినను, అంతకుఁబూర్వమే నిన్ను దీసికొనిపోయినను, నీవు చేయవలసినది కేవలము బోధనయే. లెక్కలను మేము వేయుచుందుము.

మేము వారిదేశములోనికి వచ్చి, దానిసీమల నాక్రమించు కొనుచుండుట వారికిఁ గనఁబడదా ? దేవుఁ డొకశిక్షను జెప్పిన యెడల దానిని తప్పించువా రెవ్వరు నుండరు ? అతఁ డతిత్వరిత ముగ లెక్కలను దీసికొనుచుండును.

వారిపూర్వులు కుట్రలఁ బన్నిరి. కాని కుట్ర యంతయు, దేవునియధీనములోనే యున్నది. అతఁ డందఱికార్యములను తెలిసి కొనియే యున్నాఁడు. అచట వసించులాభ మెవరిదో యవిశ్వాసులకుఁ దెలియఁగలదు.

ఇదిగాక యవిశ్వాసులు "నీవు దేవుఁడు పంపించినవాఁడవు కావు" అని యందురు. "మీకును నాకును గ్రంథముఁగూర్చి తెలిసినవారికిని దేవుఁడే సాక్షి" అనియు నను.

---

# సురా 14. ఇబ్రాహీమునకు శాంతి కలుగుఁగాక.

---

మక్కా.-52 పద్యములు.-7 రుకూ౯లు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లమ్. ర. వారిప్రభువుననుమతిచొప్పున మనుష్యులను జీఁకటినుండి శక్తిమంతుఁడు ప్రభావయుతుఁడు నగు దేవునిమార్గములోనికిఁ ద్రిప్పెదవను నుద్దేశముతో నీ కీగ్రంథము నంపినాము.

స్వర్గమర్త్యములం దున్నదంతయు నాతనిదే. రానున్నదానికంటెఁ బ్రస్తుతజీవనము నెక్కుడుగఁ బ్రేమించి, దేవునిమార్గము నుండి తప్పిపోయి, దానిని వంకరచేయఁ బ్రయత్నించు నవిశ్వాసులకు ఘోరశిక్ష కలుగనున్నది.

వీరు చాలవఱకు తప్పుదారిఁ బట్టియున్నారు.

అతఁడు వారితో స్పష్టముగాఁ బలుకుటకు, వారిభాషలోనే ప్రసంగింపుమని ప్రవక్తల నందఱను బంపినాము. కాని, దేవుఁడు తన యిచ్చవచ్చినవారిని తప్పుదారిఁ బెట్టి, యిచ్చవచ్చినవారిని మంచి మార్గమునఁదీసికొని పోవును. అతఁడు శక్తిమంతుఁడు, బుద్ధిమంతుఁడు.

పూర్వము మూసాను మాసూచనలతోఁ బంపి యాతనితో "నీప్రజలను చీఁకటినుండి వెలుతురులోనికిఁ దీసికొని రమ్ము. దేవుని దినములఁగూర్చి వారికి జ్ఞాపకము చేయుము" అంటిమి. ప్రతిసహన పరునకును, కృతజ్ఞునకును, నిశ్చయముగా నిందు సూచన లున్నవి.

అప్పుడు మూసా తనప్రజలతో "ఫిరౌను కుటుంబమువారు మిమ్ము ఘోరబాధలపాలుచేసి, మీయాఁడుపిల్లలను మాత్రము వదలి మగపిల్లలను నఱికివైచినప్పుడు దేవుఁడు మీకుఁ గనఁబఱచినదయను స్మరింపుఁడు" అనెను. ఇంక మీప్రభువునుండి గొప్పశోధన యుండెను.

అధ్యాయము 2.

నీప్రభువు, "మీరు వందనములనర్పించినచో మిమ్ముల నంత కంతకు నభివృద్ధిపఱిచెదము. కానిచో......మాశిక్ష నిశ్చయముగా నతిఘోర మైనది" అని వారికి వినఁబడునట్లు చేసెను.

మూసా "మీరును, భూలోకవాసులును, కృతఘ్నుల రైనను దేవుని కేలోపము నుండదు. అతఁడు సర్వదా స్తవనీయుఁ" డనెను.

మీపూర్వులగు నుహు, ఆద్, సామూదులప్రజలఁగూర్చియు మీతరువాతివారిఁగూర్చియు, కథలు మీచెవిని బడలేదా? దేవునికిఁ దప్ప నవి యొరులకుఁ దెలిసియుండలేదు. తమసందేశమునుగూర్చిన సాక్ష్యముతో వారు వచ్చినప్పుడు, వారు నోటిపై చేతుల నుంచుకొని "నిశ్చయముగా మీసందేశమును మేము నమ్మము. మీరు మ మ్మాజ్ఞాపించుదానివిషయమై మాకు సంశయము కలుగుచున్నది" అనిరి.

10. వారిప్రవక్తలు "స్వర్గమర్త్యముల సృజించి, మిమ్ము క్షమించుటకై పిలిచికొంతకాలమువఱకును మీకు విశ్రాంతికలుగఁ జేసినదేవుని విషయమై యేమైన సందేహము గలదా ?" యని యడిగిరి. వారు వారితో "మీరును మావంటిమనుష్యులే. మాతండ్రు లవలంబించిన యారాధననుండి మమ్ము దప్పింప నెంచుచున్నారు. కావున మా కొకస్పష్టమగుసాక్ష్యమును దీసికొని రండు" అనిరి.

వారి ప్రవక్తలు వారితో "మేము నిశ్చయముగా మీవంటి మనుష్యులమే, కాని, దేవుఁడు తన కిష్టమైనవారికే వరములఁ బ్రసాదించును దేవునియాజ్ఞ లేనిదే మే మేసాక్ష్యమును దేఁజాలము. కావున విశ్వాసులగువారు దేవుని నమ్మియుండెదరుగాక !

మనమార్గములయందు మనల నింతకుఁబూర్వము సరిగ నడిపించినదేవుని నేల మనము నమ్మఁగూడదు ? మీరు మా కొనర్పఁదలఁచినకీడును మేము తప్పక యోర్పుతో సహించి యుందుము. విశ్వాసులు దేవుని నమ్మియుందురుగాక !" అనిరి.

అధ్యాయము 3.

వారిలో నమ్మనివారు ప్రవక్తలతో "మీరు మామతము లోనికి వెంటనే వచ్చి చేరనియెడల మి మ్మీదేశమునుండి వెడలఁ గొట్టెద" మనిరి. అప్పుడు వారిప్రభువు వారికి "మేము నిశ్చయముగా దుష్టవర్తనులను నశింపఁజేతుము.

వారిపిదప వారిదేశములో మిమ్ము వసింపఁజేతుము. మాన్యాయసింహాసనమునొద్ద మొగముఁ జూప జంకి మాకోపమునకు భయపడువారి కిది యొకసూచన" అని రహస్యమును వెలిబుచ్చెను.

అంత వారు దేవుని శరణుఁ జొచ్చిరి. గర్విష్ఠులుఁ దిరస్కారపరులు నగువందఱును నశించిరి.

వారిముందు నరక మున్నది. వారు కుళ్ళి కంపుకొట్టునీళ్ళను త్రాగవలసి యున్నది.

వారు దానినే యాహారముగాఁ గొని, యేవగించుకొనుచు మ్రింగలేక యుందురు. వారి కన్నిదిక్కులను మృత్యువు వెన్నంటు చున్నను వారు చావఁజాలరు. వారియెదుట ఘోరబాధ తాండవ మాడుచుండును.

అది ప్రభువును నమ్మనివారియాకృతిఁ దాల్చి యుండును. వారికృత్యములు తుపానుదినమున గాలి కెగిరిపోవుబూడిదవలెఁ బరిణ మించును. వారు తమకర్మముల కెట్టిఫలమును బొందఁజాలరు. దారిని విడిచి దూరముగఁ దొలఁగి యుండుట కిదియే ఫలము.

సత్యముగా దేవుఁడు స్వర్గమర్త్యములను సృజించియుండుట మీకుఁ గనఁబడలేదా? అతని కిష్టమైనయెడల మిమ్ము నశింపఁజేసి మీస్థానమున మఱియొకజాతివారి నుంచియుండును.

20. ఇది దేవుని కొకకష్టము కాదు.

మనుష్యజాతి యంతయు దేవునిమ్రోలకు రాఁగలదు. అప్పుడు బలహీనులు బలవంతులతో "నిశ్చయముగా మేము మిమ్మనుస రించితిమి. కావున, దేవునికోపమునఁ గొంతభాగమును మమ్ములనుండి మీరు తప్పింపలేరా?" అని యడిగెదరు. బలవంతులు "దేవుఁడు మమ్ము సరియైనదారిలో నడిపించినచో మిమ్మును మేము నడపించి యుందుము. ఇప్పుడు మేము సహించి యున్నను లేకున్నను నొక్కటే. మేము తప్పించుకొన వీలులేదు" అని యందురు.

## అధ్యాయము 4.

దండన విధింపఁబడినపిదప సైతాను "దేవుఁడు మీ కొక సత్యమగు వాగ్దానముఁ జేసియున్నాఁడు. నేనును నట్లే చేసితిని.

కాని, మిమ్ము మోసపుచ్చితిని. అయినను మీపై నాకు శక్తి లేదు. నేను మిమ్ము పిలిచినమాత్రమున మీరు పలికితిరి. కావున నన్ను మీరు నిందింప వలదు. మిమ్ము మీరే నిందించుకొనుఁడు. నేను మీకు సహాయపడలేను. నాకును మీరు సాయము చేయలేరు. మీరు నన్నవనితో సమానుఁడ నని యెంచితిరో యతనితో నేను సమానుఁడను కాను" అనును. దుష్టులకు ఘోరశిక్ష కలుగనున్నది.

కాని, విశ్వసించి క్రిమవర్తనులైనవారిని నదులు ప్రవహించు నుద్యానవనములలోనికిఁ దెత్తురు. తమప్రభువుననుజ్ఞచొప్పున వా రందు చిరకాలము వసింపఁగలరు. వారు "శాంతి రస్తు" అని యొకరి నొక రభినందించుకొందురు.

దేవుఁడు మంచిమాటను దేనితో సరిపోల్చునో మీకుఁ దెలియదా ? భూమిలో వ్రేళ్ళు దృఢముగ నాటికొని, శాఖలు స్వర్గమువఱకు వ్యాపించి,

తనప్రభువు నిచ్చచొప్పున సర్వర్తుఫలప్రదాయకమగు వృక్షముతో నాతఁడు దానినిఁ బోల్చియున్నాఁడు. జనులు బాగుగ యోచన చేసెదరని దేవుఁ డిట్టిపోలికలను గల్పించును.

భూమినుండి వేళ్లతోఁ బెల్లగింపఁబడి, నిలుచుటకు శక్తిలేని వృక్షముతో చెడ్డమాట పోల్పఁబడినది.

నమ్మినవారిని దేవుఁ డిహపరలోకములందు మాట తప్పక స్థిరపఱచియుండును. కాని, యాతఁడు దుష్టులను తప్పులోనికి దించును. దేవుఁడు తనయిష్టమైనదానినే చేయును.

## అధ్యాయము 5.

దేవుఁడు ప్రసాదించినదాని కవిశ్వాసముఁ జూపి వారిప్రజలను నరకములోనికి దించినవారినిఁ జూచితివిగదా !

నరకమా ! వా రందే దగ్ధు లగుదురు. వారియావాసము దుఃఖావిలముగ నుండును.

30. మనుష్యునిఁదనమార్గమునుండి తప్పించుటకు వారు దేవునితో సమానులఁ గల్పింతురు. "ఇంకఁ గొంతకాలము మీసంతోషముల ననుభవింపుఁడు. కాని, యిక్కడనుండి మీ రగ్నిలోనికి పోఁగలరు" అని చెప్పుము.

విశ్వాసులగు నాకింకరులతో మాట్లాడుము. స్నేహముగాని, రాకపోకలుగాని, లేకుండనుండుదినము రాకపూర్వమే వారు ప్రార్థనలు సలిపి, మేము వారి కిచ్చినదానిలోఁ గొంత రహస్యముగనో బహిరంగముగనో భిక్షము పెట్టునట్లు చేయుము.

స్వర్గమర్త్యముల సృజించి, స్వర్గమునుండి వర్షమును గురియించి, మీకాహారముగాఁ బండ్లను కల్పించినవాఁడు దేవుఁడే. అతని యాజ్ఞ చొప్పున సముద్రముపైఁ బోవుటకు నావలను మీయధీనము చేసినాఁడు. నదులపై మి మ్మధికారులఁ జేసినాఁడు.

సూర్యచంద్రులను గతి తప్పకుండ నుంచి వారినిఁగూడ మీలొంగుబాటులో నుంచినాఁడు. రాత్రింబవళ్ళనుగూడ నాతఁడు మీ వశము చేసినాఁడు.

మీ రడిగినదాని నంతయు నాతఁడు మీ కొసగియున్నాఁడు. దేవునివలన మీరు పొందినవరములను లెక్కింప శక్యము గాదు. నిశ్చయముగ మనుష్యుఁ డన్యాయపరుఁడు, కృతఘ్నుఁడు నై యున్నాఁడు.

## అధ్యాయము 6.

ఇబ్రాహీము "ప్రభువా, ఈ దేశమును గాపాడుము. మమ్ము విగ్రహములనుండి మరల్పుము.

ప్రభువా ! అవి చాలమందిని త్రోవ తప్పించినవి. కాని, నన్ననుసరించినవాఁడు నావాఁ డగును. నన్ను ధిక్కరించినవాఁడు .........నీవు నిశ్చయముగా దయాళుఁడవు. కరుణాలవాలుఁడవు.

ప్రభువా ! నాసంతానములోఁ గొందఱను నీపవిత్రగృహము నకుఁ జేరువగానున్న సంధ్యమగుకొండలోయలో నుంచినాను. ప్రభువా ! వారిని క్రమము తప్పక ప్రార్థనలు సలుపఁజేయుము. కావున మను ష్యులహృదయములు వారివైపు తిరిగి, వారు కృతజ్ఞులుగ నుండుటకు వారికి ఫలం డ్లందునట్లు చేయుము.

ప్రభువా ! మేము దాఁచినదానిని, వెలిబుచ్చినదానినిఁగూడ నీ వెఱుఁగుదువు. స్వర్గమర్త్యములం దెద్దియు నీకుఁ దెలియనిది లేదు.

నాముసలితనమున ఇస్మేలు, ఇసాకులను నాకుఁ బ్రసాదించిన దేవుఁడు కీర్తనీయుఁ డగుఁగాక ! నాప్రభువు ప్రార్థనలను తప్పక వినును.

40. ప్రభువా ! నేనును, నాసంతతివారును ప్రార్థనాపరులమగున ట్లనుగ్రహింపుము. ప్రభువా ! యీనామనవి సంగీకరింపుము.

ప్రభువా ! లెక్కలు తీసికొనుదినమందు నన్నును నాతల్లి దండ్రులను విశ్వాసులను క్షమింపుము '' అనెను.

అధ్యాయము 7.

దేవుఁడు దుష్టులకార్యములను సరకుగొనకున్నాఁడని తలంప వలదు. భయముతో వారు తెల్లఁబోయి చూడఁగలదినమువఱకును మాత్రి మాతఁడు విశ్రాంతిని గలిగించినాఁడు.

వారు భయముతో త్వరపడెదరు. వారు దయను యాచిం చుచు తలల నెత్తికొందురు. వారిచూపు నిట్టన నిలిచిపోయియుండును. వారిహృదయములు శూన్యములై యుండును.

కావున దుష్టులు, "ప్రభువా మా కింకఁ గొంచెము విశ్రాంతి నిమ్ము. నీవు పిలువఁగనే వత్తుము. నీప్రవక్తలను మే మనుసరించె దము" అని పలుకునాఁడు ఘోరదండన వెంబడించునని వారికి భయ సూచన నిమ్ము. "మీ కేమార్పును గలుగఁబోదని మీ రొకప్పు డంటిరికదా!

అయినను మీరు స్వవినాశము గావించుకొనినవారియిండ్లలో నివసించితిరి. వారి నేమిచేసితిమో మీకుఁ దెలిపితిమి. వారిని మీ కుదాహరణప్రాయులుగాఁ జేసితిమి.

వారు తమపన్నాగములఁ బన్నిరి. కాని, పర్వతములనైనఁ గదలింపఁగలవారికుట్రల నన్నిఁటిని దేవుఁడు తెలిసికొనఁ జాలి యుండెను."

కావున, దేవుఁడు ప్రవక్తలకుఁ జేసినవాగ్దానమునుండి తప్పి పోవునని తలంపకుము. దేవుఁడు శక్తిమంతుఁడు. పగ సాధించువాఁడు.

ఈభూమి మఱియొకభూమియై, స్వర్గము మఱియొకస్వర్గమై పోయినప్పుడు అద్వితీయుఁడును, జయశీలుఁడును నగుదేవునిమ్రోలకు మనుష్యులు రాఁగలరు.

ఆదినమున దుష్టుల కొకరికొకరికి సంకెళ్ళు తగిలింపఁబడును.

50. వారిబట్టలు నల్లబడియుండును. వారిముఖముల నగ్నియావ రించియుండును.

దేవుఁ డాయాయాత్మలకుఁ దగినబహుమానముల నిచ్చును. నిశ్చయముగా దేవుఁడు లెక్కతప్పకుండఁ జూచికొనుచున్నాఁడు.

మనుష్యజాతి భయసూచనం గొని, దేవుఁ డొక్కఁడే యని తెలిసికొని బుద్ధిమంతులు యోచించుకొనుటకై యీసందేశము పంపఁబడినది.

# సురా 15 గుట్ట.

మక్కా-99 పద్యములు-6 రుక్కూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లమ్. ర. ఇవి యీగ్రంథముయొక్కయు, దాని నిర్మల పఠనముయొక్కయు సూచనలు.

---

# కాండము 14

---

అవిశ్వాసు లెన్నియోసార్లు ముస్లీములు (భక్తులు) కాఁగోరెదరు.

వారు విందులను భోగములను ననుభవించుచు నాశపెట్టుకొని యుండనిమ్ము. తుదకు వారికే సత్యము బోధపడును.

మేము స్పష్టసూచనల నీయనిదే యేపురములను నాశనము చేసియుండ లేదు.

ఏజనులును నానాశనము నిర్ణీతకాలమునకు ముందుగఁ గాని, తరువాతఁగాని, కలుగఁగలదని చెప్పఁజాలరు.

వారు "ఓయీ! భయసూచనను దెచ్చితినని చెప్పువాఁడా! నిన్ను పిశాచ మావేశించినది.

నీవే సత్యవంతుఁడవైనచో దేవతలతోఁగూడ మాయొద్దకు వచ్చి యుందువు " అందురు.

తగినకారణము లుండినఁగాని మేము దేవతలఁ బంపము. అట్లు పంపినయెడల నవిశ్వాసులకు విశ్రాంతి కలిగి యుండదు.

నిజముగా మేము భయసూచనఁ బంపి, దానిని తప్పక రక్షించుచున్నాము.

10. ఇంతకుఁబూర్వమే పురాతనమతశాఖలవారికి ప్రవక్తలఁ బంపియున్నాము.

కాని, వచ్చినప్రవక్తల నందఱను వారు గేలి చేసినారు.

మక్కాలోని పాపులహృదయములు నట్టివే యగునట్లు చేయుదుము.

పూర్వులయుదాహరణము లున్నను వా రాతని నమ్మరు.

వారికొఱకు స్వర్గద్వార మొకదానిని తెఱచి మీఁది కెక్కించుచున్నాము.

వారు " నిశ్చయముగా మాకు మత్తెక్కియున్నది. ఎవ్వరో యీమాయను గల్పించినారు " అందురు.

అధ్యాయము 2.

మే మాకాశమున రాశిచక్ర మేర్పఱిచి చూచువారికి నేత్రానందకరముగా నలంకరించితిమి.

దొంగతనముగా వినువానినుండి తప్ప,

శిలాపాతముం గొనినసైతాను లందఱనుండియు దానిని రక్షింతుము. అట్లు వినువానిని రూపవంతమగుజ్వాల వెంటఁబెట్టఁగలదు.

మేము భూమిని పఱచి, యందు పర్వతములను స్థాపించి,

పుష్కలముగా నందు సర్వమును బుట్టునట్లు చేసితిమి.

20. మీకును మీరు పోషింపనిజీవులకును అం దాహారము నాయత్తపఱచితిమి.

ప్రతివస్తువుయొక్క కొట్లును మాయాధీనములోనే యున్నవి. ఆవస్తువులను కావలసినన్ని మాత్రమే మేము పంపెదము.

ఫలవంతముగ నొనర్చుగాలులను బంపి, స్వర్గమునుండి వర్షము దిగునట్లుచేసి, దానిలోఁ గొంత మీకుఁ దాగ నిచ్చియున్నాము. దాని నొకచోఁ జేర్పఁగలశక్తి మీకు లేదు.

పుట్టించువారమును గిట్టించువారమును మేమే. అన్నివస్తువులకును మేమే వారసులము.

మీలో నెవరు ముందు వత్తురో యెవరు వెనుక వత్తురో మాకుఁ దెలియును.

నీప్రభువు బుద్ధస్వరూపుఁడు, జ్ఞానమూర్తి, కావున నాతఁ డందఱను దిరిగి యొకచోఁ జేర్పఁగలఁడు.

అధ్యాయము 3.

నల్లబురద నచ్చుకట్టి యెండినజిగటమంటితో మనుష్యుని సృజించితిమి.

పిశాచము నంతకుఁబూర్వమే జ్వలించునగ్నితో నిర్మించితిమి.

దీనిని జ్ఞాపక ముంచుకొనుఁడు:—నీప్రభువు దేవతలతో, "నల్లబురద యచ్చువేసి గట్టిమట్టితో మనుష్యుని సృజింతును.

అతని నట్లు సృజించి నాప్రాణము నాతనియందుఁ బ్రవేశ పెట్టునప్పుడు మీ రాతనికి సాష్టాంగపడి యారాధింపుఁడు" అనెను.

30. అట్లే 'ఇబ్లిసు' తప్ప తక్కినదేవత లందఱు నాతనినారాధించిరి.

అతఁడుమాత్రి మారాధకవర్గములోఁ జేరఁడయ్యెను.

దేవుఁ డిబ్లిసుతో "నీ వారాధకులలో నేల చేర లేదు ?" అని యడుగ,

"బురదతోడను మట్టితోడను నీవు నిర్మించిన మనుష్యునికి నమస్కరించుట నాకు పరువు తక్కువ కాదా" అనెను.

దేవుఁడు "అయిన నీవు మాసమక్షమునుండి తొలఁగి పొమ్ము. నీవు శప్తుఁడవు.

ఆ శాపము ప్రళయదినమువఱకును నీకుండఁగల" దన నాతఁడు,

"ప్రభువా! మనుష్యుఁడు చచ్చినవారినుండి లేచువఱకును నా శాశాపము తగులకుండ తడ విమ్ము" అని వేఁడికొనెను.

దేవుఁడును, "నీవు ప్రళయదినమువఱకును,

విశ్రాంతినొంది యుండు" మనెను.

అతఁడు "ప్రభువా! నీవు నన్ను మోసపుచ్చితివి. అట్లే నేను వారికి భూమియందు సర్వమును బాగుగఁ గనఁబడఁజేసి వానితో,

40. "నీకువిశ్వాసులగుకింకరులను దప్ప తక్కినవారిని మోస పుచ్చెద" ననెను.

దేవుఁడు "ఇదియే నాతో క్రమమైనమార్గము.

"మోసపోయి నిన్ననుసరించువారిపైఁ దప్ప నితరులపై నీ కెట్టియధికారమును నే నీయను" అనెను.

నిశ్చయముగా వారిలోఁ బ్రతిపురుషునకును నరకమే విధింపఁ బడియున్నది.

దాని కేడుద్వారములున్నవి. ప్రతిద్వారమునొద్దను కొందఱు పిశాచులు గుంపులుకట్టి యుందురు.

## అధ్యాయము 4.

కాని, భక్తులగువా రుద్యానవనములయందు సెలయేళ్ళదరిని వసింపఁగలరు.

"అందు నిశ్చింతతో సురక్షితముగఁ బ్రవేశింపుఁడు."

వారిహృదయములనుండి యీర్ష్యయనుదాని నంతటినిఁ దీసివైచెదను. అచట వారు సోదరులవలె నుండి శయ్యలపై నొకరికొకరభిముఖముగాఁ గూర్చుండి యుందురు.

అచట వారి కాయాస ముండదు. వారి నచటనుండి యెవ్వరును వెడలఁగొట్టఁ జాలరు.

నాయౌదార్యమును దయను నాకింకరులకు చాటి చెప్పుము.

50. నాదండన యతిఘోరమని వారికిఁ దెలియఁ జేయుము.

ఇబ్రాహీమునతిథులఁగూర్చి వారి కెఱింగింపుము.

వా రాతనియొద్ద కేఁగి స్వస్తివచనముం బలుక నాతఁడు "మిమ్ముఁజూడ నాకు భయమగుచున్న" దనెను.

వారు "భయపడవలదు. నీకు సుపుత్రజననముంగూర్చిన వార్తను దెచ్చియున్నా" మనిరి.

ఆతఁడు "ఏమి! జరాభారుఁడనైయున్ననాకు సుపుత్రజనన వార్తయా? ఇది చోద్యముగ నున్నది. మీ రేల వచ్చితిరో సత్యము వచింపుఁ" డన వారు,

"నీ వాశనువిడనాడవలదు. మేముపలుకునదిసత్యమే" యనిరి.

అతఁడు "తప్పుతోవఁ బట్టినవారుతప్ప దేవునిదయంగూర్చి యెవ్వరును నిస్పృహులు కారు.

అయిన నోదూతలారా, మీకు నాతో నేమిపని" యని యడుగ వారు,

“ ఈప్రజలలో ‘ లూటు ’ కుటుంబమువారుతప్ప నందఱును పాపులే.

ఆకుటుంబములో నాతనిభార్య వెనుకఁబడును గనుక,

60. ఆమెను దప్ప నాతనికుటుంబము నంతటిని మేము రక్షింతు ” మనిరి.

అధ్యాయము 5.

ఆదూతలు లూటుగృహమున కేఁగ నాతఁడు,

‘ మీ రెవ్వరో నాకుఁ దెలియ ’ దనెను.

వారును “ అవునుగాని, మీజనులు సందేహించునొక కార్యమునిమిత్తమై మేము నీయొద్దకు వచ్చి యున్నాము.

మేము సత్యసందేశహారులము.

కావున నర్ధరాత్రమప్పుడు నీకుటుంబమును దోడ్కొని, వారి వెనుక నే యంటియుండి మీ రందఱును వెనుదిరిగి చూడక, మీకాజ్ఞయైనచోటివఱకును నడిచి పొమ్ము ” అనిరి.

తెల్లవారుసరి కీప్రజ లొకమనుష్యుఁడును లేకుండ నాశమగుదురని మాకుఁ దెలిసియే వారి కిట్టియాజ్ఞ నిచ్చితిమి.

క్రొత్తమనుష్యులరాకవార్త విని యాపురప్రజ లందఱును లూటుగృహమునకు సంతోషముతో నేతేర నాతఁడు,

“ వీరు నా కతిథులు కావున న న్నవమానింపకుఁడు.

దేవునికి భయపడి నన్ను సిగ్గుపాలు చేయకుఁ ” డని వేఁడికొనెను.

70. వారు, “ నీ వెవ్వరికిని నాతిథ్య మీయఁ గూడ దని మేము నిషేధించియుండ లేదా ? ” యని యడుగ నాతఁడు,

" మీ రిట్లు ప్రవర్తింపనెంచినచో నిదిగో నాపుత్రిక " లని వారిని చూపించెను.

ముహమ్మదా ! సజీవుఁడవగునీయాన ! వారు మోహాంధులై కన్నుఁగాన కుండిరి.

కావున నుదయమగుసరికి వారిపై గొప్పతుపాను వీవ నారంభించెను.

అప్పుడు మేము పురమును బోరగిలఁబడునట్లు చేసి వారిపై నిటుకలవర్షము గురియించితిమి.

జాగ్రత్తగా యోచించుకొనువారికి నిశ్చయముగా నిందు సూచనలు కలవు.

ఈపురము లన్నియు రాజమార్గములో నున్నవే.

విశ్వాసుల కిందు నిశ్చయముగా సూచన లున్నవి.

ఎల్ ఐకా లోని ప్రజలుకూడ పాపులే.

కావున మేము వారిపైఁ బగఁదీర్చికొన నవి రెండును స్పష్టోదాహరణము లయ్యెను.

అధ్యాయము 6.

80. హెడ్జిర్ అనుగుట్టయందలి ప్రజలును దేవదూతల నసత్యవాదులుగాఁ బరిగణించిరి.

మేము వారికి మాసూచనలను జూప వారు వానినుండి విముఖులైరి

వారు తమరక్షణకొఱకు పర్వతములను ద్రవ్వి యందు వసతుల నేర్పఱిచికొనిరి.

కాని, యుదయముననే వారిపై గొప్పతుపాను వీవఁగా

వారి కష్టమంతయు వృథ యయ్యెను.

మే మీస్వర్గమర్త్యములను నా రెండింటికిని మధ్యభాగమును మంచియుద్దేశముతోడనే సృజించి యున్నాము. నిశ్చయముగా ఘంటానాద మాసన్నమై యున్నది. కావున నోముహమ్మదా! నీవు దయతో వారిని క్షమింపుము.

నీ ప్రభువే సృష్టికర్త, బుద్ధస్వరూపుఁడు.

నీ కింతకుపూర్వమే సప్తశ్లోకి యనుస్తోత్రమును, ప్రభావంత మగు ఖురానును బ్రసాదించియే యున్నాను.

కొంద అవిశ్వాసులకుఁగూడ మే మిచ్చినమంచివస్తువులవైపు నీవు తేఱిపాఱఁ జూడ నక్కఱలేదు. వారినిగూర్చినచింత నీకు వలదు. విశ్వాసులను నీరెక్కలనీడక్రిందికి చేర్చికొనుచు,

“ స్పష్టమగుసూచనను దెచ్చినవాఁడను నే నొక్కఁడనే ” అని చెప్పుము.

90. ఈఖురానును భాగములుగా విడఁదీసి,

కొన్ని విశ్వసనీయము లనియుఁ గొన్ని యవిశ్వసనీయము లనియుఁ జెప్పువారిని మేము శిక్షింతుము.

నీప్రభువునాన, వారిలోఁ బ్రతిమనుష్యునినుండియు,

వారికృత్యము లన్నిఁటిఁగూర్చియు మేము లెక్క తీసి కొందుము.

కావున నీయాజ్ఞ యైనదానిని బహిరంగముగఁ జాటుము. దేవునితో నితరదైవములఁ జేర్చువారిసాంగత్యమునుండి తొలఁగుము.

నిశ్చయముగా నిన్నుపహసించి దేవునికి సములుగా మఱి కొందఱదైవముల లేవనెత్తువారి కెదురుగా మీపక్షమును మే మవ లంబింతుము.

తుదకు వారు తమ తెలివితక్కువను దెలిసికొనఁగలరు.

ఇప్పుడు వారు పలుకు పలుకులవలన నీహృదయము దుఃఖించు నని మాకుఁ దెలియును.

కాని నీవు మాత్రము నీప్రభువుయొక్కయు, నాతనిభక్తులయు, స్తోత్రములం జేయుచు,

నీకు కాల మాసన్నమగువఱకును నీప్రభువును గొలిచి యుండుము.

---

# సురా 16. తేనెటీఁగ.

---

మక్కా—128 పద్యములు-16 రుక్కులు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

దేవుఁ డుద్దేశించిన ప్రళయసమయము రాకతప్పదు. కావున దానిరాకను త్వరపెట్టకుము. అతఁడు ప్రభావంతుఁ డగుఁగాక! అతనితో వారు చేర్పుదైవము లందఱికంటె నాతఁ డుచ్చస్థాన మధిష్ఠించి యుండుఁగాక!

తన శిష్టులైనకింకరులపైఁ బరిశుద్ధాత్మను వ్రాలఁ జేయుటకు, తనయాజ్ఞమీఁదుగా దేవతలను బంపి యాకింకరులకు, "నేనుతప్ప మఱియొక దేవుఁడు లేఁ డని వారికి భయసూచన నిమ్ము. నాకు భయపడుము" యని దేవుఁ డాజ్ఞాపించును.

తనసత్యము వ్యాపించుటకు నాతఁడు స్వర్గమర్త్యముల సృజించి

నాఁడు. తనతోఁ జేర్చినయితరదైవములపై నాతఁ డధికారి యగు గాక !

మనుష్యు నాతఁ డొకతడిపురుగునుండి సృష్టించినాఁడు. అయినను మనుష్యుఁ డతనిని బాహాటముగా నిందించుచున్నాఁడు.

ఇఁకఁ బశువులు—వాని నాతఁడు నీకొఱకు సృజించినాఁడు వానినుండి నీకు వెచ్చనివస్తులును, ఉపయోగకరములగు నితరవస్తువులును లభించును. వానిని నీవు భక్షింతువు.

వానిని నీవింటికి తెచ్చునప్పుడును, పచ్చికమేఁతకై తోలుకొని పోవునప్పుడును, నవి నీ కానందకరము లగుచుండును.

నీవు మిక్కిలి కష్టపడక మోయలేనిభారముల నవి నీకొఱకితరదేశములకు మోసికొని పోవును. నిజముగా, నీప్రభువు దయాదాక్షిణ్యమూర్తి.

నీవు స్వారిచేయుటకును, నీ కలంకారప్రాయములుగను, నాతఁడు నీకు గుఱ్ఱములను, కంచరగాడిదలను, గాడిదలను, నీకిచ్చియున్నాఁడు. నీకుఁ దెలియనియితరవస్తువులనుగూడ నాతఁడు నీకుఁ బ్రసాదించియున్నాఁడు.

“ సరియైనమార్గమును జూపుటకు దేవుఁడే సమర్థుఁడు. కొందఱు దాని నతిక్రమింతురు. అయినను నాతఁడు నిన్ను మంచి త్రోవలో నడిపింపవలెనని నట్లే చేసియుండును.

అధ్యాయము 2.

10. స్వర్గమునుండి వర్షము గురియించువాఁ డతఁడే. దానినుండియే నీకు త్రాగుటకు నీరు దొరకును. దానినుండియే నీకు మొక్కలును బచ్చికయుఁ గలుగుచున్నవి.

దానినుండియే యాతఁడు ధాన్యము, ఆలివువృక్షములు, ఖర్జూరపుచెట్లు, ద్రాక్షలు, సర్వవిధములగు ఫలములను నీకొఱకు

పుట్టించుచున్నాఁడు. నిజముగా నాలోచించువారికి దీనియందే సూచనలు కనుపించును.

అహోరాత్రముల నాతఁడు నీకు దాసులుగాఁ జేసినాఁడు. సూర్యచంద్రులును, నక్షత్రములును నాతనియాజ్ఞచే నీకు దాసులగుచున్నారు. నిజముగా బోధపఱచుకొనువారి కిందు సూచనలున్నవి.

పృథ్విపై చిత్రవిచిత్రము లగువస్తువుల నన్నిటి నాతఁడు నీకొఱకు సృజించియున్నాఁడు. జ్ఞాపకమున్నవారికి నిజముగా నిందు సూచన లున్నవి.

సముద్రమునుగూడ నతఁడు నీయధీనము చేసినాఁడు. దానిలోని చేఁపలను నీవు తినుటకును, దానియందలిరత్నములను నీవు ధరించుటకును, దానితరంగములపైఁ దేలియాడునావలపై నాతఁడు నీకొఱ కితరదేశములలో నుంచియున్న ధనములఁ గనుగొనుటకును, దీని కంతటికిని నీ వాతనికి తిరుగ వందనముల నర్పించుటకును, నాతఁ డట్లు చేసియున్నాఁడు.

భూమి నీతోఁగూడఁ దిరుగకుండునట్లు దానిపై నాతఁడు గొప్పపర్వతముల నుంచియున్నాఁడు. నీకు దారిఁజూపుటకు నదులు, మార్గములు, మార్గపుగుఱుతులఁగూడ నాతఁ డుంచియున్నాఁడు.

నక్షత్రములును జనులకు దారిఁ జూపుచుండును.

ఇట్లు సృష్టిచేసినవాఁడు సృష్టిచేయనివానిని పోలియుండు టెట్లు ? ఆలోచించుకొనవేల ?

దేవుఁడు నీ కిచ్చినవరములను దలంచినచో, వానిని నీవు లెక్కపెట్టలేవు. ఆహా ! నిశ్చయముగా దేవుఁడు దయాదాక్షిణ్యమూర్తి !

నీవు దాఁచికొనినదానిని, బయలుపెట్టుదానినిగూడ దేవుఁ డెఱుంగును.

20. నిజమైనదేవుఁడు తప్ప నితరదైవములు సృష్టింప సమర్థులు కారు. సరేకదా, తామే సృష్టింపఁబడుచున్నారు.

వారు మృతప్రాయులు, నిర్జీవులు,

తా మెప్పుడు లేచెదరో వారికిఁ దెలియదు.

## అధ్యాయము 3.

నీదేవుఁ డొక్కఁడే. రాఁబోవుజీవనమునుగూర్చి నమ్మనివారు నాస్తికులు, గర్విష్ఠులు.

నిస్సందేహముగా దేవుఁడు వారు దాఁచినదానిని, బయలు పెట్టిన దానినిఁ గూడఁ దెలిసికొనును. గర్వితుల నాతఁడు ప్రేమింపఁడు.

వారిని "ఈనీప్రభువు నీ కేమిపంపినాఁ"డని యడుగఁగా వారు "తాతలనాఁటిప్రాఁతకథ" లని పల్కుదురు.

అందుచే రక్షణదినమున వారు తమసర్వభారమునే కాక తమ ప్రేరణచే మూఢులై తప్పుత్రోవం బడినవారిభారమునుగూడ మోయవలయును. అది వారికిఁ గష్టదాయక మగుభారము కాదా?

## అధ్యాయము 4.

వారికిఁ బూర్వులును గుటిలు పన్నిరి. కాని, దేవుడు పునాదులతోఁబాటు వారియిండ్లను త్రవ్విపేయఁగా నింటికప్పులు వారి తలలపైఁ బడెను. వారికిఁ దెలియకుండఁగనే వారిని దండన వెంబడించెను.

రక్షణదినమునఁగూడ దేవుఁడు వారిని సిగ్గులపాలు చేయును. "మీరు వివాదములాడి నాతో జతగూర్చినమీదేవు ళ్ళేరి?" అని యాతఁడడుగును. అప్పుడు వారిలో జ్ఞానసంపన్నులు, "నిశ్చయముగా నీదినమున నమ్మనివారికి లజ్జయుఁ గీడును గలుగును" అందురు,

తమయాత్మలపైఁ దామే పాపము చేసికొని, దేవతలచే మృతిఁగాంచినవారు, "మేము పాపము చేయలేదు" అని లొంగి పోవుదురు. కాని, మీరు చేసిచేసితిరో దేవుని కెఱుక!

కావున, మీరు నరకద్వారములఁ బ్రవేశించి యచటనే చిర కాల ముండుఁడు. గర్విష్ఠులవాసస్థానము మిగుల భయోపేత మైనది.

30. కాని, దైవభీతిపరులను, "మీప్రభువు మీ కేమి ప్రసాదించి నాఁడని యడుగఁగా "సర్వోత్కృష్టమైన మేలునే యొసగినాఁడు. మంచిచేసినవారి కిహమందుమంచిలాభమును పరలోకమందు మంచి హార్మ్యము నొసగినాఁడు. దైవభీతిపరులవాసస్థాన మతిసౌఖ్యావహ మైయుండును" అని వారు పలుకుదురు.

వారు నందన (ఈడెను) వనములఁ బ్రవేశింతురు. అచటి చెట్లనీడలయందు సెలయేళ్ళు ప్రవహించుచుండును. వారికోర్కె లన్నియు వారి కక్కడ చేకూఱును. తనయెడ భీతి కలిగి వర్తించు వారిని దేవుఁడి ట్లనుగ్రహించును.

వారు పుణ్యవంతులు గావున, దేవతలు వారియాత్మలను పరి గ్రహించుచు వారితో "మీకు శాంతి కలుగుఁగాక! మీకష్టము లకు ఫలితముగా స్వర్గమును బ్రవేశింపుఁడు" అని చెప్పుదురు.

విశ్వాసరహితు లైనవారిపై మృత్యుదేవతలు పడుటయో దేవునిశిక్ష కలుగుటయో సంభవించును. వారిపూర్వులు నట్లే యను భవించిరి. దేవుఁడు వారి కన్యాయము చేయలేదు. వారియాత్మలకు వారే యన్యాయము చేసికొనినారు.

వారు చేసికొనిన దుష్కృత్యము వారినే కొట్టెను. తాము కేలి చేసినది తమ్ము చుట్టుముట్టికొనెను.

## అధ్యాయము 5.

దేవునితో నితరదైవములఁ జేర్చినవారు, "అతని యిష్టమై

నచో, మేముగాని మాపూర్వులుగాని యాతనిఁ దప్ప నితరులను బూజించి యుండము. అతనియాజ్ఞ లేనిదే దేనినిగూడ నిషేధించి యుండము " అందురు. వారిపూర్వులు నిట్లేసంచరించిరి. అయినను ప్రవక్తలు చేయవలసినది బహిరంగబోధనతప్ప మ రేమియున్నది ?

ప్రతిజాతివారికి నొకప్రవక్తను బంపి, " దేవుని బూజింపుఁడు. తాగూతు ( ఒక యరేబియాదేశపువిగ్రహము ) నుండి తొలఁగి పోండు " అని చెప్పితిమి. అందు కొందఱు దేవునిచే మార్గము తెలుపఁబడినవారును కొందఱు త్రోవ తప్పవలసినదిగా విధింపఁబడిన వారును నైయుండిరి. కాని యాదేశములకుఁ బోయిన యాప్రవక్తల నసత్యవచనులనుగా గణించినవారి కేమైనదో కనుఁగొనుము !

నీకు వారిగతిఁగూర్చి యాతురతగా నున్నచో, తాను తప్పు త్రోవఁ దీసికొనిపోవ నిశ్చయించినవారిని మంచిత్రోవఁ బెట్టఁ డనియు వారికి సహాయు లెవ్వరు నుండఁబోరనియుఁ దెలిసికొనుము.

" ఒకసారి చనిపోయినవారిని దేవుఁడు తిరిగి లేవనెత్తఁ " డని వారు దేవునియాన పరమప్రమాణము చేయుదురు. కాని ప్రజలు తెలిసికొనలేకపోయినను,

వారివివాదవిషయమును బరిష్కరించుటకును, అవిశ్వాసు లసత్యవాదు లని తెలుపుటకును నాతనివిధికృత్య మొకటి యున్నది.

40. మే మొకవస్తు వుండవలెనని సంకల్పించుకొని " రమ్ము " అనినంతనే యది వచ్చును.

అధ్యాయము 6.

దేవునికొఱకు బాధలఁబడి దేశమును వదలి పారిపోయినవారి కీలోకమున నిశ్చయముగా మంచియేర్పాటులఁ జేసెదము. తెలిసికొనఁగలిగినచోఁ బరలోకమునందును వారికి గొప్పలాభము కలుగఁ గలదు.

కష్టముల నోర్పుతో సహించి ప్రభువునందు నమ్మకము గల వారు వారే !

వారివిధికృత్యములను వారికిఁ దెలిపితిమి. దైవగ్రంథములతో నింతకుఁబూర్వ మావేశపరవశులైనవారిని దప్ప నితరులఁ బంపలేదు.

ఈసంగతి నీకుఁ దెలియునిచో, నిషిద్ధగ్రంథముగలవారి నడిగి జనులకుఁ బంపినదానిఁగూర్చి నీవు వారికి స్పష్టముగాఁ దెలిపి, వారిని దానిగూర్చి బాగుగ నాలోచింపఁ జేయుము.

ఏమిది ! కుటిలులున్న వారికి క్రిందిభూమిని దేవుఁడు బ్రిద్దలు చేయఁడని కాని, వారు తలంపని దిక్కునుండి యొకశిక్ష వారికిఁ గలుగదనికాని,

వా రిటు నటు వచ్చుచుఁ బోవుచున్నప్పుడు తన్ను తిరస్కరింప లేనిసమయమున నాతఁడు తమ్ముఁ బట్టికొనఁడని కాని,

మెల్లమెల్లగ క్షమింపఁజేయునొకరోగమును వారిపైఁ బంపఁ డనికాని, నిర్భయముగ నున్నారా ? కాని, నీప్రభువు నిశ్చయముగ దయాపరుఁడు ; దాక్షిణ్యమూర్తి !

దేవుఁడు సృజించినప్రతివస్తువును దక్షిణమునకుఁ నైపునకును, నెడమవైపునకును బాపి యాతని మోల దీనముగ సాష్టాంగపడు చుండుటను వారు కాంచలేదా ?

స్వర్గమర్త్యములయందు జంగమవస్తువులును, దేవతలును గూడ దేవునియెదుట భక్తితోఁ బ్రణమిల్లి గర్వరహితు లగుదురు.

50. వారు తమపై నున్నప్రభువునకు భయపడి యాతనియాజ్ఞ లను నిర్వర్తింతురు.

అధ్యాయము 7.

మీ రిద్దఱుదేవుళ్ళ నారాధింపకుఁడు. దేవుఁ డొక్కఁడే. కావున నన్నే—పూజింపుఁడు ” అని దేవుఁ డనినాఁడు.

స్వర్గమర్త్యములందలి దంతయు నాతనిదే. అతనికే నిరంతర

సేవ సలుపవలయును. అయిన నాతనికిఁ దప్ప మ తెవ్వరికి నేల భయపడియెదరు ?

మీకుఁ గలసౌఖ్యము లన్నియు దేవుఁడు ప్రసాదించినవే. కావున మీకుఁ గష్టము గలిగినప్పుడు సహాయమున కాతని నాశ్రయింతురు.

కాని, యాతఁడు నీకష్టమును తొలఁగించినంతనే మీరు తిరిగి యాతనికి సమానులఁ గొందఱఁ గూర్తురు.

మావరములఁ బడసి మీ రెంతకృతఘ్నులుగ నున్నారో తెలుపుట కిది చాలును ! కావున నిపుడు సుఖముల ననుభవింపుఁడు. తుదకు సత్యమును దెలిసికొనఁగలరు.

విగ్రహములఁగూర్చి వారికిఁ దెలియనే తెలియదు. మే మొసగిన యైశ్వర్యములను వానికై కొంత యుపయోగింతురు. మీ యీ కృత్యములకు దేవునియెదుట సమాధానము చెప్పవలసి యుండును.

దేవునికిఁ గుమార్తె లున్నారని వారు చెప్పుదురు. అతనికి జయ మగుఁగాక ! కాని తమకుఁ గుమార్తెలు పుట్టుట మాత్రము వారి కిష్టము లేదు.

వారిలో నెవ్వరికైనను గుమార్తె పుట్టిన దని యెవ్వరైనఁ జెప్పినచో వారు మొగములు ముడిచికొని విచారగ్రస్తు లగుదురు.

ఇది దుర్వార్త యనుకొని యాతఁడు జనులనుండి తొలఁగి పోయి యొంటరిగ నణఁగియుండును. అవమానమునకోర్చి యాశిశువును పెంచునా ? లేక బ్రతికియుండఁగనే భూమిలోఁ బూడ్చివైచునా ? వారియూహలు తప్పులు గావా ?

60. పునర్జన్మమునందు నమ్మకము లేనివారి నందఱను జెడుగైన దానితోఁ బోల్పవచ్చును. దేవునిమాత్ర మత్యుచ్చమగుదానితోఁ బోల్పఁ దగును. అతఁడు సర్వశక్తుఁడు, సర్వజ్ఞుఁడు.

## అధ్యాయము. 8.

మనుష్యులు చేయుదుష్కృత్యముల కన్నిఁటికి దేవుఁడు శిక్షనే విధించుచో భూమిపై నాతఁడు జీవుల నుంచనే యుంచకుండును. కాని, యాతఁడు వారికిఁ గొంతకాలము వ్యవధి నిచ్చును. వారికాలము వచ్చినయెడల వా రాలస్యము చేయఁజాలరు. ఆకాల మొకగంట ముందైన నాగఁజాలదు.

తమ కిష్టములేనివానిని వారు దేవుని కారోపింతురు. తమస్థితి మంచిదని వారినాలుక లసత్యము లాడుచుండును. కాని, నిశ్చయముగా వారి కగ్నిగుండము సిద్ధముగా నున్నది. దానియందు మొట్టమొదటఁ బ్రవేశింపవలసినవారు వారే!

దేవునియాన! పూర్వ మాయాజాతులవారికి బ్రవక్తలఁ బంపియుంటిమిగాని, సైతాను వారికిఁ బనిఁ గల్పించి, నేఁడు వారికిఁ బ్రభువైనాఁడు వారికి ఘోరశిక్ష రానున్నది.

దైవగ్రంథమును మేము నీకొక్కనికే పంపినాము. దానిమూలమున వారి వాదవిషయములఁ గూర్చినసందేహములఁ దీర్చి, నమ్మినవారి కది మార్గోపదేశకమును దయాన్వితమును నగునట్లు నీవు చేయవలయును.

భూమి నిర్జీవమైనపిదప దేవుఁడు స్వర్గమునుండి నీటినిఁ బంపి దానిని పునర్జీవింపఁజేయును. వినఁగలవారికి దీనియం దొక సూచన యున్నది.

## అధ్యాయము 9.

పశువులుఁగూడ మీకు బోధించుచున్నవి. వానియుదరముల లోని కసవునుండియు, నెత్తురునుండియు, మీకు స్వచ్ఛమగు పాల

నిచ్చుచున్నాము. దానిని త్రాగువారి కది మనోరంజకముగ నుండును.

పండ్లరకములలో మీకు ఖర్జూరమును, ద్రాక్షల నిచ్చితిమి. అవి మీకు మంచియాహారమును, ద్రాక్ష రసముకు నొసగుచున్నవి. నిజముగా నాలోచించువారికి వీనియందు సూచనలు కాన్పించు చున్నవి.

ప్రభువు తేనెటీఁగ తో, "పర్వతములయందును, చెట్ల యందును మనుష్యులు మీకొఱకు నిర్మించుగూళ్ళయందును వాస ముల నేర్పఱచుకొనుము.

అన్నిరకముల పండ్లను దినుము. మీప్రభు వేర్పఱిచిన తిన్నని దారులలో నడువుము" అని బోధించెను. దానియుదరమునుండి రంగురంగులమధు వుప్పతిల్లుచు మనుష్యుని కౌషధముగా నుపయో గించును. యోచించువారికి దీనియందు నిశ్చయముగా నొకసూచన యున్నది.

70. దేవుఁడు మిమ్ము సృజించినాఁడు. కొలఁదికాలములో నాతఁడు మిమ్ము తనదరికిఁ జేర్చికొనును. మీలోఁ గొందఱిని జిన్ననాఁటి వృత్తాంత మంతయు మఱపునకువచ్చు తుచ్ఛపుముసలితనమువఱకు జీవింపనిచ్చును. ఆహా! దేవుఁడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తుఁడు!

## అధ్యాయము 10

జీవనమునకుఁ గావలసినవస్తువుల నాతఁడు మీలోఁ గొందఱికి తక్కినవారికంటె నెక్కువగ నిచ్చియున్నాఁడు. కాని, హెచ్చుగఁ బడసినవారు తమక్రిందిచేతులలోఁ జిక్కియున్నతమ బానిసలకు తమ కున్నదానిలోఁ గొంతపాలియ నొల్లరు. ఏమిది? వారు తమ యైశ్వర్య మంతయు దైవప్రసాదము కా దనుకొందురా?

ఇది గాక, దేవుఁడు మీజాతినుండియే మీకు భార్యల నిచ్చి

యున్నాఁడు. మీభార్యలవలనఁ గొడుకులను మనుమలను నిచ్చి యున్నాఁడు. మీకు మంచివస్తువులను బ్రసాదించి యున్నాఁడు. ఏమి! వా రింకను తుచ్ఛవిగ్రహములను నమ్మెదరా? దేవునివర ములఁ జేకొని వారు కృతఘ్ను లగుదురా?

స్వర్గమునుండికాని, భూమినుండికాని యొకయన్నపుమెతుకు నైన నీయఁజాలక స్వయముగ శక్తిమంతులు గానివారిని వారు దేవునితోఁ జేర్చి పూజింతురు!

కావున దేవునికి సాటివారల నేర్పఱుపకుఁడు. నిజముగా దేవుఁడే జ్ఞానవంతుఁడు. మీరు కారు.

తనప్రభువునకు సొత్తయి, దేనిపైనను హక్కు లేనిబానిసకును మావలన సర్వసంభారములను గొని గుప్తముగను రహస్యముగను, భిక్షము నొసగువానికిని, దేవుఁడు తారతమ్యము నేర్పఱిచినాఁడు. వారిద్దఱును సమాను లగుదురా? దేవుఁడు స్తుతింపఁబడుఁగాక! అట్లు కానేరరు. అయినను నీవిషయము చాలమందికిఁ దెలియదు.

పుట్టిననాఁటనుండియు మూఁగవాఁడై దేనికిని శక్తిలేక తనప్రభు వునకు భారమై యెక్కడికి కేఁగినను నపజయముతో తిరిగివచ్చుమను ష్యుఁడును, న్యాయవంతుఁడై సన్మార్గావలంబియగువాఁడును సమా నులగుదురా?

## అధ్యాయము 11.

స్వర్గమర్త్యములరహస్యములు దేవునివి. తుదిగడియ తెప్ప పాటుకాలమో యంతకు తక్కువగనో యుండును. నిజముగా దేవుఁ డన్నిఁటికిని సమర్థుఁడు.

మీతల్లులగర్భమునుండి దేవుఁడు మి మ్మజ్ఞానులనుగా సృజించి నాఁడు. కాని, మీకు శ్రవణము, దృష్టి, హృదయము ననువానిని

ప్రసాదించినాఁడు. బహుశః మీ రతనికి నమస్కృతుల నొనర్తు రనియే యాతఁ డట్లు చేసినాఁడు.

స్వర్గప్రాంగణమున నాతనికి వశములై యున్న పక్షులను వారు విలోకింపలేదా ? దేవుఁడు తప్ప నితరులు వానిని స్వహస్తగతము లుగ నుంచికొనలేరు. విశ్వాసులగువారి కిందే చిహ్నములున్నవి.

80. దేవుఁడు మీరు నివసించుటకు గుడారముల నిచ్చియున్నాఁడు. మీబసలను మార్చికొనినప్పుడును, బసలు చేయునప్పుడును, చులుక నగా నుండుట కాతఁడు మీగుడారములకు తోళ్ళ నిచ్చియున్నాఁడు. తాత్కాలికముగా మీ కుపయోగపడుటకుఁ గావలసినసామగ్రి కొఱకై వానినుండి మీ కున్నిని, మెత్తనికుచ్చులను నొసగి యున్నాఁడు.

తాను సృజించినవస్తువులనుండి దేవుఁడు మీకు నిలువ నీడను మీవసతులకొఱకుఁ బర్వతములను, ఎండవేఁడిమినుండి మిమ్ముఁ గాపాడుటకు వస్త్రులను, యుద్ధములందు మీ కపాయము లేకుండ నంగరక్షులను నిచ్చియున్నాఁడు. మీ రాతనియధీనములోనికి వత్తురను నుద్దేశముతో నాతఁడు సంపూర్ణానుగ్రహమును జూపుచుండును.

వారు నీమాటలను వినక వెనుదిరిగినను వారికి బోధించుచుం డుట నీనిర్మలవిధి యై యున్నది.

వారు దేవునిదయామయుత్వము నొప్పుకొనియు నాతని నిరా కరించి యందఱును దైవద్రోహులగుచున్నారు.

## అధ్యాయము. 12.

కాని యొకానొకదినమునఁ బ్రతిజాతినుండియు నొకసాక్షి బయలుదేరును. నాఁడు దైవద్రోహులు సాకులు కల్పించుకొనుట కనుజ్ఞ యుండదు. వారు దేవునిదయకుఁ బాత్రులు కారు.

ఈరీతిగా దుష్టవర్తనులైనవారు తమ బాధను కండ్లారఁ గాంచి నప్పుడు వారికి శిక్ష యేమాత్రమును తగ్గదు. దేవుఁడు వారివైపుఁ జూపుటకైనను నను్రగహింపఁడు.

దేవునికి సమానులఁ గల్పించినవా రాసమానదేవతను జూచి నప్పుడు దేవునితో "ప్రభువా! నీవుగాక నీతో సమానులని మేము కల్పించినవారు వీరే?" యని పల్కఁగా వారు "నిశ్చయముగా మీా రసత్యవాదులరు" అని బదులు చెప్పెదరు

ఆదినమున వారు దేవునికి సమర్పింలగుదురు. వారు దేవునితో సమానులుగాఁ గల్పించినదేవతలు కంటికి కగపడకుండ మాయ మగుదురు.

దైవద్రోహులై దైవపథమునుండి యితరులను మఱల్చిన వారికి వారి దుష్టచరితముకొఱకు శిక్షపైశిక్షను విధించెదము.

ఒకానొకదినమునఁ బ్రతిజాతినుండియు నొకసాక్షిని బిలిచె దము. మార్గదర్శకమై సందేహములఁ బాపి, రక్షణోపాయమై, దైవాధీనులగువారికి మంచివార్తను తెచ్చునీగ్రంథమును నీకుఁ బంపి యున్నాము. కావున మక్కావాస్తవ్యులనుండి సాక్షిగా నిన్నుఁ బిలిచెదము.

## అధ్యాయము 13.

90. నిజముగా బంధువులయెడల న్యాయమును మంచితనమును జూపి వారిని బహూకరింపవలెనని దేవునియాజ్ఞ. అశ్లీ దౌర్జన్య మును, చెడ్డతనమును, బాధను వర్జింపవలె నని యాతఁ డాజ్ఞాపించి యున్నాఁడు. మీారు జాగ్రత్తగానుండుట కాతఁడు మీాకు భయసూ చనల నొసగియున్నాఁడు.

దైవసంబంధమగు నొడంబడికలో మీారు చేరినప్పుడు దాని

నుండి మఱలక యుండుఁడు. మీరు ప్రమాణము చేసినపిదప దాని నుండి తొలఁగిపోకుఁడు. మీకు ప్రతినిధిగా దేవుని నేర్పఱచికొని యున్నారు. నిశ్చయముగా మీరు చేయునదంతయు దేవునికిఁ దెలియును.

మఱికొన్ని జాతివారలకంటె మీ రధికసంఖ్యాకులరు కదా యని, గట్టిదారమును వడకి దానిపుఱివిప్పివేయునామెవలె నొకరితో నొకరసత్యప్రమాణములఁ జేసికొనకుఁడు. ఈవిషయములో దేవుఁడు మిమ్ము శోధించుచున్నాఁడు. రక్షణదినమున దేవుఁడు మీమీ వివాదములను దీర్పఁగలఁడు

దేవుని కిష్టమైనచో నాతఁడు మి మ్మందఱ నొక్కజాతివారిఁ గనే చేసియుండును. కాని యాతని కిష్టమైనవారిని మంచిత్రోవ లోను నిష్టములేనివారిని తప్పుత్రోవలోను నాతఁడు నడిపించును. మీమీకృత్యములకు నిశ్చయముగా మీరు బాధ్యుల రగుదురు.

కావున నొండొరుల మోసపుచ్చవలెనని ప్రమాణములఁ జేయకుఁడు. అట్లుచేసినచో గట్టిగా నానుకొనియున్నకాలు జాఱును. మీ రితరులను దైవపథమునుండి తప్పించినందుకు కీడు ననుభవింపఁ గలరు. గొప్పశిక్షను బొందఁగలరు.

మీరు దేవునితోఁ జేసికొనిన యొడంబడికను తుచ్ఛధన మునకై యమ్మివేయకుఁడు. మీరు దేవునియొద్ద నుంచికొనిన దంత కంటె నమూల్యమైనదని మీకు జ్ఞానమున్నచోఁ దెలియఁగలదు.

మీయొద్దనున్నదంతయు నశించునదే. దేవునియొద్ద దాఁచి కొనినదే శాశ్వతము. ఓప్పుతో సహించియుండువారికి, వారియుత్తమ కృత్యములకుఁ దగినట్లు మేము నిశ్చయముగా బహుమానమిచ్చెదము.

స్త్రీయైనను బురుషుఁడైనను విశ్వాసులై సన్మార్గావలంబులై యుండువారికి సుఖజీవనమును త్వరలోఁ గూర్చి, వారియుత్కృష్ట

కార్యములకుఁ దగినబహుమానమును చేకూర్చెదము.

ఆలు రువ్వఁబడినసైతానునకు దేవుని నమ్మి విశ్వాసులై యున్నవారిమీఁద నించుకయు శక్తి లేదు.

దేవునినుండి తొలఁగి యతనికి సమానులను గూర్చువారిపైననే యాతనికి శక్తి గలదు.

100. కావున మీరు కురానును చదువునప్పుడు సైతానునుండి రక్షింపుమని దేవునిసహాయమును వేఁడికొనుఁడు.

అధ్యాయము 14.

దేవునిరహస్యము లన్నియు దేవునికే బాగుగఁ దెలియును. మే మొకసూచనను మార్చి మఱియొకదానిని గూర్చునప్పుడు వారు "నీవు కేవలకృత్రిమవాది" వని యందురు. కాని వారిలోఁ జాల మంది యజ్ఞానులు.

విశ్వాసులకు స్థిరత్వము నిచ్చుటకును, దైవపరులకు మార్గదర్శకముగను సువార్తగను నుండుటకును, దానిని సత్యసమన్వితముగఁ బరిశుద్ధాత్ముఁడగు జిబ్రీలు నీప్రభువునుండి తీసికొనివచ్చినాఁడని చెప్పుము.

"నిజముగా నెవఁడో యాతనికి బోధించుచున్నాఁడని వా రందురని మాకును దెలియును. కాని, వా రనుకొన్నదానిభాష వేఱు, ఈకురానుభాష శుద్ధఅరబ్బీభాష.

దేవునిసూచనలను నమ్మనివానికి రక్షణోపాయము లేదు. ఆతనికి ఘోరశిక్ష కలుగనున్నది.

దేవునిసూచనలను నమ్మనివా రసత్యమును కల్పించినవారే. వా రసత్యవాదులే.

ఎవ్వఁడైనను దేవుని నమ్మి యతనిని నిరాకరించినను తిరిగి

నిర్బంధముచే నతనిహృదయ మాతని నంటిపెట్టుకొనియున్న యెడల నిర్దోషి యగును. కాని హృదయమునందలి విశ్వాసమునకుఁ దావొసగి, వాఁడు దేవునికోపమునకుఁ బాత్రుఁడై ఘోరశిక్ష ననుభవింపఁగలఁడు.

పరలోకవాసముకంటె నిహలోకజీవనమునే వారు ప్రేమించుట చేతను, నవిశ్వాసులకు దేవుఁడు మార్గదర్శి కాఁడు గావునను వారి కట్టియనుభవము కలుగుచున్నది.

వీరిహృదయములను, కన్నులను, చెవులను, దేవుఁడు మూసివైచి నాఁడు. వీరే యజాగ్రతగ నుండువారు.

పరలోకములో వారు నిస్సందేహముగ నశింపఁగలరు.

110 అనేకశోధనలకుఁ బాలయి తమదేశమును వదలిపెట్టియు, యుద్ధముచేసి యోర్పుతో సహించియుండువారిని దేవుఁడు క్షమించి వారియెడలఁ గృపాపరుఁడై యుండును.

## అధ్యాయము 15.

ఒకానొకదినమున నాత్మలన్నియుఁ దమ్ముఁగూర్చి చెప్పికొనుటకు రాఁగలవు. ఆయాయియాత్మలకు తమతమకర్మల ననుసరించి ఫలము కలుగఁగలదు. వాని కెట్టియపకారమును గలుగదు.

దేవుఁ డొకనగరమును దృష్టాంతముగాఁ జూపియున్నాఁడు. దాని కెట్టియలజడియు లేక సురక్షితమై యుండ నన్నిదిక్కులనుండియుఁ గావలసినసదుపాయములు వచ్చుచుండెను. కాని, యది దేవుని వరములను స్వీకరించి కృతఘ్నతఁ జూపుచుండెను. కావున నందలి జనులు చేసినకార్యములకై దేవుఁడు దానికి భయమును గఱవును ననుభవింపఁజేసెను.

ఇదిగాక వారిలోనుండియే యొకప్రవక్త బయలుదేరఁగా వా రాతనిఁ గృత్రిమునిగాఁ బరిగణించిరి. వారు దుష్టవర్తనులగుటచే వారి కందఱకును శిక్ష ప్రాప్తించెను.

దేవుఁడు మీకుఁ బ్రసాదించినదానిలో విధ్యుక్తమైనదానిని, మంచిదానిని తిని, మీ రాతనిని సత్యముగ నారాధించువారైనచో నాతనివరములకుఁ గృతజ్ఞత గలిగి వర్తింపుఁడు.

తనంతట తాను చనిపోయినదానిని, రక్తమును, పందిమాంసమును, దేవునికిఁగాక మఱి యేదేవతకైనను బలి యీఁబడినదానిని మీరు నిషేధింపుఁడు. నిన్నెవ్వరైన బలవంతపెట్టినఁగాని, మీ కిష్టము లేకుండినఁగాని, మీరు మనస్ఫూర్తిగ నట్టిదానిని సేవింపకుండినఁగాని, దేవుఁడు మిమ్ము క్షమించి దయచూపును.

"ఇది విధ్యుక్తము, ఇది నిషిద్ధము" నని యసత్యకల్పనలఁ జేయకుఁడు. ఒకవేళ మీ రట్టియసత్యమును గల్పింతురేమో! దేవునియెడల నసత్యమును గల్పించువారు వృద్ధినొందరు.

వారియానందము తాత్కాలికమేకాని, వారికిఁ గలుగుశిక్ష యంతములేని దగును.

మేమింతకుఁబూర్వము చెప్పినదానిని నిషేధించిన యహూదీలకు మే మపకారముఁ జేయలేదు. వారికివారే యపకారముఁ జేసికొనిరి.

అజ్ఞానముచే దురితము నాచరించినను బశ్చాత్తాపమునొంది వారి కంతమున దేవుఁడు దయాదాక్షిణ్యములఁ జూపును.

## అధ్యాయము 16.

120. నిశ్చయముగా నిబ్రాహీము మతనాయకుఁడు. దేవునికి విధేయుఁడు. పరమవిశ్వాసి. ఆతఁడు దేవునితో సమానదైవములఁ గల్పించినవాఁడు కాఁడు.

తాను పొందినమేళ్ళ కాతఁడు కృతజ్ఞుఁడై యుండెను. దేవుఁ డాతని ననుగ్రహించి సన్మార్గములోనికిఁ ద్రిప్పెను.

ఈలోకమున మే మాతనికి మంచివస్తువుల నిచ్చితిమి. పరలోకమం దాతఁడు న్యాయవంతులతో నివసింపఁగలఁడు.

స్థిరవిశ్వాసి యగు నిబ్రాహీముమతమును మీ రవలంబింపవలయునని మేము దీనిని మీకుఁ దెలిపియున్నాము. ఆతఁడు దేవునితో సమానదైవములఁ గల్పించువారిలోనివాఁడు కాఁడు.

సబ్బాతు (విశ్రాంతి) దినము, దానిఁగూర్చి భేదాభిప్రాయములఁ గల్పించుకొనినవారికొఱకే యేర్పడినది. నిజముగా దేవుఁడు రక్షణదినమున వారివాదములఁ దీర్పఁగలఁడు.

జ్ఞానవంతుఁడవై, దయాపరుఁడవై వారిని నీప్రభువుమార్గమునకుఁ బిలువుము. అతిదయ గలిగి వారితో వాదనఁ జేయుము. తనమార్గము నుండి తప్పిపోయినవారెవరో దాని ననుసరించినవా రెవరో దేవుఁడు బాగుగ గుర్తించియే యుండును.

నీకుఁ గలిగిననష్టములకు నీవు పరిహారముఁగోరినచో నీ కెంత నష్టము గలిగినదో యంతవఱకే పరిహారముఁ గోరుము. కాని, నీవు సహించియుండినచో, సహనమువలన గొప్పమేలు కలుగఁగలదు.

కావున నోర్పుతో సహించియుండుము. ఆ సహనము దేవుని నాశ్రయించుకొని యుండవలయును. అవిశ్వాసులఁగూర్చి చింత నొందకుము. వారిపన్నుగడలఁగూర్చి యాలోచింపకుము.

తనకుభయపడి సత్కర్మల నాచరించు వారితోడనే దేవుఁ డుండును.

---

# కాండము. 15

## సురా 17 రాత్రిప్రయాణము.

---

మక్కా--111 పద్యములు-12 రుకూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

మక్కాయందలిపవిత్రదేవాలయమునుండి దూరముగా నున్నట్టియు, మేము ధన్యముగాఁ జేసినట్టియు దేవాలయమునొద్దకు మాసూచనలఁ జూపుటకు రాత్రివేళఁ దనసేవకునిఁ దీసికొనిపోయిన యాతఁడు మహిమాన్వితుఁ డగుఁగాక! అతఁడు సర్వశ్రోత! సర్వద్రష్ట! ఇస్రాయేలు జనులకు మార్గదర్శకముగా నుండుటకు మేము గ్రంథమును మూసా కిచ్చి "మీరు నన్నుఁదప్ప మఱియొక రక్షకుని జేపట్టకుఁడు" అని యంటిమి.

నుహుతోఁబాటు మేముతీసికొనివెళ్ళినవారిసంతతివారలారా! ఆతఁడు విశ్వాసియగుసేవకుఁడు.

ఆగ్రంథములో నిస్రాయేలు ప్రజలకు ఖండితముగా "మీరు రెండుసారులు నిశ్చయముగ ఘోరపాతకములఁ జేయుదురు; గర్వముతో నుప్పొంగుదురు" అని ఘోషించితిమి.

మొదటిపాతకమునకు శిక్ష మీకాసన్నమైనంత నే ఘోరశక్తిగలమాసేవకులను మీపైఁ బంపఁగా వారు మీగృహములను మూలమూలల వెదకి మిమ్ము శిక్షించిరి.

తరువాత మీకు వంతుక్రమమున వారిపై నధికారమిచ్చి, వారిధనమును సంతానమును వృద్ధిచేసి, మీపక్షజలనభివృద్ధినొందఁజేసి,

మీతో “మీరు మంచిచేసినచో నది మీమేలుకొఱకే, చెడుగుచేసినచో మీకీడుకొఱకే. మీరెండవపాతకమునకు శిక్ష ననుభవింపవలసివచ్చినప్పుడు మీముఖములు విచారగ్రస్తములగుటకు మీపై నొకశత్రువు నంప, వారు దేవాలయమున మొదటఁ బ్రవేశించినట్లే ప్రవేశించి తాము జయించినదానిని బూర్ణముగ నాశనము చేసిరి.

మీపై ప్రభువు కరుణఁజూపునేమో ! మీరు మఱలిన యెడల మేమును మఱలెదము. అవిశ్వాసులకు బంధనాగారముగా నరకము నేర్పఱిచితిమి

నిశ్చయముగా నీకురాను క్రమమార్గమును జూపఁగలదు. పుణ్యకర్మల నాచరించువిశ్వాసులకు గొప్పబహుమానము కలుగ నున్న దనియు,

10. పునర్జీవమును నమ్మనివారికి కఠినశిక్షను సిద్ధముచేసియున్నా మనియు, నది ఘోషించును.

## అధ్యాయము 2.

మనుష్యునికి తొందర హెచ్చు. కావుననే యాతఁడు మేలు కోరుకొనినట్లే కీడునుగూడఁ గోరికొనును.

మేము రాత్రినిఁబగటిని రెండుసూచనలఁగాఁ జేసియున్నాము. రాత్రిపూఁట సూచన కనఁబడకుండఁజేసెదముగాని, పగటిసూచ నను బ్రకాశవంతముగఁజేసి మీరు మీప్రభువునుండి యైశ్వర్యమును కోరికొని మీయాయుఃప్రమాణమును గాలపరిమాణమును మీరు తెలిసికొనఁజేసితిమి. అన్నిఁటిని నిక్కిలి స్పష్టముగా నిర్మించితిమి.

ప్రతిమనుష్యునియదృష్టమును నాతనిమెడకే చుట్టియుంచితిమి.
రక్షణదినమున నాతనియెదుట నొకపుస్తకమును బాగుగ విప్పియుంచి,
“ ఈపుస్తకమును జదువుము. నీలెక్కను నీకుఁజూపుట కీదిన
మున మఱియెవ్వఁడును నక్కఱలేదు ” అందుము.

ఈరక్షణమార్గమును స్వీకరించుట తనరక్షణకొఱకే. ఆమా
ర్గమునుండి తప్పుట తమనష్టముకొఱకే. పాపభారమును మోయువా
రితరులభారమును మోయనక్కఱలేదు. మే మొకప్రవక్తను బంప
కుండ నెవ్వరిని శిక్షించియుండలేదు.

మే మేనగరమును నాశనముఁ జేయనెంచినను దానిలోనిధనికు
లకు మున్ముందు మాయాజ్ఞను దెలిపియే యుంటిమి. వారు ద్రోహులై
చరించుటచే వారికిఁగల్గినశిక్ష న్యాయమైయుండె నానగరమును సంపూ
ర్ణముగ నాశనముచేసితిమి.

నూహుతరువాత నెన్నియోజాతులవారిని నిర్మూలించితిమి.
తనసేవకులపాపములను ప్రభువు గమనించుచుఁ దెలిసికొనుచునే
యున్నాఁడు

నశ్వరమగు నిహలోకజన్మమును గోరికొనినవారిని మేము
త్వరగా నెంచికొని, వారికి మాయిష్టమువచ్చినదానిని బ్రసాదింతుము.
తరువాత నవమానితులై, బహిష్కారమునొంది దగ్ధులగుటకు వారికి
నరకము నేర్పాటుచేసియున్నాము.

కాని, విశ్వాసియై పరలోకజీవనమునుగోరి యథావిధిగా దాని
కొఱకుఁ బాటుపడువాఁడు దేవునికిఁ గృతజ్ఞుఁడై యత్నప్రయత్నమును
సలుపుచుండును.

20. వీరికిని, వారికిని, నందఱకును దేవుఁడు తనవరముల నిచ్చుచునే
యుండును. దేవునివరములను బొందనివా రెవ్వరు నుండరు.

వారిలోఁ గొందఱ నితరులకంటె నధికులఁ జేసితిమికదా ! కాని

పరలోకమున నాయంతరువు లింతకంటె హెచ్చుగను శ్రేష్ఠములు గను నుండును.

అవమానితుఁడవును, నసహాయుఁడవును నై యొకచోఁ గూర్చుండకుండుటకు నీ దేవునిఁ గాక నితరదైవముల నావాహనఁ జేయకుము.

## అధ్యాయము 3.

నీప్రభువు తన్నుదప్ప నితరుల నీ వారాధింపవలదనియు, నీతో నీతల్లిదండ్రులు వృద్ధులైనను వారియెడల దయగలిగి యుండుమనియు, వారిని 'ఛీ' యనుటగాని దూషించుటగాని కూడ దనియు, వారిని మర్యాదగాఁ బల్కరింపవలయుననియు,

నెమ్మదిగా వారియిష్టములను నెఱవేర్పవలయు ననియు, "ప్రభువా! వీరిద్దఱును నన్ను చిన్ననాఁడు దయతోఁ బెంచినారు. అట్లే నీవు వారిని దయతోఁ జూడు" మని యనుమనియు మిమ్మా జ్ఞాపించి యున్నాఁడు.

మీయాత్మలలో నున్నదంతయు మీప్రభువున కెఱుకయే. మీరు పుణ్యవంతులరో కారో యాతనికిఁ దెలియును. అతనియొద్దకు మఱలి వచ్చువారియెడ నాతఁ డౌదార్యముఁ జూపును.

నీబంధువులకు రావలసినవంతు నిచ్చి, భిక్షుకులకును, పాంథులకును బెట్టుచు నమితవ్యయముఁ జేయక సంచరింపుము.

అమితముగ వ్యయముచేయువారు సైతానులకు సోదరులు. సైతాను దేవునికి కృతఘ్నుఁడై యుండెను.

నీ వాశాపరుఁడవై నీప్రభువునుండి నీకొఱకే వరములఁ గోరి కొని వారిని వదలిపెట్టినయెడల వారితో దయగానైనను మాట్లాడుము.

నీ చేతులను నీమెడకుఁ దగిల్చికొనకుము. వానిని బారుగా

చాపను జాపకుము. అట్లు చేసితివేని నీవును భిక్షుకుఁడవై యితరుల దూషణకుఁ బాత్రుఁడ వగుదువు.

30. నిశ్చయముగా నీప్రభువు తనయిష్టమువచ్చినవారికిఁ గావలసినంత యిచ్చునేకాని మితముగా నుండును. తనకింకరుల నాతఁడు పరీక్షించుచుండును.

## అధ్యాయము 4.

తిండికి లేదని పుత్త్రిఘాతకులరు కాఁబోకుఁడు. వారికినిమీకును గూడ నిచ్చెదము. వారిని జంపుట దౌష్ట్యము.

వ్యభిచరింపకుఁడు. అది కలుషకృత్యము. దౌర్జన్యము.

మంచివిషయములోఁదప్ప దేవుఁడు చంపవలదని చెప్పినవానిని జంపకుఁడు.

అకారణముగఁ జంపఁబడినవారివారసులకు మే మధికారముల నిచ్చియున్నాము. కాని, యాతఁడుగూడ హత్య నొనరించినవానినిఁ జంపఁ బ్రయత్నించి హద్దుమీఱఁగూడదు. అతనికిఁగూడ మేము పగ తీర్చికొన సహాయపడెదము.

క్రమమార్గమునఁదప్ప ననాథశిశువునకు బలము చేరువఱకును నన్యోన్యముగ దాని పదార్థమును ముట్టికొనకుము. నీప్రతిజ్ఞను నెఱవేర్చికొనుము. అది నెఱవేరినదా లేదా యని మే మడుగుచునే యుందుము.

కొలుచునప్పుడు తప్పుకొలతలఁ గొలవక, తూఁచునప్పుడు సరియగు త్రాసు నుపయోగింపుము. ఇదియే శ్రేష్ఠము. ఇట్లే తగవులు తీరిపోవును.

నీకుఁదెలియనిదానివెంబడిఁ బోకుము. అట్లు చేసితివేని నీచెవి, నీకన్ను, నీహృదయముఁగూడ సాక్ష్యమియ్యవలసియుండును.

నీవు భూమిని బ్రద్దలుచేయలేవు. పర్వతములవలె నున్నతుఁడవు కాఁజాలవు. కావున గర్వపూరితుఁడవై భూమిపై సంచరింపకుము. ఇదియంతయు దుష్టము. నీప్రభువునకు జుగుప్సాకరము.

ఇది నీప్రభువునకుఁ జూపినదానిలో నొకభాగము. నీవు దూషితుఁడవు, బహిష్కృతుఁడవును నై నరకములోఁ బడకుండుటకు దేవుని ప్రక్క మఱే యేదైవమును నిలువఁబెట్టకుము.

40. ఏమి! మీప్రభువు మీకు కొడుకులను సృజించి తనకొఱకు దేవతలనుండి కూఁతురాండ్రి నేర్పఱిచికొనినాఁడా? మీరు ఘోరవార్త నుచ్చరించుచున్నారు.

అధ్యాయము 5.

ఇదిగాక మనుష్యుఁడు భయసూచనను బరిగ్రహించుటకే కురానున ననేకవిధములుగఁ జెప్పియున్నాము. అయినను వారు దానినుండి మఱింతదూరముగఁ బలాయితు లగుచున్నారు.

మీరనున ట్లతఁడుగాక యితరదైవములున్నచో వారు సింహాసనస్థునిపైఁబడఁ బ్రయత్నించియుండరా?

అతఁడు మహిమాన్వితుఁ డగుఁగాక! వారిపాపవాక్యములాతని నేమాత్రమును జేరవు.

సప్తస్వర్గము లంతను భూమియందు నీరెంటిటియందుండువారును నాతనిస్తుతింతురు. అతనిస్తోత్రము చేయని దేదియునుండదు. కాని వారిస్తోత్రపాఠములు మాకుబోధపడవు. అతఁడు కరుణాపరుఁడు, క్షమాయుతుఁడు" అనుము.

నీవు కురాను చదువుచున్నప్పుడు, నీకును ముందుజన్మమునందు నమ్మకము లేనివారికిని మధ్య నొక నల్లనితెర యుండును.

వారు దానిని బోధపఱుచుకొందురేమో యని వారిచెవులలో

దిమ్మలను, వారిహృదయములపై తెరలను నుంచియుందుము. కురానులో నీయేకప్రభుని పేరు వచ్చునప్పుడు వారు పాఱిపోవుచు వెన్నిచ్చెదరు.

వారు నిన్ను వినుచు నేల తమలోఁ దాము గుసగుసలాడుకొనుచున్నారో మాకుఁ దెలియును. దుష్టులు "మీరొకయింద్రజాలము ననుసరించుచున్నా" రందురు.

చూచితివా? ని న్నెట్టివారితోఁ బోల్చుచున్నారో! కాని, వారు తప్పుత్రోవఁబడి మంచిత్రోవ నిఁకఁ గనుఁగొనలేరు.

వా రింకను, "మే మెముకలును, ధూళియునైన పిదప మాకు పునఃసృష్టి యుండునా?" యందురు.

50. "అవును. మీరు మీదృష్టికి ఱాళ్ళో యినుమో మఱి యేజంతువుగనో కనఁబడి,

తిరిగి, జీవమునొందుట కష్టమని మీకుఁ దోచినను పునస్సృష్టి కలుగక మానదు" అనుము. వారు "మమ్ము తిరిగి జీవింపఁ జేయువా రెవ్వ" రని యడిగిన "మిమ్ముఁ దొలుత సృష్టించినవాఁడే" యని బదులు చెప్పుము. వారును తలలను తటపటాయించి "అది యెప్పుడు జరుగును" అందురు. "బహుశః ఆకాల మైయున్నది కాఁబోలు" ననుము.

ఆదినమున దేవుఁడు మిమ్ముఁ బిలువ మీరు స్తోత్రములతో బదులిత్తురు. మీరు కొలఁదికాలముమాత్రమే యాలసించినట్లు మీకుఁ దోచును.

అధ్యాయము 6.

నాసేవకులగువారు వారితో దయగా మాటాడవలయు నని చెప్పుము. సైతాను మనుష్యునకు గర్భశత్రువు. కావున నాతఁడు వారియందు కలహములఁ బుట్టించును.

నీప్రభువునకు నీవు పరిచితుఁడవే. అతని కిష్టమైనచో నిన్నుఁ గరుణించును ; లేకున్న శిక్షించును. నిన్నుమాత్రము వారికి రక్షకుఁడవుగా నుండుటకుఁ బంపలేదు.

స్వర్గమర్త్యములం గలదంతయు నీప్రభువున కెఱుకయే. కొందఱు జ్యోతిష్యులకంటె నింకఁ గొందఱకు హెచ్చుశక్తి నిచ్చితిమి. దావీదునకు స్తోత్రపాఠగ్రంథము నిచ్చితిమి.

మీరు భ్రమించి దైవము లనుకొనినవారి నాతనిప్రక్క నిలిపెదరా ? కాని, వారు మీకష్టములఁ దొలఁగింపనుగాని, వానిని మఱియొకరికిఁ గలుగఁజేయనుగాని సమర్థులు కారు.

మీ రాశ్రయించుచున్నవారు తమప్రభువు నాశ్రయమును గోరుచున్నారు. తమలో నెవ్వ రాతనికి మిక్కిలి సమీపవర్తులో వారు స్పర్ధకలిగి యున్నారు. ఆతనికరుణకొఱకు కాశయును, శిక్షనుండి భయమును బొందుచున్నారు. నిశ్చయముగా నీప్రభువుశిక్షకు భయపడవలసినదే " అని పల్కుము.

రక్షణదినమునకుఁ బూర్వము మేము నాశనముచేయనట్టికాని ఘోరశిక్షను విధింపనట్టికాని, నగర మెద్దియును లేదు. అది యంతయు గ్రంథములో లిఖితమయియే యున్నది.

పూర్వకాలపుప్రజ లసత్యము లనిరే కాని నీ కద్భుతచర్యలఁ జేయుటకు శక్తినిచ్చియే పంపియున్నాము. వారికన్నులయెదుట నే థమూదున కాఁడుయొంటె నిచ్చితిమి. కాని, వారు దానిని గౌరవింపరైరి. మేము ప్రవక్తల కద్భుతచర్యలఁ జేయుసామర్థ్యము నిచ్చుట మీకు భయముపుట్టుటకొఱకే.

60. దీనిని స్మరింపుము. మేము నీతో " నిశ్చయముగా నీప్రభువు మనుష్యులచుట్టు నావరించియే యున్నాఁడు. మనుష్యులు వివాదములఁ బెంచికొనుటకే నీకు దర్శనమును, ఖురానులోనివిష

వృతుమును నిచ్చియున్నాము. మేము వారిని భయభ్రాంతులగునట్లు చేసెదము. అయినను దానివలన వారిదౌష్ట్యము హెచ్చగుచునే యుండును” అంటిమి.

## అధ్యాయము 7.

దేవతలలో “ఆదామునకు సాష్టాంగపడుఁ” డనగా వారందఱు నట్లు చేసిరిగాని, ఇబ్లీసుమాత్రము, “ఏమి! నీవు మట్టితో నిర్మించినయాతనికి నేను నమస్కరింపవలయునా?

నాకంటె నీతని హెచ్చుగా గౌరవించుచున్నావు. నిశ్చయముగా రక్షణదినమువఱకును నాకు గడువిచ్చితివేని, కొలఁదిమందిని తప్ప నాతనిసంతానము నంతటిని నాశనము చేసియేతీరుదును” అనెను

దేవుఁడును, “ఇచటనుండి వెడలిపొమ్ము. వారిలో నిన్ననుసరించువారికి నరకమే బహుమానము. ఈ బహుమానము చాలదా?

నీకు సాధ్యమైనంతమందిని నీమాటలతోఁ ద్రోవ దప్పింపుము. నీయాశ్వికులతోడను, బదాతులతోడను, వారినెదిరింపుము. వారి ధనమందును, సంతానమందును, నీవును భాగస్థుఁడవై, వారికి వాగ్దానములనే చేయుము.

కాని, నాకింకరులపై నీకెట్టియధికారమును లేదు. నీప్రభువే వారికిఁ దగినరక్షకుఁడుగా నుండును” అనెను.

నీప్రభువే వాడినావలను వడివడిగ సముద్రముపైఁ దీసికొనిపోవుచు నాతనిధనమును వారు వెదకునట్లు చేయును. అతఁడు మీయెడలఁ గరుణ వహించియున్నాఁడు.

నీకు సముద్రముపై నాపద గలిగినప్పుడు నీవు పిలిచిన వారు కనఁబడరు. అచటనుండువాఁడు దేవుఁడొకఁడే. కాని, యాతఁడు

నిన్ను సురక్షితముగ భూమిపైకిఁ దీసికొనివచ్చినను మీ రాతని కెడగలుగ నిలఁబడుదురు. మనుష్యుఁడు కృతఘ్నుఁడు.

ఏమి! ఆతఁడు మీకొఱకు భూమిని బ్రద్దలు చేయఁడనికాని, మీపై నిసుకతో నిండినమారుతములఁ బంపఁడనికాని మీ కేమి నమ్మకము ? అయిన నీకు రక్షకుఁ డెవ్వఁడును దొరకఁడు.

లేక, నిన్ను మఱియొకసారి సముద్రముపైకిఁ దీసికొనిపోయి నీకృతఘ్నతకు ఫలముగా నీపై ఝుంఝామారుతమును బంపి నిన్ను నీటిలో ముంచఁడని నీకేమినమ్మకము ? అయిన నందు నీకు మే మెవ్వరమును సహాయపడము.

70. మే మాదాముపుత్త్రిలను గౌరవించి భూసముద్రములపై వారిని దీసికొనిపోయి, వారికి మంచిపదార్థముల నాహారముగా జతగూర్చి చాలమందికంటె హెచ్చుగా ధన మొసగియున్నాము.

## అధ్యాయము 8.

ఒకానొకదినమున వారిని వారినాయకులతో నొకచోఁ జేర్చెదము. అప్పుడు కుడిచేతఁ బుస్తకమునందుకొనువారికి నూలుపోగువాసిగా నైనను హాని కలుగదు.

ఇచ్చట నంధులైయున్నవారు తరువాతఁగూడ నంధులై మార్గమునుండి మఱింతదూరముగఁ దొలఁగుదురు.

నిశ్చయముగా మేము మీకుఁజూపినదానినుండి వారు నిన్ను పెడతోవఁ బెట్టి, మాపేర నీవు మఱియొకవస్తువు నుంచునట్లు చేయ నెంచెదరు. అట్లయినచో వారు నిన్ను స్నేహితునిగనే చేకొని యుందురు.

మేము నీకు స్థిరచిత్తము నీయనిచో మీవారిప్రక్కకుఁ గొంచెము పోయియే యుందువు.

అట్లయిన జీవితమునందును మృత్యువునందును నిన్ను దుఃఖము ననుభవింపఁజేసియే యుందుము. అప్పుడు మాపై నెవ్వఁడును నీకు సహాయకుఁడు దొరకఁబోఁడు.

నిశ్చయముగా, వారు నిన్ను భూమినుండి త్రోలి, యెన్నడును నిచటికి రాకుండఁ జేసియుందురు. కాని, వారే నీతరువాతఁ గొంతకాల మాలస్యము చేయవలసియుండును.

నీకుఁబూర్వము మేము పంపినప్రవక్తలిట్లే చేసిరి. ఈమార్గమునం దిఁకముం దేమార్పును గలుగఁబోదు.

## అధ్యాయము 9.

రాత్రిని సంజెచీఁకటి యావరించువఱకును సాయంత్రము ప్రార్థన సలుపుము. ఉషఃకాలప్రార్థనకు సాక్షు లున్నారు.

కావున నాయుషఃకాల ప్రార్థనకొఱకు రాత్రియంతయు వేచియుండుము. ఈనీసేవ యధికమేకాని, యిందుమూలమున నీప్రభువు మహిమావంతమగుస్థానమునకు లేవనెత్తునేమో!

80. "ప్రభువా! న న్నేయాటంకమును లేకుండఁ బ్రవేశింపఁ జేసి, యడ్డు లేకుండఁ బైకి వచ్చునట్లును జేసి, నీసాన్నిధ్యమువలన నాకు సహాయముగలుగునట్టిశక్తిని బ్రసాదింపుము.

సత్యోదయమైనది. అసత్య మస్తమించినది. నిజముగా నసత్యమంతరించియే తీరును" అనుము.

భక్తులకుఁ గరుణాచిహ్నమును రోగములమాన్పు లేపనమును నగు ఖురానుభాగమును బంపుచున్నాము. కాని యది దుష్టులను మఱింత నశింపఁజేయనే తోడ్పడును.

మనుష్యునకు మేము వరములనిచ్చునప్పు డాతఁడు వెనుకకు తగ్గి ప్రక్కకుఁ బోవును. కాని, యాతనికి కీడు కలుగునప్పుడు నిస్పృహుఁ డగును.

" ఎవరికిఁ దోఁచినట్లు వా రాచరింతురు. కాని, మంచిరక్షణ మెవనికిఁ గలిగెనో యాతనికే బాగుగఁ దెలియును " అనుము.

## అధ్యాయము 10.

వారు నిన్ను పరిశుద్ధాత్మఁగూర్చి యడుగుదురు. వారితో " పరిశుద్ధాత్మ నాప్రభువునుమతిపై బయలువెడలును. కాని నీకు స్వల్పజ్ఞానమే యీయఁబడినది '' అనుము.

మా కిష్టమైనచో మేము నీకుఁ దెలిపినదాని నుపసంహరించియే యుందుము. దేవునిదయ లేకున్న నప్పుడు నీపక్షము నవలంబించువాఁ డెవ్వఁడు నుండఁడు.

ఆతనికి నీయెడల దయ చాల హెచ్చుగా నున్నది.

" నిశ్చయముగా మనుష్యులును బిశాచములును నొకరికొకరు సహాయముచేసికొనియు, నీకురానువంటిగ్రంథమును గల్పింపఁజాలరు " అనుము.

సత్యముగా నన్నిరీతులమనుష్యులకును సరిపోవున ట్లీకురాను నందు వాక్యములను జతపఱిచి యున్నాము. కాని, చాలమంది భక్తి హీనతదప్పఁ దక్కినదంతయును నిరాకరించి యున్నారు.

90\. వారు " మాకొఱకు భూమినుండి యొకయూటను బయలు వెడలఁజేసి తైనను,

ద్రాక్షాఖర్జూరవనములఁ బుట్టించి యందు జీవనదుల నిరంతర ప్రవాహయుతములుగఁ జేసి తైనను,

నీవు మాకుఁ దెలియఁజేసినట్లు ఖండఖండములుగా నాకాశ మును మాపై బడఁజేసి తైనను, నీకు సాక్ష్యముగా దేవునిఁ గాని దేవతలనుగాని తెచ్చితైనను,

నీవు బంగారపుటిల్లు కలిగి తైనను, నీవు స్వర్గమున కెగఁ

బ్రాఁకి, యందుండి, మేము చదువఁగలయొకగ్రంథమును మాకుఁ బంపినయెడను, మాకునమ్మకముఁబుట్టించినఁగాని, మేమువిశ్వసింపము" అందురు. నాప్రభువునకు స్తోత్రములు కలుగుఁగాక! నేను మనుష్య మాత్రుఁడ నగు నొకపవిత్రను మాత్రమే కదా!

## అధ్యాయము 11.

"దేవుఁడు మనుష్యుని ప్రవక్తగాఁ బంపించెనే" యని వా రడుగుదురు. కాని, వారికి రక్షణమార్గము చేఁజిక్కి యున్నను, వారు విశ్వసింపరేల?

దేవతలు నిత్యమును భూమిపై సంచరించువారైనచో మేము స్వర్గమునుండి యొక దేవతనే పవిత్రగాఁ బంపియుందుము.

మీకును నాకును మధ్య దేవుఁడే సాక్షిగా నున్నాఁడు. తన కింకరులఁబరీక్షించి వారిపై నొకక న్నుంచియే యున్నాఁడు" అనుము.

దేవుఁ డెవనినైన రక్షింపఁదలఁచినచో రక్షించియే తీరును. త్రోవఁ దప్పింప నెంచినచోఁ దాను తప్ప నితరులు సహాయపడఁ జాలరు. రక్షణదినమున వా రందఱును బధిరులు, పంగులు, నంధులు గా ముఖములపైఁ బ్రాఁకికొనుచు నొకచోఁ జేరుదురు. వారికి నరకమే వాసగృహ మగును. దానియగ్నిశిఖ లాఱిపోవుచున్నప్పు డెల్లను వానిని తిరిగి ప్రజ్వలింపఁ జేసెదము.

వారు మాసూచనలను విశ్వసింపక, "మేము బుగ్గియు, నెము కలు నైనపిదప మాకుఁ గ్రొత్తజీవములు వచ్చునా?" యని యని నందు కిదియే బహుమానము.

స్వర్గమర్త్యముల సృజింపఁగలదేవుఁ డట్టివానిని తిరిగి సృజింపఁ గలఁ డని వారికిఁ దోఁచదా? వారి కాతఁడు కొంతగడు వొసగి యున్నాఁడు. ఇం దెట్టిసందేహమును లేదు. కాని, దుష్టులు భక్తిహీనతఁ దప్ప సర్వమును నిరాకరింతురు.

100. "మనుష్యుఁడాశాపరుఁడు. కావున దేవునిదయాధనము మీయొద్ద నున్నను దానిని వ్యయపఱుతు రనునుద్దేశముతో మీరు దానిని వారి కీయరు" అనుము.

## అధ్యాయము 12.

కావున మేము మూసాకు స్పష్టములగు తొమ్మిదిసూచనల నిచ్చితిమి. అతఁడు ఫిరౌనునొద్దకు రాఁగా, "మూసా! నీ వింద్రజాలమునకు లోనై యున్నావు. ఇది నిశ్చయము" అని యాతఁడేల యనెనో నీ విస్రాయేలుజనుల నడుగుము.

మూసా, "స్వర్గమర్త్యాధినాథుఁడగు దేవుఁడు తప్ప నితరు లీస్పష్టసూచనల నీయఁజాలరని నీకుఁ దెలిసియేయున్నది. ఫిరౌనా, నీవు మార్గముతప్పినవాఁడవని నాయభిప్రాయ" మనెను.

కావున ఫిరౌను ఆతనిదేశమునుండి తఱుమఁజూచెను. కాని, యాతనిని, నాతనియనుచరులను, మేము నీటముంచి చంపితిమి.

ఆతఁడు మృతినొందినపిదప నిస్రాయేలుప్రజలను, "మీరీదేశమున వసింతురా?" యని యడిగితిమి. పునర్జన్మము సత్యమైనచో మీయిద్దఱనుఁ దీర్పుచెప్పఁ బిలిచెదము.

మేము నిశ్చయముగా కురాను నంపియున్నాము. నిశ్చయముగా నది యవతరించినది. దానిని చాటుటకును భయసూచనల నిచ్చుటకును మాత్రమే నిన్ను పంపియున్నాము.

కురానును భాగములుగా ఖండించి నీవు దానిని క్రమక్రమముగాఁ జదువునట్లు దానిని ప్రత్యేకభాగములుగనే యవతరించునట్లు చేసితిమి.

మీరు దానిని నమ్మెదరా? నమ్మరా? పూర్వమే జ్ఞానమొందినవారు దానిపఠనమునువినుచు ముఖములపై సాగిలఁబడి,

"దేవుఁడు మహిమయుతుఁడు. అతనివాగ్దానము నెఱ వేఱినది"

అనుచు నేడ్చుటచే వారినమ్రత్వము మఱింత హెచ్చెను.

110. "అల్లా (దేవుఁడు) యని, కాని, "అర్రహమాన్" (దయానిధి) యని కాని, నీయిష్టమువచ్చినపేర నాతనిఁ బిలువుము. ఆతనినామము లన్నియు నత్యుత్తమములు. నీవు ప్రార్థించునప్పుడు మిక్కిలిబిగ్గరగను మిక్కిలి మెల్లగను గాక మధ్యస్వరమునఁబలుకుము.

పుత్త్రవంతుఁడు గానివాఁడును, రాజ్యమునఁ దనకు భాగస్థుఁడు లేనివాఁడును, బలహీనతచే సహాయము నపేక్షింపనివాఁడును నగు దేవుని స్తుతింపుము. ఆతనిమహిమను చాటుచు దానిని హెచ్చు చేయుము.

# సురా 18 గుహ.

మక్కా-110 పద్యములు-12 రుకూలు.

## అధ్యాయము 1.

### దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

దేవునినుండి వారికిరాఁగల గొప్పదుఃఖమును సూచించుటకును,

పుణ్యకార్యములఁజేయు భక్తులకు చిరకాలము నుండఁగల యొక మంచిబహుమాన మున్నదని ప్రచురించుటకును,

దేవుని కొకపుత్త్రుఁ డున్నాఁడని చెప్పువారి కొకభయసూచన నిచ్చుటకును,

చుట్టుత్రోవం గాక సూటిగా నర్థమురాఁగల గ్రంథము నవత రింపఁజేసినదేవుని స్తుతింపుఁడు.

దీనినిగూర్చి వారికిఁగాని వారిపూర్వులకుఁగాని, యేమియుఁ దెలియదా? వారు పల్కునది కడుఘోరము. వా రసత్యముఁ దప్ప మఱెద్దియు భాషింపకున్నారు.

వారు దీనిని నమ్మనిచో, బహుశః నీవు వారిగుమ్మమునొద్దనే, వారిదారిలోనే, చీకాకుచే నాత్మహత్యఁ జేసికొందువుకాఁబోలు!

నిశ్చయముగా భూమిపై మేము సృజించినదాని నంతను దాని కలంకారప్రాయముగాఁ జేసి, వారిలో నెవ రెక్కువపుణ్యకర్మల నాచరింపఁగలవారో యనుస్పర్థ పుట్టఁజేయ నెంచితిమి.

కాని, దానిపై నున్నదాని నంతటిని ధూళిగాఁ జేయ నుద్యుక్తులమై యున్నాము.

గుహ యందును, అల్ రఖీమునందును నున్నవారు మా యద్భుతసూచనలలోనివారే యని తెలిసికొంటివా?

10. ఆయౌవనులు గుహయందుఁ జొచ్చినప్పుడు, "ప్రభువా! మమ్ముఁ గరుణించి మాపని సరిగజరుగున ట్లనుగ్రహింపుము" అనిరి.

అప్పుడు మేము చాలసంవత్సరములవఱకును వారు చెవిటివారుగ గుహలోనుండునట్లు వారిచెవులపైఁ గొట్టి,

తుదకు వారెల్లంతకాల ముండినదియు వారిరువురలో నెవరు బాగుగఁ దెలుపఁగలరో యని వారిని మేల్కొల్పితిమి.

## అధ్యాయము 2.

వారికథను యథారూపముగఁ జెప్పుచున్నాము. ఆయౌవనులు తమప్రభువును నమ్మియుండుటచే వారికి మారక్షణను వృద్ధినొందించి,

హృదయస్థైర్యము నిచ్చి నిలువఁబెట్టి, "స్వర్గమర్త్యములకుఁ బ్రభువగువాఁడే మాప్రభువు. ఆతనిఁదప్ప మఱియొక దేవుని మేము

స్మరింపము. అట్లు చేసినచో మే మక్రమకార్యమును జేసినవార మగుదుము.

ఈ మాప్రజలు తగినసాక్ష్యము లేనిదే దేవునిఁగాక యితర దైవముల నావాహనము చేసియున్నారు. దేవుని కసత్యదోషము గల్పించినవానికంటె ఘోరపాపి యెవ్వఁ డుండును?

కావున మీరు వారినుండియు, వారారాధించు దైవములనుం డియు నెడఁగలుగఁ బోవునప్పుడు గుహలోఁ బ్రవేశింపుఁడు. మీ ప్రభువు మిమ్ముఁగరుణించి మీకార్యములను జక్కఁ జేయును" అంటిమి.

సూర్యుఁ డుదయించి, గుహకు కుడిప్రక్కగాఁ బోయి, యస్త మించునప్పుడు వారు దానివిశాలాభ్యంతరమున నుండఁగా, వారియె డమప్రక్కనుండి పోవుచుండుటను నీవు గుర్తించియుందువు. ఇదియు దేవునిసూచనలలో నొకటి. దేవుఁడు రక్షించినవారికే రక్షణ. ఆతఁడు త్రోవతప్పించినవారికి ప్రభువుగాని మార్గదర్శకుఁడుగాని, యెవ్వఁడు నుండఁబోఁడు.

## అధ్యాయము 3.

వారునిద్రించుచున్నను మేల్కొనియున్నట్లే నీవు భావింతువు. వారిని కుడిప్రక్కకు నెడమప్రక్కకుఁ ద్రిప్పితిమి. ద్వారమున, వారి కుక్క కాళ్ళు చాఁచుకొని పరుండెను. వారిపై నాకస్మికముగా నీవు పడియుండినచో, వెనుజూపి పరువెత్తి, వారియెడల భయపూర్ణుఁడవై యుండియుందువు.

కావున వారొండొరులఁ బ్రశ్నించుకొనుటకు వారిని మేల్కొ లుప నం దొకఁడు, "మే మిచట నెంతసే పుంటి" మని యడుగ, "వారు ఒకదినమో దినభాగమో యిందు మసలినాము. అయినను మీ రెంతకాల మిం దుండినదియు మీప్రభువునకే బాగుగఁ దెలి

యును. ఇప్పుడు మీలో నొకని నీనాణెమును దీసికొనిపోయి నగరములో నెచ్చట మంచియాహారము లభించునో చూచి రమ్మని పంపుఁడు. ఆతఁడు మర్యాదగా మాట్లాడుచు, మీయునికి నెవ్వరికినిఁ దెలియఁజేయనీయ కుండున ట్లేర్పఱుపుఁడు.

20. వారు మిమ్ముఁ గనుఁగొనినచో మీపై ఱాళ్ళురువ్వి చంపుటయో, తనమతములోనికిఁ ద్రిప్పికొనుటయో చేయుదురు. అట్లయ్యేని మీకు శాశ్వతసుఖము కలుగఁ గలదు '' అనిరి.

దేవునివాగ్దానము సత్యమనియు, ప్రళయదినము తప్పక వచ్చుననియు, నానగరవాసులు తెలిసికొనుటకై, వారిప్రయత్నమును వెలిబుచ్చఁగా, వారును దమలోఁ దాము తమకు సంభవించినదానిఁ గూర్చి వివాదములఁ బెంచికొన నందులోఁ గొందఱు, " వారిపై నొకయిల్లు కట్టుఁడు. వారినిగూర్చి వారిప్రభువునకే బాగుగఁ దెలియు '' ననిరి. వాదములో గెలిచినవారు, " వారిపై నొకదేవాలయముఁ గట్టించెద " మనిరి.

కొందఱు " వారు ముగ్గురే. వారికుక్క నాల్గవది '' అనిరి. కొందఱు రహస్యమును గుర్తించి " వారైదుగురు. వారికుక్క యాఱవ " దనిరి. ఇంకను గొందఱు, " వారేఁడుగురు. వారికుక్క యెనిమిదవ '' దనిరి. " నాప్రభువునకే వారిసంఖ్య బాగుగఁ దెలియును. కొలఁదిమందికి తప్ప వారినిగూర్చి యెవ్వరికినిఁ దెలియదు. కావున వారినిఁగూర్చిన వివాదములలో స్పష్టముగా నుండి వారివిషయమై నస్రానీ నెవ్వని నడుగకుము

అధ్యాయము 4.

" దైవానుగ్రహమువలన '' అనుమాటలను జేర్పనిదే, " తేపే తప్పక పనిని జేతు '' నని యనకుము.

నీ వట్లనుటను మఱచినచో నీప్రభువును స్మరించి "ఈకథ సత్యమును సరిగఁ దెలిసికొనుటకు నాప్రభువు జ్ఞానము నిచ్చును గాక" యనుము.

వార ట్లాగుహయందు మూఁడువందలయేం డ్లుండిరి. కొందఱు మఱి తొమ్మిదియేండ్లుకూడ నుండిరందురు.

"వా రం దెంతకాల ముండిరో దేవునికే బాగుగఁ దెలియును. స్వర్గమర్త్యములందలి రహస్యము లన్నియు నాతనియధీనములే. ఆతని పైననే దృష్టి యుంచి యాతనివాక్యములనే వినుచుండుము. ఆతఁడు తప్ప మనుష్యునకు మఱియొకరక్షకుఁడు లేఁడు. ఆతనితోఁగూడి మఱి యెవ్వఁడును తీర్పు చెప్పఁజాలఁడు.

నీప్రభుగ్రంథముఁగూర్చి నీకుఁ దెలుపఁబడినదానిని నీవు చాటుము. ఆతనివాక్యముల నెవ్వరును మార్పఁజాలరు. ఆతఁడుగాక నీకు మఱియొక రక్షణస్థానము లేదు.

ఆతనిముఖావలోకనము నపేక్షించుచు, ప్రాతఃకాలమును, సాయంత్రమును తమప్రభువును స్మరించువారియెడల శాంతము వహించి యుండుము. ఇహలోకభోగములకై వారినుండి నీదృష్టిని మఱల్పకుము. మమ్ము స్మరింప లక్ష్యపెట్టనివారికిని, విషయేచ్ఛాపరులకును, ఇంద్రియనిగ్రహము లేనివారికిని, విధేయుఁడవై యుండకుము.

"సత్యము నీప్రభునధీనము. కావున విశ్వసించినవారే విశ్వసింపుదురు గాక! విశ్వసింపనివారు విశ్వసింపకుందురు గాక! కాని ద్రోహులను పొగచేఁ గప్పఁగలయగ్ని నాయత్తపఱిచియేయున్నాము. వారు సహాయముకొఱకు మొఱపెట్టినచో మఱుగుచున్న యిత్తడివలె వారిముఖములను కాల్పఁగల యుష్ణజలమే వారికి సహాయము కాఁగలదు. వారు త్రాగుజలము దుఃఖకరముగను, వారు పరుండుశయ్య యసౌఖ్యావహముగను నుండును.

30. కాని, భక్తులై పుణ్యకార్యములఁ జేసినవారికి పుణ్యవంతులకు రాఁగల బహుమానమును నశింపఁజేయకుము.

వారికి ఈడెనువనమునందలినీడలలోఁ బ్రవహించునదులు లభింపఁగలవు. వా రందు బంగారుకంకణములచే నలంకృతులై సరిగంచు పట్టు పీతాంబరముల ధరించి, సింహాసనములపై విశ్రమించియుందురు. వారిబహుమాన మానందమయమై, వారిశయ్య సంతోషదాయకమై యుండును.

## అధ్యాయము 5.

వారి కిద్దఱుమనుష్యుల నొకసూచనకథగా నుదాహరింపుము. వారిలో నొకనికి రెండుద్రాక్షవనములును, వానిచుట్టును ఖర్జూరతరువులును వానిమధ్య వరిపొలముల నిచ్చి యాతోఁటలు నిత్యఫలవంతములుగా నుండునట్లు చేసితిమి.

దానిమధ్య నొకనదిని బ్రవహింపఁ జేసితిమి.

ఆపురుషుఁడును నాఫలములను దీసికొని తనస్నేహితునితో వివాదము బెట్టికొని, "నీకంటెనాకు హెచ్చుధన మున్నది. నీకుటుంబముకంటె నాది గొప్పది" అని పల్కుచుఁ దనయాత్మకే యన్యాయవంతుఁడై,

తనవనములోనికిఁ బోయి, "యిది యెన్నఁడును నశింపదు.

ప్రళయకాల మెన్నటికిని రానేరదు. నే నొకవేళ నాప్రభువు నొద్దకుఁ బోయినను దీనికంటె సౌఖ్యతర మగునది నాకు లభించును" అనెను.

అతనిస్నేహితుఁడును నతనితో వాదించి, "ఏమి, నిన్ను ధూళితో నిర్మించి, పిదప జీవకణములుగాఁ జేసి, నిన్ను సంపూర్ణపురుషుని జేసినవానియందు నీకు నమ్మకము లేదా ?

నాకు మాత్రము దేవుఁడే ప్రభువు. నాప్రభువుతో మఱి యెవనిని జేర్పను.

నీవు నీయుద్యానవనముం జొచ్చినప్పుడు, "ఇది యంతయు దైవేచ్ఛ. దేవునియందుఁ దప్ప మఱి యెంగును శక్తిలే" దని నీ వేల యనలేవు ? నీకంటె ధనమునందును సంతానమునందును నేను తక్కువగనే నీకుఁ గనఁబడవచ్చును గాని,

40. నాప్రభువు నీయుద్యానవనముకంటె నధికమగుదానిని నాకుఁ బ్రసాదించి యీయుద్యానమునకు నాకసమునుండి పిడుగులఁ బంపి దానిని ధూళి గొనర్చునేమో ?

లేదా, దానిని నీటితో ముంచి, కంటికిఁ గానరాకుండఁ జేయునేమో !" యనెను.

ఆతనిఫలము లన్నియు నాశన మయ్యెను. ద్రాక్షతీఁగలు వాడి పందిరులనుండి వ్రేలాడఁదొడఁగెను. అప్పు డాతఁడు తా నాయుద్యానమువిషయమై పడినశ్రమయును వెచ్చించినధనమును చేతులతో లెక్కించుకొనుచు, "అయ్యో ! నాప్రభునిఁ గాక యింకొకని నేల యారాధించితి" నని మొఱపెట్టెను.

దేవుఁడుతప్ప నితరుఁడు తనకు సహాయకుఁడు కాఁజాలఁడనియు, తనకుఁ దాను సహాయముచేసికొనలే ననియు, నాతనికప్పుడుతోచెను.

అట్టిసమయమున సత్యముగా దేవుఁడే రక్షకుఁడు. ఆతఁడే బహూకరించువారిలో శ్రేష్ఠుఁడు. దేని నైనను బాగుచేయువాఁడు నాతఁడే.

## అధ్యాయము 6.

ఆతనిముం దీజీవితమునుండియే యొక యుపమానముం జూపుము. మేము స్వర్గమునుండి నీటిని బంప దానిలో భూమియం

దలిగడ్డి కలిసి మఱునటిదినముననే యది యెండిపోవ, గాలి దాని నెగఁజిమ్మునుగదా! దేవుని కన్నివస్తువులపైనను నధికారము గలదు.

ధనమును సంతానమును ప్రస్తుతజన్మమున కలంకారములు. కాని, నీబహుమానము కొఱకును, ముందటియాశకొఱకును శాశ్వత పుణ్యకర్మలు నీప్రభువు దృష్టిలో నుత్తమములు.

మేము పర్వతముల నంతరింపఁజేసి, భూమిని చదునుచేసి, మనుష్యులలో నొక్కనినైన విడువకయె యొకచోఁ జేర్పఁగలదిన మును స్మరింపుము.

వారప్పుడు దేవునిముందు వారివారి యంతరువులప్రకారము నిలువఁబడఁగా దేవుఁడు "మిమ్ము తొలుత సృష్టించినట్లే మీ రిప్పుడు మాయొకటికి వచ్చియున్నారు. కాని, మీరు మాయిచ్చినమాట వృథయగునని భావించితిరిగదా!" అనును.

అప్పుడు ప్రతిమనుష్యునిచేతికి నొకపుస్తక మందియ్యఁబడును. దుష్టులు దానిని జూచి భయాకులులై "అయ్యో! ఈపుస్తక మేమి? ఇందు మేము చేసినకొద్దిగొప్పకార్యము లన్నియు లిఖింపఁబడి యున్నవే!" యనుచుఁ దమకన్నులతోఁ దాము చేసిన ప్రతికార్యమును జూచికొనఁగలరు. నీప్రభువు వారి కెట్టియన్యాయమును జేయఁడు.

అధ్యాయము 7.

50. మేము దేవతలతో "ఆదామునుముందఱ సాష్టాంగపడుఁ" డన నందఱును నట్లు చేసిరి. కాని, పిశాచవర్గములోనివాఁడు కావున, ఇబ్లిసుమాత్రము ప్రభువునాజ్ఞఁ దిరస్కరించెను. ఏమి! అయిన నన్నుఁగాక యాతని నాతనిసంతానమును ప్రభువులుగాఁ జేకొందువా? వారు నీశత్రువులు కారా? భక్తిహీనుల కిది విచారకరమగుమార్పు.

స్వర్గమర్త్యముల సృష్టినిగాని, తమసృష్టినిగాని, వారికిఁ జూఫ

లేదు. ఆమోసగాండ్రను నాకు సహాయకులుగాఁ జేకొనలేదు.

ఒకానొకదినమున దేవుఁడు, "మీరు దైవములని యెంచి, నాకు స్నేహితులుగాఁ జేసినవారినిఁ బిలువుఁ" డన వారును వారిని బిలుతురుగాని, వారు బదులు చెప్పరు. అప్పుడు వా రిరువురమధ్యను నరక మనునొకలోయ నుంచెదము.

దుష్టు లందరియగ్నినిఁజూచి, తా మందు పడఁగల మనియు నందుండి వెడలు నుపాయము లే దనియుఁ దెలిసికొనఁగలరు.

అధ్యాయము. 8.

ఇప్పు డీకురానులో మనుష్యునకు వివిధములగు నుపమాన ములను జెప్పియున్నాము. కాని, మనుష్యుఁడు చాలవస్తువులఁజూచి నిరసించుచున్నాఁడు.

పూర్వులగతియే తమకును బట్టినవఱకును, లేదా, లోక మంతయుఁ జూచుచుండ వారికి శిక్ష కలుగువఱకును మనుష్యులు తమకు రక్షణ దొరకియున్నను విశ్వాసయుక్తులై క్షమింపుమని ప్రభు వును వేడ రేల?

మాదూతలు సత్యమును చాటుటకును భయసూచనల నిచ్చుటకును మాత్రమే వచ్చియున్నారు. కాని, యవిశ్వాసకులు సత్యము నసత్యమని వాదించుచు, మాసందేశములఁ గేలిసేయుచు వృథాలాపము లాడుచున్నారు.

తన ప్రభువుసూచనలఁగూర్చి యాతనికిఁ జెప్పినను తాను పూర్వ మాచరించినకర్మలను మఱచిపోవువానికంటె నధముఁ డెవ్వఁ డున్నాఁడు? వా రీకురానును బోధపఱుచుకొనకుండ వారిహృదయ ములపై తెరలను గప్పి వారిచెవులలో దిమ్మల నుంచియున్నాము. మీరు వారిని రక్షణఁ బొందుఁడని యాజ్ఞాపించినను వా రొకింతయు రక్షణనొంద నొల్లరు.

నీప్రభు వుదారస్వభావుఁడు. దాక్షిణ్యమూర్తి. వారిపాప కార్యములకు వారిని శిక్షింపనెంచినచో వారి కాశిక్ష త్వరగానే కలిగియుండును. కాని మా బెదరింపు లన్నియు జరుగుట కొకకాలము నియమితమై యున్నది. దేవుఁడు తప్ప మఱి యెవ్వఁడు నాతని కాశ్రయుఁడు లేఁడు.

ఆయానగరవాసులు భక్తిహీనులగుటఁ జూచి యానగరముల నిర్మూలము జేసితిమి. వారికి రానున్న నాశనమునుగూర్చి ముందుగనే సూచనల నిచ్చితిమి.

## అధ్యాయము 9.

60. దీనిని స్మరింపుము:—మూసా తనసేవకునితో "నేనారెండు నదులును కలియుచోటును కనుఁగొనువఱకును నిట్లే సంవత్సరముల కొలఁదియుఁ బ్రయాణము చేయుచునే యుందును. ఊరకొనను" అని యానదుల సంగమస్థానమును చేరుసరికి తమచేఁపను మఱచిపోవ నది సముద్రములో యథేచ్ఛం బోయెను.

వారు కొంతదూర మరిగినపిదప మూసా తన సేవకునితో, "మా కుదయభోజనమును తెమ్ము. మే మీ ప్రయాణమువలన చాల నలసియున్నాము" అన,

ఆతఁడు "ఏమనుకొన్నావు. ఱాతియొద్దకు మనము విశ్రాంతికై పోయినప్పు డచట చేఁపను మఱచితిని. దానినిఁగూర్చి తలంపకుండ సైతానే నన్ను మఱువఁజేసినాఁడు. అదియు నద్భుతముగా సముద్రములోనికి దారిచూచికొనినది" యనెను.

మూసా "దీనిని వెదకుటకే మనము బయలుదేఱినా" మని వానితో వెనుకకు మఱలెను.

అప్పుడు మా యనుగ్రహమును బడసినట్టియు, మా జ్ఞానము

నొందినట్టియు మా సేవకులలో నొకనిని వారు కలసికొనఁగా,

మూసా వానితో "నీకు బోధపఱుపఁబడినజ్ఞానమే నాకును గలుగుటకు ని న్ననుసరింతునా?"

అన నాతఁడు "నీవు నాతో సహించి యుండలేవు.

నీకుఁ దెలియనివిషయములలో నీవు సహనము గలిగి యెట్లుండఁ గలవు ?" అని యడిగెను.

మూసా "దైవేచ్ఛ యున్నచో నే నోర్పుగలిగి నీవు శాసించు దాని నతిక్రమింప" నన

70. ఆతఁడు "అట్లయిన నేను నీకుఁ జెప్పునంతవఱకును 'నిది యే' మని మాత్ర మడుగకుము" అనెను.

## అధ్యాయము 10.

వారిద్దఱు నట్లు పోయి పోయి యొకయోడ నెక్క నాయజ్ఞాత పురుషుఁడు దానిని నడపుచుండెను. అప్పుడు మూసా "ఏమిది, దీనిలోనివారిని నీటిలోఁ ద్రోయుటకా నీవు దీనిని గడపుచున్నావు? ఇదియేమి యిట్లు వింతగా సంచరించుచున్నా" వని యడుగ,

ఆతఁడు మూసాతో "నీవు నాతో సహించి యుండలేవని నీతో తొలుతఁ జెప్పలేదా?" యని మందలించెను.

మూసా "నేను మఱచితి నని నన్నుమందలింపకుము. ఇట్లు కఠినముగా నన్ను శాసింపకు" మని వేఁడికొనెను.

వారట్లు పోవుచు నొకయావనునిఁ జూచిరి. ఆతఁడు వానినిఁ జంపెను. మూసా "అయ్యో! ఆతఁ డెవ్వరిని జంపలేదే. ఆతని నేల జంపితివి. ఏమి యిట్టిఘోరకృత్యముఁ జేసితి" వని యడిగెను.

# కాండము. 16.



అతఁడు "నీవు నాతో సహించియుండలేవని నీతోఁ జెప్పియుం టినిగదా!" యనెను.

మూసా "ఇటుతరువాత నిన్నడిగినచో నన్ను విడిచిపెట్టుము. ఇప్పుడుమాత్రము క్షమింపు" మని వేఁడికొనెను.

వారింకను బోవుచు నొకనగరమందలి ప్రజలఁజూచి యాహా రముకొఱకు యాచింప, వారు వారికాతిథ్య మీయరైరి. వారికచటఁ బడిపోవనున్న యొకగోడ కనఁబడెను. ఆ వింతపురుషుఁడు తిన్నగా దానిని తిరిగి నిలువఁబెట్టెను. మూసా దానినిజూచి "నీవుకోరినచో నీవుచేసినపనికి నీకు కూలి వచ్చియుండునే" యనెను.

అతఁడు "ఇంతటితో నీవు నన్ను విడిచిపోవలయును. అయినను నీ వోర్పుమాలి నన్నడిగినవాని కుత్తరములను వినుము.

మనమెక్కిన యోడ కొందఱు పేదవారిది. కాని, నావల నన్నిఁ టినిబట్టి వశముచేసికొనుచుండు నొకరాజు దానిని వెంబడించు చుండు టచే దానిని ముంపనెంచితిని.

80. మనముచూచిన యావనుని తలిదండ్రులు భక్తులు. కావున నతఁడు వారిని తనభక్తిహీనతచేతను దుర్మార్గముచేతను నెక్కడ బాధపెట్టునో యని వానిని జంపి,'

ఆతనికంటె పుణ్యవంతుఁడును, మాతాపితృభక్తిపరుఁడును నగు పుత్త్రునిఁ గలిగింప దేవునిఁ బ్రార్థించితిని.

ఈగోడక్రింద చాల ధనమున్నది. ఆధన మిద్ద ఱనాధబాలురది. వారితండ్రి పుణ్యవంతుఁడు. నీప్రభువనుగ్రహముచే వారిరువురును, వారికి బలముచేరినపిదప నాధనమును తీసికొనవలెనని దైవేచ్ఛ. ఇది

నాయిష్టముచొప్పున చేసినపనికాదు. నీ వోర్పులేక యడిగినదాని కర్థ మిదియే" యనెను.

## అధ్యాయము 11.

జుల్కర్నైన్ (రెండుకొమ్ములవాఁడు) ను గూర్చి వారు నిన్న డుగుదురు. "వారికథ మీకుఁ జెప్పెదను.

అతనిశక్తి నీభూమిపై స్థిరపఱిచి, యన్నిదారులను నాతనికధీన మగునట్లు చేసితిమి.

అతఁడొకదారిపట్టి పోయిపోయి,

సూర్యుఁడస్తమించు స్థలమునుజేరి, యాబింబ మొక బురదగుంటలో నస్తమించుటఁ జూచెను. దానికి సమీపముననే కొందఱు జనులుండిరి. మే మాతనితో "జుల్కర్నైన్! నీవు వారిని శిక్షింపనైనను శిక్షింపుము. లేదా దయతో నాదరింపుము" అంటిమి.

ఆతఁడు "మేము అధర్మవర్తనుని తప్పక శిక్షింతుము. పిదప వాఁడు ప్రభువునొద్దకుఁబోవ నాతఁడు వానిని ఘోరముగ శిక్షింపఁ గలఁడు.

కాని, విశ్వసించి పుణ్యకార్యములఁ జేయునాతనికి మంచి బహుమానము దొరకఁగలదు. వానిని మేము కఠినముగునాజ్ఞకు లోఁబడఁజేయము. తరువాత నాతఁడొకదారిఁబట్టి

90. సూర్యోదయమగుస్థలమునుజేర నచట వాని కాతపబాధనుండి రక్షణలేని జనులు కొందఱు కనఁబడిరి.

ఇది యథార్థము. ఆతనియొద్ద నెంతసైన్యమున్నదో మాకు పూర్తిగాఁ దెలిసెను.

ఆతఁడు ప్రయాణమై,

రెండుపర్వతముల మధ్యభాగమున నేభాషయు నెఱుఁగని జనులను కొందఱినుజూచెను.

వారాతనితో "జూల్కర్నైన్, యాజూజ్, మాజూజ్ అను వారిదేశమును పాడుచేయుచున్నారు. మాకును వారికిని మధ్య పెద్దగోడ కట్టినందులకా నీకు కప్పము చెల్లించుట?" యనిరి.

అతఁడు "మీకప్పముకంటె దేవుఁడు నాకనుగ్రహించిన బలమే మేలు. నాకు మనస్ఫూర్తిగా సహాయపడినచో మీకును వారికినిమధ్య పెద్దగట్టువైచెదను.

నాకుఁ గొన్ని యినుపదుక్కలను తెం" డని యాజ్ఞాపింప వారా దుక్కలతో పర్వతముల ప్రక్కనున్న స్థలమంతయు నింపిరి. అప్పుడాతఁడు "తిత్తులతో నగ్నిని బ్రజ్వలింపఁ జేయుఁ" డనెను. అదియు నగ్నితప్తమై యెఱ్ఱగానున్నప్పుడాతఁడు "దానిమీఁదఁ బోయుటకు మఱుగుచున్న యిత్తడి తెం" డనెను.

అప్పుడు యాజూజ్, మాజూజ్ లుదానినిత్రవ్వుటకుఁగాని, దాటుటకుగాని సమర్థులు గాకపోయిరి.

అప్పుడాతఁడు "ఇది నాప్రభువు ననుగ్రహము. నా ప్రభువువాగ్దానము జరుగనున్నప్పు డాతఁడది బుగ్గియైపోవునట్లు చేయును. నాప్రభువు సత్యవచనుఁడు" అనెను.

ఆదినమున మేము వారొండొరులఁ దీవ్రముగఁ దాఁకునట్లు చేసెదము. అప్పుడు బూరాపై మోత వినఁబడును. అంత నందఱ నొక్కసారిగ నొకచోఁ జేర్చెదము.

100 అప్పుడు మేమిచ్చిన భయసూచనను చూడకుండ కన్నులు పొర కప్పినవారును, వినుటకు శక్తిలేనివారును నైన

యవిశ్వాసులకు దగ్గఱగా నరకము నుంచెదము.

## అధ్యాయము 12

ఏమి! నన్నుగాక నాకింకరులఁ గొందఱిని గూడ నవిశ్వాసకులు తమప్రభువులుగా నెంచుకొన్నారా? నిశ్చయముగ భక్తిహీనులకు నరకమును సిద్ధము చేసియే యున్నాము.

"తమ కష్టములకు పాలై, చాలమట్టుకు నష్టముపడిన వారెవరో మీకుఁ దెలుపుదుమా?

ఈజన్మమున తమ విధిని తెలిసికొనలేక తాము చేసినదే క్రమమను కొనువారు వీరే.

దేవుని సూచనలనునమ్మక యాతనియొద్దకుఁ దిరిగి రామని తలంచువారేవారు. కావున వారికృత్యములన్నియు వృథయే. రక్షణ దినమున వారి నెంతమాత్రమును జూడము.

వారికి బహుమానము నరకమే. వారునమ్మక, నాసూచనలను, నాదూతలను నిరసించినందు కదియే ఫలము.

కాని, విశ్వసించి పుణ్యకార్యములఁ జేయువారికి స్వర్గమందలి వనములు వసతిగృహములుగా నేర్పాటు చేయఁబడినవి.

వారచటనే శాశ్వతకాలముండి యచటినుండి మార్పుఁ గోరి కొనరు" అనుము.

సముద్రమంతయు సిరాయైనను నాప్రభువు మాటలన్నియు వ్రాయకపూర్వమే యది అయిపోవును. మఱియొక సిరాసముద్రము గూడ నావాక్యములను వ్రాయుటకుఁజాలదు.

110 నిజముగా నేనును మీవంటి యొక నరుఁడనే. మీదేవుఁడే యేకేశ్వరుఁడని నాకుఁ దెలుపఁబడినది. కావున, బ్రభుని జేరఁ దలఁచినవాఁడు పుణ్యకార్యమును జేయుచు, తనప్రభువుతోఁబాటు మఱియెవ్వని నారాధింపకుండనిమ్ము" అనుము.

---

# సురా 19. మరియమ్మ

మక్కా - 98 పద్యములు 6 రుకూలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

కఫ్. హా. య. ఐన్. సద్. తన కింకరుఁడగు జెకేరియాకు నీ ప్రభువు దయఁగూర్చిన కథ.

ఆతఁడు తన ప్రభువును రహస్యముగాఁ బిలిచి,

ప్రభువా! నా యెముకలు సడలినవి. నాతల వెండ్రుకలు నెఱయుచున్నవి. ప్రభువా! నిన్ను ప్రార్థించునప్పుడెల్ల నాకోరికలు నెరవేరుచునే యున్నవి. కాని, నాకిప్పుడు సంతానేచ్ఛ కలిగినది. నేను గతించిన వెనుక నా దాయాదు లేమిచేయుదురో యని భయమగుచున్నది. నాభార్య గొడ్రాలు.

కావున నాకును యాకూబు కుటుంబమునకును వారసుఁడగు వానిని నాకనుగ్రహించి యతఁడు నీ దయకుఁ బాత్రుఁడగునట్లు జేయుమని వేఁడికొనఁగా

దేవుఁడు "జెకేరియా! నిశ్చయముగా నీకొక పుత్త్రునిఁ బ్రసాదించినాము. వాని పేరు యాహ్యా. వానికిఁబూర్వ మట్టిపేరును మేమెవ్వరికి నీయలేదు" అనెను.

ఆతఁడు "ప్రభువా! నాభార్య వంధ్య. నేను ముదుసలిని. పటుత్వము తగ్గినది. ఇట్టియెడ నాకుఁ బుత్త్రోదయ మెట్లగు" నని యడిగెను.

దేవుఁడు "అది మాయాజ్ఞ. నీవు పూర్వముంటివా? నిన్ను సృజించితిమికామా? ఇదిమాకు కడుసులభమే!" యనిన,

10. అతఁడు "ప్రభువా ! నాకొకసూచనను దయచేయుము" అనివేఁడికొనెను. దేవుఁడు "నీవు పూర్ణారోగ్యవంతుఁడ వయ్యును మూఁడురాత్రుల పర్యంతమును మూగవై యుండువు. ఇదియే నీకు సూచన" అనెను.

అప్పుడాతఁడు తన పవిత్రగృహమునుండి వచ్చి ప్రజలను గలిసికొని యుదయమునను సాయంసమయమునను, దైవస్తోత్రములను సలుపుఁడని కోరెను.

మేమాతనితో "యాహ్యా, హృదయపూర్వకముగా నీగ్రంథమును స్వీకరింపు" మని యాతని బాల్యమునందే జ్ఞానినగునట్లుచేసి,

మాకరుణాళుత్వమును పవిత్రతను బ్రసాదించితిమి. ఆతఁడును భక్తిపరుఁడై తలిదండ్రులకు విధేయుఁడై, గర్వియు, తిరస్కారభావము గలవాఁడును గాకయుండెను.

అతని జననదినమునను, మరణదినమునను, అతఁడుతిరిగిప్రాణము బొందిన దినమునను స్వస్తివాచనములు జరిగెను.

## అధ్యాయము 2

గ్రంథములో మరియమ్మవృత్తాంతముఁగూడ వ్రాసియుంచుము. ఆమె తన సంసారమునువిడిచి తూర్పుదిక్కుగాఁ బోవుచు,

వారికిఁ గనఁబడకుండ ముసుగువైచికొని యున్నప్పు డామెవెను వెంటనే మాదూతను బంపితిమి. అతఁ డామెయెదుట నవయౌవ్వన పురుషుండై నిలిచియుండ,

ఆమె, "నీబారినుండి రక్షింప దయామయుఁడగు దేవు నాశ్రయించుచున్నాను. నీవాతనికి భయపడినచో నన్ను విడిచిపో" మ్మన

ఆతఁడు "నేను నీప్రభువుపంపినదూతను. నీకు పవిత్రపుత్త్రి ద్దానము చేయ వచ్చియున్నా" ననెను.

20. ఆమెయు "నేను నిర్మలపరివర్తన గలదాననే! నన్నెవ్వఁడు నిం తకుపూర్వము స్పృశించియుండలేదే! అట్టియెడ నాకుఁ బుత్త్రోదయ మెట్లగు" నని యడుగ,

ఆతఁడు "అదియఁగతే. నీప్రభువు 'నాకిది కడుసులభ' మని యనియున్నాఁడు. మేమాపుత్త్రుని మనుష్యులకు సూచనగను, దయా చిహ్నముగను జేసెదము. ఇది యంతయు నిర్ణీతమైయున్నది" అనెను.

ఆమెయు గర్భవతియై యొక దూరప్రదేశమున కేఁగెను.

అచట నొక ఖర్జూరతరువుప్రక్క నామెకు ప్రసవవేదనరాఁగా నామె "ఆహా! నే నేల చావకున్నాను? అనామకురాలనై యేల యుండనైతిని?" అని మొఱపెట్టుచుండ,

ఆమెక్రిందినుండి యొక యశరీరవాణి "నీవు చింతింపవలదు. నీప్రభువు నీపాదములయొద్ద నే యొకసెలయేటిని బుట్టించియున్నాఁడు.

ఖర్జూరతరువును నీవంకకుఁ గదల్చుము. అది నీపై నప్పుడే పం డఁబాఱినఫలములను వర్షింపఁగలదు.

కావున, నీవాపండ్లను దిని, యానీటిని ద్రాఁగుము. సంతోష లోచనవగుము. నీకెవ్వఁడైన మర్త్యుఁడు కనఁబడినచో నతనితో 'నేను కరుణాలవాలుఁడగు దేవునికొఱ కుపవాసముచేసియున్నాను. ఈదిన మున నెవ్వరితోడను మాట్లాడ' నని చెప్పుము" అనెను.

ఆమెయు శిశువును చేతఁబట్టుకొని తనప్రజలయొద్దకు రాఁగా వారు "మరియమ్మా! ఏమి, యీవిచిత్రప్రవర్తనము!

హారూనుసోదరీ! నీతండ్రి దుష్టుఁడుకాఁడే! నీతల్లియు వ్యభి చారిణికాదే!" యన,

ఆమె చేతితో నాశిశువును జూపెను. వారును "పొత్తులలో నున్న పసిపాపనితో మేమెట్లుమాటాడఁగల" మనిరి.

30 అంత నాశిశువు "నిశ్చయముగా నేను దేవుని సేవకుఁడను. అతఁడు నాకు గ్రంథము నిచ్చి నన్నొక ప్రవక్తగా నేర్పఱిచినాఁడు.

నేనెక్కడనున్నను నతఁడు నాకు ధన్యత్వమును బ్రసాదించి నాజీవితకాలమంతయు నాకు ప్రార్థనయు, భిక్షాదానమును విధించి యున్నాఁడు.

అతఁడు నాకన్నతల్లికి విధేయుఁడనై యుండవలయునని యాజ్ఞా పించినాఁడు. నాకు గర్వమును నీచత్వమును నతఁడు కల్పింపలేదు.

నేను పుట్టిన దినమున దేవుని స్వస్తివాక్యమును వింటిని. నేను చనిపోవు దినమునను, పునర్జీవితుఁడనగు దినమునను, నాస్వస్తివాక్యము వినఁబడఁగలదు" అనెను.

ఈతఁడే ఈసా, మరియమ్మ పుత్త్రుఁడు. ఈసత్యమును గూర్చియే వారు సందేహింతురు.

దేవునికిఁ బుత్త్రుఁడు పుట్టుట యేమి? అతఁడు మహిమవంతుఁ డగుఁ గాక! అతఁడు దేనినైనఁ గోరినప్పు డిట్లగుమని నంత నది యైతీరును.

నిజముగా దేవుఁడు నీకును నాకును గూడ ప్రభువు. కావున నాతనిఁ బూజింపుము. ఇదియే క్రమమైన మార్గము.

కాని, యూదయూ తెగల వారీసానుగూర్చి బహువిధాభిప్రాయ ములుగలిగియున్నారు. కాని విశ్వసింపనివారి కామహాదినమం దంద ఱును గలిసియున్నప్పుడు దుఃఖము కలుగఁ గలదు.

వారు వినునట్లును, మాయొద్దకు రాఁగలదినమును జూచునట్లును జేయుము. కాని, తప్పుచేసినవా రీదినమున మార్గము తప్పి యున్నారు.

వారు నిర్లక్ష్యముతో నమ్మకయుంచుచుండఁగనే నిట్టూర్పులు విడువఁగల దినము వచ్చిపడుననియు, నాతనియాజ్ఞ జరిగియే తీరుననియు వారికిఁ జెప్పియుంచుము.

40 నిశ్చయముగా భూమికిని, సందుండువారికిని, మేమేవారసులము. వారు మాయొద్దకే తిరిగిరాఁగలరు.

అధ్యాయము-3

ఇబ్రాహీమును గూర్చికూడ గ్రంథములో వ్రాసియుంచుము. అతఁడు సత్యవంతుఁడగు ప్రవక్త.

అతఁడు తనతండ్రితో "నాయనా, దీనికి (ఈవిగ్రహమునకు) చూడఁ గన్నులులేవు. వినచెవులులేవు. నీకేవిధమునను సహాయపడదు. అట్టిదాని నేల పూజించెదవు?

తండ్రీ! యిప్పుడు నీకుఁగలుగని జ్ఞానము నాకుఁ బ్రసాదింపఁ బడినది. కావున నన్ననుసరింపుము. నిన్ను సరియగు మార్గమునఁ దీసికొని పోయెదను.

జనకా! సైతాను కరుణామయుఁడగు దేవునికి విరోధి. అతనిని బూజింపకుము.

పితా! కరుణాలవాలుఁడగు దేవునిశిక్ష నిన్ను బొందఁగలఁదనియు, నీవు సైతానునకు విధేయుఁడ వగుదువనియు నాకు భయమగు చున్న" దనెను.

తండ్రియు "ఇబ్రాహీమా! ఏమీ, నాదైవములను బరిత్యజించెదవా? నీవీకార్యమునుండి తొలఁగకున్న నీపై రాళ్లువిసరి చంపెదను. ఇచ్చోటు విడిచి చాలకాలమువఱకును నాకంటఁబడకుము."

అనఁగా నాతఁడును, "నీకు శాంతియగుఁగాక! దేవుఁడు నాపై దయగలిగియున్నాఁడు, కావున నిన్ను క్షమింపుమని యాతని వేఁడికొనెదను.

కాని, నిన్నునుండియు, సత్యదేవుఁడుగాక నీవుదైవములని పిలుచువారినుండియు, నేను వేఱయ్యెదను. నాప్రభువునకే నేను మొఱలిడెదను. బహుశః నాప్రభువు నాప్రార్థనల నంగీకరింపకపోఁడు."

అని, వారినుండియు, వారుపూజించు నితరదైవములనుండియు, నాతఁ డెడమైనంతనే యాతనికి ఇసాకు, యాకూబు, లను వారిని బ్రసాదించి వారినిర్వురను బ్రవక్తలఁ జేసితిమి.

50 వారిపై దయగలిగి వరముల నొసగి, వారిని సత్యవచస్కులగు నట్లు జేసితిమి.

## అధ్యాయము 4.

గ్రంథములో మూసానుగూడ స్మరింపుము. అతఁడు పవిత్ర వంతుఁడు. ప్రవక్త. జ్యోతిష్కుఁడు.

పర్వతమునకు కుడివైపునుండి యాతనిబిలిచి మాతోరహస్యముగా మాట్లాడుటకు మమ్మ సమీపింపఁ జేసితిమి.

అతనిపై దయగలిగి యాతనికి సోదరునిఁగా ప్రవక్తయగు హారూను నిచ్చితిమి.

గ్రంథములో 'ఇస్మాయేలును' స్మరింపుము. ఆతఁడాడినదానిని. తప్పలేదు. అతఁడు ప్రవక్తయు, దూతయునై,

తన ప్రజలకు ప్రార్థనము, భిక్షాదానమును విధించి, దేవునికిష్టుఁ డయ్యెను.

గ్రంథములో 'ఎద్రిసు'ను స్మరింపుము. అతఁడు సత్యవంతుఁడు. జ్యోతిష్కుఁడు.

ఆతని నుచ్చస్థానమున నుంచితిమి.

ఆదాము సంతతిలోని జ్యోతిష్కులును, నుహూతోఁ బాటు నావయందు రక్షణనొందినవారిలోనివారును, ఇబ్రాహీము, ఇస్రాయేలు సంతతివారును, మేము రక్షణనిచ్చి యెంచికొన్నవారును, దేవునియనుగ్రహము నొందినవారును, నగువారు వీరే. దయాపరుఁడగు దేవుని సూచనలు వారికి వినఁబడినంతనే వారు శిరములువంచి, కన్నుల నశ్రువులుగార నారాధించిరి.

కాని, వారితరువాత వారిస్థానమున మఱికొందఱు వచ్చిరి. వారు ప్రార్థనలను గట్టిపెట్టి, తమదుర్ణయములందుఁ దిరుగఁజొచ్చిరి. వారు తుదకు నరకమును పొందఁగలరు.

60 అయినను తమమనస్సులను మఱల్చికొని, విశ్వసించి క్రమవర్తను లగువారు నందనవనమునఁ దిరుగఁగలరు. వారి కేకీడును గలుగఁ బోదు.

ఆ నందనవనమగు నీడెనుతో టను కరుణానిధియగు దేవుఁడు కనఁబడకుండియు తనకింకరుల కనుగ్రహించియున్నాఁడు తన వాగ్దానము నాతఁ డీడేర్చుకొనఁగలఁడు,

వారికచట స్వస్తివాక్యములే కాని, వృథావాక్యము లేవియు వినఁబడవు. వారి కుదయమునను, సాయంత్రమునను, వేళతప్పక యాహారము సమకూరుచుండును

మాయెడల భయముకలిగిన మాకింకరులకు వారసత్వముగా మేమీయఁగల స్వర్గ మిదియే.

మేము నీప్రభుని యనుజ్ఞలేనిదే స్వర్గమునుండి యవతరింపము. మాకు ముంగను, మాకు వెనుకను, ఆ రెండింటికిమధ్యను నున్నదంతయు నాతనిదే. స్వర్గములకును, భూమికిని, నా రెండింటికిని మధ్య నున్నదానికిని నాథుఁడగు నతనికి మఱపెక్కడిది ?

కావున నతనిని స్థిరభక్తితో నారాధింపుము. ఆతనికి సమానుఁడు మఱెవఁడైన నీకు తెలియునా?

## అధ్యాయము 5.

మనుష్యుఁడు "ఏమి! నేను చచ్చి, తుదకు తిరిగి సజీవుఁడనయ్యెదనా?" యనును.

మనుష్యుఁడు తొలుత లేకుండినను, నాతని సృజించితిమని యాతనికిఁ దెలియదా?

నీప్రభువునాన, ప్రమాణము చేయుచున్నాను. మేము వారిని సైతానులను నొకచోఁ జేర్చి నరకముచుట్టును మోకాళ్ళపైఁ గూర్చుండఁజేసి,

ఆయావర్గములనుండి. దయానిధి యగు దేవునిపై తిరుగుబాటు చేసినవారిలో మొనగాండ్రి నేర్పఱిచి,

70 అప్పుడు నరకాగ్ని యెవరి కెక్కువగా తగియున్నదో చెప్పఁగలము.

మీలో నొక్కరును నచటికి పోకతప్పను. ఇది ప్రభుని తప్పని యాజ్ఞ.

అప్పుడే దైవభీతిగలవారిని విడుదలచేసి దుష్టులను మోకాళ్ళపై నచటనే యుంచివైతుము.

మా స్పష్టసూచనలను వారికి చూపించి నప్పు డవిశ్వాసకులు విశ్వాసకులతో "ఉభయవర్గములతోను నెవరు కుశలులు? ఎవరి సాంగత్యము శ్రేష్ఠము?" అనియడుగుదురు.

కాని, వీరికి పూర్వము వీరికంటె శోభయందును, ధనమునందును, నెన్నియో రెట్లధికులను నెందఱిని మేము నాశనము చేసియుండలేదు?

"తప్పుత్రోవను బోవువారికి దయానిధియగు దేవుఁడు చిరాయువు నొసగును. ప్రస్తుతశిక్షయో ప్రళయకాలశిక్షయో వారి కన్నులఁ బడి, యెవరు హీనతములై, దుర్బలతములై యున్నారో తెలిసికొను వఱకును వారు జీవించియుందురు.

కాని, దేవుఁడు పూర్వమురక్షణనొందినవారినే మఱింత రక్షించును. నీప్రభువుదృష్టియందు మేలి దుకూలములకంటెను, ప్రపంచ సౌఖ్యములకంటెను, చిరకాలముండఁగల సత్కర్మలే శ్రేష్ఠములు.

మాసూచనలను నమ్మక, "నాకు నిశ్చయముగా ధనమును బుత్త్రులును గలుగఁగల" రని చెప్పువానిని నీవు గుర్తించితివా?

ఆతఁడు దేవునినోటియొద్ద చెవియొగ్గి రహస్యములను కనుఁగొనెనా యేమి? దయానిధియగు దేవునికిని, నాతనికిని, నొడంబడిక యయ్యెనా యేమి?

ఇది యసత్యము. మే మాతఁడు చెప్పున దంతయు వ్రాసి యుంచి, యాతనిశిక్ష చిరకాల ముండునట్లు చేసెదము.

80 ఆతఁడు చెప్పినది మాకే చేరును. అతఁడును నొంటరిగనే మమ్ము చేరఁగలఁడు.

వారు తమకుసహాయముగా సత్యదేవునికంటె నితర దైవములను చేపట్టియున్నారు.

కాని, యది యెంతో కాలము జరుగఁబోదు. వారి దైవములు వారిపూజల నిరాకరించి, వారికి శత్రువు లే యయ్యెదరు.

అధ్యాయము-6

అవిశ్వాసకులు మఱింతపాపము చేయుటకు వారియొద్దకు మేము సైతానులను పంపియుండుట నీవు గమనింపలేదా?

కావున, వారినిగూర్చి నీవు తొందరపడకుము. వా రెన్నాళ్ళో బ్రదుకరు.

ఒకానొకదినమున దైవభీతిగలవారి నందఱిని నుచితసత్కారములతో దయానిధియగు దేవునిసన్నిధిం జేర్చెదము.

కాని, పాపులను నీళ్ళకు మేకలమందలనుద్రోలునట్లు నరకములోనికి త్రోలెదము.

దయాలవాలుఁడగు దేవునియనుజ్ఞనొందినవాఁడు గాక యితరుఁడొనాఁడు మాధ్యస్థ్యము వహింపఁజాలఁడు,

"కరుణాలవాలుఁడగు దేవునికి పుత్రజనన మైనదని వారందురు." ఇది కడు నీచమగుమాట.

"దయానిధియగు దేవునికి పుత్త్రుఁడు కలుగుట
90 అతనికి గౌరవముకాదు.

అట్లు జరుగునాఁ డాకాశము ప్రీలి, భూమి బ్రద్దలై, పర్వతములు శతధా భిన్నములు కాకుండునా?

నిశ్చయముగా కరుణాలవాలుఁడగు దేవుని సాన్నిధ్యమునకు కింకరుఁడుగాఁ దప్ప మఱియొకరీతిఁ బోవువాఁడు స్వర్గమర్త్యములం దెవ్వఁడును లేఁడు.

అట్లు పోఁగలవారిసంఖ్య నాతఁడు పరిగణించియే యున్నాఁడు.

వారిలో నొక్కొక్కఁడును నొంటరిగ నా రక్షణదినమున రాఁగలఁడు.

కాని, విశ్వాసులు, ఋజుమార్గవర్తనులు నగువారిని దయానిధియగు దేవుఁడు ప్రేమింపఁగలఁడు.

నిశ్చయముగా మేము కురానును మీ భాషలోనే సులభముగా రచించితిమి. దానిని పఠించి, మీరా సువార్తను దైవభీతిగలవారి కెఱింగించి, వివాదములు పెట్టుకొనువారికి భయసూచన నీయవలయును.

వారికి పూర్వ మెందఱిని నాశనము చేసితిమికాము! వారిలో నొకరినైన వెదకికొనఁగలవా? వారినుండి యొకచిన్నమాటనైనను నీవు వినఁగలుగుచున్నావా?

# సుర 20-త. హ.

మక్కా - 135 పద్యములు - 8 రుకూలు.

అధ్యాయము - 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

త. హ.

నిన్ను విచారపెట్టుట కీ కురానును నీకుఁ బంపలేదు.

భయపడువారు దీనిని భయసూచనగా గ్రహింతురనియే దీనిని మీ కనుగ్రహించియున్నాము.

ఇది భూమిని, దానిపై నెత్తుగ స్వర్గములను సృజించిన దేవుని నుండి వచ్చినవార్త.

కరుణానిధియగు దేవుఁడు తన సింహాసనముపై స్థిరముగ నుండును.

స్వర్గములందును భూమియందును, నీ రెండిటికి మధ్యప్రదేశమునకును, చెమ్మనేలకు క్రిందను గలదంతయు నాతనిదే.

నీ వేమియుఁ బలుకనక్కఱలేదు. రహస్యముగా నీవు చెవిలో నూదినదానిని అంతకంటె రహస్యమైనదానిని గూడ నాతఁడు తెలిసికొనియే యున్నాఁడు.

అల్లాకంటె వేఱుదేవుఁడు లేఁడు. అతనిబిరుదులు మిక్కిలి మేలైనవి.

మూసా చరిత్రము నీచెవిని బడినదా ?

10. అతఁ డగ్నినిజూచి తనకుటుంబముతో "మీ రిక్కడనుండుఁడు. నా కగ్ని కనఁబడుచున్నది. బహుశః అందుండి మనకు దారికనఁబడుట కొకకొఱవి దొరకునేమో. లేక యచట మనకు దారిచూపఁ గలవాఁ డెవఁడైన నుండునేమో !"

అని, వారియొద్ద కేఁగినంతనే "ఓమూసా,

నిజముగా నేను నీప్రభువను కావున నీపాదరక్షలను వదలి వేయుము. నీ విప్పుడు పవిత్రవంతమగు టూవా లోయలో నున్నావు.

నేను ని న్నెంచికొన్నాను. నేను నీకు తెలియఁజేయు రహస్య ములను వినుము.

నిజముగా నేనుదేవుఁడను. నేను తప్ప మఱియొక దేవుఁడు లేఁడు. కావున నన్నారాధించి నన్ను మదియందుంచుకొనుటకు నాకు ప్రార్థన సలుపుము.

నిజముగా కాల మాసన్న మగుచున్నది. ఆత్మలన్నియు తమ కష్టములకు ఫల మనుభవించుటకై వానిరాకను మీకు దెలియఁ జేయఁ బోవుచున్నాను.

కాని, దానిని విశ్వసింపక తనయిష్టానుసారముగఁ దిరుగువాఁడు నిన్ను సన్మార్గమునుండి మఱలించి నీవు నశించునట్లు చేయనీయకుము.

మూసా ! ఇప్పుడు నీకుడిచేత నేమున్నది ?'' అనియడుగ,

అతఁడు "ఇది నాచేయూఁతకోల. ఇది నాగొఱ్ఱెలకు ఆకులఁ గొట్టికొనుటకును మఱికొన్నిపనులకును పనికివచ్చు'' నన,

దేవుఁడు "దానిని పాఱవేయు'' మనెను.

20. అదియు క్రిందఁ బడినంతనే సర్పరూపముఁ దాల్చి పరుగిడ నారంభించెను.

అప్పుడు దేవుఁ డాతనితో "భయపడక దానిని పట్టుకొనుము. అది పూర్వరూపము దాల్చునట్లు చేసెదము.

ఇప్పుడు నీ కుడిచేతిని నీ చంకయం దుంచి తీయుము. అది తెల్లగా కాఁగలదు. ఇది మఱియొక సూచన.

వీనిని నమ్మినయెడల మాసూచనలలో మహత్తమగుదానిని నీకుఁ జూపెదము.

ఫిరౌను అన్నిహద్దులను మీాఱి ప్రవర్తించుచున్నాఁడు. అతని యొద్దకు పొమ్ము” అనెను.

## అధ్యాయము 2

మూసా “ప్రభువా! నాకు విశాలహృదయము నిచ్చి,
నాపని సులువగునట్లు చేసి,
నావాగ్బంధనమును విడఁదీసి,
వారు నామాటలను బోధపఱుచుకొనునట్లు చేయుము.
నా కుపదేశకుఁడుగా నుండుటకు నాకుటుంబములోని,
30 నాసోదరుఁడగు హారూనును నా కనుగ్రహింపుము.
అతఁడు నాకు ధైర్యమునిచ్చువాఁ డగును.
నాపనియందు సహాయకుఁడుగను నుండునట్లు చేయుము.
నీకు మాయెడఁ బరమప్రీతి,
మేమును నిన్ను పరిపరివిధముల స్తోత్రముచేసి
స్మరించుచుందుము” అనెను. దేవుఁడు “ఓమూసా, నీవు కోరినదాని నిచ్చితిమి.

ఇంతకుఁ బూర్వ మొకప్పుడు నీవు నాయనుగ్రహమునకుఁ బాత్రుఁడవైతివి.

అప్పుడు నేను నీతల్లితో

“అతని నొకపెట్టెలో పెట్టి సముద్రములోఁ బడవేయుము. సముద్ర మాతనిని తీరమునకుఁ గొట్టివేయును. నాకును వానికిని శత్రు వగువాని చేతిలో నాతఁడు పడును” అంటిని. మఱియు నాక న్నుల యెదుట పెరుగుటచే నేనే నిన్ను ప్రేమాస్పదునిఁగాఁ జేసితిని.

40 అప్పుడు నీయక్క వెళ్ళి “అతనికి దారి కావలసినచో చూపె ట్టెదను,” అనఁగా నిన్ను నీతల్లియొద్దఁ జేర్చితిమి. ఆమెయు సకురిమిత

సంతుష్టహృదయయై దుఃఖమును మఱచిపోయెను పిదప నీవొకనిని హత్యగావించినప్పుడు మేము నిన్ను కష్టమునుండి తొలగించి, మఱి యొకరీతిగాఁ శోధించితిమి. నీవు మిడియానుప్రజలతో బహువత్సరములు వసించి తుదకు నాయాజ్ఞవలన నిచటికిఁ జేరితివి.

నిన్ను నా కనుకూలునిగా నెంచికొనియున్నాను.

నీవును నీసోదరుఁడును నాసూచనలను గ్రహించి పొండు. నన్ను మఱువకుఁడు

ఫిరౌను హద్దులనన్నిటిని మీాఱియున్నాఁడు. ఆతనియొద్దకుఁ బోయి,

సాంత్వవచనముల నాతనితో భాషించినయెడ,ఆతఁడాలోచించుకొని భయగ్రస్తుఁ డగునేమో ?" అనెను.

వారు "ప్రభువా ! ఆతఁడు మాపై తిరుగఁబడి యధర్మవర్తి యగునేమోయని భయమగుచున్నది."

అనఁగా దేవుఁడు "నేను మీాప్రక్కనే యుందును. మీాకు భయమువలదు. నేను వినుచు చూచుచునే యుందును.

మీారాతనియొద్ద కేఁగి "మేము నీ ప్రభువునొద్దనుండి యేతెంచిన దూతలము. ఇస్రాయేలు ప్రజలను మాతోడఁ బంపివేయుము. వారిని దుఃఖపెట్టకుము. నీప్రభువు నీకుఁ గొన్నిసూచనలను జూపమ మ్మాజ్ఞాపించియున్నాఁడు. సరియగు రక్షణమార్గము ననుసరించువానికి శాంతికలుగఁగలదు.

అతఁ డసత్యవాదియని గెంటివేయువానికి ఘోరశిక్ష కలుగునని మాకుఁదెలుపఁబడినది" యనుఁడు అనెను.

ఫిరౌను మూసాతో 'నీప్రభు వెవ్వఁ' డనియడుగ,

50. ఆతఁడు "సర్వవస్తువులకును రూపము నొసగి సత్పథమున నడిపించువాఁడే మన ప్రభు" వని యుత్తరమిచ్చెను.

"అయిన, తరతరములనుండియు వచ్చుచున్నవారిస్థితి యెట్టి" దని ఫిరౌను అడుగ,

"దానిని నాప్రభువు తన యాజ్ఞానిబంధనగ్రంథమున వ్రాసి యుంచినాఁడు. దానినిగూర్చి యాతనికే యెఱుక. నాప్రభువు సన్మార్గమునుండి తొలంగఁడు. ఆతనికి మఱపులేదు.

ఆతఁడు భూమిని పఱుపువలెఁ బఱచి, యందు మీకు మార్గములను శుభ్రముగ నేర్పఱిచి స్వర్గమునుండి వర్షమును పంపించుచున్నాఁడు. దాని మూలమున మేము వివిధౌషధులను పుట్టించుచున్నాము.

మీరు తిని మీపశువులకు మేతఁబెట్టుఁడు! నిజముగా బుద్ధిమంతుల కివియే సూచనలు.

అధ్యాయము 3.

మిమ్ముల నందుండియే సృజించి, యందులోనికే తిరిగిపంపి, మఱియొకసారి యందుండియే మి మ్ముద్ధరింపుచున్నాము"

అని మేము మాసూచనల నన్నిటిని కనఁబఱిచితిమి. కాని, యాతఁడు వానినన్నిటిని నసత్యములుగఁ బరిగణించి విశ్వసింప నొల్లఁడయ్యెను.

ఆతఁడు "మూసా, నీయింద్రజాలములవలన మమ్ము మాదేశమునుండి ప్రోఁద్రోల వచ్చియున్నావా?

కావున, మేము నిశ్చయముగా మీయింద్రజాలములకు ప్రతిగా మాయింద్రజాలములను జూపెదము. కావున మనమిద్దఱమును నొక సంకేతస్థలమునఁ గలిసికొందము. నీవు రా తప్పకుము. మేమును తప్పక వత్తుము" అనెను.

మూసా "సరే, యుత్సవదినమునందు పట్టపగలే జనులనందఱిని ప్రోగుచేయు" మనెను.

60. ఫిరౌను అచటినుండి మఱలి, తిరిగి తన యైంద్రజాలికులతోఁ గాఁగా,

మూసా వారితో "పాపులారా! దేవునిపై నసత్యదోషము నారోపింపకుఁడు. అట్లు చేసితిరేని యాతఁడు మిమ్ము శిక్షించి నాశము చేయును. అసత్యవాదు లందఱు నిట్లే నశించియున్నారు" అనెను.

ఐంద్రజాలికులును దమలోఁదా మాలోచించుకొని రహస్యముగా ఫిరౌనుతో,

"సత్యముగా వీరిరువురును చిల్లంగివారు. వీరు నిశ్చయముగా తమచిల్లంగిప్రభావమున నిన్ను నీదేశమునుండి తరిమివేసి మీలో ముఖ్యులను తమమార్గములలోనికి త్రిప్పికొందురు.

కావున నీయైంద్రజాలికులఁ గూడఁదీసి గందరగోళము పడకుండ రమ్ము. ఈదినమున గెలిచినవారికి శుభమగు" ననుచు,

మూసావంకఁ దిరిగి, "మూసా, మాదండమును మేము ముందుగా క్రిందవైతుమా, నీవు నీదండమును వైచెదవా?" అని యడుగ,

ఆతఁడు "మీదండమునే క్రిందకుఁ ద్రోయుఁ"డనెను. వెంటనే వారి యింద్రజాలమువలన వారిత్రాళ్ళును, దండములును పఱుగెత్తుచున్నట్లు కనఁబడెను.

మూసా భయవిహ్వలుఁ డయ్యెను.

మే మప్పు డాతనితో "భయమువలదు. నీవే గెలిచెదవు.

నీ కుడిచేత నున్నదానిని క్రిందఁ బడవైచినంతనే యది వారు కల్పించినదానిని మ్రింగివేయఁగలదు. వారు మాంత్రికులతంత్రమును జూపించియున్నారు. మాంత్రికు లెల్లయెడలను నవమానమునే పొందఁగలరు" అనెను.

70. ఐంద్రజాలికులును మోకాళ్ళపైఁ బడి "హారూనుమూసాల ప్రభువును మేము విశ్వసింపుచున్నా" మని యారాధింపఁదొడఁగిరి.

ఫిరౌను వారితో "ఏమి, మాయాజ్ఞ లేనిదే మీరాతని విశ్వసించుచున్నారా? మీ కింద్రజాలవిద్యను నేర్పినవాఁడు గదా మీ ప్రభువు. కావున మీకొకప్రక్క చేతులను నొకప్రక్క కాళ్ళను ఖండించి, ఖర్జూరతరుకాండములపై మిమ్ము సిలువకొట్టించెదను. ఎవరి శిక్ష గొప్పదో, యెవరిశిక్ష చిరకాల ముండఁగలదో మీ రప్పుడు తెలియఁగలరు" అనెను.

వారును, "మాకు స్పష్టమగుసూచనలు కనఁబడినవి. అతఁడు మమ్ముల సృజించినాఁడు. అతనినివిడిచి నిన్ను మే మారాధింపము. నీవు మా కొసఁగనెంచిన శిక్ష నొసఁగవచ్చును. నీ వీజన్మమునమాత్రమే మమ్ము శిక్షింపఁగలవు

దేవుఁడు నీకంటె మంచివాఁడు. నీకంటె నాతఁడు స్థిరముగా సహాయపడుచుండును. నీవు మమ్ము నిర్బంధించి చేయించిన పాపములను, నింద్రజాలములను, క్షమించుటకు నిశ్చయముగా నాతనియందే విశ్వాస ముంచుచున్నాము.

తన ప్రభువుముందు పాపభారమును మోసికొనివచ్చువానికి నరకము ప్రాప్తించును. అతఁ డందు చావనుచావక బ్రతుకనుబ్రతుకక యుండును.

కాని, విశ్వాసియై పుణ్యకార్యములను చేకొని యాతనిసాన్నిధ్యమునకు వచ్చువానికి పరమపదములు చేకూరఁగలవు.

నందనవనములలో సెలయేళ్ళదరి తరుచ్ఛాయలక్రింద వారు సార్వకాలమును వసింపఁగలరు. విశుద్ధహృదయుఁడై యున్నవానికిదియే బహుమానము" అనిరి.

## అధ్యాయము 4.

అప్పుడు మూసాతో "నీవు రాత్రివేళ నాకింకరులతోఁ బోయి, వారికై సముద్రమునుచీల్చి పొడిమార్గము నేర్పఱుచుము, నీపై వారు

పడెదరని భయపడవలదు. నిర్భీతుఁడవై యుండుము " అని పల్కితిమి.

ఫిరౌను తనసైన్యములతో నాతని వెంబడింపఁగా వా రంద
ఱును గొప్పతరంగములచేఁ గప్పఁబడి నశించిరి. ఫిరౌను వారు మంచి
మార్గమునుబట్టక తప్పుత్రోవఁ బోవుటచే వారి కిట్టులయ్యెను

80. ఇస్రాయేలుప్రజలారా! మిమ్ము మీశత్రువులనుండి తప్పించి
నాము. పర్వతమునకు కుడిప్రక్క మీరుకలియుఁడని యాజ్ఞయిచ్చి
నాము. అమృతమును నత్తలును మీ కాహారమగునట్లు పంపినాము.

మేము మీకమర్చిన మంచివస్తువులను తినుఁడు. మితిమీఱినచో
నాకోపమునకుఁ బాత్రులగుదురు. నాకోపమునకు గుఱియగువాఁడు
నిశ్చయముగ నశింపఁగలఁడు.

కాని, దేవునివంకతిరిగి, విశ్వాసియై, పుణ్యకార్యములఁజేయుచు,
రక్షణమార్గమును చేకొన్నవానిని మేము నిశ్చయముగా క్షమింపఁ
గలము.

కాని, ఓమూసా, నీప్రజలనుండి నీ వంతశీఘ్రముగా విడఁబడి
పోవుటకుఁ గారణమేమి ?" అని మేమంటిమి.

మూసా, "వారు నన్ననుసరించుచునే యుండిరిగాని, ప్రభువా!
నీవు సంతోషింతువని నేను వడివడిగ వచ్చితిని " అనెను.

దేవుఁడు "ఇప్పుడు నీవు వారిని విడిచియుండుటచే వారిని శోధిం
చితిని. వారు సమిరీజనులమాటలు విని త్రోవతప్పినారు."

అనఁగా మూసా కోపవిచారములు నిండుకొనఁ దనప్రజలను
జేరి, "నాప్రజలారా! మీ ప్రభువు మీకు మంచివాగ్దానము చేసియు
న్నాఁడుగదా! నేను వచ్చునంతలోనే మీకు తొందరైనదా! లేక
నామాటతప్పి ప్రభువుకోపమును కోరికొనుచున్నారా?" అని యడిగెను.

వారు "మేము బుద్ధిపూర్వకముగా మాటతప్పలేదు. వారు
మమ్ము చాలయాభరణములను తెచ్చి యగ్నిలోఁబడవేయుఁడని,
తాము ను తమవానిని నందుఁ బడవైవ,

అందుండి 'యంబే'యనుచు సశరీరయగు నొకదూడ బయలు వెడలెను. వారప్పు "డిదియే మీ ప్రభువును, మూసా ప్రభువును. కాని, మూసా దీనిని మఱచియున్నాఁ" డనిరి.

ఆహా! అది వారికిఁ బ్రత్యుత్తర మీయఁజాల దనికాని, కీడు మేలులఁ జేయఁజాల దనికాని, వారు తెలిసికొనలేకపోయిరా?

అధ్యాయము 5.

90 హారూను వారితో నంతకుఁబూర్వమే "ఈదూడ మిమ్ము శోధింపఁ గలదు. మీ ప్రభువు కరుణాళుఁడుకావున నన్ననుసరించి నాయాజ్ఞకు లోఁబడుఁ" డనెను.

వా రాతనితో "మూసా మాయొద్దకు వచ్చువఱకును, మేము దాని నారాధింపకమానము" అనిరి.

మూసా హారూనుతో "వారు త్రోవఁదప్పిరని తెలిసియు,

నన్నేల యనుసరింప కుంటివి? నాయాజ్ఞ నుల్లంఘించితివా" యనియడుగ,

ఆతఁడు "సహోదరా! నీవు నా మ్రోల నిట్లాడవలదు. నీ వొకవేళ 'ఇస్రాయేలు ప్రజలందుఁ గలఁతఁబుట్టించి నాయాజ్ఞలఁ బాలింపవైతి'వని యందువేమోయని భయపడితి"ననెను.

మూసా సమేరీతో నీయుద్దేశ మేమనియడుగ,

అతఁడు "వారు చూడనిదానిని నేను చూచియున్నాను. కావు[illegible] దేవదూత పోయినమార్గమును కొంతవఱకే యనుసరించితిని. పిద[illegible] దానిని విసర్జించితిని. నాయాత్మ నన్నిట్లే ప్రబోధించినది." అనెను.

ఆతఁడు "అయిన పొమ్ము. నీ వీజన్మములోఁ గూడ నంటరాని వాఁడ వగుదువు. నీ కొక శాపమున్నది. ఇఁకముందు దానిని నీవు తప్పించుకొనలేవు. నీ వింతకాలము ను భక్తిశ్రద్ధలతోఁ బూజించిన

నీదేవు నిప్పుడుచూడుము. దాని నగ్నిలోఁద్రోసి భస్మముచేసి సముద్రములో పాఱఁబోసెదము.

అల్లాయే నీదేవుఁడు. ఆతఁడుతప్ప నితరదైవములు లేరు. ఆతఁడు సర్వజ్ఞుఁడు" అనెను.

ఈతీరుననే మేము పూర్వచరిత్రలను తెలుపుచు మీకు బుద్ధి చెప్పుచుందుము.

100 దానిని వినక ప్రక్కకుతొలఁగు వాఁడు ప్రళయదినమున పెద్ద భారమును మోసికొని, దానిక్రిందనే యుండును. రక్షణదినమున దానిని మోయుటవలన మిక్కిలి శ్రమగానుండును.

ఆదినమున బూరామ్రోత వినఁబడినంతనే గ్రుడ్డివారై దుష్టులందఱొకచోఁ జేరఁగలరు.

అప్పుడు వారొకరితోనొకరు మెల్లగా "మీరు భూమిపై పది దినములుమాత్రమే మసలియుండిరి" అందురు.

వారేమి చెప్పుచున్నారో నాకుఁ దెలియును. వారిలో మిక్కిలి సత్యవాదులు "మీరొకదినముకంటె నెక్కువ యాలస్యము చేయ లేదు" అందురు.

అధ్యాయము 6.

వారు నిన్ను పర్వతములఁగూర్చి యడుగుదురు. "నాప్రభువు వాని నెగజిమ్మి ధూళిగాఁజేసి,

చదునైన మైదానమగునట్లు చేయును.

అందు లోయలుగాని, గుట్టలుగాని యుండఁబోవు" అనుము.

ఆదినమునఁ బిలుచువాఁడు ముక్కుకుసూటిగాఁబోవుచుండఁగా, వారాతని ననుసరింపఁగలరు. కరుణాళుఁడగు దేవునిమ్రోల వారు హీనస్వరులై మందమందముగ పడుచున్న పదధ్వనులుతప్ప మఱిదేనిని వినఁజాలరు.

కరుణాలవాలుఁడగు దేవుఁ డంగీకరించి యొప్పుకొనిన మాట లాడువాఁడుతప్ప నితరుఁడు మాధ్యస్థ్యమువహించి సహాయపడ లేదు.

110 అతనికి వారిభూతభవిష్యత్తులు తెలియునుగాని వారిబుద్ధి కవి గోచరములు కానేరవు.

స్వయంభువును జీవస్వరూపియునగు నాతనిముందు వారు దీన వదనులైయుందురు. పాపభారము వహించువారికి గతియేయుండదు.

కాని, ఋజుమార్గవర్తియు, విశ్వాసియు నగు వానికి హానిగాని నష్టముగాని, కలుగనేరదు.

ఈరీతిగా మేము అరబ్బీభాషలో కురానును పంపించి యం దనేక భయసూచనలను చూపించి, బహుశః మీరు దైవభీతిపరులై యాలోచించు కొందురని తలఁచితిమి.

కావున, సత్యస్వరూపుఁడును, చక్రవర్తియు నగు దేవుఁడు పూజ్యుఁడగుగాక! కురానును పూర్తిగ విననిదే తొందరపడి దానిని పఠింపక "ప్రభువా! నాజ్ఞానమును వృద్ధిసేయుము" అనికోరుము.

పూర్వకాలమున ఆదాముతో మేమొక యొడంబడిక చేసి యుంటిమి. కాని, యాతఁడు దానిని మఱచిపోయి, యస్థిరచిత్తుఁ డయ్యెను.

## అధ్యాయము. 7

మేము దేవతలతో "మీరు మోకాళ్ళపైఁబడి యాదామును భజింపుఁ" డని నందఱును సేవించిరి. ఇబ్లీస్‌మాత్రము నిరాకరింప,

మేము ఆదాముతో "ఆదామా, ఈతఁడు నిజముగా నీకును నీభార్యకును శత్రువు సుమీ! కావున నీవు వానిమాటలు విని నందన వన భ్రష్టుఁడవై దుఃఖంతుఁడవు కాఁజూడకుము.

అచట నీవు నగ్నుఁడవై సంచరించుచు, నాఁకలియనున దెఱుఁగ కుండ వరమునిచ్చియున్నాము.

అచట నీకు దప్పికయు, ఎండవలని బాధయుఁ గలుగఁబోవు" అంటిమి.

120. కాని, సైతా నాతని చెవిలో "ఆదామా, నీకు శాశ్వత జీవ వృక్షమును, శాశ్వత రాజ్యమును జూపుదునా" యనెను.

వారిద్దరును దాని ఫలములను దినిరి వెంటనే వారి నగ్నత్వము వారికి గోచర మయ్యెను. వారును కొన్ని యాకుల నేరి, కుట్టి, వస్త్రములుగా కల్పించుకొనిరి. ఆదాము, ప్రభునాజ్ఞ తిరస్కరించి త్రోవ దప్పెను.

పిదప, నాతని ప్రభు వాతని నే యెంచికొని, యాతని యెడఁ గరుణ వహించి సరియగు మార్గము జూపుచు.

"మీరీ చోటు విడిచి క్రిందికి పొండు. మీరిద్దఱును నొకరి కొకరు శత్రువులయ్యెదరుగాక ! ముందుగ నేను మీకు రక్షణమార్గమును జూపఁగలను. నా త్రోవఁ బట్టిన వారు తప్పిపోరు. దుఃఖము నొందరు.

కాని, మా బుద్ధి వినని వాని జీవనము దుఃఖభాజనమగును. అతఁ డాంధుఁడై రక్షణాదినమున దుష్టులతోఁ గా టచటికి రాఁగలఁడు." అంటిమి.

ఆతడు "ప్రభువా ! నాకు దృష్టి యుండెనే. నన్ను తక్కిన వారితోఁ జేర్చి యంధుని జేసితివేల ?" యనును.

దేవుఁడు వానికిఁ బ్రతివచనముగా "అవునట్లే. మా సూచనలు నిన్ను జేరినను నీవు లక్ష్యపెట్టవైతివి. కావుననే మేము నిన్ని దినమున మఱచిపోయెదము" అనును.

ఆజ్ఞల నుల్లంఘించి ప్రభువు సూచనలను విశ్వసింపని వారి కిదియే బహుమానము. నిజముగా పరలోక శిక్ష యింతకంటె ఘోరమై చిర కాల ముండఁగలదు.

తాము వసించినచోటనే పలుమారులు సంచరించుచున్నను, ఎన్నితరములవారిని మేము నాశనము చేసితిమో వారికి తెలియకుండెనా? బుద్ధిగలవారికి నిజముగా నివియన్నియును సూచనలే.

## అధ్యాయము 8

కొంతవిశ్రాంతి నిచ్చితిమని దేవుఁడు తొలుతఁ బలికియుండనిచో వారికి వెంటనే శిక్షకలిగియుండును. కాని యాకాలము నియమితమై యున్నది.

130 కావున వారు చెప్పుదానిని విని సహించి యుండుము: సూర్యోదయాస్తమయములయం దాతని సంకీర్తనములు చేయుచుండుము. రాత్రికొంత భాగమునను, మధ్యాహ్నమునను నాతని నారాధింపుచుండుము. అందువలన నాతఁడు సంతుష్టుఁడగు నేమో!

ఈ లోకమునందలి డాంబికములతో నీకు పనిలేదు. మేమట్టి వానిని, వారిలో కొంతమందికి, వారి శోధనకొఱకుఁ బ్రసాదించి యుంటిమేకాని, వేరుగాదు. నీకు నీప్రభువనుగ్రహించినదే మంచిదియు శాశ్వతమైనదియునై యుండును.

కావున వారివలె నీవును జేయఁ బ్రయత్నింపకుము. నీకుటుంబమువారు గూడ ప్రార్థన సలుపునట్లు శ్రద్ధ పుచ్చుకొనుము. నీవంతేదో నీవు చూచుకొనకయుండిన యెడల నీకు సకల సౌకర్యములను జేకూర్చి, నీభక్తికిఁదగిన సౌఖ్యఫలము నొసగెదము.

కాని, వారు "తనప్రభువునుండి యొకసూచనతో నాతఁడు రాకున్నచో మేము విశ్వసింప" మందురు. అయినను పూర్వగ్రంథములలోఁ గూడ స్పష్టసూచనలను వారు కనుగొనలేదా?

శిక్షాకాలమునకుఁ బూర్వమే వారిని మేము నాశనముచేసినచో వారు "ప్రభువా! మమ్ము దీనులఁజేసి యవమానింపక పూర్వ

యొకదూతను బంపి మాకు సూచనల ననుగ్రహింపకుండినచో మే మెట్లు విశ్వసింపఁగలము ?" అనియందురు.

వారితో నీవు "మనలో నొక్కొక్కఁడును, మృత్యువుకొఱ కెదురు చూచుచునే యుండును. కావున మనలో ఋజుమార్గవర్తు లెవరో, రక్షణమార్గమునాదినవా రెవ్వరో తెలిసికొనుటకు కొంచె మోపిక గలిగి వేచియుండుఁడు" అనుము.

---

# కాండము. 17

---

## సురా 21 ప్రవక్తలు.

మక్కా-112 పద్యములు-7 రుకూ-లు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

ఈప్రజలలెక్క యైపోవచ్చినను, వారు విమయులోలురై యజాగ్రత్తతో మార్గమునుండి తొలఁగిపోవుచున్నారు.

వారికివచ్చిన క్రొత్తసూచనల నన్నిటిని వారు లెక్కించు చున్నారు

తప్పుచేయుచు వారు రహస్యముగా "అతఁడు నీవంటినరుఁడే కదా ! అతని యాధిక్య మేమున్నది ? కన్నులు తెఱచికొనియుండియు మీరింద్రజాలమునకు లోనయ్యెదరా ?" అనుకొందురు.

"స్వర్గమునందును, భూమియందును నెవ్వ రేమనుకొనినను నాప్రభువునకుఁ దెలియుచునేయున్నది. అతఁడు సర్వమును వినుచు తెలిసికొనుచున్నాఁడు" అని వారితో నీవనిన,

వారు "అట్లుకాను. అదంతయు స్వప్నప్రాయమే. అతఁడు దానిని కల్పించియున్నాఁడు. అతఁడు కవీశ్వరుఁడు. పూర్వపు ప్రవక్తలు వచ్చినట్లే యాతఁడు సూచనల నేలదీసికొనిరాఁ" డందురు.

వీరికిపూర్వము మేము నాశనముగావించిన పురములను వా రెవ్వరును నమ్మలేదు. వీరుమాత్రము నమ్ముదురా ?

ఇంతకుపూర్వము పంపినవారికి మమ్మునుగూర్చి సర్వమును దెలిపియే పంపియున్నాము. నీకుఁదెలియనిచో భయసూచనలఁ గొన్ని వారి నడుగుము.

వారిదేహము లన్నముచేఁ బోషింపఁబడునట్లును చిరకాలము జీవింపకుండునట్లును చేసితిమి.

అప్పుడు మేమన్నదానిని చేసియేతీరితిమి. మాయిష్టమువచ్చిన వారిని రక్షించి, యితరులను నాశనముచేసితిమి.

10. ఇప్పుడు భయసూచన గలగియున్న గ్రంథమును, మీకుఁ బంపినాము. ఏమి, యింకనయిన బోధపడకున్నదా ?

## అధ్యాయము 2

మే మెన్నినగరములను నాశనముచేసి, వానిపిదప నెందఱు ప్రజలను బుట్టింపలేదు ?

వారికి మాపగ కనఁబడినంతనే వారు పలాయితులయిరి.

దేవతలును వారినిబరిహాసింపుచు "ఏలపరుగెత్తెదరు ? మీరు భోగైకనిరతులై పూర్వముండిన యావాసములకుఁ దిరిగి చేరికొనుఁడు! బహుశః మిమ్ము ప్రశ్నలడిగెదరేమో" యనిరి.

వారును, "అయ్యో ! యెంతటి యధర్మవర్తనులమై యుంటిమి !" అని యనుకొనఁ జొచ్చిరి.

వారిని కోసినధాన్యమువలె నశింపఁజేయువఱకును వారట్లే యఱచుకొనుచుందురు.

స్వర్గమర్త్యములను, తదంతరాళమును వినోదమునకై మేము సృజించియుండలేదు.

మాకిష్టమైనచో మాయందు మేమే వినోదించుకొని యుందుము.

మేము సత్యము నసత్యముమీఁదికిఁ విసరినంతనే యది భిన్నమై యంతరించును. కాని నీవు దేవునిఁగూర్చి పల్కినదానికి దుఃఖము ననుభవింతువు.

స్వర్గమర్త్యములఁగల భూతరాసులన్నియు నాతనివే. అతని సాన్నిధ్యవర్తు లాతనికి హితకరులై యలసటలేక సేవించుచుందురు.

20 వారు విశ్రాంతిలేక యాతని రాత్రింబవళ్ళు స్తోత్రముచేయు చుందురు.

మృతులను సజీవులుగఁ జేయఁగల దైవములను వారు భూమిపైనుండి గ్రహించిరా ?

భూమియందుఁగాని స్వర్గములందుఁగాని దేవుఁడుగాక యితర దైవము లున్నయెడల నిరువురును నశించియుందురు. వా రాతనిఁ గూర్చి కూయున దటుండనిమ్ము. సింహాసనాసీనుఁడగు దేవునిమహిమ వృద్ధినొందుఁగాక !

ఆతనిపనులనుగూర్చి యాతని నెవ్వరును నడుగఁజాలరు. ఆతఁడితరులను తమకర్మలఁ గూర్చి ప్రశ్నించును.

అతనిఁగాక యితర దైవములను వారుపరిగ్రహించిరా ? వారు దైవములనుటకు తగిన ప్రమాణములఁ జూపుము. నాతోనున్నవారియు నాకుఁ బూర్వమున్నవారియు భయసూచనయిదియే. కాని, వారిలోఁ జాలమందికి సత్యము తెలియక దారి తప్పుదురు" అనుము.

"నాకంటె నితర దైవము లేఁడు. కావున నన్నుభజింపు" మని మేము చెప్పిపంపిన ప్రవక్త యెవ్వఁడును లేఁడు.

అయిననువారు "దేవతలవలన దయానిధియగు దేవునికి సంతానముకలిగిన దందురు. అతఁడు మహిమవంతుఁ డగుగాక ! వారాతని గౌరవనీయకింకరులే.

ఆతఁడు మాట్లాడినదే వారు మాట్లాడరు. వారాతని యాజ్ఞానుసారము ప్రవర్తింతురు.

వారికి ముందును వెనుకను నున్న దాతని కెఱుక. ఆతనికిష్టమైన వారికి తప్ప నితరు లేమిచెప్పికొనినను నాతఁడు వినఁడు. ఆతని యాజ్ఞానువర్తులై వారు పనిచేయుచుందురు.

దేవునిప్రక్క నేనును దేవుఁడనే యని చెప్పు దేవతకు నరకమే బహుమానము. తప్పుచేసినవారి కిదియే బహుమానము.

## అధ్యాయము 3.

30 స్వర్గములును, భూమియు నొకటేముద్దగా నుండఁగా నాతఁడు వానినిచీల్చి, నీళ్ళుపోసి జీవమునుగల్పించియుండుట యవిశ్వాసకులు చూచియుండలేదా? అయిన వారేలవిశ్వసింపరు?

వారితోఁగూడ నవి సంచరించునేమోయని భూమిపై మేము పర్వతములనుంచి దానిపై వారిరక్షణకొఱకు వెడల్పైనబాటల నేర్పఱిచితిమి.

స్వర్గము నొకగట్టియింటికప్పువలె నిర్మించితిమి. కాని వారా సూచనలఁ బరిగ్రహింపరు.

రాత్రింబవళ్ళను తమతమ స్థానములఁ దప్పక వడిగాఁ దిరుగుచుండుసూర్యచంద్రులను సృజించినవాఁ డాతఁడే.

మనుష్యున కెప్పుడును శాశ్వతజీవనమును మే మనుగ్రహించియుండలేదు. నీవే మృతినొందినయెడల వారు శాశ్వతముగా బ్రదికియుందురా?

ఆత్మలన్నిటికిని చావుసత్యమే. మీమీ పాపపుణ్యకార్యములచే మిమ్ము శోధింతుము. మీరు మాయొద్దకే తిరిగిరావలయును.

అవిశ్వాసకులు మిమ్ముఁ జూచి వెక్కిరింతురు. "ఏమి, మీదైవములఁ గూర్చి యిట్లుమాట్లాడువాఁ డితఁడేనా?" అని వారెఱుంగరు, కాని వారికి దయానిధియగు దేవునిఁగూర్చి చెప్పినప్పుడు వారునమ్మరు.

"మనుష్యుఁడు తొందరగా సృజింపఁ బడియున్నాఁ" డని వారెఱుంగక, నేను వారికి నాసూచనలఁ జూపెదను. కావున వారు త్వరపెట్టుమని కోరకుందురుగాక!

"ఈభయసూచనఫల మెప్పుడుకనఁబడును? మీరు సత్యవంతులైనచో చెప్పుఁ" డని వా రడుగుదురు.

నరకాగ్ని వారిముఖములను, వీపులను కాల్పఁగలకాలము వారి కెట్లు తెలియును? వారికి సహాయమును దొరకఁజాలదు.

40 అది వారిపై నాకస్మికముగాఁ బడినంత వారు నిస్పృహులయ్యెదరు అదివారికొఱ కాగదు వారికి గడువును దొరకదు.

నీకుఁబూర్వమెందరో ప్రవక్తలు హేళనకుఁ బాత్రులై యుండిరి. కాని, వారిని హేళనచేసినశిక్ష యవిశ్వాసకులకు తప్పినదికాదు.

## అధ్యాయము 4.

"దయానిధియగుదేవునినుండి రాత్రింబవళ్ళును ని న్నెవ్వరు రక్షింపఁ గలరు? అయినను వారు తమప్రభువుసూచనను లక్ష్యపెట్టరు" అనుము.

మేముకాక వారినిరక్షింపఁగల యితరదైవము లున్నారా? వారు తమకుతామే సహాయపడఁజాలరు. దేవునితో సాటితెచ్చు నితరదైవములును, మాకోపమునుండి వారిని రక్షింపఁజాలరు.

అవును, వీరిని, వీరిపితరులను జీవితకాలమంతయు భోగముల ననుభవింపనిచ్చితిమి. ఏమి! మే మొకదేశమునకు వచ్చి దానిసరిహద్దులను తగ్గించుచుండుట వారుచూచుచున్నారుగదా! అయిన వారా జయించినవారు?

"నాకు తెలిసినంతమట్టుకే మీకు సూచన నిచ్చుచున్నానుం కాని, యెట్టిసూచన నిచ్చినను చెవిటి వా రామాటను వినరు.

నీప్రభువుశిక్ష వారినిసోకినంతనే వారు "అయ్యో, మేమును తప్పుచేసితిమే" యనియందురు.

రక్షణదినమునకు సరియైన త్రాసుల నేర్పఱిచి యున్నాము. ఏవిషయమునందును నేయాత్మకును, నన్యాయముకలుగదు. ఆవగింజయంత కర్మము చేసినను, మేము దానిని తూచియే తీరుదుము. మా లెక్కయే చాలును.

మూసా హారూనులకు పూర్వము జ్ఞానజ్యోతి నిచ్చితిమి.

తమ ప్రభువునకు రహస్యముగా భయపడి, ప్రళయదినమునకు కంపమొందుచు, దైవభీతులైనవారి కొకజ్ఞానజ్యోతిని, భయసూచనను నిచ్చితిమి.

50 మేముపంపిన యీ కురానుగూడ ధన్యమగు సూచనయే. అయిన దానిని మీరు విడనాడెదరా?

## అధ్యాయము. 5

పూర్వ మిబ్రాహీము తగిననాఁడని యెంచి మాయాజ్ఞ నాతని కొసగితిమి.

అతఁడు తన తండ్రితోడను, ప్రజలతోడను, "మీరుభక్తితో నారాధించు నీప్రతిమ లేమి?" యని యడుగ,

వారు "ఇవి మాపూర్వులారాధించినవే" యనిరి.

అతఁడు "నిశ్చయముగా మీరును మీపితరులును, తప్పుచేసి యున్నా" రన,

వారు "నీవు నిజముగా బల్కుచున్నావా ? హాస్యము చేయుచున్నావా ?" యనియడిగిరి.

అతఁడు "స్వర్గమర్త్యముల సృజించి, వానికి ప్రభువగువాఁడే మీప్రభువు. దీనికి నేనొక సాక్షిని.

మీరు మఱలి, వెనుజూపినంతనే మీప్రతిమలపైఁగుట్ర బన్నెదను" అని, వానినన్నిటిని బగులఁగొట్టి, వారుతిరిగి వచ్చి,

"మాదైవముల కెవ రిట్లుచేసినారు. వారన్యాయవంతు" లని యనుట కాప్రతిమలలో ముఖ్యములగువాని నుంచివేసెను.

60. వారు "ఒక యావనుఁడిట్లు చేసెనని చెప్పఁగా విని యుంటిమి. అతని పేరు ఇబ్రాహీము.

అతనిని ప్రజలముందుకు తెండు. వారాతనిపై సాక్ష్యమీయఁగల" రని చెప్పుచు,

ఆతనితో "ఇబ్రాహీమా ! నీవేనా మాదైవముల నిట్లుచేసినవాఁడవు" అనియడుగ,

అతఁడును, "కాదు కాదు. వారిలోని నాయకులే వారి నట్లు చేసినారు. వారు మాట్లాడఁ గలిగినచో వారినడుగుఁ" డనెను.

కావున వారు తమలోఁ దామే యాలోచించుకొని "మీరే భక్తిహీనుల" రని పలుకుచు,

వారిపూర్వపు తప్పునుండి మఱలక, తలతిక్కతో "ఇవిమాట్లాడలేవని నీకుఁదెలియును గదా !" యనిరి.

అతఁడప్పుడు "ఏమి, దేవునికిమాఱుగా మీకులాభము గాని నష్టముగాని చేయఁజాలని యితరదైవములనారాధింతురా ?

మీరును, మీరారాధించు దైవములును, నీచములే. అయ్యో! అయిన నింకను మీరు బోధపఱుచుకొనలేరా ?” అనియడుగ,

వారు “మీ రేదైనచేయఁగలిగినచో, వాని నగ్నిలోఁగాల్చి మీదైవముల రక్షించుకొనుఁడు” అనిరి.

మేము, “అగ్నీ, నీవు చల్లఁబడి ఇబ్రాహీమును రక్షింపుము.” అంటిమి.

70. వా రాతనిపైఁ గుట్రఁబన్నిరిగాని, దానివలన వారికే నష్టము కలిగెను.

అంతట మేమాతనిని, లూట్‌ను, సర్వమనుష్యులకును ధన్యవాసమగు భూమికిఁదెచ్చి,

ఆతనికి మఱియొకబహుమానముగా ఇసాకు, యాకూబులనిచ్చి వారినందఱిని న్యాయవంతులఁగాఁ జేసితిమి.

వారిని మాయాజ్ఞప్రకారము నితరులుసంచరించుట కాదర్శకులగునట్లు చేసి, వారిని సత్కార్యానుష్ఠానపరులును, ప్రార్థనానిరతులును, భిక్షాదాతలును నగునట్లు చేయ, వారు మమ్మారాధించిరి.

లూటునకు బుద్ధిని, జ్ఞానమును బ్రసాదించి, కల్మషయుక్తమగు నగరవాసులగు దుష్ప్రవర్తనులనుండి రక్షించితిమి.

ఆతఁడు సన్మార్గవర్తియగుటచే వానిని మాదయకుఁ బాత్రునిఁ జేసితిమి.

## అధ్యాయము 6.

పూర్వము నుహు మాకుమొఱలిడ మేమువిని, యాతని, నతనికుటుంబమును గొప్పయాపదనుండి తప్పించుటను స్మరింపుము.

మాసూచన లసత్యములనిపల్కిన జనులపై వానికి సహాయము చేసితిమి. వారు దుష్టులగుటచే వారిని నీటముంచి చంపితిమి.

కొందఱిగొఱ్ఱె లోకపొలమును పాడుచేసినప్పుడు దావూదు సులైమానులు తగవుతీర్చిరి. వారితీర్పునకు మేముసాక్షులము.

సులైమానునకావిషయమై తెలిపి, యిరువురకును బుద్ధిజ్ఞానములఁ బ్రసాదించితిమి. పర్వతములును, పక్షులును, దావూదుతోఁగూడి మమ్ము స్తుతింపఁజేసితిమి. అట్లుచేసినవారము మేమే.

80. మీలో నొకరికొకరు చేసికొను హానినుండి రక్షణనొందుటకై దావూదునకు కవచములఁజేయు నేర్పును బ్రసాదించితిమి. కావున మీరు కృతజ్ఞులరై యుండ రేల ?

గట్టిగా వీచు మారుతముపై సులైమానుకధికారమీయ నాతఁడు దానిని మేము ధన్యముచేసిన భూమిపై వచ్చున ట్లాజ్ఞాపించెను. మాకు సర్వవిషయములును,

నీటిలోమునిఁగి యాతని కనేకవిధముల నుపచారములఁజేయు పిశాచములును నెఱుకయే. మేము వారిపై కన్నువేసియే యుంచితిమి.

అయ్యూబునుగూడ స్మరింపుము. ఆతఁడు తన ప్రభువుతో "నన్ను దోష మంటినది. నీవు కరుణాపరులలో నుత్తముఁడవు" అని మొఱపెట్ట,

మేమువిని, యాతని దుఃఖభారమును తొలఁగించి, యాతని కుటుంబమును, మఱికొందఱిని నాతనికిచ్చి, మాసేవకుల కాతఁ డొక జ్ఞాపకచిహ్నముగాఁ జేసితిమి.

ఇట్లే యిస్మాయేలు, ఇద్రీసు, జల్‌కిఫిల్, మొదలగువారు దృఢభక్తులై యోర్పుగలిగియుండిరి.

వారు సన్మార్గవర్తులుగాన వారిని మేముకరుణించితిమి.

ఇట్లే యూనూ సనువాఁడు కోపముతోఁ బోవుచు నాతనిపై మాకు శక్తిలేదని యనుకొనెనుగాని, చీకఁటిలో నాతఁడు "నీవుతప్ప

నితరదైవము లేఁడు. నీవు మహామహాతుఁడ వగుదువుగాక! నేను దుష్టవర్తనుఁడ" నని మొఱపెట్టెను.

మేమువిని, యతనిని దుఃఖమునుండి విడిపించితిమి విశ్వాస యుతల నిట్లే మేము రక్షింతుము.

ఇట్లే జకరియ్యాయును తనప్రభువుతో "ప్రభువా! నన్నుపుత్త్రి కుం జేయకుము. అయినను నీకంటెమంచివారసుఁడు నాకులేఁ" డని మొఱపెట్ట,

90 మేమువిని యాతనికి యహ్యానిచ్చి యాతనిభార్య ప్రజావతి యగునట్లు చేసితిమి. వారును నొకరికంటె నొకరు హెచ్చుగా సత్కర్మల నాచరింపుచు, భయభక్తులతో మమ్మాశ్రయించి మా యెడల నమ్రులయిరి.

ఆమెయు కన్యాత్వమునుపాలించి, మాయాత్మను స్వీకరించి. తానును తన పుత్త్రుఁడును, సర్వభూతములకును, సూచనలైరి.

నిశ్చయముగా నీ యీమతమే సత్యమతము. నేనే నీప్రభువను, కావున నన్ను సేవింపుము.

కాని, యీయుపదేశమునుగూర్చి యనేకవిధములుగా వా రర్థము చేసికొని, తెగలు తెగలుగా విడిపోయిరి. వారందఱును మాయొద్దకు రాకతప్పరు.

## అధ్యాయము 7

న్యాయమైన పనులఁజేయుచు విశ్వాసియైనవాని ప్రయత్న ములన్నియు, సఫలములుగాకపోవు. వానినన్నిటిని నతనికొఱకు వ్రాసి యుంచెదము.

మేము నాశనముచేసిన నగరములన్నిటిపైనను శాపమున్నది. యాజూజు, మాజూజులు దారికల్పించికొని,

ఉన్నతప్రదేశములనుండి, వా రెల్లయెడలను లేచి మాభయ సూచన సత్యమగునంతవఱకును, నగరములు మఱియుద్ధరింపఁబడవు. అప్పు డవిశ్వాసకు లాశ్చర్యరసనిమగ్న నేత్రులై "అయ్యో, వీరిని గూర్చి యెంత యజాగ్రత్తగా నుంటిమి ! మేము భక్తివిహీనుల" మందురు. ఈ మావాగ్దానము జరిగితీరును.

నిశ్చయముగా మీరును, దేవునిఁగాక మీరారాధించు నితర దైవములును, నరకాగ్ని కింధనములు కాఁగలరు. మీ రందులోనికి పోకతప్పదు.

వీరే దైవములైనచో నందులోనికిఁబోవఁ బనిలేదే. అయినను వారందులోనే శాశ్వతముగా వసింపఁగలరు.

100 అచట వారు మూల్గుచు త మ్మాశ్వాసించువచనముల నెట్టి వానిని వినఁజాలరు.

కాని, మేము మంచికార్యములఁ జేయ నియమించినవారు దాని నుండి దూరముగ నుండఁగలరు.

దాని శబ్దమును వా రణుమాత్రమును వినరు. వారు తమ యాత్మలు కోరినదానియందే చిరకాలము వసింపఁగలరు.

ఆ మహాభయము వారిని కంపింపఁజేయ నేరదు. దేవతయు వారిని గలిసికొని "మీ కీయఁదలంచినదిన మిదియే" యనిచెప్పును.

ఆదినమున, వ్రాసినకాగితములను చుట్టఁబెట్టినట్లు స్వర్గమును చుట్టివైతుము. మేము మొదటసృష్టిని జేసినట్లే తిరిగిచేసెదము. ఇది మాకు విధాయకకృత్యమగుటవలన నట్లుచేసియే తీరుదుము.

• ఈధర్మము నిచ్చినతరువాత భక్తిగీతములలో "న్యాయవర్తులగు నాకింకరులు భూమికివారసు" లనివ్రాసితిమి.

నిజముగా దేవునిసేవకులకే కురానునందు బోధయున్నది.

సర్వభూతములకును దయాచిహ్నముగనే నిన్నుఁ బంపితిమిగాని, మఱియొకటికాదు.

"మీదేవుఁ డొకఁడేయని నాకుఁదెలుపఁబడినది. మీ రాతని కధీనులై ముస్లిముల (భక్తుల) గుదురా ?" అనుము.

కాని, వారు వెనుదిరిగినచో "మీకందఱికిని నొకేరీతిగ భయసూచన నిచ్చియున్నాను. కాని యాశిక్ష దగ్గఱపడినదో దూర ముగనున్నదో నాకుఁదెలియదు.

110. మీరు బిగ్గఱగాననునదియు, రహస్యముగాననునదియు దేవు నికిఁ దెలియును.

ఈయాలస్యము మీశోధనకొఱకో, మీరు మఱికొంతకాలము భోగైకపరాయణులై యుండుటకో నాకు తెలియదు.

"మీరు సత్యముగ తీర్పుచెప్పుఁ"డని నాప్రభువు పల్కు చున్నాఁడు. మీరు ప్రేలుదానికై సహాయము వేఁడికొనవలసిన దయా నిధియగు దేవుఁ డతఁడే.

---

# సుర-22. యాత్ర.

---

మదీనా-78 పద్యములు-10 రుకూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

మక్కావాస్తవ్యులారా! దేవునికి భయపడుఁడు. తుదిగంట యప్పుడు కలుగు భూకంపము కడుఘోరమైనదికదా!

మీకు దానిని జూచుదినమున, పాలిచ్చుచున్న స్త్రీలు చంటి బిడ్డలను వదలిపెట్టఁగలరు గర్భమును మోయుచున్న స్త్రీలు తమభార మును విడిచిపెట్టఁగలరు. మనుష్యులు త్రాగియుండకున్నను, త్రాగిన వారివలె కానవత్తురు. ఇదియే దేవుని ఘోరశిక్ష!

అజ్ఞానియై, దేవునిగూర్చి వివాదములుచేయుచు, తిరుగుబాటు చేయు సైతానులనందఱ ననుసరించువాఁడొకఁడున్నాఁడు.

తన్ను ప్రభువుగాఁ జేకొనినవారి నాతఁడు మోసపుచ్చి యగ్ని జ్వాలలోనికి దీసికొనిపోవునని చెప్పఁబడియే యున్నది.

జనులారా! మీరురక్షణఁగూర్చి సందేహింపవలదు. మాశక్తిఁ బ్రమాణముగా మిమ్ము తొలుత ధూళినుండియు, పిదప అణుజీవుల నుండియు, తరువాత నెత్తురుముద్దలనుండియు, ఆవెనుక రూపముగల ట్టియు లేనట్టియు మాంసఖండంబులనుండియు, మేము మిమ్ము సృజిం చియున్నాము. గర్భములో నాడుపిండమో మగపిండమో కాలమగు వఱకునుండునట్లు విధించియున్నాము. తరువాత మిమ్ము శిశువులుగాఁ బైటఁబెట్టితిమి. అనంతరము మిమ్ము యౌవనులఁజేసితిమి. పిదప మీలోఁగొందఱు మృతినొందుదురు. మఱికొందఱు తమపూర్వజీవితము నంతటిని మఱచిపోవువఱకును, జీవించియుందురు. భూమియంతయు నెండిపోయి ఫలహీనమగుటను మీరు కనుగొందురు. కాని, మేము దానిపై వర్షము కురియించినంతనే దానియందు చలనముకలిగి పెద్ద దియై, యన్నివిధములగు మొలకలును బుట్టుటకు తావగును.

దేవుఁడే సత్యముకావునను, మృతినొందినవారి నుజ్జీవింపఁజేయు వాఁ డాతఁడేకావునను, అతనికే సర్వవస్తువులపైనను శక్తియుండుట చేతను,

నిస్సందేహముగ నాగంట వచ్చితీరునుగావునను, సమాధులలో నుండువారిని దేవుఁడు తిరిగిజీవింప మేల్కొల్పును. కావుననే యిట్లగును.

జ్ఞానముగాని, రక్షణగాని, ప్రకాశవంతమగు గ్రంథముగాని, తనకు లేకున్నను దేవునిగూర్చి వివాదములు చేయువాఁ డొకఁ డున్నాఁడు.

ఇతరులను దేవుని మార్గమునుండి తప్పించుట కాతఁడు తిరస్కారభావముతో మఱలియుండును. అతని కీలోకమున లజ్జయే ప్రాప్తించును; రక్షణదినమున నాతని కగ్నిబాధను రుచిచూపెదము.

10. "ఇది నీవు పూర్వము నీచేతులతోఁ జేసినదాని కనుభవము! దేవుఁడు తన సేవకుల కన్యాయము చేయఁడు"

## అధ్యాయము 2.

కొందఱు దేవుని నేదో యొకవిషయములోనే సేవింతురు. వారిలో నొకనికి మేలుకలిగినచో నావిషయమునే యాశ్రయించు కొనియుండును. కాని, యతనికొక శోధనకలిగినచో అతఁడు తిరిగి యవిశ్వాసములోఁబడి యిహామునకును బరమునకునుగూడఁ జెడును. ఇదియే స్పష్టమైననాశనము!

తనకుఁ గీడుగాని, మేలుగాని, చేయలేనిదాని నాతఁడు దేవునితో సమానమని సేవించుచుండును. ఇదియే చాల తప్పు.

అతఁడు తనకు కీడుచేయువానినే పిలుచునుగాని, మేలుచేయు వాని నావాహనచేయఁడు. నిశ్చయముగా ఆ ప్రభువును, సేవకుఁడును, దుష్టులేకదా!

కాని, దేవుఁడు తన్నునమ్మి, క్రమవర్తనులైనవారిని తరంగిణులు ప్రవహించు నుద్యానవనములలోనికిఁ దెచ్చును. దేవుఁడు తన యిచ్ఛ వచ్చినదానిని జేయఁగలఁడు.

దేవుఁడు తన ప్రవక్త కిహామునను బరమునను గూడ సహాయ పడఁడని తలంచువాఁ డొకత్రాటిని పట్టుకొని తన్నుఁదాఁ జంపుకొను

వానివలె పైకెత్తి, దానిని గోసివేయనిమ్ము; తాను కోపించినదాని నేమైనఁ జేయఁగలఁడేమో యాతనికి గనఁబడఁగలదు.

దేవుఁడు తనయిచ్ఛవచ్చినవారినే రక్షించును గావున మేమీ కురానులోనిపద్యములను స్పష్టములగు సూచనలతోఁ బంపుచుందుము.

విశ్వాసులు, యహూదీలు, సబీవారు, నస్రానీలు, మాజియనులు, దేవునితో నితరదైవములఁ జేర్చువారు, రక్షణదినమున దేవుఁడు వీరివివాదములఁ దీర్చును. దేవుఁడు సర్వసాక్షి!

స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవునారాధించుచుండుట నీకుకనఁబడదా? సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, పర్వతములు, వృక్షములు, జంతువులు, చాలమంది మనుష్యులు, వీరందఱు నారాధించుచునేయున్నారే? కాని చాలమందికి శిక్షయే ప్రాప్తమగును.

దేవుఁ డవమానించినవారి నెవ్వరును గౌరవింపరు. దేవుఁడు తనకిష్టమైనదానిని చేయును.

20. విశ్వాసులు, నవిశ్వాసులునగు వీరు, తమప్రభునిగూర్చి వివాదములు సల్పెదరు. కాని, యవిశ్వాసులగువారి కగ్నితో వస్త్రములు గూర్పఁబడును. వారి శిరములపై సలసల మఱుగుచున్న నీళ్ళు పోయఁబడును.

వారిప్రేగులలోను చర్మములలోను నున్నదంతయు వా రరిగించుకొందురు. వారి కినుపదుడ్డే సిద్ధముగానున్నవి.

మిక్కిలి బాధచే వా రెన్నిసారులు పైకిరాఁదలంచినను తిరిగి వారినందులోనికే త్రోసివైచెదరు. వారగ్నిబాధ ననుభవింతురు.

అధ్యాయము 3.

కాని, విశ్వసించి క్రమవర్తనులైన వారిని దేవుఁడు తరంగిణులు ప్రవహించు నుద్యానవనములలోనికిఁ దెచ్చును. అచట వారికి బంగారు

కడియములును ముత్యాలసరములును నాభరణములును, పట్టు బట్టలును లభించును. వారు శ్రేష్ఠమగు వాక్యములనువిని, శ్రేష్ఠమగు మార్గమును బట్టుటచేతనే యీలాభము కలిగినది.

కాని, విశ్వసింపక దేవునిమార్గమునుండియు, మనుష్యుల కొఱ కేర్పఱిచిన మసీదునుండియు, (దీని నందువసించు వారికిని పైవారికిఁగూడ నేర్పఱిచితిమి) పరులను తప్పించి తీసికొనిపోవువారికిని, దానిని భక్తిహీనులై యపవిత్రము చేయనెంచువారికిని ఘోరశిక్షను రుచిచూపెదము.

## అధ్యాయము 4.

మేము మాపవిత్రగృహ ముండు స్థలమును ఇబ్రాహీమునకుఁజూపి "పూజలో నాతో నితరులఁ జేర్పకుము. నాగృహముచుట్టును ప్రదక్షిణము చేయువారికొఱకును, నిలుచుండియో, వంగియుండియో పూజ చేయువారికొఱకును, దానిని శుభ్రపఱిచియుంచుము" అని మేము చెప్పియుంటిమి. దానిని స్మరించుకొనుము.

జనులకు "యాత్ర" విధివిహితమని ప్రకటింపుము. వారు పాదచారులుగనో, వడిగల యొంటెలపైననో కొండకనుమలలోనుండి నీయొద్దకు రాగలరు.

అప్పుడు వారు దానిలాభములను తామే చూచికొనఁగలరు. విధివిహితములగు దినములందును, దేవుఁడు తమ కాహారముగానిచ్చిన జంతువులఁ జంపునప్పుడును, వారు దేవుని నామస్మరణము చేయఁగలరు. ఆ చంపఁబడిన జంతువులను మీరును భక్షింపుఁడు; నిర్భాగ్యులకును పేదవారికి నిడుఁడు.

పిదప వారు దీక్షలోనున్నప్పు డుపేక్షించిన తమ దేహములను శుభ్రముచేసికొని, తమ మొక్కులను చెల్లించి, యాపురాతనగృహము చుట్టును ప్రదక్షిణము సలుపవలయును.

30 దీనినిచేయుఁడు. దేవుని పవిత్రశాసనములను మన్నించువాఁడు దేవుని యనుగ్రహామునకుఁ బాత్రుఁడగును. ఇంతకుఁబూర్వము నీకుఁ జెప్పినదితప్ప, పశువులమాంసము నీవు భజింపవచ్చును. కావున విగ్రహాములను నపవిత్రవస్తువుల చెంతకుఁ బోకుఁడు. అసత్యవచనములవిడిచి పెట్టుఁడు.

దేవునియెడ స్థిరభక్తిగలిగి యతనితో నితరదైవములఁ జేర్పకుఁడు. దేవునితో నితరదైవములఁజేర్చుట, పైనుండిపడినదానిని పక్షులెత్తుకొనిపోవుటయో, గాలినెత్తుకొని దూరముగ విడిచిపెట్టుటయో వలె నుండును.

దీనిని చేయుఁడు. దేవునిఁగూర్చిన పూజలను చేయువారిపూజ హృదయపూర్వకముగుభక్తివలనఁ గలుగును.

పశువులను జంపువఱకును మీరు వాని ననుభవింపవచ్చును. వానిని పురాతన గృహామునొద్దనే బలి యీయవలయును.

## అధ్యాయము-5

మేము వారివారికిచ్చియున్న జంతువులను చంపునపుడు చేయవలసిన కొన్నికర్మల నేర్పఱిచియున్నాము. ఏకేశ్వరుఁడే మీదేవుఁడు. కావున మీరాతనికి వశులరుకండు. నమ్రములయినవారికిని,

దేవుని నామోచ్చారణమువలన హృదయములం గగుర్పాటు నొందువారికిని, తమ కేదిసంభవించినను స్థిరులైనిలిచి ప్రార్థనలుసలిపి, మే మనుగ్రహించినదానిలోనే భిక్షము పెట్టువారికిని, సువార్తను బ్రకటింపుము.

దేవునికి బలియిచ్చుటకు మీ కొంటెల నిచ్చితిమి. వానివలన మీకుఁ జాల మేలుకలుగుచున్నది. కావున వానిని జంపక పూర్వము వానినన్నిటిని వరుసగనిలిపి వానిపై దేవుని నామమును స్మరింపుఁడు.

అవిప్రక్కలపై యొఱగి పడియున్నప్పుడు, వానిమాంసమును తిని, యడిగినవానికిని, అడుగక తృప్తినొందియున్నవానికిని నిండు. మీరు కృతజ్ఞులైయుండుటకు వానిని మీకిట్లు వశములుగ చేసితిమి.

వానిమాంసముగాని, రక్తముగాని యెంతమాత్రమును దేవునిఁ జేరదు; మీభక్తియే యాతనిఁజేరును. దేవుఁడు మీకొసగిన రక్షణకై యాతని మహిమోన్నతుని జేయుటకే యాతఁడు వానిని మీకు వశములు చేసియున్నాఁడు. ఇదిగాక సత్కార్యములు చేసినవారికి

విశ్వాసులనుండి దేవుఁడు కీడును తొలఁగించునని చాటుము. దేవుని కసత్యవాదులును, భక్తిహీనులును నిష్టులుగారు.

అధ్యాయము 6.

దౌర్జన్యములకు పాలై, యాయుధముల గ్రహించి, 'మాప్రభువు దేవుఁడే' యని పల్కినందుకు తమగృహములనుండి తరుమఁబడిన వారికి యుద్ధముచేయ ననుజ్ఞ యీయఁబడినది. దేవుఁడు వారికి సహాయపడఁగలఁడు.

40 దేవుఁడు కొందఱిని మఱికొందఱిచే తరిమివేసియుండనియెడల, మఠములును, దేవాలయములును, సభాభవనములును, మసీదులును, నన్నియు నాశనము చేయఁబడియుండును. దేవునికి సహాయముచేయు వానికి దేవుఁడు సహాయముచేయును. దేవుఁడు బలవంతుఁడు, శక్తిమంతుఁడు! వారి నీభూమిపై నెలకొల్పినచో, ప్రార్థనలఁ దప్పక, విధి విహితమగు భిక్షముఁబెట్టి, క్రమవర్తనము విధించి, దుష్టవర్తనమును నిషేధింతురు. వస్తువులన్నియుఁ దుద కేమగునో దేవునికే తెలియును.

వీరు నీకు కృత్రిమత్వము నారోపింతురేమో? వీరికి పూర్వమప్పుడే, నుహు, ఆదు, సమూదు,

ఇబ్రాహీము, లూతు, వీరిప్రజలును, మిదియానువాసులును, తమప్రవక్తలు కృత్రిములనియే యన్నారు.

మా సాకుఁగూడ కృత్రిమత్వమును వా రంటఁగట్టిరి! అవిశ్వాసులను జాలకాలము సహించియుంటిని. ఇఁక వారిని పట్టుకొనుము. నేనుచేసినమార్పు చాలగొప్పది!

దైవదూషకములైన యెన్నో పురములలోని యిండ్లను పడఁద్రోసి మేము నాశనముచేసియుంటిమి! నూతులును, గొప్పకోటలును పాడుపడిపోయినవి!

వారు దేశములో సంచారముచేయలేదా! బోధపఱచుకొనుటకు వారికి హృదయములు లేవా ? వినుటకు చెవులు లేవా? దీనిని చూడకుండ నుండుటకు వారికన్నులకు గ్రుడ్డిలేదు. వారి హృదయములే గ్రుడ్డివై యుండెను!

రాఁబోవుశిక్ష యేదో శీఘ్రముగ రానిమ్మని వారందురు. కాని, దేవుఁడు తాను భయపెట్టినదానిని చేసియేతీరును. మీ లెక్కప్రకారము వేయిసంవత్సరములు దేవుని కొకదినముకదా?

ఎన్నోనగరములు దుష్టములైనను చిరకాలము సహించియుంటిని. కాని తుదకు వానిని పట్టుకొని శిక్షించితిని. అందఱును నా యొద్దకే చేరఁగలరు.

అధ్యాయము 7.

జనులారా! 'నేను కేవలము భయసూచన నిచ్చువాఁడనే.
50 విశ్వసించి, క్రమవర్తనులగు వారికి క్షమాపణయు, గౌరవజీవనమును గలుగును.

కాని, మాసూచనలను నిరాకరించువారు నరకవాసులు కాఁగలరు" అనుము.

పూర్వము మేముపంపిన ప్రవక్తల కోరికలలోనెల్ల సైతాను చొరఁబడి యొకతప్పుటుద్దేశమును గలిగింప నెంచెను. కాన, దేవుఁడు

సైతాను ప్రేరేపించినదాని నడఁచివై చెను. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు. కావున తన తెలివికుల నాతఁ డిట్లు తెలియఁజేయుచుండును

కఠినహృదయులను, హృదయరోగపీడితులను, శోధించుటకే సైతా నిట్టికోర్కెలను పుట్టించుచుండును. దుష్టులు సత్యమునుండి విడఁబడి చాలదూరము పోయియున్నారుగదా!

'జ్ఞానము' ప్రసాదింపఁబడినవారు 'కురానే' దేవునినుండి వచ్చిన సత్యమని గ్రహించి, దానిని నమ్మి, వారిహృదయములు దానికి సమ్మతించుటకే దేవుఁడిట్లుచేయును. నమ్మినవారిని తిన్ననిత్రోవను నడిపింపఁగలవాఁడు దేవుఁడేకదా.

ఆగంట యకస్మాత్తుగా వారికాసన్న మగునంతవఱకునో, నిర్మూలనదినమున వారిపై శిక్షపడువఱకునో భక్తిహీనులు దానిని గూర్చి సందేహములను విడిచిపెట్టరు.

ఆదినమున రాజ్యము దేవునిదై యుండును. వారివివాదముల నాతఁడేతీర్చును. విశ్వసించి క్రమవర్తనులైనవా రాదినమున నందనో ద్యానవనములలో వసింతురు.

కాని, భక్తిహీనులై, మాసూచన లసత్యములనువారో-వీరికి లజ్జాకరమగు శిక్షకలుగును!

అధ్యాయము 8.

దేవునివిషయమై తమదేశమునువిడిచి, తరువాత చంపఁబడినను, చచ్చినను, వారికి దేవుఁడు మంచిసంభారములఁ గూర్చియుంచును. జీవనోపాధి కల్పించువారిలో దేవుఁడేకదా శ్రేష్ఠుఁడు!

దేవుఁడు వారి నందు సుఖప్రవేశముచేయించును. దేవుఁడే సరిగ తెలిసికొనువాఁడు. దాక్షిణ్యమూర్తి

60. అదియట్లేయగును. తనకుఁ గలిగిననష్టమునకుఁగాను న్యాయముగ రియైన పరిహారముఁ బుచ్చికొనినవారికి తిరిగి హానికలిగినచో, దేవుఁ

డాతనికి తప్పక సహాయముచేయును. దేవుఁడు మిక్కిలి దయాళుఁడు. కరుణాళుఁడు.

అదియట్లేయగును. దేవుఁడు రాత్రిని పగటియందును, పగటిని రాత్రియందును, సంక్రమింపఁజేయును; దేవుఁడు వినుచున్నాఁడు, చూచుచున్నాఁడు.

అదియట్లేయగును; దేవుఁడేసత్యమూర్తి! అతనినిగాక వారావాహనఁజేయునదంతయు వ్యర్థము. దేవుఁ డున్నతుఁడు, బలవంతుఁడు!

దేవుఁడు స్వర్గమునుండి వర్షముఁ బంపిన మఱుసటిదినమే' భూమి పచ్చికతోఁ గప్పఁబడియుండుటను నీవుచూడవా? దేవుఁడు దయాళుఁడు, సర్వజ్ఞుఁడు!

స్వర్గమర్త్యములయందున్నదంతయు నాతనిదే. దేవుఁడేకదా భాగ్యవంతుఁడును, స్తవనీయుఁడును.

## అధ్యాయము 9.

భూమిలోనున్నదంతయును, సముద్రముపై నతనియాజ్ఞప్రకారమునడచు నావలను, నాతఁడు మీకు వశముచేసియుండుట మీకు గనఁబడదా? తన యనుజ్ఞలేనిదే భూమిపైఁ బడకుండ నాకాశమునాపియున్నాఁడు దేవుఁడు నిశ్చయముగా మనుష్యులయెడ దయాదాక్షిణ్యమూర్తియై యున్నాఁడు.

మీకు జీవనమునొసగి, పిదప మిమ్ముఁజంపి, తిరిగి జీవింపఁజేయువాఁడాతఁడే. అయినను సత్యముగా మనుష్యుఁడు కృతఘ్నుఁడైయున్నాఁడు.

అన్ని జాతులవారికిని కొన్నికొన్ని విధుల నేర్పఱిచి యున్నాము. కావున, వారు నీతో నీవిషయమైవివాదము చేయనీయకుము. నీవుసరియగు మార్గమున నున్నావు. వారిని దేవునియొద్దకు రమ్మని యాజ్ఞాపింపుము.

కాని, వారు నీతో వాదమునకు దిగినచో "మీరుచేయునది దేవుని కెఱుక! రక్షణదినమున దేవుఁడు మీమీవివాదములను దీర్పఁ గలఁడు.

70. స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవుని కెఱుకయే యని నీకు తెలియదా?

ఇది నిశ్చయముగా "గ్రంథము"లో వ్రాయఁబడియే యున్నది. ఇది సత్యముగా దేవునికి సులభము.

దేవుఁడు తమకెట్టి యనుమతి నీయనట్టియు, తమకే తెలియ నట్టియు వస్తువును వారు దేవునిప్రక్క పూజింతురు. కాని, యీతప్పు చేసినవారికి సహాయకుఁ డుండఁ బోఁడు.

మా స్పష్టసూచనలు వారికి తెలుపఁబడుచుండఁగా నా యవి శ్వాసులచూపులలో నీకు తిరస్కారము కాన్పించుచుండును. ఆసూచ నలను తెలుపుచున్నవారిపై నొక్కసారిగాఁబడుదుమా యని వా రుం కించుచుందురు. 'ఇంతకంటె చెడుగయినదానిని తెలుపుమందురా? విశ్వసించనివారికి దేవుఁడు విధించినశిక్షయే యాయగ్ని! అందులోనికి దారి దుర్గమముగానుండును.

అధ్యాయము 10.

జనులారా! మీకొక భావగర్భితమగు కథ తెలుపఁబడినది. కావున దానిని వినుటకుఁ జెవియొగ్గుఁడు. దేవునిగాక వా రారాధించు నితరదైవములందఱును గూడియు నొక యీగనయినను జంపఁజాలరు. ఆయీగ వారినుండి దేనినైన నెత్తికొనిపోయినచో దానినుండి వారు తిరిగి తీసికొనఁజాలరు! అడుగుకొనువాఁడును, అడుగఁబడువాఁడును గూడ బలహీనులే!" అనుము.

వారు దేవునిఁగూర్చి సరిగాఁ దెలిసికొనలేదు. దేవుఁడు నిశ్చ యముగా బలవంతుఁడు! శక్తిమంతుఁడు!

దేవతలనుండియు, మనుష్యులనుండియు, దేవుఁడు దూతల నెంచుకొనుచుండును. దేవుడు, వినుచుఁ జూచుచు నున్నాఁడుగదా!

వారికి ముందటి నేమున్నదో, వెనుక నేమున్నదో యతనికిఁ దెలియును. దేవునియొద్దకే సకలవస్తువులును తిరిగిచేరును.

విశ్వాసులారా! మీ ప్రభువునకు నమస్కరింపుఁడు. సాష్టాంగ పడుఁడు. అతనిఁ బూజింపుఁడు. మీ శ్రేయస్సుకొఱకు క్రమవర్తను లరు కండు!

మీరు దేవునివిషయమై యెట్లు పాటుపడవలయునో యట్లు ధైర్యముతోఁ బోరాడుఁడు. అతఁడు మి మ్మెంచికొనినాఁడు. మీ తండ్రి యగు న్యిబాహీముమతము నే యాతఁడు మి మ్మనుసరింపుఁడ నెనుగాని, యామతమునందు మీకుఁ గష్టమును గూర్చియుండ లేదు. మీ కాతఁడు 'ముస్లిముల' (దృఢభక్తుల) ను నామమును ఇంతకుఁబూర్వ మీ గ్రంథములో నొసగియున్నాఁడు. ప్రవక్తలు మీకు సాక్షులుగను, తక్కిన మనుష్యులకు మీరు సాక్షులుగను నుండుటకే మీ కాతఁ డీదృఢభక్తి నొసగియున్నాఁడు. కావున ప్రార్థనలుసలుపుచు విధివిహితమగు భిక్షమును చెల్లించి దేవుని గట్టిగ నంటిపెట్టుకొని యుండుఁడు. అతఁడు మీకధినాథుఁడు! మంచిప్రభువు, మంచిసహాయకుఁడు.



# కాండము. 18

## సుర 23-విశ్వాసకులు.

మక్కా-118 పద్యములు-6 రుకుకులు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేః

ప్రార్థనయందు దీనులై,
వృథాలాపముల దూరముగనుంచి,
భిక్షుల నొసగుచు,

తమ కుడిచేతులతోఁ సంపాదించిన బానిసలయందును, దమ భార్యలయందును దప్ప నితరులయందు,

తమకామమును నిగ్రహించువారై (పైవారిని కామించువారికి నింద లేదు.

ఇంతకు మించినయెడల నతిక్రమణదోషము కలుగును)

తమయందుంచిన నమ్మకములను, నొడంబడికలను, బాలించు వారై,

ప్రార్థనలను దప్పకయుండు,
విశ్వాసకులు సుఖులై,
10 స్వర్గమునందు చిరవాసము చేయుచు,
దానిని వారసత్వముపై ననుభవింపఁగలరు.
మనుష్యుని మెత్తని బంకమట్టితోఁ జేసి,

మిలమిలలాడు మెత్తనిపురుగగు నాతని సురక్షితస్థలమం దుంచి, ఆపురుగును నెత్తురుముద్దఁజేసి, యానెత్తురుముద్దను మాంసపు ముక్కఁజేసి, యామాంసపుముక్క నెముకలుగాఁజేసి, యాయెముకలపై మాంసముఁగప్పి, మనుష్యునికి కేవలము మాఱురూపు ఘటిల్లునట్లు చేసితిమి. మిక్కిలి నేర్పరియగు సృష్టికర్త, దేవుఁడు ధన్యుఁడగుఁగాక!

అటుపిమ్మట మీరు తప్పక మృతినొందుదురు.

తరువాతఁ బ్రళయదినమందు మీరు తప్పక మేల్కొలుపఁబడుదురు.

మీపై నేడు స్వర్గములను నిర్మించితిమి. సృష్టినిగూర్చి మే మజాగ్రత్తగా నుండము.

స్వర్గమునుండి కావలసినంత వర్షమునుబంపి యది భూమిపై నిలువయుండునట్లు చేసి, దానిని తీసివేయుచున్నాము.

దానిమూలమున ఖర్జూర ద్రాక్షవనములు పెఱుగునట్లు చేసి, వానిఫలములు మీ రారగించునట్లు చేతుము.

20 సినైశిఖరముపై నూనెయుఁ బానీయమగు రసమును గలుగు వృక్షమును మేము పుట్టింతుము.

పశువులనుండి కూడ మీరు నేర్చికొనవచ్చును. వానియుదరము లోనిది మీరు త్రాగి, వానినుండి యనేకలాభములఁబొంది, వానినే యాహారముగాఁ జేసికొందురు.

అవియును, నావలును మీకు వాహనములగును.

## అధ్యాయము 2.

ఇంతకుఁబూర్వము నువాను వారిప్రజలయొద్దకంప నాతఁడు "నాప్రజలారా! దేవుని సేవింపుఁడు. అతఁడు తప్ప మీకు మఱియొక దేవుఁడు లేఁడు. కావున నాతనికి మీరు భయపడరా?" అనఁగా,

వారిలో నవిశ్వాసకులగు నాయకులు "వీఁడును మీవంటి మనుష్యుఁడే. ఇతఁడు మీకంటె నధికుఁ డనిపించుకొన నెంచుచున్నాఁడు. దేవుఁ డెవ్వనినైన దూతఁగా బంపవలెనన్న దేవతలనే పంపియుండును. మీపూర్వు లెవ్వరు నిట్టివాఁడు వచ్చునని యెన్నడును చెప్పియుండలేదు.

ఇతఁడు పిశాచగ్రస్తుఁడు. కావునఁ గొంతకాలమీతనిఁ బరిత్యజింపుఁడు" అనిరి.

ఆతఁడు "ప్రభువా! నాకు వీరారోపించిన యనృతదోషమును బాపు" మని వేఁడికొనెను

కావున మేమాతనితో "మేము విధించిన ప్రకారము మా సమక్షముననే యొక నావను నిర్మించి, మాశిక్ష రానున్నప్పుడు, భూమి యుపరిభాగ ముడుకెత్తునప్పుడు, దానిలోనికి, పూర్వమే శిక్ష విధింపఁబడినవారినిఁగాక యితరులలో జాతికొక పురుషుని, స్త్రీని నీకుటుంబముతో దీసికొని పొమ్ము. దుష్టులను రక్షింపుమని నాతోఁబల్కఁబోకుము. వారిని నీటియందు ముంచి చంపెదను.

నీవును నీయనుచరులును నావలోని కెక్కి "దుష్టులనుండి మమ్ము రక్షించిన దేవునికి జయమగుఁగాక?

ప్రభువా? మమ్ము సురక్షితముగా నీ నావనుండి దిగునట్లు చేయుము. నీవే మమ్ము దరిఁజేర్ప సమర్థుఁడవు" అనుమని పలికితిమి.

30 ఇవియన్నియు నిశ్చయముగా సూచనలే. నిజముగా మనుష్యు నిట్లు శోధించుచునే యుందుము.

పిదప నాతనివెనుక మఱికొన్ని తరముల వారిని వెలయించి,

వారినుండియే యొక ప్రవక్తను బంప నాతఁడు, "మీరు దేవునారాధింపుఁడు ఆతఁడుతప్ప నింకొక దైవములేఁడు. మీరాతనికి భయపడరా? " యన,

## అధ్యాయము 3.

వారిలో నమ్మనివారును, రాఁబోవుజన్మమున మాయొద్దకు వచ్చు టసత్యమనువారును, ప్రస్తుతజన్మమున మాయొద్దనుండి యనేక బహుమానములు నొందినవారును నగు నాయకులు "వీఁడును మీ వంటి యొక మనుష్యుఁడు. ఈతఁడు మీరుతినుదానినే తినును. మీరు త్రాగినదానినే త్రాగును.

మీవంటి నరునే మీరును ననుసరింతురేని మీకు ముందుగతు లుండఁబోవు.

ఏమి! చచ్చి, బుగ్గియు నెమ్ములు నైనపిదప మీరు తిరిగి బ్రతికెదరని యీతఁడు పల్కుచున్నాఁడా?

అతని భవిష్యత్సూచనల దూరముగ నుంచుఁడు.

ప్రస్తుత జన్మకంటె వేఱుజన్మము లేదు. మనము జీవించి యున్నాము. ఇఁక చచ్చిపోవుదుము. అంతేకాని, తిరిగి లేచుట యసంగతము.

వీఁ డెవ్వఁడో దేవుని కసత్యత్వ మారోపించుచున్నాఁడు. మే మాతనిని నమ్మము" అనిరి.

ఆతఁడు "ప్రభువా! నాకసత్యత్వదోష మారోపించు వీరినుండి నన్ను రక్షింపు" మన,

40 దేవుఁడు "నీవు తొందరపడవలదు. కొలదికాలములోనే వారు పశ్చాత్తప్తులు కాఁగల" రనెను.

అప్పుడు న్యాయమగు శిక్ష వారిపై నాకస్మికముగాఁబడి ప్రవాహముచేఁ గొట్టుకొనిపోవు నాకులవలె వారినెగురఁ గొట్టెను. దుష్టు లిట్లే యంతరింతురుగాక!

వారితరువాత నితరతరములవారిని లేవనెత్తితిమి.

ఏ ప్రజలైనను తమ కాలము వచ్చువఱకును నోర్చియుండ వలసినదే.

అప్పుడు మే మొకరి వెంబడి నొకరుగా ప్రవక్తలను బంపితిమి. వారి కాప్రవక్త కనఁబడినప్పుడెల్లను నాతనినసత్యవాదిగాఁ బరిగణించిరి. ఇట్లొకరిపిదప మఱికొందఱి నట్లే సృజించుచు,నాకథను మోచుకొనుచు వచ్చునట్లుఁ జేసితిమి. నమ్మనివారు నశింతురుగాక!

పిదప ఫిరౌను నొద్దకును, నాతని సామంత రాజపుత్త్రిల యొద్దకును,

మాశక్తితోడను, స్పష్టసూచనలతోడను, మూసాను, ఆతని సోదరుఁడగు హారూనును బంపితిమి. కాని, వారు గర్విష్ఠులై యతి చరించి,

"వారిప్రజలు మాకు బానిసలు. వారిద్దఱును మావంటి నరులే. అట్టివారినా మేము నమ్మవలయు ?" ననుచు,

వారిని మిథ్యాపురుషులుగాఁ బరిగణించిరి. కావుననే వారు నాశనముఁ జెందినవారిలోఁ జేరిరి.

పిదప నిసాీయేలుల రక్షణార్థము మూసాకు మాగ్రంథము ననుగ్రహించితిమి.

50 మరియమ్మ పుత్త్రిని, నాతని జననిని, సూచనగా నియోగించి తిమి. వారికి శాంతమును, జలధారాపూర్ణముననగు నొక యుచ్చ స్థానమున వాస మేర్పఱచితిమి.

## అధ్యాయము 4.

"ప్రవక్తలారా! మంచి వస్తువులను తినుఁడు. క్రమమగు దానిని చేయుఁడు. మీరు చేయుదానిని నేనుచూచుచున్నాను.

నిశ్చయముగ మీమతమే మతము. నేను మీప్రభువను, కావున నాకు భయపడుఁ"డంటిమి.

కాని, మనుష్యులు తమకు దొరకిన దాని విషయమై వివిధాభిప్రాయములం బడి కక్షుల నేర్పఱిచికొని, యెవరి యభిప్రాయము వారికానందముగాఁ బ్రవర్తించిరి.

కావున కొలఁదికాలమునఱకును, వారి నాతప్పుత్రోవయందే యుండనిమ్ము.

ఏమీ, వారికి మేము సంతానరూపమునను, ధనరూపమునను,

హెచ్చుగాఁ బ్రసాదించునది వారిమేలుకొఱకే యనుకొందురు కాఁబోలు ! వారికి దానికటుకు తెలియదు.

కాని, ప్రభువునకు భయపడువారును,

ప్రభువు సూచనలను నమ్మువారును,

తమ ప్రభునిఁదప్ప నితరులను జేరనివారును,

60 తమ ప్రభువునొద్దకు తిరిగి పోవలయుఁగదా యని భయకంపితులై హృదయపూర్వకముగా దానముచేయువారును,

మేలు నాసించి దానిని మున్ముందుగా సంపాదింతురు.

ఏయాత్మమీఁదనైనను, శక్తికిమించిన భారము వేయము.

మాయొద్ద సత్యగ్రంథ మొకటియున్నది. వారి కెట్టి యన్యాయమును జరుగదు.

కాని, యీగ్రంథమును గూర్చి వారిహృదయము లన్యథా తలంచుచున్నవి. వారికృత్యములన్నియు, ముస్లిముల (భక్తుల) కుచితములుకానివై యున్నవి.

వారిలో ధనవంతులకు శిక్షకలుగువఱకును, వా రాపనులం జేయుచు, నప్పుడు సహాయముకొఱకు మొఱపెట్టుదురు.

"ఈదినమున మేము మీకు సహాయము చేయము. కావున మీరు మమ్ము నేఁడు పిలువఁబనిలేదు.

ఇంతకుపూర్వ మెంతో కాలముక్రిందట మాకీసూచనలఁ జూపితిమిగాని, మీరు లక్ష్యపెట్టలేదు.

మీరు గర్వితులరై రాత్రిపూట వాదములం జెంచికొంటిరి. ”

వారి తాతముత్తాతలకు మేము పలుకని పలుకులను, వారు వినియు లక్ష్యపెట్టరేల?

తమ ప్రవక్తను గుర్తింపరేల?వానిని తిరస్కరించెదరేల!

70 “అతనిలో పిశాచమున్నదని నారందురా ? ” కాదు. అతఁడు సత్యవార్తతో వారియొద్దకు వచ్చినాఁడు. కాని, సత్యమనిన వారిలోఁ జాలమందికిఁ గిట్టదు.

వారికోరికలలోనే సత్యమున్నయెడల నింతకుఁబూర్వమే స్వర్గమర్త్యములను, నందుండు సర్వమును నాశనమొందియే యుండును. కాని, వారికి భయసూచనను దెచ్చితిని. వారు దానిదరికిఁ బోరు.

వారినుండి లాభము నడుగుచున్నావా? నీప్రభు విచ్చులాభమే శ్రేష్ఠమైనది. ఆతఁడు నీకు కావలసిన దంతయు బాగుగ నమర్పఁగలఁడు.

నీవు వారిని క్రమమార్గమునఁ బొమ్మని యాజ్ఞాపింతువు.

కాని, తిరిగి జీవింపఁగలమని నమ్మనివా రామార్గము నతిక్రమింతురు.

వారిపై దయగలిగి వారికష్టములను మేము హరించినచో, వారు తమ దౌష్ట్యమును వదలక యున్మత్తులై తిరిగియుందురు.

పూర్వము వారిని శిక్షించితిమి గాని, వారు ప్రభువుముందర నమ్రులగుటగాని, దీనులగుటగాని, చేయ లేదు.

మేమును వారిని ఘోరశిక్షాద్వారమును తెఱచినంతనే నిస్పృహులగుదురు.

## అధ్యాయము 5.

ఆతఁడేకదా వినుటకును చూచుటకును శక్తియు, నొక హృదయమును నొసగియున్నాఁడు. అయినను మీలో నెంతమంది యాతనికి కృతజ్ఞులరైయున్నారు?

మిమ్ముల నీ భూమిపై జన్మింపఁజేసినవాఁ డాతఁడే. ఆతనియొద్దకు మీరందఱును తుదకు చేరుదురు.

పుట్టించినవాఁడును, గిట్టించువాఁడును నాతఁడే. ఆతనివలననే రాత్రింబవళ్ళు క్రమముతప్పక మాఱుచున్నవి. మీరు బోధపఱచుకొనరేల?

వారు పూర్వకాలపువారివలె,

"ఏమి, మేమువచ్చి మన్నును నెముకలును నైనపిదప మాకు తిరిగి ప్రాణములువచ్చునా?

మాకును మాతాతముత్తాతలకును నిట్లే చెప్పియున్నారు. కాని, యిది యంతయు తాతలనాటి ప్రాతకథయేకాని యొండు గా" దందురు.

"మీకు తెలిసినచో నీభూమియు నందుండు సర్వమును నెవరిదో తెలుపుఁ" డని వారిని నీవడిగినచో

వారు 'దేవుని' దందురు. అయిన, మీరు యోచింపరా?

"ఏడుస్వర్గములందును, సింహాసనమునందును నధిష్ఠించి, ప్రభావంతుఁడై యుండువాఁ డెవ్వఁడు" అని మీరడుగ,

వారు "దేవుఁడే" యందురు. అయిన నాతనికి భయపడరా?

"మీకు తెలిసినచో సర్వవస్తువులపై నధికారము గలవాఁడును, రక్షణనిచ్చి రక్షణను గొనువాఁడును, నెవ్వఁ"డని యడుగ,

వారు 'దేవుఁడే' యందురు. అయిన మీరు నివ్వెఱపడి నిలిచి యుండురేల?

90. మేము వారికి సత్యముఁ దెచ్చియున్నాము. కాని, వారు కేవల మనృతవాదులు.

దేవునికి సంతానము లేదు. అతఁడుతప్ప మఱియొక దేవుఁడు లేఁడు; అట్లయినచో, నేదేవుఁడు సృజించుకొనినదాని నాదేవుఁడే యెత్తికొనిపోయి యొకదేవునిపై మఱియొక దేవుఁ డధికారము నేర్పఱుచుకొనియుండును. ఇట్టి యపవాదము లాతనిమహిమనుండి దూరముగా వెడలునుగాక !

దృష్టాదృష్టములన్నియు నాతనికెఱుక. ఆతనితో సరిచేసినదైవములందఱికంటె సత్యదేవుఁ డత్యుచ్చస్థానము నలంకరించుఁగాక !

అధ్యాయము-6.

"ప్రభువా ! వారికి నీవు భయపెట్టిన శిక్షను, నాకుచూపఁ దలఁచితివచో, దైవరహితులగు వారితో నన్నుఁ జేర్పకుము." అనెను.

నిజముగా వారికి మేము భయపెట్టినశిక్షను నీకుఁ జూపుటకు, సమర్థులమే.

కావున, మంచికర్మలఁ జేసి, దౌష్ట్యమును పాఱఁద్రోలుము. వారు నీపై నేమియపవాదము లాడుకొనుచున్నారో మాకు బాగుగఁ దెలియును.

"ప్రభువా! పిశాచముల దురాలోచనలకు పాలుగాకుండుటకై నిన్నాశ్రయించుచున్నాను.

ప్రభువా ! వారు నాకు కీడుచేయకుండుటకై నీశరణుజొచ్చుచున్నాను" అనుము.

మరణ మాసన్నమైనప్పుడు దుష్టుఁడు "ప్రభువా ! తిరిగి నా లోకమునకు నన్ను బంపుము.

110. నేను సత్కార్యానుష్ఠానపరుఁడనై పూర్వపాపములఁ దొలఁ

గించికొనెదను" అనును. "అట్లెన్నడును జరుగఁబోదు" ఇవియే మాతఁడుపల్కు పల్కులు. కాని, వారు తిరిగి ప్రళయదినమున లేచు వఱకును, వారివెనుక పెద్దగోడ పెట్టఁబడియుండును.

బూరాపై నాదినమున మ్రోఁత వినఁబడినంతనే సంబంధబాంధవ్యములన్నియు నెగిరిపోవును. వారొండొరుల సహాయమును గోరుకొనఁజాలరు.

ఎవరి త్రాసులు బరువులెక్కునో వారు ధన్యులు,

ఎవరిత్రాసులు చులుకనగునో వారే తమయాత్మలను గోల్పోయి నరకమునఁ జిరకాల ముండఁగలరు.

అగ్ని వారిముఖములఁ గాల్చుచుండ వారి పెదవులుల్లాడుచుండును.

"ఏమి! మేము మాసూచనలను మీకుఁ జూపలేదా? అవి యసత్యములని మీ రనలేదా?" అని యడుగ,

వారలు "ప్రభువా! మాదురదృష్టబలమున మేము త్రోవఁ దప్పితిమి.

ప్రభువా! ఇందుండి మమ్ము తీసివేయుము. ఇఁకముందు మేము పాపములఁజేసినచో మమ్ము పాపాత్ములఁగాఁ బరిగణింపుము." అందురు.

దానికిఁ బ్రత్యుత్తరముగా "దానిలోనికి వేవేగపొండు. నాతో మాట్లాడకుఁడు" అనుశబ్దము వినవచ్చును.

వారిలో మాకింకరులగు వారు కొంద ఉండి "ప్రభువా! మేమునమ్మితిమి. మమ్ము క్షమింపుము. నీవు కరుణాలవాలుఁడవు. మమ్ము కరుణింపుము" అందరు.

110. కాని,మీరు వానిని హేళనఁజేసి తిరస్కరించితిరి. వారును భయసూచనను మఱచునట్లుజేసితిరి, వారిని జూచి మీరు నిరసనజేసి నవ్వితిరి.

వారి యోర్పునకు మెచ్చి యీదినముననే వారిని బహుమానిం చెదము. వా రానందాత్ము లగుదురుగాక!

ఆతఁడు "మీరుభూమిపై నెన్నిసంవత్సరములు మసలితి" రని యడుగ,

వారు "ఒకదినమో, యం దొకభాగమో యుంటిమి. అయి నను లెక్కలువేయు దేవతనడుగు మన,

దేవుఁడు—"మీరు తెలిసికొనినచో మీరచటనుండిన కాలము చాలస్వల్పమే.

ఏమి! మిమ్ములమేము వినోదార్థముగను, నిచ్చటికిఁ దీసి కొనిరాకుండు నుద్దేశముతోడను, సృజించితిమా?" అనెను.

కావున చక్రవర్తియు, సత్యమూర్తియునగు దేవుఁ డుచ్ఛస్థానమునం దుండుఁగాక! అతఁడు తప్ప నింకొక దైవము లేఁడు. అతఁడే సింహాసనాసీనుఁడు!

తనదైవముతోఁబాటు, సాక్ష్యములేనిదే మఱియొకదైవమును బిలుచువాఁడు, తన ప్రభువునకు లెక్క నొప్పఁజెప్పవలెను. ఓహో! విశ్వాసహీనులకు మేలుగలుగదు.

"ప్రభువా! క్షమించి, కరుణింపుము. కరుణాపరులలో నీవే యుత్తముఁడవు" అనుము.



# సురా 24-జ్యోతి.

మదీనా-64 పద్యములు-9 రుకూలు.

## అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

మాయనుమతిచొప్పున నవతరించిన సురా యిది ! మీరు భయపడియుండుటకందు స్పష్టసూచనల నంపియున్నాము.

లంజలకును, లంజలను దార్చువానికిని, చెఱియొక నూఱేసి కొరడాదెబ్బలు కొట్టుము. మీకు దేవునియందును, తుదిదినమునందును, నమ్మకమున్నచో ఈదేవుని శిక్షను జేయక దయదలఁచి విడువకుము. విశ్వాసులలోఁ గొందఱి నాశిక్షను కన్నులారఁ జూడనిమ్ము.

తార్పుకాఁడు లంజను, విగ్రహారాధనాపరురాలినే, వివాహము చేసికొనవలయును. లంజతార్పుకానినే, విగ్రహారాధనాపరునే, పెండ్లి చేసికొనవలయును విశ్వాసుల కిట్టివివాహములు నిషిద్ధములు.

సదాచారవర్తినులపై నిందలుమోపి, యానిందను ఋజువు చేయుటకు నలుగురుసాక్షులను తీసికొనిరాలేనివారి కెనుబదికొఱడా దెబ్బలు కొట్టుము. వీరు దుష్టులుకావున మఱి వీరిసాక్ష్యము నంగీకరింపఁగూడదు.

తరువాతఁ బరితపించి సదాచారవర్తులగు వారివిషయమై యుదివర్తింపఁడు. దేవుఁడు దయాళుఁడు, కరుణాళుఁడు.

తమభార్యలపై నిందమోపి, దానికి తామేతప్ప నితరసాక్షులు లేనివారికి దేవుఁడే వా రసత్యమును వచించినందులకు నాల్గుసార్లు సాక్ష్యమిచ్చును.

ఐదవపర్యాయము నట్టినింద నాతఁడుమోపి యసత్యము లాడినచో దేవునియాగ్రహమునకుఁ బాత్రుఁడగును.

కాని, యామె తనభర్త యసత్యముఁ బల్కుచున్నాఁడని దేవునియాన నాల్గుసారులు చెప్పినచో నామె కాశిక్ష తప్పును.

ఆతఁడు సత్యముఁబల్కినచో నైదవసారి యామె దేవుని యాగ్రహమునకు గుఱియగును.

10 దేవుఁ డనుగ్రహింపఁగలవాఁడును, బుద్ధుఁడునై నీయెడఁగరుణఁ జూపనిచో...............!

## అధ్యాయము-2

సత్యముగా మీలోనివారే యీయనృతముల నాడియున్నారు. కాని, యది మీకుఁ గీడని తలంపకుఁడు. అది మీకు లాభమే. వారిలో నందఱికిని వారువారు చేసికొనినదానిప్రకారము ననుభవము కలుగును. ఆయానేరముల నభివృద్ధి చేయనెంచువానికి ఘోరశిక్ష సిద్ధమైయున్నది.

మీరు దీనిని వినినప్పుడు, మీలో విశ్వాసులగు స్త్రీపురుషులు 'ఇది స్పష్టముగా ననృతమని తమ మనస్సులలో సదభిప్రాయముఁగలిగి యుండిరికదా ?

దానికి వారు నలుగురు సాక్షుల నేల తేలేదు ? వారు సాక్షులను తేలేనియెడల, దేవునియెదుట వారే యనృతవాదులగుదురు.

మీకుఁ దెలియనిదానిని మీ నాలుకలతో నుచ్చరించుచు, నోళ్ళతోఁ బల్కుచు నలుదిక్కులఁ జాటినందుకు, దేవునికి మీపై

ననుగ్రహమే లేకయుండిన, నిహపరలోకములలో నాతనికిఁ గరుణయే లేకయున్నచో, మీకు ఘోరశిక్ష కలిగియేయుండునుగదా! ఇది యేదో స్వల్పవిషయమని మీ రనుకొంటిరిగాని, దేవుని కిది పెద్ద విషయమే.

దానిని విని, "మాకీ గొడవయేల? దేవా, ఇది కేవల మనృత వాదము" అని మీరనలేదా?

మీరు విశ్వాసులైనచో నిట్టిదానిలో మఱిపడవలదని దేవుఁడు మీ కాజ్ఞాపించెను.

దేవుఁడు తన సూచనలను మీకు స్పష్టపఱుచును. అతఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

విశ్వసించినవారికి ఘోరనిందలు కలుగవలయునని యభిలషించు వారి కిహమందును బరమందును గొప్పశిక్ష సిద్ధముగా నున్నది.

దేవుఁడు జ్ఞాని, నీ వజ్ఞానివి.

20 దేవుఁడు దయాదాక్షిణ్యమూర్తియై నిన్ననుగ్రహించి కరుణించియుండకున్నచో!.......!

## అధ్యాయము 3.

విశ్వాసులారా! సైతానుపదముల ననుసరింపకుఁడు. సైతాను పదముల ననుసరించువారి కాతఁడు నీచములు, నిందాస్పదములు నగు వానిని విధించును. దేవుఁడే నిన్ననుగ్రహింపకుండినచో, మీలో నెవ్వరును శాశ్వతముగఁ బవిత్రవంతులరయి యుండరు. కాని, దేవుఁడు తన యిచ్ఛవచ్చిన వానినే పరిశుభ్రునిగఁ జేయును. అతఁడు శ్రోత! జ్ఞాని!

మీలో ధనాఢ్యులును, నుపాధిగలవారును, దమ బంధువులకును, బీదలకును, దేవునివిషయమై దమయిండ్లను విడిచిపెట్టినవారికిని, ఏమియు నీయమని యనఁగూడదు. వారు వారి తప్పులను క్షమించి

పట్టింపకుండ నుండవలయును. దేవుఁడు మిమ్ము క్షమింపవలయునని మీకు లేదా ? దేవుఁడు దయాదాక్షిణ్యమూర్తి !

విశ్వాసినులును, పవిత్రచరిత్రులునునయ్యు, నజాగ్రత్తగనుండి స్త్రీలపై నిందలమోపువా రిహపరలోకముల రెంటను శప్తులగుదురు. వారికి ఘోరశిక్ష సిద్ధముగా నుండును.

ఒకానొకదినమున వారిజిహ్వలును, చేతులును, పాదములును వారిపై సాక్ష్య మీయఁగలవు.

ఆదినమున దేవుఁడు వారికి రావలసినదానిని న్యాయముగ నిచ్చివేయును. అప్పుడు వారికి దేవుఁడు నిర్మల సత్యమూర్తియని తెలియఁగలదు.

దుష్టపురుషులకు దుష్టస్త్రీలును, దుష్టస్త్రీలకు దుష్టపురుషులును; గాని, పవిత్రస్త్రీలకు పవిత్రపురుషులు, పవిత్రపురుషులకు పవిత్రస్త్రీలును గలుగుదురు. వీరునిందల నన్నిటిని బాసియుందురు. వారికి క్షమాపణయు, గౌరవజీవనమును చేకూరును.

## అధ్యాయము 4.

విశ్వాసులారా ! మీయిండ్లలోనికిఁదప్ప నితరగృహములలోని కందుండువారి యనుమతి లేకుండ, వారిని తొలుత నభినందింపక పోవకుఁడు. ఇదిమీకు శ్రేయస్కరము. దీనిని మీరు జ్ఞప్తియందుంచుకొందురుగాక !

ఆగృహములలో మీ కెవ్వరును కనఁబడకయుండిన, అనుమతి లేకుండ లోనికిఁ బోకుఁడు. మిమ్ము, లోనివారు పొమ్మనినఁబోఁబొండు. ఇది మిమ్ము నిందారహితులఁ జేయును. మీరుచేయునది దేవునికిఁదెలియును.

మీకు కావలసినదానిని తెచ్చికొనుటకు, ఎవ్వరును లేని యిండ్ల

కేఁగుటవలన మీకేకీడును లేదు. దేవుఁడు మీరు బయలుపెట్టువానిని, దాచియుంచువానినిగూడ తెలిసికొనుచునే యున్నాఁడు.

30 తమకన్నులను తమస్వాధీనముననే యుంచికొని మితితప్పకయుండుఁడని విశ్వాసులతోఁ జెప్పుము. ఇట్లు వారు మఱింత పవిత్రవంతులగుదురు. వారుచేయునదంతయు దేవునికి బాగుగఁ దెలిసియే యుండును.

విశ్వాసినులు తమ కన్నును తమస్వాధీనములో నుంచుకొని మితిమీఱకయుండవలెనని చెప్పుము. పైయాభరణములను తప్ప లోని యాభరణములను వారుపైకి గనఁబఱుపఁగూడదు. తమ భర్తలు, తండ్రులు, భర్తలతండ్రులు, తమపుత్రులు, తమ భర్తల పుత్రులు, సోదరులు, సోదరుల కొడుకులు, అక్కచెల్లెండ్ర పుత్రులు, వారిస్త్రీలు, దాసీలు, ఖోజాలు, స్త్రీలునగ్నలై యుండుటను గ్రహింపఁజాలని పిల్లలు, వీరియెదుటఁ దప్పఁ దక్కినయెడలనెల్ల స్త్రీలు తమ వక్షస్థలముపై ముసుగును దగ్గఱగఁ దీసికొనియుండి, తమయాభరణములను కనఁబడనీయఁగూడదు. తమ యందెలమోత వినఁబడునట్లు కాళ్ళను చప్పుడుచేయఁగూడదు. విశ్వాసులారా! మీరందఱును దేవునివైక దిరుగుఁడు. మీకు శ్రేయస్సుకలుగును.

మీలో నొంటరిగ నున్నవారిని, మీసేవకురాండ్రలో మంచివారిని, సఖీజనమును, పెండ్లిచేసికొనుఁడు. వారు దరిద్రులైనను దేవుఁడు వారికి భాగ్యమీయఁగలఁడు దేవుఁడు సర్వప్రదాయకుఁడు. జ్ఞాని.

కాని, దారిద్ర్యముచేఁ బెండ్లిచేసికొనలేనివాఁడు, దేవుఁడు తనకు ధనము ననుగ్రహించువఱకు నోర్చియుండవలయును. నీ దాసిస రాండ్రలో నెవ్వతెయైన నిన్నుఁ జేకొనుమనినచో నామె మంచి ప్రవర్తన గలదైనయెడల నట్లేచేసికొని, దేవుఁడు నీకిచ్చియున్న దానిలో నొకభాగ మామె కిమ్ము. నీ దాసిసరాండ్రు తమ మానమును

గాపాడుకొన నెంచినప్పు డిహాలోకసౌఖ్యములకై వారిని వ్యభిచారమునకు నిర్బంధపెట్టకుము. కాని, యాస్త్రీల నిర్బంధముపై వారితోఁ గూడువారిని దేవుఁడు క్షమించి దయఁజూచును.

ఇప్పుడు మేము మీకు స్పష్టసూచనలను, మీపూర్వులయుదాహరణమును, దైవభీతిపరుల కుద్బోధనను దెలియఁజేసియున్నాము.

అధ్యాయము 5.

స్వర్గమర్త్యములకు దేవుఁడు జ్యోతి. అతనిజ్యోతి నక్షత్రమువలె వెలుఁగుచుండు గాజులాంతరువంటి లాంతరుంచు గూడువంటిది. అదియొక ధన్యవృక్షమునుండి వెలుఁగుచుండును. ఆయాలివువృక్షము తూర్పుది కాదు. పడమటిదియుఁగాదు. ఆచెట్టు నూనె యగ్నిస్పర్శలేనిదే వెలుఁగుచుండును. దేవుఁడు తనయిచ్చవచ్చినవారిని తన జ్యోతివంకకుఁద్రిప్పుచు జనులకు భావగర్భితములగు కథలను జెప్పును. అతఁడు సర్వజ్ఞుఁడు.

దేవుఁడు తన స్మరణకొఱకే లేవనెత్తిన దేవాలయమునందు జను లాతనిని సాయంప్రాతలయందు స్తుతింతురు.

అట్టిజనులు వర్తకవ్యాపారములవలన నతని స్మరణను, ప్రార్థనను, విధివిహితభిక్షాదానమును మానక గుండెలు దడదడ కొట్టికొని, కనుగ్రుడ్లు గిఱ్ఱునఁ దిరుగు నా తుదిదినమునకు భయపడుచుందురు.

తమ శ్రేష్ఠకార్యములకు దేవుఁడు బహుమానమిచ్చి వాని నంతకంతకును వృద్ధిచేయునని వారు నమ్మియుందురు. దేవుఁడు తన యిచ్చవచ్చినవారికి కొలఁదిసేయక కావలసినదంతయు నిచ్చుచుండును.

కాని, భక్తిహీనుల కార్యములన్నియు, నెడారిమధ్యమున తృషితులకు నీరను భ్రమకల్పించి, వారచటికి రాఁగానే యేమియులేక దేవునే కనఁబడఁజేయు ఎండమావులువంటివి. దేవుఁడు తా నీయవలసిన

దానిని సంపూర్ణముగ నిచ్చివేయును. దేవుఁ డతిత్వరితముగ లెక్కలు వేయుచుండును.

40. లేదా, యతిగంభీరమగు సముద్రముపై కెరటములపై కెరటములు వచ్చుచుండ, వానిపైఁ జీఁకటియు, దానిపైఁ దిరిగి చీఁకటియుఁ గప్పికొనినట్లుండును. మనుష్యుఁడు చేయిచాచును గాని, సరిగ నది కంటఁబడదు! దేవుఁడు వెలుతురీయనివానికి, మఱి వెలుతురే లేదు.

అధ్యాయము. 6

స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవు నెట్లు స్తుతించుచున్నదో నీకుఁ గనఁబడదా? పక్షు లెగురుచు నెగురుచు నాతని స్తుతించుచున్నవికావా? తా నేమి ప్రార్థనచేయవలెనో, యెట్లుస్తుతింపవలెనో ప్రతిజంతువునకును దెలియును. అవిచేయునది దేవుని కెఱుక.

స్వర్గమర్త్యాధికారము దేవునిదే. తుదకందఱు నతనినే చేరవలసియున్నది.

దేవుఁడు మేఘములను తొలుత మెలమెల్లగ నడిపించి, పిదప వానినొకచోఁ జేర్చి తరువాత నొకదానిపై మఱియొకదానిని దొంతరలుగఁ గూర్చుచుండుట నీవుచూడలేదా? అప్పుడు వానిమధ్యనుండి వర్షము దిగును. పర్వతములవంటిమేఘములను వడగండ్లచే పూరించి, స్వర్గమునుండి దిగఁజేసి వానిని తనయిచ్చవచ్చినవారిపై నాతఁడు పడఁజేయును. ఇష్టమువచ్చినవారినుండి వానిని తప్పించును. అతని మెఱపు కన్నులు మిరుమిట్లుకొలిపి దృష్టి నపహరించునేమో యున్నట్లుండును.

దేవుఁడు రాత్రింబవళ్ళ నొకదానివెనుకనొకటిగ వచ్చునట్లు చేయును. అంతశ్చక్షువులకిందు బోధకానరాదా?

దేవుఁడన్నిజంతువులను నీటియందు సృష్టించినాఁడు. అందు

లోఁ గొన్ని జంతువులు కడుపుపైఁ బ్రాకును. కొన్ని రెండుపాదములపైనను, మఱికొన్ని నాలుగుపాదములపై నను నడుచును, దేవుఁడు తనయిచ్చవచ్చిన దానినెల్ల సృష్టించినాఁడు. అవును. అతనికన్ని వస్తువులపైనను శక్తిగలదు.

ఇప్పుడు మేము స్పష్టసూచనల నంపియున్నాము. దేవుఁడు తన కిష్టమైనవారిని సరియగు త్రోవలోనికిఁ దీసికొనిపోవును.

కొందఱు "దేవుని, నాతనిప్రవక్తను నమ్మి వారిని మన్నింతు" మందురు. అయినను గొందఱు వెనుదిరుగుదురు. వీరు విశ్వాసులలోని వారుకారు.

వారిని బరీక్షించుటకై దేవుని యొద్దకును, నాతని ప్రవక్త యొద్దకును, పిలుచునప్పుడు కొందఱు వెనుకకు మఱలిపోవుదురు.

వారి పక్షమునసే సత్యమున్న యెడల వారు తప్పక నమ్రులై వచ్చియుందురు

50 ఏమి! వారి హృదయములకు రోగముపట్టినదా? వారు సందేహించుచున్నారా? దేవుఁడును, నాతని ప్రవక్తయు, వారికన్యాయము చేయుననుకొనుచున్నారా? లేదు. వారేయన్యాయవర్తనులు.

అధ్యాయము 7.

విశ్వాసులను దేవుని యొద్దకు, నతనిప్రవక్తలయొద్దకు తీర్పు చెప్పుటకు పిలువఁగా 'మాకు వినబడినది. విధేయులమగుచున్నాము, అనియందురు. వీరికే శ్రేయస్సుకలుగును.

దేవుని, నతని ప్రవక్తను మన్నించి వారికి భయపడి యుండు వారే యానందమనుభవింపఁగలవారు.

నీవు వారికి మాటనిచ్చిన యెడల తాముతప్పక వెడలివచ్చెదమని దేవునియాన వారు ఘోరప్రమాణమును చేసి యున్నారు. "ఖార్థు

ప్రమాణములు చేయకుఁడు. మన్నించియుండుటయే శ్రేష్ఠము. దేవు నికి మీరుచేయునదంతయు విశదమేకదా !" అనుము.

"దేవుని నతనిప్రవక్తనుమన్నింపుఁడు. మీరొకవేళమరలిపోయి నను, వానిభారము వానిపైననే యుండును. మీవిధిభారము మీపైననే యుండును. మీరు మన్నించినచో రక్షణదొరకును. కాని, ప్రవక్త చేయఁగలిగినది స్పష్టముగ బోధపఱుచుటయే" యనుము.

మీలో విశ్వాసులై క్రమవర్తనులగు వారికి వారిపూర్వుల కెట్లీభూమినిచ్చియుండెనో యట్లేతమకును నిత్తుననియు, వారికి సంతోష కరమగు మతమునందే నెలకొల్పుదుననియు వారిభయములఁబోగొట్టి భద్రముచేకూర్తుననియు, దేవుఁడువాగ్దానము చేసియున్నాఁడు. "వారు నన్నారాధింపవలయును. నాతో వారితరులఁ జేర్పఁగూడదు. ఇఁకమీఁద నైనను విశ్వసింపనివారే భక్తిహీనులు.

కాని, మీరు కరుణాపాత్రులు కాఁదలఁచినచో ప్రార్థనదప్పక, విధివిహితభిక్షమునొసగి ప్రవక్తను మన్నింపవలయును."

దేవునిఁదనభూమిపైననే బలహీనునిఁ జేయఁగలమని యవిశ్వా సులుతలంపకుందురుగాక ! వారికగ్నియే యావాసము. అచటికి ప్రయా ణము కడుదుఃఖకరము !

## అధ్యాయము. 8.

విశ్వాసులారా ! మీబానిసలును, యుక్తవయస్సురానివారును, మీసమక్షమునకు రాకపూర్వము మూడుసార్లు, అనఁగా ఉదయప్రార్థనా సమయముననను, మధ్యాహ్నము మీదుస్తులను తీసివైచియున్నప్పు డును, సాయంప్రార్థనాసమయముననను, మీయనుమతిఁ బడయ వలయును. ఈమూఁడుకాలములయందును మీ రేకాంతముగనుందురు. ఈ సమయములందుఁదప్ప నితరసమయములందు మీరొకరి నొకరు

చూచికొనుటకు వెళ్ళుచుండునప్పుడు వారుమీయనుమతిలేకపోయినను మిమ్ము దర్శించుటవలన, మీకుఁగాని వారికిఁగాని దోషములేదు. దేవుఁ డిట్లే తనసూచలను స్పష్టముచేయుచుండును. దేవుఁడు జ్ఞాని. బుద్ధుఁడు.

మీపిల్లలు యుక్తవయస్కులైనను తమ పూర్వు లడిగినట్లే తామును మీయొద్దకు వచ్చుట కనుమతిఁబడయ వలయును. దేవుఁ డిట్లే తన సూచనలను మీకుఁ దెలియజేయుచుండును. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు !

60 పిల్లలనుకనుకాలముదాఁటిపోయి, మఱి పెండ్లి యాడుటకు వీలు లేనిస్త్రీలు, తమ యాభరణములు కనఁబడకుండ పైవస్త్రములను తీసి వేసికొనినను దోషములేదు. అయినను వారట్లు చేయ కుండుటయే మంచిది. దేవుఁడు శ్రోత, జ్ఞాని.

గుడ్డివారును, కుంటివారును, రోగులును మీతోఁగలిసి భోజనము చేయుట దోషముకాదు. మీరు మీయిండ్లలోను, మీతండ్రులు, తల్లులు, సోదరులు, అక్కచెల్లెండ్రు, పినతండ్రులు, తండ్రివంక యత్తలు, వీరి యిండ్లలోను, మీయొద్ద బీగములున్న యిండ్లలోను, మీస్నేహితులయిండ్లలోను భోజనము చేయుట దోషముకానేరదు. మీరందఱుఁగలిసి భుజించినను వేర్వేఱ భుజించినను తప్పులేదు. మీ రిండ్లలోనికిఁబోవునప్పు డొకళ్ళొకళ్ళను దేవునినుండివలె నభినందించు కొనుఁడు. మీరు బోధపఱుచుకొందురుగదాయని దేవుడు తనసూచనల నిట్లు స్పష్టముచేయుచుండును.

## అధ్యాయము 9.

దేవుని నతనిప్రవక్తను నమ్మి యాతనియొద్ద కేదైన పని మీఁద వెళ్ళినప్పు డాతనియొద్ద సెలవుపుచ్చుకొననిదే లేచిపోవనివారే కదా విశ్వాసులు. అవును, నీయొద్ద సెలవుపుచ్చుకొనువారే దేవుని

నతని ప్రవక్తను నమ్మినవారు. తమకు పనియుండి నీయొద్దసెలవు పుచ్చుకొనువారికి సెలవిచ్చి, వారికై దేవునియనుగ్రహమును వేఁడుము. దేవుఁడనుగ్రహించువాఁడు. కరుణాళుఁడు.

మీలో మిమ్ముఁ బిలుచుకొనునట్లు ప్రవక్తను పిలువఁగూడదు. సభలలోనికి వచ్చి యితరుల చాటుననుండి మెల్లగ జాఱిపోవువా రెవరో దేవుని కెఱుక. ఆతనియాజ్ఞ నుల్లంఘించువారికి ప్రస్తుత మొక యాపదయో యిఁకముందు ఘోరశిక్షయో కలుగునని తెలిసి కొందురుగాక !

స్వర్గమర్త్యముల నున్నదంతయు దేవునిదేకదా? మీస్థితి యత నికిఁ దెలిసియేయున్నది. ఒకదినమున మనుష్యులందఱు నాతని యొద్దకే వత్తురు. అప్పుడు మీరుచేసిన పనుల నాతఁడు మీకెఱింగించును. దేవుఁడు సర్వజ్ఞుఁడు.

---

# సురా 25. అల్ ఫుర్ కాన్ లేక ఏర్పాటు.

---

మక్కా-77 పద్యములు-6 రుక్కూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

సర్వజాతులకును భయసూచనగా తనకింకరునకు ఏర్పాటును (అల్ ఫుర్కానును) పంపిన యాతఁడు ధన్యుఁడగుగాక !

స్వర్గమర్త్యాధిపత్యమాతనిదే. ఆతనికి పుత్త్రుఁడు పుట్టలేదు. ఆతని రాజ్యమున మఱియెవ్వనికిని వంతులేదు. ఆతఁ డన్నివస్తువులను సృష్టించి వానిగతులను నిర్ణయించియున్నాఁడు.

అయినను దేవునిగాక తామే సృష్టినొంది దేనినిగూడ సృష్టింపని దైవములను వారు స్వీకరించియున్నారు. మంచికిఁగాని, చెడునకుఁగాని, యాదైవములకు తమపైఁ దమకే శక్తిలేదు. పుట్టించుటకును, గిట్టించుటకును, చచ్చినవానిని లేవనెత్తుటకును, వారికి శక్తిలేదు.

అవిశ్వాసకులు "ఖురా నతఁడు సృష్టించిన మోసము గాక మఱియొకటిగాదు. ఇచటి కన్యాయముగను, అసత్యవాదిత్వము వలనను వచ్చిన వా రామోసమును కల్పించుటయందు తోడ్పడినారు.

తాతలనాఁటి ప్రాఁతకథల నన్నిటిని నతఁడు వ్రాసిపెట్టియుంచినాఁడు. రాత్రింబవ ళ్ళెవరో యతనిని దీనినివ్రాయుమని చెప్పియున్నా" రందురు.

"స్వర్గమర్త్యముల రహస్యముల నెఱింగినవాఁడు వీనిని పంపియున్నాఁడు. అతఁ డుదారశీలుఁడు. దయామయుఁడు" అనుము.

వారు, "వీఁ డెట్టిప్రవక్త? తిండితినుచు వీథులలోఁ దిరుగుచున్నాఁడు. వీనితోఁబా టొకదేవతయువచ్చి యాభయసూచనల నీయకున్నను,

ఆతనికి ధనము పైనుండి యింతపడకున్నను, తన యాహారమునకొక తోఁట వానికి లేకున్నను, మేమీతని విశ్వసింప" మందురు. ఆ యన్యాయపరులు "మీ రీ యింద్రజాలమునకు లోఁబడినవాని ననుసరించుచున్నా" రందురు.

వారు ని న్నెట్టివారితో సరిపోల్చుచున్నారో చూడుము. అయినను వారు దారితప్పి, దానిని తిరిగి కనుఁగొనలేకున్నారు.

### అధ్యాయము 2

10 ఆతని కిష్టమైనచో వారుచెప్పిననదులు ప్రవహించుచుండు వనములే కాక యింకను మేలగు వస్తువులఁ బ్రసాదింపఁగలయాతఁడు

ధన్యుఁడగుఁగాక ! అతఁడు నీకు గొప్ప గుడారములను దయ సేయఁగలఁడు.

ఓహో! ప్రళయకాలమాసన్నమగుట యసత్యమని వారితలంపు. కాని, యీప్రళయ కాలాగమన మసత్యమను వారికి ప్రజ్వలించు నగ్నిని సిద్ధపఱిచియున్నాము.

అదిదూరమునుండికనఁబడినంతనే వారికి దాని ఘోష వినబడును.

వారు దానిలో నొకమూల బంధింపఁబడి పడియున్నప్పు డున్న చోటనే నాశనము నొందఁగలరు.

" ఈదినమున నొక్క నాశనమే కాదు. అనేకనాశనములు కలుగ నున్నవి.

"దైవ భీతులగు వారికొసగఁబడు శాశ్వతస్వర్గమా, యిదియా మేలు ?" అనియడుగుము. అదియే వారికి బహుమానము. అదియే వారికి రక్షానిధానము.

వా రంగు శాశ్వతముగ వసించి, తాముకోరినదంతయు ననుభ వించెదరు. నీప్రభువునుండి నీవుకోరికొనిన దిదియే.

వారినాదఱను, దేవుఁడుగాక యితర దైవములఁగొలిచిన వారిని నాతఁడొకచోఁజేర్చి "నాసేవకులను త్రోవతప్పించినవారు మీరా, లేక వారంతట వారే త్రోవతప్పిరా ?"

అనియడుగ వారు "నీకు జయమగుఁగాక ! నిన్నుఁదప్ప నితర ప్రభువులఁ జేపట్టుట మాకుతగనిపనియే. కాని, వారికిని, వారిపూర్వుల కును భోగ్యవస్తువుల నవ్వారిగానొసగి, వారునిన్నుమఱచి నాశన యుక్తులగునట్లు చేసితివి" అందురు.

అప్పుడుదేవుఁడు విగ్రహారాధకులఁజూచి "వారు మీచెప్పిన దంతయు వృథచేసిరి. మీశిక్షనుతప్పించుటకుఁగాని మీకుసహాయపడు టకుఁగాని, వారికి శక్తిలేదు" అనును. మీలోనెవ్వరైన నిట్టియుపచా రము చేసినచో గొప్పశిక్ష ననుభవింపఁజేతుము.

20 మేముపూర్వముపంపిన ప్రవక్తలందఱును మీవలె నేయన్నముఁ దిని, వీథులలోఁదిరిగిన వారే. మీలో నొకరివలన మఱియొకరిని శోధింపఁజేతుము. మీప్రభువు చూచుచున్నాఁడు.

---

# కాండము. 19

---

## అధ్యాయము 3.

మీరు దృఢచిత్తులరై యుందురా? మమ్ముచేరఁబోమని తలంచువారు "దేవతలు మాయొద్దకు వచ్చుటయో, మాప్రభువును మేము చూచుటయో, జరుగనియెడల మేమునమ్మము" అందురు. అయ్యో! వారపరిమితగర్వాక్రాంతులై యున్నారే!

వారు దేవతలను జూడఁగలదినమున దుష్టుల కెట్టిమంచి వార్తయువినఁబడక "అయ్యో! దాఁటశక్యముగాని యడ్డుగలిగినదే" యని మొఱపెట్టుదురు.

తరువాత వారు చేసినకర్మలను మేము పరిగణించి వారిని విరజల్లిన యిసుకవలె చేసెదము.

నందనవనవాసులు మాత్ర మాదినము సుఖతరులై మధ్యాహ్నము పరుండుటకుమంచివసతి కలిగియుందురు.

ఆ దినమున స్వర్గము మేఘములతోఁ జీలియుండ, దేవతలు పంపఁబడుచుండ, నవతరించెదరు.

ఆదినమున రాజ్యమంతయు దయానిధియగు దేవుని యధీన

మగును. అవిశ్వాసకుల కది కష్టదినమగును.

దుష్టుఁడాదినమున చేతులు గఱచికొనుచు "అయ్యో! ప్రవక్తమార్గమును మే మేల యనుసరింపమైతిమి!

అయ్యయ్యో! అట్టివానిని మాస్నేహితునిగా నేల చేసికొంటిమి!

మాకు చేరినభయసూచననుండి తప్పుత్రోవను బెట్టినవాఁడాతఁడే. పిశాచియే మనుష్యుని మోసపుచ్చువాఁడు" అనును.

30 అప్పుడు ప్రవక్త, "ప్రభువా! నిజముగా నాప్రజలు కురాను వృథాభాషణయుక్తమైన దందు" రనెను.

ఇట్లే ప్రవక్తల కందఱికిని దుష్టులయందు శత్రువుల నేర్పఱిచితిమి. కాని, నీప్రభువు రక్షకుఁడును, సహాయకుఁడునునై యున్నాఁడు.

అవిశ్వాసకులు "కురానంతయు నొకసారిగా నాతనికి పంపఁబడకపోయినచో మేము నమ్మము," అందురు. కాని, యీరీతిగా నీహృదయమును దానియందు స్థిరపఱిచెదము. దానిని మీకు ఖండఖండములుగా పంపితిమి.

వారు నిన్ను చిక్కుప్రశ్నలనడుగుదురు. మేమును మీయొద్దకు సత్యమును బంపి ప్రశ్నల కుత్తరమిచ్చెదము.

నరకములోని కధోముఖులై చేరినవా రతిహీనమగు స్థలమున నుండి సుఖప్రదేశమునకు మిక్కిలి దూరముగా నుందురు.

## అధ్యాయము 4.

ఇంతకుపూర్వము మూసాకు ధర్మమునిచ్చి యాతని కుపదేశకునిగా నాతని సోదరుఁడగు హారూనునిచ్చి,

"మాసూచన లసత్యములనినవారియొద్దకు మీరువెళ్ళుఁడు" అని వారిని సంపూర్ణముగ నాశనము చేసితిమి.

నూహుప్రజలును తమ ప్రవక్తలను మిథ్యాపురుషులుగా

గణింప, వారినినీటముంచి చంపితిమి వారిని మనుష్యజాతికి సూచనగాఁ జేసితిమి. దుష్టులకు ఘోరశిక్ష నాయత్తపఱిచియున్నాము!

ఆద్, సామూదు, రాస్ప్రజలు, వారిమధ్యననేకతరములవారు.

వీరందఱికిని కథలనుచెప్పి, భయ సూచనల నిచ్చి, యందఱిని సంపూర్ణముగ నాశనముచేసితిమి.

40. అవిశ్వాసులగు మక్కావాసు లింతకుపూర్వ మెన్నోసారులు మేము ఘోరవర్షము గురియించిన నగరముప్రక్క నుండి వెళ్ళియుండిరి. ఏమి, వారుదానిని చూడలేదా? వారికింక రక్షణపై నాశలేదు.

వారు నిన్నుజూచి గేలి సేయుటయే ప్రధానముగా నెంతురు. "ఏమి, యితనినా దేవుఁడు ప్రవక్తఁగాఁబంపియున్నాఁడు?

మేము మాదైవముల యందు దృఢభక్తిగలిగి యుండనిచో నాతఁడు మనలను త్రోవతప్పింపవలసినవాఁడే" అనివారందురు. కాని, వారి కంతకాలమందు శిక్షకనఁబడుచుండఁగా నెవరుమిక్కిలిగా త్రోవ తప్పిరో తెలియఁగలదు.

నీ వేమనుకొనుచున్నావు? తన కోరికలనే దైవముగా నెంచిన వానికి నీవు సంరక్షకుఁడవౌదువా?

వారిలో చాలమందికి, విని, బోధపఱుచుకొను శక్తి కలదనుకొను చున్నావా? వారుపశుప్రాయులు! అవును! వారుక్రమమార్గమును విడిచి యింకను దూరముగపోయెదరు.

అధ్యాయము 5.

నీప్రభువు నీడ నెట్లుపొడిగించునో నీవు చూచుచుండలేదా? అతనికిష్టమైనచో దానిని కదలకుండఁ జేసియుండును. కాని, దానికి సూర్యుని మార్గవిధాతగా నేర్పఱిచి,

పిదప సులభముగా దానిని ముడిచికొనఁజేసెదము,

రాత్రి వ్యసనముగను, నిద్ర విశ్రాంతిగను, పగలు జీవములతో మేల్కొనునట్లుగను చేసినవాఁడాతఁడే.

అతఁడే తనదయాధారయగు వర్షాగమనసూచకముగా గాలిని పంపుచున్నాఁడు. మృతధాత్రిని పునర్జీవింపఁజేయుటకు మేము స్వర్గము నుండి నిర్మలోదకమునంపుచున్నాము.

ఆజలమును, మాసృష్టియందలి మనుష్యజంతుసంతానములకు త్రాఁగనిచ్చెదము.

50. దానినందఱికిని సరిపోవునట్లన్ని దిశలకునుపంపెదము. ఇందువలన వా రాలోచించుకొందు రేమో యనుకొంటిమి. కాని, వారిలో చాల మంది కృతఘ్నులుగనే యుందురు.

మా కిష్టమైనచో నగరనగరమున కొక ప్రవక్తను బంపి యుందుము.

కావున నవిశ్వాసకులకు లోనుగాక యీకురానుబలమున వారితో పోరాడుము.

అతఁడే యిత్తు, లవణసముద్రములు రెండును, గట్టుదాఁటి పారలి యేకమగునట్లుచేసి, యారెండింటిమధ్యను నెడముంచి, యాగట్టును దాఁటరానిదానిగాఁ జేసినవాఁడు.

అతఁడే మనుష్యుని నీటితో నిర్మించి వారియందు సంబంధ బాంధవ్యముల నేర్పఱిచినాఁడు. నీప్రభువుసర్వశక్తుఁడు.

అయినను వారు దేవునిఁగాక, మేలునకుఁ గాని, కీడునకుఁగాని, సమర్థులు కానివారిని సేవింతురు. అవిశ్వాసి తనప్రభువున కెదురుగా పిశాచమునకు తోడ్పడుచుండును.

అయినను నిన్ను వైతాళికునిగ ముందుగ భయసూచన నిచ్చుటకే పంపియున్నాము.

" మీరు నాకు దీనికై యెట్టిబహుమానమును నీయనక్కఱ

లేదు. ప్రభువునొద్దకు మార్గముఁబట్టి నెంచిన వాఁడే నన్ను బహూకరింపఁగలవాఁడు.

ఆ యమరునియందు నమ్మకముంచి యాతని స్తుతింపుము. ఆఱుదినములలో స్వర్గమర్త్యములను, తదంతరాళమును సృజించి,

పిదప, సింహాసనాసీనుఁడై యున్న దయానిధియగు దేవుని కాతని సేవకుల తప్పులన్నియు సంపూర్ణముగఁ దెలిసియేయున్నవి. ఆతనిగూర్చి బుద్ధిమంతుల నడిగి తెలిసికొనుము.

60 కాని, వారితో "దయానిధియగు దేవునికి నమస్కరింపుఁ" డన వారు "ఆ దయానిధియగు దేవుఁడెవ్వఁడు? నీవాజ్ఞాపించిన వానికి మేముఁనమస్కరింతుమా?" యని నిన్నునుండి మఱింతదూరముగా తొలఁగిపోయెదరు.

## అధ్యాయము 6.

స్వర్గమునందు రాశిచక్రముంచి, సూర్యుని దీపముగ నియమించి, చంద్రుఁడు వెలుతురు నిచ్చునట్లు చేసిన యాతఁడు ధన్యుఁడగుఁగాక! దేవుని దలంచుచు, కృతజ్ఞులై యుండనిచ్ఛగించిన వారికి రాత్రింబవళ్లొకదానితరువాత మఱియొకటి వచ్చునట్లుగా విధించిన వాఁడాతఁడే!

భూమిపై శాంతులై సంచరించువారే దయానిధి యగు దేవుని సేవకులు. తెలివితక్కువవారితో వారు స్వస్తివాక్యములఁ బల్కెదరు.

రాత్రిపూట సాష్టాంగపడుచు, నిలుచుండియు ప్రభువునారాధించువారును,

"ప్రభువా! అనంతమగు నరకబాధనుండి మమ్ము విముక్తులఁ జేయుము.

ఆదిమాకు దుఃఖావాసము " అనియనువారును,

వ్యయముచేయునప్పు డమితముగను, లోభముగను నుండక, సమదృష్టితో దానముచేయువారును,

దేవునితప్ప నితర దైవములకు మొఱలిడక, న్యాయమగు దాని కొఱకుతప్ప, దేవుఁడు చంపఁగూడదనువానిని చంపక, వ్యభిచరించినచో తమదౌష్ట్యమునకు ఫలము ననుభవింపఁగలమనియు,

రక్షణదినమందు శిక్ష యినుమడింప, నందే శాశ్వతకాల మవ మానితులమై యుండఁగలమనియు,

70 పశ్చాత్తప్తులై, విశ్వసించి, పుణ్యకార్యములం జేసినచో నుదార వంతుఁడును, దయానిధియునగు దేవుఁడు చెడువస్తువులను మంచి వానినిగాఁ జేయుననియు,

దేవునివైపు తిరిగి సత్కర్మల నాచరించినచో నిశ్చయముగా మనస్సులు మాఱుననియుఁ దలంచువారును,

అన్ృతకార్యములకు సాక్షులుగాక, కేవలము వినోదక్రియలను జూచి వానిజోలికిఁబోక, గొప్పబుద్ధితో సంచరించువారును,

తమప్రభువునుండి వచ్చిన సూచనలను విని చెవిటివారును, నంధులును వలె పడియుండనివారును,

" ప్రభువా! మాభార్యలను, పుత్త్రిలను, నేత్రానందదాయ కులఁజేసి, నీకుభయపడువారికి మ మ్మాదాహరణప్రాయులుగఁజేయు" మనువారును,

వీరందఱును తమనిశ్చలభక్తికి ఫలముగా స్వర్గమున నుచ్చ స్థానములనొంది, యచట నాదరముతో నాహ్వానింపఁబడి,

సుఖావాసమును, విశ్రాంతిస్థలమును నగు నచటనే శాశ్వత ముగా వసింపఁగలరు.

"నీ వాతనికి మొలిలిడనిచో నీకొఱ కాప్రభువు లక్ష్యపెట్టఁడు. ఆతని పవిత్రను వీరారు మిథ్యావాదిగాఁ బరిగణించి యున్నారు. కాని, సకాలమున వారికి శిక్ష కలుగఁగలదు" అనుము.

---

# సురా 26 – కవీశ్వరులు.

---

మక్కా - 228 పద్యములు - 11 రుకూ్కలు.

అధ్యాయము 1

దయాదాక్షిణ్యమూర్తియగుదేవుని పేర.

త. సీన్. మీామ్.

ఇవిస్పష్టగ్రంథములోని సూచనలు.

వారు విశ్వసింపరని నీవువిచారముతోఁ గృశించిపోవుచున్నావు కాఁబోలును.

మాకిష్టమైన యెడల మే మొకసూచననుబంపి వారిని నమ్రులఁ జేసియుందుము.

కాని, మేమిచ్చినసూచనలనన్నిటిని వారు పెడచెవినిబెట్టి,

అసత్యములుగా వారు పరిగణించియున్నారు. కాని, వా రపహాస్యము చేయుఁజాలనివార్త యొకటి వారికి వినఁబడఁగలదు.

ఈభూమిపై సత్యుత్తమములగు మొలకలను పుట్టించియుండుట వారు చూడలేదేమో ?

నిజముగా నిదియొకసూచన - కాని వారుదానిని విశ్వసింపరు.

నిశ్చయముగా నీప్రభువు శక్తిమంతుఁడు. కరుణాళుఁడు.

## అధ్యాయము 2.

10 దీనిని జ్ఞాపక ముంచుకొనుము. నీప్రభువు మూసాను బిలిచి "దుష్టులగు ఫిరౌనుజనులయొద్ద కేఁగుము.

ఏమి, వారికి నేననిన భయము లేదా ?"

అన నాతఁడు "ప్రభువా! న న్నసత్యవాదిగా వారు తలంతురేమో యని నాకు భయమగుచున్నది.

నేను కుంచితహృదయుఁడను. మందభాషిని. కావున నాకు సహాయునిగా హారూనును బంపుము.

వారు నాపై నొక నేరమును మోపి యున్నారు. నన్ను చంపెద రేమోయను భీతిగలుగుచున్నది" అనెను.

దేవుఁడు "అట్టిభయ మేమియు లేదు. కావున మాసూచనలను తీసికొనిపొమ్ము. మేముమీప్రక్కనేయుండియంతయునువినుచుందుము.

నీవు ఫిరౌను నొద్ద కేఁగి 'నిజముగా మేముప్రపంచాధినాథుని దూతలము.

మాతో నిస్రాయేలు ప్రజలనుబంపుమనెను" అనెను.

ఫిరౌను మూసాతో "నీచిన్నతనమునన్నిన్ను మేము పెంచ లేదా ? నీజీవిత కాలమునఁజాలవత్సరములు మాతోఁ గడుప లేదా ?

అట్లుండియు నిదేమి చేయుచున్నావు ? నీవు కృతఘ్నుఁడవా?" యనియడుగ,

అతఁడు "నీవన్నది నిజమే. నేను త్రోవ తప్పినవారిలో నొకఁడనే.

20 మీకు భయపడి పాఱిపోయితిని. కాని, నాప్రభువు నాకు బుద్ధిని ప్రసాదించి, తనదూతలలో నొకనిగా నన్ను చేసినాఁడు.

ఇస్రాయేలు ప్రజలను బానిసలగాఁ జేయుటయా, నీవు నాకు చేసిన యుపకారము ?" అనెను.

ఫిరౌను "అయిన ప్రపంచాధినాథుఁ డెవ్వఁడు ?" అని ప్రశ్నించెను.

మూసా "నీవు నమ్మినయెడల స్వర్గమర్త్యములకును, వానిమధ్య నుండు ప్రదేశమునకును నాథుఁడగువాఁడే ప్రపంచాధినాథుఁడు" అనెను.

ఫిరౌను తన చుట్టుపట్లవారితో "మీరు దీనిని వినుచున్నారా?" అనెను.

మూసా " అతఁడే నీకును, నీతాతముత్తాతలకును ప్రభువు" అనెను.

ఫిరౌను "అతఁడు మీయొద్దకుఁ బంపినదూత! పిశాచగ్రస్తుఁడు కాఁబోలు !" అనెను.

మూసా "నీవు తెలిసికొనఁగలిగినచో నాతఁడు తూర్పునకును పడమటికిని, ఆ రెండిటికి మధ్యనున్న సర్వమునకును నాథుఁడు" అనెను.

ఫిరౌను "నన్నుఁగాక మఱియొక దేవుని నీవు తీసికొనివచ్చిన యెడల నిన్ను బంధీకృతినిఁ జేసెదను" అని పల్కెను.

30 మూసా "ఏమి! నాయాగమనహేతువునకు సాక్ష్యముగా నేను దేనినైనను జూపినను సల్లే చేసెదవా ?" యని యడిగెను.

ఫిరౌను "నీవు సత్యవాదివైనచో నదేదో యాసాక్ష్యమును వెంటనే చూపుము" అని గద్దించెను.

అప్పుడాతఁడు తన చేతిదండమును క్రిందవైవ నది యొక సర్ప మయ్యెను.

తనచేతిని పైకిఁ దీయఁగనే యది చూచువారికిఁ దెల్లఁగాఁ గనఁబడెను.

## అధ్యాయము 3.

అంత ఫిరౌను తన్నుఁ గొలిచియున్న సామంతులతో "వీఁడు నిజముగా మాయలమారియగు నైంద్రజాలికుఁడు,

తనతంత్రములవలన మిమ్ము మీదేశమునుండి పాఱఁద్రోలఁ గలఁడు. మీ రేమి చేయుమందురు" అని యడుగ,

వారు "ఈతనిని, ఇతనిసోదరుని, కొంతకాలము విడిచిపెట్టి వాడవాడలనుండియు,

మాంత్రికుల నిచటికి కాహ్వానముచేయ దూతలఁబంపు" మనిరి.

అంత నొకశుభదినమున నిర్ణీతకాలమున మాంత్రికులందఱు నొకచోఁ గూడిరి.

ప్రజ లందఱును గూడి,

40 ఈమాంత్రికు లీదినమున జయముగాంచిన-చో వారినే యనుసరింతు" మనిరి.

మాంత్రికులు ఫిరౌను నుద్దేశించి "మేము విజయులమైనచో మమ్ము బహూకరింతువా ?" యని యడుగ,

ఆతఁడు "తప్పక యట్లే చేసెదను. అప్పుడు నిశ్చయముగా మిమ్ము నాసమీపవర్తులగాఁ జేసికొందు" ననెను.

మూసా వారితో "మీరు క్రింద దేనిని పడవైచెదరో పడ వేయుఁ" డనెను.

వారు తమత్రాళ్ళను దండములను త్రోసివైచుచు" ఫిరౌను శక్తివలన మేము విజయము గాంచఁగల" మనిరి.

అంతట మూసా తనదండము క్రిందవైవ నదివారు కృత్రిమముగాఁజూపిన యద్భుతవస్తువులను మ్రింగివైవఁ దొడంగెను.

మాంత్రికులును మోకాళ్ళూంబడి,

"మూసా హారూనుల ప్రభువగు,

ప్రపంచాధినాథుని విశ్వసించుచున్నా" మని యారాధింపఁ దొడఁగిరి.

ఫిరౌను వారితో "ఏమి ! మాయనుజ్ఞ లేనిదే మీ రాతని విశ్వసించుచున్నారా ? మీకింద్రజాలమును నేర్పినవాఁడుగదా మీ యజమాని. కానిండు. కర్మేమి నాశక్తి మీకు బోధపడఁగలదు. మి మ్మొకప్రక్క చేతులను, నొకప్రక్క కాళ్ళను ఛేదించి సిలువవేయిం చెదనని భయపెట్టెను.

50 వారును "దానివలన మా కేహానియుఁ గలుగఁబోదు. మేము మాప్రభువునొద్దకేకదా మఱలిపోయెదము.

మేమాతని విశ్వసించినవారిలో ప్రథములము గావున, మా ప్రభువు మాపాపములను క్షమించునని మాకు నమ్మకముగల" దనిరి.

అధ్యాయము 4.

అప్పుడు మేము మూసాతో "నీ వీరాత్రియే నాకింకరులతో వెడలిపొమ్ము. నిన్ను వారు వెంటఁబెట్టెద" రని యనుజ్ఞ నిచ్చితిమి.

ఫిరౌను ప్రతిపురమునకును దూతలనంపి,

"ఈ యిస్రాయేలు లల్పసంఖ్యాకులయ్యును,

మాపై కుపితులై యున్నారు.

కాని, మేమును చాలమందిమి - జాగ్రత్త గలవారముగదా" యని చాటఁబంచెను.

ఈరీతిగా వారు తమయుద్యానవనములను, సెలయేళ్ళను,

ధనరాసులను, దివ్యభవనములను విడుచునట్లు చేసి,

మే మిస్రాయేలు సంతతివారికి దానిపై వారసత్వమును కల్పించితిమి.

60 అంత సూర్యోదయకాలమున నీజిప్టు (మిసిరు) దేశస్థులు వారిని వెంబడింప నారంభించిరి.

ఉభయసైన్యములు నన్యోన్యావలోకనము చేసికొనినప్పుడు మూసామిత్రులు "అదిగో, వారు మనపైఁ బడినా" రని మొఱ పెట్టిరి.

మూసా "అ దెట్లగును? నాప్రభువు నాతోనున్నాఁడు. అతఁడు నాకు దారి చూపఁగలఁ" డని వారికి దిట్టదీర్చెను.

అప్పుడు మేము మూసాతో "సముద్రమును నీదండముతో స్పృశింపు" మని యాజ్ఞాపింప నదియు రెండుచీలికలై యాకొక్కొక్క భాగ మొక యున్నతపర్వతముగా మాఱిపోయెను.

అప్పుడు మూసా మిత్రులును, అనుచరులును,

సురక్షితముగా దాఁటిపోయిరి.

శత్రువులు నీటిలోఁబడి మడిసిరి.

సత్యముగా నిదియొక సూచనయే కాని, వారు దానిని విశ్వసింపకుండిరి.

నిజముగా నీప్రభువు శక్తిమంతుఁడు; కరుణాళుఁడు.

అధ్యాయము 5

వారికి ఇబ్రాహీము కథను చెప్పుము.

70 అతఁడు తనతండ్రిని, ప్రజలను "మీరు దేని నారాధించు చున్నా" రని యడిగిన,

వారు "మేము నిశ్చలభక్తితో విగ్రహముల నారాధించెద" మనిరి.

ఆతడు " ఆవిగ్రహములు మీమొఱలను వినఁగలవా ?

మీకు సహాయముగాని, హానిగాని, చేయఁగలవా ? " అని యడుగ వారు " ఇది మాతాత ముత్తాతల యాచార " మని పల్కిరి.

ఆతఁడు " మీ రేమని యోచించుచున్నారు ?

మీరును మీతాతముత్తాతలుఁను, ఆరాధించినవారు నాకు శత్రువులు.

కాని, నన్ను సృజించి, నాకు సరియగు మార్గముఁజూపి,

అన్న పానములఁబ్రసాదించిన,

జగన్నాథుఁ డట్టివాఁడుకాఁడు.

80 నేను రోగినై యున్నప్పు డాతఁడు నాకారోగ్యము చేకూర్చును.

ఆతఁడు నన్నుఁ జంపి పునర్జీవితుం జేసి,

ప్రళయదినమున నాపాపములను క్షమింపఁగలఁడు.

ప్రభువా! నాకు బుద్ధిని బ్రసాదించి, ధర్మవర్తనులతోఁ జేర్పుము.

ముందు రాఁబోవు సంతతులవారు నేను మంచివాఁడ ననునట్లు చేయుము.

నన్ను నందనవనమునకు వారసులలో నొకనిగఁ జేయుము.

నాతండ్రి మార్గముఁ దప్పియున్నాఁడు. అతనిని క్షమింపుము.

నిర్మలహృదయుఁడై దేవుని సమీపించువానికి తప్ప,

ఇతరుల కాదినమున ధనముగాని, పుత్త్రులుగాని సహాయపడరు.

ఆదినమున మానవజాతి మీఁదికి లేవఁగలదు. ఆసమయమున నన్నవమానితుఁ జేయకుము.

90 అప్పుడు భక్తులకు స్వర్గమును,

దుష్పథవర్తులకు నరకమును ప్రాప్తమగును.

పాపుల నాదినమున " దేవునిఁగాక యితరుల నారాధించితిరే. వారెచట నున్నారు ?

వారు నీకు హానిగాని, సహాయముగాని చేయఁగలరా? తమకుఁ దామైనఁ దోడ్పడఁగలరా?" యని యడుగుదురు.

ఇతరులఁ దప్పుత్రోవఁబెట్టి, తామును నందే పడియున్న పాపులు

ఇబ్లీసు ననుచరులందఱతోడను, నానరకమునఁగూలి,

అచట నొకరొకరితో వాదులాడుచు,

"దేవునియాన,

నిన్ను జగన్నాథునితోఁ బోల్చుట స్పష్టముగా మాదే తప్పు.

దుష్టులే మమ్ము మార్గమునుండి తొలఁగించిరి.

100 ఇప్పుడు మమ్ముఁగూర్చి మనవిసేయువారు లేరే!

మాకుఁ దోడ్పడఁగల మిత్రులును లేకున్నారే!

మేము తిరిగి భూమిపై జన్మించినచో "విశ్వాసివర్గములోఁ జేరుదుము" అందురు.

నిజముగా నిదియొకసూచనయైనను, వారిలో చాలమంది నమ్మకుండిరి.

నిశ్చయముగా నీప్రభువు శక్తిమంతుఁడు; కరుణాళుఁడు!

అధ్యాయము 6.

నుహు ప్రజలు ప్రవక్తను దిరస్కరించిరి.

వారి సోదరుఁడగు నుహు వారితో "మీరు దేవునికి భయపడరా?

సత్యముగా మీకు నేను విశ్వాసినగు దూతను.

కావున దైవభీతిగలిగి న న్ననుసరింపుఁడు.

మీరు నా కెట్టి బహుమానమును నీయనక్కఱలేదు. జగన్నాథుఁడే నన్ను బహూకరింపఁగలఁడు.

కావున, దేవునికిభయపడి, నాకు విధేయులరుకండు" అనఁగా వారు "అతినీచులు నిన్ననుసరించుచున్నారు. అట్టి నిన్ను మేమెట్లు విశ్వసింతుము" అనిరి.

అతఁడు "వారుచేసినదేమో నాకుఁ దెలియదు.

అదియంతయు నాప్రభువునకే తెలియును. ఇది మీకుఁదెలిసిన నెంతబాగుండును!

నేను స్పష్టభయసూచనలనిచ్చుటకే నియోగింపఁబడియున్నాను,

కావున విశ్వసించినవారిని నేను త్రోసివేయ" ననెను.

వారు "నుహా! నీవిప్పుడు నీప్రయత్నమును మానకున్నచో నీపై ఱాళ్ళు విసరి చంపెద" మనిరి.

అతఁ డప్పుడు "ప్రభువా! వీరు నన్నసృతవాదిగా నెంచుచున్నారు.

కావున, వారికిని నాకును మధ్యనుండి, తీర్పుచెప్పి, నన్నును నన్ను విశ్వాసులై యనుసరించుచున్నవారిని కాపాడు" మని ప్రార్థింప,

మేమతనిని, అతనితోనున్నవారిని నావనిండ నెక్కించి, రక్షించి,

మిగిలినవారిని నీటిలోఁ ద్రోసి చంపితిమి.

ఇది నిజముగా నొక సూచనయైనను వారిలోఁ జాలమంది దానిని విశ్వసింపరైరి.

కాని, నీప్రభువుశక్తిమంతుఁడు; కరుణాళుఁడు!

అధ్యాయము 7.

ఆదైతులుకూడ, ప్రవక్త లసత్యవాదు లనిరి.

వారిసోదరుఁడగు హూదు వారితో "మీరు దేవునికి భయపడరా?

నేను విశ్వాసపాత్రుఁడను. మీదూతను.

కావున, దైవభీతిగలిగి నాకు విధేయుల రగుఁడు.

ఇందుకు మీరు నాకు బహుమాన మీయనక్కఱలేదు. జగన్నాథుఁడే నన్ను బహుమానింపఁగలఁడు.

ఏమీ, మీ రున్నతస్థలములందెల్ల గుఱుతుల నుంచికొనుట వినోదార్థమా ?

మీకు శాశ్వతనివాసము లగుననియా యిండ్లను కట్టుకొనుచున్నారు ?

130 మీశక్తినంతయు కాఠిన్యముతోడనా చూపెదరు ?

కావున, దైవభీతిగలిగి నాకు విధేయతఁజూపుఁడు.

ఆతఁడు మీకు మందలను, సంతానమును,

ఉద్యానవనములను, సెలయేళ్ళను,

సర్వమును సమృద్ధియగునట్లు ప్రసాదించియున్నాఁడు. ఆతనికి భయపడుఁడు. "

ప్రళయదినమున మీకు ఘోరశిక్ష కలుగునేమో యని భీతిల్లుచున్నా" ననెను.

వారు "నీవు మమ్ము భయపెట్టినను భయపెట్టకున్నను నొక్కటే.

ఇదియొక తాతలనాఁటి ప్రాఁతకథ.

మా కాశిక్ష యెంతమాత్రమును గలుగనేర " దని,

ఆతనిని, మిథ్యాపూరుషునిఁగా గణింప, మేము వారిని నాశనము చేసితిమి. ఇదియొక సూచనమైనను వారిలో చాలమంది దానిని నమ్మకుండిరి.

140 కాని, నీప్రభువు శక్తిమంతుఁడు ; కరుణాళుఁడు !

అధ్యాయము. 8.

సమూదీయులును, వారిప్రవక్తల నసత్యవాదు లనిరి.

వారిసోదరుఁడగు 'సాలే' వారితో "మీకు దైవభీతిలేదా ?

నేను సంపూర్ణవిశ్వాసపాత్రుఁడ నగు ప్రవక్తను.

కావున, దేవునికి భయపడి నాకు విధేయుల రగుఁడు.

మీరు, నాకెట్టి బహుమానము నీయనక్కఱలేదు. జగన్నాథుఁడే నాకు బహుమాన మీయఁగలఁడు.

మీరీ వస్తువులమధ్య శాశ్వతముగా సురక్షితులై యుండఁగలరా ?

ఈయుద్యానవనములు, నీసెలయేళ్ళు,

ఈసస్యక్షేత్రములు, నీపుష్పఫలభరితములగు ఖర్జూరతరువులు, నివియన్నియు మీకు శాశ్వతములా ?

మీరు గర్వితులరై, పర్వతములను ద్రవ్వి, యందు వసతుల నేర్పఱచుకొందురా? అట్లుచేయకుఁడు.

150 దేవునికి భయపడి నన్ననుసరింపుఁడు.

భూమిపై నక్రమవర్తులై,

పశ్చాత్తప్తులు గాక, దుర్నయములను జేయువారి యాజ్ఞలను మన్నింపకుఁడు, అనఁగా,

వారు "నీవు నిజముగా పిశాచగ్రస్తుఁడవు.

నీవును మావంటి మనుష్యుఁడవేకదా ! నీవుచెప్పినది సత్యమైనచో మాకొక సూచనఁ జూపు" మనిరి.

అతఁడు వారితో "ఇదిగో ! యీయాడుయొంటె. మీకొకదినమునను, దీని కొకదినమునను త్రాగుటకు నీరు దొఱకును.

కాని దానికేహానియుఁ జేయకుఁడు. అట్లుచేసిన ప్రళయదిన శిక్ష మీకు కలుగఁగల" దనెను.

కాని, వారు దానిని చంపివైచి, మఱుచటియుదయమే, పశ్చాత్తాపము నొందిరి.

ఆ యుదయమే వారికి శిక్షకలిగెను. ఇది సత్యముగా నొక సూచనమైనను వారిలో చాలమంది దానిని నమ్మరైరి.

కాని, నీప్రభువు శక్తిమంతుఁడు. కరుణాళుఁడు.

అధ్యాయము 9.

160 లూట్ ప్రజలు, ప్రవక్తల నసత్యవాదులుగాఁ బరిగణించిరి.

వారి సోదరుఁడగు లూటు, వారితో "మీరు దేవునికి భయపడరా? నేను విశ్వాసపాత్రుఁడ నగు మీప్రవక్తను.

కావున, మీరు దైవభీతిగలిగి నన్ననుసరింపుఁడు.

దీనికి మీరు నాకు బహుమాన మీయనక్కఱలేదు. జగన్నాథుఁడే నన్ను బహుమానింపఁగలఁడు!

ఏమి! జీవరాసు లన్నిటిలోను నొక్క మనుష్యులతోడనే మీరు సంచరింతురా?

మీకొఱకు మీప్రభువుసృజించిన మీ భార్యలను పరిత్యజింతురా? ఓహో! మీరు త్రోవతప్పి యున్నా" రన,

వారు "లూటా! నీవు నీయుద్యమమును వదలినచో నిన్ను దేశభ్రష్టునిఁ జేసెద" మనిరి.

అతఁడు "మీకృత్యములు నాకసహ్యములు.

ప్రభువా! నన్నును, నాకుటుంబమును, వారికృత్యములనుండి రక్షింపు" మన,

170 ఆలస్యము చేసిన రొయొక వృద్ధునితప్ప,

ఆతనిని, ఆతని కుటుంబము నంతటిని, మేము రక్షించి,

మిగిలినవారిపై ఘోరమును, మృత్యుకరమును నగువర్షమును గురియించి, నాశనము చేసితిమి.

ఇది, సత్యముగా నొకసూచనమైనను, వారిలో చాలమంది దానిని నమ్మకుండిరి.

కాని, నీప్రభువు శక్తిమంతుఁడు కరుణాళుఁడు !

## అధ్యాయము 10.

మదియా నను నరణ్యమునందు వాసముచేయువారు ప్రవక్తల కసత్యదోషము నారోపించిరి.

వారి సోదరుఁడగు షూయైబు వారితో "దేవునికి భయపడరా?

నేను నిశ్చయముగా సంపూర్ణవిశ్వాసపాత్రుఁడనగు ప్రవక్తను.

కావున దేవునికి భయపడి, నాకు విధేయతఁజూపుఁడు.

180 దీనికై నాకు మీారేట్టిబహుమాన మీాయనక్కఱలేదు. జగన్నాథుఁడే నన్ను బహూకరింపఁగలఁడు.

మీాకొలతలను సరిగా కొలువుఁడు. తగ్గించి కొలువకుఁడు. సరియగు త్రాసులతో తూఁచుఁడు.

మనుష్యులకు కావలసిన పదార్థమును దొంగిలింపకుఁడు. భూమిపై దుర్నయములఁజేసి యితరుల కపకారమొనరింపకుఁడు.

మిమ్ములను మీాపూర్వులను సృజించినయాతనికి భయపడుఁడు.

అనఁగా వారు "నిజముగా నీకు పిశాచముపట్టినది.

నీవు మావంటి యొకమనుష్యుఁడవే. నీవసత్యవాదివని మా నమ్మకము.

నీవు సత్యవాదివైనచో స్వర్గములో నొకభాగము మాపైఁబడునట్లు చేయు" మనిరి.

ఆతఁడు "మీాకృత్యములన్నియు నాప్రభువున కెఱుకయే" యని యుత్తరమిచ్చెను.

వారాతని నసత్యవచనునిగా నెంచినంతనే మేఘాచ్ఛాదితమగు దినమునాఁటిశిక్ష వారికిఁ గలిగెను. ఆభయంకరదినమున కలుగు శిక్షయే యది.

190 ఇదియు నొకసూచనయే యైనను, వారిలోఁ జాలమంది దానిని నమ్మకుండిరి.

కాని, నీప్రభువు శక్తిమంతుఁడు. కరుణాళుఁడు!

అధ్యాయము-11.

నిశ్చయముగా నీపుస్తకము జగన్నాథునినుండి వచ్చినది.

దానితోడనే నీవును స్పష్టమగు నరబ్బీభాషలో,

వారికి భయసూచన నీయఁగలందులకు,

నీహృదయము నొకసత్యదేవత యావేశించినది.

ఇది యంతయు వారి పూర్వపురాణములలోఁ జెప్పఁబడినదే.

ఇస్రాయేలు ప్రజలలోని పండితులు దానిని చేకొనిరనుట వారి కొకసూచనకాదా?

మేము దానినొక విదేశీయునికిచ్చి,

దానిని పఠింపఁజేసినచో వారు దానిని నమ్మరని దానిని నీకిచ్చితిమి.

200 ఆఘోరశిక్ష ననుభవించువఱకును, దానిని నమ్మకుండునట్లు, దుష్టులహృదయమును కల్పించితిమి.

ఆశిక్ష వారికిఁ దెలియకుండ నకస్మాత్తుగా రాఁగలదు.

అప్పుడువారు "మాకు కొంతతడవు దొరకదా!" అనియుందురు.

ఏమీ! వారు మాశిక్షవచ్చునట్లు త్వరపెట్టుచున్నారా?

నీవేమనుకొందువు? వారికి పూర్ణాయుష్య మొసగినను,

తుదకు మేము భయపెట్టుచువచ్చిన శిక్ష వారికి కలిగినచో,

వారి భోగములన్నియు వారి కెట్లు పనికివచ్చును ?

మేము భయసూచనల నీయనిదే యెన్నడును, నేపురములను నాశనము చేయలేదు.

మే మధర్మముగా నెన్నఁడును సంచరింపలేదు.

210 ఈకురానుతో సైతానులుగూడ దిగలేదు.

అది వారికి తగదు. వారి కట్లుచేయ శక్తిలేదు.

వారు దానిని విననర్హులుకారు.

నీవు బాధల పాల్గాకుండుట కాతనితప్ప మఱి యేదేవునిఁ బిలువఁ బోకుము.

నీ దగ్గఱబంధువులకు భయసూచననిచ్చి,

నిన్ను విశ్వాసులై యనుసరించువారిపైఁ గరుణించిన ఱెక్కలను పఱపుము.

వారు తిరస్కరించినచో వారితో "మీకృత్యములకు నేను బాధ్యుఁడనుకా" నని చెప్పుము.

ఆతఁడు సర్వమును, వినుచుఁ దెలిసికొనుచున్నాఁడు.

నీవు ప్రార్థనకై నిలుచుండురీతిని,

ప్రార్థించువారిమధ్య నీనడవడిని చూచుచునే యుండు,

220 శక్తిమంతుఁడును, గరుణాళుఁడునగు, నాతనియందు నమ్మిక ముంచుము.

సైతాను లెవ్వరి నావేశింతురో చెప్పుదునా ?

వా రసత్యవాదులపైనను, దుష్టులపైనను వ్రాలుదురు.

వారు విన్నదానిని చెప్పెదరేకాని, వారిలో చాలమంది యనృతవాదులు.

మార్గము తప్పినవారు కవుల ననుసరింతురు.

విశ్వాసముకలిగి, సత్కార్మానుష్ఠానపరులై తఱచుగ దేవుని స్మరించుచు,

అధర్మముగ నొరులు తమ్మెదుర్కొనిన నాత్మరక్షణఁ జేసికొనుచు నున్నవారుతప్ప,

వితరులు లోయ లన్నిటియందును, పిచ్చియెత్తినవారివలెఁ దిరుగుచు,

వారు చేయనిదానిని చేసితిమని చెప్పుచుండుట నీవుచూచిన విషయమే. కాని, వారిలో మంచివారి కధర్మముచేసినవారి కెట్టి ఫలము కలుగునో యిప్పుడే తెలియఁగలదు.

# సురా 27-నముల్.

మక్కా-93 పద్యములు-7 రుకూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

త. సాద్. అవి కురానులోనివియు, స్పష్టగ్రంథములోనివియు నగు శ్లోకములు; స్పష్టచిహ్నములు.

ప్రార్థనను విడువక, భిక్షపెట్టుటను మానక, దృఢవిశ్వాసయుక్తులగు వారికి పరలోకరక్షణయు, సంతోషవార్తయుఁ గలుగుచున్నవి.

నమ్మనివారికి తాముచేసినదంతయు బాగుగనున్నట్లు తోఁపఁజేయ వారు భ్రాంతినొందుదురు.

వీరికొఱకే శిక్ష యెదురుచూచుచున్నది. పరలోకజీవనమున వారు గొప్పనష్టమును పొందఁగలరు.

కాని, నీకు కురాను బుద్ధుఁడును జ్ఞానియు నగువానినుండి లభించినది.

దీనిని స్మరింపుము,—మూసా తనకుటుంబముతో "నాకొక యగ్ని కనఁబడినది.

దానినుండి యొకవార్తనుగొని, మీరు కాగుటకు కొఱకచ్చును గొని తెచ్చెద" నని,

దానియొద్దకుఁబోయి యుండ నొకయశరీరవాణి "అగ్నియందును, దానిచుట్టును నుండువాఁడు ప్రభావంతుఁడగుఁగాక! జగన్నాథుఁడగు దేవునిమహిమ చెన్నారుఁ గాక!!

మూసా! నిశ్చయముగా నేను శక్తిమంతుఁడను బుద్ధుఁడనునగు దేవుఁడను.

10 ఇప్పుడు నీచేతికోలను క్రిందఁబడవేయు" మని పలుక నాతఁ డట్లేచేసిన నది సర్పముఁబోలె ప్రాకఁజొచ్చెను. అతఁడు భయపడి తిరిగి రాకయుండఁగా "మూసా! భయములేదు.

తొలుత తప్పొనరించి, పిదప తప్పున కుచితముగా మంచిచేయు వారుతప్ప, నాదూతలు నాయొద్ద భయపడరు. నేను క్షమాపరుఁడను; దయావంతుఁడను.

నీచేతిని నీగుండెపై నుంచికొనుము. దానికేహానియుఁగలుగకయే తెల్లగానగును. ఫిరౌనునకును, నతనిప్రజలకును, కనఁబడఁగల తొమ్మిదిసూచనలలో నిదియొకటి. వారు దుష్టప్రజలు.

మాసూచనలు వారికన్నులయెదుటనే కనఁబడినను, వారు "ఇది కేవలమింద్రజాల" మనిరి.

వారిమనస్సుల కవియన్నియు నసత్యములే యని తోచినను వారిదౌష్ట్యముచేతను గర్వముచేతను, వానిని నిరాకరించిరి. కాని, నీచ కర్ములకుఁగలిగిన గతియేమో చూచితివా?

## అధ్యాయము 2.

పూర్వము దావూదు సులైమానులకు మేము జ్ఞానమునీయ వారు "విశ్వాసయుక్తులగు నాతని కింకరు లనేకులకంటె మమ్మధికులఁ జేసిన దేవునిస్తోత్రముచేసెదము" అనిరి.

దావూదే సులైమానుకు జ్ఞానమిచ్చెను. ఆతఁడు "ప్రజలారా! మాకు పక్షులభాషయాదిగా సర్వమును దెలియును. ఇది దేవుఁడు మా కనుగ్రహించిన స్పష్టమగు వరము" అనెను.

సులైమానునొద్దకు పిశాచములును, మనుష్యులును, పక్షులును జేరఁగా నతఁడు వారిని గుంపులు గుంపులుగా నడిపించుచు,

నముల్ అను లోయకుఁ దీసికొనిపోయెను. అచట నొక నముల్ వాసి "నముల్ వాసులారా! సులైమాను తన సైన్యములతో వచ్చుచున్నాఁడు. మీరు నలిగిపోవుట యాతనికిఁ దెలియకుండును. కావున మీరు మీ యిండ్లలోనికిఁబొండు!" అనెను.

అప్పుడు వానిమాటలువిని నవ్వుచు "ప్రభువా! నీవు నాకును నాతల్లిదండ్రులకును జూపిన యనుగ్రహమునకు కృతజ్ఞుఁడనై యుండునట్లును, నీకిష్టమగు పుణ్యకార్యములఁ జేయునట్లును, నన్ను ప్రబోధించి, నీదయచే పుణ్యవంతులగు నీకింకరులలో నన్నుఁ జేర్పుము"

20 అని, పక్షులనన్నిఁటినిఁజూచి "ఇచ్చట హుద్‌హుద్ కనఁబడఁడేమి? వాఁడు రానివారిలో నొకఁడా!

వాఁడు సరియగు కారణముఁ దెలుపనిచో వానికి ఘోరశిక్ష విధించి వానిని చంపివేసెదను"

అనినంతలో వాఁడును వేవేగవచ్చి, "నీకుఁ దెలియనిదొకటి నాకుఁదెలిసినది. 'సబా' నుండి నిశ్చయమైనవార్త నొకదానిని తీసికొని వచ్చియున్నాను.

అచట నొకస్త్రీ రాజ్యము చేయుచున్నది. ఆమె సర్వగుణసంపన్న. ఆమె సర్వాలంకృతమగు సింహాసనముపై నధిష్ఠించియున్నది.

ఆమెయు నామెప్రజలును దేవునిగాక సూర్యునారాధించుట నేనుచూచితిని. సైతాను వారికి తమపనులన్నియు మంచివిగా తోపc జేయుచు మార్గమునుండి తప్పించినాcడు.

స్వర్గమ ర్త్యములయందలి రహస్యముల వెలిcబుచ్చుచు, మనుష్యులు పైకి చెప్పుదానిని, దాచుదానినిగూడc దెలిసికొనcగల దేవుని యారాధనకు వారు పూనుకొనరు.

ఆతనికంటె నితరమగు దైవములేcడు. పరమసింహాసనమునc గూర్చున్న ప్రభువాతcడే" యనెను.

ఆతcడును "నీవు, సత్యమును వచించుచున్నావో యసత్యవాదివో చూచెదవుగాక !

ఈచీటిని గొంపోయి వారియొద్దc బడవేయుము. అచటనుండి కొంతదూరముపోయి యుత్తరముకొఱ కెదురుచూడుము " అనెను.

ఆమె తన సామంతులతో "సామంతులారా ! గౌరవచిహ్నితమగు లేఖయొకటి నాయొద్దcబడినది.

30 దానిని సులైమాను వ్రాసినాcడు. అందాతcడు "దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర !

మీరు నన్ను తిరస్కరింపక నాకు ముస్లిములరు (భక్తులరు) కండు" అని లఖించినాcడు.

అధ్యాయము. 3.

సామంతులారా ! నేనేమిచేయవలయునో యుపదేశింపుcడు.

మీయనుమతి లేకుండ నేనేమియుcజేయcజాల" ననెను.

సామంతు లామెతో "మేము బలవంతులము, అమితశౌర్యవంతులము. కాని, నీయాజ్ఞను మీఱము. నీ వాజ్ఞాపించుదానిని జేయ సంసిద్ధులమైయున్నా" మన,

ఆమె "రాజులు నగరములను బ్రవేశించి స్వాధీనముచేసికొను నప్పుడందలి బలవంతులనందఱ నవమానింతురు. వీరునునట్లే చేయుదురు.

కాని, నేనిప్పుడు వీరికొక కానుకఁ బంపి నాదూత లేమిప్రత్యుత్తరము దెత్తురో చూచెదఁగాక !"

అని, దూతనుబంప దూతతో సులైమాను "మీరు నాకు ధనసాహాయ్యముఁ జేయనక్కఱ లేదు. దేవుఁడు మీకిచ్చిన దానికంటె నాకుఁ బ్రసాదించినదే యుత్తమము. అయినను మీరు మీ కానుకలను గొప్పగాఁ జూచికొందురు.

మీరు వారియొద్దకు మఱలిపొండు ! మేమడ్డగింపరానిసైన్యములతోవచ్చి వారిని భంగపఱిచి, వారిదేశమునుండి తఱిమెదము."

అని తనసామంతవర్గమువంక తిరిగి "సామంతులారా ! వారు నా కధీనులై (ముస్లిములై) రాక పూర్వ మామె సింహాసనము నెవ్వరు తీసికొనివత్తురు ?"

అన నొక దుష్టపిశాచము "నీవు నీయాసనమునుండి లేచునంతకాలములో దానిని నేను తేఁగలను. నేను విశ్వాసిని.

40 దీనిని జేయ సమర్థుఁడ" ననెను. గ్రంథజ్ఞానముగల యొకఁడు "కనుఱెప్పపాటుకాలములో నేను దానిని నీమ్రోలకు తేఁగల" ననెను. వా రిట్లనుచు దాని నాతని యెదుటనుంప నాతఁడు "నేను కృతజ్ఞుఁడనో, కృతఘ్నుఁడనో శోధించుటకు నాప్రభువునాకనుగ్రహించిన వర మిదియే. కృతజ్ఞుఁడయియుండుట తనమేలుకొఱకే. కృతఘ్నుఁడగు వానితో సర్వమును తనయధీనమునందుంచుకొని యుదారస్వభావుఁడగు నాప్రభువున కెట్టి ప్రసక్తియు లేదు.

ఆసింహాసనము నామె గుర్తింపకుండునట్లు చేయుఁడు. ఆమె రక్షణమార్గమును తెలిసికొనినదో లేదో చూతము."

అని యామెయు వచ్చినతోడనే యామెతో "నీ సింహాసనమిట్టిదేనా ? యనియడుగ నామె" ఇట్టిదేయైనట్లు నాకుఁదోచుచున్న"

దనెను. ఆతఁడు "ఈమెకు పూర్వమే జ్ఞానముకలిగి ముస్లిముల (భక్తుల) మైయున్నా" మనెను.

కాని, యామె ఆరాధించుదైవముల నమ్మనివారిలోనిది గావున నామెను తప్పుతో ద్రవఁబెట్టిరి.

ఆమెతో "ఈకోటలోఁ బ్రవేశింపు" మనఁగా నామె యది యొక నీటి సరస్సనుకొని, కాళ్ళపైనున్న బట్టనుదీసి మోసపోయి, తెలిసికొని, "యిది యద్దములతో తాపిన యాొకమేడ. ప్రభువా! నాయాత్మకే నేను పాపమొనరించినాను. కావున సులైమానుతోఁ బాటు నేనును జగన్నాయకుఁడగు దేవుని కధీనురాల నగుచున్నా" ననెను.

## అధ్యాయము 4.

పూర్వము సామాదునకు వారిసోదరుఁడగు సాలేతో "మీరు దేవుని సేవింపుఁడని చెప్పి పంప, వారొండొరులతో వాదులాడుచు రెండుకక్షులుగా నేర్పడిరి.

ఆతఁడు "నాప్రజలారా! మీరు మీదేవుని దయకొఱకు క్షమింపుమని వేఁడికొనక, మేలుకంటె కీడునే శీఘ్రముగఁ గోరికొనుచున్నారేల?"

అని యడుగ వారు "మేము శకునములనుచూడ, నీవలనను నీవారివలనను, మాకు కీడు గలుగునట్లు తోచిన" దన నాతఁడు "మీ శకునఫలము దైవాధీనము. కాని, మీరు శోధింపఁబడుచున్నా" రనెను.

అప్పు డానగరమున దౌర్జన్యములుచేయుచు నక్రమవర్తులగు తొమ్మండ్రుపురుషులుండిరి.

వారు "మీరు దేవునియాన నొండొరులతో మేమాతనిపైనను, నాతనికుటుంబముపైనను బడి, యారక్తమునకు పగదీర్చుకొనువారితో వారికుటుంబనాశనము చూడలే"దని బాసచేసికొనుఁడు. నిశ్చయముగ మేము సత్యమును వచించుచున్నా"మని,

50 వారొక కుట్రఁ బన్నిరి. మేమును కుట్రఁబన్నితిమిగాని, వారి కది తెలియదు.

వారిపన్నాగ మేమైనదో చూడుఁడు! వారిని, వారిప్రజల నందఱిని, మేము నాశనము చేసితిమి.

వారిపాపములకు ఫలముగా వారియిండ్లు శిథిలములై పోయినవి. నిశ్చయముగా బోధపఱుచుకొనువారి కిందొక సూచనయున్నది.

మాకు భయపడి విశ్వసించినవారిని విముక్తులఁ జేసితిమి.

లూటుతనప్రజలతో "ఏమి! కన్నులు తెఱచికొనియే యిట్టి కలుష కృత్యములకుఁ గడంగెదరా?

విషయేచ్ఛతో స్త్రీలయొద్దకుఁగాక పురుషులయొద్దకు వత్తురా యేమి? నిశ్చయముగా మీ రజ్ఞానప్రజలు"

అనఁగా నాప్రజ లాతనితో "మీనగరమునుండి లూటు కుటుంబమును తఱిమివేయుఁడు. వారు పవిత్రవంతులఁట" యని మాత్ర మనిరి.

కావున మేమతనిని, నతని కుటుంబమును, రక్షించితిమిగాని, యాతనిభార్య యాలసించునట్లు విధించితిమి. గాన నామెనుమాత్రము విడిచిపెట్టితిమి.

వారిపై వర్షముగురియింప నది సూచనబొందినవారికి మృత్యుప్రాయమయ్యెను.

## అధ్యాయము-5.

"దేవునకును, నాతఁడెంచికొనిన సేవకులకును స్వస్తియగుగాక! ఆతఁడా, అతనితో వారుచేర్చు నితరదైవములా, ఘనులు?

# కాండము. 20.

60 స్వర్గమర్త్యములను సృజించి, స్వర్గమునుండి వర్షముఁబంపి, దాని మూలమున విశాలవనములను బుట్టించినవాఁ డాతఁడేకదా! అందలి వృక్షములను మొలపింప నీకు శక్తిలేదుకదా! ఏమి! దేవుఁడుగాక మఱియొకదేవుఁడా? అయినను వా రాతనికి సములను వెదకు చున్నారు.

భూమి నచలఁగాఁజేసి, దానిమధ్య నదులఁ బుట్టించి, దానిపై బర్వతములనుంచి, రెండుసముద్రములమధ్యను పెద్దగట్లను పోసినవాఁ డాతఁ డేకదా? ఏమి! దేవునితోఁగూడ మఱియొకదేవుఁడా? అయి నను వారిలో చాలమందికి జ్ఞానము లేదు.

అతఁడేకదా బాధితుల మొఱలనువిని, వారికష్టములను బాపి, మీకు మీపితరులధనము నొప్పఁజెప్పినవాఁడు! ఏమి! దేవుఁడుగాక మఱియొకదేవుఁడా? అయినను కొలఁదిమందిమాత్రమే దీనిని జ్ఞాపక ముంచికొందురు.

భూమిపైనను, సముద్రముపైనను, చీఁకటిలో మీకు దారి చూపి, తనదయాసూచకముగా మారుతములను దూతలఁగాఁ బంపు వాఁ డతఁడేకదా! ఏమి! దేవుఁడుగాక యింకొకదేవుఁడా? మీరు దేవునితోఁ జేర్చువా రాతని కెడగలుగనుందురుగాక!

ఒకసత్త్వమునుబుట్టించి, దానినిచంపి, తిరిగిపుట్టించి, భూస్వర్గ ములనుండి నీకాహారము నొసగువాఁ డాతఁడేకదా! ఏమి? దేవుని ప్రక్క మఱియొకదేవుఁడా? మీరు సత్యభాషణులైనచో మీసాక్ష్య ములఁ దెండు.

స్వర్గములందుగాని, భూమియందుగాని, దేవుఁడుతప్ప అదృ

ష్టమును జూచినవాఁడు మఱెవ్వఁడును లేఁడు. వారెప్పుడు మీఁదికి లేచెదరో వారికిఁ దెలియదు.

కాని రాఁబోవు జన్మముఁగూర్చి వారికిఁ దెలియునఁట! అయినను వారు దానినిగూర్చి సందేహింతురఁట! అయినను వారు దాని విషయమై యంధులఁట !" అనుము.

అధ్యాయము—6.

అవిశ్వాసకులు "మేమును, మాపితరులును, చచ్చిపడియుండ మమ్ము లేపించెదరా ?

పూర్వము మాకును, మాపూర్వులకును, నిట్టివాగ్దానమే కలిగినది. ఇవియన్నియు తాతలనాఁటి ప్రాఁతకథ"లందురు.

"మీరు దేశమంతయుఁ దిరిగి దుష్టులగతి యేమయ్యెనో తెలిసికొనుఁడు.

70 వారినిగూర్చికాని, వారిపన్నాగములఁగూర్చికాని మీమనస్సులను కలఁతఁబెట్టుకొనకుఁడు" అనుము.

వారు "నీవు సత్యమును బల్కుచున్నచో, నీచేఁజెప్పఁబడినదెప్పుడు జరుగును ?" అని యడుగుదురు.

"మీరు తొందరపడి కోరుకొనుచున్నది బహుశః మీవెంటనంటియే యున్నదికాఁబోలు !" అనుము.

నిశ్చయముగా నీప్రభువు మనుష్యులపై దయాపూర్ణుఁడై యున్నాఁడు. కాని, వారిలోఁ జాలమందికి కృతజ్ఞతలేదు.

వారిహృదయములలో దాగినదానిని, వారు వెలిబుచ్చుదానిని గూడ నీప్రభువు తెలిసికొనియే యున్నాఁడు.

భూస్వర్గములందుఁగల రహస్యవిషయములన్నియు స్పష్టగ్రంథమునం దుండియేయున్నవి.

నిశ్చయముగా నిస్రాయేలుప్రజలు, వివాదములను పెంచికొనిన విషయములన్నియు కురానులోనే యున్నవి.

భక్తుల కది రక్షణోపాయమును, దయాచిహ్నమును నై యున్నది.

నీప్రభువు శక్తిమంతుఁడు, సర్వజ్ఞుఁడు. కావున నాతఁడు తన బుద్ధిచే వారివివాదములఁ దీర్పఁగలఁడు.

నిర్మలసత్యము నీపక్షముననే యున్నది. కావున, దేవునియందు నమ్మికముంచుము.

80 నీవు చచ్చినవారిని వినునట్లు చేయఁజాలవు. చెవిటివారు వెనుకఁ దిరిగియున్నప్పుడా మోఁతను వారు వినునట్లు చేయఁజాలవు.

అంధులను తమతప్పులనుండి నీవు మఱలింపఁజాలవు. మాసూచనలను నమ్మువారినితప్ప నీవు వినఁజేయఁజాలవు. వారే ముస్లిములు (భక్తులు).

శిక్ష నీపైఁబడ నుంకించుచున్నప్పుడు మేము భూమినుండి యొక రాక్షసుని బుట్టింప నాతఁడు నిశ్చయముగా మనుష్యులు మాసూచనలందు దృఢవిశ్వాసము కలిగియుండ"లేదని యార్చును.

## అధ్యాయము—7.

ఆదినమునఁ బ్రతిదేశమునుండియు, మాసూచనలను విశ్వసింపనివారిని వేర్వేరుగుంపులుగా నొకచోఁ జేర్చెదము.

వారు దేవునిమ్రోలకురాఁగానే దేవుఁడు "మీరు మాసూచనలను గుర్తెఱుఁగకుండియు, వాని నసత్యములుగాఁ బరిగణించితిరా? లేకున్న మీరు చేయుచున్నదేమి ?" అనును.

వారిదుష్టకార్యములకై వారిపై శిక్షపడును. వారెట్టిసాకులను జెప్పవీలు లేదు.

విశ్రాంతికొఱకు రాత్రిని, వెలుతురుతో పగటిని, మేము విధిం

చియుండుట వారికిఁ దెలియదా? సత్యముగా విశ్వసించినవారి కిందే సూచనలున్నవి.

ఆదినమున బూరాపై నొకమ్రోఁతవినఁబడును. అదివిని స్వర్గములోనివారును, భూమియందలివారును, నందఱును భయకంపితులగుదురు. దేవుఁడు ముక్తినొసగ నెంచినవారికిమాత్ర మామ్రోఁత మెల్లగా వినఁబడును.

అచలములని నీవు తలంచుచున్న యీపర్వతములు, మేఘములు గాలికెగురునట్లుగా నెగిరిపోవుట నీవు చూడఁగలవు. దీనిని సర్వమును విధించునది దేవునికృత్యము. మీరు చేయునదంతయు నతనికి బాగుగఁ దెలియును.

పుణ్యకర్మలతో నాతనిమ్రోలకు వచ్చువారికి, తమకర్మమగు దానికంటె హెచ్చుఫలమే కలుగును. ఆదినమున వారికెట్టిభయమును సోకదు.

90 పాపకర్మలతో నాతనియొద్దకు వచ్చువా రధోముఖులుగా నగ్నిలోఁ గూలుదురు. నీకర్మల కనుగుణముగాఁగదా నీకు ఫలములును గలుగఁగలవు?

ఈదేశము నాతఁడు పవిత్రముచేసెను. దీని ప్రభువు నారాధింపుమని నాకాజ్ఞయైనది. సమస్తవస్తువులు నాతనివే. దేవునికధీనులగు వారిలో (ముస్లిములలో)ఁ జేరుమని నాకాజ్ఞ.

నేను కురానును పఠింపవలెను. క్రమరక్షణనొందినవాఁడు తన మేలుకొఱకే యట్లుచేయును. కాని త్రోవదప్పినవానితో "నేను భయసూచనమాత్రమే యిచ్చెదను.

దేవుఁడు స్తవనీయుఁడగుఁగాక! అతఁడు మీకు తనసూచనల నీయు, మీరు వానిని పరిగ్రహింపవలయును. మీరు చేయుపనులను మీప్రభువు గుర్తించుచునే యున్నాఁడు" అనుము.

# సురా-28 కథ.

మక్కా-88 పద్యములు-9 రుకు్కలు.

అధ్యాయము. 1.

దయాదాక్షిణ్యమూర్తి యగు దేవునిపేర.

త. సీ. మీమ్.

ఇవియే స్పష్టగ్రంథమందలి సూచనలు.

విశ్వాసులకు బోధించుటకై మూసా ఫిరౌను చరిత్రములలోఁ గొన్ని భాగములను మీకు చదివెదము.

ఫిరౌను భూమిపై నధికారము వహించి, తన ప్రజలను కక్షులుగాఁ జీల్చి వారిలోఁ గొందఱ నణంచెను. వారి మగశిశువుల నాతఁడు చంపి, యాడుపిల్లలనే జీవనములతో నుండనిచ్చెను. ఆతఁ డల్లరులఁ బుట్టించువారిలో నొకఁడై యుండెను.

ఇ ట్లడంపబడినవారి ననుగ్రహించి, ఇమాములఁజేసి ఫిరౌనుకు వారసులఁగా నియమించి,

భూమిపై స్థిరముగ నెలకొల్పి, ఫిరౌను, హామానులును, వారి సైన్యములును తాము చేయుదుష్కృత్యములకుఁ దామే పాత్రులగున ట్లుచేయ మాకు మనసయ్యెను.

అంత మేము మూసా తల్లితో "మూసాకు చనుగుడిపి పెంచుము. అతని కపాయము గలుగునని నీకు భయమయినచో నత నిని సముద్రముపై విడువుము. భయముగాని, యాతురతఁగాని చూపకుము. ఆతనిని తిరిగి నీకడఁజేర్చి యొక పవిత్రునిగాఁ జేసెదము" అని యంటిమి.

ఫిరౌను హామానులను, వారిసైన్యములును పాపులగుటచే ఫిరౌను కుటుంబమువా రాతని శత్రువుగను, దమకు శోకహేతువుగను బరిగణించిరి !

అపుడు ఫిరౌనుతో నాతనిభార్య "నీకును నాకును నేత్రానందదాయకుఁడగు నీతనిఁజంపకుము. ఇతఁడుమనకుపయోగపడు నేమో. లేదా, వీనిని పుత్త్రునిగఁ బెంచికొందము" అనెను. కాని, వారు కావించినదేమో వారికిఁ దెలియదయ్యెను.

10 మూసాతల్లిహృదయము భయవిహ్వలమయ్యెను. ఆమె యాతని వెంటనే పోల్చికొనియుండునుగాని, యామె విశ్వాసినియై యుండుట కామె హృదయమునకు స్థైర్యమునిచ్చితిమి.

ఆమె యాతని యక్కతో "ఆతని ననుసరింపుము" అనఁగా నామెయు దూరమునుండి యాతనిని కనిపెట్టుచుండెను. వారికాసంగతి తెలియలేదు,

ఆతని కెంతమంది దాదులనుపెట్టినను పాలు ద్రావఁడయ్యెను. తుద కాయక్క యచటికి వచ్చి "ఇతనిని పెంచి జాగ్రతగఁజూడఁగల యొక కుటుంబమును మీకు తెలుపుదునా ?" అని యనెను.

కావున మే మాతనిఁ దనతల్లికి తిరిగి యొప్పఁజెప్పితిమి. ఆతఁడామెకు నేత్రానందకరుఁడై యామె యాతురతను బాపఁగా దేవుని మాట సత్యమని యామె నమ్మియుండెను. కాని చాలమంది కిది తెలియదు.

## అధ్యాయము. 2.

అతఁడును బలముగలిగి పెద్దవాఁడైనంతనే మే మాతనికి బుద్ధిజ్ఞానముల నిచ్చితిమి. పుణ్యవంతులను మే మిట్లే బహూకరించుచుందుము,

అంత నతఁడు ప్రజలెవ్వరు తన్నుఁ గనుఁగొనఁజాలనిసమయమున నొక పురముఁ జొచ్చి, యం దొండొరులతోఁ బోరాడుకొనుచున్న యిరువురు మనుష్యులఁ జూచెను. అందులోనొకఁడు తన ప్రజలలోనివాఁడు ; రెండవవాఁడు శత్రుపక్షమువాఁడు. తనపక్షమువాఁడు మూసాను శత్రుపక్షమువానిపై సహాయపడుమని కోరెను. అంత మూసా యాతనిఁ దనపిడికిలితో నొక్క గ్రుద్దుగ్రుద్ది చంపివైచి "ఇది సైతానుపని. ఇతఁడు శత్రువు. స్పష్టముగా నితరులను దారి తప్పించువాఁడు" అనెను.

అతఁడు "ప్రభువా ! నేను నాకీడుకొఱకే పాపమొనర్చితిని. నన్ను క్షమింపుము." అనఁగా దేవుఁడాతని క్షమించెను. ఆతఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు.

అంత నతఁడు "ప్రభువా ! నీవు నా కీయనుగ్రహముఁజూపితివి. ఇఁకముం దెన్నఁడును దుష్టులకు సహాయము చేయను" అనెను.

మధ్యాహ్నమైనంతనే యాతఁడు పురములో భయమున నిటు నటుఁజూచుచుఁ బోవుచుండగా క్రిందటిదినమున తాను సహాయము చేసినవాఁడే తనయెదుటఁ బ్రత్యక్షమై తిరిగి సహాయము చేయ వేఁడెను. అంత మూసా యాతనితో "నీవు కడునీచుఁడవు" అని పల్కెను.

తనకును వారికినిగూడ సమానశత్రువగు వానిపై నాతఁడు పడనుంకించఁగా నాతఁడు "మూసా ! నిన్న నీవొక మనుష్యునిఁజంపితివి. అట్లే నన్నును జంపనెంచుచున్నావా? నీ వీదేశమున రాజ్యము నాక్రమించుటకే యెంచుచున్నావు. నీవు శాంతినెలకొల్పుటకు రాలేదు" అనెను.

20 అప్పుడు పురముకొననుండి యొకఁడు పరుగెత్తుకొనివచ్చుచు 'మూసా ! ఇచట సామంతులు నిన్నుఁ జంపయోచనలఁ జేయు

చున్నారు. వేగముగఁ బాఱిపొమ్ము. నేను నీస్నేహితుఁడను గావున చెప్పుచున్నాను' అనెను.

కావున నాతఁడు భయముతో నిటునటు చూచికొనుచు నా చోటనుండి పాఱిపోవుచు "ప్రభువా! యీ యన్యాయవంతులగు ప్రజలనుండి నన్ను రక్షింపుము" అనెను.

అధ్యాయము. 3.

అతఁడు మదియానుదిక్కుగాఁ బ్రయాణము చేయుచు "నా ప్రభువు నన్ను క్రమమార్గమున నడిపించునుగాక!" అనెను.

అతఁడు మదియానునందలి యొక జలాశయముఁ జేరఁగా గొందఱు నీళ్ళు తోడికొనుచుండిరి. వారిప్రక్క నిద్దఱుస్త్రీలు తమ మందను వెనుకనేయుంచి వేచికొనియుండఁగా నాతఁడు వారితో "మీ రిట్లేల చేయుచున్నా" రని యడిగెను వారు "మాతండ్రి కడు వృద్ధు. ఈగొల్లవారు తమమందలను తోలుకొనిపోవువఱకును, మేము నీటిని ముట్టికొనఁగూడ దని పలికిరి.

కావున నాతఁడు వారికి నీళ్ళుతోడియిచ్చి, నీడలోనికిఁబోయి, "ప్రభువా, నీవు నాకుఁ జేసెదనని మేలు నాకిపు డవసరమైనది" అనెను.

అంత వారిలో నొకతె లజ్జావనతముఖియై వానిదరిఁ జేరి "నీవు మాకు నీరు తోడియిచ్చినందుకుగాను కూలియిచ్చుటకు మాతండ్రి నిన్ను పిలుచుచున్నాఁ డనఁగా నాతఁడు వారితండ్రికడ కేఁగి తనకథను చెప్పఁగా నాతఁడు "భయపడకుము. నీ వన్యాయవర్తనులబారినుండి తప్పిపోయితివి" అనెను.

వారిలో నొకతె "తండ్రీ! ఏనిని కూలి కుంచుకొనుము. నీకు నమ్మకమైనవాఁడును, బలముగలవాఁడును నొకఁడు కావలయును గదా!" అనెను.

అతఁడు "నీవు నాయొద్ద నెనిమిదిసంవత్సరములు కూలికి కుదిరి యున్న యెడల నే నా యిద్దఱుకుమార్తెలలో నొకతెనిచ్చి నీకు పెండ్లి చేయవలెనని కోర్కె యున్నది. పదియేండ్లున్నచో నీయిష్టము వచ్చినట్లు చేసికొనవచ్చును. నిన్ను నిర్బంధించను. దేవునిదయ యున్నచో నేను న్యాయవంతుఁడనని నీకుఁదెలియఁగలదు" అనెను.

అతఁడును "నీకును నాకును నిట్లే యొడంబడికకానిమ్ము. నీవు చెప్పిన రెండిటిలో నెట్లుచేసినను నాకన్యాయము జరుగఁగూడదు. మనమనుకొనినదానికి దేవుఁడే సాక్షి" యనెను.

అధ్యాయము 4.

మూసా నిర్ణయించుకొనినకాలము నచటఁగడిపి తనకుటుంబముతోఁ బ్రయాణము చేయుచుండఁగా పర్వతముపై నొకమంట యతనికి గాన్పించెను. అతఁడు తనకుటుంబముతో "మీరు వేచి యుండుఁడు నాకొక మంట గనఁబడుచున్నది. అచటనుండి యొక వార్తనో, మీరు వెచ్చఁగఁ గాచికొనుట కొకకొఱకచ్చునో తీసికొని రాఁగలను" అనెను.

30 అతఁడచటికి రాఁగానే పవిత్రవంతమగు లోయకు కుడిప్రక్క నొకపొదలోనుండి "మూసా! నిశ్చయముగా నేను జగన్నాథుఁడ నగు దేవుఁడను.

ఇపుడు నీచేతికఱ్ఱను క్రిందఁబడవేయుము" అనువాక్యొకటి యాతనిచెవినిబడెను. ఆకఱ్ఱయు నొకపామువలెఁ గదలుచుండుటచే నాతఁడు వెనుకకు మఱలి, పాఱిపోయి, మఱిరాఁడయ్యెను. అప్పుడా వాణి "మూసా! దగ్గఱకురమ్ము. భయములేదు. నీకు భద్రము కలుగును.

గుండెపై చేయిపెట్టుకొనుము, అది తెల్లబడునుగాని, దాని

కేయుపాయమును గలుగను. భయరహితుఁడవై నీచేతిని వెనుకకులాగి కొనుము. ఫిరౌనునకును, నతనిసామంతులకును, నీ రెండును నానవా ళ్ళుగా నుండును. వారుదుష్టవర్తనులు" అనెను

అంత నతఁడు "ప్రభువా! నేను వారిలో నొకనిని జంపితిని. కావున వారు నన్ను జంపెదరేమో యని భయమగుచున్నది.

నాసోదరుఁడగు హారూను నాకంటె స్పష్టముగ మాట్లాడఁ గలఁడు. కావున నాకు సహాయముగను, నాపక్షము గెలుచుటకును నాతని నాతోఁబంపుము. వారు నన్ను కృత్రిమునిగ గణింతురేమో యని భయపడుచున్నాను" అనెను.

దేవుఁడును నతనితో "నీసోదరుని నీతో నంపి నిన్ను బలపఱి చెదములే. మీయిరువురకును శక్తినిచ్చెదము. మాసూచనలవంటి సూచనలను వారు చూడఁజాలరు. మీరిద్దఱును, మిమ్మనుసరించుచు వారును విజయముఁ గాంచెదరు" అనెను.

మూసా మాయిాస్పష్టసూచనలతో వారియొద్ద కేఁగగా వారు "ఇది కేవలము నింద్రజాలము. మాపూర్వు లెవ్వరు నిట్లు చేసియుం డుటను వినలేదు" అనిరి.

మూసా వారితో "ఎవనికి రక్షణ ననుగ్రహించెనో, భోగ భూమియందు నివాస మెవ్వరి కనుగ్రహింపఁబడినదో యాప్రభువునకే బాగుగఁ దెలియును. దుష్టులు వృద్ధికొందరుగదా" అనెను.

అంత ఫిరౌను "సామంతులారా! నాకుఁ దెలిసినంతవఱకు, నేను తప్ప మీకు మఱియొక దేవుఁడు లేఁడు. ఈమూసా అసత్యమును బలుకుచున్నాఁడు. హామానా, యిటుకలను గాల్పించి యెత్తైనయొక గోపురమును నిర్మింపుము. నేను దానినెక్కి మూసాదేవునిఁ జేరె దను" అనెను.

అతఁడును నతనిసైన్యములును భూమిపై నన్యాయముగను నక్రమముగను వర్తించుచు మాయొద్దకు మఱలి రారని తలంచిరి.

40 కాని, మే మాతనిని, నతనిసైన్యములను బట్టుకొని, సముద్రములోఁ గూలవైచితిమి. ఇదిగో దుష్టవర్తనులగతిఁ దిలకింపుఁడు.

వారిని నరకాగ్నిలోనికి బిలిచికొనిపోవువారిని ఇమాములుగఁ నేర్పఱిచితిమి. రక్షణదినమున వారి కెట్టిసహాయమును దొరకదు.

వారిని మే మిహలోకమున శపించితిమి. రక్షణదినమున వారు లజ్జచే నావరింపఁబడియుందురు.

## అధ్యాయము 5

పూర్వతరములవారిని మేము నాశనముచేసినపిదప, మనుష్యుని బోధకొఱకు ధర్మగ్రంథమును మూసా కిచ్చితిమి. వారుయోచించుకొందురుకదా యని, దానిని రక్షణోపాయముగను, దయాప్రదానముగను పంపితిమి.

మూసాకు మాయాజ్ఞ నొసగినప్పుడు నీవు సినై పర్వతపు పశ్చిమభాగమున లేవు. నీవు దానిని జూచినవారిలో నొకఁడవుకావు.

మూసాతరువాత చిరాయువులగు నెన్నియో తరములవారి నెందఱినో లేవఁదీసితిమి. మేము మదియానువాస్తవ్యులకుఁ బ్రవక్తను బంపితిమిగాని, యాప్రజలలో నీవు లేవు.

మేము మూసాను బిలిచినప్పుడు సినై పర్వతపు చరియపై లేవు. ఈప్రజలు యోచించుకొందురుగాక యని తలఁచి, పూర్వము వీరి కేప్రవక్తను బంపియుండకున్నను, నీవు భయసూచననిత్తువుగదాయని దయతో నీప్రభువు వీరియొద్దకు నిన్నుబంపినాఁడు.

వారు తాము చేసికొనినదానికిఁగా తమకొక యాపద సాభవించినప్పుడు " ప్రభువా ! మాకొక ప్రవక్త నేల పంపితివికావు ? అట్లు చేసియుండినచో నీసూచనల ననుసరించి విశ్వాసులమైయుందుమే " యని యనకుండుటకే నిన్ను ప్రభువు వారియొద్ద కంపియున్నాఁడు.

వారికి మాయొద్దనుండియే సత్యముచేరినను, "మూసాకుఁ గలశక్తులే యీతనికి లేకున్నచో.........." అని యందురు. కాని, పూర్వము మూసాకుఁ బంపినదానినిమాత్రము వారు విశ్వసించిరా ? "చిల్లంగి గ్రంథములు రెండు పరస్పరసహాయము చేసికొనెను. ఆ రెండి టిని మేము నమ్మము" అని వారనిరి.

"మీరు సత్యవంతులైనచో దేవునియొద్దనుండి యింతకంటె బాగుగ శిక్షింపఁగల మఱియొక గ్రంథమును దీసికొనిరండు. నేను దాని ననుసరించెదను" అనుము.

50 వారు నీకుఁ బ్రత్యుత్తరమీయనిచో తమ పిచ్చియూహలనే యనుసరించుచున్నారని తెలిసికొనుము. దేవునివలన దారిఁగనుఁగొనక తనపిచ్చియూహలనే యనుసరించు వానికంటెఁ దప్పుత్రోవఁ బడినవాఁ డెవఁడుండును ? దేవుఁడు దుష్టులకు దారి చూపఁడు గదా !

అధ్యాయము 6.

వారు భయపడియుండుట కిపుడు వారికి మామాటల కనే కార్థము లుండునట్లు చేసితిమి.

దీనికి పూర్వము మావలన సత్యగ్రంథములఁ గొన్నవారు దీనినిగూడ విశ్వసింతురు.

అది వారికి వినిపింపఁగా వారు "ఇది దేవునినుండి వచ్చిన సత్యము. దానిని మేము నమ్మెదము. అదిరాకపూర్వమే మేము ముస్లిముల (దైవాధీనులము) మైతిమి" యని యందురు.

వారు సహనముతో నోర్చి, కీడును మేలుతో పరిహరించి, మేము వారి కనుగ్రహించినదానినుండి భిక్షము పెట్టినందుకు వారికి ద్విగుణిత ముగ బహుమానము చేకూరును.

వారు పొల్లసంభాషణను వినక దానినుండి తొలఁగిపోవుచు, "మాపనులుమావి. మీపనులు మీవి ! మేము మూర్ఖులకొఱకు రాలేదు" అందురు.

నీవు నీయిష్టమువచ్చినవారికి దారి చూపలేవు. దేవుఁడే తన యిచ్ఛవచ్చినవారికి దారి చూపును. నడిపింపఁబడుట కొప్పుకొనువా రెవరో యాతనికే తెలియును.

కాని, వారు "నీకు దొరకినదారిని మేమనుసరించినచో, దేశమునుండి వెడలఁగొట్టఁబడుదుము" అందురు. వారికొఱకు ఒక పవిత్రమును, నిరుపద్రవకరమును, సర్వఫలసంభరితమును, జీవనాధారవస్తు సంయుతమును నగు నొకస్థలమును చేరువనే యేర్పఱిచియుంచినాము కామా? కాని, వారిలోఁ జాలమందికి జ్ఞానములేదు.

సుఖలోలములైయుండిన యెన్నినగరములను మేమునాశనము చేయలేదు? వారువిడిచిన గృహములందు కొలఁదిమందియేతప్ప నెవ్వరును నింతవఱకును నివసించియుండలేదు. మేమేవానికి వారసుల మైతిమి.

వారి మాతృనగరమునకు మాసూచనలఁ దెలుపుటకు నీప్రభు వొక ప్రవక్తనుపంపనిదే యాపురములను నాశనము చేయలేదు. అందలి ప్రజ లన్యాయవంతులు కాకున్నచో నాపురములను మేమును నాశనము చేసియుండియుండము.

60 మీ కనుగ్రహింపఁబడినదంతయు నిహలోకమున గొప్పగ ననుభవించుటకే. కాని, దేవునియొద్ద నున్న దింతకంటె శ్రేష్ఠమును, శాశ్వతమునునై యున్నది. మీరు బుద్ధిగలిగి యుండరేల?

అధ్యాయము-7.

మేము ముందుకు మేలివాగ్దానము చేసినవారును, నిహలోకమున మావలన సకల సౌఖ్యములఁగొనియు, రక్షణదినమున శిక్ష ననుభవింపవలసినవారును, సమానులగుదురా?

ఆదినమున దేవుఁడు వారినిబిలిచి "మీరు నాతో సమానులను కొనినవా రేరి?" అని యడుగును.

అప్పుడు న్యాయశిక్ష ననుభవించువారు "ప్రభువా! మేము త్రోవతప్పించినవారు వీరే. మేము త్రోవఁదప్పింపఁబడినట్లే వీరినిగూడఁ దప్పించితిమి. నీవు మమ్ము నిందింపఁ గారణము లేదు. వా రారాధించిన వారము మేముకాము" అని యందురు.

అప్పుడు వారితో "దైవసమానులని మీరు కల్పించిన వారిని పిలువుఁడు" అని పల్కఁగా వారు వారిని పిలిచినను పలుకరు. వారు శిక్షనుగాంచి, సరియగు రక్షణ నొందియుండిన బాగుండు నను కొందురు.

ఆదినమున దేవుఁడు వారినిబిలిచి "మీరు ప్రవక్తల కేమని బదులుచెప్పితిరి?" అని యడుగును.

కాని, యాదినమునవారు తడబాటుచే నంధులై సరియగు లెక్క నీయలేకుందురు. ఒకరినొకరైన నడుగలేక యుందురు.

అయినను దేవునివంకఁ దిరిగి, విశ్వసించి, క్రమవర్తనుఁడగు వాఁడు సుఖులలో నాదినమునఁ జేరునేమో?

దేవుఁడు స్వేచ్ఛగాఁ దనయిచ్ఛవచ్చినదానిని సృజించును. ఆ కృత్రిమదైవములకట్టి స్వేచ్ఛలేదు. దేవుఁడు మహిమాన్వితుఁడగుఁ గాక! తనతోడ వారుచేర్చినవారికంటె నున్నతుఁడగుఁ గాక!

వారు తమహృదయములలో దాచియుంచినవానిని, బయలు పెట్టినదానిని, దేవుఁడు బాగుగ గ్రహింపఁ గలఁడు.

70 అతఁడే దేవుఁడు! అతఁడుతప్ప మఱియొకదేవుఁడు లేఁడు. ఇహపరలోకములం దాతనిదేకీర్తి! అతనిదే యనంతశక్తి! మీరాతని యొద్దకే కొనిరాఁబడుదురు!

"మీ రేమనుకొనుచున్నారు? రక్షణదినమువఱకును దేవుఁడు మిమ్ము పెద్దచీఁటిలోఁ గప్పివైచినచో మఱియేదేవుఁడు మిమ్ము వెలుతురులోనికిఁ దీసికొని రాఁగలఁడు? అయిన మీరు వినరేల?

"మీ రేమని తలంచు చున్నారు! రక్షణదినమువఱకును దేవుఁడు మిమ్ము పెద్దనెలుతురులోనే యుంచివైచినచో మఱి యేదేవుఁడు విశ్రాంతికొఱకు రాత్రినిగల్పింప సమర్థుఁడు? అయిన మీరు చూడ రేల?" అనుము

మీరు విశ్రాంతినొందుటకై దయతో నాతఁడు రాత్రిని కల్పించినాఁడు. అతఁ డనుగ్రహించిన వస్తువులలో మీకుకావలసిన దానిని కొని, కృతజ్ఞులరై యుండుట కాతఁడు పగటిని కల్పించినాఁడు.

ఒకదినమున దేవుఁడు వారినిబిలిచి "మీరు సమానులనుకొనిన వారేరి?" యని యడుగును.

మేము ప్రతిజాతినుండియు నొకసాక్షిని బిలిచి "మీ ప్రమాణ ములను జూపుఁడు" అందుము. వారికప్పుడు సత్యము దేవునియొద్దనే యున్నదని తెలియును. వారుకల్పించుకొనిన దైవములు వారిని విడిచి పెట్టుదురు.

## అధ్యాయము-8.

ఖారూన్ అనువాఁడు మూసా ప్రజలలోనివాఁడే. కాని యాతఁడు వారియెడ గర్వముతోఁ బ్రవర్తించెను. వానికిచ్చిన ధనా గారపుబీగములు పలువురుబలవంతులైనను మోయఁజాల కుండిరి. కావుననే వానికంతగర్వము కలిగెను. అతనిప్రజ లతనితో, "నీవు కులుకకుము. కులుకుచుండువానిని దేవుఁడు ప్రేమింపఁడు.

"దేవుఁడు నీ కనుగ్రహించిన దానితో ముందుపదవికొఱకుఁ బ్రయత్నింపుము. ఈలోకమున నీవుచేయవలసినదానిని మానకుము. దేవుఁడు నీకెట్లు దయఁజూపెనో, యట్లే ప్రజలను దయతోఁజూడుము. భూమిపై నక్రమములఁ బ్రవర్తింపఁజేయకుము. అల్లరులఁ గల్పించు వారిని దేవుఁడు ప్రేమింపఁడు" అనిరి.

అదివిని యతఁడు "నేను జ్ఞానవంతుఁడను. కావుననే నాకీ ధనము వచ్చినది" అనెను. తనకంటె బలవంతులై, తనకంటెహెచ్చు ధనమును సంపాదించిన తన పూర్వతరములవారిని దేవుఁడు నాశనము చేసియుండెనని యాతనికిఁ దెలియలేదా ? కాని, దుష్టులను దమ నేరములంగూర్చి యడుగము.

అంత, ఖారూను గొప్పశోభతో తనప్రజలయొద్ద కేఁగఁగా వారిలో నిహలోకభాగ్యమునే యాసించినవారు, "ఆహా ! ఖారూను వలె మేమును ధనవంతులమైనచో నెంతబాగుండును ! అతఁడు గొప్ప యదృష్టవంతుఁడు" అనిరి.

80 కాని, జ్ఞానముఁబొందినవారు, "మీరుదుఃఖితు లగుదురు గాక ! విశ్వాసులై పుణ్యకార్యములఁ జేయువారికి దేవుని బహుమానమే శ్రేష్ఠము. ఓర్పుగలిగి సహించియుండువారికిఁదప్ప నితరులకాబహుమానము దొరకదు" అనిరి.

అంత మేమాభూమిని, అతని మేడలను పెకలించివేయఁగా దేవునిస్థానమున నతనికి సహాయపడు సైన్యములెవ్వియు లేకయుండెను, అతఁడు రక్షితులలోఁ జేరలేకపోయెను.

ఉదయమగునంతనే యతని యదృష్టమును గోరికొనినవారు "ఓహో, దేవుఁడు తనసేవకులలో నిచ్చవచ్చినవారికే తనవరముల నిచ్చును. ఇతరుల కీయఁడు. దేవుఁడు మమ్మనుగ్రహింపకుండినచో మమ్ముఁగూడ పెకలించివైచి యుండును. ఓహో ! కృతఘ్నులెన్నడును వృద్ధి నొందఁజాల" రనిరి.

## అధ్యాయము-9.

భూమిపై నున్నతులము కావలయుననియు, నక్రమములఁగావింపవలయుననియు నెంచనివారికే ముందటిపదవిని మేమిచ్చెదము. దైవభీతిపరులకు సౌఖ్యము చేకూరఁగలదు.

మేలుచేసినవారికంతకంటె హెచ్చుబహుమానము దొరకును. కీడుచేయువారికి తాము కావించినంతయే ఫలము కలుగును.

కురాను నీకిచ్చినవాఁడు తప్పక నీగృహమున నిన్నుఁజేర్చును. "ఎవఁడు సరియగుత్రోవఁ బట్టినాఁడో, ఎవఁడు స్పష్టముగఁ ద్రోవఁ దప్పినాఁడో, దేవునికే బాగుగఁదెలియు" ననుము.

ఈగ్రంథము నీ కీయఁబడునని నీవెన్నఁడు ననుకొనలేదు. దేవుని యనుగ్రహమువలననే యదినీకు లభించినది. కావున నీ వవిశ్వాసులకుఁ దోడ్పడకుము.

నీకు మాసూచనలువచ్చినపిదప వారిప్రేరేపణచే నాసూచనల నుండి మఱలిపోకుము. ప్రజలను దేవునివంక తిరుగుఁడని యాజ్ఞాపింపుము; దేవునితో దైవములఁ జేర్చువారిని గలియకుము.

దేవునిఁగాక మఱియేదైవమును నావాహన చేయకుము. అతఁడు తప్ప మఱియొకదేవుఁడు లేఁడు. అతఁడుతప్ప తక్కినదంతయు నశించును. అతఁడే తీర్పుచెప్పఁగలవాఁడు! అతనియొద్దకే మీరు తిరిగి పోవలెను.

---

# సురా-29 సాలీదు.

---

మక్కా 69-పద్యములు - 7 రుకూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లామ్. మీమ్.

మనుష్యులు తాము విశ్వసించితిమనినంతనే వారిని శోధింపకుండ విడిచెదమని తలంచుచున్నారా?

వారిపూర్వులను మేము శోధించితిమి. నిష్కల్మషులెవరో, యసత్యవంతులెవరో దేవుఁడు తెలిసికొనుచునే యుండును.

దుష్కార్యముల నాచరించువారు మమ్ము తప్పించుకొందు మనుకొనుచున్నారా ? వారియోచన సరియైనదికాదు.

దేవునిఁజేర నాశించువానికి నిర్ణీత సమయమువచ్చును. అతఁడు శ్రోత, జ్ఞాని !

భక్తికొఱకు పాటుపడువాఁడు తనమేలుకొఱకే యట్లు చేయును. దేవుఁడు సర్వవస్తువులును లేకుండగనే భాగ్యవంతుఁడు గదా ?

విశ్వాసులై, క్రమవర్తనులైనవారి దుష్కార్యములను మేమం తరింపఁజేసి, వారిసత్కార్యములఁ బట్టియే వారిని బహూకరింతుము.

ఇదిగాక మనుష్యుఁడు తలిదండ్రులయెడ దయఁజూపవలయునని మేము విధించియుంటిమి. కాని, నీకు తెలియని యితరులను నాతోఁ జేర్పవలయునని వారు నీతో వాదించినచో వారిని మన్నింపకుము. మీరు నాయొద్దకే వత్తురు. అప్పుడు మీకార్యములను మీకు తెలియఁ జేయుదును.

విశ్వాసులై క్రమవర్తనులగు వారిని న్యాయవంతులలోఁ జేర్తుము.

10 కొందఱు 'మేము దేవుని నమ్ముచున్నా'మని యందురుగాని,వారు దేవునివిషయములో బాధల ననుభవించునప్పుడు, మనుష్యునివలనఁ గలిగినఁ బాధను దేవుఁడే పంపెనని తలంతురు. వారికి ప్రభువుజయము నిచ్చినచో "మేము నీపక్షమున నుండుటచేతనే యీజయము కలిగిన" దందురు. తాను సృజించిన వారి హృదయములలో నేమున్నదో దేవునికి బాగుగఁ దెలియునుగదా.

అవును. విశ్వాసులెవరో కపటులెవరో దేవునికి బాగుగనే తెలియును.

అవిశ్వాసులు విశ్వాసులతో, "మామార్గము ననుసరింపుఁడు. మేము మీపాపములను తప్పక భరింతుము" అందురు కాని, వారి పాపములలో నేమాత్రమును భరింపరు. వా రసత్యవాదులు గదా !

కాని, తమభారములను, మఱికొన్ని భారములనుగూడ వారు తప్పక మోయఁగలరు. వారికుట్రలఁగూర్చి రక్షణదినమునఁ బరీక్ష జరుగఁగలదు.

అధ్యాయము-2.

పూర్వము నుహును తనప్రజలయొద్దకంపితిమి. అతఁడు వారితో నేఁబది తక్కువ వేయిసంవత్సరము లుండెను. వా రక్రమములఁ జేయుచుండఁగనే యుప్పెనవచ్చి వారిని తీసికొనిపోయెను.

అతనిని, నావలోనున్నవారిని, మేమప్పుడురక్షించి, యది జనులకందఱకొక సూచన యగునట్లు చేసితిమి,

ఇబ్రాహీముగూడ తన ప్రజలతో "దేవునారాధించి యాతనికి భయపడుఁడు. మీరు జ్ఞానులైనచో నిదియే మీకు శ్రేయస్సు" అనెను.

దేవునిప్రక్క మీరు విగ్రహములనే పూజించుచున్నారు; అసత్యమును గల్పించుచున్నారు. దేవునిగాక మీరారాధించు నితరులు మీకేమియు నీయఁజాలరు. కావున మీకుఁ గావలసిన వస్తువుల కొఱకు, దేవుని వేఁడుఁడు. అతనిని సేవించి, యతనికి కృతజ్ఞులరగుఁడు. మీ రాతనియొద్దకే చేరఁగలరు.

మీరు నన్నసత్యవచనునిగ నెంచిన నెంచుఁడు. మీపూర్వులు గూడ దేవదూత యసత్యవాది యనిరి, కాని, బాహాటముగ బోధించుటయే యాతని విధి.

దేవుఁడెట్లు సృష్టించుచున్నాఁడో వారుచూడలేదా? తాను సృజించిన దానిని తనయొద్దకే కదా యాతఁడు చేర్చికొనును. ఇదినిశ్చయముగా దేవునికి సులభము.

20 "భూమిపై సంచరించు జీవజంతువుల నాతఁడెట్లు సృజించెనో చూడుఁడు. ఇఁకముందుగూడ వానిని రెండవసారి పుట్టునట్లు చేయును. దేవుఁడు సర్వశక్తుఁడు.

ఆతఁడు తన యిష్టమువచ్చినవారిని శిక్షించి, యిష్టమువచ్చిన వారిని కరుణించును. మీరతనియొద్దకే తీసికొని పోఁబడుదురు.

స్వర్గమునందుఁగాని, భూమిపైఁగాని, యాతని యధికారమును నీవు తీసివేయలేవు. దేవుఁడువినా నీకు సంరక్షకుఁడుగాని సహాయుఁడుగాని, లేఁడు.

అధ్యాయము-3.

దేవుని సూచనలయందుఁగాని, యాతని జేరుటయందుఁగాని, నమ్మకములేనివారు నా కరుణఁగూర్చి నిరాశ చేసికొనవలసినదే. వీరికి ఘోరశిక్ష యాసన్నమైయున్న" దనియనుము.

అతని ప్రజలు "ఇతనిని నరకివేయుఁడు, కాల్చివేయుఁడు" అని మాత్రము బదులుచెప్పిరి. కాని, దేవుఁడాతని నగ్నినుండి రక్షించెను. విశ్వసించిన వారి కిందు సూచన లున్నవిగదా.

ఇబ్రాహీము "ఇహలోకమున మీరొండొరులతోఁ గలసి యుండుటకు దేవునితోఁబాటు మీరు విగ్రహములఁ జేకొంటిరికదా. "కాని, రక్షణదినమున మీలోఁ గొందఱు తక్కినవారిని విసర్జింతురు; కొందఱు కొందఱను శపింతురు. మీకగ్నియే యావాసమగును. మీకెవ్వరును సహాయకులుండరు" అనెను.

లూటు, ఆతనినమ్మి "నా ప్రభువు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు. నే నాతని నాశ్రయించెద" ననెను.

ఆతనికి మేము ఇసాకు యాకూబుల ననుగ్రహించి, యతని సంతతివారికి భవిష్యత్తును దెలిసికొనుశక్తిని, పవిత్రగ్రంథమును నొసగితిమి. అతని కిహలోకమున బహుమానమిచ్చితిమి. పరలోకమున నాతఁడు న్యాయవంతులలో నుండఁగలఁడు.

మేము, లూటునుగూడ బంపితిమి. అతఁడు తనప్రజలతో "ప్రపంచమందలి యే ప్రజలు నింతకుపూర్వము పోని కల్మషము లోనికి మీరేఁగెదరా ?

"మీరు మనుష్యులయొద్దకైనఁ బోయెదరా? వారిని బహిరంగముగ దోఁచికొందురా? మీ సభలలో దౌర్జన్యములు చేసెదరా?" అని యడిగెను. కాని, వారు "నీవు సత్యవంతుఁడవైనచో దేవుని శిక్షయేదో తీసికొనిరమ్ము" అని మాత్రము బదులిడిరి.

30 "ప్రభువా! యీ యపవిత్రులనుండి నన్ను రక్షింపుము" అని యాతఁడు మొఱలిడెను.

## అధ్యాయము 4.

అప్పుడు మాదూతలు ఇబ్రాహీమునొద్దకువచ్చి, యతనికి పుత్త్రోదయ సందేశముఁ దెల్పి "ఈ పురవాసులు దుష్టులు. వీరిని తప్పక నశింపఁజేతు" మనిరి.

"లూటు అందున్నాఁడే" యని యాతఁడనఁగా, వారు "ఈపురమున నెవరున్నారో మాకు బాగుగఁ దెలియును. అతనిభార్య వెనుకపడి యుండుటచే నాతనిఁదప్ప, నతనిని, నతని కుటుంబమును, మేము రక్షింతుము" అనిరి.

ఆ దూతలును లూటు నొద్దకురాఁగా నాతఁడు తన కుటుంబము కొఱకు కలఁతనొందెను. వారిని రక్షించుట కాతనికి బాహుబలము లేకుండెను. అప్పుడువారు, "భయములేదు. చింతిల్లకుము. నీభార్య వెనుకపడియుండును గావున నామెనుతప్ప నిన్నును నీకుటుంబమును రక్షింతుము.

ఈ పురవాసులు గావించిన యక్రమమునకుగా దేవునినుండి తప్పక శిక్షను తీసికొని వత్తుము" అనిరి.

బోధపఱుచుకొనఁగలవారి కాపురము నాశనముకాఁగా మిగిలిన దానియందే సూచనలున్నవి.

మాదియానులయొద్దకు వారిసోదరుఁడగు షోయాబును పంపితిమి. అతఁడు "ప్రజలారా! దేవుని పూజింపుఁడు. తుది దినము కొఱకు నిరీక్షించి యుండుఁడు. దేశములో హానికరములగు నక్రమములఁ జేయుచుండకుఁడు" అని యనెను.

కాని, వారాతనిఁ గృత్రిమునిగఁ బరిగణించిరి. కావున, వారున్న చోట భూకంపము కలుగఁగా తెల్లవారుసరికి వారు తమ యిండ్లలోనే చచ్చిపడియుండిరి.

మేము ఆదు సామూదులను నాశనముచేసితిమి. పాడు పడిన వారి గృహములనుండియే యీసంగతి మీకు స్పష్టముగఁ దెలియఁజేయఁబడినది. సైతాను వారికృత్యములను వారికి మంచివిగఁ గనఁబడునట్లు చేసి వారు సూక్ష్మగ్రాహులైనను వారిని క్రమమార్గమునుండి తప్పించెను.

ఖారూను, ఫిరౌను, హామాను, వీరియొద్దకు తన సందేశముఁ గూర్చిన సాక్ష్యముతో మూసా వచ్చెను. కాని, వారు భూమిపై గర్వముతో వర్తించిరి. అయినను వారు మమ్ము మించలేకపోయిరి.

40 వారిలోనివాఁ డెవ్వఁడైనసరే పాపముచేయుచుండఁగనే పట్టుకొంటిమి. వారిలోఁ గొందఱిపై రాళ్లతోఁబూరించిన మారుతమును

బంపితిమి. జిబ్రీలు చేసిన ఘోరనాదము వారి కాశ్చర్యమును గలిగించెను. వారిలో గొందఱి కాళ్ళక్రింద నే భూమి బీటలువారఁ జేసితిమి. కొందఱను నీటిలోముంచి చంపితిమి. వారికి దేవుఁ డెట్టియన్యాయమును జేయలేదు. వారికి వారే యన్యాయమును చేసికొనిరి.

దేవునిఁగాక యితర సంరక్షకులఁ జేకొనినవారు తన గృహమును నిర్మించుకొను 'సాలీడు' ను బోలియుందురు. కాని, సాలీడు కట్టుకొను నిల్లు మిగుల బలహీనములగు పదార్థములతోఁగదా కట్టఁబడియున్నది ? వారి కిది తెలిసిన నెంతబాగుండును ?

దేవుఁడు తన్నుగాక వారు పిలుచువారినందఱను దెలిసియే యున్నాఁడు. అతఁడు బలవంతుఁడు. బుద్ధుఁడు.

మనుష్యులకు మే మీయుపమానములఁ దెలుపుదుము. బుద్ధిమంతులుమాత్రమే వీనిని బోధపఱుచుకొనఁగలరు.

దేవుఁడు స్వర్గమర్త్యముల నొక గొప్పయుద్దేశముతోనే సృజించియున్నాఁడు. విశ్వసించినవారి కిందే యొక సూచనయున్నది.

---

# కాండము. 21.

---

## అధ్యాయము 5.

మీకు తెలుపఁబడిన గ్రంథములోని భాగములను పఠించుచుండుఁడు. ప్రార్థనావిధిని నిర్వర్తింపుఁడు. ప్రార్థన కల్మషములను నిందలను హరించును. దేవుని స్మరణమే తప్పకుండవలయువిధి. మీరు చేయుచున్నది దేవుని కెఱుకయే.

గ్రంథావలంబులతో దయతోఁదప్ప మఱియొకరీతిగా వాదిం పకుము. నీకు కీడుచేసినవారితోమాత్ర మట్లు చేయనక్కఱలేదు. "మాకును మీకును బంపఁబడినదానిని మేము విశ్వసించుచున్నాము. మీ దేవుఁడును మాదేవుఁడును నొక్కఁడే. అతనికే మే మధీనుల మైనాము" అని యనుఁడు.

ఇట్లే యీకురానుగ్రంథమును నీకుఁబంపినాము. ధర్మగ్రంథ మును స్వీకరించినవారు దీనిని విశ్వసింతురు. ఈయరబ్బులలోఁగూడఁ గొందఱు విశ్వాసులున్నారు. భక్తిహీనులుతప్ప మఱెవ్వరును మా సూచనలను నిరాకరింపరు.

నీ వింతకుఁబూర్వ మేగ్రంథమును బఠించియుండలేదు. ఈనీ కుడిచేతితో నే గ్రంథమును వ్రాసియుండలేదు. అట్లు చేసియుండి నచో నిది డాంబికమని తలంచువారు న్యాయముగనే సందేహించి యుందురు.

కాని, యిది జ్ఞానమునొందినవారి హృదయములలోని యొక సూచనయే. దుష్టులుతప్ప మఱెవ్వరును మాసూచనలను నిరాకరింపరు.
50 వారు, "అతనికి తనప్రభువునుండి యొకసూచన రానిచో..."
అని యందురు. "సూచనలన్నియు దేవుని యధీనములే. నేను కేవ
లము నోటితో భయసూచన దెలుపువాఁడనే" యనుము.

ఈగ్రంథమును వారిమ్రోలఁ బఠింపుమని నిన్నుఁబంపియుండుట వారికిఁ జాలదా? విశ్వాసుల కిదియేకదా భయకరుణాసూచకము!

## అధ్యాయము 6.

"మీకును నాకును దేవుఁడే సాక్షి" యనుము. స్వర్గమర్త్య ముల నున్నదంతయు నాతని కెఱుక. విగ్రహములను నమ్మి దేవుని విశ్వ సింపనివారే నష్టులై పోవుదురు.

"ఏదీ! ఆ శిక్షను దీసికొనిరమ్మని వారు నిన్నడుగుదురు. దాని కొక కాలమునిర్ణయమైయుండనిచో నది యింతకుఁబూర్వమే వారికి గలిగియుండును. కాని, వారు దానిఁగూర్చి యుపేక్షించియున్నప్పుడే యది వారిపైఁబడును.

ఆ శిక్షను ద్వరఁగఁ దీసికొనిరమ్మని వారు నిన్ను కోరుదురు. కాని, భక్తిహీనులచుట్టును నరకమావరించుకొనియే యున్నదికదా!

ఒకానొకదినమున నా శిక్ష వారిపై నుండియు, పాదములక్రింద నుండియు బయుదేరి వారిని గప్పివేయును. "మీరుచేసికొనిన దానిని రుచిచూడుఁడు" అని దేవుఁడనును.

విశ్వాసులగు నా సేవకులారా! నా భూమి విశాలమైనది. కావున నన్నే తప్పక యారాధింపుఁడు.

ప్రత్యాత్మయు మృత్యువును గుచిచూచును. పిదప మీరు నన్ను జేరఁగలరు.

విశ్వసించి, పుణ్యముచేసికొనినవారిని తరంగిణులు ప్రవహించు నుద్యానవనములలోని యున్నతహర్మ్యములలో నుంచెదను. వారందు శాశ్వతవాసము చేయఁగలరు. కష్టపడుచు,

ఓర్పుతో సహించి, తమ ప్రభువును నమ్మినవారికి మంచి బహుమానము కలుగును గదా!

60 తమ యాహారమును సంపాదించుకొనలేని జంతువులెన్ని లేవు? వానికి మీకునుగూడ దేవుఁడాహారమిచ్చును. అతఁడు సర్వమును వినుచున్నాఁడు. సర్వమును దెలిసికొనుచున్నాఁడు.

స్వర్గమర్త్యములను సృజించి, సూర్యచంద్రులకు గతులనేర్పఱిచినవాఁ డెవఁడని నీవు వారినడిగినచో "దేవుఁడే" యని వారు ప్రత్యుత్తరమిత్తురు. అయిన వారసత్యములఁ గల్పించెదరేల?

దేవుఁడు తన యిష్టమువచ్చినవారికి గొప్పగనో కొలఁదిగనో యిచ్చుచుండును. దేవునికి సర్వమును దెలియును.

స్వర్గమునుండి వర్షమునుబంపి, దానిమూలమునఁ జచ్చియున్న భూమికిఁ జైతన్యముకలుగఁజేసినవాఁడెవఁడని వారిని నీవు ప్రశ్నించి నచో ' దేవుఁడే ' యని వారుబదులుచెప్పుదురు. "దేవునికి స్తుతియగు గాక ! అయినను వారిలో చాలమందికి బోధలేదు " అనుము.

## అధ్యాయము 7.

ప్రస్తుతజీవన మొకయాట, యొకవినోదముగాని, వేఱుగాదు. భవిష్యద్గృహమే సత్యగృహము ! ఇది వారికిఁదెలిసిన నెంత బాగుండును !

అదిగో ! వారు నావలనెక్కినప్పుడు దేవునికి మొఱలిడి, నిష్కాపట్యమగు పూజచేసెదమందురుకాని, సురక్షితముగ నొడ్డుచేరినంతనే యాతనితో భాగస్థులఁ జేర్తురు.

వారికి మేము తెలిపినదానిని వారు విశ్వసింపరుకాని, మే మిచ్చిన మంచివస్తువులను యథేచ్ఛగ ననుభవింతురు. తుదకు వారిమూర్ఖత వారికిఁ దెలియఁగలదు.

వారిచుట్టునుండు జనులు చెడిపోవుచుండఁగా వారి కొకసురక్షిత మగు స్థలమును చేరువగనే మేమేర్పఱిచియుండుట వారికిఁ దెలియదా ? అయిననువారు పనికిమాలినవిగ్రహములఁ ద్యజించి దేవుని మంచితనము నొప్పుకొనరేల ?

దేవునిఁగూర్చి యసత్యకల్పనముచేయువాఁడును, వారికి వచ్చిన సత్య మసత్యమనువాఁడును, దప్పనక్రమవర్తనుఁ డెవ్వ డుండును? భక్తి హీనులకు నరకములోనేకదా వాసము ?

మాకొఱకు ప్రయత్నముల సల్పువారిని మా మార్గములలో నడపుచుందుము. దేవుఁడు తప్పక పుణ్యచరిత్రుల నంటియుండును.

# సూరా 30 రోమనులు

మక్కా - 60 పద్యములు 6 రుకూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

అలీఫ్. లామ్. మీమ్.

దగ్గఱనున్న దేశములో రోమనులు పరాజయము నొందిరి.

కాని, వారి యపజయమునకు మాఱుగఁ గొన్ని సంవత్సరముల లోనే వారు తమశత్రువుల నోడింపఁగలరు.

ఈపనియంతయు మొదటినుండి తుదివఱకును దేవునిదే. ఆదినమున భక్తులు దేవుని సహాయమునొంది మోదము నొందఁగలరు.

తన కిష్టమయినవారి కాతఁడు సహాయపడును. అతఁడు శక్తిమంతుఁడు. దయాపరుఁడు.

అది దేవుని వాగ్దానము ; దేవుఁడు తన వాగ్దానమునకు వ్యతిరేకముగా నడవఁడు ; కాని చాలమందికది తెలియదు.

ప్రస్తుతజీవనపు బాహ్యావేషమే వారికి బోధపడుచున్నది కాని, పరలోకజీవనముఁగూర్చి వారజాగ్రత్తగ నున్నారు.

స్వర్గమర్త్యములను, వానిమధ్యనున్నదానిని దేవుఁడొక గొప్ప యుద్దేశముతో కొంతనియమితకాలమువఱకే సృజించి యున్నాఁడని వారు తమలో యోచించుకొనలేదా ? కాని, తుదకు వారు తమప్రభుసన్నిధి కేఁగవలసియున్నదని చాలమందికి తెలియదు.

వారు దేశములో సంచారము చేసి, తమపూర్వికుల కెట్టిగతి పట్టినదో కనుగొనలేదా ? వీరికంటె వారు మిగుల బలవంతులు. వారు భూమిని బ్రద్దలుచేసి యిప్పుడు నివసించియుండువారికంటె నధికసంఖ్యాకులుగ నందు నివసించియుండిరి; వారిప్రవక్తలు తమ సందేశమునుగూర్చి ఋజువుచూపుచు, వారిలోనికి వచ్చిరి; కాని, వారికి దేవుఁ డపకారము చేయలేదు ; తమకుఁదామే యపకారము చేసికొనిరి.

10 అప్పుడు దుష్టవర్తనులకుఁ గీడే ఫలమయ్యెను; వారు మా భయచిహ్నముల నసత్యములుగఁ బరిగణించి, వానిని తృణీకరించి, నవ్విరి.

అధ్యాయము-2.

దేవుఁడు సృష్టించి, దానిని తిరిగి తనయొద్దకే చేర్చికొనును. అప్పుడు మీరాతనియొద్దకే రావలయును.

ఆగంటవినఁబడు దినమున దోషులు మాటరాక స్తంభించి పోవుదురు.

దేవునితో సమానులని వారుకల్పించిన దేవతలు వారిని రక్షింపఁ జాలరు. అట్లు వారుకల్పించిన దేవతలను వారు నిరాకరింతురు.

ఆగంట మ్రోగుదినమున జను లొకరినుండి యొకరు విడి పోవుదురు.

విశ్వాసులై సన్మార్గావలంబులైనవారుమాత్రము మధు వనమునందు పూలచెట్లక్రింద నానంద మనుభవింతురు.

అవిశ్వాసులై మాసూచనలను, పరలోకజీవనమును, నసత్య ములని యెంచువారు ఘోరశిక్షకు పాత్రులగుదురు.

కావున సాయంకాలమందును, నుదయమున లేచినప్పుడును, దేవుని స్తోత్రము చేయుఁడు.

స్వర్గమర్త్యములయం దాతనికీర్తి ప్రబలును గాక! సంధ్యల యందును, మధ్యాహ్నము విశ్రాంతి నొందునపుడును, నాతని ధ్యానింపుఁడు.

చచ్చినవారినుండి బ్రతికినవారిని, బ్రతికినవారినుండి చచ్చిన వారిని, నాతఁ డుత్పత్తి చేయుచుండును. చచ్చినభూమి నాతఁడుజ్జీవింపఁ జేయును. ఇట్లే మీరును సృష్టింపఁబడుదురు.

## అధ్యాయము 3.

20 ఆతఁడు మిమ్ము బుగ్గినుండి సృష్టించియుండు టొకగుఱుతు; వెంటనే మీరు భూమియంతటను వ్యాపింతురు.

మీకు మీమనుష్యజాతినుండియే భార్యలను సృజించి, వారితో మిమ్ము నివసింపఁజేసి మీయిరువురకును ప్రేమానుబంధము నాతఁడు గూర్చుట యొకగుఱుతు. ఆలోచించువారి కిందే సూచనలు గలవు.

స్వర్గమర్త్యముల సృష్టియు, బహుభాషలును, పెక్కురంగులు, నివన్నియు నాతని సూచనలలోనివే. జనులందఱకు నిందు సూచనలు గలవు.

రాత్రింబవళ్ళు మీరు నిద్రించుటయు, నతని వరములకొఱకు మీరుచేయు ప్రయత్నములును, నాతని సూచనలే. వినువారికి సత్యముగా నిందు గుఱుతులున్నవి.

భయాశాజనకమగు మెఱపు నాతఁడు మీకుఁ జూపుటయు, స్వర్గమునుండి వర్షముఁ బంపుటయు, చచ్చినభూమికి జీవనముఁ బోయుటయు, నాతని సూచనలలోనివే. బోధపఱుచుకొనువారి కిందుసత్యముగా సూచనలుఁ గలవు.

ఆతని యాజ్ఞచొప్పున స్వర్గమర్త్యములు స్థిరముగ నిలుచుటయు నాతని సూచనలలో నొకటియే. తరువాత నొకపిలుపుతో మిమ్ము నాతడు భూమినుండి పిలుచునప్పుడు వెంటనే మీరు బయలుపడఁగలరు.

స్వర్గమర్త్యములందలి యన్నియును నాతనివే. అన్నియు నాతనికి విధేయములే.

ఒకజీవమును సృజించి తిరిగి తనయొద్దకు రప్పించు వాఁడాతఁడే; ఇది యాతనికి కడుసులభము. స్వర్గమర్త్యములయం దత్యుత్కృష్టమగు పదార్థములతో నాతని సరిపోల్పవలయును; అతఁడు శక్తిమంతుఁడు. బుద్ధిమంతుఁడు!

అధ్యాయము 4

మీలోనుండియే యాతఁడు మీకొక దృష్టాంతమును కల్పించినాఁడు. మీ కుడిచేతులతో మీరుజయించిన బానిసలలోను, మీకు మే మిచ్చిన ధనములోను భాగస్థుఁ డెవఁడైన నున్నాఁడా? మీరిరువురును సమానముగఁ బంచికొందురా? మీలో మీ రొకరికొకరెట్లు భయపడుదురో వారికినట్లే భయపడుదురా? (బోధ పఱుచుకొనువారికిట్లే మాసూచనలఁ దెలుపుచుందుము.)

అవును, మీరట్లుచేయరు కాని, యజ్ఞానులగు దుష్టులు, తమ కామముల ననుసరింతురు. దేవుఁడే తప్పుతోవ నడిపించిన వారి కెవరు మార్గము చూపెదరు? ఎవరు రక్షింపఁగలరు?

30 దేవుఁడు భక్తిని గల్పించినాఁడు; భక్తికొఱకు మనుష్యుని సృజించినాఁడు. కావున సత్యమగు పశ్చాత్తాపమునొంది యాభక్తివైపు మొగముంచుఁడు. దేవునిసృష్టియందు మార్పునది లేదు. ఇదియే సత్యమైనభక్తి; కాని మనుష్యులలోఁ జాలమందికిది తెలియదు.

మీరాతనివైపు తిరిగి, యతనికి భయపడి, ప్రార్థనచేసి, యతనికి సమానదైవములఁ గల్పించు వారితోడను,

తమ మతమును ఖండములుగఁ జేసికొని, యందఱును తమ మతమే మంచిదనుకొని సంతోషించుచు నుపశాఖలుగఁ జీలిపోయిన వారితోడను జేరకుఁడు.

మనుష్యుల కాపదగలిగినప్పుడు దేవునివైపు తిరిగెదరు. అతఁడును తనదయను జూపినంతనే వారిలో కొందఱాతనితో నితరదైవములఁ జేర్చెదరు.

వీరు మాయుపకారములను మఱచిపోవుదురు! అయిన సుఖింపుఁడు. తుదకు మీా తెలివితక్కువ మీాకు బోధపడఁగలదు.

వారు దేవునితోఁ జేర్చువారి కనుకూలముగ నేదైన నాజ్ఞ నొసగియున్నామా?

మేము మనుష్యులయెడఁ గరుణఁజూపినప్పుడు వారు సంతోషించెదరు. కాని, తా మొనర్చిన దుష్టకృత్యములకు ఫలము ననుభవింపవలసి వచ్చినప్పుడు వా రాశను విడిచికొందురు.

దేవునికిష్టమైనవారికి నిండు సంభారములను చేకూర్చి యిష్టము వచ్చినవారికి కొంచెముగా నిచ్చుచుండుట వారుచూచుచుండలేదా? నమ్మినవారి కిందు సత్యముగా సూచనలున్నవి.

నీబంధువునకు రావలసిన పాలునిచ్చివేయుము; బీదవానికి, దారిఁబోవువానికిని దానముచేయుము. దేవునిముఖమును జూడఁగోరువారి కిదియే శ్రేష్ఠము. అట్టివారికి శ్రేయస్సుకలుగును.

ఇతరుల ధనము నపహరించి వృద్ధికివేసినదానికి దేవుఁడు వృద్ధి నొసగఁడు. దేవునిముఖమును జూడఁగోరి, భిక్షముగా నిచ్చువానికి దేవుఁడు రెండింతలుగా నిచ్చును.

40 నిన్ను సృజించినవాఁడు దేవుఁడు—తరువాత నీకాహారము నొసగియున్నాఁడు. పిదప నిన్ను మృత్యువున కప్పగించును-తిరిగి బ్రతికించును. మీారు దేవునితో సమానులని చెప్పువారెవ్వరైన నిట్టి

పనులఁ జేయఁగలరా? అతఁడు స్తుతింపఁబడుగాక! అతనితో కలిపి చెప్పు దైవములకంటె నత్యుచ్ఛస్థానము నాతఁ డధిష్ఠించుఁగాక!

అధ్యాయము 5

మనుష్యులను స్వకర్మఫలముల ననుభవింపఁ జేయుటకును, వారిని దేవుని వైపునకుఁ ద్రిప్పుటకును, భూసముద్రములపై గొప్ప నాశము కలిగినది

"భూసంచారముచేసి మీ పూర్వులగతి ఏమయినదో కనుగొనుఁడు! వారిలో హెచ్చుమంది దేవునితో నితరదైవములఁ జేర్చినా" రని చెప్పుము.

దేవుఁడు రప్పించుదినము నెవ్వరు నడ్డగింపలేరు. ఆదినము రాక మునుపే క్రమభక్తిఁ దాల్చుటకు సుముఖులరు కండు!

ఆదినమున నవిశ్వాసమున నిలిచియున్న విశ్వాసహీనులను, సదాచార సంపన్నులై సుఖశయ్యల సంపాదించుకొన్న వారును, విడిపోవుదురు.

విశ్వాసయుతులై సన్మార్గవంతులగువారి కాతఁ డపారదయను జూపును. అవిశ్వాసకుల నాతఁడు ప్రేమింపఁడు.

అతని కరుణామృతము నాస్వాదించుటకును, అతని యాజ్ఞచొప్పున నావలు ప్రయాణముచేయుటకును, అతని ప్రసాదమువలన మీరు ధనము సంపాదించుటకును, మీకు కృతజ్ఞతాపూర్వక వందనముల నాచరించుటకును, ఆతఁడు వర్షసూచకములగు వాయువులఁ బంపించుట యాతని సూచనలలో నొకటైయున్నది.

మీకు పూర్వ మాయాజాతులవారికి ప్రవక్తలఁ బంపితిమి. వారును వారికడ కేఁగి తమసందేశములను స్పష్టముగా విశదీకరించిరి. విశ్వాసులను మే మప్పుడు రక్షించితిమి. దోషులపై పగదీర్చికొంటిమి.

గాలులనుబంపి మేఘముల లేపించువాఁడును, తనయిష్టప్రకారము వానిని నానాదిక్కుల వ్యాపింపఁజేసి చెదరఁగొట్టువాఁడును దేవుఁడే. వారిమధ్యనుండియే వర్షము బయలువెడలినది. తనయిష్టము వచ్చిన కింకరులపై నాతఁడు వర్షముఁ గురియించుచుండగా,

వర్షము పడకపూర్వము నిరాశులై యున్నవారుగూడ మోదముతో నిండియుండిరి.

50 భూమి మృతినొందినపిదప తిరిగి యెట్లు బ్రతుకుచున్నదో! దేవుని కరుణాచిహ్నముల గుర్తింపుము. ఈ దేవుఁడే మృతినొందినవారిని బ్రతుకఁజేయును. అతనిశక్తి యన్నివస్తువులయందును సమముగా నుండును.

అయినను మేము ప్రచండవాయువునుబంపి వారిపంటలను పాడుచేసినప్పుడు వారు కృతఘ్నులగుదురు.

నీవు చచ్చినవారిని వినఁజేయలేవు. చెవిటివారు వెనుదిరిగినప్పుడాపిలుపును వినఁజేయలేవు.

నిజముగా గ్రుడ్డివారిని వారితప్పునుండి మరల్పలేవు. మాసూచనల నమ్మినవారే నిజమైన భక్తులు; వారు మాయిచ్ఛాధీనులయినారు.

అధ్యాయము-6.

దేవుఁడు మిమ్ము తొలుత బలహీనులుగాసృజించి పిదప మీకు బలము నిచ్చినాఁడు. పిదప బలహీనతను, నెరసిన వెండ్రుకలను నిచ్చినాఁడు; అతని కిష్టమువచ్చినదాని నాతఁడు సృజించును. అతఁడు బుద్ధిమంతుఁడు; శక్తిమంతుఁడు.

ఆగంట ప్రమోగుకాలమున, ఒక్కగంటయే వేచియుంటిమని యాదుర్మార్గులందురు. భూమిపైఁగూడ వారట్టి యసత్యములనే పల్కియుండిరి.

కాని, భక్తిజ్ఞాన సంపన్నులు "దైవగ్రంథము ప్రకారము మీరు రక్షణదినమువఱకు వేచియుంటిరి. ఇదియే రక్షణదినము. అది మీకు తెలిసినదికాదు" అందురు.

ఆదినమున దుష్టులు కల్పించు సాకులు పనికిరావు. నాఁడు వారు దేవునియధీనములోనికి రా వీలులేదు.

ఈ కురానులో నన్నివిధములగు నీతికథలను జెప్పియున్నాము. కాని, యందులో నొక్కపద్యము నెవ్వరైన వారిముందఱ చదివి నచో వారు "మీరు కేవలము వృథాలాపు" లని యందురు.

అజ్ఞానుల హృదయములను దేవుఁ డిట్లే మూసివైచినాఁడు.

60 కాని, ముహమ్మదా! సహించి యుండుము. దేవునివాగ్దానము సత్యము; విశ్వాసహీనులవలన నీభక్తిని గోల్పోవకుము.

---

# సురా 31-లుఖ్మాను.

---

మక్కా-34. పద్యములు-4 రుకూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లామ్. మీమ్.

ఇవి జ్ఞానగ్రంథమునందలి సూచనలు.

ప్రార్థనఁ దప్పక, విధివిహితభిక్షమును చెల్లించి, పరలోకజీవనమునందు గట్టినమ్మకము గలవారికిని,

పుణ్యవర్తనులకునునిది రక్షణోపాయము. కరుణాప్రదాయకము.

వీరు తమ ప్రభుపురక్షణనే నమ్ముకొనియుందురు. వీరికి శ్రేయస్సు కలుగును.

తా నజ్ఞానియై, యితరులను దేవునిమార్గమునుండి తప్పించి, దానిని తృణీకరింపఁజేయుటకై వృథాలాపములఁ జేయు వాఁ డొకఁ డున్నాఁడు. అట్టివారికి లజ్జాకరమగుశిక్ష సిద్ధముగా నున్నది!

అతనికి మా సూచనలఁ దెల్పఁగా, వానిని విననివానివలెను, పెద్దచెవుడున్నవానివలెను, తిరస్కారభావముతో నాతఁడు మఱలి పోవును. కావున నతనికి ఘోరశిక్ష కలుగనున్నదను వార్తను ప్రకటించుము.

కాని, నమ్మకముగలిగి పుణ్యవర్తనులగువారికి నందనోద్యాన వనములు విహారభూము లగును.

వా రందు శాశ్వతముగ వసింపఁగలరు. ఇది దేవునిసత్యప్రతిజ్ఞ. ఆతఁడు శక్తిమంతుఁడు, బుద్ధుఁడు.

10 కన్నులకు కానరాని స్తంభములతో నాతఁడు స్వర్గములను సృష్టించినాఁడు. భూమి నీతోఁగూడఁ దిరిగిపోకుండుటకై యాతఁడు భూమిపైఁ బర్వతముల నెత్తియుంచినాఁడు. దానిపై నాతఁ డన్నివిధములగు జంతువులను నుంచియున్నాఁడు. మేము స్వర్గమునుండి వర్షముఁ దెప్పించి, భూమిపై నన్నిరకముల మొలకలను మంచివానినిపుట్టింతుము.

ఇది దేవుని సృష్టి. అతఁడు గాక యితరులు సృష్టించిన దేదో నాకుఁ జూపుము. ఆహా! భక్తిహీనులు కేవలము మోసమునకు లోనై యున్నారు.

## అధ్యాయము-2.

పూర్వము మేములుఖ్మానునకు బుద్ధి నిచ్చి "దేవునికిఁగృతజ్ఞుఁడవై యుండుము. కృతజ్ఞుఁడు తన మేలుకొఱకే యట్లుండును. ఎవఁ

డైనఁ గృతఘ్నుఁడైనచో......... దేవుఁడు స్వయంశక్తుఁడు. అన్ని విధములను స్తవనీయుఁడు" అని బోధించితిమి.

లుఖ్‌మాను తనపుత్త్రినికి భయసూచన నిచ్చుచు, "కుమారా! దేవునితోఁ నితరదైవములఁ జేర్పకుము. అట్లు చేయుట భక్తిలోప మగును'' అని చెప్పుటను స్మరింపుఁడు.

మనుష్యులకుఁ దమ తల్లిదండ్రులనుగూర్చి యాజ్ఞాపించి యుంటిమి. తల్లి మిక్కిలి బలహీనురాలగుచు అతనిని గర్భమున మోయుచుండును. రెండేండ్లవఱకు నాతఁడు తల్లిపాలను విడువఁడు. నాకును, నీతలిదండ్రులకును గృతజ్ఞతఁ గలిగియుండుము. అందఱును నాయొద్దకే తిరిగి చేరఁగలరు.

కాని, నీకుఁ దెలియనిదానిని నాతోఁ జేర్పుమని వారు నిన్ను బ్రతిమాలినను, వారిమాట నంగీకరింపకుఁడు క్రమము ధర్మము నగునట్లు లోకమున సంచరింపుఁడు. నావంకఁ దిరుగువాని మార్గము ననుసరింపుఁడు. తుదకు మీరు నన్నే చేరుదురు. అపుడు మీపనులను మీకుఁ దెల్పెదను ;

"కుమారా! ఆవగింజ యెత్తుగలదైనను, పెద్ద ఱాతిక్రింద నైనను, స్వర్గములందైనను, భూమియందైనను దాగియున్నప్పటికిని దేవుఁడు బయలుపెట్టియే తీరును. దేవుఁడు సర్వాంతర్యామి, సర్వజ్ఞుఁడు.

"పుత్త్రికా! ప్రార్థనసలుపుము. క్రమవర్తనమును విధించుము. అక్రమమును నిషేధించుము, నీకేమి సంభవించినను నోర్పు గలిగియుండుము. ఇది నీకుఁ దప్పనివిధి.

"మనుష్యులనుజూచి మొగము చిట్లించుకొనకుము. భూమిపై బొరవిఱిచికొని నడవకుము, గర్విష్ఠియై తన ప్రభావమును చాటుకొనువానిని దేవుఁడు ప్రేమింపఁడు.

"అంత వేగముగను, అంతమెల్లగను గాకుండ నడువుము. నింపాదిగా మాట్లాడుము. గార్దభస్వరము మనోహరముకాదు" అని లుఖ్మాను తన పుత్త్రున కుపదేశించెను. దీనిని స్మరింపుఁడు.

అధ్యాయము-3.

20 స్వర్గమర్త్యముల నున్నదంతయు దేవుఁడు మీకు వశముచేసి, మీదేహములకు నాత్మలకుఁగూడ నెట్టివరముల నిచ్చియున్నాఁడో మీకుఁ దెలియదా? కాని, కొందఱు జ్ఞానశూన్యులై దేవునిఁగూర్చి వాదించుచుందురు. వారికి రక్షణగాని జ్యోతిర్గ్రంథముగాని దొరకదు.

'దేవుఁడు పంపినదానిని మీ రనుసరింపు' ఁడని వారితోఁ బల్కఁగా "అట్లు చేయము. మా తండ్రి తాతల మతమునే యనుసరింతుము" మని వారందురు. ఏమి! సైతాను వారి నగ్నిలోనికిఁ బొమ్మని యాజ్ఞనిచ్చినను నిట్లే యందురా?

కాని, దేవునికి వశుఁడై, యాతనికభిముఖుఁడై సత్కార్యముల నాచరించువాఁడు మంచియాధారము నాశ్రయించియున్నాఁడు. సర్వకర్మల ఫలములును దేవునివలననే కలుగుచుండును.

అనమ్మనివారి యవిశ్వాసముఁజూచి నీవు చింతిల్లవలదు. వారు మాయొద్దకే రాఁగలరు. అప్పుడు వారికార్యములను వారికిఁ దెల్పుదుము. దేవునికి హృదయములోని రహస్యములన్నియు నెఱుకయే.

వారికిఁ గావలసినదాని నింక గొంతకాలముమాత్రమే సమకూర్చెదము. తరువాత వారికిఁ గఠినశిక్ష విధింతుము.

స్వర్గమర్త్యములను సృజించినవాఁ డెవఁడనిన వారు 'దేవుఁడే' యనియందురు. "దేవునికి స్తుతియగుఁగాక! కాని, వారిలోఁజాలమందికి జ్ఞానము లేదు" అనుము.

స్వర్గమర్త్యములలో నున్నదంతయు దేవునిదే! దేవుఁడే భాగ్యవంతుఁడు, స్తవనీయుఁడు!

భూమిపైనున్న వృక్షములన్నియుఁ గలములై, తరువాత దేవుఁడు సముద్రమును పొంగఁజేసి యేడుసిరాసముద్రములుగాఁ జేసినను, ఆతని వాక్యములు తరిగిపోవు. దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధుఁడు.

మీసృష్టియు, మీపునర్జీవమును, నెవఁడో యొకనిఁగూర్చినవిగ నున్నవి. దేవుఁడు వినుచుఁ జూచుచు నున్నాఁడుగదా!

దేవుఁడు పగటిని రాత్రియందును, రాత్రిని పగటియందును, సంక్రమింపఁజేయుటను నీవు చూడలేదా? సూర్యచంద్రుల కాతఁడు గతిధర్మముల విధించి వారియుదిష్టస్థానములకుఁ బంపుచుండునుగదా! కావుననాతఁడు మీరు చేయుదాని నెఱింగియే యుండునుగదా!

30 దేవుఁడు సత్యమూర్తి గావునను, అతనినిగాక మీరావాహన చేయునదంతయును వృథకావునను, దేవుఁడే యున్నతుఁడును, మహాత్ముఁడును గావునను నీరీతిగఁ జరుగును.

## అధ్యాయము-4.

దేవుఁడు తనసూచనలను మీకుఁ జూపుటకు తనయనుగ్రహము వలన నావలను సముద్రముపై నెట్లునడుపుచున్నాఁడో మీరు చూడ లేదా? సహనపరులై కృతజ్ఞులై యుండువారికిందు సూచనలున్నవి.

నల్లనినీడలవలె కెరటములుతమ్ముకప్పునప్పుడువారు నిష్కల్మష భక్తిపరులైనట్లే యాతనికై మొఱలిడుదురు. కాని, యాతఁడు వారిని సురక్షితముగ దరిఁజేర్చినంతనే వారిలోఁ గొంద ఱెవరినినమ్ముదుమా యని యోచించుచు నూరకొందురు. మోసగాండ్రును, కృతఘ్నులును తప్ప మఱెవ్వరును దేవునిసూచనలను నిరాకరింపరు.

జనులారా! మీప్రభువునకు భయపడుఁడు! తండ్రి కొడుకు నకుఁగాని, కొడుకు తండ్రికిఁగాని, యడ్డుపడఁజాలని యా దినమును దలఁచి గడగడవడంకుఁడు. అవును, దేవునిప్రతిజ్ఞ సత్యము. కావున

ప్రస్తుతజీవనమును జూచి మోసపోకుఁడు, దేవునిగూర్చి మోసగాని మోసములో పడిపోకుఁడు.

అవును ! ఆగంటఁగూర్చి దేవునికే తెలియును. వర్షమునుపంపించువాఁడాతఁడే. గర్భములలోఁగూడ నేమున్నదో యాతనికిఁ దెలియును. కాని, యాత్మ తనకు మఱునాఁడేమి కలుగనున్నదో కూడ తెలిసికొనఁజాలదు. ఆయాత్మ యేదేశములో తాను చావవలసియున్నదోకూడ తెలిసికొనఁజాలదు. దేవుఁడు జ్ఞాని. అతనికిఁ దెలియని దేదియులేదు.

---

# సురా 32 ఆరాధన.

---

మక్కా-30 పద్యములు-3 రుకూలు.

## అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అలీఫ్. లామ్. మీమ్.

ఈగ్రంథమును జగన్నాయకుఁడు పంపిన జ్ఞానసందేశమనుట కెట్టిసందేహమును లేదు.

దాని నాతఁడు సృష్టించెనందురా ? అట్లుకాదు. వారు శిక్షణఁ బొందెదరేమో యని పూర్వ మెవ్వరును భయసూచన నీయని యాజనులకు నీవు భయసూచననిచ్చుటకు నీప్రభువు నీకాసత్యమును బంపియున్నాఁడు.

స్వర్గమర్త్యములను, తదంతరాళములను, నాఱుదినములలో దేవుఁడు సృజించి పిదప సింహాసనారూఢుఁడయ్యెను. ఆతఁడు తప్ప నిన్ను పోషించువాఁడును, నీకుసహాయపడువాఁడును, మఱెవ్వఁడును లేఁడు. కావున నీవాలోచించుకొనవేల ?

స్వర్గమునుండి భూమివఱకుఁ గల యన్నివస్తువులను నతఁడు పాలించుచున్నాఁడు. మీరు లెక్కింపఁజాలనట్టి వేల సంవత్సరముల పరిమితిగల యొకదినమున నవి యన్నియు నాతనియొద్దకు రాఁగలవు !

దృష్టాదృష్టపరిజ్ఞాతయు, శక్తిమంతుఁడును, దయానిధియునై,

సర్వమును నతిశ్రేష్ఠముగ సృష్టించి, మనుష్యుని మట్టితో నిర్మించి,

జీవకణములనుండియు, ముఱికినీటినుండియు, నాతనికి సంతానమును గలుగఁజేసి,

ఆతనికి రూపము నిచ్చి, తనప్రాణము నాతనియందుఁ బ్రసరింపఁజేసి, మీకు వినుటకును, చూచుటకును శక్తియు, హృదయములను, బ్రసాదించినవాఁ డాతఁడే అయినను మీ రెంతకృతఘ్నులరై యున్నారు !

10 వారు “ఏమి, మేము భూమియందు దాగియుండి పునఃసృష్టి నొందుదుమా ?” అందురు. అవును. వారు తమప్రభువును చేరుట యసత్యమందురు.

“మీ వెంటనంటియున్న మృత్యుదేవత మిమ్ము చంపఁగలదు. అప్పుడు మీరు మీ ప్రభువునొద్దకుఁ రాఁగలరు” అనుము.

## అధ్యాయము-2.

ద్రోహులగువారు తమ ప్రభువు ముందర నమ్రవదనులై “ప్రభువా ! మేము విన్నాము. కన్నాము. మమ్ము మఱల జీవింపఁ

జేయుము. క్రమముగ సంచరించుకొందుము. నిశ్చయముగా మాకు దృఢభక్తికుదురుకొన్నది" అనుట నీవు చూచితీరవలెను.

(ఆతనికిష్టమైనచో నాత్మలకన్నిటికి నాతఁడు రక్షణ నొసగి యుండును. కాని, నేను తొలుతనే చెప్పియుండినమాట సత్యము కాక తప్పదు. నేను నిశ్చయముగా పిశాచములతోడను, మనుష్యుల తోడను, నరకమును నింపివైచెదను.)

"ఈదినమున మిమ్ములను కలిసికొనుటనుగూర్చి మఱచినందుకు బహుమానమును స్వీకరింపుము. మేముకూడ నిన్ను మఱచి పోయినాము. కావున నీవుచేసినదానికి శాశ్వతశిక్షను పొందుము.

సూచనలఁగూర్చి ముచ్చటవచ్చినంతనే యారాధనాపరులై సాష్టాంగపడువారును, ప్రభువును స్తుతించువారును, గర్వముచే నుప్పొంగనివారును,

శయ్యలనుండి లేచుచునే భయముతోడను, కోరికతోడను, ప్రభునామమును స్మరించువారును, మే మనుగ్రహించినదానిలోనే భిక్షపెట్టువారును, వీరే మా సూచనలను విశ్వసింతురు.

తనకర్మల కేమిబహుమానముఁ బొందఁగలలో యేయాత్మకును దెలియదు.

అయిన భక్తుఁడును ఘోరపాపివలె నుండవలయునా? వా రిద్దఱను నొకరీతిగా గణింపఁబోవ,

భక్తులై పుణ్యకర్మల నాచరించువారికి, తమపుణ్యకార్యములకు బహుమానముగా శాశ్వతవాసములగు వనములుకలుగును.

కాని ఘోరపాపములఁ జేయువారి కగ్నియే వాసస్థానము. వారెన్నిసార్లు దానినుండి తప్పిపోనెంచినను, దానియందే మరల మరలఁ ద్రోయబడుదురు. వారితో "మీ రసత్యమనిపల్కిన యగ్ని బాధ ననుభవింపుఁడు" అనిచెప్పఁబడును.

ఇదిగాక వా రిఁకముం దనుభవింపఁగల పెద్దబాధ ననుభవింపక పూర్వము పశ్చాత్తాపము నొందుదురేమో యని ముందుగా చిన్న బాధలను బంపుచునే యుందుము.

ప్రభువుసూచనలను గ్రహించియు వానిని లక్ష్యపెట్టనివాని కంటె నధముఁ డెవ్వఁడుండును ? ద్రోహులపై మేము పగదీర్చికొనక తప్పదు.

అధ్యాయము. 3.

ఇంతకుఁబూర్వము ధర్మగ్రంథమును మూసా కిచ్చితిమి. అత నితో మేము మాట్లాడుటఁగూర్చి నీకెట్టిసందేహమును వలదు. దాని నిస్రాయేలు ప్రజలకు రక్షణమార్గముగా విధించితిమి.

మాయందు నిశ్చలభక్తిగలిగి మాసూచనలను నమ్మినవారిలో మాయాజ్ఞప్రకారము సంచరించువారిని కొందఱను " ఇమాముల "ఁ జేయుచున్నాము.

రక్షణదినమున నీప్రభువే వారి వివాదవిషయమును నిర్ణయింపఁ గలఁడు.

వారిప్పుడు సంచరించు గృహములలోనివారికి పూర్వ మెన్నితర ములవారినో మేము నాశనముచేసియున్నాము. ఇవియే మాసూచ నలు. వానిని వారు వినరేల ?

ఎడారినేలలపై వర్షముఁగురియించి, యందు సస్యముల మొలపించి, వారికిని, వారిపశువులకును, నాహారమును మేము కల్పించుచుండుట, వారు చూచుచునే యున్నారుగదా ? వారు కన్నులనింకను తెఱవ రేల ?

" నీవు సత్యవంతుఁడవైనచో నీతీర్పెప్పుడు వచ్చును" అని వారందురు.

వారితో "ఆతీర్పుదినమున నవిశ్వాసకులు భక్తిపరులైనను కార్యములేదు. వారికి మఱి గడవుదొరకదు.

30 కావున వారికి దూరముగానుండి వారివలె మీరును కనిపెట్టు కొని యుండుఁడు" అనుము.

---

# సురా-33-సహాయసైన్యములు.

---

మదీనా-73 పద్యములు-9 రుకూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

ప్రవక్తా! నీవు దేవునికి భయపడుము. అవిశ్వాసులను కపటులను మన్నింపకుము. నిశ్చయముగా దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

నీప్రభువు నీకుఁదెలిపినదాని ననుసరింపుము. అతనికి నీకార్యము లన్నియుఁ దెలియును.

దేవునియందు విశ్వాసముంచుము. దేవుఁడు నీకుసహాయము చేయఁజాలును.

దేవుఁడు మనుష్యులకు రెండుహృదయముల నొసగలేదు. మీరువిడిచిపెట్టిన భార్యలు మీకు తల్లులు కానేరరు. మీ పెంపుడు కొడుకులు మీకుసొంతపుత్త్రులు కానేరరు. ఇట్టిమాటలుమీనోళ్ళలో నున్నవి. కాని, దేవుఁడు సత్యమును వచించును. అతఁడు మిమ్ము తిన్ననిమార్గములో నడపును.

కొడుకులకు తండ్రులపేళ్ళు పెట్టుఁడు. ఇది దేవునికి సమ్మతము. వారి తండ్రులెవరో మీకుఁ దెలియకపోయిన వారిని నీమతసోదరులుగను, సహాయకులుగను చేకొనుఁడు. మీ రీవిషయమున బుద్ధిపూర్వకముగఁ జేయకున్నచో నేదియు నేరముకానేరదు. దేవుఁడు క్షమాయుతుఁడు, దయాళుఁడు.

వారికి తమకంటె ప్రవక్తయే దగ్గఱబంధువులు. అతనిభార్యలు వారితల్లులు. దైవగ్రంథముప్రకారము తక్కిన విశ్వాసులకంటెను దేవునికొఱకు తమదేశమును వదలిపెట్టినవారికంటెను, రక్తసంబంధము కలవారే దగ్గఱబంధువులు. మీరు మీబంధువులకుఁ జూపినదయయంతయు గ్రంథములో వ్రాయఁబడుచుండును.

ప్రవక్తలతోడను, నీతోడను, నుహూ, ఇబ్రహీము, మూసా, మరియమ్మ కుమారుఁడగు ఈసా వీరలతోడను మేమొడంబడికచేసికొనియున్నాము. వారితో నిశ్చితసంధి నేర్పఱిచికొనినాము.

సత్యవంతులను వారిసత్యమును గూర్చియడుగుటకే యీసంధి చేసితిమి. కాని, యవిశ్వాసుల కొఱకు ఘోరబాధనాయత్తపఱిచియుంచినాఁడు.

## అధ్యాయము 2.

విశ్వాసులారా, సైన్యములు మీపైకివచ్చినప్పుడు వానిపై మారుతమును మీకుకానరానిసైన్యములను బంపిన దేవుని కారుణ్యమును స్మరింపుఁడు. మీ కార్యములపై దేవుఁడు దృష్టి నుంచియేయున్నాఁడు.

10 వారు మిమ్ము మీఁదినుండియు క్రిందినుండియు నెదిరించినప్పుడు మీ కన్నులు మిఱుమిట్లుగొనినవి. మీహృదయములు మీగొంతుకలలోనికివచ్చినవి. మీరు మీదేవునిఁగూర్చి పలువిధములఁ దలంపసాగితిరి.

అప్పుడు విశ్వాసులకు శోధనకలిగెను. వారు గడగడ వడంకిరి.

అసంతృప్తిపరులును "దేవుఁడును, నతని ప్రవక్తయు నిచ్చిన మాటలు, మోసము" లనియు,

వారిలోఁగొందఱు "ఓ యస్రీబుప్రజలారా! ఇది మీకు భద్రమగు స్థలముకాదు. కావున మీ పురములోనికి పొండు" అనియు, పల్కుటచే నీశోధనకలిగెను. మీలోఁ గొందఱు తిరిగిపోయెదమనియు, తమయిండ్లను రక్షించువారెవ్వరును లేరనియుఁ బ్రవక్తతో విన్నవించుకొంటిరి. అట్లుకాదే! వారిగృహములు రక్షణలేకుండ విడువఁబడలేదే ; వారికి పాఱిపోవలయునని మాత్రము కోరిక యుండెను.

శత్రు వన్నిదిక్కులనుండియుఁ బ్రవేశించునప్పుడు వారి నల్లరలఁ బుట్టింపుమనినచో నట్లే పుట్టించియుందురు. కాని, వారెంతో కాలము దానిలో (మదీనాలో) నుండలేకపోవుదురు.

పూర్వము వారు వెనుదిరుగమని దేవునియానఁ బ్రమాణము చేసియుండిరి. దేవునికిచ్చిన ప్రమాణము పరీక్షింపఁబడవలయును.

"మీరు పాఱిపోవుటవలన లాభములేదు. ఒకవేళ మీరు చావునుగాని, చంపఁబడుటవలన తప్పించుకొనినచో మీసద్వస్తువులను కొలఁదికాలము మాత్రమే యనుభవింపఁగలరు.

దేవుఁడు మీకు కీడుకలుగఁజేయ నెంచినను, దయఁజూడఁ దలఁచినను, మి మ్మాతనినుండి యెవరు దాఁచఁగలరు ? దేవుఁడుతప్ప వారికి సంరక్షకుఁడుగాని, సహాయకుఁడుగాని మఱియొకఁడుండఁబోఁడు" అనుము.

మీలో నాటంకములు గలుగఁజేయువారిని "మాదగ్గఱకు రండని తమ సోదరులతో ననువారిని, ఏదోకొంచెమే యుద్ధముచేయు వారిని, దేవుఁడు బాగుగ గుర్తించి యున్నాఁడు.

ఒకయాపద ప్రాప్తించినప్పుడు వారు నీవంకఁజూచి చచ్చుటకు సిద్ధముగా నున్నవారివలె కన్నులను తేలవేయుదురు. ఇది నీపై

నీర్ష్యచేతనే. ఒకవేళ నాయాపద తొలఁగిపోయినచో నప్పుడును వారీర్ష్యాబద్ధులై, మీకు దొఱకిన కొల్లలో శ్రేష్ఠభాగమును గ్రహించుటకు నిన్నెదిరింతురు. వీరికి విశ్వాసము లేదు! దేవుఁడు వారికార్యములను నిరర్థకములఁ జేయును! ఇది దేవునికి సులభము.

20 బొడ్డారులకు సహాయకములై వచ్చిన సైన్యము లెన్నటికిని మరలిపో వని వారుతలంచిరి. వారు మరలవచ్చినను తాము మాత్ర మెడారిలోని యరబ్బులలోనేయుండి నీకేమయ్యెనో యను వార్తకై యెదురుచూడ నెంతురు. వారు నీతోనున్నను నెంతోయుద్ధము చేయరు.

అధ్యాయము 3.

దేవునిపై నాశపెట్టుకొనువారును, తుదిదినమును నమ్మిన వారును, దేవుని పలుమారు స్మరించువారును దేవునిప్రవక్తనే యుదాహరణప్రాయునిఁగఁ జేకొందురు.

విశ్వాసు లాసహాయసైన్యములఁజూని "దేవుఁడును, నతనిప్రవక్తయు, మాకుఁ జెప్పిన దిదియే. వారిమాటలు సత్యములు." అని యందురు. దానివలన వారి భక్తియు నుత్సాహమును నధికములయ్యెను.

విశ్వాసులలోఁ గొందఱు తాము దేవుని ప్రమోలపల్కినమాటను దప్పకుండిరి. కొందఱు తమపనిని ముగించిరి. కొందఱు ముగింప నెంచుచున్నారు. వారు మాఱిపోలేదు.

విశ్వాసులకు వారి విశ్వాసములకై దేవుఁడు బహుమాన మిచ్చుటకును, కపటులను తనకిష్టమైనచో శిక్షించి, లేకున్న దయఁ జూచుటకును, వారిట్లుచేసిరి. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు.

భక్తిహీనులు క్రోధముతో నుండఁగనే దేవుఁడు వారిని దరిమివైచెను. వారి కేలాభమును గలుగలేదు. పోరిలో దేవుఁడు విశ్వాసులకుఁ జాలియుండెను. దేవుఁడు బలవంతుఁడు, శక్తిమంతుండు.

వారిలో గ్రంథావలంబకులును, నాసైన్యములకు సహాయము చేసినవారునునగు యహూదీల నాతఁడు తమకోటలనుండి రప్పించి వారిహృదయములందు కలఁతఁ బుట్టించెను. కొందఱను మీరుచంపితిరి. కొందఱను ఖైదీలుగఁ బట్టికొంటిరి.

ఆతఁడు మీకు వారిభూమిని, గృహములను ధనమునుగూడ ననుభవింప నిచ్చివేసెను. మీరింతకుపూర్వము కాలుపెట్టియుండని భూమిని గూడ నాతఁడు మీకిచ్చెను: దేవునిశక్తి యెంతకైనను జాలును.

## అధ్యాయము-4.

ప్రవక్తా! మీభార్యలతో మీ కిహలోకసౌఖ్యములే కావలసినచో నాతోఁరండు. మీకు వానినిచ్చి మిమ్ము గౌరవముగ విడిచి పెట్టెదను.

'కాని, మీకు దేవుఁడును, నాతని ప్రవక్తయుఁ, బరలోకవాసమును గావలసినచో నిశ్చయముగా మీదేవుఁడు గొప్పబహుమానమును మీలోఁ బుణ్యవంతులకు సిద్ధముచేసియే యున్నాఁడు.

33 'పవిత్రభార్యలారా! మీలో నెవతెయైనను వ్యభిచారము చేసినచో నామెశిక్ష ద్విగుణితమగును. దేవునికిది సులభము.

---

# కాండము. 22

---

'మీలో దేవుని, నతని ప్రవక్తను మన్నించి క్రమముగవర్తించు నామెకు రెండింతలుగ బహుమానమిత్తుము. ఆమెకు కావలసిన దంతయు గౌరవముగ సిద్ధపఱిచియున్నాము.

'ప్రవక్తభార్యలారా! మీరు తక్కిన స్త్రీలవంటివారుకారు. మీరు దేవునికి భయపడినచో, చనవిచ్చి మాట్లాడకుఁడు. హృదయ రోగముగల కాముకుఁడు మిమ్ము కామించునేమో! కావున యోచన కలిగి మాట్లాడుఁడు.

'మీరు మీ యిండ్లయందే యుండుఁడు. పూర్వ మజ్ఞానదశలో శృంగారించుకొని వీథులలోఁ దిరిగిన ట్లిప్పుడును తిరుగకుఁడు. ప్రార్థన మానకుఁడు. విధివిహితభిక్షమును చెల్లింపుఁడు. దేవుని నతనిప్రవక్తను మన్నింపుఁడు. దేవుఁడు మిమ్ము తనకుటుంబములోనివారినిగా భావించి కల్మషమును హరించి మిమ్ము పవిత్రలఁ జేయును.

'దైవగ్రంథముఁ గూర్చియు, జ్ఞానముఁ గూర్చియు, మీకు తెలుపఁబడినదానిని మీ యిండ్లలో స్మరింపుఁడు. దేవునికి సూక్ష్మ దృష్టికలదు. అతఁడు సర్వజ్ఞుఁడు'' అనుము.

అధ్యాయము. 5.

నిశ్చయముగా దేవునియధీనమునఁ జేరువారు (ముస్లిములు)ను, విశ్వాసులును, విశ్వాసినులును, భక్తులును, భక్తురాండ్రును, సత్యవంతులును, సత్యవతులును, సహనముగల పురుషులును, స్త్రీలును, నమ్రులును, నమ్రలును, భిక్షాప్రదాతలును, భిక్షాప్రదాయినులును, ఉపవాసముచేయు పురుషులును, స్త్రీలును, పవిత్రవంతులును, పవిత్ర

వతులును, దేవుని నిత్యము స్మరించు స్త్రీపురుషులందఱును దేవునియొద్ద సిద్ధముగనున్న క్షమాపణను, బహుమానములను బొందఁగలరు.

దేవుఁడును, నాతని ప్రవక్తయు నొకవిషయమై యొకరీతిగా విధించియున్నప్పుడు విశ్వాసులు స్త్రీయైనను పురుషుఁడైనను నన్యథా చేయవీలులేదు. దేవుని నాతని ప్రవక్తను మన్నింపనివారు తప్పక తప్పులోఁబడియున్నారు.

దేవుఁడును నీవును ననుగ్రహించినవానితో నీభార్యను నీయొద్దనే యుంచికొనుము. దేవునికి భయపడుము" అని నీవు పల్కితివి. దేవుఁడు వెలిబుచ్చగలదానిని నీవు దాచిపెట్టితివి. మనుష్యునికి భయపడితివి; దేవునికి భయపడియుండుట క్రమముగ నుండి యుండును. జాయిూదామెను విడనాడనిశ్చయింపఁగా నామెను నీకుఁ బెండ్లిచేసితిమి. పెంపుడుకొడుకుల పెండ్లములకు రావలసినదియిచ్చి వారిని పెండ్లియాడుట నేరముకాదని తెల్పుటకే యిట్లు చేసితిమి. దేవునియాజ్ఞ జరిగియేతీరవలెను.

దేవుఁ డనుమతించియుండినచోట ప్రవక్తకే నిందయు రాఁజాలదు. నీకుఁ బూర్వముండిన ప్రవక్తలవిషయమై దేవుఁ డట్లే సంచరించెను. దేవునియాజ్ఞ తప్పనిది.

ఆపవిత్ర దేవుఁడు తనతోఁ బంపినసందేశమును దెలిపి, యాతనికి భయపడి, యితరులకు భయపడకుండెను. దేవుఁడు సరిగ లెక్కించుచునే యుండును.

40 ముహమ్మదు మీలో నెవరికిని తండ్రికాఁడు. అతఁడు దేవుని ప్రవక్త. పూర్వప్రవక్తల మాటలను స్థిరపఱుపవచ్చియున్నవాఁడు. దేవుఁడు సర్వజ్ఞుఁడు.

అధ్యాయము. 6

విశ్వాసులారా! దేవుని సర్వదా స్మరింపుఁడు.

సాయంప్రాతలయందాతని స్తుతింపుఁడు.

అతఁడు మి మ్మాశీర్వదించును. అతనిదేవతలు మీకు మాధ్య స్థ్యమును వహింతురు. అతఁడు మిమ్ము చీకటినుండి వెలుతురులోనికిఁ దెచ్చును. అతఁడు విశ్వాసులయెడ కరుణాళుఁడు.

వా రాతనిని గలిసికొనుదినమున 'శాంతిరస్తు' అని యభివం దింతురు. అతఁడు వారికొక గొప్పబహుమానమును సిద్ధము చేసి యున్నాఁడు.

ప్రవక్తా! నీవుసాక్షివై, సువార్తను దెలుపువాఁడవై, జయ సూచననిచ్చువాఁడవై యుండుటకే నిన్ను బంపితిమి.

అతనియనుమతిచొప్పున నీవు జనులను దేవునియొద్దకుఁ బిలుచు వారికి త్రోవయందు వెలుఁగునిచ్చు దివిటీవలె నుండవలయును.

కావున విశ్వాసులకు దేవునియొద్ద గొప్పవరములు సిద్ధముగ నున్నవని ప్రకటింపుము.

భక్తిహీనులను, కపటులను, మన్నింపకుము. కాని, వారికి హానిచేయకయుండుము. దేవుని నమ్మియుండుము. అతనిసంరక్షణ నీకు చాలును.

విశ్వాసులారా! మీరు విశ్వాసినులను బెండ్లియాడి వారితోఁ గలియకపూర్వమే విడిచిపెట్టినచో వారివిషయమై మీరు మఱివేచి యుండనక్కఱలేదు, వారికి తినుటకుఁ దగినంత యిచ్చివేసి గౌరవ ముగఁ బంపివేయుఁడు.

ప్రవక్తా! నీవు ధనము నిచ్చి పెండ్లిచేసికొనినవారిని, దేవుఁడు మీ కనుగ్రహించినకొల్లలో నీకుడిచేతితో బానిసలఁగా గ్రహించిన స్త్రీలను, నీ మేనమామ కూఁతులను, నీతో మదీనాకు పాఱివచ్చిన నీమేనత్తలయు, పినతల్లులయు కుమార్తెలను, ప్రవక్తవివాహామా డఁగోరఁగా నాతనియధీనములోనికివచ్చిన విశ్వాసినులను, నీవు భార్య

లుగ పరిగ్రహింపవచ్చును. తక్కినభక్తులకంటె నీకీయధికారమును హెచ్చుగ నిచ్చితిమి.

50 వారిభార్యలకును, వారికుడిచేతులలో నుండు బానిసరాండ్రకును, మే మేమి విధించియున్నామో మాకుఁ దెలియును. నీవలన నేతప్పునులేదు. దేవుఁడు దయాళుఁడు, కరుణాళుఁడు !

ప్రస్తుతము వారిలో నీయిష్టమువచ్చినవారిని నిరాకరింపవచ్చును. నీయిష్టమువచ్చిన యామెతో నుండవచ్చును. ఇంతకుఁబూర్వము నీ వుపేక్షించినవారిలో నిపుడు నీకు మనసైన దానిని పొందవచ్చును. ఇది నీకు నేరము కానేరదు. ఈరీతిగా వారికన్నులు చూడఁగోరుదానిని వారికిఁజూపి, వారినిదుఃఖపెట్టక, వారివారికి నీవిచ్చిన దానితో తృప్తినొందించుట నీకు సులభమగును. మీ హృదయములలో నేమున్నదో దేవునికిఁ దెలియును. దేవుఁడు జ్ఞాని, దయాళుఁడు.

ఇఁకముందు నీ వితరభార్యలను చేకొనఁగూడదు. నీ కుడిచేతిలోనున్న బానిసరాండ్రను తప్ప, నితరస్త్రీలు తమ సౌందర్యముచే నిన్నాకర్షించినను, నిప్పటివారినివిడిచి వీరిని పెండ్లి యాడఁగూడదు. దేవుఁడు సర్వమును గనిపెట్టుచున్నాఁడు.

అధ్యాయము. 7.

విశ్వాసులారా ! ప్రవక్త యనుమతిలేనిదే యతనిసమయముకనిపెట్టక భోజనమున కతనియింటిలోనికి పోకుఁడు. ఆహ్వానింపఁబడితిరేని వెళ్ళుఁడు, భోజనమైనవెంటనే చెదరిపొండు. ప్రవక్తకు చిక్కుతెచ్చిపెట్టునట్లు చనవుగా మాట్లాడుచుండకుఁడు. అతఁడు మిమ్ముల వెడలఁగొట్టుటకు సంకోచించును. కాని, దేవుఁడు సత్యమును బలుకుటకు మొగమాటపడఁడు. అతనిభార్యలనుండి యేదైన బహుమానము కోరినచో తెరవెనుకనుండి యడుగుఁడు. వారిహృదయములకును,

మీ హృదయములకును నిది పవిత్రతనిచ్చును. మీరు దేవునిప్రవక్తకు చీకాకుకలుగఁజేయఁగూడదు. అతని తరువాత నెన్నడును నతనిభార్యలను మీరు పెండ్లియాడఁగూడదు. అట్లు చేయుట దేవునియెడ గొప్పనేరమగును.

మీరు దేనినైనను దాచినను వెలిబుచ్చినను దేవునికన్నియుఁ దెలిసియే యుండును.

తమ తండ్రులు, కొమారులు, నన్నదమ్ములు, నన్నదమ్ముల కుమాళ్ళు, అక్కచెల్లెండ్ర కుమాళ్లు, వారిస్త్రీలు, వారి కుడిచేతుల నుండు బానిసరాండ్రు, వీరితో మీభార్యలు ముసుగులేకుండమాట్లాడుట నిందాస్పదము కానేరదు. మీరు దేవునికి భయపడుఁడు. దేవుఁడు సర్వసాక్షి.

దేవుఁడును, నతనిదేవతలును, ప్రవక్త నాశీర్వదింతురుగదా! విశ్వాసులారా! మీ రాతని నాశీర్వదించి యాతనికి శాంతివాదములఁ జేయుఁడు.

దేవునిపైనను, నతనిప్రవక్తపైనను దిరుగఁబడువా రిహామందును, బరమందును, నతని శాపమునకుఁ బాత్రులగుదురు. అట్టివారికి లజ్జాకరమగు శిక్ష నాతఁడు సిద్ధముచేసియున్నాఁడు.

విశ్వసించిన పురుషులను స్త్రీలను, వారివలన నేతప్పును లేకపోయినను నెదిరించువారు నిందారోపకులును, స్పష్టముగ కీడుచేయువారునునై యుందురు.

## అధ్యాయము-8.

ప్రవక్తా! నీభార్యలును, కూఁతుండ్రును, విశ్వాసుల భార్యలును ముసుగులను కొంచెము దించియుండఁగా వారితో మాట్లాడుము. అప్పుడు వారిని సులభముగఁ బోల్చికొనవచ్చును; వారికవమానము కలుగదు. దేవుఁడు దయాళుఁడు, కరుణాళుఁడు!

60 కపటులును, కలుషితహృదయులును, మదీనాలో నల్లరుల లేవఁదీయువారును, తమకార్యములను మాననిచో, నిన్ను వారిపైఁ బ్రేరేపించెదము. అప్పుడు వారందఱు నీతో కొలఁదికాలమే యుండఁ గలరు.

వా రెచట నున్నను శప్తులే; వారిని పట్టుకొని నరకివేయ వలయును.

వారి పూర్వులకు దేవుఁ డట్లే చేసెను. దేవుని విధానములో నేమార్పు నుండఁబోదు.

"ఆగంట" యెప్పుడు వచ్చు నని జనులు ని న్నడుగుదురు. "దానినిగూర్చి దేవునికే తెలియును. ఆ 'గంట' యాసన్నమై యున్న దేమో యెవరి కేఱుక?" అనుము.

దేవుఁడు భక్తిహీనులను శపించి, వారి కగ్నిజ్వాలలను సిద్ధ పఱిచి యున్నాఁడుగదా?

వారందు శాశ్వతముగ వసింపఁగలరు. అచట వారికి స్నేహి తులుగాని, సహాయకులుగాని, యుండరు!

వారి మొగముల నగ్నిలో తిరుగవేయుచున్నప్పుడు వారు "అయ్యో, మేము దేవుని, నతని ప్రవక్తను మన్నించిన నెంతబాగుం డును" అని మొఱపెట్టుదురు.

"మా ప్రభువా! మేము మానాయకులను, మాలో గొప్ప వారిని మన్నించితిమి. వారు మమ్ము దేవునిమార్గమునుండి తప్పించిరి.

"ప్రభువా! వారిని ద్విగుణముగ శిక్షింపుము, వారికి ఘోర శాపము నిమ్ము" అని వా రందురు.

అధ్యాయము-9.

విశ్వాసులారా! మూసా నవమానపఱిచినవారివలె నుండ కుఁడు. కాని, దేవుఁడు వారి యపనిందలఁ బాపి, యాతనిఁ బేరెన్నికఁ గాంచఁజేసెను.

70 విశ్వాసులారా! దేవునికి భయపడి, యోచనగలిగి మాట్లాడుఁడు.

దేవుఁడు మీరుచేయు కార్యములకై మిమ్మాశీర్వదించి, మీ పాపములను క్షమించును. దేవుని, నాతనిప్రవక్తను మన్నించినవారిదే మహదానందము.

మేము స్వర్గమర్త్యములను, బర్వతములను, మామతమును స్వీకరింపుమంటిమి. కాని, యవి దానిని భారముగ గణించి స్వీకరింప భయపడెను. మనుష్యుఁడు దానిని మోయు సిద్ధపడెను; కాని, యన్యాయవంతుఁడును, బుద్ధిమాలినవాఁడును నైపోయెను.

కావుననే దేవుఁడు కపటులను, దేవునితో నితరదైవములఁ జేర్చువారును నగు స్త్రీపురుషులను శిక్షించును. కాని, విశ్వాసులగు స్త్రీపురుషులవంక కాతఁడు తిరుగును. దేవుఁడు దయాళుఁడు, కరుణాళుఁడు.

---

# సురా 34-సబా.

---

మక్కా-54 పద్యములు. 6 రుక్కులు.

## అధ్యాయము-1.

### దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

దేవునికి స్తుతియగుగాక! స్వర్గమర్త్యములయందున్నదంతయు నాతనిదే. అతనికి పరలోకమందును స్తుతియగుగాక! అతఁడే సర్వజ్ఞుఁడు, సర్వమును నతనికి గోచరమే!

భూమిలోని కేమిపోవుచున్నదో, యందుండి యేమి వచ్చుచున్నదో, స్వర్గమునుండి యేమి వచ్చుచున్నదో యచటి కేమిపోవుచున్నదో యంతయు నతని కెఱుకయే. ఆతఁడు క్షమాయుతుఁడు. కరుణాళుఁడు.

అవిశ్వాసులు "ఆగంట యెన్నటికిని మాకు రాలే" దందురు. వారితో "కంటికగపడనిదానిని జూచు నాప్రభువునాన, అదితప్పక వచ్చితీరును. స్వర్గమర్త్యములలోని యొకయణువైన నాతనిఁ దప్పించుకొనఁజాలదు. ఇంత కెక్కువదియు, తక్కువదియు గ్రంథములో లేనిది మఱెచ్చటను లేదు

విశ్వసించి క్రమవర్తనులగు వారికి దేవుఁడు బహుమానమిచ్చుటకే యిట్లుజరుగును. వారికి క్షమాపణయు, గౌరవజీవనమును గలుగనున్నవి!

కాని, మాసూచనలు కావనువారికి ఘోరబాధఁ గలుగఁజేయు శిక్ష సిద్ధముగనున్నది!

జ్ఞానము ప్రసాదింపఁబడినవారు నీకు పంపఁబడినదే సత్యమనియు, స్తవనీయుఁడును, మహిమాన్వితుఁడును నగు నాతని మార్గములోనికే యది తీసికొని పోఁగలదనియుఁ దెలిసికొందురు.

కాని, యవిశ్వాసకులు తాముస్నేహము చేసినవారితో "మిమ్ము చీల్చి ముక్కలుగఁగోసినను మీకుఁ గ్రొత్తరూపముకలుగునని భవిష్యత్తుచెప్పఁగల యొకనిని మీకుఁ జూపుదుమా? అతఁడు దేవునిఁ గూర్చి యసత్యముఁ బల్కుచున్నాఁడు; లేదా పిశాచగ్రస్తుఁడై యున్నాఁ" డందురు.

కాని, పరలోకజీవనమును నమ్మనివారు శిక్షననుభవించి, దేవునినుండి తప్పిపోయి, చిక్కుదారులలోఁ బడుదురు.

ఏమి! వారికి ముందు వెనుకలను, స్వర్గమర్త్యములందును, గల దానిఁగూర్చి వారెన్నఁడును యోచించుకొనలేదా? మాకిష్టమైనచో వారిని భూమిలోఁ బూడ్చివైచియుందుము. లేదా స్వర్గఖండము నొకదానిని వారితలలపైఁ గూలనేసియుందుము! మాయొద్దకు తిరిగి వచ్చు ప్రతిసేవకునికి నిందు సత్యముగ సూచనయున్నది.

అధ్యాయము-2.

10 పూర్వము దావూదునకు మాప్రత్యేక వరమునిచ్చియుంటిమి. "పర్వతములు, పక్షులునగు మీ రాతని స్తుతిగానముల ననుకరించుచుండురు." అతని కినుమును మెత్తబఱచితిమి.

"కవచములఁ జేసి వాని కినుపబిళ్ళల నమర్చుఁడు. మీరు పుణ్యము చేయుఁడు. మీకృత్యముల నేను జూచుచున్నాను."

సులైమానుకు మేము గాలిని వశపఱచితిమి. అది యుదయమున నొకనెలప్రయాణమును, సాయంకాలమున నొకనెలప్రయాణమును చేసెను. ఆతనికొఱకొక కఱగుచున్న యిత్తడియూటను ప్రవహింపఁజేసితిమి. అతనిప్రభువు నానతిచొప్పున నాతనిమ్రోల కొన్ని పిశాచములు పనిచేయుచుండెను. వారిలో మాయాజ్ఞ నేమాత్రముఁ దప్పినవారైనను వారి కగ్నిజ్వాలవలనిబాధను రుచి చూపింతుము.

వా రాతని కొఱకు గొప్ప సభాభవనములు, విగ్రహములు, ఒంటెలకు నీళ్ళుపెట్టుటకు చెలువులవలె విశాలములగు బానలు, స్థిరముగ నిలిచియుండు వంటపాత్రలు, ఇవియవియన నేల, యతని కిష్టమైనవానినన్నిటినిఁ జేసిరి. "దావూదుకుటుంబము వారలారా! కృతజ్ఞులరై పనిచేయుఁ" డని మేమంటిమి. కాని నాసేవకులలో కొలఁది మందిమాత్రమే కృతజ్ఞులు.

సులైమాను చనిపోవలసినదిగా మేము విధింప నాతఁడుచచ్చి పోవుట, యాతని శవమున కాధారముగా నిలిచిన కఱ్ఱను భూమినుండి వచ్చిన యొకపాము కఱచుచుండుటను వారు చూచినంతవఱకు నెవరి కిని దెలియలేదు. అదియు క్రిందికి పడిపోఁగా, నదృష్టవిషయములు తమకుఁదెలిసియుండిన నాలజ్జాకరమగుపనిని వారుచేసియుండఁజాలరని యా పిశాచములకు గోచరమయ్యెను.

సబా వారికి తమ వాసస్థానములందే యొకసూచనయుండెను. వారికుడిప్రక్కనొకటియు, నెడమప్రక్కనొకటియు, రెండుతోఁటలుం డెను. "మీప్రభువు మీ కనుగ్రహించినవానిని తిని కృతజ్ఞులరుకండు. మీదేశము మంచిది. మీ ప్రభువు దయాళుఁడు.

కాని, వారు ప్రక్కకు మఱలిపోయిరి. కావున మేము వారి దేశముపై ఉప్పెనను బంపితిమి. వారితోఁటలలో విషవృక్షములను, చింతచెట్లను, జిల్లేళ్ళను, మొలపించితిమి.

వారికృతఘ్నత కదియే మేముచేసినశాస్తి. కాని, కృతఘ్నులకు తప్ప మఱెవ్వరికైన నిట్లుచేయుదుమా ?

వారికిని, మే మాశీర్వదించియుంచిన నగరములకును మధ్య గొప్పపురములఁ గల్పించి సులువగునంచెలఁ గూర్చి "రాత్రిం బవ ళ్లును మీరు భద్రముగఁ బ్రయాణముచేయుఁ" డంటిమి.

కాని, వారు "ప్రభువా! ఈయంచెల నింతకంటె నెడముగ నుంచుము" అని తమకుఁ దామే యన్యాయముచేసికొనిరి. కావున వారియం దొకవదంతిని కల్పించి వారిని నలుదిక్కుల చెదరిపోవునట్లు చేసితిమి. సహనపరుఁడును, కృతఘ్నుఁడును నగువాని కిందు సూచన లున్నవేకదా.

20 వారినిగూర్చి తనకు బాగుగఁ దెలియునని ఇబ్లీసు అనుకొనెను. విశ్వాసులలోఁ గొందఱు తప్ప తక్కినవారందఱు నాతని ననుసరించిరి,

కాని, వారిపై నాతని కేశ క్తియు లేకుండెను. పరలోకజీవనమును నమ్మినవానినుండి, దానినిగూర్చి సందేహించినవానిని మేము తెలిసికొందుము. నీప్రభువు సర్వమును కనిపెట్టుచునే యున్నాఁడు.

అధ్యాయము 3.

"దేవునిగాక మీరు దైవము లనుకొనినవారినిగూడ నావాహన చేసెదరా? వారికి స్వర్గమర్త్యములం దణువెత్తయిన నధికారమును లేదు. వారికి వానియందు పాలులేదు. వారిలో నెవ్వఁడు నాతనికి సహాయకుఁడుగాఁడు.

అతఁడే యనుమతించినఁదప్ప నతనిముందు మాధ్యస్థ్యమెందుకును బనికిరాదు. తుదకు వారిహృదయములు భయమువీడి నిబ్బరపడి "మీప్రభు వేమనెను?" అని వారందురు. "ఆతఁడు సత్యమునే పలికెను. అతఁడున్నతుఁడు. మహాత్ముఁడు" నని వారికిఁ దెలుపఁబడును.

"మీకు స్వర్గమర్త్యములనుండి కావలసినదాని నెవఁడిచ్చును? దేవుఁడే. మీరైనను సరియగుమార్గమున నుండవలయును. లేదా మేమైన నుండవలెను. ఎవరమో యొకరము తప్పులో నున్నాము!

"మనతప్పులఁగూర్చి ప్రశ్నరాదు. మనకార్యములఁగూర్చియు మనలఁ బ్రశ్నింపరు.

"మన ప్రభువు మనలనందఱ నొకచోఁ జేర్చును. అప్పుడు మనకు న్యాయమగు తీర్పు చెప్పును; అతఁడే న్యాయకర్త, జ్ఞాని!

"మీ రతనితో సమానులఁగా జేర్చినవారిని నాకుఁ జూపుఁడు. అట్లుకాదు. అతఁడే దేవుఁడు—బలవంతుఁడు, బుద్ధుఁడు!" అనుము.

నిన్ను మనుష్యజాతియంతటికిని బ్రకటించుటకును, భయసూచన నిచ్చుటకును, బంపితిమి. కాని, చాలమందికిది తెలియదు.

వారు "ఈభయపెట్టిన దెప్పుడువచ్చును ? మీరు సత్యవంతుల రైనచో చెప్పుఁడు" అనియందురు.

30 "మీరొక గంటముందుకుగాని, వెనుకకుగాని జరుపఁజాలని దినమే మీకుకలుగనున్నది" అనుము.

అధ్యాయము-4.

అవిశ్వాసులు, "మేమీ కురానునుగాని, దానికి పూర్వపు గ్రంథములనుగాని, నమ్మము" అందురు. కాని దుష్టులు తమ ప్రభుని మ్రోల నిలువఁబడియున్నప్పుడు వారిని జూచిన నెంత బాగుండును! వా రొకరినొకరు దూషించుకొనుచుందురు. బలహీనులు బలవంతులతో "మీరు లేకుండినచో మేము విశ్వాసులమై యుండియుందుము" అందురు.

అప్పుడు బలవంతులు బలహీనులతో "ఏమీ! మీకు వచ్చిన రక్షణనుండి మిమ్ము తప్పించినవారము మేమా? కాదు. మీయెడల మీరే దుష్టప్రవర్తనులైతి" రందురు.

అదివిని బలహీనులు బలవంతులతో "మీరు రాత్రింబవళ్ళు కుట్రలుపన్ని, దేవుని మన్నింపవలదని మాకాజ్ఞయిడి, యాతనికి సమానులను కూర్పలేదా ?" అనియందురు. వారికి శిక్ష కంటఁబడిన పిదప వారు తమ పశ్చాత్తాపమును ప్రకటింతురు. విశ్వసింపనివారి మెడలకు పూజులు తగిలించెదము. వారికార్యములకు తగినట్లుగాక మఱియొకఫలముకలుగునా ?

మేము భయసూచనను పంపించిన ప్రతిపురమునందును ధనవంతులు "నీసందేశమును నే మెంతమాత్రమును నమ్మము.

మాకే హెచ్చుధనమున్నది, గొప్పసంతానమున్నది. మేము శిక్షితులలోఁ జేరఁబోము" అనిరి.

" నా ప్రభువు తనయిష్టమువచ్చినవారి ననుగ్రహించును. ఇష్టములేనివారి ననుగ్రహింపఁడు. కాని, చాలమంది దీనిని గ్రహింపరు" అనుము.

## అధ్యాయము-5.

మీధనముగాని, మీపుత్త్రులుగాని, మిమ్ము మాయొద్దకుఁ జేర్పలేరు. కాని, విశ్వాసులు, క్రమవర్తనులునగువారు తాముకావించినదానికి ద్విగుణముగ బహుమానము పొందుదురు. వారు భోగభూమియందలి గుడారములలో భద్రముగ వసింతురు!

మాసూచనలను కావనువారు శిక్షాపాత్రులగుదురు.

సత్యముగా నాప్రభువు తన కిష్టుఁడైన సేవకునకు గొప్పగనో, కొలఁదిగనో యీయవచ్చును. మీరు భిక్షగానొసగినదాని నాతఁడు తిరిగి మీకిచ్చివేయును. అతఁడే యెవరికి తగిన బహుమానములను వారికి సరిగ నీయగలవాఁడును.

40 ఒకానొకదినమున నాతఁడు వారినందఱ నొకచోఁ జేర్చును. అప్పుడాతఁడు దేవతలను "వీరు మిమ్మారాధించిరా" యని యడుగును.

వారు "నీవు మహిమాన్వితుఁడవగుదువుగాక! నీవే మాప్రభువవు. వీరుకారు" అనియందురు. కాని, వారు పిశాచముల నారాధించిరి. చాలమంది వానినే విశ్వసించిరి.

ఈదినమున మీలో నొకరికొకరు సహాయముగాని, హానిగాని చేసికొనఁ జాలరు. అప్పుడు మేము దుర్మార్గులతో "మీరు మోసమనుకొనిన యగ్నిబాధను రుచిచూడుఁడు" అందుము.

మాస్పష్టసూచనలను వారికెఱిఁగింపఁగా, వారు "ఇతఁడు మిమ్ము మీ తండ్రుల మార్గమునుండి తప్పింపనెంచిన మనుష్య

మాత్రేఁడు. ఈఖురా నొకసృష్టింపఁబడిన యసత్యముగాని వేఱుగాదు." అనియందురు. అవిశ్వాసులకు సత్యమును దెలుపఁగా "ఇది కేవలము చిల్లంగిగాని, మఱియొకటికాదు" అందురు.

అయినను నింతకుపూర్వము వారు బాగుగపఠించుటకు గ్రంథములనుగాని, భయసూచనలతో నొక ప్రవక్తనుగాని, వారియొద్దకుఁ బంపియుండలేదు.

వారి పూర్వులుగూడ నిట్లే మాప్రవక్తలు కృత్రిములనిరి. కాని, మేము వారికనుగ్రహించినదానిలో పదియవవంతైనను వా రనుభవింపలేదు. వారుమాప్రవక్తలకు మోసమును నారోపించినప్పుడు, మాపగ యెంతయో ఘోరముగ నుండెను!

## అధ్యాయము-6.

"మీకొకటి మాత్ర ముపదేశించుచున్నాను. మీ రిద్దఱిద్దఱుగాఁగాని, యొంటరిగాఁగాని, దేవుని మ్రోలనిలిచియుండి, మీపురవాసియందు పిశాచము లేకుండుటఁ గూర్చి యోచింపుఁడు. మీకు గొప్పశిక్ష కలుగుటకుపూర్వము మీకు దానిసూచననిచ్చుటకు మాత్ర మాతఁడు వచ్చియున్నాఁడు.

"మీరు వాకు కూలి నీయనక్కఱలేదు. అది మీరేయుంచికొనుఁడు. నాకూలిని దేవుఁడే యిచ్చును. అతఁడు సర్వసాక్షి!

"నిశ్చయముగా నాప్రభువు సత్యమును బంపియున్నాఁడు. కంటికగపడనివన్నియు నాతనికిఁ దెలియును.

"సత్యమువచ్చియున్నది. అసత్యము అదృశ్యమై మఱి తల చూపఁ జాలదు.

50 "నేను తప్పియున్నచో నానష్టమునాదే. నాకురక్షణయున్నచో నదినాకు నాప్రభువు తెలిపినదే! అతఁడు చేరువగనేయుండి వినుచున్నాఁడు." అనుము.

వారు గడగడవడఁకుచు, తప్పించుకొనలేక సమాధులనుండి లేవఁదీయఁబడినప్పుడు,

"మేమాతని విశ్వసింతుము." అనునప్పుడు వారిని నీవు చూచిన బాగుండును. కాని, వా రింతదూరముగనుండి విశ్వాసము నెట్లు పరిగ్రహింపఁ గలరు ?

దానిని వారు పూర్వము నిరాకరించిరికదా ! ఇచ్చటనుండియే దూరముగనున్నరహస్యములపై బాణములనేయఁజూచిరికదా ?

వారికిని వారికోరికలకును చాల యెడముండఁగలదు. వారి పూర్వులుఁగూడ నిట్లే తమ సందేహములలోనే నశించి నప్పు డీరీతి గనే చేయఁబడినది.

---

# సురా 35-సృష్టికర్త

---

మక్కా - 45 పద్యములు-5 రుకూలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

స్వర్గమర్త్యముల సృష్టికర్త యగు దేవునికి స్తుతియగుఁ గాక ! రెండు, మూఁడు నాలుగుకూడ జతలఱెక్కలుగల దేవతల నాతఁడు దూతలఁగాఁ బంపును. తాను సృజించినవానికి తనయిష్టమైనదానిని చేర్చును ! దేవుఁ డన్నిటికిని శక్తుఁడు గదా !

దేవుఁడు మనుష్యునకుఁ జూపఁబోవుకరుణ నెవ్వరు నడ్డపెట్టఁ జాలరు. ఆతఁ డడ్డగించినదాని నెవ్వఁడు నీయఁజాలఁడు. అతఁడు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు !

జనులారా! దేవుఁడు మీకుఁజూపిన యనుగ్రహమును స్మరింపుఁడు. స్వర్గమర్త్యములనుండి మీకుఁగోరిన వస్తువులనిచ్చి మిమ్ము పోషించు దేవునికంటె మఱియొక సృష్టికర్తగలఁడా? అతఁడుతప్ప వేఱుదేవుఁడు లేఁడు! అయిన నాతనినుండి మఱలియుండెద రేల?

వారు నిన్ను కృత్రిముఁ డనవచ్చును. కాని, నీకుఁ బూర్వము వచ్చినవారిని, గూడ వారిట్లే యనిరి. అయినను సన్నివస్తువులును దేవునియొద్దకే మఱలిపోవును.

జనులారా! దేవుఁ డిచ్చినమాట సత్యము; కావున ప్రస్తుత జీవనముఁజూచి మోసపోకుఁడు. మోసగాఁడగు సైతాను మిమ్ము దేవునిఁగూర్చి మోసగింప నీయకుఁడు.

అవును. సైతానే మీశత్రువు. కావున నతనిని శత్రువుగఁ దలంపుఁడు. అతని యనుచరు లగ్నిజ్వాలలయందు వసించుట కాతఁడు వారిని పిలుచును.

అవిశ్వాసకులకు ఘోరశిక్ష రానున్నది. కాని, విశ్వాసులై క్రమవర్తనులగు వారికి కరుణయు, గొప్పలాభమును గలుగును.

అధ్యాయము 2.

తనకార్యములు దుష్టములైనను తన్ను తాను మోసపుచ్చుకొని, యవి మంచివే యనుకొనువాఁడును, అన్నికార్యములను క్రమముగఁ జూచికొనువాఁడును, నొక్కరీతి యనుభవమునే పొందుదురా; దేవుఁడు తన యిష్టమువచ్చినవారిని దారితప్పించి యిష్టులైనవారికి దారిఁజూపును. వారికొఱకు నిట్టూర్పులు విడుచుచు నీయాత్మను వ్యయపఱుచు కొనకుము. దేవునికి వారిసర్వకార్యములును దెలియును.

మేఘములను మీఁదికి విసరివేయఁగల వాయువుల నాతఁడే పంపించును. అప్పుడు మేము నీరులేక చచ్చియున్నభూమిని తిరిగి యుజ్జీవింపఁజేయుటకు వానిని పంపుదుము. రక్షణకూడ నిట్టిదే.

10 ఎవనికైనను గొప్పతనము కావలసినచో నాగొప్పతనము దేవునియొద్దనే యున్నది. మంచిమాట యాతనియొద్దకు చేరును. ఆతఁడు పుణ్యకార్యమును గొప్పఁగఁ జూచును. కాని, కుట్రలుపన్ను వారికి ఘోరశిక్ష సిద్ధముగ నున్నది. అట్టివారికుట్రల నాతఁడు కొన సాగనీయఁడు.

ఇదిగాక దేవుఁడు మిమ్ము తొలుత ధూళినుండియు, పిదప జీవాణువులనుండియు, సృజించి మీకు స్త్రీపురుష భేదములఁ గల్పించెను. ఏయాఁడుదానికిని, గర్భముగాని, ప్రసవముగాని, యతనికి తెలియనిదే కలుగదు. గ్రంథము ప్రకారముతప్ప ముదియునది ముదియదు. మనుష్యుని యాయుర్దాయమునుండి కొంచెమైనను తగ్గిపోదు. నిశ్చయముగా దేవునికిది సులభము.

రెండు సముద్రములును నొకరీతివిగావు. ఒకటి మంచి, తీయని, పానయోగ్యమగు నీటితోను, రెండవది యుప్పు, చేఁగుగల నీటితోను నిండియున్నవి. ఆయినను రెండింటినుండియు మీరు మంచిచేఁపలనుపట్టి తిందురు; మీరుధరించుట కాభరణములను తీయుదురు; మీరాతనిచే దయతో మీకుఁజూపఁబడిన వస్తువులను సేకరించికొని కృతజ్ఞులరై యుండుటకు, వానినీళ్ళపై నావలలోఁ బోవుదురు.

అతఁడు రాత్రిని పగటియందును, పగటిని రాత్రియందును సంక్రమింపఁ జేయును. సూర్యచంద్రులు తమగతులను తప్పకుండు నట్లు కొన్నివిధుల నాతఁ డేర్పఱిచెను. ఈతఁడే మీప్రభువగు దేవుఁడు. శక్తియంతయు నాతనిదే. మీరాతనిగాక పిలుచు నితరులకు ఖర్జూరపు గింజలోని తొక్కమీఁదనైనను శక్తిలేదు!

మీరు వారికి మొఱలిడిన వారామొఱల నాలకింపరు. వినినను, మీతోఁ బలుకరు. రక్షణదినమునఁ దమ్ము దేవునితో మీరు కూర్చుటఁగూర్చి యొప్పుకొనరు. సర్వజ్ఞుఁడగు నాతనికంటె బాగుగ నీకెవరు బోధింపఁగలరు?

అధ్యాయము.-3.

జనులారా ! మీరు దరిద్రులు. మీకు దేవుఁడను భిక్షకావలయును. దేవుఁడు ధనవంతుఁడు. స్తవనీయుఁడు !

అతని కిష్టమైనచో మిమ్ము తుడిచివైచి మీస్థానమున క్రొత్త జాతి వారిని దెచ్చిపెట్టును.

ఇది దేవునికి కష్టముకూడ గాదు.

తనభారమునే మోయుచున్నయాత్మ మఱియొకని భారము గూడ మోయఁబోదు. తనభారమును మఱియొకనిచే మోయింపించుమని యేయాత్మయైనను మొఱవెట్టినచో దగ్గఱిబంధువులచే నైనను దానిలో నేభాగమును మోయింపించ వీలులేదు. రహస్యముగఁ దమప్రభువునకు భయపడి ప్రార్థన తప్పనివారికి భయసూచనఁదెల్పుము. తన్నుఁ దాఁ బవిత్రవంతునిగఁ జేసికొనువాఁడు తన మేలుకొఱకే యట్లు చేయును. దేవునియొద్దకే తుదకందఱును జేరుట.

గ్రుడ్డివారును దృష్టిగలవారును నొకటిగాదు.

ఇట్లే చీఁకటియు, వెలుతురును,

నీడయు వేఁడిగాలియు,

జీవించియున్నవారును, మృతులును నొక్కటిగారు. దేవుఁడు తనయిచ్ఛవచ్చినవారిని వినఁజేయును, గాని సమాధులలోనున్నవారిని నీవు వినఁజేయఁజాలవు.

నీవు కేవలము బోధన చేయవలసినదే.

నీకు సత్యమునిచ్చి పంపితిమికదా ! సువార్తను భయసూచనను నీవుతీసికొని పోవలయును. ప్రతిజాతివారికిని భయసూచనదెల్పుచు నొకఁడు వచ్చియుండెను.

నిన్ను వా రసత్యవంతుఁ డనవచ్చును. వారిపూర్వులును దమసందేశములకుఁ గల ప్రమాణములతోను, దివ్యగ్రంథములతోను,

పవిత్ర గ్రంథములతోను, తమయొద్దకువచ్చిన ప్రవక్తల నిర్లే యని యుండిరి.

అప్పుడు నే నవిశ్వాసకులను శిక్షించితిని. నాపగ చాల గొప్పది !

## అధ్యాయము-4.

దేవుఁడు స్వర్గమునుండి జలమునంపుటయు, దానివలన మేము చిత్రవిచిత్రములగు పండ్లను పుట్టించుటయు, పర్వతములపై తెలుపు, ఎఱుపు, కాకిచలుపు రంగులుగల దారులుంచుటయు నీకుఁ గనఁబడ లేదా ?

మనుష్యులు, సరీసృపములు, జంతువులు, నివిగూడ వివిధవర్ణములు గలిగియుండును. జ్ఞానవంతులగు దేవునిసేవకులే యాతనికి భయపడుదురు. దేవుఁడు శక్తిమంతుఁడు. దాక్షిణ్యమూర్తి !

దైవగ్రంథమును పఠించుచు, ప్రార్థనదప్పక, రహస్యముగను, బహిరంగముగను, మేమొసగిన దానినుండి భిక్షము పెట్టువారును నాశనములేని సరకులను బడయఁగలరు.

30 దేవుఁడు వారికిరావలసిన కూలినిచ్చివేయును. తనదయచే వారిని వృద్ధిచేయును. అతఁడు దయాళుఁడు, కృతజ్ఞుఁడు !

గ్రంథమునుగూర్చి మీకు మేము తెలిపినదే సత్యము. అది పూర్వగ్రంథములను స్థిరపఱుచుచున్నది. దేవుఁడు తనసేవకులను తెలిసికొని చూచుచున్నాఁడు.

ఇదిగాక మేమెంచికొనిన సేవకుల నీగ్రంథమునకు వారసులఁ జేసితిమి. కొందఱు దుష్టకార్యములఁజేసి హాని గలిగించుకొందురు. కొందఱు కీడు మేళ్ళకు మధ్యస్థముగాఁ బోవుదురు. దేవుని యను మతిచొప్పునఁ గొందఱు మంచితనముచే మించుదురు. ఇదియే పరమ పుణ్యము !

వారు అమరవనములోఁ బ్రవేశించి బంగారముతోను, ముత్యములతోను నమర్చిన నగల నలంకరించికొని పట్టుబట్టలఁ గట్టికొందురు.

అచట వారు "మమ్ము నుండి దుఃఖము నెడముగనుంచిన దేవునికి స్తుతియగుఁగాక ! దేవుఁడు దయాళుఁడు, కృతజ్ఞుఁడునుగదా !

అచట నతని యనుగ్రహముచే శాశ్వతమగు గృహమందు మమ్ము వసింపఁజేయును. అచట మాకేకష్టముగాని, యలసటగాని కలుగనేరదు" అందురు.

అవిశ్వాసులకు నరకాగ్నియే ప్రాప్తము. వారుచచ్చుటకు వీలులేదు. వారిబాధ యించుకైనను తగ్గింపఁబడదు. అవిశ్వాసుల కందఱకిదియే మేమిచ్చు బహుమానము.

అచట వారు "మమ్మిచటినుండి తీసికొనిపొమ్ము. ప్రభువా ! ఇఁకముందు క్రమముగ నడచుకొందుము. పూర్వమువలె సంచరింపము" అని మొఱలిడుదురు. "భయసూచనఁ గొనువారు ప్రస్తుతజీవితమునందే కొనవలయుననికదా మీయాయుష్కాలమును వృద్ధిచేసితిమి ? మీయొద్దకు బోధకుఁడు వచ్చెనే ! "అయిన దీనిని రుచిచూడుఁడు." అన్యాయవంతులకు రక్షకుఁడుండఁబోఁడు.

అధ్యాయము.-6

స్వర్గమర్త్యములందలి రహస్యములు దేవునికి యథార్థముగాఁ దెలియును. హృదయములోని రహస్యములుగూడ నతనికిఁదెలియును.

అతఁడు భూమిపైఁ దనప్రతినిధుల నేర్పఱచియున్నాఁడు. నమ్మనివారిని తమ యవిశ్వాసమే కొట్టివేయును. వారి యవిశ్వాసమట్లు వృద్ధియగుచునే యుండును. వారిని వారి ప్రభువు ద్వేషించును. నమ్మనివారి యవిశ్వాసము వారినరకబాధను హెచ్చుచేయుచునే యుండును !

40 దేవునిఁగాక మీరుపిలుచు నితరులఁగూర్చి యేమనుకొనుచున్నాము ? వారు భూమిలో నెంత భాగమును సృజించినారో నాకుఁ జూపుము. వారుస్వర్గములో నేపాటిదైన సృజించియుండిరా ? వారికి పిలుపు రాఁగలదనిచెప్పు గ్రంథమును వారికి మేముపంపితిమా ? లేదు. దుష్టులొకరికొకరు మోసము చేయనే యెంతురు.

స్వర్గమర్త్యములు కదలిపోకుండ దేవుఁడు వానిని గట్టిగఁబట్టుకొని యుంచును. అవి కదలిపోవునప్పుడు వానిని పట్టియుంచు వాఁడాతఁడుతప్ప మఱియొకఁడు లేఁడు. అతఁడు దయాదాక్షిణ్యమూర్తి!

వారియొద్దకొక బోధకుఁడువచ్చినచో తక్కిన జాతులవారికంటె తామే రక్షణ పొందఁగలమని వారు ఘోరప్రమాణము చేయుదురు. కాని, వారియొద్ద కాబోధకుఁడు వచ్చినంతనే వారు మఱింత యెడఁబడిపోయిరి.

భూమిపై వారికుండు గర్వమును, వారుచేయు కుట్రయు హెచ్చుగ నుండెను ! కాని, కుట్రపన్నువారు తామే యందు తగులొ్కందురు. అయిన వారు తమపూర్వులకు దేవుఁడు చేసినదానిని గాక మఱియొకదానిని జేతురేల ? దేవుని విధానమునం దేమార్పును నుండఁబోదు. అవును. దేవునిమార్గమునం దనుక్షణమును మార్పులు కానరావు.

పూర్వులు తమకంటె బలవంతులైనను, వారికేమిగతిపట్టెనో, దేశసంచారముఁజేసి వారెన్నడును గనుఁగొనలేదా ? స్వర్గమర్త్యములయందేదియు, దేవునివిధానమును తప్పింపఁజాలదు. అతఁడు సర్వజ్ఞుఁడు ; సర్వశక్తుఁడు.

ఇదిగాక, మనుష్యులకుఁ దగినట్లు దేవుఁడు శిక్షింపనెంచినచో నాతఁడు భూమిపై నొక సరీసృపమునైన నుండనీయఁడు ! కాని, నియమితకాలమువఱకును వారికాతఁడు విశ్రాంతి నిచ్చియున్నాఁడు.

సేవకులకు కాలమువచ్చునప్పుడు దేవుఁడు వారినొకకంటఁ జూచుచునే యుండును.

---

# సురా 36 యాసీన్.

---

మక్కా-83 పద్యములు-5 రుకూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

యాసీన్

కురానునాన!

నీవు క్రమమార్గమున వచ్చిన

దూతలలోనివాఁడవు.

తమ తాతముత్తాతలకు భయసూచన లేకుండుటచే నిర్లక్ష్యముగా పెఱిగిన ప్రజలకు సూచన నిచ్చుటకై

శక్తిమంతుఁడును, దయానిధియు, ప్రసాదించిన దివ్యజ్ఞానమిది

వారిలో చాలమందికి మేమిచ్చు శిక్ష న్యాయమైనది. కావున వారు దానిని నమ్మరు.

వారిగడ్డములవలన వ్రేలాడు శృంఖలములను వారిమెడలపై వైచి తలలు మీఁదికెత్తుకొని తిరుగునట్లు చేసితిమి.

వారికి ముందువెనుకల పెద్దగట్లనుపోసి కన్నులు కనబడకుండునట్లు ముసుఁగులు కప్పితిమి.

10 వారిని భయపెట్టినను పెట్టకున్నను నొక్కటే. వారునమ్మరు.

ఈసూచనను గుర్తించి రహస్యముగ దయాపరుఁడగు దేవునికి

భయపడువానికే యీసూచననిమ్ము. అతనినే క్షమాపణవాక్యముల తోడను బహుమానమును నాశతోడను సంతోషపెట్టుము.

నిశ్చయముగా చచ్చినవారిని త్రొందరపెట్టి వారు ముందుగాఁ దమకు పంపికొనిన కర్మలను, వారు విడిచిపెట్టిన మంచికర్మల జాడలను మేమే వ్రాసిపెట్టియుంచుము. ప్రతివిషయమును స్పష్టవిధిగ్రంథము నందు లిఖించియేయున్నాము.

అధ్యాయము-2.

దూతలువచ్చి చేరిన పురమునందలి ప్రజల యుదాహరణము వారికిఁజూపుము.

మేము వారియొద్ద కిద్దఱను బంపఁగా వారు వారినసత్యవాదులుగాఁ బరిగణించిరి. కావున, వారికి సహాయునిఁగా మూఁడవవానిని బంపితిమి. వారు " మేము దేవుఁడుపంపిన దూతలము. "

అనఁగా నాప్రజలును, "మీరును మా యట్టిమనుష్యులే. దయానిధియగు దేవుఁడు దేనినైనను బంపియుండలేదు. మీరు కేవల మసత్యము లాడుచున్నారు " అనిరి.

వారును "మేము మీయొద్దకుఁ బంపఁబడితిమని మాప్రభువునకు నిశ్చయముగాఁ దెలియును.

మీకొక స్పష్టవార్త తెలుపుటయే మావిధి " యన

వారును " శకునములంబట్టిచూడ మీవలన మాకు కీడగునట్లు తోచుచున్నది. మీయుద్యమమును మీరు మాననిచో మిమ్ము రాళ్లువిసరి చంపెదము. మమ్మునుండి మీకు ఘోరశిక్ష కలుగఁ గలదు " అనిరి.

వారు " మీయపశకునఫలము మీయొద్దనే యున్నది. మీరు భయసూచనంగొనరా ? మీరు దారి తప్పుచున్నారు. "

20 అనుచున్నంతలో పురముకొననుండి యొకఁడు పరుగుపరుగున వచ్చి " నా ప్రజలారా! దూతల ననుసరింపుఁడు.

వీరు మిమ్ము బహుమానము లడుగ లేరు. వీరు క్రమరక్షణ నొందియున్నారు. కావున, వారిమాట వినుఁడు.

# కాండము. 23.

నన్ను సృజించి తుదకు తనయొద్దకు రప్పించికొనఁగలుగు నాత నినే యేల యారాధింపఁగూడదు ?

ఆతఁడుగాక యితర దైవములను నేను చేకొందునా! దయానిధి యగు దేవునికి నన్ను శిక్షించుటయే యిష్టమైనయెడల వారిసామర్థ్య మ్యము నన్నెట్లు రక్షింపఁగలదు? వారు నన్నెట్లు విడిపింపఁగలరు:

కావున నేను నిశ్చయముగా తప్పుత్రోవలో నున్నాను.

నీప్రభువును నేను నమ్ముచున్నాను. కనుక నామాట వినుఁడు" అనెను.

ఆతనికి స్వర్గప్రవేశ మనుగ్రహింపఁబడెను.

అతఁడును " ఓహో! దేవుఁడు నాయెడల నెంత యుదారవంతుఁ డుగనున్నాఁడో, నన్నెట్లు గౌరవించియున్నాఁడో, వారికిఁ దెలిసిన నెంత బాగుండును." అనుకొనెను.

అతఁడు మృతినొందినపిదపనే సైన్యమునుగాని, తరువాతనే దేవతలనుగాని, మేము పంపియుండలేదు.

జిబ్రీలొక్కసారి చప్పటులు చఱచినంతనే వారు నాశనమైరి. అహా! నాకింకరు లెంతటి దుఃఖభారపీడితులైయున్నారు? వారి

యొద్దకువచ్చిన ప్రవక్తలనందఱును వారు నిరసించి నవ్వుచున్నారు.

వారికిపూర్వ మెన్నితరములవారిని మేము నశింపఁజేసితిమో వారు చూడలేదా ?

వారందఱును కృత్రిమదేవతలయొద్దకుఁబోక నాయొద్దకే యొక్క గుంపుగాఁ దీసికొనిరాఁబడుదురు.

అధ్యాయము—3.

ఇదిగాక మృతమృత్తికయే వారికి సూచన. వారిని త్వరపెట్టి యందుండి ధాన్యముఁబుట్టింప వారు దానిని భుజింతురు.

అందు ఖర్జూర ద్రాక్షవనములను బుట్టించి దానినుండి యూఁటలు బయలువెడలునట్లు చేసిదము.

వా రాఫలములను, తమస్వకాయకష్టఫలమును ననుభవింతురు. ఇట్లయినను వారు కృతజ్ఞులు కానేరరు.

భూమియం దుదయమందు వస్తువులందును, మనుష్యులయందును, వారికి గోచరింపని యితరవస్తువులందును, పుంస్త్రీవిభాగము చేయు నాతనికి జయమగుగాక!

రాత్రిగూడ వారికొక సూచనయే. దానినుండి పగటిని తీసివేసినంతనే వా రంధకారమున మునిఁగియుందురు.

సూర్యుఁడు తన విశ్రమస్థలమున కేఁగును. ఇది శక్తిమంతుఁడును, జ్ఞానియునగు నాతనియాజ్ఞ.

చంద్రునకును, నదిముదిసివంగిన ఖర్జూరతరుశాఖవలె నగువఱకును, కొన్నిస్థానముల నేర్పఱచియున్నాము.

40 సూర్యుఁడు చంద్రునికంటె ముందు పోఁజాలఁడు. రాత్రియు పగటికంటె ముందు పోఁజాలదు. అవి తమ నిర్ణీతస్థానములో సంచరించుచుండును.

వారిసంతతులవారిని సంపూర్ణభారవహమగు నావలో మోచికొనిపోవుటయు వారికొకసూచనయే.

వా రెక్కుటకు నుహనావవంటి నావలనే మేమునిర్మించి వారికిచ్చియున్నాము.

మాయిష్టమైనచో వారిని నీటనుంచి చంపివైచెదము. వారికెవ్వరును సహాయపడఁజాలరు.

మాకు దయపుట్టినచో వారిని రక్షింతుము. అట్టివారు మఱికొంతకాలము సౌఖ్యముల ననుభవింపఁగలరు.

"మీకాతనిదయ కావలసినచో మీకు ముందువెనుకలనున్నదానికై భయపడుఁ" డని యంటిమి.

కాని నీప్రభువునుండి వారి కెన్నిసూచనలను నీవు తెచ్చినను వారు వానిని పాటిసేయరు.

దేవుఁడు మీకనుగ్రహించినదానిలోనే కొంత భిక్షపెట్టుటకు వినియోగింపుఁడని మేము వారికి చెప్పినప్పుడు నమ్మకములేనివారు, "దేవునికిష్టమైనచో నాతఁడే యాతని కాహారమిడును. నీవిట్లు మాకు చెప్పుట తప్పు

నీవు పల్కునదే సత్యమైనచో, ఆవచ్చున దెప్పుడువచ్చును?" అని యడుగుదురు.

వారాయొంటిమ్రోఁతకై యెదురుచూచుచున్నారు. వారిట్లు వివాదములు చేసికొనుచుండఁగనే యది వారిని జెనకఁగలదు.

50 అప్పుడు వారు తమద్రవ్యమును నొరుల కొప్పఁజెప్పుటకుఁగాని, తమకుటుంబముల నొకసారి చూచుటకుఁగాని సమర్థులు కాఁజాలరు.

## అధ్యాయము-4.

బూరామ్రోఁత వినఁబడినంతనే తమసమాధులనుండి వారు తమప్రభువులయొద్దకుఁబోవఁ ద్వరపడుదురు.

వారు "అయ్యో ! మాశయనాగారమునుండి మమ్మెవరు లేపి నారు. దయానిధియగు దేవుఁడు మాకిచ్చెదనన్న దిదియే. ప్రవక్తలు సత్యమునే పల్కి"నారని యందురు.

ఒక్కఱ్ఱమ్రోఁతయైనంతనే యందఱును మాయొద్దకుఁ జేరఁగలరు.

ఆదినమున నేయాత్మకును నన్యాయము జరుగదు. వారివారి పుణ్యకర్మల ప్రకారముతప్ప మఱియొక రీతిగా బహుమానమును దొరకదు.

కాని, యాదినమున స్వర్గవాసులు తమతమకార్యముల నత్యానందముతోఁ జేసికొనుచు,

తరుచ్ఛాయలలో పెండ్లిపఱపులపైఁ దామును, దమకామినులును విశ్రాంతినొందియుందురు.

అచట వారికిఁ బండ్లును, వారు కోరికొను సర్వమును దొరకును.

దయానిధియగు వారిప్రభువు వారికి స్వస్తివాక్యమును బలించుచుండును.

"పాపులారా ! మీరీదినమును విడఁబడియుండుఁడు.

60 ఆదాముపుత్త్రులారా ! మీకు "సైతాను గర్భశత్రువు. ఆతనిఁ బూజింపకుఁడు.

నన్నుఁ బూజించుటయే క్రమమగు మార్గ" మని మేమాజ్ఞాపించియుండలేదా ?

కాని యిప్పుడాతఁడు మీలోఁ జాలమందిని తప్పుద్రోవఁబెట్టియున్నాఁడు. అది మీకుఁ దెలియలేదా ?

మీరు భయపడవలసినదని చెప్పిన నరకమిదియే.

దానిని మీరు నమ్మలేదు కావున దానివేఁడిమిని నేఁడు మీరనుభవింపుఁడు."

ఆదినమున వారినోళ్ళను మూసెదము. కాని వారిచేతులును కాళ్ళును, తాముచేసిన పనులఁగూర్చి చెప్పివేయగలవు

మాకిష్టమైనయెడల వారికన్నులనుగూడ దీసివై చెదము; అప్పు డును వా రొకరొకరితో పంతములాడుచుఁ దమదిమ్మపథమునఁ బరువు లెత్తుదురు. వారికి దృష్టియెక్కడిది ?

మాకిష్టమయినయెడలవారిరూపములనుమార్చివైచి ముందుకుఁ గాని, వెనుకకుఁగాని కదలలేకుండునట్లు చేసెదము.

అధ్యాయము—5.

వానికాయువ్యమునిచ్చుచు ముసలితనమున నడుమువంగు నట్లు చేసెదము. వారికి బోధపడలేదా ?

మహమ్మదునకు మేము కవిత్వము నేర్పలేదు. అది యాతనికి గౌరవహేతువుకాదు. ఈగ్రంథమే భయసూచన; ఇదియే కురాను.

70 ఇది బ్రతికియున్నవారిని భయ పెట్టును; అవిశ్వాసకులకు సరి యైనతీర్పు చెప్పును.

మీచేతులతో నిర్మించినవానితో మీరు ప్రభువులైయున్న జంతువులును, వారికి మేము వశపఱిచిన మఱికొన్ని వస్తువులును, నున్న వని వారికిఁ దెలియదా ?

వానిలోకొన్ని వారికివాహనములు,కొన్ని యాహారపదార్థములు.

అవి మిక్కిలి యుపయోగకరములై యుండును. వానినుండి వివిధపానీయములు పుట్టును.

ఇట్టియుపకారముఁబొందియు వారు సత్యదేవునిఁ బరిత్యజించి తమసహాయముకొఱకితరదైవముల నాశ్రయించి యున్నారు.

కాని, వారికి సహాయపడ సమర్థతలేదు. ఐనను ననేకులు వారికి సేవకులై యున్నారు.

వారిమాటలవలన నీవు దుఃఖచకుము. వారు దాచినదానిని బైట బెట్టుదానినిగూడ మేమెఱుంగుదుము.

మనుష్యుని మిలమిలలాడు మెత్తని పురుగులతో నిర్మించితి మని యాతనికిఁ దెలియదా ? అయినను నాతఁడు హేళనచేయు చున్నాఁడే !

అతఁడు మాతో వాదములకుదిగి తనసృష్టినిగూర్చి మఱచి యున్నాఁడు. "ఎముకలు క్రుళ్ళినపిదప వానికి జీవము నెవఁడు పోయఁ గలఁడు ?" అని యాతఁడు ప్రశ్నించును.

వానితో "అతఁడు సకలసృష్టియందును కుశలుఁడు. మొదటఁ బ్రాణమునీయఁగలిగినవాఁడు తరువాత నీయఁజాలఁడా ?

80 పచ్చనిచెట్టునుండి యాతఁ డగ్నిని బుట్టింప నీవు దానితో మంటచేసికొందువుగదా !

ఏమి ! స్వర్గమర్త్యములను సృజింపఁగలిగినవాఁడు మీవంటివా రిని సృజింపఁజాలఁడా ? నిజముగా నాతఁడు సృష్టియందు నిపుణుఁడు.

అతని కేదైన బుద్ధిపుట్టినప్పుడు "కమ్ము" అని యాజ్ఞాపించినం తనే యది అగును.

సర్వవస్తువులపైనను నధికారముగలయాతఁడు ధన్యుఁడగును గాక ! ఆయనయొద్దకే మీరందఱును తిరిగి తేఁబడుదురు.

---

# సురా 37—అంతరువులు.

మక్కా—182 పద్యములు-5 రుకూ్కలు.

## అధ్యాయము. 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

సంకీర్తనగీతములకొఱకు బారులుగట్టి యున్న దేవతలయాన!

పిశాచములం ద్రోలువారియాన,

భయసూచనగా ఖురానును బఠించువారియాన.

నిజముగా స్వర్గమర్త్యములకును, ఆ రెండిటికిని మధ్యనున్న దానికిని నధినాథుఁడును, ప్రాగ్దిక్కునకు

ప్రభువును నగు దేవుఁ డొక్కఁడే.

క్రిందిస్వర్గము నుడుగణాలంకృతముగాఁ జేసితిమి.

ఈ నక్షత్రమువలనఁ బ్రతిదుర్మార్గపిశాచమును నుచ్చస్థానమున జరుగుచున్నదానిని వినఁజాలదు.

అట్లించుకైన వినఁబ్రయత్నించెనేని నగ్నిజ్వాల యొక టాతని వెంబడించుచుండును.

ఆతనిఁజుట్టుముట్టి మేము పాఱఁద్రోలుచుందుము. అట్టివారిని శాశ్వత నరకాగ్నియందు వ్రేగఁ జేయుచుండుఁడు.

10 ఎవ్వఁడైన నొక్క మాట నపహారించినచో మండుచున్న యగ్నిజ్వాల వానిని వెంబడించును.

అయిన వారా దేవతలా బలవత్తములని మక్కావాసుల నడుగుము. నిజముగా మేము వారిని తుచ్ఛమృత్తికతో నిర్మించితిమి.

కాని, నీవాశ్చర్యపడుచుండ వారు హేళనచేయుచుందురు.

వారికి భయసూచననిచ్చినను వారాసూచనను గ్రహింపరు.

వారొక భయసూచనం జూచి వెక్కిరించుచు,

"ఇది కేవల మింద్రజాలము,

ఏమి, మేము ధూళియు నెముకలు నైనపిదప,

మా చచ్చిన తాతలతోఁగూడ పునర్జీవితులమగుదుమా" అని యందురు.

"అవును! మీ రవమానముచేఁ గప్పఁబడుదు" రని వారితోఁ బల్కుము.

ఒక్కటే మోఁత వినఁబడును. దానిని వినినవెంటనే వారు తమ చుట్టు,

20 "ఓహో! మేము దుఃఖభాజనులము! ఇదియే శిక్షాదినము!

మీ రనృతదినమని వచించిన తీర్పుదిన మిదియే" యని యందురు.

## అధ్యాయము 2.

అన్యాయవర్తులను, వారి సహాయకులను, సత్యదేవుఁడుగాక వా రారాధించిన యితరదేవతలను నొకచోఁ జేర్చి,

నరకమార్గమున వారిని దోడ్కొనిపొమ్ము.

వారిని ముందుపెట్టఁగా వారు,

"ఏల మీ రొండొరులకు సహాయపడరు?" అని ప్రశ్నింపఁ బడుదురు.

ఆదినమునమాత్రము వా రందఱును దేవునికి నమ్రులై

ఒకరినొకరు నిందించుకొనుచు,

"ఏమిరా! యపశకునముగా నావెంటఁబడితివేల?" యని యనుకొనుచుందురు.

కాని, వారికి ప్రతివచనముగా " అట్లుకాదు. నమ్మనివారలు మీరే.

30 మాకు నీపై నేమియు నధికారములేదు. మీ జాతివారందఱు నుత్పథగాములు.

కావున మా ప్రభువు మాకు విధించిన శిక్ష న్యాయమైనదియే. మనము దాని ననుభవించియే తీరవలెను.

మేము త్రోవఁ దప్పితిమి కావున మిమ్ములనుగూడ త్రోవఁ దప్పించితిమి" అను మాటలను విందురు.

కావున, వా రాదినమునఁగలుగు శిక్షను పంచికొనఁగలరు.

నిశ్చయము ! దుష్టుల నిట్లే శిక్షింతుము.

మేము వారితో "దేవుఁడుతప్పమఱియొక దేవుఁడు లేఁ"డని చెప్పఁగా వారు గర్వితులై,

" అయినను మే మొక వెఱ్ఱికవీశ్వరునికొఱకు మా దేవతలను విడిచిపెట్టవలయునా ?" యనిరి కావున నే, వారి కిట్టి శిక్షను మేము విధించుచున్నాము.

నిజముగా నాతఁడు వచ్చి, పూర్వము పంపఁబడినవారి వాక్యములను స్థిరపఱుచును.

నిశ్చయముగా మీ రా బాధాయుతమగు శిక్ష నాస్వాదింపవలయును.

దేవుని హృదయపూర్వకముగా ననుసరించు కింకరులుతప్ప,

40 ఇతరులు తాము చేయు కర్మలఁబట్టి ఫలముల నందగలరు.

వారికి పండ్లతో విందు చేయఁబడును.

వా రానందారామములలో,

శయ్యలపై నొకరికొకరెదురుగాఁ బరుండియుండ,

గౌరవింపఁబడుదురు.

శుక్లవర్ణమై, రుచికరమైన,
నదీజలమును వారు పాత్రలోఁ బోసికొని త్రాఁగఁగలరు.
దానివలన వారికి మొగము మొత్తదు. మైకము గ్రమ్మదు.
వారిలో ముగ్ధేక్షణలగు విశాలనేత్రలు
ఉష్ట్రపక్షి గ్రుడ్డువలె మనోహరలు నగు వారితోఁ గలసి యుందురు.

50 వారిలో నా రొకరిని ప్రశ్నలడుగుకొనుచుందురు.
అం దొకఁడు, "నాకుఁ గూర్చు మిత్రుఁ డొకఁడు గలఁడు.
అతఁడు 'నీవు దానిని నమ్మెదువా?
ఏమి, మనము చచ్చి, ధూళియు నెముకలును నైనపిదప మనలఁ బరీక్షించువా రుందురా?" యని యడుగుచు,
తనచుట్టుపట్లవారితో 'మీరు చూచితిరా' యని యడిగి నంతనే,
ఆతఁ డాతనిని నరకమధ్యమునఁ గనుఁగొనును.
అప్పు డతఁ డాతనితో "దేవునియాన! నీవు నన్ను నశింపఁజేసి యున్నావు.
నా ప్రభునియనుగ్రహము లేకుండినచో నేను నిజముగా బాధ పడవలసినవారిలోఁ జేరియుందు" ననును.
ధన్యాత్ములగువారు "మేము చనిపోమా?
మొదటిచావుకంటె వేఱు చావున్నదా? మేము బాధలను తప్పించుకొంటిమా" యని యడుగుదురు.

60 నిజముగా నిదియే మహానందము.
ఇట్టిదానికొఱకే పాటుపడువారు పాటుపడవలయును.
ఇది మంచియాహారమా? ఎజ్‌జకూమ్ అను చెట్టుఫలము మంచియాహారమా?

నిజముగా దుష్టులు దానినిగూర్చి వివాదములు పెంచుకొనుటకే దానిని సృష్టించితిమి.

ఆచెట్టు నరకము నడుగుభాగమునుండి పుట్టుచున్నది.

దానిపండ్లు సైతానుల తలకాయలవలె నుండును.

ఇదిగో, పాపులు దానిఫలములను తిని కడుపులు నింపుకొన్న పిదప,

దానిపై సలసల మఱుగుచున్న నీటిని త్రాగవలయును.

తరువాత వారు నరకమునకుఁ బోవలయును.

వారు తమ పెద్దలు తప్పుత్రోవను బోవుటను జూచి.

70 తామును వారిమార్గమునే యనుగమించిరి.

వారికిఁ బూర్వముఁగూడ నెందఱనో భయసూచనలఁ దెల్పుటకుఁబంపినను,

వారి పూర్వులును తప్పుత్రోవనే పట్టిరి.

కాని, దేవునికింకరులకుఁ దప్ప,

భయసూచననుగొన్న యితరుల కేమికలిగెనో చూడుఁడు ?

## అధ్యాయము-3.

పూర్వము నుహు మమ్ము పిలిచెను. మేము వెంటనే యాతని మొఱ విని,

అతనిని, అతనికుటుంబమును, గొప్ప యాపదనుండి తప్పించి,

అతని సంతాన మాతని యనంతరమును బ్రతికియుండునట్లు చేసి,

అతనికిని, అతని సంతతికిని,

“ప్రపంచము లన్నిటియందును, నుహూకు శాంతియగుఁగాక !” యను నాశీర్వాదమునుఁ బ్రసాదించితిమి.

80 సన్మార్గవర్తులను మే మిట్లు బహూకరింతుము.

అతఁడు మాయందు విశ్వాసముగల కింకరులలో నొకఁడు.

తక్కినవారిని నీట ముంచి చంపితిమి.

నిజముగా నిబ్రాహీమును నట్టివిశ్వాసియే.

సంపూర్ణ విశ్వాసహృదయుఁడే.

అతఁడు తనతండ్రితోడను, తన ప్రజలతోడను "మీరు దేని నారాధించుచున్నారు ?

ఏకేశ్వరారాధనము చేయక సత్యమార్గమునుబట్టి, బహుదేవతల నేల పూజింతురు ?

ప్రపంచాధినాథుఁ డెట్టివాఁ డని మీ యూహ" యని పలుకును.

నక్షత్రములవంక దృష్టివాల్చక చూచి,

మఱియు, "నాకు రోగముగానున్నట్లున్న" దనఁగా,

90 వా రాతనివిడిచిపోయిరి.

అతఁడును వారి దేవతలయొద్దకుఁ బోయి "ఏమి ! మీరు తిండి తినరా ?

మీరు మాట్లాడకుండుట కేమయిన రోగ మంకురించినదా ?" యని యడుగుచు,

వారిపైఁ బోయి తన కుడిచేతితోఁ గొట్టెను.

అంతట నతనిజాతివారు వడివడిగా నాతని సమీపింప,

మిమ్ము దేవుఁడు సృజించియున్నాఁడు.

మీ రీ విగ్రహములను చెక్కియున్నారు. మీరు చెక్కిన బొమ్మనే మీరు పూజింతురా" యని యడుగ,

వారు "చితి నొకదానినిపేర్చి, జ్వలించుచున్న యగ్నిలో నతని నుంచి కాల్పుఁ" డని పలికిరి.

వా రాతనిపై కుట్ర పన్నియుందురు గాని, వారిని మేము భంగపఱిచితిమి.

ఆతఁడు "నిజముగా నాకు రక్షణమార్గముఁ జూపఁగల నా ప్రభువు నాశ్రయించుచున్నాను.

100 ప్రభువా! సన్మార్గవంతుఁడగు నొక కొమారుని నాకుఁ బ్రసాదింపు" మన,

మే మాతనికి వినయధురీణుఁ డగు బుత్త్రునిఁ బ్రసాదించితిమి.

అతఁడు సంపూర్ణ యౌవనుఁ డైనంత నే, ఆతనితండ్రి, "కుమారా! నేను నిన్ను బలియీయవలసియున్నదని కల వచ్చినది కావున క్రమమైన మార్గము నాలోచింపు" మన, పుత్త్రుఁడును "తండ్రీ! నీ కాజ్ఞయైనట్లు చేయుము. దైవానుగ్రహమువలన, నే నోర్వఁగలిగి యుందు" నని యుత్తరమిచ్చినంత నే,

తండ్రియుఁ బుత్రుని దేవునికి బలిగా నర్పింపసమకట్టి బోరగిలఁ బరుండఁ బెట్ట,

మేమును "ఇబ్రాహీమా!

ఇపుడు నీవు నీ స్వప్నముప్రకారము చేసితివి. మాకు తృప్తి యైన" దంటిమి. ఋజుమార్గవర్తుల నెట్లు బహూకరింతుమో చూచితివా?

ఇది నిజముగా కఠినశోధనగదా.

కావున నాతనిపుత్రునికి బదులుగా విలువగల బహుమానము నిచ్చి,

ఆతని సంతతివారి నుద్దేశించి,

"ఇబ్రాహీమునకు శాంతియగుఁగాక!" యని యాశీర్వదించితిమి.

110 సత్కర్మానుష్ఠానపరుల కిట్టి బహుమానమునే మే మిత్తుము.

ఆతఁడు విశ్వాసులగు మా కింకరులలో నొకఁడు.

అపుడు మే మాతనికి ఋజువర్తియగు 'ఇసాకు' అను ప్రవక్త పుట్టఁగలఁడని చెప్పి,

అతనిని ఇసాకును నాశీర్వదించితిమి. వారిసంతతిలోఁ గొందఱు సన్మార్గవర్తులును, మఱికొందఱు తమ శిక్షకొఱకే కేవలపాపులునుగఁ బరిణమించిరి.

అధ్యాయము-4.

మఱియుఁ బూర్వకాలమున మూసా హారూనులకు వరముల నిచ్చి,

వారిని వారిప్రజలనుగూడ గొప్పదుఃఖమునుండి తప్పించి,

వారికి సహాయుపడి, విజయుల జేసి,

వారిద్దఱకుఁ జెఱియొక సద్గ్రంథము నిచ్చి,

ఇద్దఱను మంచిమార్గమునఁ ద్రిప్పి,

వారి సంతతిలో నందఱకును,

120 "మూసా హారూనులకు శాంతియగుఁగాక" యను వరమును బ్రసాదించితిమి.

వారిద్దఱును విశ్వాసులగు మా కింకరులలోనివారు.

సజ్జనులను మేమిట్లే బహూకరింతుము.

నిజముగా 'ఇల్యాసు' కూడ మాప్రవక్తలలోని వాఁడే.

అతఁడు తనప్రజలతో "మీకు దైవభీతిలేదా ?

'బాల్' (సూర్యుఁడు) అను మీదేవతనారాధించి, యతి నిపుణుఁడగు సృష్టికర్తను బరిత్యజించెదరా ?

మీకును మీతాత ముత్తాతలకును, దేవుఁడే ప్రభువు" అని బోధింప,

వా రాతని నసత్యవాదిగాఁ బరిగణించిరి. కావున విశ్వాసులగు దేవునికింకరులుతప్ప,

ఇతరులు శిక్షనొందఁగలరు.

130 మేమాతని సంతతికొఱకు "ఇల్యాసునకు శాంతియగుఁగాక !" యని యాశీర్వదించితిమి.

ఆతఁడు విశ్వాసులగు మాకింకరులలో నొకఁడు.

సత్పురుషులను మేమిట్లే సన్మానింతుము.

'లూట్' కూడ మాప్రవక్తలలో నొకఁడే,

ఆలస్యముచేసిన యొకవృద్ధస్త్రీనితప్ప,

ఆతనిని, ఆతనికుటుంబమును మేమాపదనుండి తప్పించి,

తరువాత తక్కినవారిని నాశనము చేసితిమి.

మీ రుదయమునను, రాత్రియందును, పాడుపడినవారియిండ్ల ప్రక్కనే పోవునప్పుడు.

ఆలోచించుకొనుఁడు.

అధ్యాయము 5.

'యూనూసు' కూడ మాప్రవక్తలలో నొకఁడే.

140 ఆతఁ డతిభారమగు నావలోనికిఁబోవ,

అందు చోటు లేకపోవుటచే చీట్లు వేయఁబడెను.

అందుచేత నతనిని సముద్రములోఁ ద్రోసివైచిరి. ఆతఁడు నిందాపాత్రుఁడు కావున నొకచేఁప యాతని మ్రింగివైచెను

కాని, యాతఁడు మమ్ము స్తుతించువారిలోనివాఁడు కాక పోయినచో,

ఆమత్స్యముననే ప్రళయదినమువఱకును నుండియుండును.

అతనిని నిర్మానుష్యమగు తీరమునఁ ద్రోసియుంచి, రోగపీడితుఁజేసి,

అతనిపై నొకగుమ్మడిపాదు లేచునట్లుకల్పించి,

అతనిని లక్షకుపైగా మనుష్యులయొద్ద కంపితిమి.

వారు విశ్వాసులుకావున వారిభోగములు కొంతకాలము సాగునట్లు చేసితిమి.

కావున మక్కా-వాసులతో నీప్రభువునకుఁ బుత్త్రికలును, తమకుఁ బుత్త్రులును గలరేమో యడుగుము.

150 దేవతలను స్త్రీలుగా మేము సృజించితిమా? వారు చూచియున్నారా ?

దేవుఁడు సంతానవంతుఁడని చెప్పువాక్యము

వారే కల్పించిన యసత్యముకాదా ? వారు కేవల మసత్యవాదులు.

అతనికి పుత్త్రులకంటెఁ బుత్త్రిక లిష్టమా ?

వారట్లు తలంచుటకుఁ గారణమేమి ?

అయిన మీరీ భయసూచనను గ్రహింపరా ?

వానికి స్పష్టమగు సాక్ష్యము నీయఁగలరా ?

మీరు సత్యవాదులయినచో మీగ్రంథమునుజూపుఁడు ?

వారతనికిని, పిశాచములకును బాంధవ్యము గల్పించెదరు. కాని, యాపిశాచములకును నీవిగ్రహారాధకులు దేవునిసాన్నిధ్యమునకు రాఁగలరని తెలిసియేయున్నది.

అతనికి వారారోపించినదానినుండి దేవుని ప్రభావము దూరముగా నుండుఁగాక !

160 విశ్వాసులగు నాతనికింకరు లట్లు చేయరు.

ఇదిగాక మీరును మీరారాధించువారును,

నరకాగ్నిఁబడువారినితప్ప,

ఇతరుల నేమాత్రము నుద్బోధింపఁజాలరు,

నిజముగా మాలో ప్రతిపురుషునకును స్థానములు నిర్ణీతములయియే యున్నవి.

మేము యథాస్థానములందు వరుసగ నిలువఁబడి,

అతనిసంకీర్తనములఁ జేయుచుందుము."

ఆయవిశ్వాసకులు,

"మా పూర్వులనుండియు నీయద్భుతము మాకుఁ దెలియఁ జేయఁబడియుండినచో,

మేమును దేవుని విశ్వాసకింకరులమై యుండియుందుము" అందురు.

170 కాని, వారు కురానును విశ్వసింపరు. తుదకు దానిసత్యమును వారు గ్రహింపక పోరు.

మాకింకరులగు ప్రవక్తలకు

నిశ్చయముగా సహాయము దొరకుననియు,

మాసైన్యములు వారికి విజయము చేకూర్పఁగలవనియు, పూర్వకాలమున మేము మాటల పంపితిమి.

కావున కొంతసేపు వారి మార్గమునుండి తొలఁగి,

వారినిఁ జూచుచుండుఁడు. వారు తుదకు తమశిక్షను జూడఁ గలరు.

అయిన, వారు మాకోపము శీఘ్రముగ వచ్చునట్లు చేసి కొందురా ?

కాని, యది వారి గృహములకు చేరునప్పటికి భయసూచన నొందినవారికి దుష్ప్రభాతమై యుండును.

కావున కొంతసేపు వారి మార్గమునుండి తొలఁగి వారిని చూచుచుండుఁడు.

వారును తుదకు తమ శిక్షను జూడఁగలరు.

180 వారాతని కారోపించినదానినుండి మహిమాన్వితుఁ డగు దేవుని ప్రభావము దూరముగా నుండుఁగాక !

అతని ప్రవక్తలకు శాంతి యగుఁగాక ?
ప్రపంచాధినాథుఁడగు దేవుఁడు కీర్తనీయుఁ డగుఁగాక !

# సురా-38 సాద్.

మక్కా-88 పద్యములు-5 రుకూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

సాద్ భయసూచనాపూర్వకమగు కురాను నాన !
అవిశ్వాసకులు గర్విష్ఠులై నీతో వివాదముచేయుచున్నారు.

వారికిఁబూర్వ మెన్నియో సంతతులవారిని మేము నాశనము చేసియున్నాము. వారు రక్షింపుమని వేఁడికొనినఁగాని, యది తప్పించుకొనుటకు సమయమా ?

వారు తమలోనే యొకఁడు భయసూచనంగొనుచు వచ్చుటయా యని యాశ్చర్యపడి " వీఁ డైంద్రజాలికుఁడు. అసత్యవాది.

మన దైవములనందఱను త్రోసివైచి యొక్కఁడే దేవుఁ డని చెప్పుచున్నాఁడు. ఇదివిచిత్రముగదా ?" యందురు.

వారిలో నాయకు లెడఁగలుగ నిలువఁబడి " మీరు పొండు. మీదైవములను పరిత్యజింపకుఁడు. ఆతఁడు చేయనెంచినది మీకు గోచరించియే యున్నది.

మనపూర్వాచారములలో నిట్టిదాని నెన్నఁడైన వినియుంటిమా ? ఇది కేవలము మిథ్యాకల్పనము.

మన యందఱిలోనను నాతనికొక్కనికే యాభయసూచక గ్రంథము దిగిపడినదా ?" యందురు. అవును ! వారు నాపగను రుచి చూచియుండకపోవుటచే నాభయసూచనలను విశ్వసింపకున్నారు.

సర్వశక్తుఁడును, సర్వప్రదాతయు నగు వాని ధనరాసులన్నియు వారిచేతులలోనా యున్నవి. ?

10 స్వర్గమర్త్యములయు, తదంతరాళముయొక్కయు నాధిపత్యము వారిదా ? అట్లయిన త్రాళ్ళ నూతగాఁ జేసికొని పై కెగఁబ్రాకు మనుము.

వా రెందఱు కలిసివచ్చినను పాఱఁదోలఁబడుదురు.

వీరికి పూర్వము నుహు, ఆద్ ల చర్మముల నొలిపించిన ఫిరౌను వీరల ప్రజలును, వారి జ్యోతిష్కులును, మిథ్యాపురుషులుగాఁ బరిగణించిరి.

సాముాదు, లూటుప్రజ లరణ్యవాసులు. వీరు వారికి సహా యులు.

వారు ప్రవక్తల నసత్యవాదు లనుట తప్ప మఱేమియుఁ జేయలేదు. కావున వారికిఁ గలుగఁబోవు శిక్ష న్యాయమైనదే.

అధ్యాయము-2.

ఈమక్కావాసులును నాయొంటి మోఁత కై వేచియున్నారు. దాని నెవ్వరునడ్డగించలేరు.

అయినను వారు "ప్రభువా ! ప్రళయదినమునకుఁ బూర్వమే, మాకుఁ గలుగవలసినది రానిమ్మని సాహసముతోఁ బలుకుదురు

వారిమాటల నోర్పుతో వినుచుండుము. బలయుతుఁడై, పశ్చాత్తప్తుఁడై, మావైపుఁ దిరిగినవాఁడగు మాకింకరుని దావూదును స్మరింపుము.

ఉదయాస్తమయములయం దాతనితోఁ గూడఁ బర్వతములు స్తోత్రములు చేయునట్లు చేసితిమి.

పక్షిగణము లాతనిచుట్టును జేరి, తిరిగితిరిగి యాతనియొద్దకే యేతెంచుచుండెను.

20 ఆతని రాజ్యమును మేముస్థిరముగ నుండునట్లుచేసి న్యాయ్యమగు తీర్పుల నిచ్చుట కాతనికి నిర్మల బుద్ధి నిచ్చితిమి.

ముహమ్మదా! ఆతని గదిగోడల నెక్కిన యిద్దఱ అన్యాయవాదులకథను నీవు వింటివా?

వారు దావూదు గృహముఁ బ్రవేశింప నాతనికి భయమగుడు వారును, "నీవు భయపడవలదు. మే మెదురుకక్షులవారము. మే మొకరికొకరము హాని చేసికొనియున్నాము. కావున నన్యాయము చేయక మాయిద్దఱయందును సత్యపరుఁ డెవఁడో యేర్పఱించి మాకుఁ గ్రమమార్గముఁ జూపుమన,

ఈ నా సహోదరునియొద్ద తొంబదితొమ్మిదిగొఱ్ఱెలును, నా యొద్ద నొకటియు మాత్ర ముండెను. ఆతఁడు దానిని తనయొద్ద నుంచుమని నన్ను నిర్బంధపెట్టినాఁడు" అనఁగా.

దావూదు "నీ గొఱ్ఱెనుగూడ తనవానితో కలుపుకొనుమనని యాతఁ డడుగుట యధర్మమే. ఇట్లే స్నేహితులమని పేరుచెప్పి యితరుల ధనము నెందఱో యపహరించుచుందురు. కాని, విశ్వాసులును, ఋజుమార్గవర్తులును నట్లుచేయరు. వారు స్వల్పసంఖ్యాకులు" అనుచు తన్ను మేము శోధించితిమని తెలిసికొని ప్రభువు క్షమాపణ వేఁడికొని, పశ్చాత్తప్తుఁడై సాష్టాంగపడి యారాధించెను.

కావున నతని యాపాపమును మేము క్షమించితిమి. అతఁడు మాయొద్ద గొప్పపదవియందుండి స్వర్గమున మంచి వసతి గలిగి యుండును.

దావూదా! మేము నిన్ను భూమిపై మాకు ప్రతినిధిగా నియోగించినాము. కావున వారు నిన్ను సత్యపథమునుండి తప్పింపకుండుటకై నీయిష్టము ననుసరింపక మనుష్యులవివాదములను సత్యబుద్ధితోఁ బరిష్కరించుచుండుము. దైవమార్గమును తప్పినవారికి ప్రళయదినమును మఱచియున్నందులకై ఘోరశిక్ష కలుగనున్నది.

## అధ్యాయము-3.

స్వర్గమర్త్యములను, తదంతరాళమును సూఱకే మేము సృజించి యుండలేదు. కాని, యవిశ్వాసకు లట్లే తలంచుచుందురు. వారి కగ్నివలన దుఃఖము కలుగనున్నది.

విశ్వాసులను, ఋజుమార్గవర్తనులను భూమిపై దౌష్ట్యమును ప్రవర్తింపఁ జేయువారివలెనే చూతుమా? భక్తిహీనులను, భక్తిపరులనుగూడ నొకేరీతిగఁ జూతుమనుకొంటివా?

మనుష్యులు దానియందలి శ్లోకములను ధ్యానించి జ్ఞానులు దానిని మఱువకుండుటకు ధన్యగ్రంథము నొకదానిని మేము మీకుఁ బంపియున్నాము.

30 దావూదునకు సులైమానును బ్రసాదించితిమి. అతఁడు దేవుని వైపు దిరుగుట కిచ్ఛగలిగి మంచిసేవకుఁడయ్యెను.

దీనిని జ్ఞాపకముంచుకొనుము. అతిజవాశ్వము లాతనియెదుటికిఁ దేఁబడినప్పుడు,

ఆతఁడు "సూర్యుఁడు తమోజవనిక మఱుగున కరుగువఱకును, దేవుని మఱచి యిహలోకవస్తువులయందు ప్రేమనుంచితిని,

వానిని నా యెదుటకుఁ దె" మ్మని వారికాళ్ళను మెడలను తెగనరకనారంభించెను.

మేమును సులైమానును శోధించి యాతని సింహాసనముపై నొక పిశాచమును గూర్చుండఁబెట్ట నతఁడు మాయొద్దకుఁ బశ్చాత్తప్తుఁడై వచ్చి,

"ప్రభువా! నీవు సర్వప్రదాతవు. నాకు తప్ప నితరులకు భోగ్యముకాని రాజ్యము ని" మ్మని వేఁడ,

ఆతనికి వాయువుపై నధికార మొసగితిమి. అదియు నతని యాజ్ఞచొప్పున నతిమందముగా వీఁచుచు నాతఁడు పంపినచోటికిఁబోవు చుండెను.

సైతానులును, తాపీపనివాండ్రును, నీట మునుఁగువారును,

ఇతరులును, శృంఖలములచే బంధింపఁబడినవారును నగు వారితో వేర్వేఱుగా,

"ఇదియే మా బహుమానము. నీవు ధర్మాత్ముఁడవుకమ్ము; కాకపోయిన పొమ్ము. దానికి నీవు లెక్కనీయలేకుంగువు" అంటిమి.

40 అతనికి మాతోడ నుచ్చస్థానమును, సౌఖ్యవసతియు నిచ్చితిమి.

అధ్యాయము-4.

దీనినిగూడ స్మరింపుము. మా సేవకుఁడగు 'అయ్యూబు' తన ప్రభువుతో "సైతాను నాకు రోగమును బాధయు నిచ్చియున్నాఁ" డన,

మేము "నీకాలితో నేలను తాకుము. అచటఁబుట్టినవారిలోఁ బ్రక్షాళనము చేసికొని యాశీతలజలములను ద్రావుము" అని,

అతనికి కుటుంబమును, మాదయవలన మఱియంతమందిని నిచ్చితిమి. విచక్షణగలవారి కిది యొక సూచన.

అప్పుడు మే మాతనితో "చేత నొక కట్టఁ బట్టికొందుము. నీయొట్టును తప్పకు" మంటిని. అతఁడు నోర్పుకలిగియుండుటను

మేము చూచితిమి. అతఁడు చాల మంచిసేవకుఁడు; మా శరణు జొచ్చినవారిలో నొకఁడు.

బలవంతులును, జ్ఞానచక్షులును, మాకింకరులును నగు ఇబ్రాహీము, ఇసాకు, యాకూబులను స్మరింపుము.

స్వర్గవాసజ్ఞానమను జలముచే వారిని పవిత్రులఁ జేసితిమి.

వారు మాదృష్టికి సన్మార్గవర్తులును, మే మెంచికొనినవారిలోనివారును నై యున్నారు.

ఇస్మాయేలు, అల్యసా, జుల్ కిఫ్ల్, వీ రందఱును న్యాయవంతులు. వీరిని స్మరింపుము.

ఇదియొక సూచన. భక్తులకు నిశ్చయముగా సౌఖ్యవసతి కలుగఁగలదు.

50 వారెల్లపుడును తెఱచియుండు ద్వారముగల యాడెనువనములయందు

శయనించి, వివిధఫలములను, పానీయములను ననుభవించుచు, లోలేక్షణలును, సవయస్కలును నగు ముగ్ధకన్యల సహవాసమున నుందురు.

“ఇదియే ప్రళయదినమున మీకు చేకూరఁగల దని మేము చెప్పినది.”

“అవును. ఇదియే మే మీయనెంచిన బహుమానము. అది యెప్పుడును తప్పదు.”

అది అట్లేకాని, దుష్టప్రవర్తనులకు దుఃఖగృహము సంప్రాప్తమగును.

అదియే నరకము. అచట వారు దుఃఖశయ్యపైఁ బరుండియుండ దహింపఁబడుదురు.

అదియట్లే. వారచట సలసల మఱుగుచున్న నీటిని, నెత్తురును, మఱియు నట్టి యితరవస్తువులను రుచి చూడఁగలరు.

వారిలోని నాయకులకు "వీరే మీ సహచరులు. వీరును మీతో తలక్రిందుగాఁ బడఁగలరు. వారి నెవ్వరు నాహ్వానింపరు. వా రగ్నిలో దహింపఁబడుదురు" అను మాటలును వినఁబడును.

60 వారు "మీరుమాత్రమో? మీకుమాత్రము సంతోష పూర్వకాహ్వానముండునా యేమి? ఈదుఃఖగృహమును మాకొఱ కాయత్తపఱిచిన వారలు మీరలేకదా!" యందురు.

వారి యనుచరులును, "ప్రభువా! మమ్మిందులోనికిఁ దోడ్కొని వచ్చినవీరి కీయగ్ని నినుమడింపుము."

అనుచు, "మేము కొందఱు మనుష్యులను దుష్టులని నిరసించి తిమి. వా రిచటఁ గానరారేమి?

వారు మా దృష్టిపథమునుండి తప్పిపోయిరా యేమి?" అని యందురు.

నిశ్చయముగా నగ్నియందు వారిట్లు వివాదముపడుట సత్యము.

అధ్యాయము-5.

వారితో "భయసూచనఁ దెలుపుట మాత్రమే నాపని. అద్వితీయుఁడు, ననంతశక్తుఁడు.

స్వర్గమర్త్య తదంతరాళముల కధినాథుఁడు, ననంతసత్త్వుఁడు, క్షమాపరుఁడు, నగు దేవుఁడు తప్ప మఱియొకదేవుఁడు లేఁడు.

ఇది చాలవిశ్వసనీయమగు వార్త.

దానిని మీరు వినకున్నారు.

దేవనాయకులలో జరిగినవివాదము నాకుఁ దెలియదు,

70 నేను బహిరంగబోధకుఁడను గావున నాకది తెలుపఁబడినది.

నీప్రభువు దేవతలతో "మనుష్యుని బంకమట్టితో సృజించి,

ఆతనియందు నాప్రాణముంచినంతనే మీరు మోకాళ్ళపైఁ బడి యాతని నారాధింపుఁ" డన,

వారందఱు నొక్కమాఱుగా సాష్టాంగపడిరి.

కాని, ఇబ్లిస్‌మాత్ర మట్లుచేయక గర్విష్ఠియు, నవిశ్వాసియు నయ్యెను.

దేవుఁ డాతనితో "ఇబ్లీసా! నేను నాచేతులతో నిర్మించిన వాని కేల సాష్టాంగపడితివి కావు?

నీవు గర్వపూరితుఁడ వైతివా? లేక బహుపుణ్యవంతుఁడవా?" యని యడుగ,

ఆతఁడు "నే నాతనికంటె నుత్తముఁడను. న న్నగ్నితోడను, నాతని మట్టితోడను గదా నీవు నిర్మించితివి" అనెను.

దేవుఁడును, "నీవు నాసమక్షమునుండి పొమ్ము. నీవు శప్తుఁడ వైతివి.

ప్రళయదినమువఱకును నీశాపము నిన్నంటియుండఁగలదు." అనఁగా

80 ఆతఁడు "ప్రభువా! రక్షణదినమువఱకును, నాకు గడు విమ్ము" అని వేఁడికొనెను.

దేవుఁడు కరుణించి "సరే! నిర్ణీతదినమువఱకును,

గడువుగలవారిలో నీవొకఁడవు కాఁగల" వని యనుగ్రహింప,

ఆతఁడు "నిన్ను నిర్మలహృదయులై సేవించువారిని దప్ప,

తక్కినయందఱను నేను తప్పుత్రోవను బెట్ట నీకీర్తియానఁ బ్రమాణము చేయుచున్నాను"

అనఁగా దేవుఁడు "ఇది సత్యము. నేను సత్యమును బలుకు

చున్నాను. నిన్నునుండియే నేను నరకమును నింపెదను. నిన్ననుస రించువారి నందఱను నందుత్రోసెదను" అనెను.

"దీనికి బదులుగ నాకేమియు నీయనక్కఱ లేదు. నాకు మీా పనులతో జోక్యము లేదు.

సత్యముగా నీ ఖురాను సర్వజీవులకును భయసూచనమై యున్నది.

కొలఁదికాలములో మీాకు దానివార్త తెలియఁగలదు" అని చెప్పుము.

---

# సురా--39 సేనలు.

---

మక్కా 75-పద్యములు-8 రుక్కులు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

బలవంతుఁడు, బుద్ధిమంతుఁడు నగు దేవునినుండికలిగిన గ్రంథావ తరణము!

మేము నీకు సత్యముతోఁబాటు గ్రంథమును బంపియున్నాము. కావున దేవుని సేవించి, నిష్కపటివై పూజింపుము.

నిష్కాపట్యమగుపూజ దేవుని కర్పింపవచ్చియున్నావు కావా? "వారు మమ్ము దేవునిదరికిఁ దీసికొనిపోవుదురనియే వారిని మేము సేవింతు" మనుచు దేవునిఁగాక యితరులను ప్రభువులుగాఁ జేకొనిన వారికిని, విశ్వాసులకును భేదకారణమును దేవుఁడు తీర్పఁగలఁడు.

అసత్యవంతుఁడు భక్తిహీనుఁడునగు వానికి దేవుఁడు దారిఁజూపఁడు గదా!

దేవునికిఁ బుత్త్రుఁడే కావలసియున్న యెడలఁ దనసృష్టినుండి యెవ్వనినైన నతఁ డెంచికొనియుండును. అతనికి స్తుతులగుఁగాక! అద్వితీయుఁడు, సర్వశక్తుఁడునగు వాఁడు దేవుఁడే.

స్వర్గమర్త్యములను సత్యముగ సృజించినవాఁడు నాతఁడే. పగటివెనుకరాత్రిని, రాత్రివెనుకఁ బగటిని తెప్పించువాఁడు నాతఁడే. సూర్యచంద్రుల నాతఁడే నిర్ణీతస్థలములఁ జేరఁజేయును. అతఁడు శక్తిమంతుఁడును దయాళుఁడును గాఁడా?

తొలుత నొకపురుషుని సృజించి యాతనినుండియే భార్యను గల్పించి, నాయిరువురనుండియే మిమ్మందఱను నాతఁడుసృజించెను. పశువులలో మీకు నాల్గుజతలఁ బంచెను. సృష్టిపైసృష్టి చేసి త్రివిధములగు చీఁకటిలో మీతల్లుల గర్భములనుండి మిమ్ము సృజించినాఁడు. మీప్రభువగు దేవుఁ డాతఁడే, రాజ్య మతనిదే. అతఁడు గాక మఱి యొకదేవుఁడు లేఁడు. అయిన నాతనినుండి మీరింత యెడఁబడి యున్నారేల?

మీరాతనికిఁ గృతజ్ఞులు గాకయుండిన నుందురుగాక! మీరు లేకున్నను దేవుఁడు భాగ్యవంతుఁడే, కాని తనసేవకులు కృతఘ్నులై యుండుట కాతని కిష్టములేదు. మీరు కృతజ్ఞులైయున్న నతనికి సంతోషము. తనకర్మలనే మోసికొనుచున్న యాత్మపై మఱియొకదాని బరువుగూడ వేయఁబడదు. ఇఁకముందు మీరు మీప్రభువును జేరఁగలరు. అప్పు డతఁడు మీపనులను మీకుఁదెల్పును. మీహృదయములలోని రహస్యములన్నియు నతనికిఁ దెలియును.

మనుష్యుని కొక కష్టమంటినంతనే యాతఁడు తన ప్రభువు వంకదిరిగి యతనికి మొఱలిడును. కాని, యతనినాతఁడు గ్రహించి

నంతనే తాను మొఱలిడినవానిని మఱచి, దేవునికి సమానులఁగల్పించి యితరుల నాతని మార్గమునుండి తప్పించును. " ఈకృతఘ్నతతో నింకఁ గొంతకాల ముందుము కాని నీవగ్నిహోత్రమున వసించువారిలోఁ దప్పక చేరఁగలవు.

రాత్రిపూట నాయాగంటలయందు క్రమముతప్పక సాష్టాంగ పడుచునో, భక్తితో నిలిచియుండియో, రాఁబోవు జీవనమునకెదురు చూచుచుఁ దనప్రభువు దయ నపేక్షించుచు, నుండువాఁడు........? " జ్ఞానియు నజ్ఞానియు నొకేరీతిగఁ జూడఁబడుదురా ? బోధగలవారే కదా భయసూచనను గ్రహింతురు ? " అనుము.

అధ్యాయము-2.

10 " నావిశ్వాస సేవకులారా ! మీప్రభువునకు భయపడుఁడు. ఈలోకమున మేలుచేయువారికి మేలుకలుగును. దేవుని భూమివిశాలమైనది. ఓర్పుగలిగియుండువారికి సరియగు బహుమానము దొరకును. వారి బహుమానమునకు మేరయుండదు.

" నేను నిష్కపటినై దేవుని బూజింపవలయునని యాజ్ఞయైనది.

అతనియధీనములోఁ జేరువారిలో నేనే ప్రథముఁడను గావలయునని నాకాజ్ఞవచ్చినది.

" నేను నాప్రభువుపైఁ దిరుగుబాటు చేసినచో నామహాదినమున శిక్షకలుగునని నాకు భయమగుచున్నది.

" దేవుని నిష్కపటినై పూజించుచు నాతని సేవించెదను " అనుము.

" మీరాతనిప్రక్కనే మీరెంచికొనిన యితరులను సేవింతురు. రక్షణదినమునఁ దమయాత్మలను, దమ కుటుంబములను పోఁగొట్టు

కొనువారికి నష్టము కలుగును. ఇదియేకదా స్పష్టమగు నాశనము ”
అనుము.

వారిపై నగ్నివితానములును, క్రిందనగ్నినేలలును నుండును. దీనితోడనే దేవుఁడు తనసేవకులను భయపెట్టును. కావున నాసేవకులారా ! నాకు భయపడుఁడు.

కాని, థాగాతుపూజనుమాని, దేవునివంక దిరుగువారికి సువార్త రానున్నది. నామాటనువిని దానిప్రాశస్త్యమును గ్రహించిన నాసేవకులకీ సువార్తచెప్పి సంతోషపెట్టుము.

వీరే దేవునిచే నడుపఁబడువారు, వీరే యంతర్ముఖులు.

న్యాయశిక్షనొంది యగ్నిలోఁ ద్రోయఁబడనున్న వానిని నీవు రక్షింపఁగలవా ?

20 కాని, దేవునికి భయపడువారికి, క్రిందతరంగిణులు ప్రవహించు నంతస్థులుగల పెద్దగుడారములు లభించును. ఇదిదేవుని వాగ్దానము. దేవుఁడు తనమాటఁ దప్పఁడు.

స్వర్గమునుండి వర్షముఁబంపి, యానీటిని దీసికొనిపోయి భూమిలో నూఁటలఁగల్పించి, వానిమూలమున నానావిధ సస్యములఁ గల్పించి, వానిని తిరిగియెండించి, పచ్చబాఱఁజేసి, తుదకు క్రిందికి రాలఁజేసినవాఁడు దేవుఁడగుట నీకుఁగనఁబడలేదా ? ఇదిగో ! అంతర్దృష్టిగలవారికిందు బోధనయున్నది.

## అధ్యాయము-3.

తనహృదయ మిస్లామున కాలవాలము కాఁగా దేవునినుండి వెలుతురు గొన్నవాఁడు........... ? కాని, దేవుని స్మరింపక కఠిన హృదయులగు వారు దుఃఖులగుదురు ! వారు స్పష్టముగ తప్పుత్రోవ నున్నారు.

స్వవచనవ్యాఘాతములులేక, చెప్పినదానినే యుక్తిచెప్పు నొక గొప్ప గ్రంథమును దేవుఁడు పంపియున్నాఁడు. దానిముందు దైవభీతులగు వారి చర్మములు గగుర్పొడుచును. పిదప దేవునిస్మరణచే వారిచర్మములును, హృదయములును మెత్తనగును. ఇదియే దేవుని రక్షణ. అతఁడు తనకిష్టమైనవారికి దారిఁజూపును. దేవుఁడు త్రోవఁదప్పించిన వారికి దారిచూపువాఁ డుండఁబోఁడు.

రక్షణదినమునఁ దన మొగము తప్పఁ దన్ను బాధనుండి తప్పించుటకు మతేదియు లేనివాఁడు...........? అవును. దుష్టవర్తనులకు " మీరు గడించుకొనిన దానిని రుచి చూడుఁడు " అనుమాట వినఁబడును.

వారిపూర్వులు దాని నసత్యమనిరి. కాని వారనుకొననిదిక్కునుండి వారికి శిక్షవచ్చెను.

వారికిఁ బ్రస్తుతజీవనమందే దేవుఁడు దైన్యమునిచ్చెను. రాఁబోవు జీవనమున వారిశిక్ష తప్పక యింతకంటె హెచ్చుగానుండును. వారికది తెలిసిన నెంత బాగుండును !

వారు భయపడియుండుట కీకురానులో నన్నివిధములగు కథలను చేర్చియున్నాము.

అరబ్బీబాషలో వ్రాయఁబడిన యీకురానులో మీరు దేవునికి భయపడి యుందురుగదాయని కఠినములగు పదముల నుపయోగింపలేదు.

తమలోఁదాము వివాదములు సలుపు స్నేహితులకును,నొకరితో నొకరు స్నేహముగలిగి యంటియుండువారికిని, దేవుఁడు తారతమ్యమును విధించియున్నాఁడు. వీరిరువురు సమానులగుదురా ? కానేరరు. దేవునికి స్తుతియగుఁగాక ! కాని వారిలోఁ జాలమందికి బోధలేదు.

30 ముహమ్మదా ! నీవు చనిపోయెదవు : వారును చనిపోయెదరు. పిదప రక్షణదినమున మీప్రభువుముందు మీరొండొరులతో వాదులాడుకొందురు.

---

# కాండము. 24

---

## అధ్యాయము 4.

దేవుని యెడల నసత్యముపల్కి సత్యము తన్ను జేరినప్పుడుదాని నసత్యమనువానికంటె నన్యాయవర్తి యెవ్వఁడు ? భక్తిహీనులకు నరకవాస మున్నదేకదా ?

కాని, సత్యమును దెచ్చినవాఁడును, అదియే సత్యమని నమ్మిన వాఁడును, వీరే దైవభీతిపరులు.

వారు కోరినదంతయు వారి ప్రభువునొద్ద సిద్ధముగా నున్నది. పుణ్యవంతుల కిదియే బహుమానము.

దేవుఁడు చెడుకార్యముల దోషమును దొలఁగించి వారిసత్కార్యములకు బహుమాన మిచ్చును.

దేవుఁడు తనసేవకుల కన్నివిధములను సరిపోయి యున్నాఁడు గదా ! అయినను వారు తమవిగ్రహములతో నిన్ను భయపెట్టుదురు. కాని, దేవుఁడు త్రోవదప్పించినవారి కెవ్వఁడును దారిచూపఁ జాలఁడు.

దేవుఁడు దారిఁజూపినవాని నెవ్వఁడును త్రోవఁదప్పింపఁజాలఁడు. దేవుఁడు సర్వశక్తుఁడు, పగదీర్చుకొనఁ గలవాఁడు గదా !

స్వర్గమర్త్యముల సృజించినవాఁ డెవ్వఁడని నీవువారినడిగినచో వారు 'దేవుఁడే' యని బదులుచెప్పెదరు. దేవుఁడు నన్నుబాధింప

నెంచినచో, దేవునిగాక మీరావాహనచేయు నితరులు నీబాధను తొలఁగింపఁ గలుగుదు రనుకొన్నావా? అతఁడు నన్నుకరుణింప నెంచినచో వారు దానినాపఁగలరా? "దేవుఁడే నాకుచాలును. విశ్వాసు లాతనినే నమ్మియుందురుగాక !

'నాప్రజలారా ! మీమీపనులను మీశక్తికొలఁదిఁజేయుఁడు. నేనును నాపనిని జేసెదను. తుదకు,

40 "లజ్జాకరమగు శిక్ష, శాశ్వతమగుశిక్ష, యెవనికిఁ గలుగునో మీకుఁదెలియఁగలదు" అనుము.

మనుష్యునికొఱకును, సత్యముకొఱకును, మేము నీకు గ్రంథము నంపియున్నాము. దానివలన రక్షణనొందువాఁడు తనలాభముకొఱకును, తప్పిపోయినవాఁడు తన నష్టముకొఱకును నట్లుచేయును. కాని, వారిని నీ కప్పగించియుండలేదు.

## అధ్యాయము-5.

మృతినొందునపు డాత్మలను దేవుఁడు తనయొద్దకే తీసికొనును. చావనివారి యాత్మలను నిద్రలోనున్నప్పుడు చేకొనును. తానుమరణ శాసనమును విధించినవారి నుంచివేసికొని, యితరులను నిర్ణీతకాలము వఱకును, భూమిపైనుండఁ బంపివేయును. యోచించుకొనువారి కిందు సూచనలున్నవి.

దేవుఁడుగాక తమకడ్డుపడువా రెవ్వరైనఁగలరా? "ఏమి ! వారికి దేనిపైనను శక్తిలేకున్నను, వారికి బోధపడకున్నను నిట్లే చేయుదురా ?

" దేవుఁడే యడ్డుపడఁగలవాఁడు. స్వర్గమర్త్యాధిపత్యమాతనిదే ! ఇఁకముందాతనియొద్దకే మీరు తేఁబడుదురు " అనుము.

ఏకేశ్వరునినామ ముచ్చరింపఁబడినంతనే యవిశ్వాసులహృదయ ములు ముడిచికొనిపోవును. ఆతనిప్రక్క వారారాధించుదైవముల పేళ్ళెత్తినంతనే వారు సంతోషభరితులగుదురు.

"స్వర్గమర్త్యముల సృష్టించిన యోదేవా! రహస్యములును, వెలినున్నవియును నీకే తెలియును. నీసేవకులవివాదములను నీవే తీర్పఁ గలవు" అనుము.

భూమిలో నున్నదంతయు నంత మఱింతయుఁగూడ దుష్టుల కున్నచో నదియంతయు నిచ్చివేసి రక్షణదినమున వారికిఁ గల్గుశిక్ష నుండి తప్పిపోఁజూతురు. వారు పూర్వమనుకొనిన దినమున నాశిక్షలు దేవుఁడు వారికి పంపించును.

అప్పుడు వారిదుష్టకార్యములు వారికి స్పష్టముగా కనఁబడును. వారు వేళాకోళముచేసినయగ్నియే వారినన్నిదిక్కులను చుట్టుకొనును.

మనుష్యునికిఁ గష్టముగలిగినచో మాకు మొఱలిడును. పిదప మే మాతని ననుగ్రహించినచో "నాకీ యనుగ్రహము రావలసినదే యని దేవునికిఁ దెలిసె" ననును. అట్లుకాదు. అదియొకశోధన; కాని, వారిలో చాలమంది కది తెలియలేదు.

50 వారిపూర్వులుగూడ నిట్లే యనిరి. కాని, వారికార్యములు వారికి లాభించలేదు.

వారి దుష్టకృత్యములు వారినే కొట్టివేసెను. ఈమక్కావాసులు చేసిన దౌష్ట్యము వారినే కొట్టివేయును. వారు దేవుఁడు లేఁ డని చెప్పఁజాలరు.

దేవుఁ డనుగ్రహించుటకు వెనుదీయఁడనియు, తనకిచ్చవచ్చిన వారికి కొలఁదిగనే యిచ్చుననియు వారికిదెలియదా? నిశ్చయముగా విశ్వసించినవారి కిందే సూచనలున్నవి.

## అధ్యాయము-6.

మీకీడుకొఱకే యుల్లంఘించిన నాసేవకులారా ! దేవుఁడు కరుణింపఁడని నిరాశఁజెందకుఁడు. దేవుఁ డన్నిపాపములను క్షమించును. అతఁడు దయాదాక్షిణ్యమూర్తి !

శిక్షవచ్చినచో మీకు సహాయపడువా రుండరు. కావున దేవుని యొద్దకేఁగి యతనికధీనులఁరుకండు.

మీ రనుకొననప్పుడే, హఠాత్తుగా మీకుశిక్ష కలుగకపూర్వమే ప్రభువు మీకుఁ బంపియున్న యా శ్రేష్ఠవస్తువు ననుసరింపుఁడు.

అప్పుడొక యాత్మ "అయ్యో కష్టము ! దేవునియెడ చేయ వలసినవిధులను తప్పినందుకే ! నేను వేళాకోళముచేసినవారిలోని వాఁడనే" అనియు, లేదా,

"దేవుఁడు నాకు దారిచూపినచో నతనికి నేను భయపడి యుందును" అనియు, లేదా,

అది శిక్షను జూచుచు "నేను తిరిగి భూమిపై కేఁగినచో క్రమ వర్తనుఁడనై యుందును" అనియు పలుకుచుండును.

అట్లుకాదు. ఇంతకుపూర్వమే నాసూచనలను నీకుఁ దెలిపితిని. వానిని నీ వసత్యములని, గర్వితుఁడవు, నవిశ్వాసివియునైతివి.

60 రక్షణదినమున దేవునిగూర్చి యసత్యముఁ బల్కినవారిముఖములు నల్లఁబడును. గర్విష్ఠులకు నరకవాసమున్నదేకదా !

కాని, తనకు భయపడువారిని దేవుఁడు భద్రస్థానమున జేర్చును. వారి కేకీడును దుఃఖమును గలుగదు.

దేవుఁడు సర్వసృష్టికర్త. సర్వసంరక్షకుఁడు.

స్వర్గమర్త్యముల బీగము లాతనియొద్దనే యున్నవి. దేవుని సూచనల నమ్మనివారు నశింతురు.

## అధ్యాయము-7.

" అజ్ఞానులారా! దేవునిఁగాక యితరుని నన్నారాధింపుమందురా యేమి ?" అని యనుము.

" నీవు దేవునితో నితరదైవములఁ జేర్చినచో, మీపనియంతయు వృథయగును. నీవు నాశితులైన వారిలోఁ జేరుదువు.

అట్లుగాక దేవునిఁజూపింపుము. కృతజ్ఞులలోఁ జేరుము " అని నీకును నీపూర్వులకును దెలుపఁబడి యుండెను.

కాని, వారు దేవునికిఁ దగినట్లు స్తోత్రము చేయలేదు. రక్షణ దినమున భూమియంతయు నతని చేతిలో నిమిడియుండును. స్వర్గమును మడతలుపెట్టి అతఁడు తన కుడిచేతిలో నుంచికొనును. అతనికి స్తుతి యగుఁగాక ! వారతనితోఁ జేర్చినవారికంటె నాతఁడున్నతుఁడగుఁగాక!

బూరామ్రోఁత వినఁబడినంతనే దేవుఁడు జీవింపవలసినదని నిర్ణయించినవారుతప్ప స్వర్గమర్త్యములందుండువా రందఱును మృతినొందఁగలరు. తరువాత మఱియొకమ్రోఁత వినఁబడినంతనే వారందఱును లేచి నలుదిక్కులఁ బరికింతురు.

భూమి తనప్రభువుపంపిన వెలుతురుతోఁ బ్రకాశించుచుండును. గ్రంథము ముందుంచఁబడును. ప్రవక్తలును సాక్షులును వత్తురు ; అన్యాయము లేకుండ వారికి తీర్పీయఁబడను. ఎవరికిని నన్యాయము జరుగదు.

70 అతనికి మనుష్యుల కృత్యములన్నియుఁ దెలియును. కావునఁ బ్రత్యాత్మయు తానొనరించినదాని కనుగుణముగ ఫలమునొందును.

## అధ్యాయము-8.

సైన్యములు వచ్చి యవిశ్వాసులను నరకమువంకకుఁ దరుముదురు. వారచటికిఁ జేరఁగనే దానిద్వారములు తెరువఁబడును.

అప్పుడు దానిరక్షకులు వారితో "మీలోనుండియే మీయొద్దకు ప్రవక్తలువచ్చి మీప్రభువు సూచనలను బఠింపుచు, ఈ మీదినమున మీరు కలియఁజేరుటఁగూర్చి మీకుఁ దెలుపుచు నుండి యుండ లేదా ?" అని యనఁగా వారవునందురు కాని, విశ్వాసులకు కలిగినశిక్ష న్యాయమైనదే.

"నరకద్వారములఁజొచ్చి, యందు శాశ్వతముగ వసింపుఁడు" అని వారితోఁ జెప్పఁబడును. గర్విష్ఠుల కచ్చటివాసము దుఃఖకరముగ నుండును.

కాని, తమప్రభువునకు భయపడినవారిని సైన్యములువచ్చి భోగభూమికిపంపుదురు. వారచటికి రాఁగానే ద్వారపాలకులువారితో "మీకందఱకును స్వాగతము! మీరు పుణ్యవంతులరై యుఁటిరి. దీనిని జొచ్చి శాశ్వతముగ సుఖింపుఁడు" అందురు.

అప్పుడు వారు "తనమాటను తప్పక చెల్లించి, భూమికి మమ్ము వారసులఁజేసి, భోగభూమిలో మాయిచ్చవచ్చినచోట వసింపఁజేసిన దేవుని స్తుతింతుము" అందురు. పుణ్యవంతులై కష్టపడినవారికి మంచి లాభము కలుగును.

అతని సింహాసనము చుట్టును ప్రభుసంకీర్తనలఁ జేయుచు దేవతలు ప్రదక్షిణములు చేయుచుందురు. వారికి న్యాయమగు తీర్పు వచ్చును. "జగన్నాథుఁడగు దేవుఁడు మహిమోన్నతుఁ డగుఁగాక !" యనుమాట వినవచ్చును.

# సురా-40 విశ్వాసి.

---

మక్కా-85. పద్యములు-9 రుక్కులు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

హా. మీమ్.

గ్రంథావతరణము సర్వశక్తుఁడు, సర్వజ్ఞుఁడు,

పాపపరిహర్త, పరితాపము నంగీకరించువాఁడు, ఘోరశిక్షకుఁడు, చిరక్షమాయుతుఁడు, నగు దేవునినుండియే కలిగినది. అతఁడుగాక మఱి దేవుఁడు లేఁడు. తుదిసారి యతనియొద్దకే చేరుట...

దైవదూషకులుతప్ప మఱెవ్వరును దేవునిసూచనలను నిరాకరింపరు. వారల యిహలోకసంపదలఁజూచి మోసపోకుము.

నుహు ప్రజలును, నాతనిపిదప వారిస్నేహితులును, మక్కావాసుల మోలకు కృత్రిమత్వదోషమును దీసికొనివచ్చిరి. ప్రతిజాతియుఁ దనప్రవక్తను హింసించి సత్యవాదమును పడద్రోయుట కాతనితో వృథాలాపములఁ జేసినది. కావున వారినినేను గట్టిగఁబట్టుకొంటిని. నాశిక్ష కడు ఘోరమైనదికదా!

వారగ్నియందు వాసము చేయవలయునను నీప్రభువుతీర్పిట్లే యవిశ్వాసులకుఁ గలిగినది.

సింహాసనమును మోయువారును, దానిచుట్టు నుండువారును, దేవుని స్తుతించి, యాతనిని నమ్మి, విశ్వాసులకొఱకు క్షమాపణవేఁడికొందురు. "ప్రభువా! నీదయాజ్ఞానములతో సర్వవస్తువుల నావరించి

యున్నావు. కావున నీవంకతిరిగి నీమార్గము ననుసరించువారిని క్షమింపుము. వారిని నరకబాధలనుండి తప్పింపుము.

ప్రభువా! నీవు వారిననుగ్రహించి ఈడెనువనములందుంచి, వారితండ్రులు, భార్యలు, పిల్లలలోని పుణ్యాత్ములతోఁ జేర్పుము. నీవు సర్వశక్తుఁడవు! సర్వజ్ఞుఁడవు!

వారిని కీడునుండి తప్పింపుము. ఆదినమున కీడునుండి నీవుతప్పించినవానిపైననే నీకు దయగలదు." ఇదియే పరమానందము!

## అధ్యాయము 2

10 కాని, యవిశ్వాసులకు, "మిమ్ము భక్తిలోనికిఁ బిలువఁగా మీరు విశ్వసింపరైతిరి. నిశ్చయముగా మీలో మీకుఁగల ద్వేషముకంటె దేవునియెడ మీరుచూపు ద్వేషము ఘోరమైనది" అను వాక్కు వినిపించును.

వారప్పుడు "ప్రభువా! నీవుమమ్ము రెండుసారులుచంపి, రెండుసారులు బ్రతికించితివి. మేము మాపాపముల నొప్పుకొనుచున్నాము. మేము తప్పించుకొనుటకు దారిలేదా" అని యనఁగలరు.

"మీ కేకేశ్వరత్వము ప్రకటింపఁబడినప్పుడు మీరునమ్మకుండుటచేతను, దేవునికి సమానులను గూర్చినప్పుడు మీరు నమ్ముటచేతను నే యిట్లు మీరనుభవింపవలసి వచ్చినది. ఉన్నతుఁడును, మహాత్ముఁడును నగు దేవుఁడే తీర్పు చెప్పఁగలఁడు.

తన సూచనలను దెలిపి, స్వర్గమునుండి మీకుఁగావలసిన వస్తువులను బంపువాఁడతఁడే. కాని, దేవునివంక దిరుగువాఁడు తప్ప నితరుఁడు భయసూచనను గొనఁజాలఁడు.

దైవదూషకుల కిష్టములేకున్నను, దేవుని నావాహనముచేసి, పవిత్రపూజ నొనరింపుఁడు.

సింహాసనస్థుఁడై, యుచ్చస్థానమునుండి, యందఱును గలియ వలసిన దినమునుగూర్చి తెలుపుటకు తనయాజ్ఞచొప్పున నాతఁడు తన యిచ్చవచ్చినవారికి, తన పవిత్రాత్మను పంపును.

ఆదినముననే యందఱును దమ సమాధులనుండి లేచియుం దురు; అప్పుడు వారికి సంబంధించినదేదియు దేవునిమ్రోల రహస్య ముగ నుండనేరదు. ఆదినమున నెవనిశక్తి సర్వసమర్థమై యుండును? అద్వితీయుఁడును, సర్వశక్తుఁడును నగుదేవునిదే!

ఆదినమునఁ బ్రత్యాత్మయుఁ దనకుఁదగినఫలము నొందఁగలదు. ఆదినమున నన్యాయమనున దుండదు. దేవుఁ డతిత్వరితముగ లెక్కలు వేయఁగలఁడుగదా!

మనుష్యుల హృదయములు పైకిలేచుచు గొంతుకలకడ్డుపడు చుండు నాదినమునుగూర్చి వారికి భయసూచన నిమ్ము. దుష్టవర్తనుల కడ్డుపడువాఁడుగాని, సహాయకుఁడుగాని, యుండబోఁడు.

కంటిని మోసపుచ్చునదియు, హృదయములలో దాగియున్న దియు, దేవునికి తెలియును.

20 దేవుఁడు సర్వమును సత్యముగ నిశ్చయించును. కాని, దేవునిఁ గాక మనుష్యులుపిలుచుదైవము లేతీర్పును జెప్పఁజాలవు. విను వాఁడును, జూచువాఁడును, దేవుఁడే కదా!

అధ్యాయము-3.

వారెన్నడును దేశములో సంచారముచేసి తమపూర్వులగతి యేమైనదో తెలిసికొనలేదా? ఈమక్కావాసులకంటె వారు బలవంతు లైనను, నిప్పుడు వారిజాడలుమాత్రమే మిగిలియున్నవి. దేవుఁడు, వారు పాపములుచేయుచుండఁగనే తీసికొనిపోఁగా, దేవునిపై వారిని రక్షించువారెవ్వరును లేకయుండిరి.

వారియొద్దకు ప్రవక్తలు, తమసందేశమును గూర్చిన ప్రమాణములఁ దెలిపినను వారు విశ్వసింపకుండుటచేతనే యిట్లు సంభవించినది. కావున దేవుఁడు వారినితనచేత గ్రహించెను. దేవుఁడు బలవంతుఁడు; ఘోరముగ శిక్షింపఁగలవాఁడు.

ఇదిగాక మేము మూసాకు స్పష్టమగు నధికారముతో నూసూచనలనిచ్చి పూర్వము పంపితిమి.

ఫిరౌను, హామాను, కోరా, వీరియొద్ద కాతనిఁ బంపఁగావారు, "చిల్లంగివాఁడు, కృత్రిముఁడు" అనిరి.

వారియొద్దకు మాసత్యమును బట్టికొని యాతఁడురాఁగా వారు "అతనివలె విశ్వసించినవారి మగపిల్లలను జంపి, యాఁడుపిల్లలను జీవములతో వదలివేయుఁ" డనిరి. కాని, యవిశ్వాసుల ప్రయత్నము విఫలమయ్యెను.

అప్పుడు ఫిరౌను "నన్ను వదలిపెట్టుఁడు. మూసాను చంపివైచెదను. అతఁడు తన ప్రభువును పిలువనిండు. అతఁడు మీమతమునుమార్చి దేశములో నల్లరలఁ బ్రబలఁజేయునని నాకు భయముగుచున్న" దనెను.

అంత, మూసా "లెక్కలు తీయఁబడుదినమును నమ్మని ప్రతి గర్విష్ఠునినుండియు రక్షింప నాప్రభువును, మీప్రభువునునగు వాని నాశ్రయించుచున్నా" ననెను.

## అధ్యాయము-4.

ఆసమయమున, విశ్వాసి యయ్యు, తనభక్తిని దాచియుంచిన ఫిరౌను కుటుంబములోని యొకఁడు, "ఈతఁడు మీప్రభువునుండి తనసందేశమును గూర్చిన ప్రమాణములతో వచ్చియున్నాఁడు. అతఁడు దేవుఁడే నాప్రభు వనినంతమాత్రమున మీరాతనిఁ జంప

వరా ? అతఁ డసత్యము వచించినచో దానికాతఁడే బాధ్యుఁడగును. కాని, యాతఁడు సత్యవంతుఁడే యైనచో, నతఁడు భయపెట్టుచుండిన దానిలో కొంతయైనను మీకు సంభవించి తీరును. ఉల్లంఘనాపరున కును, నసత్యవాదికిని దేవుఁడు దారిచూపఁడు గదా ?

"నా ప్రజలారా ! ఈదినమున రాజ్యము మీది. మీరున్నతులై యున్నారు. కాని, దేవునిశిక్షయే వచ్చినయెడల దానినుండి మనల రక్షింపఁగలవార లెవ్వరు ?" అనఁగా ఫిరౌను "నేనుచూచిన దానినే మీరును జూడవలయును. నేను మిమ్ము సరియగు దారిలోనే నడిపెదను" అనెను.

30 అంత విశ్వసించిన యాతఁడు, "నా ప్రజలారా ! అన్యోన్య సహాయకులకు వచ్చినదినమున,

నుహు, ఆదు, సాముూదు, వీరికిని, వీరివెనుక వచ్చినవారికిని, చేకూరిన యవస్థయే మీకును గలుగునని నాకు భయ మగుచున్నది. కాని, దేవుఁడు తనసేవకుల కన్యాయము కలుగనీయఁడు.

నా ప్రజలారా ! మీలో మీరొకరిపైనొకరు చాడీలు చెప్పు కొనఁగల దినము,

శిక్షను పరిగ్రహించి నరకములోనికి తిరుగవలసిన దినము, మీకు వచ్చునేమోయని నాకు భయమగుచున్నది. ఆదినమున దేవుని నుండి మిమ్మెవ్వరును రక్షింపఁజాలరు. దేవుఁడే త్రోవదప్పించినవారి నెవఁడు రక్షింపఁగలఁడు ?

ఇదిగాక స్పష్టములగు నానవాళ్ళతో యూసూఫుగూడ మీ యొద్దకు వచ్చినను, మీరాతఁడు తెచ్చిన సందేశమునుగూర్చి శంకలను మానలేదు. తుద కతఁడు మృతినొందఁగా "దేవుఁ డిక మఱియే ప్రవ క్తను బంపఁ" డనిరి. ఉల్లంఘనాపరులను, శంకించువారిని దేవుఁడిట్లే దారి తప్పించును.

తమ కధికారము లేనిదే దేవుని ప్రమాణములను నిరాకరించువారిని దేవుఁడును, విశ్వాసులును ద్వేషింతురు. గర్వమును, దౌష్ట్యమును గలిగిన ప్రతిహృదయమునకును, దేవుఁ డిట్లే ముఁద్రలు వైచెను.

అప్పుడు ఫిరౌను "ఓహామానా, నాకొక గోపురమును నిర్మింపుము. దానిపై నెక్కి స్వర్గద్వారములఁ జొచ్చి,

మూసా నమ్మిన దేవుఁడెవఁడో చూచెదను. అతఁ డసత్యవాదియని నానమ్మకము" అనెను. ఈరీతిగా ఫిరౌనునకు తనదుర్మార్గవర్తనమంతయు మంచిదిగనే కనఁబడెను. అతఁడు సత్యమార్గము నుండి మఱలిపోయెను. ఫిరౌను పన్నాగమంతయు నంతరించిపోయెను.

అధ్యాయము-5.

అప్పుడు విశ్వసించినయాతఁడు "నాప్రజలారా! నన్ననుసరింపుఁడు. మిమ్ము సరియైనమార్గములోనికిఁ దీసికొనిపోయెదను.

నాప్రజలారా! ఇహలోకజీవనము క్షణభంగురమగు నానందముమాత్రమే. రాఁబోవు జీవనమే శాశ్వతము.

40 కీడుచేయు వా రట్టిదానినే ప్రతిఫలముగాఁ గొందురు. కాని, మంచికార్యములఁ జేయువారు స్త్రీలైనను పురుషులైనను, విశ్వాసులైనచో భోగభూమిలోని కేఁగఁగలరు. లెక్కలేని సద్వస్తువులను వార చట ననుభవింపఁగలరు.

నాప్రజలారా! మీకు నేను మోక్షమును కోరుచుండఁగా నాకు మీరగ్నిని కోరెద రేల ?

నేను దేవునినిరాకరించి, నాకేమియుఁ దెలియని దైవముల నాతనితోఁ జేర్పుమని నన్ను మీరు కోరుచున్నారు. కాని, మిమ్ము నేను, క్షమాయుతుఁడును, శక్తిమంతుడును నగు నాతనియొద్దకు రమ్మని కోరుచున్నాను.

మీరు నన్ను చేరుఁడని చెప్పు దైవముల కీలోకమునను బర లోకమునను గూడ నావాహన లేదనుటకును, మనమందఱమును దేవుని యొద్దకే చేరుటకును, ఉల్లంఘునాపరు లగ్నిహోత్రములోఁ గూలుట కును, నేసందేహమును లేదు.

నేను మీ కిపుడు చెప్పుచున్న దానిని మీరప్పుడు జ్ఞప్తికి తెచ్చి కొందురు. నేను మాత్రము దేవుని కే యధీనుఁడ నగుచున్నాను. దేవుఁడు తన సేవకులను జూచుచున్నాఁడుగదా !" అనెను.

కావున దేవుఁడు వారిపన్నాగములనుండి తప్పించెను. ఫిరౌను ప్రజలను దుఃఖకరమగు శిక్ష చుట్టుకొనెను.

ఆ 'గంట' వచ్చుసరికి 'ఫిరౌను ప్రజలను ఘోరశిక్షకు పాలు చేయుఁ' డని యాజ్ఞ రాఁగా వారి నుదయమునను, సాయంసమయ మునను, నగ్నిలోఁ బడవేయుచుందురు.

వా రాయగ్నిలో వాదించుకొనుచున్నప్పుడు వారిలో బల హీనులును, గర్వించినవారితో "మేము నిన్నే యనుసరించితిమి. ఈ యగ్నినుండి మమ్మేమయినఁ దప్పించెదరా ?" అని యడుగుదురు.

అప్పు డాగర్విష్ఠులు, "మనమందఱ మీయగ్నిలోనే యున్నా ముగదా ! దేవుఁడు తన సేవకులకు తీర్పు చెప్పినాఁ" డందురు.

అప్పుడా యగ్నిలో నున్నవారు నరకరక్షకులతో "ఈబాధ నుండి యొక్కదినముమాత్రమే మమ్ము రక్షింపుమని మీ ప్రభువును వేఁడుఁడు" అని మొఱలిడఁగా,

50 వారు "మీ ప్రవక్తలు మీయొద్ద కానవాళ్ళతో రాలేదా ?" యని యడుగుదురు. వా "రవు" నందురు. "అయినసహాయము కొఱకు గట్టిగ మొఱలిడుఁడు" అని యారక్షకు లందురుగాని యవి- శ్వాసుల మొఱలన్నియు వృథయగును.

## అధ్యాయము-6.

మా ప్రవక్తలను, నమ్మగలవారిని, ప్రస్తుతజీవితమునందును, సాక్షులు నిలిచియుండిన యాదినమునందును తప్పకరక్షించెదము.

ఆదినమున దుష్టప్రవర్తనుల సాకులెవ్వియు వారికి పనికిరావు. వారికొక శాపము తగులును. నరకవాసమువలనఁ గలుగు దుఃఖము వారిదే యగును.

పూర్వకాలమున మేము మూసాకు దారిచూపితిమి.

బుద్ధిమంతులకు భయసూచకమును, రక్షణోపాయమును నగు గ్రంథమున కిస్రాయేలు పుత్త్రులను వారసులఁ జేసితిమి.

కావున నీవు చలింపక సహించియుండుము. దేవునివాగ్దానము సత్యము. నీతప్పులకు క్షమాపణ వేఁడుము. సాయంప్రాతలయందు దేవుని స్తోత్రపాఠములఁ జేయుచుండుము.

తమకధికారమేదియులేక దేవుని సూచనలను తిరస్కరించువారి హృదయములందు గర్వముతప్ప మఱేమియులేదు. కాని, వారికి జయము కలుగదు. కావున వినువాఁడును, చూచువాఁడును నగు దేవుని నాశ్రయింప నేఁగుము.

మనుష్యుని సృష్టికంటె స్వర్గమర్త్యముల సృష్టి గొప్పదికదా ? కాని, చాలమందికి తెలియదు.

ఇదిగాక చూడఁగలవారును, చూడలేనివారును, దుష్టులును, విశ్వాసులై క్రమముగ వర్తించువారును, నొక్కరీతిగాఁ జూడఁబడరు. కొలఁదిమందిమాత్రమే దీనినిగూర్చి యాలోచింతురు.

ఆహా ! ఆ ' గంట ' తప్పకవచ్చును. దానినిగూర్చి సందేహాము లేదు. కాని చాలమంది దానిని నమ్మరు.

60 నీప్రభువు " నన్ను పిలువుఁడు, నేను వింతును. కాని, నాసేవను హర్షింపక మఱలిపోవువారు లజ్జాన్వితులై నరకములోనికిఁ బోఁగలరు."

నీకు విశ్రాంతికొఱకు రాత్రిని, వెలుతురుకొఱకు పగటిని నిర్ణయించినవాఁడు దేవుఁడే. నిశ్చయముగా దేవుఁడు మనుష్యులయెడ మిక్కిలి యనుగ్రహముఁ గలిగియున్నాఁడు. కాని, చాలమంది దానికి ప్రతిఫలముగా కృతజ్ఞతఁ జూపరు.

ఇతఁడే సర్వసృష్టికర్తయు, నీప్రభువును నగు దేవుఁడు. ఆతఁడు తప్ప మఱియొక దేవుఁడు లేఁడు. అయిన నాతనినుండి మఱలిపోయెద రేల?

దేవుని సూచనల నిరాకరించువారిట్లే మఱలిపోయియుందురు.

ఈ భూమికి గట్టిపునాది వేసి, దానిపై స్వర్గమును నిర్మించి, పిదప మిమ్ము సృష్టించి, మీకు సౌందర్యము నిచ్చి, మంచివస్తువులఁ దినుట కిచ్చియున్నవాఁడు దేవుఁడే. ఇతఁడే మీ ప్రభువగు దేవుఁడు. కావున జగన్నాథుఁడగు దేవుఁడు ధన్యుఁడగుఁగాక !

అతఁడే నిత్యజీవి. అతఁడుతప్ప మఱియొక దేవుఁడు లేఁడు. కావున నాతని నావాహనచేసి నిర్మలపూజ నొనర్పుము. జగన్నాథుఁడగు దేవునికి స్తుతియగుఁగాక !

"నా ప్రభువు స్పష్టముగు నానవాళ్ళను పంపినపిదప మీరు దేవునితోఁ గలిపి పిలుచుదానిని నేను పూజింపఁగూడదని నాకాజ్ఞయైనది. నేను జగన్నాథునికే యధీనముకావలయునని యాజ్ఞాపింపఁబడియున్నాను " అనుము.

తొలుత ధూళినుండియు పిదప నణుజీవులనుండియు, పిదప చిక్కనినెత్తురునుండియు, సృజించుచు పైకి శిశువులుగా మిమ్ముఁ దీసియున్నాఁడు. తరువాత మిమ్ము యౌవనులఁజేసి (మీలోఁగొందఱు ముందుగనే చనిపోయినను) వృద్ధులయినపిదప మీయాయుష్కాలమున కతఁడవధినిగల్పించును. మీరు బోధపఱుచుకొందురనియే యిది తెలుపఁబడినది.

పుట్టించువాఁడును, చంపువాఁడును నాతఁడే. అతఁడొకవస్తువు
ను 'కమ్ము' అనియాజ్ఞయిచ్చినంతనే యదియగును.

అధ్యాయము-8

దేవుని సూచనలఁ దిరస్కరించువారిని నీవుచూచితివిగదా!
వారెట్లుమఱలియున్నారో!

70 మా "గ్రంథమును," ప్రవక్తలతో మేముపంపినసందేశములు
నసత్యములనువారికి దానిసత్యము తరువాతఁగాని గోచరింపదు.

అప్పుడువారి కంఠముల కురులు తగిలించి గొలుసులతోఁ గట్టి,
నరకములోనికి వారినీడ్చికొనిపోవుదురు. అప్పుడు వారా
యగ్నిలో దగ్ధులగుదురు.

అప్పుడు వారితో "దేవునితోఁ గూర్చి మీరుపూజించినవారేరీ?"
యని పల్కఁగా

"వారు మమ్ముబిడిచి యదృశ్యులైనారు, అవును. మేమింతకు
పూర్వము పిలిచినదంతయు మిథ్యయే" యని వారందురు. ఇట్లేదేవుఁ
డవిశ్వాసులను దారితప్పించును.

"మీ యక్రమగర్వమునకును, భూమిపై మీరు మితిమీరి
యనుభవించిన యానందమునకును, నిదియేఫలము.

"మీరు నరకద్వారములఁజొచ్చి యందే శాశ్వతముగఁ బడి
యుండుఁడు. గర్విష్ఠుల యావాసము కడుదుఃఖప్రదమగును!"

దేవునిమాట తప్పునదికాదు. కావున మీరు చలింపక యోర్చి
యుండుఁడు. వారిని భయపెట్టినదానిలోఁ గొంతనీకుఁ జూపినను,
లేదా, నిన్ను తొలుతనే మరణము నొందఁజేసినను వారందఱును
నాయొద్దకే చేరుదురు.

నీకుఁ బూర్వముఁగూడఁ గొందఱు ప్రవక్తలఁ బంపియుంటిమి. వారిలోఁ గొందఱఁగూర్చి తెలుపలేదు. కాని, దేవునియనుమతిలేనిదే యేప్రవక్తయు నద్భుతచర్యలఁ జూప శక్తుఁడుగ నుండలేదు. దేవుని యాజ్ఞయైనంతనే సర్వమును సత్యముగఁ బరిగణింపఁబడును. అప్పుడు దానిని నిరాకరించినవారు నశింతురు.

## అధ్యాయము-9.

మీరు కొన్నిటిపై స్వారిచేయుటకును, కొన్నిటిని తినుటకును, మీకుపశువుల నిచ్చినవాఁడుదేవుఁడే.

90 (వానివలన మీ కితరలాభములునుగలవు.) వానిసహాయము వలన మీహృదయములందలి కోరికలు నెరవేరును. వానిమీఁదను, నావలపైనను మీరు ప్రయాణముచేయుదురు.

అతఁడు మీకు తనసూచనలఁ జూపించును. అయిన, దేవుని సూచనలలో మీరు దేవుని నిరాకరింతురు !

వారు దేశములో సంచరించి తమపూర్వులగతి యేమయ్యెనో తెలిసికొనలేదా ? సంఖ్యయందును, బలమునందును, వారుభూమిపై విడిచిన జాడలయందును వీరికంటెనధికులు. అయినను వారిప్రయత్న-ములు కొనసాగినవికావు.

వారిప్రవక్తలు తమసందేశములకుఁ దగినప్రమాణములతో వారియొద్దకురాఁగా వారు తామే జ్ఞానవంతులమని యుప్పొంగిరి. కాని, వారు నవ్వినశిక్ష వారినిజుట్టుకొనెను.

వారు మాపగనుగాంచి "మేము దేవునినే నమ్మెదము. పూర్వము మేమాతనితోఁ గూర్చినవారిని నమ్మము" అనిరి.

కాని, మాపగను జూపినపిదప వారికిఁగలిగినభక్తి యెందుకును

పనికిరాకపోయెను. పూర్వకాలమున నుండిన తనసేవకులకుఁ దేవుఁడట్లేచేసెను. అప్పుడును నవిశ్వాసులు నశించిపోయిరి.

# సురా 41–స్పష్టపఱుపఁబడినది.

మక్కా-54 పద్యములు-6 రుకూ-లు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

హా. మీామ్.

దయాదాక్షిణ్యమూర్తి తెలియఁజేసిన జ్ఞానము.

జ్ఞానులకు స్పష్టపఱుపఁబడిన సూచనలుగల యరబ్బీభాషలోని కురాను గ్రంథము !

భయసూచనాపూరితమయ్యు నిది శుభవార్తఁ దెచ్చినది ! కాని, వారిలో చాలమంది దూరముగఁ బోయి వినకున్నారు.

వారు, "నీబోధనలు మాకుపనికిరావు. మేము చెవిటివారము. మాకును నీకును మధ్య నొకతెరయున్నది. నీకు క్రమమని తోచినట్లు నీవు ప్రవర్తింపుము. మాకు క్రమమని తోచినట్లు మేము సంచరించెదము " అందురు.

" నేనును మీావంటి యొకనరుఁడనే. మీాదేవుఁడొక్కఁడేయని నాకు తెలుపఁబడినది. కావున తిన్నగా నాతనినాశ్రయించి క్షమింప వేఁడికొనుము. దేవునిగాక యితరదైవములఁ జేరువారును,

విధివిహితమయిన భిక్షపెట్టనివారును, రాఁబోవుజన్మమును నమ్మనివారును, దుఃఖులగుదురు.

కాని, విశ్వాసముతో పుణ్యకార్యము లాచరించువారికి సంపూర్ణబహుమానము చేకూరఁగలదు.

## అధ్యాయము-2.

" రెండుదినములలో భూమినిసృజించిన యాతని నమ్మరేల ? ఆతనికి సమానులున్నా రనెదరేల ? ఆతఁడు జగన్నాథుఁడు ?

10 అతఁడు భూమిపై నత్యున్నతములగుపర్వతములనుంచి, దానిని దీవించి, దానియందెల్లెడల నందఱకుసరిపోవునట్లు నాలుగుదినములలో నాహారమునుంచి,

పిదప మొదట ధూమరూపముగానున్న దానిని స్వర్గముగాఁ జేయనుద్యమించి, దానికిని భూమికిని, "మాకువశవర్తులయ్యెనో, వ్యతిరిక్తులయ్యెనో రం" డన నవి "మేము విధేయతతోడనే నిన్ను జేరెద" మనెను.

పిదప రెండుదినములలో నేడు స్వర్గములనుసృజించి, ప్రతిస్వర్గమునకును దానిదానివిధుల నెఱిఁగించి, క్రిందిస్వర్గమున దీపములను, రక్షణదేవతలను నుంచితిమి. ఇదియంతయు సర్వశక్తుఁడును, సర్వజ్ఞుఁడును నగు దేవుఁడు నియమించినదే.

వారు వెనుకకు మఱలినచో వారితో "ఆద్, సామూదులకుఁ బంపిన తుపానువంటితుపాను మీకును రాఁగలదని మీకు సూచన నిచ్చుచున్నాను" అనుము.

ప్రవక్తలు వారిచుట్టుఁజేరి "దేవునిఁదప్ప నితరునారాధింపకుండుఁ" డనివారితోఁబల్క వారు, "మాప్రభువునకుఁబంపనే యిష్టమైనయెడల నాతఁడు తప్పక దేవతలనే పంపియుండును. మీవార్తను మేము విశ్వసింప" మనిరి.

ఆద్ ప్రజలు గర్వితులు, నన్యాయవంతులునై చరించుచు, "మాకంటె బలవంతు లెవ్వరునులే" రనిరి. వారికంటె వారినిసృజించిన వాఁడు శక్తిమంతుఁడని, వారికిఁదెలియదుకాఁబోలు ! అందుచేతనే వారు మాసూచనలను నిరాకరించిరి.

కావుననే వారిలోకమున లజ్జాకరమగు శిక్షనొందుటకు దుర్దినములఁబంపి, వారిపై ఝుఝూమారుతము వీచునట్లు చేసితిమి. కాని, రాఁబోవుజన్మమందలిశిక్ష యంతకంటె లజ్జాకరమై యుండును వారికప్పుడు రక్షణయుండదు.

సామూదుప్రజలకు మేము శిక్షణనిత్తుమంటిమి. కాని, వారికి రక్షణకంటె నంధత్వమే మేలుగాఁదోచెను. కావున వారికర్మలకు ఫలముగా లజ్జాకరమగు ఝుఝూమారుతము శిక్ష ప్రాప్తమయ్యెను.

కాని, వారిలో విశ్వాసులను, దైవభీతిపరులను, మేము రక్షించితిమి.

అధ్యాయము. 3

దేవుని శత్రువు లాదినమున గుంపులుగుంపులుగా నగ్నిలోనికిఁ బోవలయునని వారికిఁ దెలుపుము.

20 వారందుచేరినంతనే వారిచెవులును, కన్నులు, చర్మమును వారికృత్యములకు సాక్షులగును.

వారప్పుడు తమ చర్మములతో " మాకెదురుగా సాక్ష్యమిచ్చెదరేల " యని యడుగ, నవి "అన్నివస్తువులకును మాటలనేర్పినదేవుఁడు, మమ్ములనుమాట్లాడఁ జేసినాఁడు. అతఁడే మిమ్ము తొలుతసృజించినవాఁడు. ఆతనియొద్దకే మీరు తిరిగివచ్చియున్నారు.

మీచెవులును, కన్నులును, చర్మములును, మీరుచేయుపనులను జూడకుండ, మీరు దాగియుండలేరు. కాని, మీరు చేసిన చాలపనులను, దేవుఁడు చూడలేదని మీరుతలంచితిరి.

మీరు మీప్రభువునుగూర్చి తలంచిన తలంపే మీకు నాశనముఁ దెచ్చిపెట్టినది. కావుననే మీరు నాశనార్హులైనారు " అనును.

వారు శాంతులైనను నగ్నినుండి తప్పిపోఁజాలరు. వారనుగ్రహముకొఱకు వేఁడుకొనినను, ననుగ్రహింపఁబడరు.

వారికిఁ బ్రాణస్నేహితులుగా సైతానులను విధించియున్నాము. వారి యిహపరలోకజీవనములు దివ్యములుగఁ గనఁబడఁజేసినవారు వారే. వారికిఁ బూర్వము పిశాచములకును, మనుష్యులకును, మేము విధించినశిక్ష వీరికినిఁ బ్రాప్తమై వీరునుసశింపఁగలరు.

అధ్యాయము-4.

అయినను నవిశ్వాసకులు, "ఈకురాను వినవలదు. అదిచదువు చున్నప్పుడు వినఁబడకుండ గొడవచేసి, బిగ్గఱగ మాట్లాడుచుండుఁడు" అందురు.

అందుచేత వీరిని నిశ్చయముగా ఘోరశిక్ష ననుభవింపఁజేసి, వారినీచతరకార్యముల కనుగుణమగునసనుభవము కలుగునట్లుచేసెదము.

దేవునిశతృవుల కగ్నియే బహుమానము. వారుమాసూచనల నమ్మకుండి నందులకదియే వారికి శాశ్వతవాసముగఁ జేసెదము.

నమ్మనివారు "ప్రభువా! మమ్ము త్రోవఁదప్పించిన మనుష్యులను, పిశాచములను మాకుఁజూపుము. వారిద్దఱును, దీనులైయుండుటకు, మాపాదములక్రింద మట్టిపెట్టియుంచెదము" అందురు.

30 కాని, "దేవుఁడే మాప్రభువు" అని యాతనినే తిన్నగానాశ్రయించువారియొద్దకు దేవతలవతరించి "మీరు భయపడకుఁడు. దుఃఖితులరుకాకుఁడు. మీకు వాగ్దత్తమైన స్వర్గమున నానందమునొందుఁడు.

మీకిహపరలోకములందు మేమే రక్షకులము. అచట మీయాత్మ లభిలషించునదియు,

దయాదాక్షిణ్యమూర్తిని మీరు కోరికొనునదియు, మీకు లభింపఁగలదు" అందురు.

## అధ్యాయము. 5.

"నామట్టుకు నేను భక్తవర్గములోని (ముస్లిములలోని) వాఁడనే" యని దేవుని యాజ్ఞలకు లోఁబడి క్రియావర్తనుఁడగువానికంటె ప్రియ భాషణుఁడుండఁబోఁడు.

ఇదిగాక మంచిచెడ్డలు రెండును నొకరీతిగనే పరిగణింపఁబడవు. మేలుచేసి కీడునుపాఱఁద్రోలినంతనే నీకుగర్భశత్రువగువాఁడు ప్రాణ స్నేహితుఁడగును.

స్థిరశాంతులును, సదృష్టవంతులును దప్ప నితరులట్టి పదమును బడయఁజాలరు.

నీవు సైతానువలలోఁ జిక్కుకొనినయెడల సర్వశ్రోతయు, సర్వజ్ఞుఁడును నగుదేవుని నాశ్రయింపుము.

రాత్రింబవళ్ళును, సూర్యచంద్రులును నీకుసూచనలు. నీవు దేవుని సేవింపఁదలఁచినచో నాతఁడు సృజించిన సూర్యచంద్రులను బూజింపక వానిసృష్టికర్తనే భజింపుము.

వారట్లుచేయుటకు గర్వితులైనచో నాతనితోనుండువారాతనిని రాత్రింబవ ళ్ళెడతెగక స్తుతింపుచునే యుందురు.

భూమి యెండిపోవుటయు, మేము వర్షము బంపినంతనే తిరిగి యది యుప్పొంగి చలనము నొందుటయును నొకసూచనయే. నిశ్చయ ముగా దానికి జీవనము నీయఁగలవాఁడు మృతులకుఁ గూడ ప్రాణము పోయఁగలఁడుగదా! అతనిశక్తిసర్వవస్తువులపైనను వ్యాపించియున్నది.

40 మాసూచనలను మఱచి వాని నసత్యములనువారు, మమ్ముల నుండి దాగికొనఁజాలరు. అయిన రక్షణదినమున నగ్నిలోఁబడువాఁ డో, సురక్షితముగ నుండువాఁడో, ధన్యుఁడెవ్వఁడో చెప్పుము. మీరు దేనినిచేసినను, నాతనిదృష్టి యున్నిటిమీఁదను నుండును.

నిశ్చయముగా భయసూచన గల్గియు, నిర్లక్ష్యము చేయు వారి కెట్టిరక్షణయు దొరకదు. అయినను కురాను పరిభావంతమగు గ్రంథము.

బుద్ధయాత్రియు, స్తవనీయుఁడును, నగువాఁడావార్తనుబంపి యున్నాఁడు. కావున నేవంకనుండియు నసత్యము వారి నంటఁజాలదు.

నీకుఁ బూర్వము ప్రవక్తలకుఁ జెప్పినదేదియు నీకుఁ జెప్పఁబడలేదు. క్షమించుటగాని, ఘోరముగ శిక్షించుటగాని, నీప్రభువు నధీనములే.

మే మీకురానును విదేశీయభాషలోఁ జెప్పినయెడల వారు, "దానిసూచనలు స్పష్టములు కానిచో మేము దానిని పరిగ్రహింపము. ఏమి, మేమరబ్బీ దేశస్థులమై యుండఁగా నది విదేశీయభాషలో నేల యుండవలెను" అందురు. "నమ్మినవారికది మార్గదర్శియు, నౌషధమును గాని, నమ్మనివారిచెవులలో దిమ్మలును, కన్నులలో నంధత్వమును కుదిరికొనియున్నవి. వారుదూరమునుండి పిలువఁబడువారివంటివారు" అనుము.

అధ్యాయము. 6.

పూర్వకాలమున మేమీగ్రంథమును మూసాకొసఁగ, దానినిఁ గూర్చి చాల వివాదములు జరిగియుండెను. అందువలన వారిప్రశ్నలును, సందేహములును హెచ్చయ్యెను. విశ్రాంతికాలమును దేవుఁడు ముందుగ విధించియుండినచో వారి సందేహములన్నియు విడిపోయియే యుండును.

పుణ్యముచేయువాఁడును, పాపము చేయువాఁడును, తనమేలు కీడులకొఱకే చేసికొనును. నీప్రభువునకుఁ దనయనుచరులయెడఁ బక్షపాతము లేదు.

# కాండము. 25

---

ప్రళయకాల మాతనికొక్కనికే తెలియును. ఆతని కెఱుక లేకుండ పండ్లుఫలింపవు, స్త్రీలకు గర్భోత్పత్తిగాని, ప్రసవముగాని కలుగదు. ఆదినమున నీప్రభువు "ఏరీ! నాకుసమానులని మీరు వచించినవారేరీ!" యని వారినడుగుచుఁ బిలువ వారు "నిశ్చయముగా మేమనినదానికి మేము సాక్ష్యమీయలే" మందురు.

వారు తొలుతఁ బిలిచినదానియు నంతరించిపోవ, తాము తప్పించుకొన నుపాయము లేకుండుట వారికిఁ దెలియఁగలదు.

మనుష్యుఁడెప్పుడును మేలుకొఱకే ప్రార్థనలు సలుపుచు, కీడు మూసినంతనే యవనతవదనుఁడై నిరుత్సాహపరుఁడగుచుండును.

50 ఆతనికి బాధకలిగినపిదప మాదయారసమును కొంచెము రుచి చూపినచో నాతఁడు "ఇదినాకు రావలసినదే. రక్షణాదినమునుగూర్చి నేనేల తలంపవలయును? నేను తిరిగి నాప్రభువును జేరినచో నాతఁడు నాకు గొప్పమేలు చేయఁగలఁడు" అనును. కాని, మేమునిశ్చయముగా భక్తిహీనులకు వారి కర్మలను జూపించి ఘోరశిక్ష నొందునట్లు చేయుదుము.

మేము మనుష్యునియెడ దాక్షిణ్యముఁ జూపినంతవఱకును నాతఁడు మమ్ములమఱచి మాకు దూరముగనుండును. కొంచెముకీడు కలిగినంతనే దీర్ఘప్రార్థనలతో మొఱపెట్ట నారంభించును.

"మీరేమనుకొనుచున్నారు? ఈగ్రంథమును దేవుఁడే పంపియుండ మీరు విశ్వసింపనిచో దానినుండి దూరముగ నున్న మీకంటె నెవ్వఁడు మిక్కిలిగ తప్పు తోవంబడినవారు?" అని వారి నడుగుము.

అదియేసత్యమని వారికిఁ దెలియువఱకును ననేకదేశములయందే కాక వారిలోఁ గూడ నెన్నేని సూచనలఁ జూపుచుందుము. నీప్రభువు నీసర్వకర్మలకును సాక్షియైయుండుట చాలదా?

వారు తమప్రభుం గూడుటఁ గూర్చి సందేహించుచున్నారు గదా? కాని, యాతఁ డన్నివస్తువుల నావహించియున్నాఁడు!

---

# సురా-42 ఉపదేశము.

---

మక్కా-53 పద్యములు. 5 రుకూఉలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

హా, మీమ్.

ఐన్. సీన్. కాఫ్.

నీకుపూర్వము వచ్చినవారికిఁ దెలియఁజేసినట్లే శక్తిమంతుఁడగు దేవుఁడు నీకును దెలియఁజేయును!

స్వర్గమర్త్యములయందున్నదంతయు నాతనిదే; అతఁడున్నతుఁడు, మహాత్ముఁడు. మీఁదినుండి స్వర్గములు భయపడి బ్రద్దలుకానున్నవి. దేవతలు తమప్రభువును స్తుతింపుచు భూలోకవాసులను క్షమింపుమని వేఁడుచుందురు. దేవుఁడు క్షమాయుతుఁడును, కరుణాళుఁడును గదా!

కాని, యాతనిఁదప్ప నితరులను ప్రభువులఁగాజేసికొనినవారిని దేవుఁడు కనిపెట్టుచునేయున్నాఁడు. అయినను వారునీయధీనములో లేరు.

అందఱు నొకచోఁ జేరగల దినము నిస్సందేహముగ వచ్చుచున్న దనియు, నప్పుడుకొందఱుభోగభూమియందును,కొందఱగ్నిజ్వాలలలోను

నుండఁగల రనియు, నీమాతృనగరమువారికిని, ఆచుట్టుపట్ల నగరముల వారికిని, నీవు తెలుపుటకే నీకీ కురానును అరబ్బీభాషలో దెలిపి యున్నాము.

దేవునికిష్టమైనచో వారినందఱను నొకేజాతివారిగను, నొకే మతమువారిగను జేసియుండును. కాని యతనికిష్టమైనవారినే యాతఁడు తనకరుణకు పాత్రులఁజేయును. దుర్మార్గులకు పోషకులుగాని, సహాయకులుగాని యుండరు.

అతనిఁగాక యితరులను వారు పోషకులుగఁజేకొందురా? కాని, మనుష్యునికి దేవుఁడొకఁడే ప్రభువు. అతఁడు మృతులకు చైతన్యము గలిగించును. ఆతం డన్నిటికిని శక్తుఁడు.

అధ్యాయము-2.

10 మీావివాదకారణము లేవియైనను దేవుఁడే వానిని తీర్పఁగలవాఁడు. ఈతఁడే నాప్రభువగుదేవుఁడు. అతనినే నేనునమ్మియున్నాను. నేనుపరి తాపమునొంది యతనివంకకే తిరిగెదను.

స్వర్గమర్త్యములసృష్టికర్తయగునాతఁడు,మీాకు మీాలోనుండియే భార్యలనిచ్చి, ఆఁడు మగపశువులనిచ్చి, యింవమూలమున మిమ్ము వృద్ధిచేయ నెంచినాఁడు. ఆతనినిఁబోలిన దేదియునులేదు. చూచువాఁడు, వినువాఁడునాతఁడే !

స్వర్గమర్త్యముల బీగములాతని యొద్దనే యున్నవి. అతఁడు తన కిష్టమైనట్లు గొప్పగనో కొలఁదిగనో యిచ్చుచుండును. అతఁడు సర్వజ్ఞుఁడు.

నుహానుకు విధించినట్టియు, నీకుఁదెలిపినట్టియు, ఇబ్రాహీము, మూసా, ఈసాలకును విధించినట్టియు మతమును “ఈమతమునను సరింపుఁడు. దీనిలో శాఖలుగావిడిపోవకుఁ” డని తెల్పుచు మీాకునువిధించి

నాఁడు. దేవునితో గలిపి విగ్రహముల నారాధించువారికిది నిర్భరము గాదా? నీవు వారినవలంబింపుమనినది మతమా? దేవుఁడు దన యిచ్ఛ వచ్చినవారిని దానికొఱకెన్నుకొనును. పరితాపమునొంది తన వంకతిరుగు వారి కాతఁడు దానిని చేర్చును.

వారి కా "జ్ఞానము" లభించువఱకును వారన్యోన్యమును ద్వేషించికొని శాఖలుగా విడిపోలేరు. వారు కొంతకాల మిచటనే యుండి విశ్రాంతినొందవలయునని నీప్రభు వింతకుపూర్వమే యాజ్ఞాపించియుండనిచో వారికి తీర్పిడివఱకే తెలిసియుండును. ఆ "గ్రంథము" నకువారసులైనవారు, దానినిగూర్చి సందేహపడుచున్నారు.

ఇందుచేతనే వారిని మతములోనికి రమ్మనుము. వారికోరికల ననుసరింపకుము. నీకుచెప్పినట్లు ముక్కు-కుసూటిగా చేసి విడువుము. "దేవుఁడు పంపినగ్రంథములన్నిటిని నేనునమ్ముచున్నాను. మీవివాదములను న్యాయముగాఁగతీర్పవలయునని నాకాజ్ఞయైనది. దేవుఁడు మీకును, మాకునుగూడ ప్రభువే. మాపనులుమావి. మీపనులుమీవి. మీకును మాకును వివాదమేల? దేవుఁడు మనలనందఱ నొకటిగ కలుపఁగలఁడు. అతనియొద్దకే మనమందఱముఁ జేరుదుము.

అతనికి విధేయులరై యుందురని ప్రమాణము చేసి వివాదములు చేయువారివాదములు వారిప్రభువున కిష్టములుకావు. వారాతని కోపము నకుఁబాత్రులగుదురు. వారికి ఘోరబాధ కలుగుచున్నది.

సత్యముతోను, త్రాసుతోనుదేవుఁడుగ్రంథమునంపియున్నాఁడు. ఒకవేళ నా "గంట" యాసన్నమైనదేమో నీకెవరుచెప్పఁగలరు?

దానిని నమ్మనివారది రాఁగలిగిన వేగమే రానిమ్మందురు. ఆ 'గంటఁ' గూర్చి వివాదములు చేయువారు పెద్దతప్పులో పడియున్నారుగదా!

కాని, విశ్వాసులు దానికిభయపడి యది సత్యమనియే నమ్మియుందురు.

దేవుఁడు తన సేవకులయెడ దాక్షిణ్యమువహించియున్నాఁడు. ఆతఁడు తన యిష్టమువచ్చిన వారికి కావలసినది యిచ్చును. ఆతఁడు బలవంతుఁడు. శక్తిమంతుఁడు.

అధ్యాయము 3.

20 రాఁబోవు జీవనమను పంటపొలమును కోరుకొనువాని కిచ్చుట పంటపొలమున కభివృద్ధినిచ్చెదము. ఈలోకపుపంటపొలమే కావలసిన వానికిని దాని నిత్తుము. కాని, వారికి పరలోకజీవనమునందు పాలుండదు.

దేవుఁడనుమతింపనిదాని ననుమతించుదైవములు వారికున్నారా? ఎడబాటుదినమువఱకును విశ్రాంతి విధింపఁబడియుండనిచో వారికింతకు పూర్వమే తీర్పు వచ్చియుండును. భక్తిహీనులు నిశ్చయముగా ఘోర బాధ ననుభవింపఁగలరు.

ఆదినమున భక్తిహీనులు తాముచేసినదానినిజూచి భయపడుదురు. వానికి తగినఫలము వారికి కలుగును. కాని, విశ్వసించిక్రమవర్తనులైనవారు భోగభూమియందలి పచ్చికబయళ్ళలో వసింపఁగలరు. వారు కోరునదంతయు వారిప్రభువునొద్ద సిద్ధముగానున్నది. ఇదియే శ్రేష్ఠమైన వరము.

తన సేవకులలోని విశ్వాసులకును క్రమవర్తనులకును దేవుఁడు ప్రకటించున దిదియే! "నాబంధువులు నన్ను ప్రేమింపవలయుననుటతప్ప దీనికై నా కేకూలియు నక్కఱలేదు" అనుము. సత్కార్యము నాచరించి పుణ్యము సంపాదించినవాని కాపుణ్యము నభివృద్ధి చేయుదుము. దేవుఁడు క్షమాయుతుఁడు. కృతజ్ఞుఁడు.

అతఁడు దేవునిఁగూర్చి యసత్యమును సృష్టించెనని వారందురా? దేవుని కిష్టమైనచో నాతఁడు నీహృదయమున కేమూఁతలువైచియుండును. కాని, దేవుఁ డసత్యమును కొనసాగనీయక తనమాటచేత సత్యమునకు జయముకలుగఁజేయును. అతనికి హృదయమందలి రహస్యములన్నియుఁ దెలియును.

అతఁడే తనసేవకుల యనుతాపము నంగీకరించి వారిపాపములను క్షమించి మీాపనులను దెలిసికొనును.

అతఁడు తన్నువిశ్వసించి క్రమవర్తనులగువారి కోర్కెలను విని వారికక్కువగ ననుగ్రహించును. కాని, యవిశ్వాసులకు ఘోరశిక్ష సిద్ధముగనున్నది.

దేవుఁడు తనసేవకులకు హెచ్చుధనమునిచ్చినచో వారున్మార్గవర్తులగుదురేమోయని కొలఁదిగనే యిచ్చుచుండును. అతఁడు తనసేవకులనుగురించి చూచుచునేయున్నాఁడు.

జనులు వర్షమునుగూర్చి నిరాశచేసికొనునప్పుడు దానినంపి తనకరుణను వ్యాపింపఁ జేయువాఁ డాతఁడే. అతఁడే రక్షకుఁడు. స్తవనీయుఁడు !

స్వర్గమర్త్యములసృష్టియు, నారెండిఁటికిపైనను చెదర్చియుంచిన జంతువులును, నాతనిసూచనలలోనివే. వానినన్నిటి నొకచోఁ జేర్ప నతనికి శక్తిగలదు.

అధ్యాయము-4.

30 నీకుసంభవించిన యాపదలన్నియు నీవు తెచ్చుకొనినవే. అయినను నాతఁడు చాలవిషయములందు క్షమించును.

అతనిని నీవు భూమిపై బలహీనునిఁ జేయలేవు. దేవుఁడుగాక మీాకు మఱియొకపోషకుఁడుగాని, సహాయకుఁడుగాని యుండఁబోఁడు.

పర్వతములవలె సముద్రముపైఁబోవు నావలుకూడ నాతనిసూచనలలోనివే.

అతని కిష్టమైనచో నాతఁడు గాలిని స్తంభింపఁ జేయుఁగా నవి కెరటములపైఁ గదలలేక నిలిచిపోవును. స్థిరచిత్తులై, కృతజ్ఞులైనవారికందు నిశ్చయముగా సూచనలున్నవి. లేదా, వారిదుశ్చేష్టలకై యా

నావలను మునుఁగఁజేసినను నాతఁడు చాలమట్టుకు క్షమించును. కాని మా సూచనలను నిరాకరించువారుమాత్రము తప్పిపోవవీలులేదని తెలిసికొందురు.

నీకుఁగలిగినదంతయు నిహలోకానుభవమునకే. కాని, విశ్వాసయుతులై దేవునియందు నమ్మకముగలవారికిని,

నేరములనుండియు, కల్మషమునుండియు నెడఁబడియుండి, కోపము తెప్పించువారిని క్షమించువారికిని,

తమప్రభువునకు చెవియొగ్గి, ప్రార్థనతప్పక, యొండొరుల యుపదేశముచేఁ దమకార్యములను జక్కఁబెట్టుకొనుచు, మేమువారి కిచ్చి ధనవంతులఁ జేసినదానిలోనే భిక్షము పెట్టుచునుండువారికిని,

తమ కుపకారము నొరులుచేసినచో దానిని గణింపకుండువారి కిని, తమ ప్రభునొద్ద గొప్పబహుమానము వేచియున్నది.

40 అయినను, ద్రోహ్యమునకు ఫలము ద్రోహ్యమేయై యుండనిమ్ము కాని, క్షమించి సంధిచేసికొనినవారిని దేవుఁడే బహూకరింపఁగలఁడు; అతఁ డన్యాయవంతులఁ బ్రేమింపఁడు.

తమ కొరులు కీడుచేయఁగా తిరిగి కీడుచేయువారినుండి తప్పించు కొనుటకు వీలులేదు.

కాని, యన్యాయముగ నితరులకు హానిచేసి, ధర్మేతరులై కన్ను గానక మెలంగువారినుండి తప్పించుకొనవీలున్నది. వీరికి ఘోరబాధ సిద్ధముగానున్నది.

తమకుఁ గలిగిన యన్యాయమును సహించి క్షమించుటయే యనుల్లంఘనీయమగు విధి.

## అధ్యాయము-5.

దేవుఁడు త్రోవతప్పించినవారి కటువెనుక రక్షకుఁడెవ్వఁడు నుండఁడు. అన్యాయము చేసినవారు బాధనుజూచి "తిరిగివెళ్ళిపోవుటకు దారిలేదా?" యని యడుగుటను నీవుచూడఁగలవు.

వారి నాశాధముందఱ నిలుపగా వారు సిగ్గుచేఁ దలవంచుకొని యుందురు. వారు దానివంక దొంగతనముగఁ జూచుచుందురు. అప్పుడు విశ్వాసులు, "రక్షణదినమునఁ దమ్మును, దమ కుటుంబములను బోఁగొట్టుకొనువారే సత్యముగా నష్టులు! అన్యాయవర్తనులు శాశ్వత బాధ ననుభవింపవలసినదే కదా!" అని యందురు.

అతనిని రక్షింప దేవుఁడుతప్ప మఱెవ్వరు నుండరు. దేవుఁడు త్రోవతప్పించినవారికి మఱిదారి లేదు.

దేవుఁ డాదినము రావలసినదని యనుజ్ఞ నీయఁగా నితరు లడ్డగింప లేని యాసమయము రాకపూర్వమే నీప్రభువునకుఁ జెవియొగ్గి వినుము. ఆదినమున నీవుతలఁదాఁచుకొనుటకు స్థలముండదు. నీవుచేసిన పనులను చేయలే దనఁజాలవు.

వారు నిన్ను విడిచిపోయినచో, వారికి నిన్ను సంరక్షకునిఁగా నియమించియుండలేదు. నీవుచేయవలసిన దొక్క బోధనయే. మనుష్యునకు మాకరుణను రుచిచూపినచో సంతోషించును; కాని, వారు తమచేతులతో చేసికొనినదాని కాపద వాటిల్లినయెడల వెంటనే యాతఁడు కృతఘ్నుఁడై పోవును.

స్వర్గమర్త్యాధిపత్యము దేవునిదే. అతఁడు తనకిష్టమువచ్చిన సృష్టిని చేయుచుండును. అతఁడు తనయిచ్ఛవచ్చినవారికి కొమార్తెలను ఇష్టమువచ్చినవారికి కుమారులను నిచ్చును.

50 లేదా, వారికి కొడుకులను, కూఁతుళ్ళనుగూడ నిచ్చును. మఱి కొందఱ నపుత్త్రికులఁ జేయును. అతఁడు బుద్ధుఁడు! శక్తిమంతుఁడు!

మనుష్యునకు దివ్యజ్ఞానమువలననో, యొక తెరవెనుకనుండియో కాని దేవునితోమాట్లాడ శక్తిలేదు. లేదా, యాతఁడు తాను పంప నెంచిన సందేశము నొకదూతద్వారా తెలుపుచుండును. అతఁ డున్నతుఁడు. బుద్ధుఁడు!

ఈరీతిగా మాయనుజ్ఞచొప్పున, జ్ఞానముఁ దెలుపుటకు పరిశుద్ధాత్ముఁడగు జిబ్రీలునంపితిమి. ఇంతకుఁబూర్వము నీకు గ్రంథమననేమో, భక్తియననేమో తెలిసియుండలేదు. కాని, దానిని మేమొకజ్యోతిగానేర్పఱిచితిమి. దానిమూలమున మాకిష్టులయిన సేవకులకు దారిచూపుదుము నీవుతప్పక క్రమపథమగు

దేవుని దారిలోనికి నారిని తోడ్కొని పోఁగలవు. స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవునిదే. అన్నివస్తువులును దేవునియొద్దకే కదా తిరిగి చేరును.

---

# సురా-43 ఆభరణములు.

---

మక్కా - 89 పద్యములు-7 రుకూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

హా. మీమ్.

మెఱయుచున్న గ్రంథమునాన!

మీకుబోధపడుటకై యీకురాను నరబ్బీభాషలో వ్రాసియుంచితిమి.

అదిమేము దాఁచియుంచిన పురాతనమాతృకకు యథార్థముగా వ్రాసియుంచినపత్రిక. అది యుచ్ఛస్థానమున నుండి జ్ఞానపూర్ణమై యున్నది.

మీరు హద్దుమీరియున్నారని మీకీభయసూచన నీయకుందుమా?

అయినను పూర్వులలో నెన్నితరములవారికో, మాప్రవక్తల నంపియున్నాము.

కాని, వారు వచ్చినప్రవక్తలనందఱను నిరసించియున్నారు.

కావున, నీమక్కావాసులకంటె నెంతయో శక్తిమంతులను మేమునాశనము చేసియున్నాము. ఆపూర్వుల యుదాహరణము సర్వత్ర వ్యాపించియేయున్నది.

స్వర్గమర్త్యముల నెవ్వరుసృజించిరని వారిని మీరడిగినయెడల వారు,

10 “భూమిని మీకుశయ్యవలె నిర్మించి, దానియందుమీరునడచుకొనుటకు మార్గములను కల్పించినవాఁడును,

కావలసినవర్షమును స్వర్గమునుండి పంపి, మృతమైయున్న భూమిని త్వరపెట్టువాఁడును, (ఇట్లేమీరును మీసమాధులనుండి పైకి తేఁబడుదురు)

స్త్రీపురుషభేదముగల సర్వవస్తుద్వయములను సృజించి మీకు సుఖవాహనములుగా నుండుటకు నావలను, జంతువులను పుట్టించియుండ మీరువానిపై,

సౌఖ్యముగఁ గూర్చుండి మీప్రభునిదయను స్మరించుచు “ఏదిని మాకువశము చేసినవాఁడు ధన్యుఁడగుఁగాక! దీనిని మాయంతట మేము సంపాదించుకొనియుండలేము.

సత్యముగా మేము మాప్రభువునొద్దకే తిరిగిపోఁగలమని” చెప్పఁగలవాఁడును,

శక్తిమంతుఁడును, బుద్ధరూపుఁడును నగువాఁడే యారెండింటిని సృజించినాఁడని యనఁగలరు. ఇట్లయినను వారు తమ కింకరులలోఁ గొందఱాతని వారనియపవాదము లాడెదరు. నిశ్చయముగా మనుష్యుఁడు బహిరంగముగ కృతఘ్నుఁడగుచున్నాఁడు.

## అధ్యాయము-2.

దేవుఁడు తాను సృజించినవారిలో కూఁతుండ్రను పెంచికొని, మీకు కొడుకుల నెంచియిచ్చినాఁడా ?

కాని, దయానిధియగు దేవుని కాఁడుపిల్లలుపుట్టిరని చెప్పు వారికే యాఁడుపిల్లలు పుట్టుచురని చెప్పినచో వారిముఖములు నల్లబడి వారుమాట్లాడలేక విచారగ్రస్తు లగుదురు.

ఏమి ! ఆటవస్తువులలో పెరిగినవాఁడును, సందర్భరహితముగ వాదించువాఁడును, దేవునికుమారుఁడగునా ?

దయానిధియగు దేవుని కింకరులగు దేవతలు స్త్రీలని వారం దురు. ఏమి ! వారిసృష్టి వారికిఁ దెలియునా ? అట్లయిన వారిని సాక్ష్య మిమ్మనుఁడు. తరువాత వారిని దానినిగూర్చి యడిగెదము.

20 వారు, "దేవునియిష్టమైయైనచో వారిని మేము పూజింపకయే యుందుము" అందురు. ఇది వారు తెలిసియనిన మాటకాదు. కేవల మనృతము.

వారి కింతకుపూర్వము గ్రంథమునిచ్చితిమా? అదివారియొద్ద నింకనునున్నదా ?

కాని, వారు "ఇదిమాపితృాచారము, కావున నే దాని నవలం బించితి" మందురు.

ఇట్లే పూర్వ మేపురమునకైనను భయసూచన నిచ్చుట కెవనిని పంపినను, నందలి ధనికులు "మాపూర్వులమత మొకటియున్నదికదా ! వారినే మేమనుసరింతు" మందురు.

ఏమి ! మీపూర్వుల మతముకంటె సత్యమగు మతమును నేను తెచ్చినను, మీరు నన్ననుసరింపరా ? యనియును ' మని పూ ర్వప్రవక్తకు మేమాజ్ఞాపింప, వారు "నీవార్తయందు మాకు నమ్మకము లేదు" అందురు.

కావుననే వారిపై మేము పగఁదీర్చికొంటిమి. చూచితిరా మా దూతలనసృతవాదు లనువారికిఁ గలిగినగతి ?

అధ్యాయము-3.

ఇది జ్ఞాపకముంచుకొనుము. ఇబ్రాహీము తనతండ్రితోడను, తనప్రజలతోడను, " మీపూజలతో నాకుఁ బనిలేదు.

నాసృష్టికర్తనే నేను పూజించెదను. అతఁడు నాకు రక్షణ నొసగఁగలఁడు "

అని, తరతరములవఱకును నుండుటకుగాను, వారందఱును దేవునియొద్దకే మఱలిపోఁగలరను సిద్ధాంతమును స్థిరపఱిచెను.

విగ్రహారాధకులగు నీయరబ్బీలకును, వీరిపూర్వులకును, వారియొద్దకు విశ్వసనీయుఁడగు ప్రవక్త సత్యముతోవచ్చువఱకును, సకల భోగముల ననుభవింపఁజేసితిమి.

30 ఇప్పుడు వారికి సత్యవార్తరాఁగా వారు " ఇది యింద్రజాలము. దీనిని మేము నమ్మము

మక్కా, తయీఫునగరములలోని యొకగొప్పవాని కీకురాను వచ్చినయెడల మేము దానినిపరిగ్రహించియుందుము " అందురు.

అయిన నా రాదేవుని దయనుపంచిపెట్టుదురా ? ఈప్రపంచమున మేముగదా వారివారికికావలసిన యాహారమును పంచిపెట్టుదుము ! వారిలో నంతరువుల నేర్పఱిచి యెక్కువవాఁడు తక్కువవానిని సేవకునిఁగాఁ జేసికొనునట్లు చేయుదుము. కాని, వారిధనకోశములన్నిటి కంటె నీప్రభుపుకరుణ యమూల్యము.

మనుష్యజాతియంతయు నొకటే యవిశ్వాసవర్గ మగునను భయముచే తప్ప దయానిధియగు దేవుని నమ్మనివారికే మేము నిశ్చయముగా వెండియిండ్లకప్పులను, వెండిమేడమెట్లను,

వెండితలుపులను, బరుండుటకు వెండి పలకపులను,

ఆభరణములను, నిచ్చియుండెను. ఇవియన్నియు నిహలోకసౌఖ్యదాయకములు మాత్రమే. కాని, పరలోకజీవనమును నీ ప్రభువు దైవభీతిగలవారికొఱకు దాచియుంచినాఁడు.

అధ్యాయము 4.

దయానిధియగు దేవుని భయసూచనను పెడచెవిఁబెట్టువాని కాతఁడొక సైతానును గొలుసుతో వేసి కట్టి యాతనికి పరమస్నేహితునిగాఁ జేయును.

ఆసైతానులు వారిని మార్గమునుండి తప్పించినను, వారింకను సరియగుత్రోవను బోవుచున్నట్లె యోచికొనుచు,

తుదకు మాయొద్దకువచ్చునప్పుడు "ఓరీ! సైతానా, నీకును నాకును తూర్పుపడమరలకున్నంత యెడముండిన బాగుండు" నని మొఱపెట్టును. సైతాను దుష్టస్నేహితుఁడు.

నీ వన్యాయవంతుఁడవగుటచే నీకెట్టిసహాయమును గలుగఁబోదు. నీవును నాతఁడును, బాధను పంచికొనవలసియున్నది.

40 ఏమి, నీవుచెవిటివారు వినునట్లును, గ్రుడ్డివారు చూచునట్లును, తప్పుత్రోవఁబట్టినవారు సరియగుత్రోవం బోవునట్లును, చేయఁగలవా?

మేమొకవేళ నిన్నుచంపి తీసికొనిపోయినను, వారిపై మేము పగతీసికొనకతప్పదు.

వారికి మేము భయపెట్టినది జరిగినదనుటకు నిన్ను సాక్ష్యము వేసినను, వారిపై మాయధికారమును చూపియేతీరుదుము.

నీవు సరియగుమార్గములోనున్నావు. కావున నీకు మేముచెప్పిన రహస్యమును జారవిడువకుము.

నీకును నీప్రజలకును నది నిశ్చయముగా భయసూచన యగుచున్నది. దానినిగూర్చినీవు లెక్క నప్పఁజెప్పవలసియున్నది.

మేము నీకుఁ బూర్వము పంపిన దూతలను "దయానిధియగు దేవునిఁగాక యితర దైవములను మే మేర్పఱిచితిమా ?" యని యడుగుము.

## అధ్యాయము-5.

పూర్వము ఫిరౌనునొద్దకును, నతని సామంతవర్గమునొద్దకును, మూసాను బంప నాతఁడు, "నేను నిశ్చయముగా జగన్నాథునిదూత" ననుచు,

మాసూచనలను వారికిఁజూప నంతకుపూర్వ మాతకంటె గొప్పసూచన వారికిఁ గనఁబడకపోయినను వారు నవ్వఁజొచ్చిరి.

కావున, వారు దేవునిశరణుఁజొచ్చుటకు, వారినిబట్టుకొని, శిక్షల పాలు గావించితిమి.

అప్పుడు వారు "ఓయింద్రజాలికుఁడా! మేము రక్షణఁబొందెదము. కావున నీతోఁజెప్పినట్లు చేయుటకు మాపక్షమున నీప్రభువును వేఁడు" మని ప్రార్థింప,

50 మే మాశిక్షను దీసివేసితిమిగాని, వారు వెంటనే తమసమయము నతిక్రమించిరి.

ఫిరౌనును తనప్రజలతో, "నాప్రజలారా! ఈ యీజిప్టు(మిసిర్) రాజ్యమును నీ నాపాదములయొద్దఁ బ్రవహించు నదులును, నావియని మీకుఁదెలియునుగదా!

వీఁడు నీచుఁడు, స్పష్టముగ మాట్లాడనైనఁ జాలఁడు. వీనికంటె మేము శక్తిమంతులము గదా!

ఇతనిచేతుల కేమి, కంకణములు తొడిగిరా? వీనితో దేవతలు వచ్చియున్నారా?"

అని చాటఁబంపి వారికి స్వాతంత్ర్యమునిచ్చి తనకు విధేయు లగునట్లు చేసికొనెను. వారు దుష్టప్రజలు.

వారు మాకు కోపము కలిగించినంతనే మేము వారిపైఁ బగ దీర్చికొని, నీటనుముంచి చంపి,

వారితరువాతివారికి, మాకీతి కుదాహరణముగాఁ జేసితిమి.

అధ్యాయము-6.

మరియమ్మపుత్రుఁడు దైవబలమున కుదాహరణముగాఁ జూపఁ బడినంతనే నీప్రజలు సంతోషముతో గంతులువేయు నారంభించి,

"మాదైవములా యాతఁడా గొప్పవాఁడు?" అనియడుగుచు, కేవలము వాదమును పెంచఁదొడఁగిరి. వారు కేవలము శుష్కవాద ప్రియులు.

ఈసా మాయనుగ్రహముఁబొందిన మాకింకరులలోనివాఁడును, ఇస్రాయేలుప్రజలకు దైవశక్తి కుదాహరణముగా మేము చూపించిన వాఁడును తప్ప మతియెవ్వఁడును గాఁడు.

60 (మాకిష్టమయినచో మిమ్ములనుండియే కొందఱ దేవతలను లేవనెత్తి నీతరువాత భూమిపైఁ బంపఁగలము.)

అతఁడా యంతిమకాలమున కొకసూచనమై యున్నాఁడు. కావున దానిని మీరు నమ్మి నన్ననుసరింపుఁడు. ఇదియే క్రమ మార్గము.

సైతాను మీకు గర్భశత్రువు. అతనిమాటవిని మీరు త్రోవ తప్పకుఁడు.

ఈసా స్పష్టములగు సాక్ష్యములతోవచ్చి "నేను మీకు జ్ఞానముఁ బ్రసాదింప వచ్చియున్నాను. మీలోని కొన్నివిషయములనుగూర్చిన వివాదములను నేనుపరిష్కరించెదను. కావున, మీరు దైవభీతికలిగి నాకు విధేయులరుకండు.

నిజముగా దేవుఁడు మీకును నాకునుగూడ ప్రభువే. కావున నాతని నారాధింపుఁడు. ఇదియే క్రమమైన మార్గము"

అనఁగా వారు దానిని సరిగ్రగహింపలేక వాదములను మఱింత పెంచికొనిరి. కాని, హద్దుమీఱినవారి కాదుఃఖదినమున ఘోరశిక్ష కలుగక మానదు.

వా రాకాలము తామనుకొనకపూర్వమే వచ్చుటకొఱకేకదా వేచికొని యున్నారు.

దైవభీతులగువారుతప్ప స్నేహితులుగూడ నాదినమున పరస్పర వైరులయ్యెదరు.

అధ్యాయము-7.

నాకింకరులారా! ఈదినమున మీ కెట్టిభయమును గలుగఁ బోదు. మీకు దుఃఖము సంభవింపదు.

మీరుమాత్రము మాసూచనలనునమ్మి ముస్లిములరు (భక్తులరు) కండు.

73 మీ రానందముతో మీ భార్యలతోఁగూడ స్వర్గములోనికి రండు.

వా రచట బంగారు పళ్ళేరములతోడను, బంగారుగిన్నెలతోడను, తమ యాత్మలకుఁ గావలసినదంతయును, వారికన్నుల కింపగునదంత యును ననుభవింతురు. అచట మీరు శాశ్వతముగా వసింపఁగలరు.

ఇదియేస్వర్గము, మీ సత్కర్మలమూలముగా మీరుసంపా దించుకొనిన బహుమానము.

అచట మీకు కావలసినన్ని పండ్లుండును; వానిని మీ రాస్వా దింపఁగలరు.

కాని, దుష్టులు శాశ్వతనరకబాధ ననుభవింపఁగలరు.

ఆబాధ వారి కిసుమంతయు తగ్గఁబోదు. ఆచట వారు నిస్పృహులై మూకతనము నాశ్రయింపవలసినదే.

మేము వారి కెట్టియన్యాయమును జేయలేదు. వారికి వారే యన్యాయము చేసికొనినారు.

వారు, "మాలికా, నీప్రభువు మమ్ము చంపివేయఁడేల ?" యని వేదనభరింపఁజాలక యఱచుచుండ నాతఁడు "మీరిచటనే యుండవలయు" నని యుత్తర మిచ్చుచుండును.

మక్కావాసులారా ! మేము మీకొఱకు సత్యమును దెచ్చి యున్నాముగాని, మీకు సత్యమనినఁ గిట్టదు.

మీరు వారిపాశములో నంతగట్టిగఁ దగులొ్కనియున్నారా ? అయిన మేమును మాపాశములను బిగించెదము.

80 వారి రహస్యములును, వారి గుసగుసలును, మాకుఁ దెలియవను కొనినారేమో ? ఓహో ! మాదేవతలు వారిప్రక్కలనేయుండి వ్రాసి వేయుచునేయున్నారు.

"దేవునికే యొకపుత్త్రుఁ డుండెనేని, అతని నారాధించువారిలో నేనే ప్రథముఁడ నయ్యెదను.

కాని, స్వర్గమర్త్యాధినాథుఁడును, సింహాసనాధిరూఢుఁడును నగు దేవుఁ డట్టియపవాదమునకు దూరుఁడగునుగాక !

కావున వారు మునుఁగుచుఁ దేలుచు, నాడుచుఁ బాడుచు, భయావహమగు దినమువఱకును నుండనిమ్ము.

స్వర్గమునందలి దేవుఁడే భూమియందును దేవుఁడు. అతఁడే బుద్ధరూపుఁడు, జ్ఞానమూర్తి !

స్వర్గమర్త్యములకును, దదంతరాళమునకును నాథుఁడగు వాఁడు ధన్యుఁడగుఁగాక ! ప్రళయమునుగూర్చి యాతనికే తెలియును. మీరందఱును నాతనియొద్దకే తిరిగివత్తురు.

సత్యమునుజూచి దానిని తెలిసికొనినవారుతప్ప వారు స్వీకరించినదైవములు మాధ్యస్థ్యమును వహింపలేవు" అనుము.

"మిమ్ముల నెవ్వరుసృజించి" రని నీవు వారినడిగినయెడల "దేవుఁ" డని వారునీకు బదులిత్తురుగదా ! వారి కిట్టి దురభిప్రాయము లెందుండి వచ్చినవి ?

ఒకఁడు "ప్రభువా ! వీరే యవిశ్వాసకులగు ప్రజలు" అనును.

కావున నీవు వారినుండి తొలఁగి స్వస్తివాక్యమును పఠింపుము. వారు తమ మూర్ఖ్యమును తుదకుఁగాని తెలిసికొనఁజాలరు.

---

# సురా-44-అనావృష్టి

---

మక్కా-59 పద్యములు-3 రుకూ లు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అధ్యాయము-1.

హా. మీామ్. ఈ స్పష్టగ్రంథమునాన!

చూడుము ! మా యాజ్ఞాప్రభావమున సర్వవస్తువులను జ్ఞాన ప్రబోధములై యున్న

ఒక ధన్యరాత్రియందు మనుష్యజాతికి భయసూచకముగా దానిని బంపియుంటిమి.

ఇదిగో ! నీప్రభువునొద్దనుండి యనుగ్రహముగా నెల్లప్పుడును ప్రవక్తలను బంపుచునే యున్నాము.

అతఁడుతప్ప మఱియొకదేవుఁడు లేఁడు. సృష్టిసంహారకారకుఁ డాతఁడే.

నీకు స్థిరవిశ్వాసమున్నచో, స్వర్గమర్త్యముల నారెండిటికి మధ్యనున్న దానికంతటికిని నాతఁడేప్రభువు. నీకును నీతాతముత్తాతలకును నాతఁడే ప్రభువు.

నిజముగా నాతఁడు సర్వశ్రోత, సర్వజ్ఞాత!

కాని, వారు శంకాబద్ధులైయున్నారు.

కాని, స్వర్గమునుండి వెడలి మనుష్యులచుట్టు నావరించు

అనావృష్టి నిండుకొనఁగల దినమున,

10 వారిని వీక్షింపుము. వారికది బాధాకరమగు శిక్షయగును.

వారు, "ప్రభువా! యీబాధనుండి మమ్ము తొలఁగింపుము, ఇదిగో, మేమువిశ్వాసులము" అని అఱచెదరేకాని,

వారియొద్దకు సత్యప్రవక్త వచ్చినప్పుడు వారుభయసూచననేల గ్రహింపలేరు?

వారాతనికి వెనుదిరిగి "పరులు నీకునుబోధించిరా? పిశాచగ్రస్తుఁడవా?" యనియడిగిరి.

మేము మీబాధనుండి యించుకైనను దప్పించినయెడల తిరిగి పాతమార్గము ననుసరింతురుగదా!

మాయుగ్రత నతితీక్ష్ణముగాఁ గనఁబఱుపఁగలదినమున నిజముగా వారిపైఁ బగదీర్చికొందుము.

వీరికిఁ బూర్వము చాలకాలము క్రిందట నొకప్రవక్తను బంపి ఫిరౌను జనులను మేము శోధించియుంటిమి.

"నేనువిశ్వాసపాత్రుఁడ నగు ప్రవక్తను. దేవునికింకరులను నాతోఁబంపివేయుఁడు.

నిస్సందేహమగు శక్తితో నేనువచ్చియున్నాను. కావున, మీరు దేవునికంటె నధికులమని చెప్పఁబోకుఁడు.

20 మీరు నాపై ఱాళ్ళువిసరి చంపకుండ నాకును మీకును ప్రభు
వగు దేవుని శరణుఁజొచ్చుచున్నాను.

మీరు నన్ను విశ్వసింపనిచో నన్నువిడిచి తొలఁగిపోయినపొందు "
అని యాతఁడువారితోఁజెప్పి,

తిరిగి తనప్రభునితో " వీరు దుష్టజనులు " అన,

దేవుఁడాతనితో "అయిన నీవు నాకింకరులతో బయలువెడలుము.
నిన్ను వారు వెంటఁబెట్టుదురు.

నీకు సముద్రము దారియిచ్చును. వారు నీటిలో మృతినొందుదు"
రనెను.

వా రెన్నియో యుద్యానవనములను, జలయంత్రములను,

పొలములను, పిశాలభవనములను,

సౌఖ్యములను, వదలి వెళ్ళిరి.

ఇట్లు వారుచేయఁగా, వానినిమఱియొక జాతివారి కిచ్చివేసితిమి.

భూస్వర్గములు వారికొఱకు కేడ్వలేదు. వారిశిక్ష యంతరించలేదు.

అధ్యాయము-2.

30 గర్విష్ఠియు నతివిషయలోలుఁడును నగు,

ఫిరౌనునుండి యిస్రాయేలుసంతతివా రవమానముపొందకుండఁ
గాపాడితిమి.

మా భవిష్యజ్జ్ఞానముచే నన్నిజాతులవారికంటె వీరినే
యెంచికొని,

వారికి విస్పష్ట శోధన యగున ట్లనేకాద్భుతములఁ జూపితిమి.

కాని, యవిశ్వాసకులు,

" చావెప్పుడైనను నొక్కసారియే. చచ్చినవెనుక లేచుట యస
త్యము.

మీరు సత్యవాదులయినచో మాపితురులను బ్రతికింపుఁ "
డందురు.

వీరు దుష్టకృత్యములకై మేము నాశనముఁ జేసిన తుచ్ఛజనుల కంటెను వారి పూర్వులకంటెను మంచివారా?

భూస్వర్గములను, తదంతరాళమును, వినోదమునకై మేము సృజించియుండలేదు.

గొప్పయుద్దేశ్యముతోడనే సర్వమును సృజించియున్నాము. కాని, వారిలోఁ జాలమంది కది తెలియదు.

40 నిజముగాఁ బ్రళయకాలమే యందఱకును నియమితమైన కాలము.

సర్వశక్తుఁడును, దయాళుఁడునునగు దేవుఁ డనుగ్రహించిన వారిలోఁదప్ప,

ఇతరులలో యజమానుని సేవకుఁ డనుసరింపఁడు. ఎవ్వరికిని సహాయము దొరకఁబోదు.

అధ్యాయము-3

నిజముగా జకూ్కామ్ అనువృక్షమే

పాపుల కాహారము.

అది వారికడుపున మఱుగుచున్న నూనెమడ్డివలెను,

ఉడుకెత్తిన నీటివలెను, వర్తించఁగలదు.

"వానిని పట్టికొనుఁడు; అగ్నిమధ్యమునఁ దోయుఁడు.

పిదప నాతని తలపై మఱుగుచున్ననీటిని బాధపెట్టుటకై పోయుఁడు,

నీవు శక్తిమంతుఁడవును గౌరవనీయుఁడవు నేమో! దీని నాస్వాదింపుము!

50 ఇదిగో, దీనినే నీవు సందేహించితివి.

కాని, భక్తులు సురక్షితస్థలమునందు,

ఉపవనములయందు, సెలయేళ్ల దరిని,

పట్టుబట్టలను, మేలంగీలను తొడిగి, యొకరికొక రభిముఖు లగు చుందురు.

ఇదియిట్లే; వారికి మేము విశాలనీలోత్పలనయనలగు కన్య లను వివాహముచేయుదుము.

అచటవారు సురక్షితులై సర్వవిధఫలములను ననుభవింపఁ గలరు.

అచట వా రొకసారి చచ్చిపోయినతరువాత తిరిగి మృత్యువు నెఱుఁగఁజాలరు. అతఁడు వారిని నరకబాధలనుండి రక్షింపఁగలఁడు!

ఇదియే నీప్రభుని దివ్యప్రసాదము. ఇదియే పరమానందము.

వారుభయసూచనను గ్రహించుటకు కురానును మీభాషలో నే వ్రాసి సులభముచేసితిమి.

వారు వేచియున్నారు. కావున నీవును వేచియుండుము.

# సురా 45 – మోకారింపు.

మక్కా–36 పద్యములు–4 రుకూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

## అధ్యాయము–1.

హా. మీమ్. సర్వశక్తుఁడు, సర్వజ్ఞుఁడునగు దేవునినుండి యీ గ్రంథ మవతరించినది!

నిశ్చయముగా నమ్మినవారికి స్వర్గములందును, భూమియందును సూచనలుగలవు.

దృఢభక్తిగలవారికి మీసృష్టియందే, యెల్లెడలనుండియుండు జంతువులయందే సంజ్ఞలుకలవు.

వివేకముగలవారి కొకదానినొకటి యనుసరించుచుండు రాత్రింబవళ్ళయందును, భూమి మృతప్రాయమైయుండ దాని నుజ్జీవింపఁజేయుటకు స్వర్గమునుండి యాతఁడు పంపించు వర్షమునందును, మాఱుచుండు గాలులయందును, సంజ్ఞలు గోచరించుచుండును.

దేవునిసూచన లిట్టివే. మేము వానిని నీకు సత్యముగా వచించుచున్నాము. కాని, వారు దేవుని నతనిసూచనలను నమ్మకుండునప్పుడు మఱియెవ్వానిని నమ్మెదరు ?

దేవుని సూచనలను మేముపఠించుచుండ వినియు, విననివానివలెఁ దిరస్కారభావముతో సంచరించుచు,

అసత్యపరుఁడగు పాపి దుఃఖభాజనుండగుఁగాక, ఘోరశిక్ష యతనికిఁ గలుగఁగలదని నొక్కిచెప్పుము.

మాసూచనల నాతఁ డొకప్పుడు గ్రహించియు దానిని పరిహసించుచుండును. అట్టివారికి లజ్జావహమగుశిక్ష కలుగుచున్నది !

నరకము వారిని వెంబడించుచున్నది. వారిలాభములుగాని, దేవునిఁగాక వారు స్వీకరించినయితర ప్రభువులుగాని, వారి కిసుమంతయుఁ దోడ్పడఁజాలరు ! వీరికిఁ గొప్పశిక్ష కానున్నది !

19 ఇదియే "రక్షణ"; తమప్రభుసూచనలను నమ్మనివారి కతిబాధాకరమగు శిక్షకలుగును.

## అధ్యాయము-2.

నావలు తనయాజ్ఞప్రకారము నడుచుచుండుటకును, అతని దయాదత్తములగు వస్తువులను నీ వన్వేషించికొని కృతజ్ఞుఁడవై యుం

డుటకును, సముద్రము నీకువశమగునట్లు చేసినవాఁడు దేవుఁడే.

స్వర్గములందును, భూమియందును, గల సర్వము నాతఁడే నీకు స్వాధీనము చేసియున్నాఁడు. సర్వము నాతఁ డనుగ్రహించినదే. నిశ్చయముగా యోచించుకొనువారి కీవిషయములందే సూచనలు కలవు.

వారివారి కర్మలననుసరించి దేవుఁడు బహూకరింపఁగల విజయ దినములఁగూర్చి నమ్మనివారిని క్షమింపుఁడని భక్తులతోఁ జెప్పుము.

మేలుచేయువాఁడును, కీడుచేయువాఁడును తనతన మేలుకీడుల కొఱకే యట్లుచేయుచుండును. ఇఁకమీఁదట మీరు మీప్రభువునొద్దకు తిరిగిరాఁగలరు.

పూర్వకాలమున జ్ఞానగ్రంథమును, జ్ఞానమును, జ్యోతిషము చెప్పనేర్పును నొసగి, యెల్ల సద్వస్తువులను బ్రసాదించి, యన్నిజాతుల వారికంటె నిస్రాయేలుసంతతి వారి నధికులఁ జేసితిమి;

మాయాజ్ఞలకు శంకారహితములగు సూచలను వారికిచ్చితిమి. జ్ఞానవంతు లగునటకును వారు పరస్పరస్పర్ధలంబెట్టికొని వాద ములఁబెంచికొనకుండిరి. కాని, నీప్రభువు వారివాదములంగూర్చి రక్షణ దినమందు నిర్ణయించును.

పిదప మేము నిన్ను మాదైవధర్మములపై నధికారిగా నియ మించితిమి. కావున నాధర్మము ననుసరింపుము. అజ్ఞానులు దేవుని నుండి నిన్నుతప్పింపఁజాలరు. కావున వారికోరికలను మన్నింపకుము.

నిశ్చయముగా దుర్మార్గు లొండొరులను ప్రభునికై ప్రోత్స హించుకొనుచుందురు. కాని, దేవునికి భయపడువారిప్రభువు దేవుఁడే!

ఈగ్రంథము మనుష్యజాతి కంతర్దృష్టినిచ్చి దృఢభక్తులగు వారికిఁ గరుణానిధానమై యుండును.

20 కేవలము దుష్టులగువారిని, పుణ్యవంతులై దృఢభక్తిగల వారిని, జీవనమునందును, మరణమునందును, నొకటేరీతిగఁ జూచెద మని వారుతలంచుచున్నారు కాఁబోలు! వారియూహ సరియైనది కాదు.

## అధ్యాయము-3.

ప్రతిమనుష్యుఁడు తనకర్మానుసారముగ ఫలముల ననుభవించుటకే సత్యముగా దేవుఁడు స్వర్గమర్త్యముల సృజించియున్నాఁడు ఎవ్వనికి నన్యాయము కలుగఁబోదు.

నీవేమనుకొనుచున్నావు? తనకోరికలనే తనకు దైవముగాఁ జేసికొన్నవాఁడును, దైవమే కోరి త్రోవఁదప్పించువాఁడును, దేవునివలన తనచెవులును, హృదయమును మూఁతపడి దృష్టిపై తెరగప్పబడిన వాఁడును, ఇట్టివానిని దేవుఁడు విసర్జించినపిదప నెవ్వఁడు దారిచూపఁ గలఁడు? ఇంకను మీకుభయముపడరా?

"మనకు ప్రస్తుతజీవన మొక్కటే నిశ్చయము. మనము చచ్చుచుఁ బుట్టుచునే యుందుము. మనమందఱమును కాలమునకే వశులమై యున్నా" మని వారందురు కాని, వారికి దానిని గూర్చిన జ్ఞానము లేదు. అది కేవలము వారియూహయే.

స్పష్టములగు మాసూచలను వారికి వినిపించినప్పుడు వారు "మీరు సత్యమును వచించుచున్నయెడల మాపూర్వులఁ బునర్జీవితులఁ జేయుఁ" డని మాత్రము వాదించుచుందురు.

వారితో "దేవుఁడు మీకుఁ జీవమునిచ్చి, పిదపమిమ్ములఁజంపి, పదంపడి రక్షణదినమున మిమ్ముల నొకచోఁ జేర్చును. ఇందు సందేహ మేమియును లేదు. కాని, చాలమందికి జ్ఞానము లేదు" అనుము.

## అధ్యాయము-4.

స్వర్గమర్త్యముల యాధిపత్యము దేవునిదే. గంటమ్రోగఁగల యాదినమున తిరస్కారభావముగలవా రందఱును నశింతురు.

ప్రతిజాతియు మోకారింపఁగల కాలమును, నీవు చూడఁగలవు. ఏజాతి ఏగ్రంథము నవలంబించునో యాగ్రంథమునే వారు చేకొనియుందురు." ఈదినమున మీకర్మఫలము ననుభవింపఁగలరు.

ఈ మీగ్రంథము మిమ్ముఁ గూర్చి సత్యముగాఁ బలుకును. మీ రాచరించిన ప్రతివిషయమును మే ముందు వ్రాసియుంచియున్నాము."

విశ్వాసయుతులై సన్మార్గము నవలంబించినవారిని వారిప్రభువు తనదయాపాత్రులఁజేయును. ఇదియే యవ్యాజమగు నానందము.

30 కాని, నమ్మనివారితో "మాసంజ్ఞలు మీమ్రోల పఠింపఁబడియుండలేదా? అయినను మీరువానిని తిరస్కరించి పాపులైతిరికాదా?"

"దేవుఁడుచేసిన వాగ్దానము సత్యము. గంట మ్రోగుకాలముఁ గూర్చి సందేహములేదు" అని మీకు చెప్పినప్పుడు "గంటయేమో మాకుఁ దెలియదు. అది భ్రాంతియని మేమనుకొందుము. అది తప్పక వచ్చునని నిశ్చయమేమి?" అని మీ రంటిరి.

వారుచేసిన దుష్కృతులువారికన్నులకు పొడగట్టె,వారు కేలిచేసిన దంతయు వారిచుట్టుఁ జుట్టికొనును.

అప్పుడు వారితో "మీరు మాతో నీదినమున కలిసికొనుటను గూర్చి యెట్లుమఱచియున్నారో యట్లే మేమును మిమ్ము నేఁడు మఱచి పోయెదము. మీ కగ్నియే గతి; అందుండి మిమ్ము రక్షించువా రెవ్వరు నుండరు.

మీరు దేవుని సంజ్ఞలను కేలిచేసితిరిగదా! ఈప్రస్తుతజీవనము మిమ్ముమోసపుచ్చినది" అని చెప్పఁబడును.ఆదినమునవారాయగ్నినుండి తప్పించుకొనలేరు. దేవునియనుగ్రహమును వేఁడుమని యాతని నాదినమున నెవ్వరును హెచ్చరింపరు.

కావున స్వర్గమర్త్యాధినాథుఁడగు లోకేశుఁడు స్తవనీయుఁడగుఁ గాక !

ఆతఁడే సర్వశక్తుఁడు. సర్వజ్ఞుఁడు ! స్వర్గమర్త్యములయందాతని మహిమ వర్ధిల్లుగాక !

---

# సూరా 46-ఇసుకతిన్నెలు.

మక్కా-35. పద్యములు-4 రుక్కులు.

అధ్యాయము-1.

# కాండము. 26.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

హా. మీామ్.

ఈగ్రంథము శక్తిమంతుఁడును బుద్ధుఁడునునగు దేవునినుండి యవతరించినది !

స్వర్గమర్త్యములను, నారెండిటికి మధ్యనున్నదానిని సత్యమునందుఁ బ్రతిష్ఠించితిమి. వానికిఁ గొంతకాల మవధిగ నేర్పఱచితిమి. కాని, నమ్మనివారు భయసూచనమునుండి మఱలిపోయెదరు.

"మీారేమనుకొనుచున్నారు ? దేవునిఁగాక మీారారాధించువారు భూమిలో నేమాత్రపుభాగమును సృజించియున్నారో నాకుఁ జూపుఁడు. వారికి స్వర్గములో పాలున్నదా ? మీారు సత్యవంతులరైనచో నీకురానునకుఁ బూర్వముపంపఁబడిన యొకగ్రంథమునుగాని, వారిజ్ఞానము జాడలఁగాని, నాకుఁ జూపుఁడు.

దేవునివిడిచి, యాతఁడు రక్షణదినమువఱకును బిలుచుచున్నను, ప్రత్యుత్తర మీయలేనివారి నారాధించువారికంటెఁ దప్పుచేసినవా రెవరు ? అవును. వారు పిలిచిన పిలుపులను లక్ష్యపెట్టరు.

మనుష్యజాతియంతయు నొకచోఁ జేరియున్నప్పుడు వారు వారికి శత్రువులును, కృతఘ్నులునై తమకు వారు పూజలు చేయ లేదందురు.

మాస్పష్టసూచనలను వారికిఁ దెలుపఁగా విశ్వాసములేనివారు తమకువచ్చిన సత్యమును, " ఇది కేవలము చిల్లంగి " యందురు.

" అతఁడే దానిని కల్పించె " నని వారందురా ? " నేను ఖురాను కల్పించినచో మీరు నాకు దేవునినుండి యొకవస్తువునైనను దీసికొని రాఁజాలరు ! మీరు దానినిగూర్చి యేమిపలుకుచున్నారో యాతనికే బాగుగఁ దెలియును ! నాకును మీకును నాతనిసాక్ష్యమే చాలును ! అతఁడు దయాళుఁడు. కరుణాళుఁడు.

"నేను క్రొత్తసిద్ధాంతములను తీసికొని రాలేదు, నాకును మీకును నేమగునోకూడ నాకుఁదెలియదు. నాకుఁదెలుపఁబడిన దానినే నేననుసరింతును. బహిరంగముగా మీకు భయసూచన నిచ్చుటయే నావిధి.

10 " మీరేమనుకొనుచున్నారు ? ఇది దేవుఁడు పంపినగ్రంథము. మీరు దానిని నమ్మరు. ఇస్రాయేలు సంతతివారిలో నొకఁ డిది ధర్మవిరుద్ధమనుటకు సాక్షి. అతఁడు నమ్మియుండెను. మీరు దానిని తిరస్కరించుచున్నారు. అయినను.......? ఆహా ! ఇట్టి నేరము చేసిన వారిని దేవుఁడు రక్షింపఁడు " అనుము.

## అధ్యాయము-2.

కాని, యవిశ్వాసులు విశ్వాసులతో " అది మంచి గ్రంథమైనచో మాకంటె వారు ముందుగ విశ్వసించియుండరు " అనుచు

రక్షణను గోరనివారగుటచే "ఇదియొక ప్రాంత పుక్కిటిపురాణము" అని పల్కుదురు.

పూర్వ మీకురానే మూసాకుపంపిన గ్రంథము. అది యీతం తనుసరించు సూత్రముచు గరుణాప్రదానమునునై యుండెను. ఇది యీగ్రంథమును అరబ్బీభాషలో స్థిరపఱుచు చున్నది. నేరము చేసిన వారి కిది భయసూచన; సత్ప్రివర్తకులకు సువార్త.

"మాప్రభువు దేవుండే" యనుచు నతని యొద్దకు తిన్ననిదారిని బట్టినవారు నిశ్చయముగా నేభయమును గాని, దుఃఖమును గాని, పొందరు.

వారు తమ సత్కర్మలకు ఫలముగా భోగభూమియందు శాశ్వత వాసము చేయుదురు!

ఇదిగాక, మనుష్యుండు తల్లిదండ్రులయెడ దయజూపవలసినదిగా విధించియుంటిమి. తల్లి యీతనిం గష్టపడి మోసినది. కష్టపడి కనినది. అతండు గర్భములోం జొచ్చిననాంటినుండి చన్ను విడుచువఱకును ముప్పదినెల లామెపై నాధారపడియుండెను. అతని శంతకంతకును బలముకలిగి నలువది యేండ్ల ప్రాయమువాండు కాంగా "ప్రభువా! నీవు నాకును నాతలిదండ్రులకును జూపిన యనుగ్రహమునకు కృతజ్ఞుండనై యుండునట్లును, నీకుసంతోషముగలుగు సత్కారములం జేయు నట్లును నన్ను ప్రేరేపింపుము. నాసంతానమును వృద్ధిచేయుము. నేను నీవంకకే తిరిగియున్నాను. నీకే యధీనుండనైయున్నాను" అని యీతం డనును.

వీరినుండియే సత్కర్మలను బరిగ్రహించి దుష్కర్మలను విడిచి వైతుము. వారికిచ్చిన సత్యవచనముప్రకారము వారు భోగభూమియం దుందురు.

కాని, తనతలిదండ్రులతో "ఛీ! ఏమిమాటలు! నాకు పూర్వ మెన్నోతరములవా రంతరించిపోయి యుండంగా నన్ను సమాధినుండి

ప్రాణములతో లేవఁదీయుదురని నాతో నచ్చఁజెప్పుచున్నారా ?" అని పల్కువానితో వారు "అయ్యో ! అట్లనకుము. నాయనా, నమ్ముమా! దేవునిమాట సత్యము సుమీ !" అని యందురు. కాని, యాతఁడు "ఇది కేవలము పూర్వుల పుక్కిటికథ" యనును.

ఇటువంటివారికే పూర్వ మాయాజాతులవారికిని, పిశాచములకును, మనుష్యులకును, విధింపఁబడినశిక్ష కలిగితీరును. వారు తప్పక నాశనము నొందుదురు.

దేవుఁడు వారివారి కర్మలనుబట్టి బహుమానముచేయుట కా కర్మలయందంతరవులఁ గల్పించియున్నాఁడు. వారి కెట్టియన్యాయమును గలుగఁబోదు.

20 విశ్వసింపనివారొకదినమున నగ్నికభిముఖులగుదురు. "మీరు భూమిపై జీవించియుండఁగనే మీశ్రేష్ఠవస్తువులను జారవిడిచికొంటిరి. మీరు వానితో సంపూర్ణముగ తృప్తినొందితిరి. మీరుభూమిపై గర్వముతో నక్రమముగ సంచరించి యున్మార్గవర్తులయినందుకు మీకిచట లజ్జాకరమగు శిక్షయే బహుమానము."

## అధ్యాయము-3.

ఇసుకతిన్నెల యందలి ప్రజలకు భయసూచన నిచ్చిన ఆదుసోదరుని స్మరింపుఁడు. అతనికిఁ బూర్వమును, దరువాతను గూడ భయసూచన నిచ్చినవారుండిరి "దేవునిఁదప్ప నితరుల నారాధింపకుఁడు. ఆమహాదినమున మీకు శిక్షకలుగునని నాకు భయమగుచున్నది" అని యాతఁడనెను.

అంతటవారు "మమ్ము మాదేవతలనుండి పాఱద్రోలుటకా నీవువచ్చినది ! నీవు సత్యవంతుఁడవైనచో నీవు భయపెట్టుచున్న యాపదల నిప్పుడు తీసికొనిర" మ్మనిరి.

అతఁడును "దానినిగూర్చి దేవునికే తెలియును. నాతోఁబంపిన సందేశమును ప్రకటించుటయే నావిధి. కాని, మీరు రజ్ఞానములో మునిఁగి యున్నవారుగా నాకుఁ గనఁబడుచున్నారు" అనెను.

అప్పు డొక మేఘము వారి లోయలవంక వచ్చుచుండుటఁజూచి "ఇదియొక వర్షమేఘము" అనిరి. కాని, యది యట్టిది కాదు. ఏది మీరు రాదనుకొంటిరో యదియేయిది. ఇదియొక తుపానుసూచన, మిమ్ము శిక్షించుటకు వచ్చుచున్నది.

అది తన ప్రభునియాజ్ఞప్రకారము సర్వమును నాశనము చేయును. "తెల్లవారుసరికి ఉత్తయిండ్లుతప్ప నచట మఱేదియు నిలిచియుండలేదు. మేము, దుష్టులకిట్లే ప్రతిక్రియఁ జేయుదుము.

మీకు శక్తినిచ్చినట్లే వారికిని శక్తినిచ్చితిమి వారికి చెవులను, కన్నులను, హృదయములను నిచ్చితిమి. అయినను వారు దేవునిసూచనలను నిరాకరింపఁగా వారిచెవులును, కన్నులును, హృదయములును, వారి కించుకయు పనికిరాలేదు. వారు వేళాకోళముచేసినశిక్ష వారి నన్ని దిక్కుల నావరించివైచెను.

అధ్యాయము-4.

మీ చుట్టుపట్లనుండు పురములనుగూడ పూర్వము మేము నాశనముచేసితిమి. వారు మాయొద్దకే తిరిగివచ్చుటకు మాసూచనలను మార్చుచువచ్చితిమి.

దేవునిగాక, వారు తమ కులదేవతలని కొలిచినవారు తమకు సహాయపడిరా? లేదు. వారు వారినుండి తొలఁగిపోయిరి. వారి మాయయు, వారిపన్నాగములు నిట్టివే.

కురానును వినవలయునని కొందఱను నీయొద్దకుఁ దెచ్చితిని. వారు దానిని వినుటకుఁబూర్వ 'మిస్సీ' యనిరి. కాని, యదిచదువుట యైనతోడనే తమ ప్రజలకు భయసూచనలఁదెల్పుటకు వెడలిపోయిరి.

30 "ప్రజలారా! మూసాకాలమునుండియు మనము వినుచున్నట్టియు, పూర్వగ్రంథముల స్థిరపఱుచునట్టియు నొకగ్రంథమును మేమువినుచుంటిమి. అదిసరియైనమార్గములో నడిపించి సత్యమును జూపఁగలదు.

"ప్రజలారా! దేవునిదూతను మన్నించి యాతనినే నమ్ముఁడు. ఆతఁడు మీ పాపముల క్షమించి, మిమ్ము ఘోర బాధనుండి తప్పించును.

"దేవుని మతప్రవర్తకుని నమ్మనివారు ఆతనికి భూమిపైఁగల యధికారమును తగ్గింపలేరు. వారి నాతఁడుతప్ప నితరులు రక్షింపఁజాలరు. వీరు తప్పక తప్పులోఁ బడియున్నారు" అనివారు తమ ప్రజలకుఁ దెలిపిరి."

స్వర్గమర్త్యములనుసృష్టించి యాసృష్టిచే నలసిపోకయున్న దేవుఁడు మృతులకు చైతన్యముఁ గలుగఁజేయఁగలఁడని వారికిఁ దెలియదా? అవును. ఆతఁ డన్నిటికిని శక్తుఁడే!

అవిశ్వాసుల నగ్నిముందర పెట్టఁగలదినముః వచ్చుచున్నది.

"సత్యముగానిది యదియేకదా. అవును. దేవుని యాననదియే" అనివారందురు. "అయినను మీరు నమ్మనందుకు శిక్షను రుచిచూడుఁడు" అని యాతఁడనెను.

కావున నీవును స్థిరభక్తులగు నీపూర్వులవలెనే సహించి యుండుము. వారిశిక్షను వేగముగ రాఁజేయకుము. వారికి వచ్చునని చెప్పఁబడినది వచ్చినయాదినమున వారికి దినములోనొకగంటమాత్రమే వేచియున్న ట్లుండును. ఇఁక చాలును! ఉల్లంఘనాపరులు తప్ప నితరులు నాశనముఁ గాంతురా?

---

# సురా-47 మహమ్మదు.

మదీనా-38 పద్యములు-4 రుక్కులు.

## అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

తామునమ్మక యితరులను దేవునిమార్గమునఁ బోనీయనివారి పనులను దేవుఁడు జరుగనీయఁడు.

కాని విశ్వసించి, సరియైనపనులను జేసి, వారిప్రభువుపంపిన సత్యమును మహమ్మదున కంపఁబడినదానిని నమ్మినవారి పాపముల హరించి, యాతఁడు వారిహృదయములను సరి చేయును.

అవిశ్వాసులు డాంబికులగుటచేతను నమ్మినవారు తమప్రభువు నుండివచ్చిన సత్యమును నమ్ముటచేతను నిట్లుజరుగును. దేవుఁ డిట్లే మనుష్యులకుఁ దన యుపమానములను దెలుపుచుండును.

నీవు విశ్వాసులతోఁ బోరాడుచు వారిలోఁ జాలమందిని చంపి, మిగిలినవారికి గట్టిగ సంకెళ్ళు తగిలించుము. పిదప యుద్ధ భారము తీరినంతనే వారి నూరకే విడుచుటయో, సొమ్ముతీసికొని విడుచుటయో చేయుము. ఇట్లే చేయువలయును. దేవునికిష్టమైనచో నాతఁడే వారిపైఁ బగదీర్చికొనియుండును. కాని, మీలో నొకరిచే మఱియొకరిని శోధింపించుట యాతని యభిలాష. దేవునికొఱకు పోరాడువారిపనుల నాతఁడు వృథపుచ్చఁడు.

వారి కాతఁడు రక్షణనొసగి వారిహృదయముల సరిచేయును.

వారికి తా నిచ్చెదనని పల్కిన భోగభూమిలోనికి వారిని దీసి కొనిపోవును.

విశ్వాసులారా! మీరు దేవునికి సహాయపడినచో నాతఁడును మీకు సహాయపడి స్థిరత్వమునిచ్చును.

కాని, అవిశ్వాసులు నశింతురుగాక! దేవుఁడు వారికార్యములను వృథచేయఁగలఁడు.

దేవుఁడుపంపినయాజ్ఞకు వారు విముఖులగుటచేత నే యిట్లయ్యెను. వారికార్యములు ఫలరహితములగును.

10 వారు దేశములోఁదిరిగి తమ పూర్వులగతి యేమయ్యెనో చూడలేదా! దేవుఁడు వారిని నాశనముచేసెను. అవిశ్వాసుల కిట్టిగతియే పట్టఁగలదు.

దేవుఁడు విశ్వాసులకు రక్షకుఁ డగుటచేతను, నమ్మినవారికి రక్షకులు లేకుండుటచేతను నిట్లుజరుగును.

## అధ్యాయము-2

విశ్వాసులై క్రియావర్తనులగు వారిని దేవుఁడు తరంగిణులు ప్రవహించు నుద్యానవన తరుచ్ఛాయలక్రిందికిఁ జేర్చును. అవిశ్వాసులు పశువులవలె కడుపునిండ త్రాగి తిని యుందురు. వారి కగ్నియే వాసగృహము.

నిన్ను వెడలఁగొట్టిన పురముకంటె బలవంతమగు నగరములెన్ని యుండలేదు? మేము వానిని నాశనముచేసితిమి. వాని కెవ్వరును సహాయపడఁజాలరైరి.

దేవుని స్పష్టమగుబోధ ననుసరించువాఁడు, తమ చెడుగే మంచిగాఁ గనఁబడఁ జేయఁబడినవారివలెను, తమకామేచ్ఛల ననుసరించువారివలెను నుండునా?

దైవభీతిపరులకు వాగ్దత్తము చేయఁబడిన భోగభూమిచిత్రపట మిదిగో! అచ్చట నకలుషజలపూరితములగు నదులును, రుచిమెన్నడును

చెడని క్షీరతరంగిణులును, త్రాగినవారి కతిరుచికరమగు ద్రాక్షరసస్రవంతులును గలవు. అచట స్వచ్ఛములగు మధుప్రవాహము లుండును. వారి కందు తమప్రభు వనుగ్రహించిన సర్వవిధములగు ఫలములును నుండును. ఈస్థితి యెల్లప్పుడును నగ్నిలో వసింపవలసి, తమకడుపును చీల్చివేయు నుడుకునీరు గొంతుక దిగఁద్రావఁగలవారి స్థితివంటిదా?

వారిలోఁగొందఱు నీమాట విందురుగాని, నిన్నువీడినతోడనే జ్ఞానము ప్రసాదింపఁబడినవారిని పరిహసించుచు "వీఁడేమిచెప్పినాఁడు?" అందురు. తమహృదయములు ముద్రవేయఁబడియుండ, తనుకామేచ్ఛలకే లోనయినవారు వీరే.

కాని, రక్షణనొందినవారి నాతఁడు మఱింత రక్షించి దేనికిభయ పడవలయునో బోధించును.

అగంట యకస్మాత్తుగా నెప్పుడు ప్రేమోగునోయనికదా యవిశ్వాసులువేచియున్నారు. దానిసూచన లప్పుడేవచ్చినవి. అదివారి నెదుర్కొనినపిదప వారి కెవ్వరు భయసూచన నీయఁగలరు?

కావున దేవుఁడుగాక యితరదైవము లేఁడని తెలిసికొనుము. నీపాపమునకును, విశ్వాసులగు స్త్రీ పురుషులకొఱకును క్షమాపణ వేఁడుము. మీరు తొందఱగా నెట్లుసంచరించుచున్నారో, తుదకెచట విశ్రాంతినొందెదరోకూడ దేవునికిఁదెలియును.

## అధ్యాయము-3.

20 విశ్వాసులు "ఆహా! మాకొక సురా పంపఁబడినచో నెంత బాగుండును" అందురు కాని, దాఁటరాని సురాయొకటి యుద్ధమునకుఁ బురికొల్పునది తెలుపఁబడినచో హృదయదౌర్బల్యముగలవారు మృత్యుచ్ఛాయ పడిన వారివలె మొగములఁ బెట్టుకొని కనఁబడుదురు! వారు నమ్రులై, క్రమభాషులైయుండుటయే మేలు,

వారికి యుద్ధముచేయవలయునని యాజ్ఞయైనప్పుడు వారు దేవుని నమ్మియుండినచో వారికిఁ గడు శ్రేయస్కరము.

మీరు సిద్ధముగ లేరా? అతనికి వెనుదిప్పెదరా? రక్తబంధముల నతిక్రమించి దేశమునం దక్రమముల వ్యాపింపఁ జేసెదరా?

దేవుఁడు శపించి చెవిటివారిని జేసి, కన్నులను గ్రుడ్డిచేసినవారువీరే!

అయినను వారు కురానును ధ్యానింపరేల? వారిహృదయములకు బీగములు వైచిరా?

తమకు రక్షణమార్గము దెలుపఁబడినపిదపఁగూడ పూర్వపుతప్పులనే చేయుచుండువారిని సైతాను తప్పుత్రోవఁబెట్టి, తన దురోబ్ధలఁ జేయును.

దేవుఁడుపంపినదాని సేవగించినవారితో "మీరువిధించినదానిలో నొకభాగమును మే మొప్పుకొందుము" అని వారందురు. కావుననే యిట్లు జరుగును. కాని, వారు రహస్యముగ దాచికొనినదానిని దేవుఁడు తెలిసికొనును.

దేవతలు వారిని జంపుచు మొగముల పైనను, వీఁపుమీఁదను చఱచునపు డెట్లుందురు?

వారు దేవుని కిష్టమైనదాని సేవగించి, యిష్టము లేనిదాని నిచ్ఛగించుటచేతనే యిట్లుజరుగును. కావుననే యాతఁడు వారి కార్యములను ఫలవిరహితములుగఁ జేయును.

## అధ్యాయము-4.

హృదయదౌర్బల్యముగల మీరు దేవుఁడు తన కోపమును వెలిబుచ్చఁడని తలంచుచున్నారా?

మీకిష్టమైనచో, వారిని మీకు జూపించియుందుము. వారి యానవాళ్ళవలన వారిని మీరుతప్పక తెలిసికొనియుందురు. వారివింత మాటలఁబట్టి వారిని దెలిసికొనగలరు. దేవునికి మీ పనులన్నియుఁ దెలియును.

మీలో ధైర్యవంతులెవరో స్థిరచిత్తులెవరో మాకుఁ దెలియు వఱకును మిమ్ము శోధించుచుందుము. మీ ప్రవర్తనగూర్చిన వార్తలను గూడ శోధించెదము.

విశ్వసింపక యితరులను దైవమార్గమునుండి తప్పించి "రక్షణ మార్గము" తమకు స్పష్టముగఁ దెలుపఁబడినపిదపఁగూడ ప్రవర్తనుండి విడఁబడినవారు దేవుని కేకీడును జేయఁజాలరు. వారిపనులనన్నిటి నాతఁడు వృథపుచ్చును.

విశ్వాసులారా! దేవుని నతనిప్రవక్తను మన్నింపుఁడు. మీ కార్యముల నిష్ఫలములఁ జేసికొనకుఁడు.

నమ్మనివారును, ఇతరులను దైవమార్గము నుండి తప్పించు వారును, అవిశ్వాసులుగానుండియే మృతినొందువారును దేవుని క్షమాపణను బడయఁజాలరు.

కావున హృదయదౌర్బల్యము నొందకుఁడు. మీచేయి మీఁదుగా నున్నప్పు డవిశ్వాసులును సంధికిపిలువకుఁడు. దేవుఁడుమీతోనున్నాఁడు. మీపనులకు రావలసిన లాభము, నన్యాయముగా మిమ్మునుండి యాతఁ డపహరింపఁడు.

ఇహలోకజీవనము నిశ్చయముగా నొకయాట, ఒకవినోదము. కాని, మీరునమ్మినచో దేవునికి భయపడుఁడు. అతఁడు మీబహు మానములను మీకిచ్చును; మీధనమునంతయు నాతఁడుకోరఁడు.

అతఁడు మీధనమునడిగి యొందరపెట్టినచో మీరులోభము చూపుదురు. మీగొణుగులన్నియు బైటపెట్టఁబడును.

ఇదిగో! దేవునికొఱకు ధనమునువినియోగింపుఁడని హెచ్చరింపఁ బడినవారుమీరే. కాని, మీలోఁగొందఱు లోభులు. లోభి తననష్టము కొఱకే లోభముచూపును. దేవుఁడు ధనవంతుఁడు; మీరు నిర్భాగ్యులకు. మీరు వెనుదిరిగినచో నాతఁడు మిమ్ముఁ బోఁద్రోలి మీస్థానమున నితరులనునిలుపును. వారు మిమ్ముఁబోలియుండరు.

# సురా-48-విజయము.

మదీనా-29 పద్యములు-4 రుక్కూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

## అధ్యాయము-1.

నిశ్చయముగా మీకు మేము స్పష్టవిజయము నొసగితిమి.

ఇంతకుఁ బూర్వము నీకారోపింపఁబడినట్టియు, నింకను మిగిలియున్నట్టియు దోషముల నంతరింపఁజేసి దేవుఁడు నీపై సంపూర్ణప్రసాదమును జూపి నిన్ను క్రమపథమున నడిపించుటకును,

ఆతఁడు నీకు గొప్పసహాయము చేయుటకును నిట్టిజయమునిచ్చియున్నాఁడు.

తమ విశ్వాస మభివృద్ధినొందుటకై విశ్వాసులహృదయములందు శాంతిని నెలకొల్పినవాఁ డాతఁడే. స్వర్గమర్త్యములయందలి సైన్యములన్నియు దేవునివే. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

విశ్వాసులను, విశ్వాసినులను తరంగిణులు ప్రవహించు నుద్యానవనములయందు వసింపఁజేసి, వారిదోషములను దేవుఁడు పరిహరించును. ఇదియే దేవుఁడు చేయు గొప్పపని!

కపటులగు పురుషులను, స్త్రీలను, బహుదైవారాధకులగు స్త్రీపురుషులను, తన్నుగూర్చి దుష్టాలోచనలుగలవారిని నాతఁడు శిక్షించును. వారిదౌష్ట్యమే వారిమీఁదికే తిరుగును. దేవుఁడు వారిపైఁ గోపించి, వారినిశపించి, వారికి కష్టసంకులమగు నరకమును సిద్ధముచేసియున్నాఁడు.

స్వర్గమర్త్యములందలి సైన్యములన్నియు దేవునివే. దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధుఁడు.

నిశ్చయముగా మేము నిన్నొక సాక్షిగను, సువార్తాహరునిగను, భయసూచన నిచ్చువానిగను బంపియున్నాము.

మీరల్లాయందును నాతని ప్రవక్తయందును నమ్మకముగలిగి యాతనికి సహాయపడి, యాతనిని గౌరవింపవలయును. మీరు దేవుని మహిమను సాయంప్రాతలయందు కొనియాడుచుండవలయును.

10 నిన్ననుసరించెదమని ప్రమాణముచేయువారు దేవునిననుసరించెదమనికూడ ప్రమాణముచేయువారే. అల్లాచేయి వారిచేతులకు మీఁదుగనేయుండును. కావున, విశ్వాసమును వీడినవాఁడు తన యాత్మకు కీడు చేసికొనుటకే యట్లు చేయును. దేవునితో తాను చేసికొనిన యొడంబడికను చెల్లించువాని కాతఁడు గొప్పబహుమానము నీయగలఁడు.

## అధ్యాయము 2.

11 ఎడారిలో నివసించువారిలో వెనుక నుండిపోయినవారు నీతో, "మేము మా యాస్తులతోను సంసారములతోను తీరికలేకయున్నాము. కావున, మాకొఱకు క్షమాపణవేఁడుము" అనియందురు. తమహృదయములలో లేనిదానిని వారుతమనాలుకలతో నుచ్చరించుచుందురు. వారితో "దేవుఁడు మీకు కీడుగాని, మేలుగాని చేయనెంచినచో నాతని నెవ్వరడ్డుపెట్టఁగలరు? మీరుచేయునది అల్లాకు తెలిసియే యున్నది.

ప్రవక్తయు, విశ్వాసులును దమగృహములకు తిరిగిరారనియే కదా మీరు తలంచితిరి? ఈయూహ మీకు బాగుగఁ గనఁబడినది. మీ తలంపు దుష్టమైనది. మీరు తప్పక నశింపఁగలరు!

అల్లాయందును నాతని ప్రవక్తయందును నమ్మకములేనివారికొఱకు ప్రజ్వలించుచుండు నగ్నిని సిద్ధముచేసియున్నాము.

స్వర్గమర్త్యములపై నాధిపత్యము దేవునిదే. అతఁడు తనయిష్టము వచ్చినవారిని శిక్షించును. అతఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు" అనుము.

మీరు రాజ్యములనుసంపాదింప బయలుదేరినప్పుడు వెనుక నుండిపోయినవారు, "మమ్ము మీతో రానిం" డని యందురు. వారు దేవుని మాటను తార్మారు చేయనెంతురు. "మీరు మాతో నెంత మాత్రము రాఁగూడదు. పూర్వము దేవుఁ డిట్లే విధించియుండెను" అని వారితోఁబల్కుము. కాని, వారు, "మీరు మమ్ము చూచి యోర్వలేకున్నారు" అనియందురు. అయినను వారి కించుకంతయుఁ దెలియదు.

ఎడారియందు నివసించువారిలో వెనుకనుండిపోయినవారితో "మీరు శీఘ్రముగనే యతిబలవంతులతో పోరాడుటకు పిలువఁబడుదురు. వారు మీకు వశు లగువఱకును మీరు పోరాడవలసియుండును. అప్పుడు మీరు దేవునిమాటను మన్నించినచో నాతఁడు మీకు మంచిబహుమాన మీయఁగలఁడు. పూర్వమువలె మీరు వెనుద్రిప్పినచో మి మ్మతికఠినముగ శిక్షించును

గ్రుడ్డివారును, కుంటివారును, రోగులును యుద్ధమునకు వెడలకుండుట తప్పుకాదు. అల్లాను, ఆతని ప్రవక్తను మన్నించువారి కాతఁడు తరంగిణులు ప్రవహించు నుద్యానవనములందుఁ బ్రవేశింపఁజేయును వెనుదిరిగినవాని నతికఠినముగ శిక్షించును.

## అధ్యాయము 3.

చెట్టుక్రింద నున్నప్పుడు విశ్వాసులు నిన్ననుసరింతుమని ప్రమాణముచేయుటఁజూచి అల్లా మిక్కిలియు సంతోషించెను. వారిహృదయములలోనున్నది యాతఁడు తెలిసికొనుటచే వారికి శాంతినికల్పించి యాసన్నమగుచుండిన జయమును,

వారికి కలుగఁగనున్న లాభములను ప్రసాదించెను. దేవుఁడు శక్తిమంతుఁడు, బుద్ధుఁడు.

20 మీకు దేవుఁడు చాలబహుమానములను వాగ్దానముచేసి, ఈవిజయమును శీఘ్రముగఁగలుగఁజేసి, యితరులు మీకుహానికలుగఁజేయకుండఁజూచి, విశ్వాసుల కిది యొకసూచన యగునట్లుచేసి, మిమ్ము క్రమమార్గమున నడిపించియున్నాఁడు.

మీరు సంపాదించలేని యితర లాభములను గూడ నాతఁడు మీ కొసగియున్నాఁడు. అతని కన్నివస్తువులపైనను శక్తికలదుగదా.

అవిశ్వాసులు మీపక్షమునఁ బోరాడినను, వారుతప్పక నెను చూపుదురు. వారి కప్పుడు రక్షకుఁడుగాని, సహాయకుఁడుగాని యుండఁబోఁడు.

దేవుఁడు పూర్వ మిట్లే చేసియున్నాఁడు. ఇఁకముందును నాతఁడిట్లే చేయఁగలఁడు.

మక్కా లోయలో మీకువారిపై జయము నేకూర్చి, మీరువారికిని, వారుమీకును హానిచేసికొనకుండఁజేసినవాఁ డాతఁడే. మీరుచేయున దంతయు దేవుఁడు చూచుచునేయున్నాఁడు.

పవిత్రమగు మసీదునుండి మిమ్ముమరల్చి, మీకానుక లచటికి చేరకుండఁజేసినవారు వారే. మీకు తెలియక విశ్వాసులను విశ్వాసినులను చంపియుందురు. దానికై దేవుఁడు మిమ్ము కరుణింపఁగలఁడు. ఆతఁడు తన యిచ్ఛవచ్చినవారిని దయఁజూచును. అవిశ్వాసు లొకరినుండి యొక రెంతదూరముగానున్నను వారిని మే మతికఠినముగ శిక్షించియుందుము.

అవిశ్వాసు లజ్ఞానముచే మీపై నసూయఁగలిగియుండిరి. కాని, దేవుఁడు తనప్రవక్తకును విశ్వాసులకును శాంతినిచ్చి, దుర్మార్గమునుండి యెడగలుగ నుంచెను. వారందు కర్హులై యుండిరి. దేవునికి సర్వమును దెలియును.

## అధ్యాయము—4.

నిశ్చయముగా, దేవుఁడు తన ప్రవర్తకు సత్యముతోఁ గూడిన గ్రంథము నొసగియున్నాఁడు. కొందఱు తలలు ముండనము చేయించుకొనియు, కొందఱు జుట్టుక త్తిరించుకొనియు, మీరు పవిత్ర మగు మసీదులోనికి సురక్షితముగఁ బోఁగలరు. మీ కెట్టిభయమును నుండఁబోదు. మీకు తెలియనిది దేవునికి తెలియును. అందుచేతనే మీకు విజయము చేరువయగునట్లాతఁడు చేసియున్నాఁడు

రక్షణతోడను, సత్యముతోడను తనప్రవక్తనుబంపి, తక్కిన మతములన్నిటికంటె నది యత్యుత్తమమగునట్లు చేసినవాఁ డాతఁడే. దేవుఁడే సాక్షి కాఁగలఁడు

ముహమ్మదు దేవునిప్రవక్త. ఈ ప్రవక్త ననుసరించువారు విశ్వాసులై దృఢహృదయముఁ గలిగియుందురు. వారు తమలోఁ దాము కరుణాపథమునవర్తింతురు. వారు దేవునికి నమస్కరించి సాష్టాంగపడి, యాతని యనుగ్రహమును దయను వేఁడుచుండుటను నీవు చూడఁగలవు. సాష్టాంగపడుటవలన వారికిఁ గలిగిన గుఱుతులును వారిముఖములపై నీకుఁ గానవచ్చును. బీజము మొలకయెత్తి, బలపడి, అంతకంతకును మొక్క బాగుగ నిలువఁబడఁగలిగినట్లే వీరి భక్తిబీజము కూడవృద్ధినొందును. దీనినిజూచి యవిశ్వాసులు కంటగించుకొందురు. విశ్వసించి, క్రమవర్తనులగువారికి దేవుఁడు తన క్షమాపణను, గొప్ప బహుమానమును వాగ్దానము చేసియున్నాఁడు.

---

# సురా--49 గదులు.

మదీనా-18 పద్యములు-2 రుక్కులు.

## అధ్యాయము. 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

విశ్వాసులారా! దేవుఁడును, నతని ప్రవక్తయు మీ కనుజ్ఞ నీయనిదే యేపనికిఁ బూనుకొనకుఁడు. దేవుఁడు శ్రోత, జ్ఞాని; ఆతనికి భయపడుఁడు.

మీ ప్రవక్తకంటె నుచ్చైస్స్వరముతో మాట్లాడకుఁడు. మీలో మీరు గట్టిగా మాట్లాడుకొనినట్లుఁగూడ నాతనితో మాట్లాడకుఁడు. అట్లు చేసినచో మీకుఁ దెలియకుండ మీ కార్యములు నిష్ఫలము లగును.

దేవుని ప్రవక్తముందు నింపాదిగ మాట్లాడువారి హృదయములను దేవుఁడు భక్తిపరములుగఁ జేయును. వారికి క్షమాపణయు గొప్ప బహుమానమును గలుగును.

నీవు నీ గదులలో నున్నప్పుడు నిన్ను బిలుచువారికి నిన్నెట్లు మన్నించవలెనో సరిగఁ దెలియదు.

కాని, నీవు పైకివచ్చువఱకును, వారు వేచియున్నచో వారికి శ్రేయస్సు కలుగును.

విశ్వాసులారా! దుష్టుఁడెవఁడైనను మీకు వార్త దెచ్చినచో వారికి దానిని దెలిపివేయుఁడు. అట్లు చేయనిచో మీ యజ్ఞానమువలన వారికి హానికలుగును; అందుచే త్వరలో మీరు పశ్చాత్తాపము నొంద వలసియుండును.

మీలో దేవునిప్రవక్త యొకఁడున్నాఁడని తెలిసికొనుఁడు. అతఁడు మీవిషయములలో నన్ని యెడల మీకు లొంగిపోయిన యెడల మీరు తప్పక నిందార్హులగుదురు. కాని, దేవుఁడు మీకు భక్తిని ప్రియకరముగఁ జేసి, దానిని మీహృదయములందు నెలకొల్పి, అవిశ్వాసము, దౌష్ట్యము, తిరుగుబాటుతనము, వీనిని మీ కిష్టములేనివానినిగాఁ జేసినాఁడు. క్రమవర్తను లిట్టివారే.

ఇదియంతయు దేవునిప్రసాదము. అతనిదయ. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

విశ్వాసులే తమలోఁదాము పోరాడిరేని వారికి సంధిగూర్పుము; వారిలో నొకరు రెండవవారికిఁ గీడుచేసినచో వారు దేవునిబోధనలఁ దిరిగి చేకొనువఱకును, కీడుచేసినవారిపై యుద్ధముచేయుము. వారట్లు మఱలిరేని వారికి న్యాయమగు సంధిచేసి నిష్పక్షపాతముగ నుండుము. నిష్పక్షపాతులను దేవుఁడు ప్రేమించును.

10 విశ్వాసులే సోదరులు. కావున సోదరులకు సంధిచేయుము. దేవునిదయ సంపాదించుట కాతనికి భయపడుము.

## అధ్యాయము-2.

విశ్వాసులారా! తమకంటె మంచివారిని జూచి మనుష్యులు కేలిచేసి నవ్వవలదు. స్త్రీలుగూడ తమకంటె మంచివారినిజూచి కేలి చేసి నవ్వఁగూడదు. ఒకరినొక రవమానపఱిచికొనుచు పేర్లు పెట్టుకొనవలదు. భక్తిపరులయినపిదప దుష్టులనిపించుకొనుట తప్పు. దీనిని గూర్చి పశ్చాత్తాపపడనివారే దురాత్ములు.

విశ్వాసులారా! కొన్నిశంకలు నేరములుగావున తఱచుగ శంకించుచుండకుఁడు. పొంచియుండి వినకుఁడు. మీలో నొకరు లేనప్పుడు వాని వెనుక వానిని నిందింపఁగూడదు. మీ రెవ్వరైనఁ జచ్చిన

సోదరునిమాంసముఁ దిన నియ్యకొందురా? తప్పక మీరసహ్యపడుదురుగదా! దేవుఁడు మీవంకఁ దిరుగుటకు సిద్ధముగ నున్నాఁడు. అతఁడు కరుణాళుఁడు. కావున నాతనికి భయపడుఁడు.

జనులారా! మిమ్ము స్త్రీపురుషసంయోగముచేఁ బుట్టించితిమి. మీరొకరినొకరు తెలిసికొనుటకు మిమ్ము జాత్యుపజాతులుగా విభజించితిమి. దేవునికి భయపడినవాఁడే సత్యముగా నాతనియెదుట గౌరవార్హులలో శ్రేష్ఠుఁడు. దేవుఁడు జ్ఞాని. మీపనులన్నియు నతనికి దెలియును.

ఎడారిలోని యరబ్బులు "మేము నమ్మితి" మందురు! "మీరు నమ్మలేదు. భక్తిని నటించుచున్నామనిమాత్రి మనుఁడు. భక్తి మీ హృదయములఁ కింకను నెక్కలేదు. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు. మీరు దేవుని, నతనిప్రవక్తను మన్నించినచో, నాతఁడు మీపనులను వృథచేయఁడు" అనుము.

దేవునియందును, నతని ప్రవక్తయందును నమ్మకము గలిగి, పిదప సందేహింపక, తనుదేహములను ధనమును, దేవునికొఱకై విని యోగించువారే సత్యమగు భక్తులు, వీరే నిష్కపటులు.

"స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవునికిఁ దెలిసియుండఁగా నాతనికి మీమతమును బోధించెదరా? సత్యముగా దేవుఁడు సర్వజ్ఞుఁడు" అనుము.

నీవు భక్తిపరుఁడ వైతివని వారు నిన్ను నిందింతురు. "నేను భక్తుఁడ నైతినని నన్ను గేలిసేయకుఁడు. మిమ్ము భక్తిలోనికిఁ దీసికొనివచ్చితినిగదాయని దేవుఁడేమిమ్ము గేలిసేయఁగలఁడు. మీరునిష్కపటులైనచో దీని నొప్పుకొనుఁడు" అనుము.

సత్యముగా స్వర్గమర్త్యములందలి రహస్యములన్నియు దేవునికిఁ దెలియును. మీరు చేయుదానిని దేవుఁడు చూచుచున్నాఁడు.

---

# సురా 50-కాఫ్.

మక్కా-45 పద్యములు-3 రుకూ్కలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

అధ్యాయము 1.

కాఫ్. మహిమాత్మకమగు ఖురానునాన !

వారిలో నొకఁడే భయసూచనలఁ దెచ్చుట యేమని వా రాశ్చర్యపడుచున్నారు. అవిశ్వాసకులు "ఇది కేవల మద్భుతకార్యము.

ఏమి, చచ్చి మన్నయినపిదప తిరిగిబ్రతుకుటయా ? అట్లుబ్రదుకు టెంతయో కాలమునకా ?" యనియందురు.

భూమి వారిలో నెవరినిమ్రింగివేయునో మాకు తెలియును. లెక్కలువేయు పుస్తక మొకటి మాయొద్దనున్నది.

కాని, వారికి తెలిసిన సత్యము నసత్యమని వారుభావించిరి. కావున వారిస్థితి యగమ్యగోచరముగానున్నది.

వారు తమపైనున్న స్వర్గమునుజూచి, దానినెట్లులేవనెత్తి యలంకరించి నిష్కళంకముగ నొనర్చితిమో తలంపరేల ?

భూమినో, దానిని విస్తరింపఁజేసి, దానిపై పర్వతములనుంచి, దేవునిఁ జూడ నభిలషించు ప్రతికింకరునకును బుద్ధివచ్చుకొఱకును జ్ఞానముకొఱకును,

దానిపై ననేకవిధములగు చక్కని మొలకలు లేవఁజేసితిమి.

స్వర్గమునుండి దాని యాశీర్వచనములతోఁగూడ మనుష్యుని పోషణార్థమై వర్షమునుపంపి, దానిమూలమున తోఁటలను, ధాన్యమును,

10 శాఖాఫలభరితములగు ఖర్జూరతరువులను, పుట్టించితిమి.

ఇందుమూలమున చచ్చియున్న దేశమును పునర్జీవిత మగునట్లు చేయుదుము. రక్షణమును నిట్లే కలుగఁగలదు.

ఈమక్కా-వాసులకుఁ బూర్వము నుహు, రాసు, సామూదు, జను లిట్లే ప్రవక్త లసత్యవాదులని యపవాదము లాడియుండిరి.

ఆదు, ఫిరౌను, లూటు అనువారు అన్నదమ్ములు. అరణ్య వాసులు.

అందఱును ప్రవక్తల కసత్యదోషమును కట్టపెట్టిరి. కావుననే, న్యాయముగ శిక్షలు విధింపఁబడినవి.

మాకింకను మొదటిసృష్టితోడనే తృప్తికాలేదుగదా ! క్రొత్త సృష్టిఁగూర్చి వారికింకను సందేహమేల ?

## అధ్యాయము-2.

మేము మనుష్యునిసృజించితిమి. అతని యాత్మ యాతనికేమి చెప్పుచున్నదో మాకు తెలియును. అతని మెడలోని రక్తనాళముకంటె మేమాతనికి దగ్గఱగనున్నాము.

ఇద్దఱుదేవతలును, నొకరుకుడివైపునను నొకరెడమవైపునను కూర్చుండి మనుష్యుల కృత్యములను లెక్క-వేయుచున్నప్పుడు,

అతనినోట నొకమాటయునురాదు. కాని, యాతనివెంబడించుచు నొకఁడు సర్వమును వ్రాయుచునే యుండును.

నిశ్చయముగా మృత్యువాసన్నమగుచున్నదను జ్ఞాన మాతనికిఁ గలుగును. " దీనినుండియే నీవు తొలఁగియుంటివి. "

అప్పుడు బూరాపై మ్రోఁతవినఁబడును. అదియే ప్రళయదినము వచ్చినదనుటకు చిహ్నము.

20 అప్పు డాత్మలన్నియు నొకదేవత తమ్ము గెంటుకొనుచు వచ్చుచుండ, మఱియొకదేవత తమకృత్యముల లెక్క-వేయుచుండ నచటికి రాఁగలవు.

ఒక దేవత "ఈదినమును నీవుపేక్షించియుంటివి. కాని నిన్ను గప్పియున్న ముసుఁగును మేము తొలఁగించితిమి. ఇపుడు నీదృష్టి నిర్మలమగుచున్నది" అనియాతనితో ననును.

రెండవపక్కనతనికిఁ గట్టఁబడియున్న సైతా నాతనితో "నీకెదురుగా సాక్ష్యమిచ్చుటకు నేను సంసిద్ధుఁడనై యున్నా"నను.

దేవుఁడు, "మీరిద్దఱును అవిశ్వాసకులను, లొంగనివారిని,
సత్పథనిరోధకులను, దుష్పథవర్తులను, సంశయాత్ములను,
ప్రత్యేకదైవముల లేవనెత్తువారినందఱను నరకమునఁ ద్రోసివేయుఁడు. వారిని కఠినబాధల పాలుసేయుఁడు" అనును.

అతనిప్రక్కనున్నవాఁడు "ప్రభువా! నేనాతనిని తప్పుత్రోవకు లాగలేదు. అతఁడే సత్యమునకు దూరమగుమార్గమున నడిచినాఁడు" అనును.

దేవుఁడు "నాయెదుట వాదులాడకుఁడు. నేను మీకు మున్ముందుగనే భయసూచనల నిచ్చియున్నాను.

నాశిక్ష తప్పఁబోదు. మనుష్యునియెడ మే మన్యాయముగాఁ బ్రవర్తింపము" అనును.

అధ్యాయము-3.

ఆదినమున మేము నరకము నుద్దేశించి "నీవునిండిపోయితివా" యని యడుగ నది "మఱిలేరా" యనియడుగును.

30 అచటి కనతిదూరముననే, స్వర్గము భక్తుల సాన్నిధ్యమునకు తేఁబడును.

పశ్చాత్తప్తుఁడై దేవుని శరణుచొచ్చి యాతనిధర్మముల ననుసరించినవానికిని,

కరుణాలవాలుఁడగు దేవునికి రహస్యముగ భయపడి సంతప్తహృదయుఁడై యాతనిదరిఁ జేరినవానికిని, మేము వాగ్దత్తముచేసిన దిదియే.

సుఖముగా దీనియందుఁ బ్రవేశింపుఁడు. ఇదియే శాశ్వతదినము.

అచట వారు కోరినదెల్లఁ బడయఁగలరు. మేము వారియానందమును వృద్ధినొందింతుము.

ఈమక్కా-వాసులకంటె బలవత్తరులగు నెందఱను వీరికిఁ బూర్వము మేము నాశనము నొందింపలేదు! కావున దేశమంతయు వెదకి, తప్పుకొన దారియున్నదేమో కనుఁగొనుఁడు.

హృదయమునన దొకటియుండి,చెవితో విని, కన్నులతోఁ జూచువాని కిదియే భయసూచన.

భూస్వర్గములను, తదంతరాళమును, సర్వమును నాఱుదినములలో సృష్టించితిమి. మా కలసట కలుగలేదు.

కావున వారు చెప్పినదానిని చెవినిబెట్టి సూర్యోదయాస్తమయములకు పూర్వము నీప్రభువును స్తుతింపుము.

రాత్రియును బ్రార్థించి యనంతరము రెండు సాష్టాంగనమస్కారముల నొనరింపుము.

40 ఆదినమున నొకఁ డందఱకును దగ్గఱగనే యుండి కేకవైచును. ఆ కేకకొఱకుఁ బ్రతీక్షించుచుందుము.

ఆ కేక వారికి వినఁబడినదినమే నిజముగా వారు తమసమాధులనుండి లేవవలసినదినము.

నిజముగా మేము పుట్టింపను గిట్టింపను సమర్థులము. సర్వమును తుదకు మమ్మే చేరవలయును.

మృతులపై భూమి రెండుగా చీలియున్నదినమున వారినొకచోఁ జేర్చుట మాకుసులభమగును.

అవిశ్వాసకు లేమందురో మాకు బాగుగఁ దెలియును. కనుక వారి నేవిధముననను నిర్బంధపెట్టకుము.

నా కోపమునకు భయపడువారికి కురానును భయసూచనగా చూపింపుము.

# సురా 51-వి ర జ ల్లు ట.

---

మక్కా-60 పద్యములు-3 రుకూలు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

విరజల్లుచుఁ బోవునవియు,

తమభారములను వహించునవియు,

మెలమెల్లగ నడచిపోవునవియు,

ఆజ్ఞ చొప్పున నందందు వర్షించునవియు నగు మేఘములయాన నిశ్చయముగా మీకుఁ జెప్పఁబడిన భయసూచన సత్యమయినది.

అదిగో, శిక్షాదినము వచ్చుచున్నది.

నక్షత్రపథమగు స్వర్గమునాన !

మీరు పల్కుదానియం దొకదానితో నొకటి పొందకున్నది.

కాని, సత్యమునుండి యాతని మరల్చువాఁడు తానే దైవాజ్ఞ వలన దానినుండి మరలఁగలఁడు.

10 అసత్యవాదులు నశింతురుగాక !

వా రగాధమగు నజ్ఞానమున తెన్నుగానకున్నారు.

వారు 'ఈశిక్షాదిన మెప్పు' డని యడుగుచున్నారు.

ఆదినమున వా రగ్నియందు బాధల నొందఁగలరు.

"ఈబాధ యసత్యమని సంకోచించితివి. దాని నిపు డనుభవింపవలయును."

కాని, దైవభీతి గలవా రుపవనములయందు సెలయేళ్ళదరిని వసింతురు.

పూర్వము వారు పుణ్యకార్యములఁ జేసియుండుటచే నిప్పుడు వారికిఁ బ్రభు వనుగ్రహించిన దాని ననుభవింతురు.

వారు రాత్రి యెంతో కాలము నిద్రపోలేదు.

ప్రభాతమున క్షమాపణకొఱకుఁ బ్రార్థించిరి.

అర్థులకును, ననాథులకును, తమధనమునందు గొంతభాగమును వారు వినియోగించిరి.

దృఢభక్తియుతులగు వారి కిహమందు సూచనలు కనఁబడును.

మీ యాత్మలయందు మీకే యాసూచనలు కనఁబడును. అయిన మీరు వానిని చూడరేల ?

స్వర్గమునందు మీకు పోషణ జరుగును. మీకు వాగ్దత్తమైన దచట తప్పక దొరకఁగలదు.

ఇహ పర నాథుఁడగువానియాన నిదియె సత్యమని మీవలె నేనును బ్రమాణము చేయుచున్నాను.

అధ్యాయము-2.

ఇబ్రాహీమునొద్దకువచ్చిన పూజ్యులగు నతిథులకథ మీకు శ్రోత్రగోచరమైనదా ?

వా రాతనియొద్ద కేఁగి "సలామ్" (శాంతిరస్తు) అనునప్పు డాతఁడును "సలామ్", మీరభ్యాగతు" లరని,

గృహమునకేఁగి యొక మదించినదూడను దెచ్చి,

వారిముం దిడి 'మీరు దీనిని భుజింపరా' యని యనెను.

వారినిజూడ నతనికి భీతిగలిగెను. వారాతనితో "భయము వల" దని చెప్పి యాతనికి జ్ఞానియగు సుపుత్త్రుఁడు జనించునని సూచించిరి.

ఆతనిభార్యయు వైళమవచ్చి ముఖమును చేతితోఁ గప్పికొని "అయ్యో! గొడ్రాలను, ముదుసలిని, నాకుఁ బుత్త్రుఁడా" యని యఱువఁజొచ్చెను.

30 వారు "ఇది ప్రభువువచనము. ఆతఁడు బుద్ధుఁడు, సర్వజ్ఞుఁడును గదా" యనిరి.

---

# కాండము. 27

---

ఆతఁడు "దూతలారా! మీసందేశ మే" మని యడిగెను.

వారు "దుష్టజనులయొద్దకు ప్రభువు మమ్ముఁబంపియున్నాఁడు. దౌర్జన్యములు జేసినవారిపై

త్రోయుట కేర్పఱుపఁబడిన మంటిబెడ్డలను వారిపై మేము విసరుదు" మనిరి.

అప్పుడు మేము పురమునందలి భక్తులకొఱకు వెదుకఁగా, ఒకకుటుంబముమాత్ర మట్టిది మాకుఁ గనఁబడెను.

బాధతోఁగూడిన యాశిక్షకు వెఱచువారికొఱ కాగృహమునఁ గొన్నిసూచనల నుంచితిమి.

మూసాకును గొన్నిసూచనల నిచ్చితిమి. అతనికి శక్తినిచ్చి, ఫిరౌనునొద్ద కంపఁగా,

అతఁడు తనసైన్యబలముచే మత్తుఁడయి "చిల్లంగివాఁడా, పిశాచగ్రస్తుఁడా" యని మోసెసును నిందించి మరలిపోయెను.

40 అతఁడు నిందకు పూర్తిగపాల్పడుటచే నతనిని, నాతనిసైన్యము లను గూడ సముద్రమునందు గూలనేసితిమి.

'ఆదు' వారికిని నిట్టిసూచనలనిచ్చితిమి. వారిపైఁ బ్రచండ మారుతమును బ్రయోగింప,

అది తాకినదంతయు ధూళియగుచువచ్చెను.

సామూదువారికిని నట్టిభయసూచనలఁ గల్పించితిమి. వారితో "మఱికొంతకాలము సుఖ మనుభవింపుఁ" డని పల్కఁగా

ప్రభునియాజ్ఞను తిరస్కరించిరికావున, చూచుచుండఁగనే వారు ఝంఝామారుతముచే నాశనమునొందిరి.

వారు తిన్నగా నిలువఁబడుటకును, తమకుఁదాము సహాయము చేసికొనుటకును శక్తులు కాకపోయిరి.

వీరికిఁ బూర్వము భక్తిహీనులగు 'నుహూ' ప్రజలను నాశనము చేసితిమి.

అధ్యాయము-3.

స్వర్గమును మాచేతులతో నిర్మించి విశాలమగునట్లు చేసితిమి.

భూమిని తివాచీవలె పఱచి యతిస్నిగ్ధముగఁ జేసితిమి.

ప్రతివస్తువును జతలుజతలుగా నిర్మించితిమి. దీనినిగూర్చి మీరు యోచించుకొందురుగాక !

50 కావున, దేవునియొద్దకు పరుగునఁ బొండు. మీకు భయసూచనను స్పష్టముగఁ దెలుపుటకు మీయొద్దకు వచ్చియున్నాను.

దేవునితోఁబాటు నితరదైవమును జేర్పకుఁడు. మీకు స్పష్టసూచన నిచ్చుటకే యాతఁడు నన్ను బంపియున్నాఁడు.

ఇట్టిసూచనల నిచ్చుటకై పూర్వమువచ్చిన ప్రవక్తలనందఱను వారు "చిల్లంగివారు, పిశాచగ్రస్తులు" అని యనుచుండిరి.

ఈయుపవాదము వారియందు తరతరములనుండి వచ్చుచున్నదా యేమి? అవును, వారు తిరస్కారస్వభావులే.

అందుచే వారినుండి మరలినచో నీ కేయుపవాదమును గలుగదు.

కావున వారికి భయమును సూచింపుము.

భూతములును, మనుష్యులును, నన్ను పూజింపవలయుననియే వానిని సృజించితిని.

వారునన్ను పోషింపనక్కరలేదు. వారిని నాయాకలితీర్పుమన లేదు.

నిశ్చయముగా ప్రభువొక్కఁడే పోషకుఁడు, సర్వశక్తుఁడు, అచలుఁడు !

కావుననీకు హాని చేయువారికి పూర్వపువారిగతియే పట్టును. అట్టి దుర్గతిని నావలన పొందుటకు త్వరపడకుందురుగాక!

60 భక్తిహీనుల కాభయంకరదినమున దుఃఖముకలుగఁబోవుచున్నది.

## సురా 52-పర్వతము.

మక్కా-49 పద్యములు 2 రుకూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

### అధ్యాయము-1.

పర్వతమును

పఱచియుంచిన తెరపై

వ్రాయఁబడిన గ్రంథమునాన

తఱచుగ దర్శింపఁబడు పవిత్రాలయమూన,

ఉన్నతమగు నాకాశమునాన,

ఉప్పొంగిన సముద్రమునాన,

నిశ్చయముగా నీప్రభువునుండి శిక్ష యాసన్నమగుచున్నది.

దాని నెవ్వరును మఱల్పలేరు

ఆదినమున స్వర్గ మల్లే దిద్దిరం దిరుగుచుండును.

10 పర్వతము లల్లే గజగజ కంపించుచుండును.

ఆదినమున ప్రవక్త లసత్యవాదులని నిందించి,

వేడుకకొఱకు వృథావాదములలోనికి దిగినవారికి దుఃఖమే సంప్రాప్తమగును.

ఆదినమున వారి నకస్మాత్తుగా నరకాగ్నియందుc గూలcద్రోయుదురు.

" ఈయగ్నినే మీ రసత్య మని పల్కితిరి.

ఏమి, యిది యింద్రజాలమా? మీకిది కనcబడదా?

అందు దగ్ధులరుకండు. మీరు దానిని సహించినను సహింపలేకున్నను నొక్కటే. మీకృత్యములకు తగినఫలములను మీ రనుభవించియే తీరవలయును."

కాని, దేవునికి భయపడినవారు వనములమధ్యను, ఆనందముల మధ్యను వసించి,

తమప్రభువు తమకొసగినదాని కానందించుచు నరకాగ్నినుండి వారిప్రభు ననుగ్రహముచే విముక్తులగుదురు.

" మీకృత్యములకు ఫలముగా సంతోషము ననుభవింపుcడు."

20 వరుసలు తీర్చియుంచిన శయ్యలపై వారు పరుండcగలరు. విశాలాసితనేత్రలగు కన్యలను వారికి మేము జతచేసెదము.

తమసంతతివారును తమవలె విశ్వసించినచో నాయినవ్వురను మేము తిరిగి కలిపెదము. వారి సుకృతములకుc దగినఫలములను వారి

కొంతయు తగ్గింపము. తన కర్మలకును, తన ఫలములకును, ప్రతి మనుష్యుఁడును దేవునికి బాధ్యత వహించియున్నాఁడు.

ఫలములను, వారుకోరిన మాంసమును, సమృద్ధిగా మేము వారి కీయఁగలము.

వృథావాదజనకమును, పాపహేతువునుగాని ద్రాక్షారసపాత్ర నచటవా రొకరినుండి యొకరికి పంపుకొనుచుందురు

వారిచుట్టు నాణిముత్యములవలె మనోహరులగు యౌవనులు తిరుగుచు,

తమలోఁదాము,

"పూర్వ మొకప్పుడు మనకుటుంబములగతి యేమగునాయని విచారించుచుంటిమి.

కాని, దేవుఁడు మనయెడల కరుణించి, విషయుతమగు బాధ నుండి మనలను రక్షించినాఁడు.

మన మాతనిని పిలుచుటచేతనే దయాదాక్షిణ్యమూర్తియగు నాతఁడు మనయెడల నట్లువర్తించినాఁడు" అనుచుందురు.

అధ్యాయము-2.

కావున నీవుభయసూచన నిమ్ము. నీప్రభువు ననుగ్రహామున నీవు సోదెచెప్పువాఁడవును, పిశాచగ్రస్తుఁడవును గావు.

30 వారు "ఈతఁడుకవియా? ఈతని యదృష్టము మాఱిపోవువఱకును కొంచెమాగుదము" అందురేమో.

వారితో నీవు "సరే, మీరు వేచియుందురా? అట్లే చేయుఁడు. నేనును మీతో వేచియుండెదనులెండు" అనుము.

వారి స్వప్నముల నాధారముచేసికొనియా వారి ట్లనుచున్నారు? లేక, వారు స్వతస్సిద్ధముగా దుర్మార్గులా?

"ఆతఁడు కురానును తానే కల్పించె" నని మీరందురా? లేదు. అది వారు విశ్వసింపకుండుటచేత ననినమాట.

వారు సత్యవంతులైనచో దానికిసరియగు నుపన్యాసమును కనఁబఱుపుఁడని యడుగుము.

వారినిసృజించినవా రెవ్వరును లేరా? లేక తమ్ముఁదామే సృజించి కొనిరా?

భూమిని స్వర్గములను వారే సృజించిరా? లేదు. వారికి నమ్మకము లేదు.

దేవుని ధనరాసులు వారియధీనమం దున్నవా? వారు సర్వాధి కారులా?

దేవతలమాటలు వినుటకు వారియొద్ద నిచ్చెనయున్నదా? వారి మాటలు వినినవాఁ డెవ్వఁడైన నుండెనేని దానికి తగిన సాక్ష్యమును తెమ్మనుము.

దేవునికి కొమార్తెలును, మీకు కొడుకులును గలరా?

40 వారినుండి జీతమడుగుచున్నావా? వారే ఋణభారముచే వంగియున్నారే.

తాము వ్రాసిపెట్టి యుంచఁగలయంత రహస్యవస్తువులను గూర్చినజ్ఞానము వారికున్నదా?

వారు నీకు వలలఁగల్పింపఁ గోరుచున్నారా? కాని, నమ్మని వారే వలలయందు తగులుకొందురు.

దేవుఁడుతప్ప మఱియొకదేవుఁడు వారికిఁ గలఁడా? ఆతనితో సమానుఁడనిచెప్పు దేవులకంటె హెచ్చగుదేవుఁడు స్తవనీయుఁడగుఁ గాక!

ఒక స్వర్గఖండము పడిపోవుచున్నట్లు వారికిఁగనఁబడినయెడల వారు, "అదియొక దట్టమయిన మేఘ" మని యందురు.

అందుచేత వారు మూర్ఛాగతులు కాఁగలదినమున కభిముఖులగువఱకును వారిజోలికిఁ బోకుము.

ఆదినమున వారివలలు వారికి పనికిరాకపోవును. వారి కెట్టిసహాయమును దొరకఁబోదు.

నిజముగా దుష్టుల కిదిగాక మఱియొకశిక్షయు కలుగనున్నది. కాని, వారిలోఁ జాలమంది కది తెలియదు.

నీవు మా దృష్టిపథమున నున్నావుకావున నీ ప్రభువు తీర్పువఱకును నోర్పుతో వేచియుండుము.

నీవు లేచునప్పుడును, రాత్రిపూటయు, నీప్రభువు సంకీర్తనమును జేయుము. నక్షత్రము లస్తమించుకాలమున నాతని స్తుతింపుము.

---

# సురా 53–నక్షత్రము.

---

మక్కా–62పద్యములు. 3 రుకూలు.

దయాదాక్షిణ్య మూర్తియగు దేవునిపేర.

అధ్యాయము–1

## అస్తమించు నక్షత్రమాన !

మీ దేశీయుఁడు దారి తొలఁగలేదు. ఆతనిని మేము దారి తప్పింపలేదు.

కేవలము తాత్కాలికోత్సాహముచేత నాతఁడు పలుకలేదు.

కురాను ఆతనికిఁ దెలుపఁబడిన రహస్యము. కాని, మఱియొకటిగాదు.

భయంకర శక్తియుక్తుఁడగు నొకఁడు,

జ్ఞానియగు నతనికి బోధపఱిచినాఁడు. ఇటునటు చలింపక యాతఁడు,

నభమునం దత్యుచ్ఛస్థానమున నిలువఁబడి,

అంతకంతకును దగ్గఱకువచ్చి,

రెండుధనుస్సుల దూరముననో, అంతకంటెదగ్గఱగనో నిలిచి,

తాను వెలిబుచ్చిన రహస్యమును వెలిబుచ్చినాఁడు.

అతఁడు చూచినదాని నతనిహృదయము తప్పని యనలేదు.

ఏమి, ఇంకను నాతఁడు చూచినదానినిగూర్చి మీరువివాదము చేసెదరా?

ఆతఁడాతనిని మఱియొకసారిగూడ,

సీమాంతమగు సీదావృక్షముదరి చూచియున్నాఁడు.

దానికి సమీపముననే విశ్రాంతివన మున్నది.

ఆ సీద్రావృక్షమును కప్పినది దానిని గప్పియున్నప్పుడు,

అతనిదృష్టి తప్పలేదు. చెదరనులేదు.

ఆతఁడు తనప్రభువుచూపిన మహామాహాత్మ్యప్రష్టమగు సూచనను జూచెను.

అల్ లాట్, ఆల్ ఒజ్జాయను విగ్రహములను,

20 వానిప్రక్క మనత్ అను మూఁడవ విగ్రహమునుచూచితివా?

ఏమి, నీకు పురుషసంతానమును, దేవునికి స్త్రీ సంతానమును గలుగవలయునా?

ఇది యన్యాయమగు దాయవిభాగము!

ఇవి కేవలము నామములు. మీరును మీపెద్దలును వాని కట్టి పేళ్ళనిచ్చిరి. వానినిగూర్చి దేవుఁ డేట్టిబుజువును బంపలేదు. వారు తమయిచ్ఛలను తమ యూహలనే యనుసరింతురు. అయినను వారి ప్రభువునుండి వారికి రక్షణ లభించెను.

మనుష్యునకు కోరినదంతయు చేకూరవలెనా?
భూతభవిష్యత్తులు దేవునియధీనమునం దున్నవి.

అధ్యాయము-2

స్వర్గములలో నెందఱో దేవతలున్నను, తాను నియమించి, స్వీకరింతునని యేర్పఱచినవారి మాధ్యస్థ్యము తప్ప,

ఇతర మెద్దియుఁ బనికిరాదు.

నిజముగా రాఁబోవుజన్మమును నమ్మనివారే దేవతలను స్త్రీనామములతో వ్యవహరింతురు.

కాని, యావిషయమై వారికిఁ దెలియదు. వారు తమ యూహానే యనుసరింతురుగాని, యూహ యెన్నటికిని సత్యముకానేరదు.

30 కావున ప్రస్తుతజన్మమునే యపేక్షించి మా భయసూచనను లక్ష్యపెట్టనివారి సాంగత్యమును వదలికొనుము.

వారిజ్ఞానమంతయు నింతయే. నిజముగా నీప్రభువు తనమార్గము నుండి తొలఁగి తప్పుత్రోవఁబడినవారెవరో, రక్షణనొందినవా రెవరో మిక్కిలి బాగుగాఁ దెలిసికొనుచున్నాఁడు.

భూస్వర్గములయందుఁగలదంతయు దేవునిదే. దుష్టులకు వారి వారి కర్మానుగుణముగా ఫలముల నాతఁ డీయఁగలఁడు. మంచికర్మలఁ జేయువారి కాతఁడు మంచివస్తువులనే బహుమానముగా నిచ్చును.

గొప్ప ద్రోహములను, విషయికపాపములను జేయక చిన్న చిన్న తప్పు లొనరించువారియెడల నీ ప్రభు వొకరీతిగాఁ గరుణింపగలఁడు. మిమ్ము భూమినుండి సృజించినప్పుడును, మీరు మీ తల్లుల గర్భములం దున్నప్పుడును గూడ దేవుని మిమ్ముఁగూర్చి తెలియును. కావున మీరు పవిత్రవంతులరని విఱ్ఱవీఁగకుఁడు. అతనికి భయపడువారెవరో యాతనికే బాగుగా నెఱుక.

## అధ్యాయము-3.

ఇచ్చునది స్వల్పమును, ఆశించునది యధికమున్నై వెనుకకు తిరిగినవానినిగూర్చి నీవాలోచించితివా?

ఆతనికి రహస్యవస్తువులఁగూర్చి జ్ఞానముగాని, దృష్టిగాని, యున్నదనుకొందువా?

మూసా గ్రంథములలో నేమున్నదో,

ఇబ్రాహీము తనప్రతిజ్ఞ నెట్లుపాలించెనో యాతనికిఁ జెప్పఁబడలేదా?

మొదలే భారముమోయుచున్న యాత్మ యితరుని భారములనుగూడ మోయఁజాలదనియు,

40 తాను స్వంతముగా ప్రయత్నముచేసి సంపాదించిన కర్మలే పరిగణింపఁబడుననియు,

అతనిప్రయత్నము లన్నియు వాని వాని యాథార్థ్యమునుబట్టి పరీక్షింపఁబడుననియు,

తరువాత నాతనికి హెచ్చుతగ్గులులేక తన కర్మలఁబట్టి ఫలము నిర్ణయింపఁబడుననియు,

అన్ని వస్తువులును తుదకు నీ ప్రభువునందే సంక్రమింపఁగలవనియు, నవ్వించువాఁడును, నేడిపించువాఁడును నాతఁడేయనియు,

పుట్టించువాఁడును, గిట్టించువాఁడును నాతఁడేయనియు,

ఇటునటు చెదరియున్న జీవాణువులనుండి,

పుంస్త్రీయోగములఁ గల్పించినవాఁ డతఁడేయనియుఁ

రెండవసృష్టి నాతఁడే చేయఁగలఁడనియు,

ధనవంతులఁజేసి, యాధనమును నిలుపువాఁ డాతఁడేయనియు,

50 ధ్రువ నక్షత్రమునకు ప్రభు వాతఁడేయనియు,

పూర్వకాలమున ఆదైతు లనువారిని,

సామూదుజనులను, వారికిఁ బూర్వము మిక్కిలి దుష్టులును, దుర్మార్గులును నగు నుహుజనులను,

నాశనముచేసి, యొక్కఁడైన జీవించియుండకుండఁ జేసినవాఁ డాతఁడేయనియు నాతని కెవ్వరును జెప్పియుండలేదా ?

స్వాధీనములైన నగరములను నాశనముచేసినవాఁ డాతఁడే.

అందుచేతనే వానిని గప్పినది వానినిగప్పినది.

ఇట్లుండగా నీప్రభువు సమకూర్చిన మేళ్ళలో దేనిని సంశయించెదవు ?

నీకిప్పుడు భయసూచన నొసగుచున్నవాఁడు పూర్వకాలము నుండియు నట్లుచేయుచువచ్చినవాఁడే.

దగ్గఱకురాఁగలదిన మప్పుడే యాసన్నమైనది. అదియెప్పుడు రాఁగలదో దేవుఁడుతప్ప నితరుఁడు తెలుపలేఁడు.

ఈవాక్కులను వినియా మీ రాశ్చర్యపడెదరు?

60 ఇందుకా మీ రేడ్వక నవ్వుచున్నారు ?

ఇందుకా, లక్ష్యపెట్టకున్నారు?

కావున, దేవునిముందు సాగిలఁబడి యాతని నారాధింపుఁడు.

---

# సురా 54-చంద్రుఁడు.

---

మక్కా-55 పద్యములు-3 రుకూలు.

ఆధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

కాల మాసన్నమైనది, చంద్రబింబము రెండుగా వ్రీలిపోయినది.

కాని, వారాయద్భుతమును చూచినప్పుడెల్ల ప్రక్కకొదిగి "ఆహా! యేమి యింద్రజాలము!" అనియందురు.

ప్రవక్తల నసత్యవాదులని యెంచి వారు తమకామములనే యనుసరింతురు. కాని సర్వమును స్థిరముగా నియమింపఁబడియేయున్నది.

వారి కతిజ్ఞానవంతమగు నిషేధవార్తవచ్చినది.

అయినను భయసూచన నిచ్చువారివలన వారు మేలుచేకొనలేరు.

కావున, వారినివదలిపెట్టుము. ఆదినమునఁ బిలుచువాఁ డొక ఘోరకార్యమునకై పిలుచునప్పుడు,

వారధోదృష్టులై తమసమాధులనుండి, చెదరియున్న మిడుతల వలె బయలు వెడలి,

పిలుచువానియొద్ద కతిత్వరితముగ నేఁగి "ఇదియే దుఃఖదిన" మని యవిశ్వాసకు లనఁగలరు.

వీరికిఁ బూర్వము నుహాప్రజలు సత్యము నసత్యముగాఁ బరిగణించిరి. మాకింకరుఁ డసత్యవాదియని నిందించి, పిశాచగ్రస్తుఁడని యాతనిఁ బరిత్యజించిరి.

10 అప్పుడాతఁడు తనప్రభువుతో "వీరు నిజముగా నన్ను తిరస్కరించుచున్నారు. నాకు సహాయము ర" మ్మనిపలికెను.

అప్పుడు మేము స్వర్గద్వారములను బలముతో తెఱవఁగా నది సంతతధారావృష్టితో దిగి,

భూమిని ప్రీలఁజేయు, నందుండి యనేకములగు మాటలు బయలువెడల, నందలి జలములన్నియు నిర్ణీతరీతిని గలిసిపోయెను.

అప్పుడు మే మాతనిని బల్లలతోను, మేకులతోను నిర్మింపఁబడిన నావలో తీసికొనిపోయితిమి.

అది మాకన్నులయెదుటనే తేలుచు పోఁజొచ్చెను. అవిశ్వాసకుఁడై పరిత్యజింపఁబడినవాని కిది బహుమానముకదా!

దానిని మే మొక భయచిహ్నముగా వదలితిమి గాని, యాసూచ
నను గ్రహింపఁగలవాఁ డెవఁడు ?

నాపగయును నా బెదరింపును గొప్పవిగదా !

సులభముగా భయసూచనను గ్రహించుట కీకురానును రచిం
చితిమి. కాని, యాసూచన నెవఁడు గ్రహింపఁగలఁడు ?

'ఆదైతులు' సత్యము నసత్యమని యెంచిరిగాని, నాపగయును
నా బెదరింపును గొప్పవిగదా !

మే మొకదినమున నతిదుఃఖకరమగు ప్రచండమారుతము
వారిపై నెడ తెగక వీచునట్లు చేసితిమి.

20 అది నిర్మూలితఖర్జూరతరుకాండములనువలె మనుష్యులను
పెల్లగించివై చెను.

నాపగయును బెదరింపును మిక్కిలి గొప్పవికావా ?

భయసూచనను సులభముగా గ్రహించుట కీకురానును రచిం
చితిమి. కాని, యాసూచనను గ్రహింపఁగలవాఁ డెవఁడు ?

అధ్యాయము-౨.

సాముూదుజాతివారు బెదరింపులనన్నిటిని నసత్యములుగా
నెంచిరి.

వారు "ఏమి, మాలోనివాఁడేయగు నొక్కని మే మనుసరింప
వలయునా ? అట్లుచేసినచో తప్పును, తెలివితక్కువతనమునునగును
గదా ?

మాయందఱిలో నాతనికొక్కనికేనా యాభయసూచన తెలి
యఁ జేయుపని నియమింపఁబడినది. అట్లుకాదు. ఆతఁడు మిథ్యాపురు
షుఁడు. గర్విష్ఠి " యనిపల్కిరి.

మిథ్యాపురుషుఁడును గర్విష్ఠియు నెవఁడో ఱేపు తెలియఁగలదు,

" వారిశోధనకొఱకు ఆడుయొంటెను పంపెదము. కాలే, నీవు వారిని గుర్తించుచు నోర్పుతో వేచియుండుము.

వారిజలములు తమకును దానికిని పంచిపెట్టఁబడుననియు, నా జలముల నొకసారి యొంటెయు, నొకసారివారును నొకరితరువాతనొకరుగ త్రాగవలయుననియు, భవిష్యత్తును వారికిఁదెలుపుము.

కాని, వారు తమమిత్రుని బిలువఁగా నాతఁడొక కత్తిఁబట్టి యొంటెను నరకివై చెను.

30 నాపగయు నాబెదరింపును నిశ్చయముగా గొప్పవి!

వారిపై నొక్కసారి చప్పట్లు చఱవఁగనే వారు వంతెనలఁ గట్టుట కుపయోగించు శుష్కకాష్ఠములవలె నైరి.

భయసూచన సులభముగాఁ దెలియుటకై కురానును రచించితిమి. కాని యీసూచనను గ్రహించువారెవరు?

లూటు ప్రజ లాతనిసూచన నసత్యముగాఁ బరిగణించిరి.

మేము లూటుకుటుంబముపైఁదప్ప నందఱిపైనను శిలావర్షము గురియించితిమి.

లూటుకుటుంబము కృతజ్ఞతఁజూపుటంబట్టి, సంధ్యాసమయమున వారి కుపకృతిగా విడుదలచేసితిమి.

మాకాఠిన్యముంగూర్చి యీతఁడు వారికి సూచననిచ్చెను. కాని, వారు దానిని సంశయించిరి.

మే మెట్టిదానిని నమ్మఁగలమని వారనఁగా, మేము వారిని దృష్టిహీనులఁజేసి,

" మాపగను, మాబెదరింపును ననుభవింపుఁ " డని వారితో నంటిమి.

తెల్లవారినంత వారికొక ఘోరశిక్ష ప్రాప్తించెను.

40 భయసూచన సులభముగా బోధపడుటకై మేము కురానును రచించియున్నాముగాని,యీసూచనను గ్రహించువాఁ డెవఁ డున్నాఁడు?

## అధ్యాయము-3.

ఫిరౌనుజనులకుఁగూడ బెదరింపులు వినఁబడెను.

మా యద్భుతకార్యములన్నియు వా రసత్యములుగాఁబరిగణించిరి. కావున బలవంతుఁడును, శక్తిమంతుఁడును నగువాఁ డెట్లు పట్టుకొనునో యట్లే మేమువారిని బట్టుకొంటిమి.

ఓమక్కావాసులారా! మీ యవిశ్వాసకులు వీరికంటె మంచివారా! పవిత్రగ్రంథములలో మీరు వదలిపెట్టఁబడియున్నారా?

"మేము చాలమందియున్నాము. మాలోనొకరికొకరము సహాయముచేసికొందు" మని వారందురా?

వారిసేన యథాయథలై వెన్నుజూపఁగలదు.

కాని యాగంటయే వారు భయపడవలసిన కాలము. ఆగంట మిక్కిలి కఠినమును దుఃఖభాజనమును నగును.

నిజముగా దుష్టులు మార్గ్యమునందును గందరగోళమునందును మగ్నులై యున్నారు.

ఆదినమున వారు తమ ముఖములమీఁదుగా నగ్నిలోనికి లాగికొనిపోఁబడుదురు. "నరకస్పర్శ నాస్వాదింపుఁడు."

ఒక నియతి ప్రకారము సర్వవస్తువులను మేము సృజించియున్నాము.

50 కనురెప్పపాటుకాలములో నుచ్చరింపఁగల యొకటేమాటతో మే మాజ్ఞాపించియున్నాము.

పూర్వకాలమునఁగూడ మీవంటివారిని నాశనముచేసియున్నాము. కాని, యెవ్వఁడైన నాసూచనను గ్రహించెనా?

వారుచేయు ప్రతికార్యమును దైవగ్రంథములలో నిరూపింపఁబడియే యున్నది.

చిన్నదిగాని పెద్దదిగాని, ప్రతికర్మయునందు వ్రాయఁబడియే యున్నది.

నిజముగా వనములయందును, నదీతీరములయందును,

సత్యస్థానమున సర్వశక్తియుక్తుఁడగు చక్రవర్తిమోల భక్తులు వసింపఁగలరు.

---

# సురా 55-కరుణాలవాలుఁడు.

---

మక్కా-78 పద్యములు-3 రుక్కులు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అధ్యాయము-1.

కరుణాలవాలుఁడగు దేవుఁడు కురానునేర్పి,

మనుష్యుని సృజించి,

ఆతనికి స్వచ్ఛమగు వాక్కు ననుగ్రహించినాఁడు.

సూర్యచంద్రులు తమ నియమితకాలమును దప్పరు.

చెట్లును మొక్కలును భక్తితో వంగుచున్నవి.

ఆతఁడుచ్చస్థానమున స్వర్గమును కల్పించి, త్రాసునొకదానిని నిర్మించి,

అందు మీ రుత్పథగాములు కాకుండునట్లు నియమించెను.

కావున, తూచునప్పుడు న్యాయ్యముగాఁ దూచుచు, తప్పుత్రాసు నుపయోగింపకుము.

సజీవజాతులకొఱకీభూమి నాతఁడు కల్పించెను.

10 అందు పండ్లును, ఫలగుచ్ఛయుతములగు ఖర్జూరతరువులును, ఉముకతో గూర్చినధాన్యమును, సుగంధతరువులును సున్నవి.

అయిన మీరిద్దఱును దేవునియనుగ్రహములలో నేవి యాతనివి కావందురు ?

కుమ్మరివానివలె నాతఁడు మనుష్యుని మంటితోడను,

పిశాచమును స్వచ్ఛమగు నగ్నితోడను, సృజించినాఁడు.

అయిన మీరిద్దఱును.............

ఆతఁడు తూర్పునకు ప్రభువు.

పశ్చిమమునకును ప్రభువు.

అయిన.........

ఒకదానినొకటి కలియున ట్లాతఁడు రెండుసముద్రములను విడిచినాఁడు.

20 కాని, రెండింటిమధ్యను గడువరాని గట్టొకటియున్నది.

అయిన.........

వీనిలో నొక్కొక్కదానినుండి చిన్నవియు, పెద్దవియునగుముత్యముల నాతఁడు తెచ్చుచుండును.

అయిన.........

సముద్రముపై పర్వతములవలె తేలియాడుచుండు నావ లాతని వే.

అయిన.........

అధ్యాయము-2.

భూమిపైఁగలదంతయు నశించును.

కాని, నీప్రభువుముఖ ముత్తేజోవంతమై మహిమయు నోజస్సును గలిగి ప్రకాశించుచుండును.

అయిన.........

స్వర్గమునందును, భూమియందును గలదంతయు నాతనినే ప్రార్థించుచుండును. అనుదిన మాతఁ డేదోయొకక్రొత్తపనిని చేయుచునే యుండును.

30 అయిన... ... ...

ఓపిశాచమా, మనుష్యులారా! మిమ్ము శోధించుటకు మాకు విశ్రాంతి లేకపోలేదు.

అయిన... ... ...

ఓపిశాచమా, మర్త్యులారా! స్వర్గమర్త్యావధులను మీ రతిక్రమింపఁగలరేని యతిక్రమింపుఁడు. కాని, మాయనుజ్ఞ లేనిదే మీ రతిక్రమింపలేరు.

అయిన... ... ...

మీయిరువురపైనను జ్వాలదగ్నికణములును, మఱుగుచున్న యిత్తడియు విసరఁబడును. వానినుండి మీరురక్షించుకొనలేరు.

అయిన... ... ...

స్వర్గము రెండుగాఁజీలి రక్తప్రభచే విరాజిల్లును.

అయిన... ... ...

ఆదినమున పిశాచమునుగాని, మనుష్యునిగాని, తమపాపములను గూర్చి యెవ్వరు నడుగరు.

40 అయిన... ... ...

వారివారిగుర్తులఁబట్టి పాపులు తెలిసికొనఁబడుదురు. వారు తమ ముందుజుట్టులఁ బట్టియు, పాదములఁబట్టియు, గ్రహింపఁ బడుదురు.

అయిన... ... ...

“ పాపు లసత్యముగాఁ బరిగణించిన నరక మిదియే. ”

దానికిని, మఱుగుచున్న నీటికిని, మధ్య నిటునటు వారుతిరు గాడఁగలరు.

అయిన ... ... ...

## అధ్యాయము 3.

కాని, దేవునిమహిమకు భయపడువారికి రెం డుద్యానవనములు సంప్రాప్తములగును.

అయిన ... ... ...

ఆరెండింటిలోనను విశాల శాఖాయుతములగు చెట్లుండును.

అయిన ...

50 ఆ రెండింటియందును రెండు సెలయేళ్ళు ప్రవహించుచుండును.

అయిన ... ... ...

ఆ రెండింటియందును ప్రతిఫలము రెండురకములుగాదొరకును.

అయిన ... ... ...

సరిగంచులుగల శయ్యపై వారు పరుండియుండ నా రెండు తోఁటలయందలి ఫలములును వారిచేతి కందివచ్చుచుండును.

అయిన ... ... ...

అందు మనుష్యుఁడుగాని, పిశాచముగాని, పూర్వము స్పృశింప కుండిన లోలేక్షణ లుందురు.

అయిన ... ... ...

వారు ముత్యములవలెను, మరకతములవలెను నుందురు.

అయిన ... ... ...

60 మంచికి మంచిగాక మఱియొక బహుమానము దొరకునా?

అయిన ... ... ...

ఏనికి ప్రక్క మఱి రెండు తోఁటలుండును.

అయిన ... ... ...

అవి పచ్చగానుండును.

అయిన ... ... ...

ఆ రెండింటిలోను నిత్యప్రవాహినులగు సెలయేళ్ళుండును.

అయిన ... ... ...

ఆ రెండింటిలోను, ఫలములును, ఖర్జూరతరువులును, దానిమ్మ చెట్లును నుండును.

అయిన ... ... ...

70 రెండింటియందును శోభనాంగులగు విలాసినులుందురు.

అయిన ... ... ...

విశాలాసితనేత్రలు వారిగుడారములయొద్ద దగ్గఱగా వేచి యుందురు.

అయిన ... ... ...

వారిని పిశాచముగాని, మనుష్యుఁడుగాని, స్పృశించియుందురు.

అయిన ... ... ...

వారి భార్యలు మృదుతరములును, పచ్చనివియునగు తలగడల పైనను, సుందరతరములగు తివాచీలపైనను విశ్రాంతి నొందుచుందురు.

అయిన ... ... ...

మహిమప్రభావంతమగు దేవుని నామము పవిత్రవంతమగుఁగాక!



# సురా 56–అయిలీఱునది.

మక్కా–96 పద్యములు 3 రుకూ౯లు.

దయాదాక్షిణ్యమూ౯ర్తియగు దేవునిపేర.

## అధ్యాయము–1.

ఆకస్మికముగా రాఁగలదినము వచ్చినప్పుడు,
ఆయాకస్మికత్వ మసత్యమని యెవ్వరు ననఁజాలరు.
ఆదినమే యుచ్చకుగాని నీచకుగాని తీసికొనిపోవునది.
అప్పుడు భూమి గజగజమని వడఁకఁగలదు.
పర్వతములు పెఠిల్లున బ్రిద్దలై,
ధూళియై యిటునటు నెగిరిపోఁగలవు.
మీరు వర్గాలుగా విడిపోఁగలరు.

అపుడు కుడివైపుననుండి జనులు-ఓహో! కుడివైపు వారెంత యానందముగానుండఁగలరు!

ఎడమ వైపుననుండు జనులు-ఓహో! యెడమవైపువా రెంత దుఃఖభాజనులైయుందురు!

10 ఇహామం దండఅకంటె ముందుండువా రింకను ముందుగనే యుందురు.

వీరిలోఁ బూర్వసంతతివారిలోఁ జాలమందియు,
తరువాతిసంతతివారిలోఁ గొందఱును,
దేవునిసాన్నిధ్యమునకుఁ బోయి,
అచట నానందారామములయందు,
అలంకృతములగు శయ్యలపై,

ఒకరిమొగమున కింకొక రెదురుగా విశ్రమించియుండ,

నిత్యయౌవనవిలాసినులు,

సంతతధారగా ప్రవహించు ద్రాక్షారసపూరితపాత్రలను వారి కందిచ్చుచుండ,

అది పానముచేయుటవలన తలనొప్పిగాని, యరుచిగాని జనింప కుండనుండ,

20 వారి కతిప్రీతికరములగు ఫలములును,

ఇంపుగూర్చు పక్షిమాంసములును లభించుచుండ,

విశాలాసితనేత్రలును, చిప్పలయం దణఁగియుండు ముక్తా ఫలసదృశలును నగునప్సరసలు,

వారిపూర్వకష్టములకు ఫలముగా వారిని సేవింపుచుండ,

ఆనందము ననుభవింపఁగలరు.

అచట వారికి "శాంతి, శాంతి" యను వాక్కుతప్ప,

వృథావాదములును, పాపులుపలుకు నపవాదవాక్యములును, శ్రోత్రగోచరములు కానేరవు.

కుడివైపుననుండువారు-ఓహో! కుడివైపువారెంత యానంద ముగా నుందురు!

ఉన్నతశయ్యలపై

నిరంతరమునుండి, యపరిత్యాజ్యములై,

20 సమృద్ధములగు ఫలములతోనిండి,

జలప్రవాహములదరిని,

విశాలచ్ఛాయలలో,

కంటకరహితములగు సీద్రావృక్షములచేతను,

ఫలభరితములగు తాళవృక్షములచేతను, నావరింపఁ బడియుండు వనములయందు వారు సుఖ మనుభవింపఁగలరు.

అప్సరస లనువా రపూర్వసృష్టలు.

నిత్య కన్యకలు.

భర్తృప్రియలు, భర్తృసవయస్కలు.

అధ్యాయము-2.

పూర్వసంతతివారిలోఁ జాలమందికిని,

తరువాతివారిలోఁ గొందఱకును, వీ రనుభోగ్యలు,

40 కాని, యెడమచేతివైపువారు—ఓహో, యెడమవైపువా రెంత దుఃఖభాజనులు!

విషవాయువులలోను, తప్తతోయములలోను,

అశీతలము, దృష్టిభయంకరము నగు,

ధూమచ్ఛాయయందు వారు వసింపఁగలరు.

వా రింతకుపూర్వ మిహలోక సౌఖ్యముల ననుభవింపుచుండియు, ఘోరపాపములఁ జేయుచు,

"ఏమి ! మనము ధూళిగను, నెమ్ములుగను నైనపిదప మన పూర్వికులగు పితరులతోఁగూడ,

సజీవులమగుదుమా?"

అని సంశయించుచు నడుగుచుండిరి.

వారితో "అవును. ఇప్పటివారును, బూర్వపువారును,

50 అందఱును నిర్ణీతదినమం దొకచోఁ జేరఁగలరు.

దుష్పథవర్తులారా ! అప్పుడు మీరు, సంశయించినమీరు,

ఎజ్ జకూమ్ అను విషవృక్షముల ఫలములఁదిని,

కడుపులు నింపుకొని,

దానిపై సలసలమఱుగుచుండునీటిని,

తృష్ణార్దితయగు నొంటెవలె త్రాగఁగలరు" అనుము.

శిక్షాదినమున నిదియే వారియాహారము కాఁగలదు.

మేము మిమ్ము సృజించితిమని మీరు విశ్వసింపరా?

ఏమితలంచెదరు? జీవాణువులను,

మీరా సృజించువారు? లేక మేమా?

60 మీయందు మృత్యువునసింపఁగలదని శాపించినవారము మేము

అయినను మీకు బదులుగా మీవంటివారిని మీస్థానములయం దుంచుటకును, మీరేమీకుఁ దెలియనిరూపములతో నిర్మించుటకును, మా కెట్టియాటంకమును గలుగఁబోదు,

మీరు మొదటి సృష్టిని చూచితిరిగదా! మీ రేల యాలోచించుకొనరు.

ఏమి తలంచుచున్నారు? మీరు భూమియందు పాతినదానిని,

మీఁదికి మొలకలెత్తఁజేయునది మీరా, మేమా?

మాకిష్టమైనయెడల మీపంటలనెండించి శుష్కములఁజేసి, మీరద్భుతపడి,

"నిజముగా మేము వ్యయపడితిమి. పంటలు నష్టములయ్యెనే!" యని యనునట్లు చేయఁగలము.

మీరుత్రాగు నీటినిగూర్చి మీరేమి తలంచుచున్నారు?

మేఘములనుండి దానిని క్రిందికి దింపినది మీరా, మేమా?

మేము దాని నుప్పభముగాఁ జేయఁగలిగియుందుము. మీరు కృతజ్ఞులరైయుండరేల?

70 మీరేమి తలంచుచున్నారు? రాపిడివలన మీరు పుట్టించు నగ్నిని, పచ్చిచెట్టునుండి,

మీరు పెరుగఁజేసితిరా, మేమా?

దానిని జ్ఞాపకచిహ్నముగను, ఎడారిలోఁ బ్రయాణముచేయు వారికి లాభకరముగను చేసినవారము మేము.

కావున మహాత్ముఁడగు మీ ప్రభునామమును స్తుతింపుఁడు.

అధ్యాయము-3.

ఇది నక్షత్రాస్తమయముపేర చేసినప్రమాణము.
మీకుఁ దెలిసినయెడల నతిఘోర ప్రమాణము.

ఇది గుప్తముగా దాచఁబడిన గ్రంథమున వ్రాసియుండినట్టియు

అతిగౌరవనీయమునునగు ఖురానని మీతో నెట్టి ఘోరప్రమాణముఁజేసి జెప్పనవసరము లేదు.

జగన్నాథుఁడు భూమిజనుల కనుగ్రహించిన పరమరహస్యమగు నాగ్రంథమును,

పవిత్రవంతులుతప్ప నితరులు స్పృశింపకుందురుగాక!

80 ఇట్టివార్తలను మీరు నిరాకరింతురేల!

ఇట్టినిరాకరణమే మీయనుదినవృత్తియా యేమి?

ఏమి, మృత్యువాసన్నమైనవాని ప్రాణములు కంఠగతములైనప్పుడు,

మీ రట్లే చూచుచుందురు.

కాని, మీకుఁ దెలియకుండ మీకంటె మేమాతనికి దగ్గఱగా నుందుము.

మీరు శిక్షనుండి తప్పించుకొనఁగోరినచో,

ఆయాత్మ తిరుగునట్లు చేయరేల? మీరు సత్యవచస్కులైనచోఁ బల్కుఁడు.

కాని, దేవుని సాన్నిధ్యము ననుభవించువానికే

విశ్రాంతియు నానందమును సంతోషారామమును గలుగుచున్నది.

నిజముగా కుడివైపుజనులు, కుడివైపు చేరఁగలదానికి,

90 అభివాదనముచేసి, 'నీకు శాంతియగుఁగాక' యని దీవింతురు.

కాని, ప్రవక్త లసత్యవాదులని నిందించువారిలోను,

దుష్పథవర్తులలోను జేరినవాఁడు,

తప్తతోయములను,

నరకాగ్నిచ్ఛటలను తప్పక యనుభవించితీరును.

ఇది నిశ్చయముగా సత్యము.

కావున మహాత్ముఁడగు నీప్రభువు నామమును స్తుతింపుము.

---

# సురా 57-ఇనుము.

---

మదీనా-29 పద్యములు-4 రుకూలు.

## అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర,

స్వర్గమర్త్యములయందున్న దంతయు దేవునిఁ గీర్తించుచున్నది. అతఁడు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు!

స్వర్గమర్త్యములపై నధికారమాతనిదే; అతఁడు సృష్టిలయకారకుఁడు. అతని కన్నివస్తువులపైనను నధికారముగలదు.

ఆతఁ డాద్యంతములయందు గోచరించుచుండును; అతఁడు వ్యక్తావ్యక్తుఁడు; అతని కన్నియుఁ దెలియును.

స్వర్గమర్త్యముల నాఱుదినములలో సృజించి సింహాసనము నెక్కిన యాతఁ డీతఁడే. భూమిలోనికిఁ బ్రవేశించుదానిని, బైకివచ్చుదానిని, స్వర్గమునుండి యవతరించుదానిని, నచటికెక్కుదానిని, నతఁడు తెలిసికొనియే యున్నాఁడు. మీ రెచ్చటనున్నను నతఁడు మీతోనుండును. దేవుఁడు మీకర్మలనన్నిటిని జూచును.

స్వర్గమర్త్యముల యాధిపత్య మాతనిదే; అన్నివస్తువులును దేవునియొద్దకే తిరిగిపోవును.

అతఁడు రాత్రిని పగటిలోనికిని పగటిని రాత్రిలోనికిని సంక్రమింపఁజేయును. హృదయములలోని రహస్యములన్నియు నాతనికిఁ దెలియును.

దేవుని నాతనిప్రవక్తను నమ్ముఁడు; దేవుఁడు మీ కనుగ్రహించినదానిలోనుండి భిక్షముపెట్టుఁడు. మీలోనమ్మి భిక్షము పెట్టువారికి గొప్పబహుమానము రాఁగలదు.

ప్రవక్త మీప్రభువును నమ్ముమని హెచ్చరించినాఁడు. ప్రభువును నీతో మైత్రినెఱపి నిచ్చగించినాఁడు. మీరు విశ్వాసులైనచో మీప్రభువును నమ్మకుండుటకు మీ కేమిమూడినది?

మిమ్ము చీఁకటినుండి వెలుతురులోనికిఁ దెచ్చుటకుఁ దనసేవకునకు స్పష్టములగు సూచనలనిచ్చినవాఁ డాతఁడే. నిశ్చయముగా దేవుఁడు మీయెడ దయాదాక్షిణ్యపరుఁడై యున్నాఁడు.

10 స్వర్గమర్త్యములయందలిదంతయు నాతనిదేకదా! అతని విషయమై మీరువెచ్చపెట్టరు మీ కేమిమూడినది? జయమునకు ముందు తోడ్పడి పోరాడినవారు మీలోమఱికొందఱికంటె వేఱుగాఁ జూడఁబడుదురు. జయము చేకూరినపిదప సహాయమొనర్చి పోరాడినవారికంటె వీరి కుత్తమపదవి చేకూఱును. అయిన నందఱకును దేవుఁడు మంచిబహుమానమునే వాగ్దానము చేసియున్నాఁడు. దేవునికి మీ కృత్యములన్నియుఁ దెలియును.

## అధ్యాయము 2.

దేవునికి మంచియప్పునిచ్చినవానికి నాతఁడు ద్విగుణముగా నిచ్చి బహూకరించును.

ఒకానొకదినమున విశ్వాసులగు స్త్రీపురుషులు తమజ్యోతి ముందుగను కుడిప్రక్కను పరుగెత్తుచుండుటను జూచెదరు. అప్పుడు దేవతలు వారితో "మీ కిదిగో నేఁడొక సువార్త! మీరు నదులు ప్రవహించు నుద్యానవనములలో శాశ్వతముగ వసింపఁగలరు" అందురు. ఇదియే సంపూర్ణానందము.

ఆదినమున నవిశ్వాసులగు స్త్రీపురుషులు విశ్వాసులతో, "కొంచెమాగుఁడు. మీదీపములో మాదీపమును వెలిగించుకొందుము" అందురు. వారితో "మీరు వెనుకకు మఱలుఁడు. మీరు మీరే వెలుతురును జూచికొనుఁడు" అనిచెప్పఁబడును. వారిరువురకు నడుమ ద్వారముగల నొక గోడయుండును. దానిలోపల కరుణయు, బయట బాధయునుండును.

వారు విశ్వాసులతో "మేము మీతోడివారముకామా?" అందురు వారు "ఔను! కాని, మీరు మోసమునకు లోనైనారు. ఆలస్యము చేసినారు. సందేహించినారు. మీరు కోరిన మంచివస్తువులు మిమ్ము మోసగించినవి. ఇంతలో దేవునిశిక్షయు మీకాసన్నమైనది. మోసగాఁడు మిమ్ము దేవునివిషయమై మోసపుచ్చినాఁడు" అందురు.

కావున నాదినమున మీనుండిగాని, యవిశ్వాసులనుండిగాని, పరిహారము తీసికొనఁబడదు. మీకగ్నియే యావాసమగును. అదియే మీకు ప్రభువగును. అందులోనికి మీదారి దుఃఖావహముగ నుండును.

దేవుని భయసూచనవలనను, అతఁడు పంపిన సత్యమువలనను, విశ్వాసులహృదయము నమ్రతనొందుటకును, పూర్వకాలమున మానవులనఁ బవిత్రగ్రంథములఁగొనియు, వారి యాయు వభివృద్ధినొందింపఁబడియు, తమ హృదయములను కఠినములఁజేసికొని దుష్టవర్తనము నందే యున్నవారివలె నుండకుండుటకును, సమయమురాలేదా?

భూమి మృతినొందినపిదప దేవుఁడు దానిని మఱల నుజ్జీవింపఁ జేయునని యెఱుంగుఁడు. మీరు బోధపఱచుకొందురని యీసూచనల నిప్పుడు మీకు స్పష్టము చేసితిమి.

నిశ్చయముగా భిక్షముపెట్టి దేవునికి ధర్మఋణమునిచ్చినవారికి ద్విగుణముగా లాభముగలుగును. వారికి గొప్పబహుమానము లభించును.

దేవునియందును నతనిప్రవక్తయందును నమ్మకముగలవారే సత్యవంతులు. వారు తమ ప్రభువుప్రమోల సాక్షులుగ నుందురు. వారికి వారిబహుమానమును వెలుతురును జేరును. కాని, యవిశ్వాసులును, మాసూచనల నసత్యములుగ నెంచినవారును నరకమున వసింపఁగలరు.

## అధ్యాయము. 3.

20 ఇహలోకజీవన మొకయాట, వినోదము, డాంబికము నని మీరు తెలిసికొనుఁడు. ధనపుత్రాదులయభివృద్ధి వర్షాంతమున మొలకల యభివృద్ధివంటిది. అవి తలచూపఁగనే కర్షకులు మోదమునొందెదరు. అంతట నవి యెండి, పచ్చబారి చెత్తయైపోవును. పిదప పరలోకమున గొప్పబాధయో, దేవుఁడు సంతోషించి వారిని క్షమించుటయో సంభవించును. ఇహలోకజీవనము మోసమునకు ఫలము.

మీప్రభువును స్వర్గమును బొందుట కొకరితోనొకరు స్పర్ధవహింపుఁడు. ఆస్వర్గము స్వర్గమర్త్యములవలె విస్తరించియుండును. దేవునియందును, నాతని ప్రవక్తలయందును నమ్మకముకలవారి కది సిద్ధపఱుపఁబడి యున్నది. దేవునిబహుమాన మట్టిది. తనకిష్టమైన వారి కాతఁడు దాని నిచ్చును. దేవుఁ డపారదయామయుఁడు!

మేము భూమిని, ఈదేహములను సృజింపకమునుపే వారికేమి కలుగవలసియున్నదో గ్రంథములో నిర్ణయించియే యుంచితిమి.

అందు వ్రాయఁబడినదిగాక వానికి మఱియేహానియుఁ గలుగదు. ఇది దేవు నికి సులభము,

మీకు మంచివస్తువులు చేకూరనిచో దుఃఖింప కుండుటకును, మీకు కలిగినదాని కుప్పొంగకుండుటకును, దేవుఁ డిట్టిసులువును గల్పించి నాఁడు. తమకు లేని దున్నట్లునటించి దాంభికుఁడై,

లోభియై, యితరులను లోభులను జేసినవారిని దేవుఁడు ప్రేమింపఁడు. కాని భిక్షమువెట్టని వారిని.........ఆహా! దేవుఁడు భాగ్యవంతుఁడు, స్తవనీయుఁడు.

మేము మాప్రవక్తలను స్పష్టచిహ్నములతోఁబంపితిమి. వారితోఁ గూడ దైవగ్రంథమును, త్రాసును బంపితిమి. మనుష్యులు న్యాయముగఁ బ్రవర్తించుటయె మాకోరిక. ఇదిగాక యినుమునుగూడ మేము పంపియున్నాము. మనుష్యజాతి కంతు గొప్పహానియు లాభమును గూడ నున్నవి. తనకును దనప్రవక్తకును సహాయము చేయువారిని దేవుఁడెఱుఁగును. నిశ్చయముగా దేవుఁడు శక్తిమంతుఁడు, బలవంతుఁడు.

## అధ్యాయము-4.

పూర్వకాలమున మేము నుహూ, ఇబ్రాహీములను బంపితిమి. వారిసంతతివారికి భవిష్యద్జ్ఞానమును, దైవగ్రంథమును బ్రసాదించితిమి. వారిలోఁగొందఱను క్రమమార్గమున నడిపితిమి. కాని, వారిలోఁ జాల మంది దుష్టులైరి.

తరువాత వారినేయనుసరించుటకు మాప్రవక్తల నంపితిమి. పిదప మరియమ్మ పుత్త్రుఁడగు ఈసాను వారివెంబడినే పంపితిమి. అతనికి మా దివ్యగ్రంథమునిచ్చి, యతని ననుసరించినవారి హృదయములందు దయాదాక్షిణ్యములఁ గుదురుకొల్పితిమి. కాని, వారు తమ సన్న్యాసులయాశ్రమమును తామే కల్పించుకొనిరి. దేవునిత్రుప్తికొఱకే సన్యసింపవలయునని వారికి విధించితిమిగాని, వారావిధిని గ్రమ

ముగఁ బాలింపలేరు. వారిలోఁ జాలమంది దుష్టులేయైనను, నమ్మిన వారికిఁ దగిన బహుమానమిచ్చితిమి.

విశ్వాసులారా! దేవునికిని, నాతనిపవిత్రునకును భయపడుఁడు. అతనిదయలో రెండువంతులు మీ కిచ్చును. మీ దారి కనఁబడుటకు వెలుతురు నిచ్చి యాతఁడు మిమ్ము క్షమించును. దేవుఁడు క్షమాపరుఁడు, దయాళుఁడు.

దేవునివరములపైఁ దమ కేయధికారమును లేదనియు, ఆవరము లన్నియు నాతనియధీనములోనే యున్నవనియు, వాని నాతఁడు తన కిచ్చవచ్చినవారి కొసగుననియు ఈ గ్రంథావలంబకులు తెలిసికొని దైవ భీతిఁగలిగి యుండవలెను.

---

# కాండము. 28.

---

## సురా 58-విన్నవించుకొనిన యామె

---

మదీనా-22 పద్యములు-3 రుకూ్కులు.

అధ్యాయము. 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

తన భర్తపై నీతో విన్నవించుకొనిన యామె మాటలను దేవుఁడు వినెను. ఆమె దేవునితోఁ జెప్పికొనెను. దేవుఁడు మీలో మీకైన సంభాషణను వినినాఁడు. దేవుఁడు చూచుచుండును, వినుచుండును.

మీభార్యలతో "మీరు నాకు తల్లిపీపులవలె నుండుఁ" డని చెప్పుచు వారిని విడనాడుదురు. కాని, వారు మీ తల్లులుకారు. మిమ్ము కనినవారే మీ తల్లులు. అట్లనువారు నిందాస్పదమును నసత్యమును వచించుచున్నారు. కాని, దేవుఁడు క్షమాయుతుఁడు. దయాళుఁడు.

ఈ రీతిగా తమభార్యలను విడిచిపెట్టి, తరువాత తమ మాటలను త్రిప్పుకొనువారు వారితోఁ గలియకపూర్వ మొక బానిసను విడిచిపెట్ట వలయును. దీనిని మీరు తప్పఁగూడదు. మీరు చేయునది దేవునికిఁ దెలియును.

విడిచిపెట్టుటకు బానిసలేనివాఁడు, వా రిద్దఱును గలిసికొనక పూర్వము వరుసఁగ రెండునెల లుపవసింపవలయును. అట్లు చేయ లేనివాఁ డఱువదిమంది బీదల కన్నమిడవలయును. వారు దేవుని నతని ప్రవక్తను విశ్వసించియుండుటకే యిట్లు చేయవలయును. ఇవి దేవుని ధర్మానుశాసనములు. అవిశ్వాసులకు ఘోరశిక్ష కలుగఁగలదు.

దేవుని, నతని ప్రవక్తను నెదిరించువాఁడు తన పూర్వులవలె దీనుఁడు కాఁగలఁడు. ఇప్పుడు మేము స్పష్టసూచనల నంపియున్నాము. భక్తిహీనులకు ఘోరశిక్ష రానున్నది.

దేవుఁడు వారినందఱ నుజ్జీవింపఁజేసి యాదినమున వారికార్య ములను వారికిఁ దెలుపును. తాము మఱచినను దేవుఁడు వారిని లెక్క వేసియే యున్నాఁడు. దేవుఁడు సర్వసాక్షి.

## అధ్యాయము. 2

దేవునికి స్వర్గమర్త్యములయం దున్నదంతయుఁ దెలియునని నీకు గోచరము కాలేదా? ముగ్గురుకలిసి రహస్యముగ మాట్లాడు కొనుచోట నతఁడు నాలవవాఁడుగ నుండును; ఐదుగురు కలిసినచోట నాతఁ డాఱవవాఁడు; కొలఁదిమందియైనను నెక్కువమందియైనను,

వారున్నచోట్లనెల్ల నాతఁడును వారినంటియేయుండును. దేవునికి సర్వ మును దెలియును. రక్షణదినమున నాతఁడు వారికి వారికృత్యములను దెలియఁ జేయును.

రహస్యాలోచన కూడదనియును, నట్లే చేయుచు, ప్రవక్తయెడల దౌష్ట్యము ద్వేషము నవిధేయతయుఁ గనఁబడున ట్లేకాంతముగ వారు మాట్లాడుకొనుచుందురుగదా! దేవుఁడు ని న్నభినందించునట్లు వారు నిన్నుచేరి యభినందింపరు. "మన మనినదానికి దేవుఁడు మనల శిక్షింపఁడేమి?" యని వారిలో వా రనుకొందురు. అట్టివారికి నరకమే ప్రాప్తము. అందలి యగ్నిలో వారు దగ్ధులగుదురు. అచటికి మార్గము దుర్గమముగ నుండును.

విశ్వాసులారా! మీరు రహస్యాలోచనలు చేసికొనునప్పుడు, ప్రవక్తయెడ దౌష్ట్యము, ద్వేషము, అవిధేయతలను ఆలోచింపకుఁడు. న్యాయముగను, దైవభీతితోడను, మీలోమీరు మాట్లాడుకొనుఁడు. అవును, మీరు తుదకు చేరఁగల దేవునికి భయపడుఁడు!

10 విశ్వాసులకు దుఃఖముఁ దెచ్చిపెట్టుటకే సైతా నట్టి నీచసంభాషణలోనికి దింపును. దేవునాజ్ఞలేనిదే చీమ యయినను కుట్టఁజాలదు. కావున విశ్వాసులు దేవునే నమ్మియుండెదరుగాక!

విశ్వాసులారా! మీసభలలో "కొంచెము జరిగి యితరులకు చోటు నిండు" అని మి మ్మడిగినయెడల చోటు నొసగుఁడు. మీకు దేవుఁడు భోగభూమియందు చో టీయఁగలఁడు. "లెండు" అతనితోడ నే నిలువఁబడుఁడు. మీలో విశ్వాసులును, 'జ్ఞానము' బొందినవారును దేవునియనుగ్రహముచే నుచ్చస్థానములఁ జేరఁగలరు. దేవునికి మీ కార్యములన్నియు నెఱుక.

విశ్వాసులారా! మీరు ప్రవక్తతో రహస్యముగ సంభాషింపనగునపుడు ముందుగా భిక్షముపెట్టుఁడు. ఇది మీకు శ్రేయస్కరము, మిక్కిలి

పవిత్రవంతము. మీరట్లు చేయుట కుపాధిలేనప్పుడు దేవుఁడు మిమ్ము క్షమించి కరుణించును.

మీ రహస్యసంభాషణకుఁ బూర్వము భిక్ష మొసగ సంకోచించెదరా? మీ రట్లు చేయలేకుండిన దేవుఁడు క్షమించును. పోనీ, ప్రార్థన చేసి, విధివిహితమైనదానినైనను జెల్లించి, దేవుని నాతని ప్రవక్తను మన్నింపుఁడు. దేవుఁడు మీ కార్యముల నన్నిటిని జూచుచున్నాఁడు.

## అధ్యాయము-3.

దేవునికోపమునకుఁ బాత్రులైనవారితో స్నేహముచేయువారిని నీవు బాగుగ గుర్తించితివిగదా! వారు నీపక్షమునఁగాని, వారిపక్షమునఁగాని చేరరు. అసత్యమని తెలిసియు వా రసత్యమాడుదురు.

వారు చేయునది దుష్టము. దేవుఁడు వారికి ఘోరశిక్షను సిద్ధము చేసియున్నాఁడు.

వారు భక్తియను వస్త్రమును గప్పికొని యితరులను దేవుని మార్గమునుండి తప్పింతురు. కావున, వారికి లజ్జాకరమగు శిక్ష సిద్ధముగ నున్నది.

దేవునిపై వారిధనమును, పుత్త్రులును నొందుకుఁబనికిరారు. వారి కగ్నితోడనే సహవాసము. వా రందు శాశ్వతముగ నుందురు.

ఒకానొకదినమున దేవుఁడు వారినందఱను లేవనెత్తునపుడు, తమకు లాభించుననుకొని మీతో నెట్లొట్లు పెట్టుకొనుచున్నారో దేవునితోడను నట్లే ప్రమాణము చేయుదురు. వా రనృతవాదులుకారా?

సైతాను వారిపై నధికారము వహించి, వారిని దేవుని మఱువఁజేసియున్నాఁడు. వీరు సైతానుపక్షమువారు. ఏమి! సైతానుపక్షము శాశ్వతముగ నశించునుగదా!

20 దేవుని నతనిప్రవక్తను నెదిరించువారు మిక్కిలి దుర్మార్గులు

"నేనును నా ప్రవక్తయు విజయమునొందుదుము" అని దేవుఁడు విధించికొని యున్నాఁడు. సత్యముగా దేవుఁడు బలవంతుఁడు; శక్తిమంతుఁడు.

దేవుని నతని ప్రవక్తను దిరస్కరించువారు తమ తండ్రులైనను, కొడుకులైనను, సోదరులైనను, దగ్గఱ బంధువులైనను, విశ్వాసులు వారిని ప్రేమింపరు. దేవుఁడు వారి హృదయములలో భక్తిని నాఁటి యున్నాఁడు. తన పరిశుద్ధాత్మచే వారికి బల మొసగియున్నాఁడు. అతఁడు వారిని తరంగిణులు ప్రవహించు నుద్యానవనములలో శాశ్వతముగ వసింపఁజేయును. దేవుఁడు వారితోడను, వారు దేవునితోడను సంతుష్టిఁ జెందియుందురు. వీరే దేవునిపక్షమువారు. దేవునిపక్షము. వారికి శాశ్వతానందము కలుగునుగదా!

---

# సురా - 59. వలసపోవుట.

---

మదీనా-24పద్యములు-3-రుక్కులు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

స్వర్గమర్త్యములయం దున్నదంతయు దేవుని స్తుతించుచున్నది. అతఁడు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు.

గ్రంథావలంబకులలోని యవిశ్వాసులను తమ గృహముల వీడఁజేసి, పూర్వము వలస పోయినవారితోఁ జేర్చినవాఁ డాతఁడే. వారు తమ గృహములను విడిచిపెట్టుదురని మీ రనుకొనలేదు. తమ కోటలే తమ్ము దేవునినుండి రక్షించునని వారును దలంచిరి. కాని, వా

రనుకొనిన దిక్కునుండి దేవుఁడు వారిపైఁబడి వారిహృదయములందు భయమును బుట్టింపగా వారియిండ్లు వారిచేతులతోను, విజయము గాంచి పురమును బ్రవేశించిన విశ్వాసులచేతులతోను నాశనమయ్యెను. అంతశ్చక్షువులారా! ఈ యుదాహరణమువలనఁ దెలివి దెచ్చికొనుఁడు!

దేవుఁడు వారిని బ్రవాసములోనికిఁ బంపకయుండినచో తప్పక యీలోకమందే వారిని శిక్షించియుండును. కాని, రాఁబోవులోకము నందు వారి కగ్ని బాధ సిద్ధముగా నున్నది.

వారు దేవునకును, ఆతని ప్రవక్తకును నెదురుచూపిరి కావుననే యట్లగును. దేవునిపై నెదురుతిరుగువాఁడు......! దేవుఁడు నిశ్చయముగా కఠినహృదయుఁడై శిక్షించును.

మీరు వారి ఖర్జూరపుచెట్లలోఁ గొన్నిటిని నరకివైచి, కొన్నిటి నుంచివేసితిరి. దేవుని యనుమతిమీఁదనే దుష్టులకు సిగ్గగునట్లు మీ రట్లుచేసితిరి.

దేవుఁడు తనప్రవక్త కనుగ్రహించిన యీయహూదీల కొల్లను చేకొని, మీరు గుఱ్ఱములతోను, నొంటెలతోను మఱి దాడివెడలలేదు. కాని, దేవుఁడు తన ప్రవక్తకు తన యిష్టమువచ్చినదానిపై నధికార మిచ్చును. దేవుఁడు సర్వశక్తుఁడు !

ఆయాపురములనుండి మీరు కొనినట్టియు దేవుఁడు తనప్రవక్త కనుగ్రహించినట్టియు కొల్లధనమునందు దేవునకును, ప్రవక్తకును, నతని బంధువులకును, అనాథులకును, బీదలకును, దారిఁబోవువారికిని, పాలున్నది. అది మీలో ధనవంతులై యున్నవా రనుభవింపఁగూడదు. ప్రవక్త మీకిచ్చినదానిని దీసికొనుఁడు, ఆతఁడీయననినదానిని దీసికొనకుఁడు. దేవునికి భయపడుఁడు. దేవుఁడు కఠినముగ శిక్షించునుజుఁడీ!

తమ గృహములను ధనములను గోల్పోయి, దేవునిప్రసాదమును ననుగ్రహమును గోరుచు, దేవునకును, నతని ప్రవక్తకు సహా

యముచేయు శరణాగతులకుఁ (మొహాజరీనులకు) గూడ నా ధనము నందు వంతుగలదు. వీరే నిర్మలపుణ్యవర్తనులు.

మదీనాప్రజలలోఁ దమగృహములను వీడక, వారికివచ్చినమత మును స్వీకరించినవారు తమ్ము శరణుజొచ్చినవారిని బ్రీతితోఁ జూతురు. కొల్లధనములోఁ దమకు వంతుగావలయునని వారు హృదయ మందైనను గోరరు. తమకు దారిద్ర్యమే సంభవించినను, వారినే తమ కంటె నధికులుగఁ జూచికొందురు. తమ యత్యాశనుండి తప్పించుకొను వారికి శ్రేయస్సు కలుగును.

10 వారిపిదప మతస్వీకారము చేసినవారు "ప్రభువా! మమ్మును, మాకుఁ బూర్వము నీభక్తి నవలంబించిన మాసోదరులను క్షమింపుము. విశ్వాసులపై మాహృదయములయం దీర్ష్యలేకుండునట్లు చేయుము. ప్రభువా! నీవు దయాళుఁడవు. కరుణాళుఁడవు" అందురు.

## అధ్యాయము-2.

అసంతృప్తినొందినవారు గ్రంథావలంబకులలో నవిశ్వాసులగు తమసోదరులఁజూచి "మీరు తఱిమివేయఁబడినచో మేమును మీతో వెడలివచ్చెదము. మీవిషయములో మఱియెవ్వరిని మన్నింపము.మిమ్ము వా రెదిరించినచో మీకు సహాయముగా వచ్చెదము" అందురు. కాని వా రనృతవాదులగుటకు దేవుఁడే సాక్షి.

వా రట్లు చేయరు. వారు తఱిమివేయఁబడినచో వీరు వారితోఁ బాటు ప్రవాసము ననుభవింపరు. వారి నెదిరించినయెడల వీరు సహాయ పడరు. ఒకవేళ సహాయపడినను వెనుజూపుదురు. అప్పుడు వా రస హాయులై యుండిపోవుదురు.

నిశ్చయముగా వారు దేవునికంటె మీకే యెక్కువగ భయ పడుదురు. వారికి వివేచనలేదు గావుననే వారిట్లు చేయుదురు.

చుట్టుఁ గంచెలుగల పురములనుండియు, గోడలవెనుకనుండియు నేకాని యహూదీలందఱును గలిసి మీతోఁ బోరాడరు. వారియందు మీశౌర్యము బాగుగ నాటికొనినది. వారు కలిసియున్నారని మీ రనుకొనుచున్నారుగాని, వారిహృదయములు కలిసియుండలేదు. వారి బోధ వేఱుకావుననే వా రిట్లుందురు.

తమపూర్వులు తాముచేసికొనినదానిని రుచిచూచినట్లే వీరును బ్రవర్తింతురు. వీరికి ఘోరశిక్ష సిద్ధముగానున్నది.

సైతాను మనుష్యునితో "భక్తిహీనుఁడవుకమ్ము" అనును. అతఁడు భక్తిహీనుఁడైనంతనే "నీదోషముతో నా కేమియుఁ బనిలేదు. నేను జగన్నాథుఁడగు దేవునికి భయపడుచున్నా" ననును. వీరును నట్టివారే.

కావున నాయిరువురకును నగ్నియందు శాశ్వతముగ వసించుటయే గతి. దుర్మార్గుల కిదియే ఫలము.

అధ్యాయము-3.

విశ్వాసులారా! దేవునికి భయపడుఁడు. ప్రత్యాత్మయు మఱు సటిదినముకొఱ కేమిదాచికొని యుంచుకొననున్నదో యోచింప నిమ్ము. మీరుమాత్రము దేవునికి భయపడుఁడు. దేవునికి మీరు చేయునదంతయు నెఱుక.

దేవుఁడు తమయాత్మలనే మఱువఁజేసియుండఁగా తామును దేవుని మఱచియున్నవారివలె నుండఁదగదు. అట్టివారే దుర్మార్గులు.

20 అగ్నియందున్నవారును, భోగభూమియందున్నవారును సమానులు కాఁజాలరు. భోగభూమినివాసులదే యానందము.

ఈ కురానును నీ కొకపర్వతముపై నిచ్చియుండినచో నది నమ్రతతో వంగిపోయి, దేవునికి భయపడి బ్రద్దలైయుండును. జను లాలో

చించుకొనఁగల రనియే యిట్టి భావగర్భితములగు నుదాహరణములను మేము కల్పించుచుందుము.

అతఁ డసమానదైవతము. దృష్టాదృష్టములన్నియు నతనికిఁ దెలియును. అతఁడు దాక్షిణ్యమూర్తి, కరుణాళుఁడు,

అతఁడుగాక యన్యథా దైవములేఁడు. అతఁడు చక్రవర్తి, పవిత్రుఁడు, శాంతుఁడు, విశ్వాసి, రక్షకుఁడు, శక్తిమంతుఁడు, బలవంతుఁడు, అత్యున్నతుఁడు. వా రతనితోఁ గలుపువారిమహిమకును, నాతని మహిమకును జాలదూరము.

అతఁడే జీవములఁగల్పించి, సృష్టిచేసి, వానికి రూపముల నిచ్చువాఁడు! అతని బిరుదావళి చాలగొప్పది. స్వర్గమర్త్యముల నున్న దంతయు నాతని స్తుతించును. అతఁడు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు!

---

# సురా—60 శోధింపఁబడిన యామె.

---

## మదీనా-13 పద్యములు.-2 రుక్కులు.

## అధ్యాయము-1.

### దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

విశ్వసించినవారలారా! మీకుఁ దెలిసిన సత్యమును నమ్మినను మీయొక్కయు, నాయొక్కయు శత్రువును జేకొని దయజూపకుఁడు. మీరు మీప్రభువగు దేవునినమ్ముటచే వారు మిమ్మును బ్రవక్తలను తరిమివేయుదురు! నన్ను సంతోషింపఁజేయనెంచి, నామార్గమున యుద్ధముఁ జేయుచు వారిని రహస్యముగఁ గరుణించినవో, మీకుఁ దెలిసినదియు, మీరు దాచినదియు నాకు బాగుగఁ దెలియును. ఇట్లు

చేసినవాఁ డప్పుడే సరియైన మార్గమును దప్పిపోయియున్నాఁడు. వారు మిమ్ము తిరిగి యవిశ్వాసులు కాఁగోరెదరు.

రక్షణదినమున మీబంధువులుగాని, మీసంతానముగాని మీకు సహాయపడఁజాలరు. ఆదినమున,

వారు మీలోఁ జేరి మీకు శత్రువులగుదురు. వారు తమచేతి తోఁడను, నాలుకతోఁడను మీకు హానిచేయుదురు. మిమ్మిరువురను విడఁదీయుదురు! మీకార్యములను దేవుఁడు చూచుచున్నాఁడు.

ఇబ్రాహీమును, నాతని ననుసరించువారును, "మీరును, దేవునిఁ గాక మీరారాధించువారును, మా కక్కఱలేదు. మిమ్ము మేము వదలి పెట్టినాము. మీ రొక్క దేవునే నమ్మువఱకును, మీకును మాకును స్పర్థయు, శత్రుత్వమును నుద్భవించియుండును" అనిరి. వారు మీ కుదాహరణప్రాయులు. అయినను ఇబ్రాహీము తనతండ్రితో "నిన్ను క్షమింపుమని దేవునివేఁడుకొందునుగాని, యతనినుండి నీకేమియు సంపాదింపఁజాలను." అనుమాటల ననుకరింపకుఁడు. ప్రభువా! నిన్నే నమ్మియున్నాము. నీవే మాకు దిక్కు. అంత్యమున మేము నిన్నే చేరుదుము.

ప్రభువా! అవిశ్వాసులచే మమ్ము శోధింపకుము. నీవుశక్తి యుతుఁడవు. బుద్ధుఁడవు. మమ్ము క్షమింపుము.

దేవునియందును తుదిదినమునందును నమ్మకముగలవా రందఱును మీ కుదాహరణప్రాయులు. తిరిగిపోయినవారిని పోనిమ్ము, దేవుఁడు భాగ్యవంతుఁడు. కీర్తనీయుఁడు.

## అధ్యాయము-2.

బహుశః దేవుఁడు మీకును, మీరు శత్రువులనుకొనిన వారికిని, సౌమనస్యముఁ గల్పించునేమో! దేవుఁడు శక్తియుతుఁడు. దేవుఁడు కరుణాళుఁడు! దయాళుఁడు!

మతవిషయమై మీతో యుద్ధముచేసి మీయిండ్లనుండి తఱిమి వేయనివారిని న్యాయముగను దయతోడను చూడవలదని యాతఁడు నిషేధింపఁడు. న్యాయవంతులను దేవుఁడు ప్రేమించును,

కాని, మతవిషయమై మీతోఁ బోరాడి మీ యిండ్లనుండి మిమ్ముఁ బోఁద్రోలినవారిని, పోఁద్రోలుటయందు వారికిఁ దోడ్పడిన వారిని, స్నేహితులుగఁ జేకొనవలదని దేవుఁడు నిషేధించును. వారితో స్నేహము చేయువారు దుర్మార్గులు.

10 విశ్వాసులారా! విశ్వాసినులగు స్త్రీలు మీయందఁజేరినప్పుడు వారిని శోధింపుఁడు. దేవునికి వారలభక్తి బాగుగఁదెలియును. మీరు వారి భక్తిని దెలిసికొనినపిదప వారిని తిరిగి యవిశ్వాసులఁ జేరనీయ కుఁడు. వీరు వారికి ధర్మపత్నులుగారు. వారును వీరికి ధర్మభర్తలు గారు. కాని, వారు తమభార్యలకుఁ బెట్టినధనమును తిరిగి యిచ్చి వేయవలెను. వారి ధనమును వారికిచ్చివేసినచో వారిని వివాహ మాడుట నేరముగాదు. అవిశ్వాసినుల విసర్జింపుఁడు. కాని, వారి ధనము వారికిచ్చివేయుఁడు. అవిశ్వాసులు తమ భార్యలకై వ్యయము చేసినదానిని తిరిగి యడుగవచ్చును. ఇది దేవుఁడు మీకు చేసిన యాజ్ఞ. దేవుఁడు జ్ఞాని, బుద్ధుఁడు.

మీభార్య లెవరైన నవిశ్వాసులయొద్దకుఁ బాఱిపోయినచో వారినుండి మీరు కొల్లగొన్నప్పు డాభార్యలకు ,పోవలసినధనము నందులోనుండి యిచ్చివేయుఁడు. మీరు నమ్మినదేవునికి భయపడుఁడు.

ఓప్రవక్తా! విశ్వాసినులు మిమ్ముఁజేరి, దేవునితో నితరులను జేర్పమనియు, దొంగతనముగాని, వ్యభిచారముగాని, చేయమనియు, పిల్లలను జంపమనియు, లేనిపోని యపవాదముల వేయమనియు, న్యాయమైనదానిలో మిమ్ము మన్నింతుమనియు, ప్రమాణము చేసి నచో, వారికి వారికి నీభక్తినిచ్చి, వారిని రక్షింప దేవుని వేఁడుము. దేవుఁడు క్షమాయుతుఁడు, కరుణాళుఁడు!

విశ్వాసులారా! దేవుఁడు కోపించినవారితో సఖ్యము చేయకుఁడు. గోరీలలోనున్న వారిఁగూర్చి యవిశ్వాసు లెట్లు నిరాశచేసికొందురో యట్లే వారు పరలోకజీవనముంగూర్చియు నిస్పృహ చేసికొందురు.

# సురా-61 యుద్ధసన్నాహము.

మదీనా-14 పద్యములు-2 రుకుక్కులు.

అధ్యాయము 1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

స్వర్గమర్త్యములందుఁ గలదంతయు దేవుని గుర్తించును. అతఁడు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు!

విశ్వాసులారా! మీరాచరింపనిదానిని గల్గియున్నట్లు మీరేల నటించెదరు?

మీరు చేయనిదానిని మీరు చెప్పుచుండుటచే దేవునికి మిక్కిలి యసహ్యము.

వరుసలుదీరి, పెద్దగోడలవలె శత్రువుల నెదిర్చి దేవునిపక్షమున యుద్ధముచేయువారిని దేవుఁడు ప్రేమించును

మూసా తనప్రజలతో "ఓ నాప్రజలారా! నేను దేవునిచే మీయొద్ద కంపఁబడిన ప్రవక్తనని తెలిసియు నన్నేల దుఃఖపెట్టెదరు" అనెను. వారు దారితప్పఁగనే, దేవుఁడును వారిహృదయములను తప్పుదారిలోనికిఁ దింపెను. దుష్టప్రజలను దేవుఁడు రక్షింపఁడు దీనిని జ్ఞాపకముంచుకొనుఁడు.

మరియు మర్య్మ పుత్రుఁడగు ఈసా "ఇస్రాయేలుపుత్రులారా! మీ కిదివఱకే యొకధర్మ ముపదేశింపఁబడినది. దానిని తిరిగి మీకుఁ దెలుప దేవునిచే మీయొద్దకుఁ బ్రవక్తగాఁ బంపఁబడియున్నాను. నా తరువాత 'అహమ్మ' దను నొకఁడు ప్రవక్తగా రాఁగలఁడు" అనెను. కాని, అహమ్మదు తనస్పష్టమగు సాక్ష్యముతో వారియొద్దకు రాఁగా వారు, "ఇది కేవలము చిల్లంగి" యనిరి.

ఇస్లాము (దృఢభక్తి) నవలంబింపుఁడని పిలువఁబడినప్పుడు దేవునిఁగూర్చి యసత్యముబల్కువానికంటె భక్తిహీనుఁ డెవ్వఁడుం డును ? దేవుఁడు దుష్టులను రక్షింపఁడు.

వారు దేవునిజ్యోతిని తమనోటితో నార్పివేయ నెంచుచున్నారు; అవిశ్వాసు లసహ్యించుకొనినను దేవుఁడు దానిని మఱింత బాగుగ వెలుఁగఁజేయును.

దేవునితో నితరదైవములఁ గల్పినవారి కిష్టములేకున్నను తన రక్షణను, సత్యమతమును, నితరమతములపై విజయముగాంచునట్లు చేయుటకుఁ దన ప్రవక్తను బంపినవాఁ డాతఁడే.

## అధ్యాయము-2.

10 విశ్వాసులారా! ఘోరబాధనుండి మిమ్ము విడిపింపఁగలయొక వస్తువును మీకుఁ దెలుపుదునా?

దేవుని, నాతనిప్రవక్తను నమ్ముఁడు. మీధనముతోను, మీదేహములతోను, దేవునికొఱకు సాహసముతోఁ బోరాడుఁడు. మీకుఁ దెలిసినచో నిదియే మీకు శ్రేష్ఠము.

అతఁడు మీపాపములను క్షమించును. ఎల్లప్పుడును నదులు ప్రవహించుచుండు మనోహరోద్యానవనములలో, ఈడెనువనములలో నాతఁడు మీకు వాసము గల్పించును. ఇదియే పరమానందము.

మీరుకోరిన యితరవస్తువులను, దైవసహాయమును, శీఘ్రవిజయమును గూడ నాతఁడు మీకొసగును. విశ్వాసులయొద్ద కీవార్తఁ గొనిపొమ్ము.

విశ్వాసులారా! దేవుని కింకరులరు కండు. పూర్వము మేరీ పుత్రుఁడగు ఏసు తనప్రవక్తలతో "దేవుని కైంకర్యమున కెవరువచ్చెద" రని యిట్లే చెప్పియుండెను. ప్రవక్తలు "మేమే యాతని కింకరుల మయ్యెద" మనిరి. ఇస్రాయేలుపుత్రులలోఁ గొందఱు నమ్మిరి. కొందఱు నమ్మకుండిరి. కాని నమ్మినవారికి వారిశత్రువులను జయింప శక్తినిచ్చితిమి. వారును శీఘ్రమే విజయులైరి.

---

# సురా-62-సభ.

---

మదీనా-11 పద్యములు-2 రుకూ_లు.

## అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

స్వర్గమర్త్యములయం దున్నదంతయు, చక్రవర్తియుఁ బవిత్రుఁడును, శక్తిమంతుఁడును, బుద్ధుఁడును నగు దేవుని స్తోత్రము చేయుచున్నది.

పూర్వ మరబ్బులు తప్పుతోవలో నుండిరి. అట్టి యనాగరికులకుఁ దనసూచనలఁ దెల్పుటకును, వారిని బవిత్రులఁ జేయుటకును, 'గ్రంథముఁ' గూర్చిన జ్ఞానమును బుద్ధిని వారికిఁ బ్రసాదించుటకును నొకప్రవక్తను వారిలోనుండియే పంపినవాఁడు దేవుఁడే.

వారిలో నితరులు తమకుఁబూర్వము భక్తిపరులై యున్నవారిని మించలేదు. అతఁడు శక్తిమంతుఁడు. బుద్ధుఁడు!

ఇది దేవునిదయ. అతఁడు దానిని తనయిచ్ఛవచ్చినవారియెడఁ జూపును. అతఁడు దయానిధి.

ధర్మభారమునుమోయుచు దానిని సహింపలేనివారు పుస్తకములను మోయు గాడిదలవంటివారు. దేవునిసూచన లసత్యములను వారి కిది కష్టమగుపోలికయే. ఈతప్పుచేసినవారిని దేవుఁడు రక్షింపఁడు.

"ఓయహూదీలారా! మీరేకాని యితరులు దేవునిస్నేహితులు కారని మీ రనుకొనినచో మీరు మీ సత్యముకొఱకు మృత్యువును బొందుఁడు" అనుము.

కాని, వారు తాము పూర్వము తమచేతులతోఁ జేసికొనిన దానికై యట్టిమృత్యువు నపేక్షింపరు. దుష్టవర్తను లెవ్వరో దేవుని కెఱుక.

"మీరు దేనినుండి పరుగెత్తిపోవుచున్నారో యామృత్యువు మిమ్ము తప్పక చేరఁగలదు. అప్పుడు మీరు రహస్యముగను, బహిరంగముగను జేయు కర్మల నన్నిటిని దెలిసికొనుచున్న దేవునియొద్దకు మీరు తిరిగి రాఁగలరు. అప్పు డాతఁడు మీకర్మలఁగూర్చి మీకుఁ దెల్పును.

## అధ్యాయము-2.

ఓవిశ్వాసులారా! శుక్రవారపుసభ నాఁడు ప్రార్థనకు మిమ్ముఁ బిలిచినప్పుడు మీరు శీఘ్రముగ దేవునిఁ బూజించుటకుఁ ద్వరపడుఁడు. మీకృత్రిమకార్యముల మానుఁడు. మీరు బుద్ధిమంతులై తెలిసికొనినచో నిదియే మీకు శ్రేయస్సు.

10 ప్రార్థన ముగిసినపిదప మీరు చెదిరిపోయి దేవుఁ డనుగ్రహించినదానిని సంపాదించుటకుఁ బూనుఁడు ఎప్పుడును దేవుని స్మరింపుఁడు. మీకు శ్రేయస్సు కలుగును'' అనుము.

కాని, వారికి వర్తకమో వేఁటయో దొరకినంతనే నిన్నువిడిచి పరుగెత్తెదరు. వారితో " మావర్తకము వేఁటలకంటె దేవునియొద్ద మేలైన వస్తువులున్నవి. అతఁడే దాతలలో శ్రేష్ఠుఁడు '' అనుము.

---

# సురా-63 కపటులు.

మదీనా - 11 పద్యములు-2 రుక్కులు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అధ్యాయము-1.

కపటులు నీయొద్దకువచ్చి, "నీవు తప్పక దేవునిపవిత్రవక్తవయినందుకు మేము సాక్షులమైయుందుము" అందురు. నీవు నిస్సందేహముగా తనప్రవక్తవని అల్లాకు తెలియును. కపటులందఱును నసత్యవాదులనియు నాతనికిఁ దెలియును.

వారు తమ ప్రమాణములమఱుగున అల్లామార్గము నతిక్రమించుచుందురు. వారు చేయున దంతయు దుష్టమే.

వారు తొలుత విశ్వసించి, పిదప నవిశ్వాసములో పడియున్నారు. కావున వారిహృదయములపై ముద్రవేయఁబడినది. వారికి జ్ఞానము కలుగదు.

నీవు వారినిచూచి వారి యాకారములకు సంతోషింతువు. వారు మాట్లడునప్పుడువారిమాటలువిందువు. కఱ్ఱదుంగకువస్త్రములను

దొడిగిన నెట్లుండునో వారును నట్లుందురు. శతృవులు దండెత్తివచ్చి నపుడెల్ల వారు తమమీఁదికే యని తలంచుచు వెనుదీయుచుందురు. కపటులే నీకు శత్రువులు. వీరినిగూర్చి కనుగలిగి యుండుము. వారు తమవిశ్వాసమును వీడియున్నందుకు దేవుఁడు వారిని నాశనముచేయును గాక.

వారితో, "రండు. దేవునిప్రవక్త మీకొఱకు క్షమాపణ వేఁడును" అనినప్పుడు వారు పెడమొగమై గర్వపూరితులై మఱలిపోవుచుందురు.

వారికొఱకు నీవు క్షమాపణను వేఁడినను వేఁడకున్నను నొక్కటే. అల్లా వారి నెప్పుడును క్షమింపఁబోఁడు. సత్పథము నతిక్రమించినవారికి దేవుఁడు దారిచూపఁడు.

వారు, "అల్లాప్రవక్తనుండి యతనియనుచరులు విడిపోవు వఱకును మీరు వారికి సహాయము చేయకుఁడు" అందురు. కాని, స్వర్గ మర్త్యములందలి ధనములన్నియు దేవునివే. ఈసంగతి కపటులకు తెలియదు.

వారు, "మేము మదీనాకు తిరిగివచ్చినయెడల నచటి బలవంతులు మాలోని బలహీనులను త్రోలివేయుదు" రందురు. కాని, యీ బలము దేవునికిని, అతనిప్రవక్తకును, విశ్వాసులకునుమాత్ర మున్నది. కపటుల కిది తెలియదు.

## అధ్యాయము-2.

విశ్వాసులారా! మీధనమును, మీసంతతిని చూచికొని దైవ స్మరణమునుండి మఱలిపోకుఁడు. అట్లుచేసినవారు నష్టులై పోవుదురు.

10 మీలో నెవ్వనికైనను మృత్యు వాసన్నమైనప్పుడు, "ప్రభువా, నీవు నాకు కొంచెము వ్యవధి నిచ్చితివికావేల? నేను భిక్షమునొసగి

సత్కర్మలఁ జేసియుందునే" అని యనకుండుటకై మృత్యువురాక మునుపే మేము మీకిచ్చినదానినుండి దానధర్మములకై వినియోగింపుఁడు.

ఏ యాత్మయైనను దేహమును విడిచిపెట్టవలసినకాలము వచ్చినప్పుడు దేవుఁడు మఱియవధి నీయఁడు. మీరు చేయునదంతయు అల్లా తెలిసికొనుచునే యున్నాఁడు.

---

# సురా-64-దోషస్పష్టీకరణము.

---

మదీనా-18 పద్యములు-2 రుకూలు.

## అధ్యాయము-1.

స్వర్గమర్త్యములం దున్నదంతయు దేవునిఁ గీర్తించుచున్నది. ఆతనిదే రాజ్యము. అతనిదే తేజము. అతనికి సమస్తవస్తువులపైన నధికారముగలదు.

ఆతఁడే మిమ్ములనందఱను సృజించినవాఁడు. అయినను మీలోఁ గొందఱు విశ్వాసులు, కొందఱు అవిశ్వాసులు; కాని, దేవుఁడు మీకృత్యముల నన్నిటిని జూచుచునేయున్నాఁడు.

సత్యముగా స్వర్గమర్త్యముల సృజించినవాఁ డాతఁడే. ఆతఁడే మిమ్ము సృష్టించి మీకు మంచిరూపముల నొసగియున్నాఁడు. ఆతని యొద్దకే మీరందఱును దిరిగి చేరఁగలరు.

స్వర్గమర్త్యములయందు జరిగినదంతయు నతనికిఁ దెలియును. మీరు దాచినదానిని, వెలిబుచ్చినదానినిగూడ నాతఁ డెఱుంగును.

మనుష్యులహృదయములలోని రహస్యములన్నియు నాతనికిఁదెలియును.

పూర్వకాలమునం దవిశ్వాసులై తమకర్మఫలముల ననుభవించినవారికథ మీచెవిని బడలేదా? వారికి ఘోర శిక్షకలుగనున్నది.

తమ ప్రవక్తలు తమయొద్దకు స్పష్టచిహ్నములతో వచ్చినప్పుడు వారు, "ఏమి? మనుష్యులా మాకు దారిచూపువారు?" అనువారికేమిది. వారు నమ్మక వెనుదిరిగిరి. కాని, దేవునికి వారితో జోక్యము లేదు? దేవుఁడు భాగ్యవంతుఁడు. కీర్తనీయుఁడు.

అవిశ్వాసులు తాము చచ్చినవెనుక బ్రతికెదమని నమ్మనట్లుందురు. "మీరు తప్పక లేవఁదీయఁబడుదురు. మీకర్మలు మీకు నిశ్చయముగాఁ దెలుపఁబడును. ఇది దేవునికిఁ గడుసులభము" అని చెప్పుఁడు.

దేవునియందును, నతనిప్రవక్తయందును, అతడుపంపిన తేజస్సునందును, నమ్మకముంచుఁడు. మీరుచేయునదంతయు దేవునికిఁదెలియును.

మీరందఱు నొకచోఁ జేర్పఁబడుదినమే యన్యోన్యకాపట్యమునకు సమయము. దేవునినమ్మి సరియైనపనులఁ జేసినవారి తప్పిదముల నాతఁడు పరిగణింపఁడు. అతఁడు వారినినదులుప్రవహించు నుద్యానవనములలో స్థిరవాస మొనర్పఁజేయును.

10 కాని, యవిశ్వాసులును, మాసూచనల నసత్యములనినవారును, అగ్నిలోఁబడి యందే చిరకాలముందురు. అచటివారు పోవుమార్గము దుఃఖదాయకము.

## అధ్యాయము-5.

దేవుని యనుజ్ఞ లేనిదియు వారికేకీడును గలుగదు. తన్నునమ్మినవారి హృదయముల నాతఁడు సరియైనమార్గమున నడుపును. దేవుఁడు సర్వజ్ఞుఁడు.

కావున దేవుని, సతనిప్రవక్తను నమ్ముఁడు. స్పష్టముగ బోధ పఱుచుటయే నాప్రవక్తవిధి. కావున మీరు వెనుదిరిగినచో నాతని తప్పేమియు నుండదు.

దేవుఁడు ! అతఁడువినా మఱిదేవుఁడు లేఁడు ! కావున దేవునే విశ్వాసులు నమ్ముదురుగాక !

విశ్వాసులారా ! మీ భార్యాపుత్త్రులే మీకు శత్రువులు. కావున, వారినిగూర్చి జాగ్రత్తగ నుండుఁడు. కాని, వారి కపటమును గణింపక వారిని క్షమించి యంతకఠినముగనుండనిచో, దేవుఁడును మీయెడల నంతకాఠిన్యమును వహింపక కరుణఁజూపును.

మీధనము, మీపుత్త్రులు మీకుశోధన హేతువులగుచున్నారు. కాని, దేవుఁడు మీకు గొప్ప బహుమాన మీయఁగలఁడు.

కావున మీశక్తికొలఁది దేవునికి భయపడుఁడు. అతనిని విని విధేయులరుకండు. మీ సౌఖ్యముకొఱకే భిక్షము పెట్టుఁడు. తమ యత్యాశనుండి తప్పింపఁబడినవారే యభివృద్ధినొందుదురు.

దేవుఁడు కృతజ్ఞుఁడు. చిరకాల మోర్పుగలవాఁడు. మీరు దయతో నప్పిచ్చినదాని నాతఁడు మీకు ద్విగుణముగా నిచ్చును.

అతఁడు శక్తిమంతుఁడు, బుద్ధిమంతుఁడు ; అతనికి రహస్యములు బహిరంగవిషయములుగూడఁ దెలియును.



# సురా-65-విడాకులు.

మదీనా-12 పద్యములు-2 రుక్కూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

## అధ్యాయము-1.

ఓయీ ప్రవక్తా, నీవు నీభార్యలకు విడాకులిచ్చినప్పుడేదో కొంతకాలమువఱకే యట్లు వదలియుండుము. అట్లు నీవెన్ని రోజులు విడువనెంచితివో యాదినములనుజాగ్రత్తగా లెక్కపెట్టుకొనుచుండుము. నీప్రభువగు నల్లాయెడల నీవునిర్వర్తింపవలసినవిధిని జ్ఞాపక ముంచుకొనుము. నీవు వారి, నిండ్లనుండి తఱిమివేయకుము. వారును తాముస్పష్టముగ వ్యభిచరించినతప్ప తమంతట ఇండ్లనువదలి వెళ్ళఁగూడదు. అవి దేవునిహద్దులు. అల్లాహద్దులను మీఱినవాఁడు తనయాత్మకు తానే యన్యాయముచేసికొనినవాఁ డగును. ఇట్లు నీవు విడాకులిచ్చిన పిదప అల్లా నిన్ను నీభార్యలతో తిరిగి కలుపునేమో నీకుతెలియదు.

నియమితకాల మయినంతనే విడాకులిచ్చిన స్త్రీలును ఇంట నుంచుకొనుటయో, లేదా దయతో పంపివేయుటయో చేయవలయును. అట్లుపంపివేయునప్పుడు దేవునిప్రమాణముగా మీలో నిద్దఱు న్యాయవంతులయెదుట స్పష్టమగు సాక్ష్యమును చెప్పవలయును. అల్లాయందును తుదిదినమునందును నమ్మకముగలవాఁ డిట్లే సంచరింప వలయునని దేవునియాజ్ఞ. అల్లాయెడల తనకుఁగల విధిని నెరవేర్చినవాని కాతఁడు తగిన రక్షణనిచ్చి,

తా ననుకొనని ప్రదేశమునుండి సహాయులను బంపుచుండును. అల్లాను నమ్మినవారి కాతనిసహాయమే చాలును. అల్లా తనకోర్కెను

నెరవేర్చుకొనగలఁడు. అతఁడు ప్రతివిషయమునకును నొకమితిని కల్పించి యున్నాఁడు.

ముట్లు కామని నిరాశచేసికొనిన నీస్త్రీలనుగురించి నీ కనుమాన మున్నయెడల, మూఁడునెల లోర్చియుండుము. ఇంకను ముట్టుకాని యెడలనునట్లేచేయుము. గర్భవతులైయున్న భార్యలుప్రసవమగువఱకును వారిని విడువఁగూడదు. అల్లాయెడల తాను వర్తింపవలసిన విధినిగూర్చి జాగ్రత్తగానుండువారి కాతఁడు సర్వకార్యములను సులువుచేయును.

ఇది అల్లా నీకు తెలిపినయాజ్ఞ. అల్లాయాజ్ఞయెడల గుఱుతు గలిగి యుండువాని కాతఁడు కీడునుతొలఁగించి గొప్పబహుమానము నీయఁగలఁడు.

నీస్థితి ననుసరించి నీవునివసించు గృహమునందే నీస్త్రీలనుగూడ నుంచుము. వారిని కష్టపెట్టుటకై వారి కెట్టియపకారమును జేయకుము. వారు గర్భవతులైయున్నయెడల వారుప్రసవించువఱకును వారి కెట్టి లోపమును జేయకుము. తమకుపుట్టిన బిడ్డలకు పాలిచ్చినయెడల వారికి తగిన ధనమిమ్ము. మీ రొండొరులకు మేలు చేసికొనుఁడు. మీరాయిరువు రకునుపడనియెడల బిడ్డలకు పాలిచ్చుటకు మఱియొకదాది నేర్పఱుచుఁడు.

ధనవంతుఁడైనవాఁడు తనభార్యలకై తగినధనము వినియోగించవలెను. బీదఱికమున నున్నవాఁడు దేవుఁడు తనకిచ్చినదానిలోనే వారికిచ్చుచుండవలెను. దేవుఁ డెవ్వనిపైనను తలకుమించనిభార ముంచఁడు. అల్లా తొలుతకష్టమును తరువాత సుఖమును నొసగును.

## అధ్యాయము 2.

దేవునియు నతనిప్రవక్తలయు నాజ్ఞలను మన్నింపని యెన్నియో పట్టణములవారిని మేము కఠినముగా శోధించి యతిఘోరముగ శిక్షించి యుంటిమి.

కావున వారు తమదుష్టకృత్యములకు తగినఫల మనుభవించిరి. వారికినరకమే గతియైనది.

10 అల్లా వారికొఱకు ఘోరశిక్షను సిద్ధముచేసియున్నాఁడు. కావున బుద్ధిమంతులగు విశ్వాసులారా! అల్లాయెడల మీరు నిర్వర్తింప వలసిన విధినిగూర్చి జాగ్రత్తగనుండుఁడు. నిశ్చయముగా, అల్లా మీకు మీవిధిని దెలుపుటకై,

విశ్వసించి సత్కార్యములనాచరించువారిని తమస్సునుండిజ్యోతి లోనికిఁ దెచ్చుటకు స్పష్టసూచనలనువచించు నొకప్రవక్త నాతఁ డంపి యున్నాఁడు. అల్లాయందు నమ్మకముగలిగి సత్కార్యముల నాచరించు వారిని తరంగిణులు ప్రవహించు నుద్యానవనములం దాతఁడు ప్రవే శింపఁజేయును. అచట వారు శాశ్వతముగ వసింపఁగలరు. అల్లా వారికి మంచి పోషణనొసగును.

సప్తస్వర్గములను, ఆస్వర్గములతోఁ దుల్యమగు భూమిని, సృజించినవాఁడు దేవుఁడే. అల్లాకు సర్వవస్తువులపైనను శక్తికలదనియు, అతఁడు సర్వవస్తువులను నావరించియున్నాఁ డనియుఁ దెలుపుటకు ఆతని యాజ్ఞ నిరంతరమును నవతరించుచునేయుండును.

# సురా-66 నిషేధము.

మదీనా-12 పద్యములు-2 రుక్కులు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అధ్యాయము. 1.

ఓప్రవక్తా, దేవుఁడు సాధువనియుఁ, గరుణాళుఁడనియు, నీభార్య లను సంతోషపెట్టుటకై దేవుఁడు నీకు న్యాయవంతమని విధించిన దాని నేలనిషేధించెదవు?

దేవుఁడు మీప్రమాణములనుండి మిమ్ముల విమోచనముచేసినాఁడు. దేవుఁడు మీయజమానుఁడు. అతఁడు జ్ఞాని, బుద్ధుఁడు !

క్రొత్తగాజరిగిన యొకసంగతిని ప్రవక్త తనభార్యతో రహస్యమని చెప్పగా దానినామె వెలిబుచ్చెను. దేవుఁడాతని కీసంగతిచెప్పఁగా నాతఁడామె కందులో సగముచెప్పి సగముదాచెను. చెప్పినదాని నామె విని "నీకు దీని నెవరుచెప్పి" రని యడుగఁగా "జ్ఞానియగు బుద్ధుఁడు నాకు చెప్పినాఁడు.

"ఇప్పుడు మీహృదయములు దారితప్పినవి. మీరు పశ్చాత్తప్తులై దేవునిఁదలంచినచో................లేక మీరు ప్రవక్తపైఁ గుట్రలఁబన్నినచో, దేవుఁడును, జిబ్రీలును, విశ్వాసులలో నందఱును, నాతనికి రక్షకులని తెలిసికొనుఁడు. వీరుగాక దేవతలును నతనికి సహాయపడుదురు.

"బహుశః అతఁడు మిమ్ములనిరువురను వదలివేసినచో, దృఢభక్తురాండ్రు, విశ్వాసినులు, నుత్సాహవతులు, నమ్రములు, నుపవాసదీక్షాపరులు, మనుష్యులయందును, కన్యలయందును, గీర్తిగాంచినవారు నగు భార్యలను, మీకంటె శ్రేష్ఠుల నాతనికి మీస్థానమునసీయఁగలఁడు" అనెను.

"విశ్వాసులారా ! మనుష్యులును, ఱాళ్ళును నింధనములుగఁ గలిగి తీవ్రదృష్టితోఁజూచు బలవంతులగు దేవతలయధికారములోనున్న యగ్నినుండి మిమ్మును మీకుటుంబములను రక్షించుకొనుఁడు. దేవునియాజ్ఞను వా రుల్లంఘింపరు. ఆతనియాజ్ఞప్రకారము వారుచేసి తీరుదురు.

అవిశ్వాసులారా ! ఈదినమున సాకులను గల్పించుకొనకుఁడు. మీమీకార్యములప్రకారము మీకు ఫలముచేకూరును.

## అధ్యాయము-2.

విశ్వాసులారా! సత్యముగు పశ్చాత్తాపముగలిగి దేవునివైపు తిరుగుఁడు. బహుశః దేవుఁడు మీపాపములను బరిహరింపఁగలఁడు. ప్రవక్తను నాతనివంటిభక్తిగలవారిని దేవుఁడు లజ్జపడునట్లు చేయక యుండుదినమున, నదులుప్రవహించు నుద్యానవనములలోనికి మిమ్ములఁ దీసికొనిపోవును వారిజ్యోతి వారికిముందుగను కుడిప్రక్కలను బరుగెత్తుచుండును. వారు "దేవుఁడు మాజ్యోతిని బ్రకాశవంతముచేసి మమ్ము క్షమించుఁగాక! దేవా! నీ కన్నివస్తువులపైనను శక్తి గలదు" అందురు.

ఓప్రవక్తా! అవిశ్వాసులపైనను, కృత్రిమ స్వభావులపైనను, యుద్ధముచేసి, కార్యమువహింపుము. నరకమే వారికి వాసస్థానము. అచటికి మార్గము దుఃఖసంకులము!

10 నుహూ భార్యను, లూటు భార్యను దేవుఁ డవిశ్వాసకుల కుదాహరణప్రాయులఁ జేసియున్నాఁడు. వారు మాసేవకులలోఁ బుణ్యవంతులగు నిరువుర క్రిందనుండి యిద్దఱును మోసపుచ్చిరి. కాని వారికి దేవునిపై వారిభర్తలే సహాయమును జేయఁజాలరైరి. వారితో, "అగ్నిలోఁబ్రవేశించువారితోఁ బ్రవేశింపుఁడు" అనిచెప్పఁబడును.

ఫిరౌనుభార్య, "ప్రభువా! భోగభూమియందు నీతోనుండుటకు నాకొకయిల్లు కట్టుము. ఫిరౌనునుండియు, నాతనిచర్యలనుండియు నన్ను తప్పింపుము. దుష్టులనుండి నన్ను దూరముగనుంచుము" అనెను. దేవుఁడామెను గూడ విశ్వాసుల కుదాహరణప్రాయగాఁ గల్పించియున్నాఁడు.

ఇమ్రాను పుత్రికయగు మరియమ్మ తనకన్యాత్వమును గాపాడుకొనెను. ఆమెగర్భములోనికి మాపరిశుద్ధాత్మను బ్రవేశపెట్టితిమి. ఆమె ప్రభువుమాటలను, అతని పవిత్రగ్రంథములను నమ్మి, భక్తిపరాయణాలలో నొకతెయైయుండెను. ఈమెయు నుదాహరణప్రాయయే.

# కాండము. 29

## సూరా--67 రాజ్యము.

మక్కా--30 పద్యములు-2 రుకూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

రాజ్యము తనచేతియం దుంచికొనినవాఁడు ధన్యుఁడగుఁగాక! ఆతని కన్నివస్తువులపైనను నధికారముకలదు.

మీలో మిక్కిలి పుణ్యకర్మలఁ జేయువా రెవరో తెలిసికొనుట కాతఁడు జీవనమును, మృత్యువును సృజించినాఁడు. అతఁడు క్షమాపరుఁడు. శక్తిమంతుఁడు.

అతఁడే యొకదానిపై నొకటిగా నేడుస్వర్గములను నిర్మించినాఁడు. దయానిధియగు దేవుని నిర్మాణమునం దెట్టిలోపమును గనఁబడదు. మఱియొకసారిచూడుము. నీ కేమైన లోపము కనఁబడుచున్నదా?

మఱి రెండుసారులు చూడుము. ఎంతచూచినను నీదృష్టి యలసి తేజోవిహీనమై తిరిగివచ్చును.

ఇదిగాక స్వర్గమును జ్యోతులతో నలంకరించి, యచటఁ బిశాచములపైఁ బ్రయోగించుటకుఁ బ్రజ్వలించు నగ్నికణముల నాయిత్త పఱిచియున్నాము.

తమప్రభువుపై విశ్వాసములేనివారికి నరకబాధతప్పదు. అచ టికి ప్రయాణ మతిదుఃఖకరము.

వా రందుత్రోయఁబడి యచటనగ్ని, గార్ధభస్వరముతో

నుడుకుచు, కోపముతో బ్రద్దలగునట్లు కనుగొందురు. దాని రక్షకులు వారిని దానిలోఁ ద్రోయుచు, "నీకు భయసూచన నిచ్చుట కెవఁడును రాలేదా ?" యని యడుగ

వారు, "అవును, మాకు భయపెట్టుచు నొకఁడువచ్చెఁగాని, యాతని మే మనృతవాదిగాఁ బరిగణించి "దేవుఁ డెవ్వరిని బంపలేదు. మీారు కేవలము మోహితులై యున్నా" రని ప్రత్యుత్తర మిచ్చితిమి.

మేము వారిమాటలను జెవినిబెట్టినచో నీయగ్నిజ్వాలల యందు వసింపకుండియే యుందుము" అందురు.

వారు తమపాపముల నొప్పుకొందురుగాని, "ఓయగ్నివాస్తవ్యులారా ! నోరుమూయుఁడు"

అయినను తమ ప్రభువునకు రహస్యముగా భయపడువారికి క్షమాపణయు, గొప్పబహుమానమును గలుగనున్నవి.

నీవు రహస్యముగ మొఱలిడినను, బహిరంగముగ మొఱలిడినను మీాహృదయాంతర్గతమగున దాతనికి తెలియనే తెలియును.

ఏమి, యతఁడు సర్వాంతర్యామి, సర్వజ్ఞుఁడు నై యుండియు, సృష్టించిన వాఁడెవఁడో యాతనికిఁ దెలియదా ?

అధ్యాయము-2.

ఆతఁడే నీ కీభూమిని సదునుగాఁ జేసియున్నాఁడు. కావున నా విశాల భూభాగముల సంచరించునాతఁ డనుగ్రహించినవానిని దినుచు నుండుఁడు. తుదకు మీారాతనియొద్దకే పోఁగలరు.

ఏమి, ఆస్వర్గవాసి భూమిని చీల్పఁగలఁడు. మీకుఁ దెలియదా? అదిగో యది కంపింపఁగలదు.

మీపై నాతఁడు శిలాపూరితమగు ఝంఝామారుతమును బంపఁడని మీకు నమ్మకమున్నదా? నాభయసూచన కర్థమేమో మీకప్పుడే తెలియఁగలదు.

నిశ్చయముగా నీపూర్వులు నాదూత లసత్యవాదులని నిరసించిరి. నాకోపమతిఘోరము.

రెక్కలఁజాచుచు, ముడుచుకొనుచు వారితలలపై నెగురుచున్న పక్షులు వారికిఁ గనఁబడలేదా? దయానిధియగు దేవుఁడుతప్ప నితరుఁడు వానిన ట్లెగురఁజేయలేఁడు. ఆతనికి సర్వవస్తువులపైనను సమానాదరమే.

20 నీకు సైన్యమువలె సహాయపడువాఁడు దయానిధియగు దేవుఁడుగాక యింకెవఁడు? నిశ్చయముగా నవిశ్వాసులు భ్రమాక్రాంతచిత్తులై యున్నారు.

ఆతఁడు నీకుఁ గావలసిన దీయకపోయినచో నింకెవ్వరు నీకీయఁగలరు? అయినను వా రతనినుండి దూరముగఁ దొలఁగి గర్వపూరితులై యుందురు.

సరియగు మార్గమునఁ దలయెత్తికొని నిరుగువానికంటె ముఖమును నేలపైమోపి ప్రాకువాఁ డెక్కువరక్షణ నొందియున్నాఁడా?

"నిన్ను పుట్టించి, వినునట్లును, చూచునట్లునుజేసి, హృదయమునిచ్చినవాఁ డాతఁడే. అయినను కొలదిమందిమాత్రమే కృతజ్ఞులై యున్నారు.

భూమిలో మిమ్ము పుట్టించినవాఁ డాతఁడే. తుదకు మీరందఱు నాతనియొద్దకే చేరికొనఁగలరు" అనుము.

వారొకవేళ, "మీరుపల్కినది సత్యమైనచో మీరు భయపెట్టున దెప్పుడురాఁగలదు" అని యందురు.

"ఏమో నాకుఁదెలియదు. అది దేవునికే యెఱుక. భయసూచనను బహిరంగముగా నిచ్చుటయే నాపని" అనుము.

అదిదగ్గఱకు వచ్చుటను వారుచూచినచో వారిముఖములువిచారాక్రాంతములగును. 'మీరుకోరికొనుచున్నదిదియే' యని యప్పుడు వారికి మేము చెప్పెదము.

"మీరేమి తలంచుచున్నారు? దేవుఁడు నన్నును, నన్ననుసరించువారిని, నాశనము గావింప నీ వనుగ్రహింపని యవిశ్వాసులకు ఘోరబాధను తప్పింపఁగలవాఁ డెవ్వఁడు?

ఆతఁడే దయానిధియగు దేవుఁడు. అతనిని మేమునమ్మి పూర్ణముగ విశ్వసించుచున్నాము. ఇఁకముం దెవ్వరు తప్పుత్రోవ నున్నారో తెలియఁ గలదు.

30 మీ రేమనుకొనుచున్నారు ? ఉదయమునసే మీజలములు శుష్కించిపోయినచో, మీకుఁ బ్రవహించుచున్న నిర్మలోదకము నెవ్వఁడీయగలఁడు ?" అనుము.

# సురా 68 కలము.

మక్కా - 52 పద్యములు-2 రుకూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

## అధ్యాయము-1.

(నూన్ = చేప) కలమాన ! వారువ్రాసిన వ్రాఁతయాన !

ఓమహాత్మా ! దైవానుగ్రహముచే నీవు పిశాచగ్రస్తుఁడవు కాకయున్నావు.

నీ వుదారస్వభావుఁడవు.

కాన నీకనంతలాభము కలుగనున్నది.

మీలో నెవరికి మతిపోయినదో

నీవును చూచెదవు. వారును జూచెదరు.

ఇపుడు నీప్రభువునకుఁ దనమార్గమునుండి తప్పువాఁడెవఁడో, దాని నవలంబించినవాఁడెవఁడో కూడ నెఱుక.

కావున నిన్ను నసత్యవాది యని పిలుచువారికి తా వొసంగకుము.

వారు తమయెడల నిన్ను సౌజన్యముతోఁ బ్రవర్తింపుమందురు. అపుడు వారు నీయెడల స్నేహితులవలె స్నేహముకలిగియుందురు.

10 కాని, యామనుష్యుఁడు భాగ్యవంతుఁడయినను, బుత్త్రవంతుఁడయినను,

ఒట్టుబెట్టుకొనువాఁడు నీచుఁడు.

మర్యాదతీయువాఁడు, నలుగురితో కొండెములు చాటువాఁడు,

సజ్జనవిరోధి, సన్మార్గాతిక్రముఁడు, నేరస్థుఁడు,

క్రూరుఁడు, నింతకుమించి యపవిత్రకులుఁడు,

ఈయద్భుతస్తోత్రములను విని, ఓహో! తాతలనాఁటి పిట్ట కథలని పల్కువాఁడును నగువానికి లోఁబడకుము.

వాని ముక్కుచరములపై చుఱకలు వేసెదము.

నిశ్చయముగా జంకును గొంకును లేక యుదయమున పండ్లు గోసెదమని పల్కిన తోఁటవారికి ఋజువుచేసినట్లే వారికిని (మక్కావాసులకును) ఋజువుచేసియున్నాము.

వారు నిద్రించుచుండ వారిచుట్టును నెటుచూచినను,

నాశనము చుట్టుకొనియుండెను.

20 తెల్లవారుసరికి తోఁటయంతయు ఫలవిహీనమైన ట్లయ్యెను.

తెల్లవారఁగా వా రొండొరులఁ బిలిచి,

"నీకు ఖర్జూరఫలములు కావలసినచో వేగముగ నీపొలమునకుఁ బొ" మ్మని పల్కిరి.

అట్లు వారిలో వారు గుసగుసలాడుచు,

"బీదవాఁ డెవ్వఁడును నేఁడు నీతోఁటలో కాలుపెట్టఁగూడదు" అని యనుకొనిరి.

ఇట్లు కృతనిశ్చయులై వా రుదయమునఁబోయి,

చూచి "నిజముగా మనము తప్పుచేసియున్నాము.

అవును! మహంనద్లు మనకు నిషిద్ధములైన" వని యనుకొనిరి.

వారిలో మంచిమనస్సుగలవాఁ డొకఁడు "దేవుని మీరు స్తుతింపవలయునని నేను మీకుఁ జెప్పలేదా?" యనెను.

దేవునిమహిమను గొనియాడెదముగాక! మనముతప్పుచేసితిమి" అని,

30 వా రొకరినొకరు నిందించుకొనసాగిరి.

అయ్యో! ఎట్టిదుఃఖభాగులము! దేవునియాజ్ఞ నతిక్రమించితిమి.

బహుశః దేవుఁడు మాకింతకంటె మంచితోఁట ననుగ్రహించును. దానికొఱకు మే మతనిని బ్రార్థించుచున్నాము" అని వారనిరి.

పూర్వము మే మట్టిశిక్షను విధించియుంటిమి. ముందు వారి కింతకంటె కఠినశిక్ష విధింపఁబడును. అయ్యో! వారి కాసంగతి తెలిసినచో నెంత బాగుండును!

## అధ్యాయము-2.

నిశ్చయముగా దైవభీతిగలవారికి ప్రభుసాన్నిధ్యమునసే వినోదారామములు ప్రసాదింపఁబడును.

తమయాత్మలను దైవార్పణముచేసినవారిని, ఆతనికోపమునకుఁ బాత్రులగువారిని నొక్కరీతిగాఁ జూతుమా?

ఇట్లనుకొనుటకు మీకేమి మూడినది ?

మీరు కోరినవస్తువులు మీకు దొరకునని చెప్పు

దైవగ్రంథములు మీయొద్ద నున్నవా ?

రక్షణదినమువఱకును నీవు కోరినవస్తువులను బొందఁగలవని చెప్పు ప్రమాణముల నేమైన సంపాదించితివా ?

40 వారిలో నెవ్వరు నీకట్టి ప్రమాణముల నీయఁగలరో యడుగుము. లేక వారిదేవుళ్ళను పరమాత్మునితోఁ బాటు కలిపిరా ? వారి మాట సత్యమైనచో నాయుపదేవులెవరో మాకు గనఁబఱిచెదరు గాక !

వారిపాదరక్షలు తీసివేయఁబడి భక్తితో పూజచేయఁబిలువఁబడినప్పుడు వారా యాదుదేవులను జూడలేరు.

వారధోవీక్షణులై సిగ్గుచే నావరింపఁబడియుందురు. వారు సురక్షితముగా నున్నప్పుడు పూజసేయుమనిన నిరాకరించిరి.

అందుచేతఁ బైనచెప్పినది కృత్రిమమని చెప్పువారిని మాకు వదలిపెట్టుము. వారిని క్రమముగ నాశనముచేసెదము. ఆనాశనమార్గమును వారికిఁ దెలియఁజేయము.

అయిన నింకను వారియెడల నోర్పుగలిగియున్నాము. స్థిర సంకల్పులము.

వారినుండి నీకేమైన లాభము కావలెనా ? వారే మీయఁగలరు ? వారే ఋణభారమునకుఁ బాల్పడియున్నారు.

ఈరహస్యములు వారికిఁ దెలియునా ? దైవగ్రంథమునుండి వారు వానిని గ్రహింతురా ?

కావున నోర్పుతో దేవునియాజ్ఞకొఱకు వేచియుండుము. పరమ దుఃఖములో నున్నప్పుడు దేవునికొఱకేడ్చిన యా మత్స్యాంతర్గతుఁడగు మనుష్యునివలె నుండకుము.

భగవంతునిదయ కాతఁడు పాత్రుఁడు కానిచో సిగ్గుచే నావిలుఁడై యాతఁడు తీరమునకుఁ గొట్టఁబడువాఁడేకదా!

50 కాని, ప్రభువాతనిపై దయగొని, యతనిని న్యాయవంతులలోఁ జేర్చెను.

కురానుచెప్పు సూచనలను విని, నమ్మనివారు నిన్ను తప్పక కొట్టెదరు. నీకు పిశాచము పట్టినదందురు.

ఏమైనను సర్వభూతములకును నిది భవిష్యత్సూచన యని నమ్మము.

# సురా-69 కాకతప్పనిది.

మక్కా-52 పద్యములు-2 రుకూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అధ్యాయము-1.

## కాకతప్పనిది!

కాకతప్పని దనఁగానేమి?

కాకతప్పనిదేమో నీ కెవ్వ రెఱుకచేయఁగలరు.

'సామూదు' 'ఆద్' అనువార లాభయావహదినము నసత్యముగాఁ బరిగణించిరి.

అందుచేత 'సామూదు' వారు పెళపెళమ్రోగు పిడుగులచే నాశనమయిరి.

'ఆద్' వారు గర్జించుచున్న ప్రచండ ఝంఝామారుతముచే నశించిరి.

ఏడుపగళ్ళు నేడురాత్రులును నది దేవునియాజ్ఞను నిర్వర్తించినది. ఆసమయమున లోపల బోలయిన తాళవృక్షకాండములవలె మనుష్యులు నేలఁగూలియుండుటను నీవుచూచియుందువు.

ఇం దొకఁడయినను బ్రతికియున్నవాఁడు నీకు కనిపించి యుండెనా ?

వీరుగాక, ఫిరౌను, నతనిపూర్వులును, నాశనమయిన పురము లును, నన్నియుఁ బాపముచేసి

ప్రభువుపంపిన దూతను తిరస్కరించియుండెను. అందుచేత వారికి చేయవలసిన శిక్షలనన్నిటిని నొకఘోరశిక్షగాసమకూర్చి వారిపై నాతఁడు పంపియుండెను.

వఱద మిక్కిలిపొంగియున్నప్పు డదిమీకుభయసూచనమై, యాసూచనను జ్ఞప్తియుంచుకొందురను నుద్దేశముతో,

మి మ్మొకనావయం దుంచితిమి.

కాని, భేరీపై, నొక్కమ్రోఁత వినఁబడునప్పుడు,

భూమియుఁ బర్వతములును నెగఁజిమ్మఁబడి, రెండును నొక్క పెట్టున ధూళియైపోవునప్పుడు,

ఆదినమున నాకస్మికముగా రాఁగల దుఃఖ మకస్మాత్తుగా వచ్చి పడును.

స్వర్గమానాఁడు పెళుసయియుండి రెండుముక్కలుగాఁజీలిపోవును.

దేవతలు దాని కిరుప్రక్కల నుందురు. వారికిపైఁగా నెనమంద్రు ప్రభువు సింహాసనమును మోసికొనియుందురు.

నాఁడు మీ రతనియెదుటికి వచ్చినప్పుడు మీ రహస్యకార్యము లెవియు దాగియుండఁజాలవు.

అప్పుడు తనపుస్తకమును కుడిచేతనందుకొనువాఁడు తనస్నేహితులతో " దీనిని దీసికొనుఁడు, దీనిని చదువుఁడు.

20 నాసుకృతములఫల మిదియే యగునని యెల్లప్పుడును దలంచుచుంటినని పలుకును.

ఆతఁ డొక పక్వఫలపూర్ణమగు విశాలోద్యానమున,
ఫలములు చేతికందివచ్చుచుండ,
సుఖజీవనము జేయుచుండును.

" నీ వారోగ్యవంతుఁడవై కావలసినది తిని, కావలసినది త్రాగి సుఖింపుము. పూర్వదినములయందు ముందుగా నిచటికిపంపికొనిన సత్కర్మలఫలమిదియే సుమీ "

కాని, యెడమచేతితో తన పుస్తకము నందుకొన్నవాఁడు " అయ్యో యీపుస్తకము నాచేతి కేలయిచ్చితిరి.
నాదుర్గతి నా కేల యెఱుకచేసితిరి !
నే నేలచావ లేదు !
నాధనము నాకిప్పు డక్కఱకురాదేమి ?
నాసామర్థ్య మంతయు నన్ను వీడిపోయినదే" యని విలపించును.
30 " వీనిని పట్టి సంకెలలం దగుల్చుఁడు ;
నరకాగ్నియందు వీనిని వైచి కాల్చుఁడు.
పిదప డెబ్బదిమూరలగొలుసుతో నీతని బంధింపుఁడు.
ఈతఁడు మహాప్రభువగు దేవుని నమ్మలేదు.
బీదల కన్నమిడుటయందు శ్రద్ధనూన లేదు.
కావున నీదినమం దీతనికి మిత్రులెవ్వరును నుండఁజాలరు.
పాపులు కుడువవలసిన కుళ్ళుపండ్లుతప్ప
వేఱొకయాహారము వీనికిదొరకదు "

## అధ్యాయము-2.

ఇది పరమమాన్యుఁడగు ప్రవక్తవాక్యమని,

మీరు చూచినదాని యానను,

40 చూడనిదానియానను, ప్రమాణముచేయు నవసరములేదు.

ఇదియొక కవీశ్వరుని యూహాజనితవాక్యముకాదు. మీ కించుక యైనను విశ్వాసము లేదేల ?

ఇదియొక శకునపక్షివాని వాక్యమును గాదు. మీరు భయసూచన నిసుమంతయు గ్రహింపరేల ?

ఇది బ్రహ్మాండాధినాథునినుండివచ్చిన వర్తమానము.

ముహమ్మదే యీవాక్యములను కల్పించి మిమ్ము మోసపుచ్చఁ దలఁచినచో,

ఆతనిని కుడిచేతితోఁ బట్టి,

మెడమీఁదిరక్తనాళములను గోసి వధించియుండమా ?

ఆతనికి మిమ్ములలో నెవ్వరినయిన నొప్పగింపకయుందుమా ?

లేదు. ఈకురాను నిశ్చయముగా దైవభీతిపరులగువారికి భయసూచనను దెలుపుచున్నది.

ఇదియంతయు నసత్యమని మీలోఁ గొందఱు తలంతురనియు మాకుఁ దెలియును.

50 కాని, విశ్వాసహీనుల కిది నిరాశాహేతువు.

ఇదియే సత్యజ్ఞానసారము.

కావున మహామహిముండగు నీప్రభువునామమును స్తుతింపుము.

# సు రా 70-సో పా న ము లు.

మక్కా-44 పద్యములు-2 రుక్కూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

## అధ్యాయము-1.

ఒకఁడవిశ్వాసకులపై శిక్ష యకస్మాత్తుగా దిగుఁగాక యని ప్రార్థించెను.

ఏఁబదివేలేండ్లలోఁ గాని దేవుని సాన్నిధ్యమును జేరరాని సోపానముల మీఁదుగా నొక్కదినములో దేవతలను, ఆత్మను నెక్కించిన,

సోపానాధిదేవతయగు దేవుఁడా శిక్ష నొసగకుండ,

ఎవఁడాటంకపెట్టగలఁడు ?

కావున, నీవు తగునోర్పుతో సహించియుండుము.

వా రాదినము దూరముగానున్నదని తలంతురు.

కాని, మాకది దగ్గఱఁగనే కనిపించుచున్నది.

ఆదినమున స్వర్గములన్నియు కఱఁగిన యిత్తడిముద్దవలె నగును.

పర్వతములు గొఱ్ఱెబొచ్చువలె మెత్తనగును.

10 ఆదినమున స్నేహితులొకరినొకరు చూచికొనుచు మాట్లాడ లేకుందురు.

ఆదినమున తన సంతానము,

భార్య, యన్నదమ్ముఁడు,

తనపైఁ బ్రేమఁజూపిన బంధువర్గము,

భూమియందుఁగల యందఱు, వీరినెల్ల నిచ్చివేసి దుష్టుఁడు శిక్ష నుండి తప్పించుకొన నుత్సాహపడును.

కాని, యదిసంభవింపదు.

వెనుకతిరిగి వెళ్ళిపోయి,

ధనార్జనపరుఁడై,

దానిని దాఁటికొనినవానిని

అగ్ని తలపట్టి తనలోనికీడ్చుకొనును.

20 మనుష్యునికి సహజముగా తొందరహెచ్చు.

కష్టకాలమునం దాతనికి సహనములేదు.

తనకు మేలుకలుగునప్పుడు దానిని వదలిపెట్టఁజాలఁడు.

కాని, ప్రార్థనాపరులై,

ప్రార్థన నెప్పుడును వదలక,

యాచకులకును, యాచించుటకు లజ్జించువారికిని,

తనధనమునందు కొంతభాగమును వినియోగించి,

శిక్షాదినము సత్యమనితలంచి,

ప్రభుపుశిక్షనుండి యెవ్వరును తప్పించుకొనఁజాలరు. కావున

ఆతనిశిక్షనుదలంచి భయకంపితులై,

30 తమభార్యలయందును, తమకుడిచేతులతో సంపాదించిన బానిసలయందును తప్ప,

ఇతరులయందు కామమును జూపువారు దుష్ప్రవర్తులని తెలిసికొని, తమకోర్కెలను తమవశము నుంచికొని,

తమ్ము నమ్మినవారియెడలను, తాముచేయుదుమని చెప్పుపనులయందును సత్యవర్తనులై,

కూటసాక్ష్యములీయక,

ప్రార్థనసమయముల నతిక్రమింపకుండువా రట్లుండరు.

వారు గౌరవభరితులై యుద్యానవనములయందు వసింపఁగలరు.

. . .

అధ్యాయము-౨.

కాని, యవిశ్వాసకులు,

గుంపులు గుంపులుగా నీకు కుడివైపునను నెడమవైపునను తిరుగుచున్నారేల ?

సంతోషారామమున వారందఱును జొరవలెననియేనా వారి యూహ ?

అట్లెంతమాత్రమును జరుగదు. మేము వారిని దేనితో సృజించితిమో వారికి తెలియనే తెలియదు.

40 వారిని తీసివేసి వారికంటె మంచివారిని వారిస్థానమున మే ముంచగలమని,

నేను ప్రాక్పశ్చిమాధిపతియాన బ్రమాణముచేయ నవసరము లేదు. మ మ్మాటంకపెట్టువారును నెవ్వరును లేరు.

కావున వారియిష్టప్రకారము ప్రేలుచు నానందింపనిమ్ము. ఆసన్నమగుచున్న యాదినమున,

వారు యుద్ధసన్నద్ధులగు పురుషులవలె తమ సమాధులనుండి వడివడిగా లేచి,

అధోదృష్టులై యొకరికొక రెదురెదురుగ నిలువఁబడఁగలరు. ఆ భయంకరదిన మట్టిదే.



# సురా - 71 నుహూ.

మక్కా-28 పద్యములు. 2 రుకూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

## అధ్యాయము-1

మేము 'నుహూ' నాతని ప్రజలయొద్దకంపి యాతనితో "నీజనులపై కఠినశిక్ష విధింపఁబడకపూర్వము వారికి భయసూచన ని"మ్మని యంటిమి.

ఆతఁడు "నా ప్రజలారా! నేను మీకు స్పష్టముగా భయసూచనను దెలుపుచున్నాను.

దేవుని సేవింపుఁడు. అతనికి భయపడుఁడు. నాకు విధేయతఁ జూపుఁడు.

ఆతఁడు మీపాపములను క్షమించి, నియమితదినమువఱకును మీకు విశ్రాంతి నొసగును. దేవుని నియమితదినము వచ్చినతరువాత మఱి తడవుండదు. మీరిది తెలిసికొనిన శ్రేయస్కరులగుదురు" అనెను.

ఆతఁడు వెండియు "ప్రభువా! నేను నాప్రజలకు రాత్రింబవళ్ళు మొఱలిడితిని. నామొఱలవలన వారలు నాకు మఱింత దూరముగా పాఱిపోవుచున్నారు.

వారిని నీవు క్షమింతువని నేను మొఱపెట్టుకొలఁదియు, వారు తమ చెవులలో వ్రేళ్ళనుదూర్చికొనుచు, బట్టలను దేహమునిండఁ గప్పికొని, తప్పుదారిని విడువక మిక్కిలి పేరశనాపరులై యున్నారు.

అప్పుడు నేను వారికి మిక్కిలి బిగ్గఱగా మొఱపెట్టితిని.

తిరిగి మర్మములేకుండ నేను వారితో మాటాడితిని; ఏకాంతముగను రహస్యముగను వారికి బోధించితిని.

దేవుఁడు మిమ్ము క్షమియింప సంసిద్ధుఁడై యున్నాఁడు. మీప్రభువును క్షమింపవేఁడుకొనుఁ డనియు,

10 స్వర్గమునుండి మీపై చాలినంతవర్షము నాతఁడు కురియింపఁగలఁడనియు,

మీధనమును సంతానమును వృద్ధిపొందించి, మీతోఁటలను హెచ్చుచేసి, మీకు నీటికాల్వలను ప్రసాదించుననియుఁ జెప్పి,

దేవుని హస్తమునుండి మీరు మేలుకోలు కేల యాశగొనరు ?

ఆతఁడేకదా క్రమేపి మిమ్ము సృజించినాఁడు ?

ఆతఁడేకదా యొకదానిపై నొకటిగా నేఁడుస్వర్గములను నిర్మించినాఁడు. అది మీకుఁ గనఁబడదా ?

ఆస్వర్గములం దాతఁడు చంద్రుని దీపముగను, సూర్యుని దివిటీగను నుంచెనుగదా !

దేవుఁడేకదా మిమ్ము భూమినుండి మొక్కలవలె లేవనెత్తినవాఁడు ?

ఆతఁడే తిరిగి మిమ్ము భూమిలోఁబూడ్చి మఱల జీవింపఁజేయుచుండును.

ఆతఁడే మీకొఱకీభూమి నొకతివాచీవలె పఱచినాఁడు.

అందు మీరు విశాలమార్గములసంచరించుటకట్లు చేసినాఁడని వారిని మందలించితిని" అనెను.

## అధ్యాయము-2.

20 నుహూ, "ప్రభువా ! వారు నాపైఁ దిరుగఁబడుచున్నారు. ఎవరి ధనము, సంతతి, వారి నాశనహేతువగునో వారినే వారనుసరింతురు " అనెను.

వారొక గొప్పకుట్రను పన్నిరి.

వారు "మీదేవతల విడిచిపెట్టకుఁడు. వాద్, సువా, యఘూస్, యహూక్, నసర్, అను దేవతలను పరిత్యజింపకుఁడు" అనిరి.

ఇట్లు వా రనేకులను తప్పుత్రోవఁబెట్టిరి. ముహమ్మదా! నీవు కూడ దుష్టులయందు దౌష్ట్యము హెచ్చుటకుఁ గారణమ వగుదువు.

వారి పాపములవలననే వారు నీటియందు మునిఁగి యగ్ని యందుపడఁ బొల్పడుదురు.

తుదకు వారు దేవుఁడుతప్ప నితరుఁడు సహాయకుఁడు కాఁజాలఁ డని తెలిసికొనిరి.

నుహూ, "ప్రభువా! భూమిపై నవిశ్వాసకుల కుటుంబము నొక దానినైనను నుంచకుము.

వారిని నీవు వదలిపెట్టినయెడల, నీకింకరులను తప్పుత్రోవఁబెట్టి, పాపాత్ములను, నవిశ్వాసకులనుమాత్రమే వారు పుత్త్రులుగాఁ గాంతురు.

ప్రభువా! నన్నును, నాజనకులను, భక్తులై గృహముం జొచ్చువారి నెల్లను, భక్తులగు స్త్రీపురుషుల నందఱను క్షమింపుము. దుష్టులకు ఘోరనరకముతప్ప మఱేదియు నీయకుము" అనెను.

---

# సురా 72-సైతాను.

---

మక్కా-28 పద్యములు-2 రుక్కులు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

అధ్యాయము-1

కొన్నిపిశాచములు చెవియొగ్గి విని "నిశ్చయముగా మే మొక యద్భుతసిద్ధాంతమును (కురాను) విని యున్నాము.

అది సత్యమునకు మార్గముఁజూపును. కావున మేము దానిని నమ్మితిమి. ఇఁకముందు మాప్రభువుతో నెవ్వనిని సాటిగా వచింపఁబోము.

మాప్రభువు ప్రభుత్వము ఘనమైనదగుఁగాక! అతనికి భార్యగాని, సంతానముగాని లేదు.

కాని, మాలో మూర్ఖులము కొందఱము ప్రభువునుగూర్చి యన్యాయముగా మాటలాడితిమి.

పిశాచములలోఁగాని, మనుష్యులలోఁగాని, యెవ్వరును దేవుని విషయమై యనృతము లాడఁజాలరని తలంచియుంటిమి.

మనుష్యులలోఁగొందఱు రక్షణకొఱకు పిశాచముల నాశ్రయించినవా రున్నారు. కాని, వారట్లుచేసి తమమౌర్ఖ్యమును వృద్ధి చేసికొనిరి.

మీరు తలంచునట్లే వారును దేవుఁడు చచ్చినవారిని బ్రతికింపఁజాలఁడని తలంచియుండిరి.

స్వర్గములనుగూడ మేము వెదకితిమిగాని, యది గొప్పసైన్యముతోడను, ప్రజ్వలించుచున్న బాణములతోడను, నిండియుండుట మేము గాంచితిమి.

అచట కొన్నియాసనములపైఁ గూర్చుండి విననెంచితిమిగాని, యచట విననెంచినవారిని వెంబడించుటకు జ్వలించుచుండు బాణములు పొంచి సిద్ధముగనే యుండును.

10 నిశ్చయముగా భూమిపై నుండువారికి ప్రభువు కీడే యెంచియున్నాఁడేమో మాకు తెలియదు.

మాలోఁ గొందఱు మంచివారును, కొందఱు చెడ్డవారును, ననేకవిధములుగా నున్నారు.

భూమిపై దేవునిబలము తగ్గింపఁగలవారుగాని, పరుగెత్తి యాతనినుండి తప్పించుకొనఁగల్గువారుగాని, యుండఁజాలరని మేము తలంచితిమి.

కావున మేము మారక్షణమార్గమునుగూర్చి వినినంతనే విశ్వసించితిమి. ప్రభువును నమ్మినవారికి నష్టముగాని, కీడుగాని కలుగఁబోదు.

మాలో కొందఱము ముస్లిములకు (భక్తులకు) వశులమైతిమి, కొందఱము త్రోవఁదప్పితిమి. దేవునికి సర్వము నర్పించువాఁడే సత్యమార్గమును కనుఁగొనఁగలఁడు.

త్రోవతప్పినవారు నరకాగ్ని కింధనములు కాఁగలరు" అని యనుకొనునట్లు నాకుఁ దెలుపఁబడిన" దని వచింపుము.

ఇదిగాక యీమక్కావాసులు సరియగుమార్గముం బట్టినచో వారిని శోధించుటకై సమృద్ధిగా త్రాగుటకు జలము నిచ్చెదము.

కాని, తనప్రభువును మఱచిపోయినవానికి ఘోరబాధ కలిగింతుము.

దేవాలయము లన్నియు దేవునికొఱకేర్పఱుపఁబడినవే. కావున నం దాతనిఁదప్ప నితరులకు మొఱపెట్టకుము.

దేవుని సేవకుఁ డాతనిఁ బిలుచుటకు నిలువఁబడియుండఁగా ప్రజలలోనుండి పిశాచములు బయలువెడలి యాతని నంటుచుఁ బోయెను.

## అధ్యాయము-2.

20 "నేను నా ప్రభువునే పిలుచుచున్నాను. ఆతనితో మఱియెవ్వరిని సాటిచేయను.

నీకు కీడుగాని, మేలుగాని, చేయుదానిపై నా కెట్టి యధికారమును లేదు.

నిజముగా దేవునికెదురుగా నిలిచియుండి నన్ను రక్షించువారెవ్వరును లేరు.

ఆతఁడు తప్ప నాకాశ్రయనీయుఁ డెవ్వఁడును లేఁడు.

దేవునిఁగూర్చి చాటుచు, నాతనివార్తను ప్రబలఁజేయుటయే

నాపని. దేవునిపైనను, నాతనిప్రవక్తపైనను, తిరుగుబాటుచేయువారికి నరకాగ్నియే గతి. వా రందు శాశ్వతముగా నుండితీరవలయును.

వారికి భయపెట్టఁబడినకసి తీరువఱకును, వారు దుష్టులుగనే యుందురు. కాని, యెవరు బలహీనులో, యెవ రల్పసంఖ్యాకులో వారికి తుదకు తెలియఁగలదు.

మీరు భయపెట్టినది సమీపించినదో, దూరముగ నున్నదో నాకు తెలియదు. ఆరహస్య మాతనికే తెలియును.

తనకిష్టుఁ డగు ప్రవక్తకుఁదప్ప నితరుల కారహస్యము నాతఁడు బయలుపెట్టఁడు. ప్రవక్తలు ప్రభువువార్తలను సరిగ చాటిరో లేదో తెలిసికొనుటకు తనకు ముందును, వెనుకను రక్షకభటులు కావలి యుందురు.

వారి ప్రవక్తలును, వారికి సంబంధించినవిషయములును, సర్వ మును నాతని జ్ఞానమ నం దంతర్లీనములై యున్నవి.

---

## సురా 73-వ స్త్రాచ్ఛాదితుఁడు.

---

మక్కా-20 పద్యములు-2 రుకూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అధ్యాయము 1.

### ఓయీ వస్త్రాచ్ఛాదితుఁడా ?

కొంతభాగముతప్ప రాత్రియంతయు నిలిచియుండి ప్రార్థన సేయుము, సగమురాత్రి, అంతకుకొంచెము తక్కువ;

కొంచెము హెచ్చు చాలును; గంభీరవాక్కులతో కురాను పఠింపుము.

అందు నీకత్యంతముఖ్యములగు నుపదేశములను జేయుచున్నాము.

రాత్రివేళ భక్తిశ్రద్ధలు కుదురుకొని మాటలు స్ఫుటముగా బయలువెడలునుగదా !

పగటిపూట నేదోయొకపని యుండనేయుండును.

నీప్రభువునామమునుభజించిసంపూర్ణభక్తితోనాతనిగొలువుము.

పూర్వాపరదిశాధిపతియగు నతఁడుతప్ప వేఱుదేవుఁడు లేఁడు. అతనినే నీరక్షకునిగా స్వీకరింపుము.

10 వారు చెప్పుదాని నోర్పుతో సహించి, గౌరవముగ వారిమార్గమును వదలిపెట్టుము.

ఇహలోకసౌఖ్యముల ననుభవించుచు నాగ్రంథమును నిరాకరించువారిని నాకు వదలిపెట్టుము; ఇంకఁ గొంతకాలము వారితో సహించియుండుము.

మాయొద్ద గట్టిసంకెళ్లును, మండుచున్న యగ్నియు,

గొంతుకకడ్డుపడు నాహారమును, పరమబాధలు నున్నవి.

భూమియుఁ బర్వతములును గజగజవడఁకఁగలదినము వచ్చుచున్నది.

పర్వతములన్నియు పొడిపొడియై పెద్దయిసుకతిన్నెలు కాఁగలవు.

ఫిరౌనున కెట్లుపంపితిమో యట్లే నీపై సాక్ష్యమిచ్చుటకుఁగూడ నొకని నంపియున్నాము.

ఫిరౌనున అప్రవక్తపై తిరుగఁబడెను; అందుచే నాతనిఁబట్టి ఘోరముగ శిక్షించితిమి.

నీవు నమ్మకపోయినచో, చిన్నపిల్లలవెంట్రుకలుగూడ నెరయు నాదినమునుండి యెట్లు తప్పించుకొని దాగియుండఁగలవు ?

దానిమూలమున స్వర్గమే ఖండఖండములు కాఁగలదు, ఈశాపము తగిలి తీరును.

ఇదిగో! ఇదిగో భయసూచన! భగవంతునిఁ జేరుమార్గమును జూచికొనుటయుఁ జూచికొనకుండుటయు నీయిష్టము.

## అధ్యాయము-2.

20 సత్యముగా రాత్రియందు మూఁడువంతులలో రెండువంతులు, సగము, లేదా నీయనుచరులవలె మూఁడవవంతు, ఎంతో కొంతసేపు, నీవును ప్రార్థింతువని నీప్రభువునకుఁ దెలియును. కాని, దేవుఁడు రాత్రిం బవళ్ళప్రమాణమును నిర్ణయించియున్నాఁడు. నీవు సరిగా గంటలను లెక్కపెట్టలేవని యాతనికెఱుక; అందుచేతనే నీయెడల నాతఁడు దయామయుఁడై యున్నాఁడు. కావున నీయోపికనుబట్టి యెంతో కొంత ఖురానునుండి పఠింపుచుండుము. మీలోఁ గొందఱు రోగులుందురు; కొందఱు దైవము ప్రసాదించినదానిని సంపాదించుటకుఁ బ్రపంచమునఁ దిరుగుచుందురు; ఇదంతయు నాతనికెఱుక. అందుచేత నీకు వీలుపడి నంతమట్టుకే ఖురానును పఠింపుము. ప్రార్థనచేయుము. విధివిహితమగు భిక్షమునొసగుము. భగవద్విషయమై హెచ్చుగా వ్యయముచేయుము. నీకుముందుగా పంపుకొనిన పుణ్యకార్యముల నన్నిఁటిని దేవుఁడు నీ కొఱకు దాచియుంచును. ఇట్లు చేయుటయే నీకుత్తమఫలప్రదము; దేవుని క్షమాపణ వేఁడికొనుము. సత్యముగా భగవంతుఁడు దయా దాక్షిణ్యమూర్తి!

---

# సురా-74 వస్త్రాచ్ఛాదితుఁడు.

మక్కా-56 పద్యములు-2 రుక్కూలు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

## అధ్యాయము 1.

ఓయీ! వస్త్రాచ్ఛాదితుఁడా!

లెమ్ము! ఉపద్రవమును నిరూపింపుము.

నీప్రభువును గొప్పగాఁ గనఁబడునట్లుచేయుము!

నీవస్త్రమును పవిత్రముచేసికొనుము.

కల్మషమును పాఱఁద్రోలుము.

తిరిగి యధికముగా పుచ్చుకొను నుద్దేశముతో దానము చేయకుము.

నీప్రభువుకై యోర్పుతో వేచియుండుము.

బూరాపై మ్రోఁతవినఁబడుదినము

చాలకష్టదినమై యుండును.

10 నమ్మనివారి కాదినమున మనశ్శాంతి యుండఁబోదు.

నేను సృజించి,

పరమైశ్వర్యవంతుని జేసి,

పుత్త్రవంతునిఁ జేసి,

సర్వమును బాధారహితముగ నొనర్చినట్టి,

అతఁ డింకను కావలెనని తృష్ణకలిగియున్నచో నాతని నాచేత విడువుము.

అతనికి తగినపని చేసెదను. అతఁడు మాయాజ్ఞలకెల్ల శత్రువు గాన,

వానిపై దుఃఖపరంపరలఁ బంపెదను.

అతఁడు కుట్రచేయుచున్నాఁడు. పన్నాగములఁ బన్నుచున్నాఁడు.

అతనికి శాపము తగులుఁగాక ! ఎంతటిపన్నుగడ !

20 ఇంకను శప్తుఁడగునుగాక ! ఏమిపన్నాగము !

అతఁ డప్పుడు తనచుట్టునుజూచెను.

కోపించెను. మొగముచిట్లించెను.

వెనుకకు తిరిగి నిర్లక్ష్యముగ నుప్పొంగెను.

" ఇది కేవలము గారడి ;

మనుష్యమాత్రుని ప్రేలాపన " యని పలికెను.

నిశ్చయముగా వీనిని నరకాగ్నిలోఁ బడద్రోసెదను.

నరకాగ్ని యన నేమో నీకెవ్వ రెఱుక సేయఁగలరు ?

అది వదలిపెట్టదు. దానికి కనికరము లేదు.

20 దానిపై పందొమ్మండ్రధిదేవత లున్నారు.

దేవతలను దప్ప నితరుల నాయగ్నికి రక్షకులుగా నుంచ లేదు. నమ్మనివారిని తడఁబడఁజేయుటకే వారిసంఖ్య నట్లుంచితిమి. దైవగ్రంథమున్నవారు కురాను సత్యమును నమ్ముదురనియు, నమ్మినవారిభక్తి యధికమగుననియు, నిట్లు చేసితిమి. దైవగ్రంథములను స్వీకరించినవారును, విశ్వాసులును, సంశయింపకుండుటకును హృదయదౌర్బల్యముగలవారును, నమ్మనివారును, " ఈకథవలన దేవుఁ డేమియుద్దేశించె " నని యడుగుటకును నిట్లు చేసితిమి. దేవుఁ డిట్లు తనయిష్టమువచ్చినవారిని మంచిత్రోవలో నడిపించును. ఆప్రభువు సైన్యములఁగూర్చి యాతనికిఁదప్ప నితరులకుఁ దెలియదు. మానవుల కిది యొక యుపద్రవసూచకముగాని వేఱుగాదు.

## అధ్యాయము-2.

చంద్రునియాన !

పోవుచున్న రాత్రియాన !

ప్రకాశముగా వచ్చుచున్న యుదయమాన !

మీలో ముందుకువచ్చి నమ్మినవారికిని, వెనుకకుఁబోయి నమ్మని వారికినిగూడ

చెప్పుచున్నాను. నరకము బహుకష్టభూయిష్ఠమైనది. మనుష్యున కుపద్రవసూచకమైనది.

ప్రత్యాత్మయు తాను చేసిన పనులకు తానే బాధ్యతవహించి యున్నది.

కాని, దేవునికుడిప్రక్కనున్న వారు

40 తమతోఁటలలో

దుర్మార్గులనుజూచి,

" ఈనరకాగ్నిలో మీరేల పడితి " రని యడుగ,

వారు " మేము దేవుని బ్రార్థింపలేదు.

బీదల కన్నమిడలేదు,

వ్యర్థవాదులతో వృథావాదముల సలిపితిమి.

శిక్షాదినమనున దసత్యమంటిమి.

కాని, తుద కాదినమును మేము చూచితిమి " అని ప్రత్యుత్తర మిచ్చెదరు.

అప్పుడు మధ్యవర్తులెవ్వరును వారిని కాపాడఁజాలరు.

అయిన నీయుపద్రవసూచనను వారు పాటింపకుండుటకు వారి కేమిమూడినది ?

50 వారు సింహామునుండి పరుగెత్తు గాడిదలవలె నున్నారేమి ?

వారిలో నందఱకును స్వర్గమునుండి తెఱవఁబడియున్న పుస్తకము దొరకిన బాగుండుననియుండును.

కాదు, కాదు. రాఁబోవుజన్మమనిన వారికి భయములేదు.

కాదు. ఈ ఖురానే చాలినంత యుపద్రవమును సూచింపఁగలదు. ఎవనికికావలసిన వాఁడే యాసూచనను గ్రహింపఁగలఁడు.

కాని, దైవానుగ్రహములేనిదియు నాసూచనరాదు. అతనికి భయపడుట శ్రేయస్కరము; అతనిక్షమాపణ వేఁడికొనుట యుక్తము.

---

# సురా—75 రక్షణదినము.

---

మక్కా-40 పద్యములు-2 రుకూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

రక్షణదినము నానఁగాని,

తన్నుఁ దా నిందించుకొను యాత్మనానఁగాని, నేను ప్రమాణము చేయ నవసరములేదు.

మనుష్యుఁడు సంధులు విడిపోయిన తనయెముకలు తిరిగి చేర్పఁబడునని తెలియఁడా యేమి ?

నిశ్చయముగా మేము వాని వ్రేలికొనలుగూడ సరిగ నమర్పఁగలము.

కాని, మనుష్యుఁడు తనముందు గనఁబడునది కనఁబడలేదని చెప్ప సాహసించుచున్నాఁడు.

"ఆరక్షణదిన మెప్పు" డని యాతఁడు ప్రశ్నించుచున్నాఁడు.
కాని, కన్నులు మిరుమిట్లుగొన్నప్పుడు,
చంద్రుఁడు తమోవృతుఁడైనప్పుడు,
సూర్యచంద్రులు కలిసి పోవునప్పుడు,

10 ఆదినమున మనుష్యుఁడు "నే నెచటికి పాఱిపోఁగలను" అని మొఱపెట్టఁగలఁడు.

కాని, యా మొఱ వృథయగును. అతనికి రక్షణస్థానములేదు.

నీప్రభు వే యాదినమున రక్షణస్థానమగును.

ఆదినుండి యంతమువఱకును దాను చేసిన కర్మలను మనుష్యుఁ డాదినమునఁ దెలిసికొనఁగలఁడు.

ఆదినమున మనుష్యుఁడు తనపైఁ దానే సాక్ష్య మీయవలసి యుండును.

నాఁడు సాకుగల్పించుకొనినను దాని నెవ్వరు నంగీకరింపరు.

(ఈసందేశమును తొందరపడి యనుసరించుటకుఁగాని, యవగాహన చేసికొనుటకుఁగాని ప్రయత్నింపకుము.

దానినొకచో సంపూర్ణముగఁ జేర్చి లోకమున వెల్లడింపఁగల భారము మాది.

మేము తొలుత నాసందేశమును వెల్లడించినపిదప నీవు దాని నుచ్చరింపమొదలిడుము.

తరువాత దానిని మేము నీకు సుగమ మగునట్లు చేసెదము.)

20 కాని, నీవు నిశ్చయముగా నశ్వరమగుదానిని ప్రేమించి,
రాఁబోవు శాశ్వతజీవితమును సరకుగొనకున్నావు.
ఆదినమున ముఖములు ప్రభుసందర్శనోత్సాహముచేఁ
ప్రకాశవంతములగును.
ఆదినమునఁ దమకేదియో గొప్పచేటు వాటిల్లునని,

ముఖములు భయవిహ్వాలము లగును.

నిశ్చయముగా నాఁడు ప్రాణము కంఠగతమగునప్పుడు,

"ప్రాణములను తిరుగ నిచ్చువాఁడెవ్వఁడును లేఁడా ?" యన నాక్రందనము వినవచ్చును.

మనుష్యుఁ డప్పు డీదేహమును విడువవలయు కాలమాసన్న మయినదని తెలిసికొనును.

మరణవేదనచే నులుచుకొనునప్పుడు కాలు కాటిపైఁ జేర్పఁబడును.

30 అప్పుడు వానిని నీప్రభుప్రసన్నిధానమునకు తోసికొనిపోవుదురు.

## అధ్యాయము-2

ఆతఁడు భక్తిపరుఁడుకాఁడు. దేవునిఁ బ్రార్థింపలేదు.

సత్య మసత్యమని పల్కి వెనుదిరిగినాఁడు.

గర్విష్ఠుల సహవాసము చేసి తనబృందమునఁ గలసిపోయినాఁడు.

ఆగడియ యంతకంతకును సమీపించుచున్నది.

ప్రతిక్షణము నది నిన్ను డాయుచున్నది.

మనుష్యుఁడు సర్వాధికారిగా నెల్లప్పుడును నుండుననుకొంటివా?

అతఁడు కేవలము పిండమాత్రుఁడై యుండలేదా ?

తరువాత నాతఁడు చిక్కనినెత్తురుకాఁగా దేవుఁడు దానినుండి యాతని నిర్మించి,

స్త్రీపురుషభేదముచే రెండుగాఁ జేసియుండలేదా ?

ఆతఁడు మృతులను తనసన్నిధానమునకుఁ దోడ్కొని పోవ సమర్థుఁడుగదా !

# సురా-76 మనుష్యుఁడు.

---

మక్కా-31 పద్యములు-2 రుక్కులు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అధ్యాయము 1.

మనుష్యుఁ డనామకవస్తువై చిరకాలము పడియుండెఁగదా !

వానిని శోధించుటకు పుంస్త్రీజాతులనుండి మనుష్యుని సృజించి, వినునట్లును జూచునట్లును జేసితిమి.

ఆతఁడు కృతజ్ఞుఁడైనను, కృతఘ్నుఁడైనను మంచిమార్గములో నుంచితిమి.

అవిశ్వాసులకు శృంఖలములను, కంఠపాశములను ప్రజ్వలించుచున్న యగ్నిని సిద్ధపఱిచితిమి.

కాని, దేవునికింకరుల కేర్పఱిచినట్టియు చాలకాల్వలమూలమున నొకస్థలమునుండి మఱియొకస్థలమునకు సురక్షితముగాఁ గడుపఁగలట్టియు, దేవునికింకరులు త్రాగఁగలట్టియు,

కర్పూరమిళితమైనట్టియు, నూఁటనీటిని ధర్మవర్తనులు త్రాగఁగలరు.

వారు తమమ్రొక్కులను దీర్చికొని, దుఃఖములను నలుదిక్కులకును దూరముగా వ్యాపింపఁజేయఁగల దినమునకు వెఱచువారును,

తమ కాఁకలి యగుచున్నను బీదలకును, ననాథలకును, ఖైదీలకును,

" మేము దేవునిదయకొఱకు మీకాహారము నిడుచున్నాము. మీరు మాకు ప్రత్యుపకృతిగాని, వందనములుగాని చేయనక్కఱలేదు" అనుచుఁ దమయన్నము నిచ్చుచు,

10 మాప్రభువునొద్దనుండి ఘోరము, దుఃఖయుతమునగు దినము నపేక్షించుచుచున్నామని చెప్పువారే ధర్మవర్తనులు.

అట్టిదినమందలి కీడునుండి దేవుఁడు వారిని మఱలించి, వారికి ముఖవికాసమును, నానందమును బ్రసాదించెను.

వారి నిశ్చలభక్తికిమెచ్చి స్వర్గమును పట్టుబట్టలను ననుగ్రహించెను.

అచట వారు పెండ్లిపఱపులపై విశ్రమించి, యెండగాని, చలిగాని యెఱుఁగకుందురు.

అందు వారు చల్లనినీడలదరి నుండఁగా వారి కందివచ్చునట్లు ఫలములు చెట్లపై వ్రేలాడుచుండును.

వారికి రజతపాత్రములును, ద్రాక్షరసముతో నిండిన పెద్దగిన్నెలును పంపఁబడును.

ఆవెండిగిన్నెలు తమంతట తామే కొలిచి కావలసినంత యొసగుచుండును.

అచట 'సల్సెబిల్' (మందగమన) యను సెలయేటినుండి నీటిని దీసి,

అల్లపురసముచేర్చిన గిన్నెలోఁబోసి వారికిత్తురు.

వారికి నిత్యయౌవనలగువార లచట పరిచర్యచేయుచుందురు. వారినిజూచి నీవు తెగి, నలుదిక్కులు చెదరినముత్యములని భ్రమింతువు.

20 ఇది నీవు చూచినయెడల నానందమును, విశాలరాజ్యమును,

సరిగంచులుగల పట్టుపీతాంబరములును చూడఁగలవు. వారికి వెండిగాజు లలంకరింపఁబడియుండును. వారికి వారిప్రభువు నిర్మల తోయమును త్రాగుట కిచ్చుచుండును.

ఇదియే నీబహుమానము. నీప్రయత్నములచే నీవు స్తుతిపాత్రుఁడ వగుదువు.

## అధ్యాయము-2.

ఉచ్చస్థానమునుండి వార్తగా కురానును మేమే నీకుఁ బంపి యున్నాము.

కావున నోర్పుతో దేవునితీర్పుకొఱకు ఎదురుచూచుచుండుము. వారిలో దుష్టులకును, నవిశ్వాసకులకును, విధేయుఁడవై యుండకుము.

ఉదయము, మధ్యాహ్నము, రాత్రి, యీమూఁడువేళలయందును, నీప్రభునామమును స్మరించుచుండుము.

ఆతని నారాధించి రాత్రియంతయు నాతనిసంకీర్తనలందు గడపుము.

కాని, యీమనుష్యులు ప్రస్తుతము నశ్వరమగుదానిని ప్రేమించి, వారివెనుకనంటియున్న శిక్షాదినమును సరకుగొనకుందురు.

మేమే వారినిసృజించి, వారిసంధులకు బలమిచ్చితిమి. మాయిష్టమైనయెడల వీరిని తొలఁగించి వారివంటివారినే భూమిపై నుంచఁగలము.

ఇది నిజముగా నొకభయసూచనయైయున్నది. ఇష్టమువచ్చిన వాఁడు దేవునిమార్గము ననుసరింపఁగలఁడు.

30 కాని, దేవునియిష్టము లేనియెడల నీయిష్ట మెందుకునుఁ బనికి రాదు. దేవునికి సర్వమును దెలియును. అతఁడు బుద్ధమూర్తి!

అతఁడు తనయిష్టమువచ్చినవారిని కరుణించి, దుష్టులకుఁ గ్రూర శిక్షను సిదపఱిచి యున్నాఁడు.

# సురా 77-పంపఁబడినవారు.

**మక్కా-50 పద్యములు-2 రుకూ్కలు.**

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

పంపఁబడినవారి వరుస యాన !
అతివేగముగాఁ బోవువారి యాన !
నలుదిక్కులను విరజల్లువారి యాన !
యుక్తాయుక్తము నేర్పఱించువారి యాన !
క్షమాపణను లేక భయసూచనను,
వెల్లడించువారి యాన !
మీకు వాగ్దానము చేయఁబడిన దిదిగో యాసన్నమగుచున్నది.
అందుచేత, నక్షత్రములు రూపుమాపఁబడునప్పుడు,
స్వర్గము చీల్పఁబడునప్పుడు,
10 పర్వతములు ధూళియై చెదరిపోవునప్పుడు,
ప్రవక్తలకు కాలము నిర్ణయింపఁబడునప్పుడు,
ఆకాల మెప్పుడు రాఁగలదు ?
ఒకరినొకరు వీడిపోవు దినమువఱకునా ?
వీడిపోవుదిన మననేమో నీకెవరు తెలుపఁగలరు ?

కృత్రిమత్వము నారోపించి నిందించువారి కాదినమున దుఃఖము కలుగుచున్నది.

అట్లు నిందించువారిని పూర్వకాలమున నాశనము గావించితిమి గాదా ?

ఆతరువాత నట్లు చేయువారినిగూడ పూర్వుల ననుసరింపఁ జేయుదుము.

దుష్టులకు మేమిచ్చుశిక్ష యిదియే.

కృత్రిమత్వము నారోపించువారి కాదినమున దుఃఖము ప్రాప్తించుచున్నది.

20 మే మొక తుచ్ఛక్రిమినుండి సృష్టించి,

దానినొక సురక్షితస్థలమందు

జనన మొందువఱకును నుంచితిమిగదా!

మాశక్తి యిట్టిదే! మేము నిగుల బలవంతులము.

మాకు కృత్రిమత్వము నారోపించువారి కాదినము దుఃఖభాజనము కాఁగలదు.

చచ్చినవారిని బ్రతికియున్నవారినిగూడ,

ఉంచుట కీభూమికి శక్తి నిచ్చితిమిగదా!

దానిపై నిమ్నోన్నతములగు పర్వతముల నుంచితిమి. త్రాగుటకు మీకు తీయనినీటి నిచ్చితిమి.

మేము కృత్రిములమని యనువా రాదినమున దుఃఖభాజనులు కాఁగలరు.

నరక మసత్యమంటిరి. అందులోనికిఁ బొమ్ము!

30 మూఁడేసిమడతలుగా నావరించుకొనియున్న చీఁకటులలోనికిఁ బొమ్ము!

"కాని, యాచీఁకటు లగ్నిజ్వాలలనుండి తప్పింప సహాయపడవు".

నరకమునుండి బయలుదేరు జ్వాలలు కోటబురుజులవలె నున్నతములయి,

నల్లని యొంటెలవలె నుండును.

మాకు కృత్రిమత్వము నారోపించినవారి కాదినమున దుఃఖము చుట్టుముట్టును.

ఆదినమున వారికి నోట మాటరాదు.

నాఁడు నెపములను కల్పించుకొనుటకును వారికి వలనుపడదు.

కృత్రిములమని మమ్ము నిందించువారికి నాఁడు దుఃఖము కలుగఁ గలదు.

ఆదినమే యొకరినుండి మరియొక రెడబాయఁగల దినము; నాఁడు మిమ్మును మీపితరులను నొక్కచోటఁ జేర్చెదము.

మీ రేమైన పన్నాగములఁ బన్నఁగలిగినచో నేఁడు వానిని నాపైఁ జూపుఁడు.

40 కృత్రిమత్వమును మాపై నారోపించినవారికి నాఁడు దుఃఖము కలుగఁగలదు.

## అధ్యాయము-2.

కాని, దైవభీతిగలవారు చల్లనినీడలలో, నీటియూఁటలదరిని వసింపఁగలరు.

వారికిఁగావలసిన పండ్లన్నియు చేకూఱఁగలవు.

"మీరు కష్టపడితిరి. దానికిఁ బ్రతిఫలముగా, తిని, త్రాగి, యారోగ్యవంతులరై సుఖపడుఁడు" అని

సజ్జనులను బహూకరింతుము.

మమ్ము కృత్రిములని నిందించువారికి దుఃఖమే నాఁడు ప్రాప్తించును.

"తినుఁడు. కొంచెముకాలముమాత్రమే సుఖమనుభవింపుఁడు. నిశ్చయముగా మీరు దుర్మార్గవర్తులరు."

మేము కృత్రిములమని యనువారు నాఁడు దుఃఖ మనుభవింతురు.

మోకాళ్ళపైఁ బడుమనునప్పుడు వారు మోకాళ్ళఁబడలేదు.

మేము కృత్రిముల మనువారు నాఁడు దుఃఖతులగుదురు.

10 అట్టివారిఁకముందు మేము సూచించుదానినిమాత్రము నమ్ముదురా ?

# కాండము. 30

## సురా–78 వార్త

మక్కా-40 పద్యములు-2 రుక్కూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

వారొకరినొకరేమి యడుగుచున్నారు ?
రాఁబోవు మహావార్తనుగూర్చి !
దీనినిగూర్చియే వారు వివాదములఁ బెట్టుకొనుచున్నారు.
లేదు ! వారు దానిసత్యమును తెలిసికొనఁగలరు.
నిశ్చయముగ వారు తెలిసికొనఁగలరు.
మఱియు నీభూమి నొకశయ్యవలె మేము నిర్మించియుండలేదా?
దానికి పర్వతములను గుడారపు కొయ్యలుగఁ జేయలేదా?
మీయందు స్త్రీపురుషభేదము నేర్పఱిచితిమి.
విశ్రాంతికొఱకు నిద్రపొమ్మంటిమి.
10 కప్పికొనుట కొక దుప్పటివలె రాత్రిని కల్పించితిమి,

పగటిపూట జీవనసౌకర్యముల సేకరించుకొనుఁ డంటిమి.

మీాపై గట్టివగు నేఁడు స్వర్గములఁ గల్పించి,

వానియందు ప్రకాశమానమగు జ్యోతి నొకదాని నుంచితిమి.

ధాన్యము, మూలికలు,

వృక్షనిబిడములగు వనములు,

సమృద్ధియగుటకు జలధరములనుండి చాలినంత నీటిని క్రిందికి పంపుచున్నాము.

అదిగో ! ఇంతలోనే యెడబాటుదిన మాసన్నమగుచున్నది.

ఆదినమున భేరిపై గొప్పమ్రోఁత వినఁబడును. నాఁడు మీారం దఱును, గుంపులుగుంపులుగా రాఁగలరు ;

అప్పుడు స్వర్గద్వారములన్నియును తెఱువఁబడును ;

20 అచలము లన్నియు చలనములై పలుచని యావిరిగా నెగిరి పోవును.

నరకమునందు చాల వలలుపఱచియుండును

అది ధర్మేతరుల కావాసము.

అచట వారు యుగములకొలఁది నుండవలయును.

అచట వారికి చల్లఁదనమనున దుండదు.

త్రాగుటకు సలసల మఱుగుచున్ననీరును, అతి మహాశీతలమగు నీరునుతప్ప, వారికేదియు దొరకదు.

ఇది వారికిఁ దగినబహుమాన మేకదా !

వారు తమలెక్కలను సవరించుకొనలేదు ?

మేమిచ్చిన సంజ్ఞలనన్నిఁటిని నిరాకరించి యసత్యములనిరి.

కాని, వారుచేసినదానినంతయు గుర్తించి వ్రాసిపెట్టియే యుంచినాము.

30 "అందుచే దీనిని త్రాగుఁడు. మీకు బాధతప్ప మఱియెద్దియు వృద్ధినొందఁబోదు."

అధ్యాయము-2.

కాని, దైవభీతిగలవారి కానందభవనము నిచ్చెదము.

చుట్టు నావరణములుగల యుపవనములను, ద్రాక్షవనములను లభింపఁజేసెదము.

వారికి సవయస్కలగు కుంభస్తనులను కూర్చెదము.

ద్రాక్షరసమును గిన్నెలనిండ నిచ్చెదము.

అచటవారికి వృథాలాపములుగాని, యసత్యములుగాని చెవిని బడవు.

కరుణాలవాలుఁడును, తనకును నతనికిని మధ్యనున్న దానికంతటికిని, స్వర్గములకును, భూమండలమునకును, నధినాథుఁడునగు నీప్రభువు వలన నీకుఁదగిన బహుమానము దొరకుచున్నదిగదా! కాని, యాతనినుండి యొకమాటయైనను వారికి వినఁబడదు.

జిబ్రీలుప్రముఖులగు దేవతలు వరుసగ నిలిచియుండవలసిన దినమందు వారు నోరుమెదల్ప వీలులేదు. కరుణాలవాలుని యనుజ్ఞ నొందినవారును, సత్యసంధులును నగువారు తప్ప నితరులు మాట్లాడుట కాదినమందు వీలుకలుగదు.

ఆదినము నిశ్చితమైనది. కాన, ప్రభువునాశ్రయింపఁదలఁచినవారు నేఁడే యాతనిఁ బొందఁగల మార్గము నవలంబింతురుగాక!

నిశ్చయముగా నాసన్నమగుచున్న శిక్షాదినమును మీకు సూచించుచున్నాము.

40 తాను చేసిన పుణ్యపాపకర్మ లాదినమునకుఁ బూర్వమే దేవునికిఁ దెలిసియుండును. మామాటను నమ్మనివా రాదినమున "అయ్యో మేము బూడిదయైపోయినను బాగుండునే" యని పశ్చాత్తాపపడుదురు.

# సురా 79—పైకీడ్చువారు.

---

మక్కా—46 పద్యములు 2 రుక్కూలు.

అధ్యాయము-1.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

ఆత్మలను బలవంతముగఁ బైకీడ్చు దేవతల యాన !
సంతోషముగా వానికి విముక్తినిచ్చెడువారి యాన !
అదే యీఁతగా నీఁదువారి యాన !
అతివేగముగా ముందుపరుగెత్తువారి యాన !
విశ్వమునందలి కార్యములను గడపువారి యాన !
గందరగోళముపెట్టి భేరీమ్రోఁత యాదినమున దానిని క్షోభ పెట్టును.
దాని వెనువెంటనే రెండవమ్రోఁతయు వచ్చును.
ఆదినమున మనుష్యులహృదయములు వడఁకుచుండును.
వారి దృష్టు లధోమార్గమునుబట్టును.
10 నాఁడు నవ్వునివారు "మనకు పూర్వపుగతియే పట్టునా ?
ఏమి! మనము క్రుళ్ళిన యెముకలుగ మాఱినపిదపఁ గూడనా ?
అట్లయినచో మనము నష్టమునే పొందుచున్నా" మని యందురు.
నిశ్చయముగా మొదటి మ్రోఁతతోడనే,
వారు తిరిగి భూమిపైఁ బడుదురు.
మూసావృత్తాంతము నెప్పుడైన వినియున్నావా ?

తోవా యను పవిత్రమగు లోయలో నాతనిప్రభు వాతనిఁ బిలిచి,

"ఫిరౌనునొద్దకుఁ బొమ్ము. ఆతఁడు నాయాజ్ఞలను మీఱి యున్నాఁడు.

ఆతనితో నీవు సన్మార్గవర్తివగుదువా ?

అప్పు డాతనియెడల భయభక్తులనొందుటకు నాతని యొద్దకు నిన్ను తోడ్కొనిపోయెద నని చెప్పుము"

20 అని చెప్పఁగా నాతఁ డారాజునొద్దకుఁబోయి తన ప్రభావ చిహ్నమగు నొక యద్భుతచర్యను జూపెను.

ఆతఁడు దానిని గణింపక యతనిని కృత్రిమునిగాఁ దలంచి వాని పైఁ దిరుగఁబడి,

త్వరితముగ వెనుదిరిగి,

ఒకసభ గావించి, యందు

"నేనే పరమప్రభువను" అని చెప్పెను.

కావున, దేవుఁ డాతని కిహమునందును, బరమునందును గూడ శిక్షవిధించెను.

ప్రభువునెడ భయముగలవాని కిదియొక సూచనగదా !

అధ్యాయము 2.

స్వర్గమునే నిర్మించిన యాతనికి నిన్ను సృజించుటన నెంత ?

అతఁడు దాని నెత్తుగానిర్మించి రూపము నొసగెను.

దానిరాత్రికి చీఁకటినిచ్చి దానివెలుతురును బయటికిఁదీసెను.

30 పిదప నీభూమిని పఱచెను.

దానినుండి దానినీరములను, దాని పచ్చికబయళ్ళను కల్పించెను.

నీవును నీపశువులును ననుభవించుటకు,

పర్వతముల నచలములుగాఁ జేసెను.

కాని, యద్భుతముగా నివియన్నియుఁ దిరుగఁద్రోయఁబడు నప్పుడు,

మనుష్యుఁడు తాను బడినకష్టముల నన్నిటిని తలంచుకొను నప్పుడు,

చూచువారందఱకును నరకము సంపూర్ణముగాఁగనఁబడునప్పుడు,

దేవునియాజ్ఞ నుల్లంఘించి,

ప్రస్తుతజీవితమునే కోరికొనినవానికి,

నిశ్చయముగా నరకమే వాసస్థాన మగుచున్నది.

40 కాని, దేవునియౌన్నత్యమునకు భయపడి తనయాత్మను మోహమార్గమునుండి త్రిప్పుకొనువానికి,

నిశ్చయముగా భోగభూమియే వాసస్థానము కాఁగలదు.

వారు నిన్ను "ఆగంట యెప్పుడు ప్రోగును? ఆవేళ యెప్పుడు" అని యడుగుదురు.

కాని, దానింగూర్చి నీకేమి తెలియును?

ఆవేళ నీప్రభువునకొక్కనికే యెఱుక!

నీవు చేయవలసినది 'ఆసమయ మాసన్నమగుచున్న' దని జనులకు చాటుటయే.

ఆగంట వారికి వినఁబడినదినమందు "మన సమాధులలో నెంతోకాలము లేమే! ఒకసాయంత్రముగాని యొక ప్రభాతముగాని కాలేదే" యని వారనుకొనఁగలరు.

---

# సురా—80 అతఁడుకోపించెను.

మక్కా—42 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

గ్రుడ్డివాఁడు దగ్గఱకు వచ్చెనని,
అతఁడుకోపించి వెనుకకుఁ దిరిగెను.
విశ్వాసమువలన నాతఁడు పరిశుద్ధుఁడు కాఁడని నీ కెట్లు తెలిసెను?
అతనికి భవిష్యత్సూచన కలిగి దానివలన లాభము పొందఁడని నీ కెట్లు తెలిసెను?
ధనవంతుని యెడల
నీ వతిశ్రద్ధగా నుంటివి.
ఆతఁడు పరిశుద్ధుఁడు కాకపోయిన నీ కావశ్యకము కాదా?
కాని, మిక్కిలి యాతురతతో,
భయపూర్ణుఁడై,
10 నిన్నుఁ జేరువానిని నీవు నిరాకరింతువు.
అయ్యో! కురానే నీ కొకసూచన.
గౌరవనీయులై, ధర్మజ్ఞులై,
ఘనులై, పరిశుద్ధులైన,
పురాణకర్తల వాక్యములందు
విశ్వాసముంచువాఁడే యాసూచనను గ్రహింపఁగలఁడు.
మనుష్యుఁడు దుఃఖావిలుఁ డగుఁగాక!
అతఁడు విశ్వాసహీనుఁ డేలయయ్యెను?
దేవుఁ డాతని దేనిచే నిర్మించెను?

తడిపురుగుల చేతఁ గదా!

20 అతఁడు వానిని సృజించి, యింతవానినిగఁ జేసి,

గర్భమునుండి బయలువెడలుటకు సులభమార్గమును కల్పించి,

తిరిగిచంపి, భూమిలో పూడ్చివేయుచున్నాఁడు.

తరువాత తనకిష్టమువచ్చినప్పుడు తిరిగి యతనిని సజీవునిఁ జేయుచున్నాఁడు.

కాని, మనుష్యుఁడు దేవుని యాజ్ఞ నింకను నిర్వహింపకున్నాఁడు.

నరుఁడు తన యన్నమును జూచికొననిమ్ము.

మేమే పుష్కల వృష్టిని గురియించితిమి;

నాగళ్ళతో భూమిని దున్నితిమి.

ధాన్యము,

ద్రాక్షపండ్లు, నోషధులు,

ఆలివు, ఖర్జూరవృక్షములు,

వృక్షములతో నిబిడములైన వనములు,

పండ్లు, పత్రములు మొదలగువానిని,

మీకొఱకును, మీపశువులకొఱకును పుట్టించితిమి.

కాని, హృదయభేదకమగు భేరీమ్రోఁత వినవచ్చునప్పుడు,

ఆదినమున మనుష్యుఁడు సోదరులు,

మాతాపితలు, భార్యాపుత్త్రిలు, అందఱను వదలి పాఱిపోవును.

ఆదినమునఁ బ్రతిమనుష్యునకును తన కార్యములు సవరించుకొనుటతోడనే సరిపోవును

ఆదినమున వికసించియుండి సంతోషవంతములైన నవ్వు మొగములు కనఁబడును.

40 ధూళిధూసరితములై,

మసిచే నల్లనైన మొగములు గూడఁ గనఁబడును.

వీరే యవిశ్వాసకులు ; అపరిశుద్ధులు.

---

# సూరా--81 ఆచ్ఛాదన.

---

మక్కా--29 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

సూర్యుఁ డాచ్ఛాదితుఁ డయినప్పుడు.

చుక్కలు రాలునప్పుడు,

అచలములు చలించునప్పుడు,

ఆఁడునొంటెలు వదలివేయఁబడునప్పుడు,

క్రూరసత్త్వము లొకచోఁ గూడియున్నప్పుడు,

సముద్రము లుడుకుచున్నప్పుడు,

ఆత్మలు తమదేహములతోఁ గూర్పఁబడినప్పుడు,

సజీవయైయుండఁగా పాతఁబడిన స్త్రీ శిశువు,

"నిన్ను వారు చంపుటకు నీవేమిదోషము చేసితివి" అని యడుగఁబడినప్పుడు,

10 దైవగ్రంథమునందలి పత్రములు విప్పఁబడినప్పుడు,

స్వర్గ మొలిచివేయఁబడినప్పుడు,

నరకము ప్రజ్వలింపఁజేయఁబడినప్పుడు,

భోగభూమి దగ్గఱకు తేఁబడినప్పుడు,

## కు రా ను ష రీ ఫ్ .

ప్రత్యాత్మయుఁ దానుజేసిన కార్యములను జ్ఞప్తికిఁ దెచ్చి కొనును.

వక్రగతి కలిగి,

త్వరితగమనమున దాగుచుండిన నక్షత్రముల యానగాని,

కారుక్రమ్ముకొనివచ్చు రాత్రియానఁగాని,

ప్రకాశయుతమగు ప్రభాతమునానఁగాని,

శక్తిమంతుఁడై సింహాసనాసీనుఁడగు ప్రభువు సన్మానమును బడసి,

20 దేవతలచే నతులందుచు, మాటతప్పని వాఁడగు,

ప్రభావంతుఁడగు దూతవాక్యమని నేను ప్రమాణముసేయ నక్కఱలేను.

నీ సహాయకుఁడగు నాతఁడు పిశాచగ్రస్తుఁడు కాఁడు.

స్వచ్ఛమగు నాకాశమున నాతని నాతఁడు చూచెను.

స్వర్గరహస్యములవంక నాతఁడు పోఁడు.

శపితుండగు సైతానువాక్యముల నాతఁడు బోధింపఁడు.

అయిన మీ రెచటికిఁ బోవుచున్నారు.

నిశ్చయముగా సర్వభూతములకు నిదియొక భయసూచన.

తిన్నని మార్గమునఁ బోవనిచ్ఛగించిన వానికి నిది సూచనయే.

సర్వలోకప్రభుఁడగు దేవుఁడే స్వతంత్రుఁడు. ఇతరుని కెవ్వనికిని స్వేచ్ఛలేదు.

---

# సురా-82 బ్రద్దలగుట.

మక్కా--19 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

ఆకాశము బ్రద్దలయి

నక్షత్రములు చెల్లాచెదరై,

సముద్రలన్నియు నేకమై,

సమాధులన్నియు క్రిందుమీఁదు లైననాఁడు,

ప్రత్యాత్మయుఁ దాను తొలుతనుండి తుదివఱకుఁ జేసినకార్యములను జ్ఞప్తికిఁ దెచ్చుకొనును.

ఓమనుష్యుఁడా! నిన్ను సృజించి, యాకారమునిచ్చి సరిగ నిర్మించిన,

దయామయుఁడగు నీ ప్రభువునుండి యెవరు నిన్ను తప్పుమార్గమునఁ బెట్టినారు?

తనకు మోదముగూర్చు నాకారమున నాతఁడు నిన్ను సృజించెను;

ఇదిసత్యము; అయినను నాతనివాక్యము నసత్యముగా నీవు పరిగణించితివి.

ఏమైనను, నీపై సంరక్షకు లున్నారు.

వారు నీవు చేయుప్రకారమును వ్రాసికొనుచున్నారు.

నీవు చేయుపనులన్నియు వారికెఱుక!

సత్యముగా ఋజుమార్గవర్తులు సౌఖ్యములమధ్యను,

మలినాత్ములు నరకాగ్నియందును వసింతురు.

శిక్షాదినమందు వారు దానియందు కాల్పఁబడుదురు.

వారు దానినుండి తప్పించుకొనలేరు.

ఆ శిక్షాదినమన నేమో నీకెవరు చెప్పఁగలరు ?

మఱియొకసారి యడుగుచున్నాను. ఆ శిక్షయేమో నీ కెవ్వరు చెప్పఁగలరు ?

ఆదినమున నొకయాత్మ మఱియొకయాత్మకు సహాయము చేయలేదు. సర్వాధికారమును నాఁడు దేవునియందే యుండును.

---

# సురా-83-తప్పుకొలత

---

మక్కా-36 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

తా మితరులనుండి పుచ్చుకొనునప్పుడు నిండుగా పుచ్చుకొని,

తా మితరుల కీయవలసినప్పుడు తగ్గించి,

తప్పుకొలతలు కొలుచునారికి దుఃఖమగు గాక !

ఏమి ! ఆమహాదినమున,

వారు తిరిగి లేవఁగలరని వారికిఁ దెలియదా ?

ఆదినమున మనుష్యుఁడు ప్రపంచాధినాథుని యెదుట నిలువఁబడవలయును.

నిశ్చయముగా దుష్టుల దౌర్జన్యముల వ్రాసియుంచిన గ్రంథము 'సిడ్జిన్' అను నరక కారాగారమునందున్నది !

సిజ్జీన్ అన నేమో నీకెవ రెఱుకచేయఁగలరు ?
అందు సర్వమును స్పష్టముగ వ్రాయఁబడియుండును.
10 మాసూచన లసత్యములనియు,

ఈ శిక్షాదిన మసత్యమనియు ననువారి కాదినమున దుఃఖము సంప్రాప్తమగుచున్నది.

ద్రోహియుఁ బాపాత్ముఁడు నగువాఁడుతప్ప నితరుఁడెవ్వఁడును దాని నసత్యమనఁజాలఁడు.

మాసూచనలను వారియెదుటఁ బెట్టినప్పుడు వారు "ఏమి ? యీతాతలనాఁటి ప్రాఁతకథ"లని యందురు.

అవును, నిశ్చయముగా వారి కర్మలు వారి హృదయములపై నధికారమూనియున్నవి.

నిశ్చయముగా నాదినమున వారికిని ప్రభువునకును మధ్య నొక తెర వేయఁబడియుండును.

అప్పుడు వారు నరకాగ్నిలో దగ్ధులు కాఁగలరు.

అప్పుడు వారికి "ఇదియే నీ వసత్యమని తిరస్కరించినదిసుమీ" యని చెప్పఁబడును.

ఇది సత్యము కాని, సన్మార్గగాముల పుస్తకము స్వర్గమందలి 'ఇల్లియోన్' అను నానందగృహమం దుండును.

'ఇల్లియోన్' అనిన నేమో నీకెవ్వ రెఱుక సేయఁగలరు ?
20 అది స్పష్టాక్షర లిఖితమయి యున్నది.
ప్రభుసన్నిధానవర్తులగు దేవతలు దానికి సాక్షులు.

నిశ్చయముగా ఋజుమార్గవర్తులు సంతోషములమధ్య నివసింపఁగలరు.

పెండ్లిపఱుపులపై వారు కూర్చుండి నలుమొగములఁ జూచెదరు.
వారిముఖమునం దానందవికాసము గోచరమగుచుండును.

కస్తూరిముద్రలుగల ద్రాక్షారస పూర్ణకుంభములనుండి వారు త్రాగుటకు మధురరస మీయఁబడును.

ఆనందముకొఱకు కాతురపడువారు దీనికొఱకు కాతురపడుదురు గాక!

దైవసాన్నిధ్యవర్తులుమాత్రము త్రాగఁగల 'తస్నీమ్' అను నూటయందలి జలములు

ఆ మధురరసముతో మిళితముచేయఁబడును.

పాపులు భక్తులనుజూచి తిరస్కారభావముతో నవ్వుచుం డురు గదా!

30 వారు భక్తులప్రక్కన పోవుచు నొకరొకరు కన్నులు గీటు కొనుచు,

తమవారిని గలిసికొనునప్పు డపహాస్యముఁ జేయుచు,

వారిని చూచునప్పుడు 'నిశ్చయముగా వీరుదుష్పథవర్తు' లని యనుచుందురు.

కాని, వారు భక్తులకు పోషకులుగా నుండుట కధికారము లేదు.

కావున నాదినమందు, భక్తులు తమ పెండ్లి సెజ్జలపై నాను కొనియుండి,

విశ్వాసరహితులను జూచి తిరస్కారభావముతో నవ్వఁగలరు.

విశ్వాసహీనులు తమ కర్మలఫలముల ననుభవింపఁగలరా?



# సురా 84-విఱిగిపడుట.

మక్కా-25 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

స్వర్గము విఱిగిపడి
దాని ప్రభువు నతిశ్రద్ధాభక్తులతో ననుగమించునప్పుడు
భూమి మైదానమువలె పఱపఁబడి
దానిలోనిదంతయుఁ బోకొట్టుకొనఁబడి, యుత్తరై,
దాని ప్రభువును విధేయతతో ననుసరించినప్పుడు,
ఓ నరుఁడా! అప్పుడు నిశ్చయముగా నీప్రభుసాన్నిధ్యమును గోరినచో నీవు పడయఁగలవు.
ఎవని కుడిచేతిలో దైవగ్రంథ ముంచఁబడునో
అతఁడు పరిగణనీయుఁడై,
తన చుట్టములకడకు సంతోషముగాఁ బోఁగలఁడు.
10 వెనుకనుండి యాగ్రంథ మందింపఁబడినవానికి
నాశనమే కలుగును.
అతఁడు మండుచున్న యగ్నిలోఁ బ్రవేశింపఁగలఁడు.
తాను దేవునియొద్దకుఁ బోవుదనను తలంపులేక,
తన చుట్టపక్కములతో సుఖముగా జీవించినందుకై,
యాతఁ డగ్నిలో దహింపఁబడును.
తాను సుఖమై యున్నాననుకొనెను గాని, దేవుఁ డాతని జూచుచునే యున్నాఁడు.
కావున సాయంసంధ్యారాగమునానఁ గాని,
కారుగ్రమ్ముకొనివచ్చు రాత్రియానఁ గాని,

పూర్ణచంద్రునానఁ గాని,

20 ఒకస్థితినుండి మఱియొకస్థితి కాతఁడు తీసికొనిపోఁబడునని నేను ప్రమాణముసేయ నవసరము లేదు.

కావున వారు విశ్వసింపకుండుటకు వారి కేమియాడినది? కురాను వారిమ్రోలఁ జదువునప్పుడు వారేల యారాధింపరు?

అయ్యో! అవిశ్వాసకులు దాని నసత్యముగాఁ బరిగణించు చున్నారు.

కాని, వారి యాంతరంగికద్వేషములు దేవుని కెఱుక.

వారికిచ్చు వార్త విషాదయుతమగు శిక్షయే.

విశ్వాసయుతులకు సత్కార్యానుష్ఠానపరులకు మాత్రము శాశ్వతలాభము కలుగుచున్నది.

---

# సురా 85–నక్షత్రపథము.

---

మక్కా-22 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

నక్షత్రావృత మగు నాకాశమాన!

ఆశపెట్టఁబడిన దిన మాన,

చూచువాని, చూడఁబడువాని యాన!

పెద్దగోయి త్రవ్వి,

దానిలో నగ్నివైచి,

చుట్టును గూర్చుండి,

విశ్వాసయుతులను బాధపెట్టినవారు శప్తులగుదురు గాక!

అతిశక్తిమంతుఁడు, స్తవనీయుఁడునగు దేవునియందలి విశ్వాసము కొఱకే కదా వారు వారిని బాధించిరి!

భూస్వర్గరాజ్యములు రెండును నాతనివే. దేవుఁడు సర్వసాక్షి
10 నిశ్చయముగా విశ్వాసయుతులను, స్త్రీలను పురుషులను బాధ
పెట్టి, పశ్చాత్తాపపడనివారికొఱకు నరకాగ్నియు నగ్ని బాధలును
నెదురు చూచుచున్నవి.

కాని, విశ్వాసయుతులై సత్కార్యములఁ జేసినవారికి నిర్మలవాహినులు ప్రవహించు సౌఖ్యారామములు కలుగుచున్నవి. ఇదియే పరమానందము!

నీప్రభువుకోప మతిభయంకరము గదా!
సృష్టికర్త యాతఁడే. సంహారకారకుఁడు నాతఁడే.
దయామయుఁడు, ప్రేమస్వరూపుఁడు.
ప్రభాభాసమానమగు సింహాసనము నధిష్ఠించినవాఁడు.
నిజేచ్ఛను కొనసాగించుకొనఁగలవాఁడు.
ఫిరౌను సామూదుల కథలను,
మీరెన్నఁడును విన లేదా?
అవును. అవిశ్వాసకులందఱు నాకథలను నమ్మరు.
20 కాని, దేవుఁడు వారి వెనుకనుండి వారిని చుట్టఁబెట్టుచున్నాఁడు.
అయినను నిది గొప్ప కురాను.
ఇది సురక్షితమైన పలుకపయి వ్రాయఁబడియున్నది.

---

# సురా - 86 రాత్రివచ్చునది.

---

మక్కా - 17 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

స్వర్గమాన! రాత్రివచ్చుదాని యాన!

ఆరాత్రి వచ్చిన దేదియో నీకుఁ దెలియునా?
నిరుపమాన ప్రకాశయుతమగు నక్షత్రమే యది.
ప్రత్యాత్మకు నొక సంరక్షకుఁ డున్నాఁడు.
కావున, మనుష్యుఁడు తాను దేనినుండి సృష్టినంది యున్నాఁడో యాలోచించుకొననిమ్ము.
పృష్ఠమునుండియు, గుండెయెముకలనుండియు,
కారిన పురుగులనుండియు నాతఁడు నిర్మింపఁబడియున్నాఁడు.
రహస్యములన్నియు బయలుపెట్టఁబడుదినమందు,
తనకు శక్తిగాని, సహాయకుఁడుగాని లేనిదినమందు,
10 దేవుఁ డతనికి ప్రాణమునిచ్చుటకు సమర్థుఁడై యున్నాఁడు.
వలయాకారముగఁ దిరుగు స్వర్గమాన!
తన హృదయమును తెఱచియిచ్చుభూమియాన చెప్పుచున్నాను.
ఈకురా నతి యుక్తియుక్తమగు గ్రంథము.
ఇది వినోదముకొఱకు వచ్చియుండలేదు.
నీపై వారు పన్నాగము చేయుచున్నారు.
వారిపై నేనొక పన్నాగము పన్నెదను.
కావున, నమ్మకములేనివారితో జోక్యము కలుగఁజేసికొనకుము. కొంతకాలమువఱకును వారిజోలికి పోకుము.

# సురా 87 - అత్యున్నతుఁడు.

మక్కా - 19 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

సర్వవస్తువులను సృజించి, వానికి సమత్వముఁ గల్పించి,
వాని ముందుగతులను నిర్ణయించి దారిఁజూపుచు,
పచ్చని పచ్చికను మొలపించి,
దానిని నల్లని యెండుగడ్డిగా మార్చుచు,
అత్యున్నతుఁడగు నీప్రభువు నామము సంస్మరణీయ మగుఁ గాక !

నీకు కురాను చదువ నేర్పెదము; దానిలో దైవేచ్ఛయైనది తప్ప తక్కిన దానిని నీవు మఱువఁజాలవు.

వ్యక్తావ్యక్త విషయములన్నియు నాతని కెఱుక.

మాసుఖమార్గము లన్నియును నీకును సౌఖ్యావహము లగునట్లు చేసెదము.

భయసూచన లాభకరము గాన, నాసూచనను దెలుపుము.

10 దైవభీతిగలవాఁ డాసూచనను గ్రహింపఁగలఁడు.

అతిదుర్మార్గుఁడెవ్వఁడో యాతఁడే యాసూచనను సరకు కొనఁడు.

అతఁడు ఘోరనరకాగ్నిలోఁబడి,
చావకయు, బ్రతుకకయు నుండును.
ఇస్లామువలనఁ బరిశుద్ధుఁడగు వాఁడు,

ప్రభునామమును మఱవక సంకీర్తనము సేయువాఁడు సుఖి యగును.

భవిష్యజ్జన్మ మింతకంటె మంచిదియు, నింతకంటె శాశ్వతము నైనను,

ప్రస్తుతజన్మమునే మీరు కోరుచున్నారు.

ఈవిషయము పురాతనకాలమున,

ఇబ్రాహీము మూసాల గ్రంథములందు సువ్యక్తమయియే యున్నది.

---

# సురా 88 - ఆచ్ఛాదనము.

---

మక్కా - 26 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర,

ఆచ్ఛాదనము చేయఁగల యాదినపువార్త నీకు చేరినదా ?

ఆదినమునఁ గొందఱ యవలోకనము లధోమార్గముఁ బట్టి యుండును.

వారు కష్టపడి, జీర్ణించి,

మండుచున్న యగ్నిలోఁ దగ్ధులగుచు,

సలసల నుడుకుచున్న యూటనీటిని ద్రావవలసియుండును.

వారికి ముషిడిపండ్లుతప్ప నింకేమియు నాహారము దొరకఁ బోదు.

ఆయాహారము వారికి పుష్టిఁగలిగింపను సరేకదా, యాఁకలి నైనఁ దీర్పఁజాలదు.

ఆదినమున మఱికొందఱ ముఖములు సంతోషవంతములై కనఁబడును.

వారు తాము పూర్వమనుభవించిన కష్టములకుఁ దగిన ఫలమును

10 ఒక విశాలోపవనమునఁ బొందఁగలరు.

అచట వృథాలాప మెద్దియు చెవిని బడదు.

అచట నిత్యసలిలధారాయుతమగు నూఁటయు,

ఎత్తగు శయ్యలును,

సిద్ధముచేయఁబడిన మధురసపాత్రలును,

వరుసగ నమర్పఁబడియుండు పఱపులును,

పఱచియున్న తివాసీలును కనఁబడును.

మేఘములె ట్లమర్పఁబడియున్నవో వారికిఁ దెలియదా ?

స్వర్గమె ట్లున్నతముగ నిర్మింపఁబడియున్నదో వారికి గోచరము కాలేదా ?

పర్వతము లెట్లు పాదుకొల్పఁబడియున్నవో కనఁబడదా ?

20 భూమి యెట్లుపఱపఁబడి యున్నదో వారు చూడలేదా ?

అందుచేత వారికి రానున్నభయమును సూచింపుము ! భయ చిహ్నముల నిరూపించుటయే సుమీ నీ విధి !

వారిపై నీకేమియు నధికారము లేదు.

కాని, యాభయసూచనను లక్ష్యింపక నమ్మకుండునట్టి

వానికి గొప్పశిక్ష నియమితమై యున్నది.

నిశ్చయముగా వారు మాయొద్దకే రావలసియున్నది.

అట్లు వారు మాయొద్దకు వచ్చినప్పుడు వారిని మే మేమిచేయ వలయునో మాకుఁ దెలియును.

# సురా—89 ప్రభాతము.

---

మక్కా—30 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర,

ప్రభాతము నాన, దశరాత్రములయాన!

ద్వయమును, నేకమును నగుదాని యాన!

జరగిపోవుచున్న రాత్రియాన!

బుద్ధిమంతుఁడగువానికిఁ దగినప్రమాణ మిందు లేదా?

ఈదేశములం దప్రతిమానములగు

స్తంభములచే నలంకృతమగు 'ఇరెమ్' నొద్ద,

ప్రభువు 'ఆదు' కేమిచేసెనో నీవు చూచితివిగదా!

లోయలోని బండఱాలను దొలచివేసిన "సామూదు" ను,

మనుష్యులను తిత్తొలిపించిన 'ఫిరౌను' నకుఁ డేమిచేసెనో నీకుఁ దెలియునుగదా.

10 వా రాయాదేశములలో ననేక దౌర్జన్యముల నొనరించి,

వానిని పాపభూయిష్ఠములుగఁ జేసిరి.

అందువలనఁ బ్రభువు వారిపై నతిదారుణశిక్షలను పంపియుండెను.

నీ ప్రభు వొకయెత్తైన బురుజుపై కావలియుండి సర్వమును జూచుచునే యున్నాఁడు.

మనుష్యుఁడన్ననో తనప్రభువు తన్ను పరీక్షించి, మర్యాదచేసి, బహూకరించునప్పుడు,

"నాప్రభువు నన్ను సమ్మానించు చున్నాఁ" డనును.

కాని, యాతని శోధించి కోరినన్ని వరముల నీయనప్పుడు,

"అయ్యో! ప్రభువు నన్ను సరిగఁ జూడకున్నాఁ" డనును.

అవును; గాని మీరు దిక్కులేని బిడ్డలను చేరఁదీయరు;

బీదల కన్నమిడవలయునని యొకరినొకరు ప్రోత్సాహపఱిచి కొనరు.

20 పితృవ్యమయిన ధనము నత్యాశతో మ్రింగివేయుచు,

ధనమనిన నతిమోహముతోఁ జూచుకొనుచున్నారు.

అవును. కాని, భూమి యొకేవిధముగా నణఁచివేయఁ బడుచున్నప్పుడు,

నీప్రభువును, వారివారి యంతరువుల ప్రకారము దేవతలును నవతరించు నప్పుడు,

ఆనాఁడు నరకము మీఁదికిత్రోయఁబడునప్పుడు, ఆదినమున

మనుష్యుఁడు తన్నుఁదాఁ దెలిసికొనఁగలఁడు. కాని, యట్టి యెఱుక యాసమయమున నాతని కెట్లుపకరించును?

అప్పు డాతఁడు, "అయ్యో! ఈదినమున సౌఖ్యమబ్బునట్లు నా జీవితమునంతను గడపఁజాలకపోయితినే" యని యనుకొనఁ గలఁడు. ఆదినమున దేవుఁడు శిక్షించున ట్లెవ్వఁడును శిక్షింపఁజాలఁడు.

ఆతఁడు బంధించునట్టి పాశములతో నెవ్వఁడును బంధింపఁ జాలఁడు.

ఓహో! విశ్రాంతిఁ జెందుచున్న యాత్మా!

తృప్తినొందుము. ఆతని సంతోషింపఁ జేయుము. నీ ప్రభువు నాశ్రయింపుము.

నాకింకరులలో నొకఁడవై,

30 నా స్వర్గములోనికి రమ్మా!

# సురా 90 - భూమి.

మక్కా 20 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

నీకును,

నీతండ్రులకును, కొడుకులకును,

వాసయోగ్యమగు నీ భూమి యాన నేను ప్రమాణము చేయ నవసరము లేదు.

నిశ్చయముగా మనుష్యుని కష్టాత్మునిఁగా సృజించితిమి.

ఏమి ! అతనిపై నెవరికి నధికారము లే దనుకొనుచున్నావా ?

“ అయ్యో ! గొప్పభాగ్యములను వృథాపుచ్చితినే ” యని యాతఁడనుచున్నాఁడు.

ఏమి ! అతని నెవ్వరును పాటింపలే దనుకొనుచున్నాఁడా ?

ఏమి ! వానికి నేత్రములు,

నాలుక, పెదవుల నీయలేదా ?

10 మంచి చెడుగులను రెండు రాజమార్గములను అతనికిఁజూపలేదా?

ఏమైన నాయున్నతప్రదేశమును నాతఁడెక్కఁ బ్రయత్నింపలేదు.

ఆయౌన్నత్యమెట్టిదో యాతని కెవరు చెప్పఁగలరు ?

చెఱలోఁబడినవానిని ధనమిచ్చి తప్పించుట,

కఱవుకాలమున నాఁకొన్నవాని కన్నము పెట్టుట,

దగ్గఱివాఁడగు దిక్కులేనిబిడ్డను, బుగ్గిలో పొర్లాడు పేదవానిని రక్షించుట,

ఇదిగాక, దైవభక్తిగలవారిలోనుండి యాభక్తి స్థిరమయిన దానినిగాఁజేసికొని యొకరికొకరు దయావంతులుగానుండఁ బ్రబోధించు కొనుట, ఇదియే యాయున్నతమార్గము.

దానిననుగమించువారు దేవునికుడిప్రక్క నుందురు.
మాసూచనలను నమ్మనివారు
ఆతనియెడమప్రక్క నుందురు.
20 వారిచుట్టు నగ్ని దరికొనును.

# సురా 91—సూర్యుఁడు.

మక్కా—15 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

సూర్యునియు, నాతని మధ్యాహ్నప్రకాశము నాన!
అతనివెనువెంట నంటియుండు చంద్రునాన!
అతనిప్రభావమును వెలిబుచ్చు పగటియాన!
స్వర్గమాన! దానిని సృష్టించినవాని యాన!
భూమియాన, దానిని పఱచియుంచినవాని యాన!
ఒకయాత్మయాన, దానిని త్రాసునందుంచినట్లు సమత్వము నిచ్చి,
దుష్టత్వమును, భక్తినిగూడ దానియం దుంచినవానియాన!
ఎవఁ డాయాత్మను నిష్కల్మషముగ నుంచునో యాతఁడు ధన్యుఁడు.
10 దానిని పాడుచేసికొనినవానికి గతిలేదు.
భక్తిపరుఁడు కాకపోవుటచే సామూదు దేవునివార్తను నిరాకరించెను.

అప్పుడు వారిలో పరమమూర్ఖుఁ డొకఁడు పరుగెత్తుకొనిరాఁగా,

దేవదూత యతనిలో " దేవుని యుష్ట్రమును త్రాగనిమ్ము " అనెను.

కాని, వారాతనినమ్మక యాయుష్ట్రమును జంపిరి. కావున వారిప్రభువు వారినేరమునకై వారిని నశింపఁజేసెను. అందఱను నొక్క రీతిగనే యాతఁడు చూచెను.

తరువాత నేమివచ్చునో యాతఁ డాలోచింపలేదు.

---

# సురా-92 రాత్రి.

---

మక్కా - 21 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

తెరవలె నవతరించు రాత్రి యాన!
దివ్యముగఁ బ్రకాశించు పగటియాన!
స్త్రీపురుష భేదమును కల్పించిన దేవునియాన!
నిశ్చయముగా మీరు భిన్నాశయములఁ గలిగియున్నారు.
కాని, ధర్మముచేయుచు, దైవభీతికలిగి,
సద్ధర్మమునకు లోఁబడినవానికి,
సౌఖ్యమార్గమును సులభముగఁ బొందఁ జేయుచున్నాము.
కాని, యాశాపరుఁడై, ధనేచ్ఛగలిగి,
సద్ధర్మ మసత్యమని చెప్పువానికి,
10 దుఃఖమార్గమునే సుకరముచేయుచున్నాము.

వాఁ డధోగతిపా లగునపుడు ధన మెట్లు రక్షింపఁగలదు ?
మనుష్యునిగతి మాచేతిలోనున్నది.
అతని భూతభవిష్యత్తులును మావే.
కావున నగ్నిజ్వాలకు భయపడుఁడు.
సత్య మసత్యమనిపల్కి వెనుజూపిన
ఘోరపాపాత్ముఁడు తప్ప, మఱియెవ్వఁడును దానిలోఁ బడఁడు.
తాను నిర్మలాత్ముఁ డగుటకుఁ దనద్రవ్యము నొసగువాఁడును,
తిరిగి లాభము నొందుటకు దానముచేయనివాఁడును,
పరమాత్మయగు ప్రభువు ముఖావలోకనమునే కోరువాఁడును,
20 దైవభీతిగలవాఁడును నగువాఁ డాఘోరాగ్నినుండి తప్పిపోవును.
తుద కాతఁడు సంతుష్టాంతరంగుఁ డగును.

# సురా - 93 ప్రకాశము.

మక్కా - 11 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

మట్టమధ్యాహ్నపు ప్రకాశము నాన !
కాఱుచీఁకటి క్రమ్ముకొనివచ్చు రాత్రియాన !
నీప్రభువు నిన్ను వదలిపెట్టలేదు ; నీపైఁ గోపింపనులేదు.
భూతముకంటె భవిష్యత్తే నీకు శ్రేయస్కరము.
అంతమున నీప్రభువు నిన్ను పూర్తిగా బహూకరించును, నీవును సంతుష్టి పొందఁగలవు.

దిక్కులేని పసివాఁడవుగా నున్నప్పు డాతఁడు నిన్ను చేరఁదీసి తలదాచుకొన నొకగృహము నిచ్చెను.

నీవు తప్పుత్రోవను త్రొక్కనున్నప్పుడు మంచిమార్గమున నీకు దారిచూపెను.

పేదవాఁడవుగా నున్నప్పుడు నిన్ను ధనవంతుని జేసెను.

అందుచేత దిక్కులేనివారికి హానిచేయకుము.

10 నిన్నర్థింపవచ్చినవారిని తూలనాడకుము.

దేవుఁడు నీకుఁ బ్రసాదించిన వరములను లోకమున వెల్లడి చేయుము.

---

## సురా - 94 వికాసపఱుచుట.

---

మక్కా-8 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

నీకొఱకు నీహృదయమును వికాసపఱిచితిమి గదా.

నీవీపుపైనుండి బాధపఱుచుచున్న

బరువును తీసివేసితిమిగదా ?

నిన్ను పేరుగలవానిఁగాఁ జేసితిమిగదా !

కావున కష్టముతోఁబాటు సుఖమును గలుగుచున్నది.

సత్యముగా కష్టముతోఁబాటు సుఖమును గలుగుచున్నది.

కాని, నీకు స్వాతంత్ర్యము గలిగినతోడనే నీవు పరిశ్రమచేయ మానకుము.

నీప్రభువును హృదయపూర్వకముగా ధ్యానింపుము.

# సురా 95 - అత్తిపండు.

మక్కా - 8 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అత్తిపండు, ఆలివువృక్షము,

సినై పర్వతము,

ఈపవిత్రస్థలము, వీనియాన ప్రమాణముచేయుచున్నాను.

మిక్కిలి మంచివస్తువులతో మనుష్యుని సృజించినాము;

తరువాత దీనులలో నాతని నతిదీనునిగాఁ జేసినాము.

విశ్వాసయుతులగు సన్మార్గవర్తులను మాత్రము విడిచిపెట్టి నాము. వారికి శాశ్వతలాభము కలుగఁబోవుచున్నది.

ఇది వినినతరువాత నెవ్వ రాతీర్పు నసత్యమనఁగలరు ?

ఏమి ! దేవుఁ డతిన్యాయవంతుఁడగు న్యాయమూర్తికాఁడా ?

# సురా 96-చిక్కని నెత్తురు లేక నెత్తురుముద్దలు.

మక్కా - 19 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

సృష్టికర్తయగు ప్రభువుపేర !

నెత్తురుముద్దల నుండి మనుష్యుని సృజించినవానిపేర ! స్మరింపుము !

స్మరింపుము! నీప్రభు వతిదయామయుఁడు.

అతఁడు నీకు వ్రాఁతనేర్పు నొసగియున్నాఁడు.

మనుష్యునకు పూర్వము తెలియని దానిని ప్రసాదించియున్నాఁడు.

మనుష్యుఁడు గర్విష్ఠియై యున్నాఁడుగదా!

తాను ధనవంతుఁడనని యాతఁడు గర్వించుచున్నాఁడు.

నిశ్చయముగా నంతయును భగవంతునియొద్దకే చేరును.

దైవప్రార్థనయందున్న భక్తుని,

10 ఆటంకపెట్టువాఁ డెట్టివాఁడనుకొందువు?

ఏమనుకొందువు? ఆతఁడు సత్పథవర్తియనిగాని,

సదాచారవర్తియనిగాని యనుకొందువా?

ఏమనుకొందువు? ఆతఁడు సత్యము నసత్యముచేసి వెనుకకుఁ దిరిగెనా?

ఏమి, దేవుఁడు సర్వము నెట్లుచూచుచున్నాఁడో యాతనికిఁ దెలియదా?

నిశ్చయముగా తనప్రవర్తనను మాననియెడల నాతని ముందు జుట్టునుబట్టి గ్రహింతుము.

అసత్యపాపభూయిష్ఠమగు నాజుట్టును పట్టుకొందుము!

తనకుసాయ మెవరువత్తురో రానిమ్ము.

మేమును నరకరక్షకులను పిలిచెదము.

వలదు! వానిని సేవింపవలదు; దేవునిస్తుతించి యతని సాన్నిధ్యమునకు రమ్ము.

---

# సురా 97-అధికారము.

మక్కా-5 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

నిశ్చయముగా నధికారమను రాత్రిపై నీకురాను నవతరింపఁ జేసితిమి.

ఈయధికారమనురాత్రి యననేమో నీకుఁ దెలియునా ?

ఈయధికారనిశీథిని వేయినెలలకు మించినది.

ఆకాలమున దేవతలును, పరమాత్మయును, ప్రభువునసుజ్ఞచే ప్రతివస్తువుకొఱకును దిగుదురు.

ప్రభాత మగువఱకును, సర్వమును శాంతరూపము నంది యుండును.

---

# సురా 98-స్పష్టమగుసాక్ష్యము.

---

మదీనా-8 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

స్పష్టమగుసాక్ష్యము తమకు చేరువఱకును గ్రంథమునందు విశ్వాసములేనివారును, బహుదైవారాధకులును, తమ మతమునందు చలింపలేదు.

సత్యగ్రంథమును బఠించుచు నొకదూత వారియొద్ద కేతెంచెను.

ఈస్పష్టమగుసాక్ష్యము వారికి చేరువఱకును, నీగ్రంథమును బొందినవా రుపశాఖలుగాఁ జీలియుండలేదు.

వారు నిశ్చలభక్తితో దేవునారాధింపవలయుననియు, ప్రార్థనల సలిపి విధింపఁబడిన భిక్షల నీయవలయుననియు తప్ప, మతేమి నిర్బంధములను చేసియుండలేదు. ఇదియే సత్యమగుమతముగదా !

కాని, గ్రంథావలంబకులలోను, బహుదైవారాధకులలోను, నవిశ్వాసులు గెహెన్నా యగ్నిహోత్రజ్వాలలో చిరకాలము వసించుటకుఁ బోవలయును. జీవరాసులన్నిటిలోను వా రధములు.

కాని, విశ్వసించి క్రమవర్తనులగు వా రన్నిజీవులలో నుత్తములు.

వారికి దేవుఁ డిచ్చు బహుమానము ఈడెను ఉద్యానవనము. అందు మంచినదులు ప్రవహించుచుండును ; అందు వారు చిరకాలము నివసింపఁగలరు.

దేవుఁడు వారియందును, వారు దేవునియందును, ప్రీతిగలిగి యుందురు. ప్రభువునకు భయపడు వానికే యీ యానందము.

---

## సురా 99 - భూకంపము.

---

మక్కా - 8 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

భూమియంతయు గజగజ కంపము నొందుచు,
తనభారమునుండి విముక్తిచెందుచుండ,

మనుష్యుఁడు 'ఏమి! భూమి కేమియైనది' అని యడుగుచున్నాఁడు,

ప్రభువుచే ప్రేరితమై,

అది తనవృత్తాంతమును చెప్పఁగలదు.

ఆదినమున మనుష్యులు గుంపులు గుంపులుగఁజేరి తాము చేసిన పనులను విలోకింపఁగలరు.

చిన్న మెత్తు సత్కార్యమును జేసినవాఁడును,

చిన్న మెత్తు దుష్కార్యము నాచరించినవాఁడునుగూడ దానిని జూడఁబోవుచున్నాఁడు.



## సురా 100 - జవాశ్వములు.

మక్కా - 11 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

నురుగుగ్రక్కుచున్న జవాశ్వముల యాన!

అగ్నికణముల వెడలించుచున్నవాని యాన!

ఉదయమున యుద్ధమునకు సన్నాహమగుచు,

ధూళిని పైకి రేపుచు,

శత్రుమధ్యమునుచీల్చికొని పోవువానియాన!

నిశ్చయముగా మనుష్యుఁడు తనప్రభువునెడల విశ్వాసఘాతుకుఁడై యున్నాఁడు.

దాని కతఁడే స్వయంసాక్షి.

నిశ్చయముగ నతఁడు ప్రాపంచికసౌఖ్యమునే యెక్కువగ నాశించుచున్నాఁడు.

అయ్యో! సమాధులలోనున్నది వెలిఁబెట్టఁబడినప్పుడు,

10 మనుష్యులయంతరంగములు బయలుపెట్టఁబడినప్పుడు,

నిశ్చయముగా వాని ప్రభువు వానినిఁగూర్చి సంపూర్ణముగాఁ దెలిసికొనునని యాతఁడు గ్రహింపలేఁడు కాఁబోలు!

## సురా 101 - గ్రుద్దు.

మక్కా - 8 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

గ్రుద్దు! గ్రుద్దన నేమి?

అది యెంతో ఘోరమైనది!

దానినిగూర్చి నీకెవరు బోధపఱిచెదరు?

ఏదినమున మనుష్యులు చెదరఁ గొట్టఁబడిన మిడుతలవలె నయ్యెదరో,

పర్వతములన్నియు చిక్కుపీడిన గొఱ్ఱెయున్నివలె నగునో,

ఆదినమున త్రాసు బరువగువానికి

తన జన్మము మోదావహమగును.

త్రాసుస్తేలికమైన వానిగతి

గోయియే.

10 ఆ గోయియేమో నీకు తెలియునా ?
భయంకరముగ మండుచున్న యగ్ని యేయది.

# సురా 102 - తృష్ణ.

మక్కా - 8 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

కాటికి చేరువఅకును.

ధనముపై తృష్ణ నిన్నమితముగా నాక్రమించుకొని యుండును.

ఓహో ! తుదకు నీకు తెలియఁగలదు.

తిరిగి చెప్పుచున్నాను. అంత్యకాలమున నీమూఢత్వము నీకు తేటపడఁగలదు.

అయ్యో ! అదిసత్యమని నీకుఁదెలిసినచో నెంత బాగుండును !

నిశ్చయముగా నీవు నరకాగ్నినిజూచెదవు.

అపుడాయగ్ని నీసత్యచక్షుస్సునకుఁ గనఁబడును.

ఆదినమున నీవిపు డనుభవించుచున్న భోగములకు తగినశిక్షను బొందఁగలవు.

# సురా 103 - అపరాహ్ణము.

మక్కా - 3 పద్యములు.

దయాదాక్షిణ్యమూ_ర్తియగు దేవుని పేర.

అపరాహ్ణమాన ప్రమాణము చేయుచున్నాను!

విశ్వాసయుతులై, సత్కార్యాచరణులై, సత్యబోధకులై, యొకరికొకరు స్థిరత్వమును బోధించుకొనువారికిఁ దప్ప,

ఇతర మనుష్యుల యదృష్టమంతయు నాశనమునందు తగులుకొనియున్నది.

# సురా 104 - కొండెగాఁడు.

మక్కా - 9 పద్యములు.

దయాదాక్షిణ్యమూ_ర్తియగు దేవునిపేర.

కొండెగాఁడు, మానమర్యాదలు లేనివాఁడు,

ధనార్జనము చేసి దాచుకొనువాఁడు దుఃఖియగుఁగాక !

అతఁడు తనధనము తనతో నిత్యముగ నుండునని తలంచుచున్నాఁడు.

అట్లది యుండఁబోదు ! నిశ్చయముగా నాతఁడు తన్ను కబళించివేయు నగ్నిలోఁ ద్రోయఁబడును.

ఈ ఘోరాగ్ని యన నేమో నీ కెవ్వరు బోధపఱుపఁగలరు ?
అది దేవుఁడు ప్రజ్వలింపఁ జేసినయగ్ని !
పాపాత్ముల హృదయములపై కెగఁబ్రాకునది !
పెద్ద స్తంభములపై నిర్మింపఁబడిన
వితానమువలె నది పాపాత్ములఁ గప్పివుచ్చును.

# సురా 105 - ఏనుఁగు.

మక్కా - 5 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

ఏనుఁగుల సైన్యమును నీ ప్రభు వేమి చేసెనో నీకుఁ దెలియును గదా !

వారిపన్నుగడనంతయు నాతఁడు వృథ సేయలేదా ?
వారిపక్షులను గుంపులు గుంపులుగాఁ బంపె నవి
మట్టిరాళ్ళను వానిమీఁదికి విసరినవి.
ఆమట్టిరాళ్ళన్నియు గడ్డివలెఁ దినివేయఁబడినవి.

# సురా 106 - కొరెష్

మక్కా - 4 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

శీతకాలము. ఎండకాలములలో విహారగుం [illegible]

కొరెయ్షు వారైకమత్యము గలిగియుండుటకొరకు,

ఆఁకలి వేయకుండ నాహారమునిచ్చి,

భయమునుండి సంరక్షించిన యీగృహదైవమును కొలిచెదరు గాక !

# సురా - 107 మతము.

మక్కా - 7 పద్యములు

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర,

మామత మసత్యమని చెప్పువానిఁగూర్చి నీవేమి తలంచుచున్నావు ?

దిక్కులేని బిడ్డలను పాఱఁద్రోలువాఁడు ;

బీదల కన్నమిడుటకై యితరులను ప్రేరేపింపనివాఁడు వాఁడే !

ప్రార్థనసేయుచు,

శ్రద్ధలేక యుండువాఁడు దుఃఖయగుఁగాక !

భక్తిపరునివలె నటించి,

అనాథలకు సహాయము చేయనివాఁడు దుఃఖయగుఁగాక !

# సురా 108 - సత్సమృద్ధి

మక్కా - 3 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

నిశ్చయముగా మేము నీకు సమృద్ధి నొసగియున్నాము.

కావున, దేవునిఁ బ్రార్థింపుము ; దోషులఁజంపుము.

నిన్ను ద్వేషించువాఁ డపుత్రికుఁ డగునుగదా !

# సురా 109 - నమ్మనివారు.

మక్కా - 6 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

" ఓనమ్మకములేనిజనులారా !

మీరు పూజించుదానిని నేను పూజింపను.

నేను పూజించుదానిని మీరు పూజింపరు.

మీరు పూజించుదానిని నే నెన్నఁటికిని పూజించువాఁడనుగాను.

నేను పూజించుదానిని మీ రెన్నఁడును పూజింపఁబోరు.

మీ మతమును మీ రవలంబింపుఁడు ; నామతమును నే నవలంబించెదను " అనుము.

# సురా 110 - సహాయము.

మదీనా - 3 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

దైవ సహాయమును జయమును నెదురైనప్పుడు,

గుంపులు గుంపులుగా జనులు దేవుని మతమును స్వీకరించుటను నీవుచూచునప్పుడు,

నీప్రభువును స్తుతించి, యతనిక్షమాపణ వేఁడికొనుము. అతనికి కరుణించుటయే యిష్టము.

---

# సురా 111 - అల్-లహాబ్.

మక్కా - 5 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవునిపేర.

అల్ - లహాబ్ అనునతనిచేతులు నశించుఁగాక! అతఁడును నశించుఁగాత!

అతనిధనము నతనిలాభమును, నిష్ప్రయోజనము లగుఁగాక!

అగ్నిజ్వాలలో నితఁడు దగ్ధుఁడగుఁగాక!

అతనిభార్యమెడకు తాటిమోకుకట్టి,

దేహమునిండ కట్టెలువైచి కాల్చెదరుగాక!

# సురా - 112 ఏకత్వము.

మక్కా - 4 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

" దేవుఁడొక్కఁడే.

అతఁడు శాశ్వతుఁడు.

అతఁడు పుట్టింపఁడు. పుట్టినవాఁడునుగాఁడు.

అతఁడు నిరుపముఁడు.

# సురా 113 ప్రభాతము.

---

మక్కా లేక మదీనా - 5 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

' సృష్టియందలి కష్టముల నుండియు ;

రాత్రిపడినవెంటనే కలుగు నుపద్రవముల నుండియు ;

మాయావాదుల మోసములనుండియు,

దురాశాపరుల దురాశనుండియు,

తప్పించుకొనుటకు ప్రభాత నాథుఁడగు దేవుని శరణు

జొచ్చుచున్నాను ' అని యనుము.

# సురా 114 - జనులు.

మక్కా లేక మదీనా - 6 పద్యములు.

దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర

"మనుష్యుని హృదయమునందు మెల్లగా గుసగుసలాడుచు దొంగతనముగాఁ బనిసేయు కొండెగానినుండియు,

పిశాచము, మానవులు, వీరినుండియు,

రక్షణనొందుటకు, జనాధినాథుఁడు, జనుల దేవుఁడు,

జనులకు ప్రభువును,

రాజునగు,

వానిశరణు జొచ్చుచున్నాను" అనియనుము.

శారదా ముద్రాక్షరశాల, బ్రాడ్వే, మదరాసు.